# శ్రీ మన్మహాభారతమ్

## విరాటపర్వ


అనువక్త

**ఆచార్య శలాక రఘునాథశర్మ**

భాషాప్రవీణ: ఎం. ఏ., పిహెచ్. డి.,

ప్రొఫెసర్, తెలుగు శాఖ

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము

అనంతపురం



ఆనందవల్లీ గ్రంథమాల

శ్రీ వేంకటేశ్వరపురం - అనంతపురం

ప్రథమ ముద్రణము :
ప్రతులు అయిదువేలు :
క్రోధన జ్యేష్ఠము :
జూన్ 1985



మూల్యము : రు. 25/- లు

గ్రంథాలయప్రతి రూ. 40/-

ప్రతులకు :
శ్రీమతి శలాక రాజరాజేశ్వరి
B 4 స్టాఫ్ క్వార్టర్సు,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
శ్రీ వేంకటేశ్వరపురం (P. O)
అనంతపురం - 515003

ముద్రణ :
'మా ము జి వు'
ఏలూరు.



ఏతద్గ్రంథ ముద్రణమునకు

తిరుమల తిరుపతి దేవస్థానముల అధికారులు

"రచయితలకు ఆర్థిక సాహాయ్యము"

అను పథకముద్వారా రు. 7500/-ల

విరాళ మొసగియున్నారు.

కృ త జ్ఞ త లు

ఓమ్

# అక్షరార్చన

"మహత్త్వా ద్భారవత్త్వాచ్చ మహాభారత ముచ్యతే"

*     *

"ధర్మే చార్థేచ కామే చ మోక్షే చ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్"

*     *

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ

వివిధ తత్త్వవేదవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు

*     *

వేదములకు నఖిల స్మృతి
వాదములకు బహు పురాణవర్గంబులకున్
వాదైన చోటులను దా
మీదల ధర్మార్థ కామ మోక్ష స్థితికిన్

*　　　*

"నమోఽస్తు తే వ్యాస విశాలబుద్ధే
ఫుల్లారవిందాయతపత్రనేత్ర
యేన త్వయా భారత తైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః"

*　　　*

"నారాయణం నమస్కృత్య
నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం
తతో జయ ముదీరయేత్"

*　　　*

"రామాయణం వా యది భారతం వా
పఠే న్మనుష్యో నరతా ముపైతి
న కేవలం హైహిక మానుషత్వం
దదాతి కస్యాపి చ సౌమనస్యమ్".



శ్రీ శ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థానమ్
దక్షిణామ్నాయ శ్రీ శారదాపీఠమ్, శృంగేరి

PERSONAL SECRETARY
To His Holiness Jagadguru
Shankaracharya Dakshinamnaya
Sri Sarada Peetham
SRINGERI - 577139.

Camp : రాజమండ్రి
Date : 16-5-1985

శ్రీయుతులు శలాక రఘునాథశర్మగారికి

నమస్కారములు.

తమరు శ్రీచరణుల సన్నిధిన సమర్పించిన మహాభారత విరాటపర్వాంధ్రానువాదమును శ్రీచరణులు అవలోకించినారు.

భారతీయ వాఙ్మయమునందు మహాభారతమునకు చాల విశిష్టమైన స్థానమున్నది. "భారతం పంచమో వేదః" అను నభియుక్తోక్తి మహాభారతమునకు వేదతుల్యత్వమును వచించుచున్నది. పురుషార్థచతుష్టయమునకు సంబంధించిన ఎన్నియో విషయములు మహాభారతమునందు ప్రతిపాదింపబడి యున్నవి. అట్టి మహాభారతాధ్యయనము ప్రతియొక్క భారతీయునకు అవశ్యకర్తవ్యము. వేదవ్యాసమహర్షులవారు సంస్కృతమున రచించిన ఈ గ్రంథమును సంస్కృతపరిచయము లేనివారలు అర్థము చేసికొనుట కొంత కష్టమైన పని. సరళసుందరమైన యనువాదములు, అట్టివారలు గూడ మహాభారతరసాస్వాదము గావించుటకు సాధనములు.

అష్టాదశ పర్వయుతమగు మహాభారతమునందలి విరాటపర్వమునకు తమరు ఆంధ్రానువాద మొనరించినారు. విరాటపర్వపారా

యణము అనావృష్టినివారకమని సంప్రదాయము. అట్టి విరాట పర్వమునకు తమ ఆంధ్రానువాదము హృద్యముగ నున్నది. ఈ గ్రంథము చదువరులకు ఆనందదాయకమై వెలుగొందుగాక యనియు, తమ రిడే రీతిగా సరస్వత్యుపాసన చేయుచు శ్రేయోవంతు లగుదురు గాక యనియు శ్రీచరణులు నారాయణస్మరణపురస్సరముగా నాశీర్వదించినారు.

ఇట్లు

(Sd) E. Dakshinamurthy.

JUSTICE P. KODANDARAMAYYA
Judge : High Court of
Andhra Pradesh

2-2-18/52 Durgabai
Deshmukh Colony
University Road,
HYDERABAD-500013
Date : 7-5-85

శ్రీ శలాక రఘునాథశర్మగారు భారతమును సమగ్రముగా మూలశ్లోకములను తాత్పర్యసహితముగా ప్రచురింపదలంచుట దైవానుగ్రహముగా భావించుచున్నాను. తెలుగువారికి కవిత్రయము వారి కటాక్షమువలన భారతముపై ఎనలేని అభిరుచి, దృఢమైన అభినివేశము కలిగినవి. కవిత్రయము వారు తెలుగు భారతమును కావ్యముగా వెలయించిరనుట నిర్వివాదాంశము, కావుననే అక్షరరమ్యత, ప్రసన్నకథాకలితార్థయుక్తిపై దృష్టిని కేంద్రీకరింపచేయుటచే పూర్తిగా ధర్మాద్వైతబోధకముగా కొనసాగించుటకు వీలుపడి యుండకపోవచ్చును, ఇందుకు మూలము పూర్తిగా అధ్యయనము చేయుటయే తరణోపాయము. అట్లు చేసినచో తెలుగువారు భారతమునందు సమగ్రపరిజ్ఞానము కలవారగుదురు. దృష్టాంతముగా ఈ క్రింది శ్లోకములను చూచిన మూలగ్రంథము పఠించుట యెంత ఆవశ్యకమో తెలియును. ద్రౌపది వ్యక్తిత్వమును గూర్చి చెప్పుచు వ్యాసభగవానుడు

1 "పతివ్రతా మహాభాగా, సతతం బ్రహ్మవాదినీ" అని ద్రౌపదిని బ్రహ్మవాదినిగా పేర్కొనుట దివ్యమైన విషయము. మఱియొక సందర్భమున భార్యాప్రాముఖ్యమును తెలియజేయుచు,

2. "పుత్రః ప్రియాణా మధికో భార్యా చ సుహృదాం వరా"
అని భార్యను ప్రీతిని కలిగించు ప్రియురాలిగా కాక, హితమును చేకూర్చు మిత్రురాలిగా చెప్పుట గమనార్హము.

3. "ఇయం హి నః ప్రియా భార్యా ప్రాణేభ్యోఽపి గరీయసీ
మాతేవ పరిపాల్యా చ పూజ్యా జ్యేష్ఠేవ చ స్వసా"

అని భార్య ప్రాణాధికురాలే కాక, తల్లివలె పరిరక్షించదగినది, అక్కవలె గౌరవించదగినది అని చెప్పుట ఎంత నిగూఢమో గమనించదగినది. మూలమునందు ఇటువంటి ధర్మములు కోకొల్లలు. కొన్ని దివ్యస్తోత్రములు మన్త్రపూర్వకములు గాన అనువదించబడలేదు. మూలము చదువనిచో ఈ రహస్యములు మనకు తెలియవు.

శ్రీ శర్మగారు మూలశ్లోకములలోని అర్థము తేటతెల్లముగా తీయని తెలుగుభాషలో ఈ గ్రంథమును వెలయించిరి. అందులోను శిష్టాచారబద్ధముగా "హృదయాహ్లాది, ఊర్జితకథోపేతంబు, నానారసాభ్యుదయోల్లాసి" యగు విరాటపర్వమును ముందు వెలువరించుట ముదావహము. ఇటులనే ఈభారతమునకు సమగ్రముగా తెలుగు తాత్పర్యమును వ్రాయుటకు వేదవ్యాసభగవానుడు శర్మగారిని ఆవేశించి, నిర్విఘ్నముగా పూర్తిచేయుటకు వేదవ్యాస భగవానుని ప్రార్థించుచున్నాను.

వేదవ్యాస గుణావాస
విద్యాధీశ సతాం వశ
మాం నిరాశం గతక్లేశం
కుర్వనాశం హరేఽనిశమ్.

(సం) వమిడిఘంటం కోదండరామయ్య

(ii)

ఓమ్

# ప్రస్తావన

శ్రీమద్వేదవ్యాసులు రచించిన శ్రీ మహాభారత గ్రంథము పురుషార్థములకు సంబంధించిన విజ్ఞానసర్వస్వమనుట సర్వజన విదితము. కావుననే అది పంచమ వేదమైనది. ఇష్టప్రాప్తికి, అనిష్ట పరిహారమునకు అలౌకికమగు ఉపాయమును బోధించునది వేదము. తత్సారము కథలో మెదిపి శ్రీమన్నారాయణ స్వరూపుడగు వ్యాస భగవానుడు, తల్లివలె, లోకమునకు అందించెను. ముఖ్యముగా అందు భగవద్గీత హృదయస్థానీయము. సనత్సుజాతీయము, విష్ణు సహస్రనామము మున్నగునవి ఆయువుపట్టులు. సనాతనుడైన వాసుదేవుని కీర్తన అందు అంతస్స్రోతస్విని. ఇట్టిది ఇహపరములకు మానవుడు కరదీపికగా పట్టుకొనవలసిన పరమోత్తమ గ్రంథము.

కాలమహిమ! ఇట్టి పరమోత్కృష్టగ్రంథము, కావలయు ననుకొనువారికి, అందుబాటులోలేని కష్టకాలము దాపురించినది. వచన భారతములు, పద్యభారతములు కలవు. గాని అవి వ్యాసమహర్షి ఏమి చెప్పెనో ఇంచుక ఇంచుకగాని, అంత యేర్పడ నిరూపించునవి కావు. శ్రీ వేదవ్యాసులు మహర్షి. కావున వారి వాక్కు మంత్రమయము. దానిని యథాతథముగా పఠించుటవలన మహాప్రయోజన ముండును. ఆప్రయోజనము భాషాగ్రంథములవలన సిద్ధింపదు, కావున మూల శ్లోకములు అందుబాటులో నుండుట అపరిహార్యమైన విషయము.

సాధారణజనమునకు సంస్కృత శ్లోక భావము సులభముగా పట్టుపడదు. అట్టివారికై తెలుగునుడికారముతో సులభగ్రాహ్యముగా నుండు తాత్పర్యము కూర్చుట ఆవశ్యకము.

మహాభారతమునందు అనేక మహావిషయములు పండితులకుగూడ అవగతము కానివి కలవు. వానిని వ్యాఖ్యానములవలననే తెలిసికొనవలసి యున్నది. శ్రీ నీలకంఠులవంటి మహామనీషులు భారతమునకు భావదీపిక వంటి వ్యాఖ్యానములు సంతరించియున్నారు. అందలి ప్రధానాంశములు కైకొను తెలుగువారికి తెలియవచ్చుట శ్రేయస్కరము.

ఈ మూడు లక్ష్యములతో శ్రీ వేదవ్యాస భారతమును తెలుగువారికి అందింపవలయునన్న సంకల్పము భగవదాజ్ఞారూపమున నాకు కలిగినది. మొత్తము భారతమును 24 సంపుటములలో సిద్ధము చేయుట, మిక్కిలి తక్కువ ధరకు తెలుగువారికి అందుబాటులో నుంచుట అనునవి సంకల్పితార్థములు.

ఆ ప్రయత్నములో ముందుగా మంగళాదిగా విరాటపర్వమును సిద్ధము చేసి అందించుచున్నాను. ఋషిఋణవిమోచన సిద్ధిలో ఈ గ్రథన మొక అంగము. నాతోపాటు ఈ గ్రంథనిర్మాణ కార్యక్రమమున ఉదారబుద్ధితో తోడ్పడినవారి కెల్లరికిని, పాఠకులందరకును తత్ఫలము సిద్ధించుగాక !

# సౌజన్యసంభావనము

ఆర్షధర్మ సాహిత్యములగు పురాణేతిహాసముల వైశిష్ట్యము నెఱుఁగు చక్కని అవగాహన, ఆదరాభిమానములు గల యీక్రింది ప్రవరులు ఈ గ్రంథముద్రణమునకై గణనీయములగు విరాళముల నందించి నేను పూనిన ఈ మహాయజ్ఞము నిర్విఘ్న పరిసమాప్తి నొందుటకై చేయూతనొసగిరి. వారి సౌజన్య సౌరభములు తెలుగు ప్రజల హృదయసీమలలో ఎల్లవేళల గుబాళించుగాక !

1. శ్రీ కాసంశెట్టి శకుంతలమ్మ, మహిళాభ్యుదయ ట్రస్టు- కల్లూరు, అనంతపురం జిల్లా 5000.00
2. స్వధర్మ స్వారాజ్యసంస్థ - మదరాసు 2500-00
3. శ్రీ రాజాలక్ష్మీ ఫౌండేషన్ - మదరాసు 2500-00

పై మూడుసంస్థల ప్రధాననిర్వాహకులు మాన్యశ్రీ కాసంశెట్టి రాధాకృష్ణయ్య. బి. వి. ఎస్. ఎస్. మణి, పి. వి. రమణయ్య రాజా గారలకు కైమోడ్పు.

4. శ్రీ సుంకు సుబ్బలక్ష్మమ్మగారు, మదరాసు 1000-00
5. శ్రీ యక్కరంరెడ్డి బాలకృష్ణారెడ్డిగారు - కొత్తూరు, నెల్లూరుజిల్లా 1000-00
6. శ్రీ జూటూరు రమణయ్యగారు - ప్రొద్దుటూరు 1000-00
7. శ్రీ అనంతపురం ఆర్యవైశ్య సంఘంవారు-పాతవూరు 1116-00
8. కడప ఆఫీసర్స్ క్లబ్ వారు 1116-00
9. భీమవరం డి. యన్. ఆర్. కళాశాల, కార్యదర్శి శ్రీరామభద్రరాజుగారు 1000-00
10. శ్రీ యస్. వెంకటస్వామి గుప్తగారు -పామిడి, అనంతపురంజిల్లా 1000-00
11. శ్రీ అమరా కృష్ణమూర్తిగారు- ఉప్పుగుండూరు 500-00
12. శ్రీ చింతపల్లి రామిరెడ్డిగారు - అనంతపురం 500-00
13. శ్రీ కె. కుళ్ళాయప్పగారు - చిత్తూరు 516-00
14. శ్రీ కె. వెంకటసుబ్బయ్యగారు - చిత్తూరు 516-00

15. పై ఇరువురి మిత్రబృందము 2000-00
16. శ్రీ బి. నారాయణరెడ్డిగారు - నంద్యాల 500-00
17. శ్రీ కె. వెంకటసుబ్బయ్య - మిత్రబృందము
పోరుమామిళ్ళ 2228-00
18. శ్రీ ఆర్. సి. కేశవరావుగారు - అనంతపురం 216.00
19. శ్రీ వి. లక్ష్మయ్యనాయుడుగారు - చిత్తూరు 216-00

ఇట్లే ఆదరముతో అడుగకనే విరాళములందించిన మహనీయులు అనంతపురం వాస్తవ్యులు సర్వశ్రీ గొల్లాపిన్ని రామకృష్ణ శాస్త్రి, ఆవంచ వీరాంజనేయులు, ఎస్. సుబ్బారెడ్డి, ఓరుగంటి నరసింహశర్మ, కె. నరసింహమూర్తి, నామా వెంకటసుబ్బయ్య, డా. సుంకర కుమారదేవి, రాచర్ల తిప్పయ్యశెట్టి, బయనగారి నాగయ్యశెట్టి, యజమానం నరసింహమూర్తి, శ్రీమతి దేవళ్ళ లలితమ్మ, ఒంగోలు వాస్తవ్యులు డా. కె. వాసుదేవమూర్తి, డా. ఎమ్. వి. ఎల్. నరసింహారావు, జి. చక్రధరరావుగారలు.

* * *

ఈ గ్రంథము ఇట్లుగా రూపుదిద్దుకొనుటకై నాకంటె ఎక్కువ శ్రద్ధాసక్తులతో దీక్షాదక్షతలతో కృషిచేసినవారు శ్రీ కోడూరి రమేష్‌గారు (అనంతపురం). అడుగడుగున అండగా నిలుచుటయేగాక మనోజ్ఞమగు మున్నుడిని పుస్తకమునకు అలంకారప్రాయముగా సంతరించినవారు ఆంధ్రప్రదేశ ఉన్నత న్యాయస్థాన న్యాయమూర్తులు మాన్యశ్రీ పమిడిఘంటం కోదండరామయ్యగారు.

మరియు అనేక విధములుగా తోడ్పడిన అస్మద్గురువర్యులు డా. దివాకర్ల వేంకటావధానిగారు, డా. దేవళ్ళ చిన్నికృష్ణయ్యగారు (మదరాసు), వేదమూర్తులు శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు గారు (మదరాసు), శ్రీ పాణ్యాం కోనప్ప శాస్త్రిగారు, శ్రీ ఎల్. కృష్ణారావుగారు (న్యాయవాదులు, అనంతపురం) శ్రీ కట్టా నాగభూషణంగారు (పారిశ్రామికవేత్త-అనంతపురం), అస్మత్ప్రియ

శిష్యుడు శ్రీ జి. రామచంద్రారెడ్డి (ప్రభుత్వ కళాశాల, విజయవాడ), శుద్ధప్రతులు సిద్ధము చేసిన ప్రియశిష్యుడు డా. డి. వీరాస్వామి (ప్రభుత్వ కళాశాల, వెంటపాడు), ముఖపత్రకారశిల్పి చి. రామకృష్ణ, అనంతపురం వాస్తవ్యులు డా. యల్. వేంకటరమణ, హైదరాబాదు వాస్తవ్యులు శ్రీ యం. వి. సుబ్బారావు -

సర్వకార్యభారము పైనివేసికొని కన్నొద్దన జడవేసిన ఏలూరు వాస్తవ్యులు మా అక్కబావలు వైలవరపు లక్ష్మీ సౌభాగ్యమ్మ, ఆంజనేయులు, మా మేనల్లుడు చి. వెంకట నాగేంద్రకుమార్, సతీమణి చి. సౌ. పద్మావతి -

శ్రీశ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రుల ఆదేశానుసారము ముద్రణ కార్యము చక్కగా నిర్వహించిన ముముక్షువు ముద్రణాలయ నిర్వాహకులు, కార్యకర్తలు, ముద్రణ స్ఖాలిత్యములు ఓర్పుతో నేర్పుతో సరిచూచిన బ్రహ్మశ్రీ వేదమూర్తులు ఇంద్రకంటి సూర్యనారాయణమూర్తిగారు -

ఈ ఉదారచరితులకందరకు ఈ మహాయజ్ఞఫలము సంపూర్ణముగా సిద్ధించుగాక ! శ్రీ వేదవ్యాసరూప నారాయణానుగ్రహము లభించుగాక ! పూర్ణపురుషార్థసిద్ధి కలుగుగాక !

* * *

నాపై సంపూర్ణ వాత్సల్యముతో గ్రంథమునకు వెలగల ఆశీస్సు ననుగ్రహించిన శ్రీశ్రీ శృంగేరీ దక్షిణామ్నాయపీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ భారతీతీర్థమహాస్వాములవారిని, వారి గురుదేవులు శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వాములవారిని, వారి గురుదేవులు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరభారతీ మహాస్వాములవారిని సాక్షాత్ పరబ్రహ్మస్వరూపములుగా భావించుచు విశ్వాసముతో ప్రణామము లర్పించుకొందును.

— రఘునాథశర్మ,
ధర్మపత్ని రాజరాజేశ్వరి.

ఓమ్

# శ్రీ మ న్మ హా భా ర త మ్

## విరాటపర్వ - విరాటపర్వము

### పాండవప్రవేశపర్వ - పాండవప్రవేశపర్వము

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్.

శ్రీమన్నారాయణునికి, నరులలో ఉత్తముడగు నరునికి, సరస్వతీదేవికి, వ్యాసునికి నమస్కరించి పిమ్మట భారతమును పఠింపవలయును.

### ప్రథమోఽధ్యాయః - మొదటి అధ్యాయము

విరాటనగరే ఉజ్ఞాతవాసం కర్తుకామానాం పాణ్డవానాం మిథోఃను ప్తమన్త్రణా, యుధిష్ఠిర కర్తృకం నిజభావి కార్యక్రమ దిగ్దర్శనంచ.

విరాటనగరమున అజ్ఞాతవాసము చేయగోరిన పాండవులు రహస్యముగా ఆలోచనచేయుట, ధర్మరాజు తనభవిష్యత్ కార్యక్రమమును సూచించుట.

జనమేజయ ఉవాచ – జనమేజయు డిట్లు పలికెను.

కథం విరాటనగరే మమ పూర్వపితామహాః
అజ్ఞాతవాస ముషితా దుర్యోధన భయార్దితాః. 1

ఓ మహర్షీ ! మాముత్తాతలు దుర్యోధనునివలన భయముతో పీడితులై విరాటనగరమున అజ్ఞాతవాసమెట్లు ఒనరించిరి ?

పతివ్రతా మహాభాగా సతతం బ్రహ్మవాదినీ
ద్రౌపదీచ కథం బ్రహ్మ న్నజ్ఞాతా దుఃఖితావసత్. 2

ఓ బ్రాహ్మణోత్తమా ! పతివ్రత, ఎల్లపుడు శ్రీకృష్ణుని జపించునది. పుణ్యాత్మురాలు అగుద్రౌపది అచట దుఃఖముతో ఎట్లు గుట్టుగా నివసించెను ?

వైశంపాయన ఉవాచ – వైశంపాయనుడిట్లు చెప్పెను.

యథా విరాటనగరే తవ పూర్వపితామహాః
అజ్ఞాతవాసముషితా స్తచ్ఛృణుష్వ నరాధిప ! 3

ఓ రాజా ! నీ ముత్తాతలు విరాటనగరమున అజ్ఞాతవాసము నెట్లుచేసిరో చెప్పెదను వినుము.

తథా సతు వరాన్ లబ్ధ్వా ధర్మోధర్మభృతాం వరః
గత్వాశ్రమం బ్రాహ్మణేభ్య ఆచఖ్యౌ సర్వమేవ తత్. 4

ధర్మమును పాటించువారిలో శ్రేష్ఠుడగు ధర్మరాజు ఆ విధముగా వరములను పొంది ఆశ్రమమున కరిగి ఆ వృత్తాంతమునంతయు బ్రాహ్మణులకు నివేదించెను.

---

1. పూర్వపితామహాః – పూర్వులనగా జనమేజయునకు తండ్రియైన పూర్వుడైన పరీక్షిత్తు, అతని తాతలు.
2. బ్రహ్మవాదినీ – బ్రహ్మమనగా పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీకృష్ణుడు – అతనిని కీర్తించు స్వభావముగలది.

కథయిత్వాతు తత్సర్వం బ్రాహ్మణేభ్యో యుధిష్ఠిరః
అరణీసహితం తస్మై బ్రాహ్మణాయ న్యవేదయత్. 5

ధర్మరాజు అట్లు బ్రాహ్మణుల కంతయుచెప్పి అగ్నిని మథించు సాధనములను ఆ బ్రాహ్మణునకు సమర్పించెను.

తతో యుధిష్ఠిరో రాజా ధర్మపుత్రో మహామనాః
సంనివర్త్యానుజాన్ సర్వానితి హోవాచ భారత ! 6

ఓ భారతా ! పిమ్మట ధర్ముని పుత్రుడు, దొడ్డబుద్ధి గలవాడు అగు యుధిష్ఠిర మహారాజు తమ్ములందరను ఒకచోటికి తెచ్చి యిట్లు పలికెను.

ద్వాదశేమాని వర్షాణి రాజ్యవిప్రోషితా వయమ్
త్రయోదశోఽయం సంప్రాప్తః కృచ్ఛ్రాత్ పరమదుర్వసః. 7

ఈ పండ్రెండు సంవత్సరములు మనము రాజ్యమునుండి వెడలగొట్టబడితిమి. మిక్కిలి కష్టము, అతి దుఃఖముతో నివసింప దగినది అగు పదుమూడవ యేడు వచ్చి పడినది.

స సాధు కౌన్తేయ ఇతో వాస మర్జున రోచయ
సంవత్సరమిమం యత్ర వసేమా విదితాః పరైః. 8

కాబట్టి ఓ కుంతీతనయా ! అర్జునా ! ఈ సంవత్సరకాలము పగవారికి ఎరుగరాకుండ ఎందు నివసింతమో నీ అభిప్రాయము తెలుపుము.

అర్జున ఉవాచ - అర్జును డిట్లుపలికెను.

తస్యైవ వరదానేన ధర్మస్య మనుజాధిప !
అజ్ఞాతా విచరిష్యామో నరాణాం నాత్ర సంశయః. 9

---

5. అరణీ సహితమ్ - అగ్నిని పుట్టించు రెండు కఱ్ఱలను
6. సంనివర్త్య - ఒకచోట సమావేశపరచి.

ఓ మహారాజా! ఆ యమధర్మరాజు ఇచ్చిన వరము వలననే మనము మనుజులకు తెలియకుండ సంచరింపగలము. ఇందు సంశయము లేదు.

తత్ర వాసస్య రాష్ట్రాణి కీర్తయిష్యామి కానిచిత్
రమణీయాని గుప్తాని తేషాం కించిత్ స్మ రోచయ. 10

మన నివాసమునకు మనోహరములైనవి, గుట్టుగా నుండదగినవి అగు దేశములను కొన్నింటిని పేర్కొందును. అందు ఒక దానిని నీ వెన్నుము.

సన్తి రమ్యా జనపదా బహ్వన్నాః పరితః కురూన్
పాఞ్చాలా శ్చేది మాత్స్యాశ్చ శూరసేనాః పటచ్చరాః 11

దశార్ణా నవరాష్ట్రాశ్చ మల్లాః శాల్వా యుగంధరాః
కున్తి రాష్ట్రంచ విపులం సురాష్ట్రావన్తయ స్తథా 12

అందముగా నుండునవి. సమృద్ధిగా అన్నము గలవి అగు దేశములు కురుదేశమునకు చుట్టుప్రక్కల గలవు. అవి పాంచాలములు, చేదిదేశము, మత్స్యదేశము, శూరసేనదేశము, పటచ్చరదేశము, దశార్ణము, నవరాష్ట్రములు, మల్లము, శాల్వము, యుగంధరము, విశాలమైన కుంతిరాష్ట్రము, సురాష్ట్రము, అవంతి అనునవి.

ఏతేషాం కతమో రాజన్ నివాస స్తవ రోచతే
యత్ర వత్స్యామహే రాజన్ సంవత్సరమిమం వయమ్. 13

ఓ రాజా! వీనిలో నీ కిష్టమైన రాజ్యమునందు మన మీ సంవత్సరకాలము నివసింతము.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లనెను.

శ్రుత మేతన్మహాబాహో యథా సభగవాన్ ప్రభుః
అబ్రవీత్ సర్వభూతేశ స్త త్తథాన తదన్యథా 14

14. ప్రభుః - యమ ధర్మరాజు.

ఓ మహాబాహూ! భగవంతుడగు యమధర్మరాజు చెప్పినది విని యుంటిమి. సర్వభూతములకు ప్రభువైన ఆయన చెప్పినట్లే యగును. మఱియొక విధముగా కాదు.

అవశ్యం త్వేవ వాసార్థం రమణీయం సుఖం శివమ్
సంమంత్ర్య సహితైః సర్వైర్ద్రష్టవ్య మకుతోభయైః 15

అయినను చూడ ముచ్చట గొలుపునది. మంగళకరమైనది, సుఖమైనదియునగు తావును మన మందరము బాగుగా ఆలోచించి ఎన్నుకొని యెందును భయము లేని వారమై యుండవలయును.

మత్స్యో విరాటో బలవానభిరక్తోఽథ పాణ్డవాన్
ధర్మశీలో వదాన్యశ్చ వృద్ధశ్చ సతతం ప్రియః 16

మత్స్యదేశప్రభువు విరాటుడు-బలవంతుడు. పాండురాజు కొడుకులమైన మనయెడ ప్రీతికలవాడు. ధర్మశీలుడు, దాత, పెద్దవాడు. ఎల్లప్పుడు మన కిష్టుడు.

విరాటనగరే తాత సంవత్సరమిమం వయమ్
కుర్వన్తస్తస్య కార్యాణి విహరిష్యామ భారత. 17

నాయనా! మనము ఈ సంవత్సరకాలము విరాట నగరమున ఆ రాజునకు పనులు చేయుచు తిరుగుదము.

యాని యానిచ కర్మాణి తస్య వక్ష్యామహే వయమ్
ఆసాద్య మత్స్యం తత్కర్మ ప్రబ్రూత కురునన్దనాః 18

కురుకుమారులారా! మనము విరాటుని కడ చేరి యేయే పనులు నిర్వహించుచు ఉందమో ఒక్కొక్కడు చెప్పుడు.

అర్జున ఉవాచ - అర్జునుడిట్లు పలికెను.

నరదేవ కథం తస్య రాష్ట్రే కర్మ కరిష్యసి
విరాటనగరే సాధో రంస్యసే కేన కర్మణా 19

ఓ మహారాజా ! సత్పురుషుడా ! నీవు అతనిరాజ్యమున సేవ యెట్లు చేయుదువు ? ఏ పని నీ కిష్టము ?

మృదు ర్వదాన్యో హ్రీమాంశ్చ ధార్మికః సత్య విక్రమః
రాజం స్త్వ మా పదాకృష్టః కిం కరిష్యసి పాణ్డవ. 20

ఓపాండుకుమారా ! మహారాజా ! నీవు మెత్తని వాడవు. ఒకరికింత ఇచ్చువాడవు. లజ్జావంతుడవు. ధర్మమును పాటించువాడవు సత్యమైన పరాక్రమము కలవాడవు. నీ విపుడు ఈ ఆపదకులోనై ఏ సేవ చేయుదువు.

న దుఃఖముచితం కిఞ్చిద్ రాజన్ వేద యథాజనః
స ఇమా మా పదం ప్రాప్య కథం ఘోరం తరిష్యసి 21

ఓ రాజా ! నీకు సాధారణ మానవునకు వలె తగని కష్టము దాపురించినది. ఘోరమైన యీ యాపదను నీ వెట్లు దాటుదువు ?

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లు పలికెను.

శ్రుణుధ్వం యత్ కరిష్యామి కర్మవై కురు నన్దనాః
విరాట మనుసంప్రాప్య రాజానం పురుషర్షభాః 22

ఓ పురుషశ్రేష్ఠులారా ! కురునందనులారా ! నేనా విరాట రాజు కడ చేరి యేపని చేయుదునో చెప్పెదను, వినుడు.

సభాస్తారో భవిష్యామి తస్య రాజ్ఞో మహాత్మనః
కఙ్కోనామ ద్విజో భూత్వా మతాక్షః ప్రియదేవనః 23

23. సభాస్తారః - సభ్యుడు; కంకః - ఈ శబ్దమునకు కపట బ్రాహ్మణుడు, యముడు అని యర్థములు గలవు. ఈ రెండర్థములును ఇచట సరిపడును. ధర్మరాజు ప్రస్తుతము బ్రాహ్మణ వేషముతో నుండుటచే కపట బ్రాహ్మణుడు. 'ఆత్మావై పుత్రనామాసి' - అని వేదము కనుక ధర్మజుడు తండ్రిపేరును ఇచట గ్రహించెను. మతాక్షః - ధర్మరాజు బృహదశ్వునినుండి పాచికల తత్త్వమును తెలిసికొనెనట

మహాత్ముడగు ఆ రాజునొద్ద నేను సభికుడనగుదును. కంకుడను పేరుతో బ్రాహ్మణుడనై పాచికలను పట్టి క్రీడాసక్తి కలవాడనై యుందును.

వైదూర్యాన్ కాఞ్చనాన్ దాన్తాన్ ఫలైర్జ్యోతీరసైః సహ
కృష్ణాన్ లోహిత వర్ణాంశ్చ నిర్వర్త్స్యామి మనోరమాన్. 24

వైదూర్యములతో, బంగారముతో ఎఱ్ఱని, తెల్లని పలకలతో దంతములతో, నల్లని పదార్థములతో చేసిన అందమైన పాచికలతో ఆట లాడుదును.

విరాట రాజం రమయన్ సామాత్యం సహబాంధవమ్
న చ మాం వేత్స్యతే కశ్చిత్ తోషయిష్యే చ తం నృపమ్ 25

మంత్రులతో బంధువులతో కూడిన ఆ మహారాజును మెప్పించుచు సంతోషపెట్టుదును. నన్నెవ్వడును గుర్తింపడు.

ఆసం యుధిష్ఠిరస్యాహం పురా ప్రాణసమః సఖా
ఇతి వక్ష్యామి రాజానం యది మాం సోఽనుయోక్ష్యతే. 26

ఆ రాజు నన్నడిగినచో నేను పూర్వము యుధిష్ఠిర మహారాజునకు ప్రాణము ప్రాణమైన సఖుడనై యుంటినని చెప్పుదును.

[ఇత్యేతద్ వో మయా ఖ్యాతం విహరిష్యామ్యహం యథా
ఇదిగో, నేనెట్లు వ్యవహరింతునో మీకు చెప్పితిని.

---

24. దాన్తాన్ - ఏనుగు దంతముతో చేసినవానివి - దంతమనగా కొండ చరియ అనికూడ అర్థము. దానితో పోలిన వానివి. జ్యోతీరసైః - 'యదగ్నే రోహితం రూపం తేజసస్తద్రూపమ్' అని వేదము, అగ్నియొక్క ఎఱ్ఱని రూపమే తేజస్సు రూపము అనితాత్పర్యము. దాని వలన ఇచ్చటి జ్యోతి శ్శబ్దమునకు 'ఎఱుపు' అర్థము.

26. యుధిష్ఠిరస్య ప్రాణ సఖః - యుధిష్ఠిరనామముగల శరీరమునకు ప్రాణమైన సఖుడు అని తాత్పర్యము. కావున ధర్మరాజు అసత్యము పలికిన దోషముండదు. గూఢముగా 'నేను యుధిష్ఠిరుడనే' సుమా అని చెప్పినట్లయినది.
అనుయోక్ష్యతేయది - ప్రశ్నించినచో.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం నిర్దిశ్య చాత్మానం భీమసేన మువాచహ.

ఇట్లు తన్ను గూర్చి చెప్పిరాని భీమునితోనిట్లు పలికెను.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లు పలికెను.

భీమసేన కథం కర్మ మత్స్య రాష్ట్రే కరిష్యసి

ఓ భీమసేనా! నీవు విరాటుని రాష్ట్రమున ఎట్లు సేవ చేయుదువు.

హత్వా క్రోధవశాం స్తత్ర పర్వతే గన్ధమాదనే
యక్షాన్ క్రోధాభితామ్రాక్షాన్ రక్షసాంశ్చాపి పౌరుషాన్
ప్రాదాః పాఞ్చాలకన్యాయై పద్మాని సుబహూన్యపి

అచట, ఆ గంధమాదన పర్వతమున, కోపములో ఎక్కువగా ఎఱుపెక్కిన కన్నులు గల క్రోధవశులైన యక్షులను, పౌరుషము గల రాక్షసులను చంపి, సౌగంధికకమలములను ఎన్నింటినో తెచ్చి ద్రౌపది కిచ్చితివి.

బకం రాక్షస రాజానం భీషణం పురుషాదకమ్
జఘ్నివానసి కౌన్తేయ బ్రాహ్మణార్థమరిందమ
క్షేమా చాభయసంవీతా హ్యేకచక్రా త్వయా కృతా

రాక్షసరాజు, భయంకరుడు, మనుజులను తినువాడు అగు బకాసురుని బ్రాహ్మణుని కొరకుగా చంపితివి. ఏకచక్రపురమును క్షేమము కలదానినిగా, భయము పోయిన దానినిగా చేసితివి.

హిడిమ్బంచ మహావీరం కిర్మీరం చైవ రాక్షసమ్
త్వయా హత్వా మహాబాహో వనం నిష్కంటకం కృతమ్.

మహావీరుడైన హిడింబుని, కిర్మీరరాక్షసుని చంపి ఓ మహాబాహూ! వనమును నిష్కంటకము చేసితివి.

ఆపదం చాపి సంప్రాప్తా ద్రౌపదీ చారుహాసినీ
జటాసురవధం కృత్వా త్వయా చ పరిమోక్షితా.

పాపము అందమైన నవ్వుగల ద్రౌపదికి కీడు మూడినపుడు జటాసురుడను రక్కసుని చంపి ఆమెను విడిపించితివి.

మత్స్యరాజాన్తికే తాత వీర్యపూర్ణోఽత్యమర్షణః

నాయనా! నిండైన బలము, మిక్కిలి క్రోధముగల నీవు మత్స్యరాజు కడ ఎట్లుందువు.]

వృకోదర విరాటే త్వం రంస్యసే కేన హేతునా. 27

ఓయీ వృకోదరుడా! విరాటనగరమున ఏ వృత్తితో కాలము వెళ్ళబుచ్చెదవు?

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి పాణ్డవ ప్రవేశ పర్వణి
యుధిష్ఠిరాది మన్త్రణే ప్రథమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున పాండవ ప్రవేశ పర్వమున
ధర్మరాజాదుల ఆలోచనయను మొదటి అధ్యాయము.

## ద్వితీయోఽధ్యాయః - రెండవ అధ్యాయము

భీమార్జునాభ్యాం తత్ర కర్తుం శక్యానామనుకూల కార్యాణాం నిర్దేశః.

భీమార్జునులు తామచట చేయగల కార్యములను తెలుపుట.

భీమసేన ఉవాచ - భీమసేనుడిట్లు పలికెను.

పౌరోగవో బ్రువాణోఽహం వల్లవో నామ భారత
ఉపస్థాస్యామి రాజానం విరాటమితి మే మతిః. 1

1. పౌరోగవః - వంటశాల కధిపతి, పురోగువు అనగా వాయువు. అతని కుమారుడు పౌరోగవుడు. భీముడు. పురః పురస్తాత్ గావో రశ్మయో యస్య సః పురోగుర్వాయుః - ముందు రశ్ములు కలవాడు. పిండోత్పత్తి జరుగునపుడు రజోరేతస్సుల కలయికయందు ముందు ప్రాణవాయువు తర్వాత ఇంద్రియములు పుట్టునని శాస్త్రప్రసిద్ధము.

ఓ భారతా ! వంటలవాడనని చెప్పుచు వల్లవుడను పేరుతో విరాటరాజును సేవింపవలయునని నా తలపు.

సూపానస్య కరిష్యామి కుశలోఽస్మి మహానసే
కృతపూర్వాణి యాన్యస్య వ్యంజనాని సుశిక్షితైః
తాన్యప్యభిభవిష్యామి ప్రీతిం సంజనయ న్నహమ్. 2

వంటశాలయందు నాకు నేర్పుకలదు. అతనికి వలయు వంటలను చేయుదును. మునుపు మిక్కిలి నేర్పుగలవారు చేసిన వ్యంజనములను తలదన్నునట్లు చేసి అతనికి ప్రీతికలిగించు చుందును.

ఆహరిష్యామి దారూణాం నిచయాన్ మహతోఽపిచ 3
యత్ ప్రేక్ష్య విపులం కర్మ రాజా సంయోక్ష్యతే స మామ్.

పెద్దపెద్ద కట్టెల మోపులను గూడ తెత్తును. అది చూచి రాజు నన్ను ఇంకను పెద్దపనులలో నియోగించును.

అమానుషాణి కుర్వాణస్తాని కర్మాణి భారత. 4
రాజ్ఞస్తస్యపరే ప్రేష్యా మంస్యన్తే మాం యథానృపమ్
భక్ష్యాన్నరసపానానాం భవిష్యామి తథేశ్వరః. 5

మనుష్యులకు అలవికాని పనులు చేయుచున్న నన్ను ఇతర సేవకులు అందరు రాజును వలె మన్నింతురు. అట్లు నేను తిను పదార్థములకు, అన్నములకు, రసములకు, పానములకు ప్రభువు నగుదును.

ద్విపా వా బలినో రాజన్ వృషభా వా మహాబలాః
వినిగ్రాహ్యా యది మయా నిగ్రహీష్యామి తానపి. 6

బాగుగా బలిసిన ఏనుగులను, గొప్పబలముగల ఎద్దులను, అదుపులో పెట్టవలసినచో, పెట్టుదును.

5. ఈశ్వరః — ఇష్టమువచ్చినట్లు వస్తువులను వినియోగించువాడు.

యేచ కేచిన్ని యోత్స్యన్తి సమాజేషు నియోధకాః
తానహం హి నియోత్స్యామి రతిం తస్య వివర్ధయన్. 7

కొలువుకూటములందు ఎవరైనను మల్లులు యుద్ధము చేయదురేని, ఆరాజునకు ప్రీతికలుగునట్లు నేను వారితో పోరుదును.

న త్వేతాన్ యుధ్యమానాన్ వై హనిష్యామి కథంచన,
తథైతాన్ పాతయిష్యామి యథా యాస్యన్తి నక్షయమ్. 8

ఇట్లు నాతో యుద్ధము చేయువారిని ఎన్నటికిని చంపను. వారు చావని రీతిగా పడగొట్టుదును.

ఆరాలికో గోవికర్తా సూపకర్తా నియోధకః
ఆసం యుధిష్ఠిరస్యాహ మితి వక్ష్యామి పృచ్ఛతః. 9

అడిగినచో నేను ధర్మరాజు కడ మదపుటేనుగులను అదుపులో పెట్టువాడనుగా, ఎద్దులను వశము చేసికొనువాడనుగా సూపకర్తనుగా, మల్లుడనుగా ఉంటినని చెప్పుదును.

ఆత్మానమాత్మనా రక్షం శ్చరిష్యామి విశాంపతే
ఇత్యేతత్ ప్రతిజానామి విహరిష్యామ్యహం యథా. 10

ఓ మహారాజా ! నన్ను నేను కాపాడుకొనుచు సంచరింతును. ఇదిగో నేనచట ప్రవర్తించు విధానమును చెప్పితిని.

---

7. నియోత్స్యామి - బలహీనులగునట్లు, చావకుండునట్లు, యుద్ధము చేయుదును.

8. ఆరాలికః - అరాలములనగా మదపుటేనుగులు - వానితో యుద్ధముచేయువాడు. గోవికర్తా - పెద్ద ఆబోతులను కూడ అణచువాడు, సూపకర్తా - పప్పు మొదలగువానిని వండువాడు, లేక, ఎక్కువ ఉపకారము చేయువాడు, నియోధకః - ఎదుటివానిని చంపకుండ మల్లయుద్ధము చేయువాడు. కొందరు ఆరాలికుడనగా అన్నము వండువాడు, సూపకర్త అనగా కూరలు వండువాడు, గోవికర్త అనగా తైలాన్నము చేయువాడు అని చెప్పుదురు. ఆధారము మృగ్యము. గోవికర్త అనగా గద్యపద్యముల రచయిత యనియు నర్థము.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లు పలికెను.

యమగ్నిర్బ్రాహ్మణో భూత్వా సమాగచ్ఛన్నృణాం వరమ్
దిధక్షుః ఖాణ్డవం దావం దాశార్హ సహితం పురా 11

మహాబలం మహాబాహు మజితం కురునన్దనమ్
సోఽయం కిం కర్మ కౌన్తేయః కరిష్యతి ధనంజయః 12

మునుపు అగ్నిదేవుడు ఖాండవవనమును కాల్పగోరి బ్రాహ్మణ రూపముతో, నరులలో శ్రేష్ఠుడు, కృష్ణసహితుడు, గొప్పబలము కలవాడు, గొప్పభుజములు కలవాడు, ఓటమి నెఱుగనివాడు అగు కురుకుమారుని ఆశ్రయించెను. అట్టి యీ కుంతీపుత్రుడు ధనంజయుడు విరాటనగరమున ఏ సేవచేయును ?

యోఽయ మాసాద్య తం దావం తర్పయామాస పావకమ్
విజిత్యైక రథేనేంద్రం హత్వా పన్నగ రాక్షసాన్. 13

అట్టి యీతడు ఖాండవమున కరిగి ఇతరుల సాయమును కోరక పాములను, రక్కసులను చంపి ఇంద్రుని గెలిచి అగ్నిదేవుని తృప్తి పరచెను.

వాసుకేః సర్పరాజస్య స్వసారం హృతవాంశ్చ యః
శ్రేష్ఠోయః ప్రతియోధానాం సోఽర్జునః కిం కరిష్యతి. 14

పాములఱేడగు వాసుకి చెలియలిని ఉలూపిని చేపట్టెను. అట్లు పోటుగాండ్రలో శ్రేష్ఠుడగు ఈ అర్జునుడు అచట ఏమి సేవచేయును!

సూర్యః ప్రతపతాం శ్రేష్ఠో ద్విపదాం బ్రాహ్మణో వరః
ఆశీవిషశ్చ సర్పాణా మగ్నిస్తేజ స్వినాం వరః.

ప్రతాపము గల వారిలో సూర్యుడు మిన్న. నరులలో బ్రాహ్మడుమిన్న. ప్రాణివానిలో పాము గొప్పది. తేజస్సు గలవారిలో అగ్ని అధికుడు.

ఆయుధానాం వరం వజ్రం కకుద్మీచ గవాం వరః
హ్రదానా ముదధిః శ్రేష్ఠః పర్జన్యో వర్షతాం వరః. 16

ఆయుధములలో వజ్రము గొప్ప. గోవులలో ఆఁబోతు గొప్ప. నీటి నెలవులలో సముద్రము గొప్ప. వర్షించువారిలో పర్జన్యుడు గొప్ప.

ధృతరాష్ట్రశ్చ నాగానాం హస్తిష్వైరావణో వరః
పుత్రః ప్రియాణామధికో భార్యాచ సుహృదాం వరా. 17

పాములలో ధృతరాష్ట్రము మిన్న. ఏనుగులలో ఐరావతము మిన్న. ప్రియులలో కొడుకు అధికుడు. స్నేహము కలవారిలో భార్య గొప్పది.

[గిరీణాం ప్రవరో మేరుర్దేవానాం మధుసూదనః
గ్రహాణాం ప్రవర శ్చంద్రః సరసాం మానసం వరమ్.

పర్వతములలో మేరువు ఘనము. దేవులలో విష్ణువధికుడు. గ్రహములలో చంద్రుడు గొప్ప. సరస్సులలో మానసము గొప్పది.]

యాన్యేతాని విశిష్టాని జాత్యాం జాత్యాం వృకోదర
ఏవం యువా గుడాకేశః శ్రేష్ఠః సర్వధనుష్మతామ్. 18

ఓ భీమసేనా ! ఇట్లు ఆయా జాతులలో అవి అవి గొప్పవి యైనట్లు యువకుడగు ఈయర్జునుడు విలుకాండ్రందరిలో గొప్పవాడు.

సోఽయ మింద్రాదనవరో వాసుదేవాన్మహాద్యుతిః
గాణ్డీవ ధన్వా బీభత్సుః శ్వేతాశ్వః కింకరిష్యతి. 19

అట్టి యీతడు ఇంద్రునికి తీసిపోడు. శ్రీకృష్ణునివలన గొప్ప తేజస్సు పొందినవాడు. గాండీవము ధనువుగా కలవాడు, యుద్ధమున వెరపుగొలుపు పనులు చేయువాడు. తెల్లని గుఱ్ఱములు గలవాడు అగు ఈ యర్జునుడు ఏమి పని చేయును !

ఉషిత్వా పఞ్చవర్షాణి సహస్రాక్షస్య వేశ్మని
అస్త్రయోగం సమాసాద్య స్వవీర్యాన్మానుషాద్భుతమ్
దివ్యాన్యస్త్రాణి చాప్తాని దేవరూపేణ భాస్వతా. 20

ఈతడు దివ్యరూపముతో వెలుగొందుచు అయిదేండ్లు దేవేంద్రుని భవనమున నివసించి మనుష్యులకు అద్భుతమైన అస్త్రయోగమును స్వశక్తితో సాధించెను. దివ్యములైన అస్త్రములను సంపాదించెను.

యం మన్యే ద్వాదశం రుద్ర మాదిత్యానాం త్రయోదశమ్
వసూనాం నవమం మన్యే గ్రహాణాం దశమం తథా. 21

ఈతనిని పండ్రెండవ రుద్రునిగా, పదుమూడవ ఆదిత్యునిగా, తొమ్మిదవ వసువుగా, పదియవ గ్రహముగా భావింతును.

యస్య బాహూ సమౌ దీర్ఘౌ జ్యాఘాత కఠినత్వచౌ
దక్షిణేచైవ సవ్యేచ గవా మివ వహః కృతః. 22

ఈతని బాహువులు సమముగా పొడవుగా అల్లెత్రాటి రాపిడికి బిరుసెక్కినవై యున్నవి. కుడియెడమ చేతులందు ఎద్దులమెడ యందువలె రాపిడికి కాచినకాయ ఉన్నది.

హిమవానివ శైలానాం సముద్రః సరితామివ
త్రిదశానాం యథా శక్రో వసూనామివ హవ్యవాట్. 23
మృగాణామివ శార్దూలో గరుడః పతతామివ
వరః సంనహ్యమానానాం సోఽర్జునః కింకరిష్యతి. 24

పర్వతములలో హిమవంతమువలె, జలాశయములలో సముద్రమువలె, దేవతలలో ఇంద్రునివలె, వసువులలో అగ్నివలె,

---

22. వహః - ఒరిపిడికి కాచినకాయ.

23. పతతామ్ - పక్షులలో

మృగములలో బెబ్బులివలె, పక్షులలో గరుడునివలె, ఆయుధధారులలో శ్రేష్ఠుడైన ఈ అర్జునుడు ఏ సేవ చేయును ?

అర్జున ఉవాచ - అర్జును డిట్లుపలికెను

ప్రతిజ్ఞాం షణ్డకోఽస్మీతి కరిష్యామి మహీపతే
జ్యాఘాతౌ హి మహాన్తౌ మే సంవర్తుం నృప దుష్కరౌ. 25

వలయైశ్ఛాదయిష్యామి బాహూ కిణకృతావిమౌ.

ఓ మహారాజా ! నేను నపుంసకుడనని చెప్పుకొందును. అల్లె త్రాటి ఒరిపిడిగల నా చేతులను కప్పిపుచ్చుట కష్టము. అయినను కాయలు కాచిన యీ చేతులను వలయములతో కప్పివైతును.

కర్ణయోః ప్రతిముచ్యాహం కుణ్డలే జ్వలనప్రభే. 26
పినద్ధకమ్బుః పాణిభ్యాం తృతీయాం ప్రకృతిం గతః
వేణీకృతశిరా రాజన్ నామ్నాచైవ బృహన్నలా. 27

అగ్నివలె వెలుగొందు కుండలములను చెవులకు పెట్టుకొని, చేతులను శంఖములను ధరించి మూడవ తీరు జనుడనై జడలు ధరించి బృహన్నల యను పేరున తిరుగాడుదును.

పఠన్నాఖ్యాయికాశ్చైవ స్త్రీభావేన పునః పునః
రమయిష్యే మహీపాల మన్యాంశ్చాన్తఃపురే జనాన్. 28

ఆడంగితనముతో మాటిమాటికి పూర్వరాజుల కథలను చెప్పుచు రాజును, అంతిపురమునందలి యితర జనులను వేడుక పరతును.

---

26. షండకః - నపుంసకుడు, గోపాలకుడనియు నర్థము. గోపాలుడైన కృష్ణునికి మారురూపము వంటివాడు కనుక అర్జునుడు షండుడు.

27. పినద్ధకమ్బుః - శంఖములవలయములను ధరించినవాడు; తృతీయాం ప్రకృతిమ్ - స్త్రీయు, పురుషుడును గాని వ్యక్తి స్వభావమును; బృహన్నలా - నరుడే నలుడు, రలలకు అభేదము; బృహత్ నరః గొప్పనరుడు- నారాయణ సఖుడైన నరుడని యర్థము.

28. అఖ్యాయికాః - పూర్వరాజుల కథలను.

గీతం నృత్యం విచిత్రంచ వాదిత్రం వివిధం తథా
శిక్షయిష్యామ్యహం రాజన్ విరాటస్య పురస్త్రియః. 29

విరాటుని అంతఃపురకాంతలకు ఆట, పాట, విచిత్రములైన వివిధములైన వాద్యములు నేర్పుదును.

ప్రజానాం సముదాచారం బహుకర్మకృతం వదన్
ఛాదయిష్యామి కౌన్తేయ మాయయాత్మాన మాత్మనా. 30

ఓ కుంతీకుమారా ! ప్రజలకు యోగ్యములైన అనేక సత్కార్యములు చేసితినని పలుకుచు కపటవేషముతో నన్ను నా బుద్ధితో కాపాడు కొందును.

యుధిష్ఠిరస్య గేహే వై ద్రౌపద్యాః పరిచారికా
ఉషితాస్మీతి వక్ష్యామి పృష్టో రాజ్ఞాచ పాణ్డవ! 31

రాజు నన్ను డిగినచో యుధిష్ఠిరుని గృహమున ద్రౌపదికి పరిచారికనై యుంటినని చెప్పుదును.

ఏతేన విధినాఛన్నః కృతకేన యథానలః
విహరిష్యామి రాజేన్ద్ర విరాటభవనే సుఖమ్ 32

ఓ రాజేంద్రా ! ఇట్టి కపటపద్ధతిలో అగ్నివలె (నలునివలె) గూఢముగా ఆ విరాటుని యింట సుఖముగా తిరుగుదును.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి పాణ్డవ ప్రవేశ పర్వణి
యుధిష్ఠిరాది మన్త్రిణే ద్వితీయోఽధ్యాయః
ఇది శ్రీమహాభారత విరాటపర్వమున పాండవప్రవేశపర్వమున
యుధిష్ఠిరాదుల ఆలోచనమను రెండవ అధ్యాయము.

---

30. మాయయా - కపట నపుంసకరూపమైన వంచనతో. ఆత్మానమ్-శరీరమును, ఆత్మనా - బుద్ధితో.

31. ద్రౌపద్యాః పరిచారికా - ద్రౌపదికి సేవకురాలు . ఇచట సేవయనగా భర్తగా భార్యకు చేయు సత్కారము అను నర్థమును గ్రహించినచో ద్రౌపదికి భర్త అను సత్యార్థము వ్యక్త మగును.

## తృతీయోఽధ్యాయః - మూడవ అధ్యాయము

నకులస్య సహదేవస్య ద్రౌపద్యాశ్చ స్వీయభావి కర్తవ్యానాం దిగ్దర్శనమ్.

నకులుడు, సహదేవుడు, ద్రౌపది తమ భావి కర్తవ్యములను సూచించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

ఇత్యేవ ముక్త్వా పురుష ప్రవీర
స్తథార్జునో ధర్మభృతాం వరిష్ఠః
వాక్యం తదాసౌ విరరామ భూయో
నృపోఽపరం భ్రాతర మాబభాషే ।

పురుషులలో శ్రేష్ఠుడు. ధర్మపరులలో మిక్కిలి గొప్పవాడు, అగు అర్జునుడు ఇట్లు పలికి మిన్నకుండెను. అంత రాజు మఱియొక తమ్మునితో ఇట్లు పలికెను.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లనెను.

కిం త్వం నకుల కుర్వాణ స్తత్ర తాత చరిష్యసి
కర్మ తత్ త్వం సమాచక్ష్వ రాజ్యే తస్య మహీపతేః
సుకుమారశ్చ శూరశ్చ దర్శనీయః సుఖోచితః. 2

నాయనా! నకులా! నీవే పని చేయుచు ఆ రాజు రాజ్యమున సంచరింతువు? చెప్పుము. నీవు సుకుమారుడవు. శూరుడవు. చూడ ముచ్చట అయిన వాడవు. సుఖపడవలసినవాడవు.

నకుల ఉవాచ - నకులుడిట్లు పలికెను.

అశ్వబన్ధో భవిష్యామి విరాటనృపతే రహమ్
సర్వథా జ్ఞాన సంపన్నః కుశలః పరిరక్షణే 3

నేను విరాటుని కొలువున గుఱ్ఱములకు పాలకుడనగుదును. వాని స్వభావాదులను చక్కగా ఎఱుగుదును. వానిని కాపాడుటలో నేర్పు గలవాడను.

గ్రన్థికో నామ నామ్నాహం కర్మైతత్ సుప్రియం మమ
కుశలోఽస్మ్యశ్వ శిక్షాయాం తథైవాశ్వచికిత్సనే
ప్రియాశ్చ సతతం మేఽశ్వాః కురురాజ యథాతవ. 4

నా పేరచట గ్రంథికుడు. నాకీపని మిక్కిలి యిష్టము. అశ్వము లను తీర్చిదిద్దుటలో, వాని చికిత్స విషయములో నేను నేర్పరిని. ఓ కురు రాజా! నీకు వలె నాకును గుఱ్ఱములు చాల ప్రియమైనవి.

యే మా మామన్త్రయిష్యంతి విరాట నగరే జనాః
తేభ్య ఏవం ప్రవక్ష్యామి విహరిష్యామ్యహం యథా. 5

నన్నెవ్వరైన విరాటనగరమున అడిగినచో నా వృత్తిని గూర్చి యిట్లు చెప్పుదును.

పాణ్డవేన పురా తాత అశ్వేష్వధికృతః పురా
విరాట నగరే ఛన్న శ్చరిష్యామి మహీపతే ! 6

"అయ్యా! నేను పూర్వము ధర్మరాజునొద్ద గుఱ్ఱములపై అధి కారిగా నుంటిని". ఓ రాజా ఇట్లు నేనా విరాటుని నగరమున తెలియ రాకుండ సంచరింతును.

---

4. గ్రన్థికః - గ్రంథములను - ఆయుర్వేదమును, అధ్వర్యవమును (యజ్ఞము నందు అధ్వర్యువు అను నతడు చేయు కార్యమును) తెలిసినవాడు. నకులుడు దేవతల వైద్యులగు అశ్వినుల కుమారుడు కనుక ఈ యర్థము సత్యమును రక్షించును.

6. అశ్వేషు అధికృతః - శ్వః - రేపు; అశ్వాః - రేపు లేనివాడు. రేపు బ్రదుకుదునను భావము లేనివాడు అశ్వుడు - అనగా శూరుడు; అట్టివారి యందు ముఖ్యుడను అని భావము. ఇది సత్యపరిరక్షణ. వేఱొక యర్థమున గుఱ్ఱముల అధికారి.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లు పలికెను.

సహదేవ కథం తస్య సమీపే విహరిష్యసి ।
కింవా త్వం కర్మ కుర్వాణః ప్రచ్ఛన్నో విహరిష్యసి ॥ 7

నాయనా ! సహదేవా ! నీవా రాజుకడ ఏపని చేయుచు గూఢముగా సంచరింతువు ?

సహదేవ ఉవాచ - సహదేవు డిట్లు పలికెను.

గోసంఖ్యాతా భవిష్యామి విరాటస్య మహీపతేః
ప్రతిషేద్ధాచ దోగ్ధాచ సంఖ్యానే కుశలో గవామ్. 8

నేనా విరాటుని కొలువున గోవులను అదుపులో పెట్టుట, పాలు పిదుకుట, పరీక్షించుట అను పనులలో నేర్పుగల గోపాలకుడ నగుదును.

తన్తిపాల ఇతిఖ్యాతో నామ్నాహం విదితస్త్వథ
నిపుణంచ చరిష్యామి వ్యేతు తేమానసో జ్వరః 9

నా పేరు తంతిపాలుడని ప్రకటింతును. చాల మెలకువతో తిరుగుదును. నీవు దిగులు పడకుము.

[అరోగా బహులాః పుష్టాః క్షీరవత్యో బహుప్రజాః
నిష్పన్న సత్త్వాః సుభృతాః వ్యపేతజ్వరకిల్బిషాః
నష్టచోరభయా నిత్యం వ్యాధివ్యాఘ్రి వివర్జితాః
గావశ్చ సుసుఖా రాజన్ నిరుద్విగ్నా నిరామయాః
భవిష్యన్తి మయా గుప్తా విరాటనగరే నృప.

---

8. సంఖ్యానే - పరీక్షించుట యందు.

9. తన్తిపాలః - ఎద్దులను త్రాళ్ళతో కట్టుటకుపయోగించు పెద్ద మోకును తంతి యందురు. దానిని పరిరక్షించువాడు. తంతి యనగా వాక్కు. దానినిపాలించు వాడు అని గూఢార్థము. 'నీవు చెప్పిన మాటను తప్పను' అను నర్థముగల పేరున నన్ను ప్రకటింతునని భావము.

ఓ రాజా ! విరాటనగరమున నేను కాపాడు గోవులు రోగము లేనివి, బలిసినవి, ఎక్కువపాలిచ్చునవి, ఎక్కువ దూడలను పెట్టునవి, అధికశక్తి కలవి, చక్కగా పెంపబడునవి, జ్వరదోషములు లేనివి, దొంగల భయము వీడినవి, రోగముల పులుల భయములేనివి, కలత పాటు లేనివి, సులభముగా వశమగునవి కాగలవు ]

అహం హి సతతం గోషు భవతా ప్రహితః పురా,
తత్ర మే కౌశలం సర్వమవబుద్ధం విశాంపతే. 10

పూర్వము నన్ను నీవెల్లపుడు గోవుల విషయముననే నియోగించితివి కదా ! అందు నాకుగల నేర్పు నీవెఱుగుదువు.

లక్షణం చరితం చాపి గవాం యచ్చాపి మంగలమ్
తత్సర్వం మే సువిదిత మన్యచ్చాపి మహీపతే. 11

గోవుల స్వభావము, నడవడి, వానికి శుభమైన విషయము - ఈయన్నియు నాకు బాగుగా తెలియును.

వృషభా నపి జానామి రాజన్ పూజిత లక్షణాన్
యేషాం మూత్రముపాఘ్రాయ అపి వన్ధ్యా ప్రసూయతే. 12

ఎట్టివాని మూత్రమును వాసనచూచి గొడ్డుటావుకూడ బిడ్డను పెట్టునో అట్టి ప్రశస్తలక్షణములు గల ఆబోతులను గూర్చియు నాకు బాగుగా తెలియును.

సోఽహమేవం చరిష్యామి ప్రీతిరత్ర హి మే సదా
నచమాం వేత్స్యతే కశ్చిత్ తోషయిష్యే చ పార్థివమ్. 13

నేనిట్లు సంచరింతును. నాకందు మక్కువ ఎక్కువ. నన్నెవ్వడు గుర్తింపజాలడు. రాజునకు ప్రీతియు కలుగజేయుదును.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లనెను.

ఇయం హి నః ప్రియాభార్యా ప్రాణేభ్యోఽపి గరీయసీ
మాతేవ పరిపాల్యాచ పూజ్యా జ్యేష్ఠేవ చస్వసా. 14

---

14. మాతా - సస్యముగల భూమి, స్వసా - పార్వతి అనియు నర్థములు కలవు. మనకు సంతాన రూపఫలము నిచ్చునది, కావుననే స్వస - అంబికవలె పూజ్యురాలు. అనునర్థము కూడ యిట భావింపదగును.

ఈమె మనకు ప్రియమైన భార్య, ప్రాణములకన్న మిన్న యైనది. తల్లివలె పాలింపదగినది అక్కవలె మన్నింపదగినది.

కేన స్మ ద్రౌపదీ కృష్ణా కర్మణా విచరిష్యతి
నహి కించిత్ విజానాతి కర్మ కర్తుం యథాస్త్రియః. 15

ఈ ద్రుపదుని బిడ్డ కృష్ణ అచట ఏవృత్తితో తిరుగును ? సాధారణస్త్రీలవలె కాదు - పనిచేయుట కొంచెమును ఎఱుగదు.

సుకుమారీచ బాలాచ రాజపుత్రీ యశస్వినీ
పతివ్రతా మహాభాగా కథంను విచరిష్యతి. 16

మృదువైనది, ఎల్లప్పుడు వన్నె తరుగనిది, రాచబిడ్డ, కీర్తి కెక్కినది, పతివ్రత, పుణ్యాత్మురాలు - ఇట్టి యీమె యెట్లు సంచరించునో కదా !

మాల్యాగన్ధానలఙ్కారాన్ వస్త్రాణి వివిధాని చ
ఏతాన్యేవాభిజానాతి యతో జాతాహి భామినీ. 17

పుట్టినది మొదలు పూలమాలలు, అలంకారములు, వివిధము లైన వస్త్రములు మాత్రమే యెఱిగినది.

ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లు పలికెను.

సైరంధ్ర్యో రక్షితా లోకే భుజిష్యాః సన్తి భారత
నైవ మన్యాః స్త్రియో యాన్తి ఇతిలోకస్య నిశ్చయః. 18

సాహం బ్రువాణా సైరంధ్రీ కుశలా కేశ కర్మణి

---

15. బాలా - నిత్యనూతన.

16. యతోజాతా - ఏనాడుపుట్టెనో ఆనాటినుండియు, అగర్భ శ్రీమంతురాలని తాత్పర్యము.

17. సైరన్ధ్రీ - సీరమును - తెరను - ధరించునది. సీరంధ్ర - సీరంధ్రయే సైరంధ్రి - అనగా అంతఃపుర పరిచారిక - ఏ స్త్రీకొఱకు తెరపట్టబడునో ఆమెయు - సీరంధ్రయే. అనగా రాజభార్య. ఆ అర్థమున సత్యమును పరిరక్షించుటయైనది. భుజిష్య - పాలింపదగినది, పాలించునది. మొదటిది గూఢార్థము, రెండవది సత్యకథనము.

లోకమున సైరంధ్రులు పాలింపదగినవారై దాసీవృత్తిలో నుందురు. ఇతరస్త్రీలు అట్లుకాదు. ఇదిలోకమున ప్రసిద్ధమే కావున నేను సైరంధ్రినని చెప్పెదను. జడలల్లుటలో నేర్పుకలదనియు పలుకుదును.

యుధిష్ఠిరస్య గేహే వై ద్రౌపద్యాః పరిచారికా. 19
ఉషితాస్మీతి వక్ష్యామి పృష్టా రాజ్ఞాచ భారత
ఆత్మగుప్తా చరిష్యామి యన్మాం త్వం పరిపృచ్ఛసి. 20

నేను ధర్మరాజు గేహమున ద్రౌపదికి పరిచారికనై యుంటినని రాజడిగినచో చెప్పెదను. నన్ను నేను రక్షించుకొందును. ఇది నీ ప్రశ్నకు సమాధానము.

సుదేష్ణాం ప్రత్యుపస్థాస్యే రాజభార్యాం యశస్వినీమ్
సా రక్షిష్యతి మాం ప్రాప్తాం మాభూత్ తే దుఃఖమీదృశమ్. 21

ఆ రాజు భార్య పేరెన్నికకన్నది. అట్టి సుదేష్ణను ఆశ్రయించి యుందును. ఆశ్రయించిన నన్నామె రక్షించును. కావున నీకిట్టి చింతవలదు.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరా జిట్లుపలికెను

కల్యాణం భాషసే కృష్ణే కులే జాతాసి భామిని
న పాప మభిజానాసి సాధ్వీ సాధువ్రతే స్థితా. 22

ఓ భామినీ ! మంచికులమున పుట్టితివి. పాపమెఱుగని దానవు. సాధుస్వభావము కలదానవు. చక్కని ప్రవర్తనము కలదానవు చక్కగా పలికితివి.

---

19. ద్రౌపద్యాః పరిచారికా - రాహువుయొక్క శిరస్సు అన్నట్లు (రాహువేశిరస్సు, వానికి మిగిలినదేహములేదు) ద్రౌపదియొక్క పరిచారిక అనగా ద్రౌపదియను పరిచారిక (ద్రౌపదీరూపముతో యుధిష్ఠిరునికి పరిచారిక అని తాత్పర్యము

యథా న దుర్హృదః పాపా భవన్తి సుఖినః పునః
కుర్యాస్తత్ త్వం హి కర్మాణి లక్షయేయుర్నతే తథా. 23

పాపాత్ములు మన శత్రువులు. మరల సుఖవంతులు కాకుండు నట్లు, వారికి గుర్తింపరాని విధమున, ప్రవర్తిల్లుము.

ఇతి శ్రీ మహాభారతే విరాట పర్వణి పాణ్డవప్రవేశ పర్వణి
యుధిష్ఠిరాది మన్త్రణే తృతీయోఽధ్యాయః
ఇది శ్రీ మహాభారతము విరాట పర్వమున పాండవప్రవేశ పర్వమున
యుధిష్ఠిరాదుల ఆలోచనమను మూడవ అధ్యాయము

## చతుర్థోఽధ్యాయః — నాల్గవ అధ్యాయము

ధౌమ్యస్య పాణ్డవాన్ ప్రతి రాజ కులవసత్యుపదేశః
సర్వేషాం స్వాభీష్ట స్థానం ప్రతిగమనంచ

ధౌమ్యుడు పాండవులకు రాజభవనములో మెలగువిధానమును బోధించుట అందరు తమ ఇచ్చవచ్చిన చోటుల కరుగుట.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లు పలికెను.

కర్మాణ్యుక్తాని యుష్మాభి ర్యాని యాని కరిష్యథ
మమ చాపి యథా బుద్ధిరుచితా విధినిశ్చయాత్ 1

మీరందరు ఏ ఏ పనులు చేయుదురో చెప్పితిరి. మరియు చేయవలసిన పనులను గూర్చి నాకు తోచిన దానిని చెప్పుదును.

పురోహితోఽయ మస్మాక మగ్నిహోత్రాణి రక్షతు
సూద పౌరోగవైః సార్థం ద్రుపదస్య నివేశనే. 2

వంటలవారితోపాటు ఈ మన పురోహితులు ద్రుపదునియింట నుండి మన అగ్నిహోత్రములను రక్షింతురుగాక.

2. అగ్నిహోత్రాణి - అగ్నిహోత్ర పాత్రలు, అగ్నిని మథించు సాధనములు హోమద్రవ్యములను కూర్చెడు గోవులు మొదలగు వానిని

ఇన్ద్రసేన ముఖాశ్చేమే రథానాదాయ కేవలాన్
యాన్తు ద్వారవతీం శీఘ్రమితి మే వర్తతే మతిః. 3

ఈ ఇంద్రసేనుడు మొదలగువారు వట్టి రథములను కైకొని ద్వారవతికి వెంటనే పోవలయునని నా అభిప్రాయము.

ఇమాశ్చ నార్యో ద్రౌపద్యాః సర్వాశ్చ పరిచారికాః
పాఞ్చాలానేవ గచ్ఛన్తు సూద పౌరోగవైస్సహ. 4

ద్రౌపది పరిచారికలగు ఈ స్త్రీలందరు, వంటలవారితో కూడి, పాంచాల దేశమునకే యరుగవలయును.

సర్వైరపి చ వక్తవ్యం న ప్రాజ్ఞాయన్త పాణ్డవాః
గతా హ్యస్మానపహాయ సర్వే ద్వైతవనాదితి. 5

పాండవుల ఉనికి మాకు తెలియదు. వారు మమ్ములను వదలి ద్వైతవనమునుండి యెటకో వెళ్ళిరని వీరందరు చెప్పవలయును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం తేఽన్యోన్యమామన్త్ర్య కర్మాణ్యుక్త్వా పృథక్ పృథక్
ధౌమ్యమామన్త్రయామాసుః సచ తాన్ మంత్రమబ్రవీత్. 6

ఇట్లు వారిలో వారు వీడబలుకుకొని, చేయవలసిన పనులను విడివిడిగా చెప్పుకొని, పురోహితుడగు ధౌమ్యునితో వెళ్ళివత్తుమని చెప్పిరి. అతడు వారికిట్లు ఉపదేశము చేసెను.

ధౌమ్యఉవాచ - ధౌమ్యు డిట్లు చెప్పెను.

విహితం పాణ్డవాః సర్వం బ్రాహ్మణేషు సుహృత్సుచ
యానే ప్రహరణేచైవ తథైవాగ్నిషు భారత 7

5: న ప్రాజ్ఞాయన్త - నిజముగనే వారికి పాండవుల సంగతి తెలియదు. పాండవులును ద్రౌపదియు ఏకాంతమునందే విరాటనగరమున నివసించుటకు నిశ్చయించిరిగదా!

ఓ ధర్మరాజా! పాండుకుమారులగు మీరు బ్రాహ్మణుల విషయమున, మిత్రుల విషయమున, విజయయాత్ర విషయమున, యుద్ధ విషయమున, అగ్నుల విషయమున చేయవలసినదంతయు చేసితిరి.

త్వయా రక్షా విధాతవ్యా కృష్ణాయా: ఫాల్గునేన చ
విదితం వో యథా సర్వం లోకవృత్త మిదం తవ 8

నీవును అర్జునుడును ద్రౌపదిని మెలకువతో కాపాడవలయును. మీకందరకు ఈలోకము తీరంతయు తెలిసినదే.

విదితే చాపి వక్తవ్యం సుహృద్భి రనురాగత:
ఏష ధర్మశ్చ కామశ్చ అర్థశ్చైవ సనాతన: 9

అన్నియు తెలిసినప్పటికిని మైత్రి కలవారు అనురాగముతో చెప్పనే వలయును. ఇట్లు చెప్పుట వలన సనాతనమైన ధర్మము, కామము, అర్థము అనుసరించి వచ్చును.

అతోఽహ మపి వక్ష్యామి హేతు మత్ర నిబోధత
హన్తేమాం రాజవసతిం రాజపుత్రా బ్రవీమ్యహమ్ 10

కావున నేను కూడ చెప్పుచున్నాను. నాయనలారా! రాజపుత్రులారా! రాజు కడనుండుటలోని విధానమును తెలియుడు.

యథా రాజకులం ప్రాప్య సర్వాన్ దోషాం స్తరిష్యథ
దుర్వసం చైవ కౌరవ్య జానతా రాజవేశ్మని 11

రాజకులమును చేరి పొందెడు కీడులన్నియు మీరు దీనివలన దాటుదురు. ఎంత తెలిసినవానికైనను రాజభవనమున వసించుట తేలిక కాదు.

---

8. లోకవృత్తమ్ - రక్షణలేని స్త్రీల యందు లోకమనుసరించు తీరు;
10. హన్త - జాలితో అన్నమాట.

అమానితైర్మానితైర్వా అజ్ఞాతైః పరివత్సరమ్
తతశ్చతుర్దశే వర్షే చరిష్యథ యథాసుఖమ్. 12

ఈ పదుమూడవ వత్సరము అవమానము కలిగినను, మన్నన కలిగినను మీరు అజ్ఞాతముగనే యుండవలయును. అటుపై పదునాల్గవ యేట మీరు ఇచ్చవచ్చినట్లు తిరుగవచ్చును.

దృష్టద్వారో లభేద్ ద్రష్టుం రాజస్వేషు న విశ్వసేత్
తదేవాసన మన్విచ్ఛేద్ యత్ర నాభిపతేత్ పరః. 13

ద్వారపాలకుని వలననే రాజదర్శనము చేయవలయును. రాజు సొమ్ముల విషయమున నమ్మకము పెట్టుకొనరాదు. శత్రువు వచ్చి పడని ఆసనమునే కోరవలయును.

యో న యానం న పర్యఙ్కం న పీఠం న గజం రథమ్.
ఆరోహేత్ సమ్మతోఽస్మీతి స రాజ వసతిం వసేత్ 14

నేను రాజునకిష్టుడనని గర్వించి ఇతరుల వాహనమును, పాన్పును, పీఠమును, ఏనుగును రథమును ఎక్కనివాడే రాజగృహమున ఉండగలడు.

యత్ర యత్రైనమాసీనం శఙ్కేరన్ దుష్టచారిణః
న తత్రోపవిశేద్ యో వై స రాజ వసతిం వసేత్. 15

ఎందెందు కూర్చున్నచో దుష్టులగు చారు లనుమానింతురో అందందు చేరనివాడే రాజగృహమున ఉండగలడు.

న చానుశిష్యాద్ రాజాన మపృచ్ఛన్తం కదాచన
తూష్ణీం త్వేన ముపాసీత కాలే సమభిపూజయేత్ 16

13. రాజస్వేషు - రహస్యేషు అని పాఠాంతరము; మంత్రాలోచన చేయునపుడు రాజునకిష్టుడనని నమ్మకముతో ప్రవేశించినచో రాజు ఆలోచన చెడెనని ప్రాణములు తీయవచ్చునని భావము.

15. యత్ర యత్ర - ద్యూతశాల మున్నగు వానియందు;

అడుగనిదే రాజునకెన్నడు ఆలోచనలు చెప్పరాదు. ఊరక సేవించుచుండవలయును. తగినవేళలలో పొగడవలయును.

అసూయన్తి హి రాజానో జనా ననృతవాదినః
తథైవ చావమన్యన్తే మన్త్రిణం వాదినం మృషా. 17

రాజులు ఇచ్చకమునకై అబద్ధము లాడు వారిని ద్వేషింతురు. అబద్ధములాడు మంత్రిని కూడ అవమానింతురు.

నైషాం దారేషు కుర్వీత మైత్రీం ప్రాజ్ఞః కదాచన
అన్తఃపురచరా యే చ ద్వేష్టి యా నహితాశ్చయే 18

బుద్ధి గలవాడు రాజుల భార్యలతోడను, అంతిపురము నందలి జనులతోడను, రాజు పగగొన్న వారితోడను, రాజు నందు పగ గొన్న వారితోడను ఎన్నటికిని మైత్రి చేయరాదు.

విదితే చాస్య కుర్వీత కార్యాణి సులఘూన్యపి
ఏవం విచరతో రాజ్ఞి నక్షతి ర్జాయతే క్వచిత్ 19

ఎంత తేలిక పనులనైనను తెలిసినచో చేయుచుండవలయును. ఇట్లు తెలిసి రాజు కడ తిరుగువానికి ఎన్నటికిని కీడురాదు.

గచ్ఛన్నపి పరాం భూమి మపృష్టో హ్యనియోజితః
జాత్యన్ధ ఇవ మన్యేత మర్యాదా మనుచిన్తయన్. 20

ఎంత ఉన్నత స్థానము చేరినను రాజు పలుకకముందు, చెప్పక ముందు, మర్యాదను పాటించుచు పుట్టు గ్రుడ్డివలె తన్నుతాను భావింపవలయును.

నహి పుత్రం న నప్తారం న భ్రాతర మరిందమాః
సమతిక్రాన్త మర్యాదం పూజయన్తి నరాధిపాః. 21

---

19. విచరతః - జాగ్రత్తగా ఆలోచించుచు తిరుగు వానికి;
20. తాను నిత్యము కూర్చుండు ఆసనమునందైనను, రాజు కూర్చుండుమని చెప్పకముందు, తనతో పలుకక ఊరకున్నపుడు, ఆ ఆసనము చూడనే చాలని పుట్టుగ్రుడ్డి వలె తన్ను భావించుకొనుచు కూర్చుండరాదని భావము,

శత్రువుల నణచివేయు స్వభావము గల రాజులు హద్దు మీరిన వానిని కొడుకునే మైనను, మునిమనుమనినైనను, తోడ బుట్టిన వానినైనను మన్నింపరు.

యత్నాచ్చోపచరే దేన మగ్నివత్ దేవవత్త్రివా
అనృతే నోపచీర్ణోహి హన్యాదేవ న సంశయః. 22

అగ్నిని వలె, దైవమును వలె ఎంతో మెలకువతో రాజును సేవింపవలయును. కపటముతో సేవించినచో తప్పక చంపును. ఇందు సంశయము లేదు.

యద్ యద్ భర్తా నుయుఞ్జీత తత్తదేవానువర్తయేత్,
ప్రమాద మవలేపంచ కోపంచ పరివర్జయేత్. 23

ప్రభువు ఏది ఏది శాసించునో, అడుగునో దానినే చేయవలయును. చెప్పవలయును. పొరపాటు, కోపము, గర్వము అనువానిని పూర్తిగా విడువవలయును.

సమర్థనాసు సర్వాసు హితంచ ప్రియమేవ చ
సంవర్ణయేత్ తదేవాస్య ప్రియాదపి హితం భవేత్ 24

ఆలోచనలు చెప్పవలసిన విషయము లన్నింటియందు హితమైన దానిని ప్రియమైన దానినే చక్కగా చెప్పవలయును. రెండును కుదరని పక్షమున ప్రియమును వదలి హితమునే చెప్పవలయును.

అనుకూలో భవేచ్చాస్య సర్వార్థేషు కథాసు చ
అప్రియం చాహితం యత్ స్యాత్ తదస్మై నానువర్ణయేత్ 25

అన్ని పనులయందును, పలుకులయందును రాజునకు అనుకూలుడే కావలయును. ప్రియము హితము కాని దానిని చెప్పనేరాదు.

---

22. అగ్నివద్ - నిప్పు సమీపమున నున్న దానిని / వానిని కాల్చి వేయునట్లు: దేవవద్ - అశ్రద్ధతో నున్నవానిని దైవము సర్వనాశనము చేయునట్లు:
24. హితం - భవిష్యత్తున సుఖమొనర్చునది, ప్రియమ్ - చెవికింపైనది.

నాహ మస్య ప్రియోఽస్మీతి మత్వా సేవేత పణ్డితః
అప్రమత్తశ్చ సతతం హితం కుర్యాత్ ప్రియంచ యత్. 26

బుద్ధిమంతుడు 'నే నీతనికి ప్రియుడను కాను' అని తలచియే సేవింపవలయును. ఎట్టి పొరపాటు లేక ప్రియము హితము అగుదానినే చేయువలయును.

నా స్యానిష్టాని సేవేత నాహితైః సహ సంవదేత్
స్వస్థానాన్న వికమ్పేత స రాజవసతిం వసేత్. 27

రాజున కిష్టముకాని వానిని సేవింపరాదు. అతని శత్రువులతో మాటాడరాదు. రాజు తనకిచ్చిన స్థానమునుండి కదలరాదు. ఇట్టి వాడే రాజు కడ నుండగలడు.

దక్షిణం వాథ వామం వా పార్శ్వ మాసీత పణ్డితః,
రక్షిణాం హ్యాత్తశస్త్రిణాం స్థానం పశ్చాద్ విధీయతే. 28

విద్యలు గల పండితుడు రాజునకు కుడివైపో యెడమవైపో కూర్చుండవలయును. ఆయుధధారులగు రక్షకులు వెనుకవైపున నుందురు.

నిత్యం హి ప్రతిషిద్ధంతు పురస్తాదాసనం మహత్,
వచ సందర్శనే కించిత్ ప్రవృత్తమపి సంజయేత్. 29

ఎంతటి వాడైనను రాజు ఎదుట ఉన్నతమగు ఆసనమును గ్రహింపరాదు. రాజుముందు సత్కారమేదైన జరుగుచున్నచో నేను ముందని పోయి గ్రహింపరాదు.

అపి హ్యేతద్ దరిద్రాణాం వ్యలీక స్థాన ముత్తమమ్,
న మృషాభిహితం రాజ్ఞాం మనుష్యేషు ప్రకాశయేత్ 30

27. స్వస్థానాత్ - రాజు తన కిచ్చిన స్థానమునుండి:
28. పణ్డితః - తన విద్యలతో కథలతో రాజును మెప్పించుచున్నవాడై.

దరిద్రులకు కూడ ఇట్టిది అప్రియమైన స్థానము. రాజుల సంగతి చెప్పనేల ? రాజుల పొల్లు మాటను కూడ మనుజులయందు వెల్లడి చేయరాదు.

అసూయన్తి హి రాజానో జనా నసృతవాదినః,
తథైవ చావమన్యన్తే నరాన్ పణ్డిత మానినః. 31

కల్లలాడు జనులను రాజులు సహింపరు. అట్లే తమ్ము తాము పండితులనుకొనువారిని అవమానింతురు.

శూరోఽస్మీతి న దృప్తః స్యాద్ బుద్ధిమానితి వాపునః
ప్రియ మేవాచరన్ రాజ్ఞః ప్రియోభవతి భోగవాన్. 32

శూరుడనని పండితుడనని గర్వింపరాదు. రాజునకు ప్రియము చేయువాడే ఇష్టుడు, భోగములు కలవాడు అగును.

ఐశ్వర్యం ప్రాప్య దుష్ప్రాపం ప్రియం ప్రాప్య చ రాజతః
అప్రమత్తో భవేద్ రాజ్ఞః ప్రియేషు చ హితేషు చ 33

పొందనలవి కాని సంపదలను, ప్రియములను రాజు వలన పొందియు రాజునకు సంబంధించిన ప్రియులయందును, హితుల యందును, ప్రియ హితములయందును మెలకువతో ప్రవర్తింప వలయును.

యస్య కోపో మహాభాధః ప్రసాదశ్చ మహాఫలః
కస్తస్య మనసాపీచ్ఛేదనర్థం ప్రాజ్ఞసమ్మతః. 34

ఎవనికోపము మహాభయంకరమో, ఎవని అనుగ్రహము గొప్పఫలముల నొసగునదియో అట్టి వానికి మనసుననైనను కీడు చేయగోరు బుద్ధిమంతు డెవ్వడుండును ?

న చోష్ఠౌ న భుజౌ జానూ నచ వాక్యం సమాక్షిపేత్,
సదా వాతంచ వాచంచ ష్ఠీవనం చాచరేచ్ఛనైః. 35

పెదవులు, చేతులు, మోకాళ్ళు, పలుకులు ప్రకటముచేయరాదు. గాలి వదలుట వలుకుట, ఉమ్మిట, మొదలగువానిని మెల్లగా తెలియ రాకుండ చేయువలయును.

హాస్య వస్తుషు చాన్యస్య వర్తమానేషు కేషుచిత్,
నాతిగాఢం ప్రహృష్యేత నచాప్యున్మత్తవద్ధసేత్. 36

ఇతరునికి సంబంధించిన నవ్వదగిన విషయములేవైన సంభ వించినను మిక్కిలిగా సంతోషము పొందరాదు. పిచ్చివానివలె పెద్దగా నవ్వరాదు.

న చాతిధైర్యేణ చరేద్ గురుతాం హి వ్రజేత్ తతః,
స్మితంతు మృదుపూర్వేణ దర్శయేత ప్రసాదజమ్. 37

అట్టి సందర్భములలో చాల ధైర్యముతో మెలగవలయును. వీడు వట్టి జడుడా! అని రాజు తలపకుండునట్లు మదిలోని ప్రసన్నతకు గుర్తుగా మృదువైన చిరునగవును ప్రదర్శింపవలయును.

లాభే న హర్షయేద్ యస్తు నవ్యథేద్ యోఽవమానితః,
అసంమూఢశ్చ యోనిత్యం స రాజవసతిం వసేత్. 38

లాభమున పొంగక అవమానముపొందిన క్రుంగక యెవడు నిరంతరము మెలకువతో ప్రవర్తించునో వాడే రాజగృహమున నివసింపగలడు.

రాజానం రాజపుత్రం వా సంవర్ణయతి యః సదా
అమాత్యః పణ్డితో భూత్వా సచిరం తిష్ఠతే ప్రియః. 39

ఎల్లప్పుడు రాజునో, రాజకుమారునో పొగడుచుండువాడు మంత్రియో, పండితుడో అయి చిరకాలము రాజునకు ప్రియుడై వెలుగొందును.

---

36. ఇట్టి విషయములందు ధైర్యముతో కొయ్యబారిన ట్లుండవలయును. లేనిచో రాజు తన్ను క్షుద్రుడనుకొనును.

38. అసంమూఢః - సేవయందు ఏమరుపాటు లేనివాడు.

39. తిష్ఠతే = ప్రకాశించును.

ప్రగృహీతశ్చ యోఽమాత్యో నిగృహీతస్త్వకారణైః,
న నిర్వదతి రాజానం లభతే సంపదం పునః. 40

రాజానుగ్రహము పొందినవాడు ఒకవేళ కారణములేకయే రాజకోపమునకు పాత్రుడైనను, నిందింపకున్నచో, మరల సంపదను పొందును.

ప్రత్యక్షం చ పరోక్షంచ గుణవాదీ విచక్షణః,
ఉపజీవీ భవేద్రాజ్ఞో విషయే యోఽపి వాథ వేత్. 41

ఆ రాజు దేశమున నుండువాడు, ఆ రాజును కొలిచి యుండు వాడును వివేకముతో ఎదురుగా నున్నను, చాటుగా నున్నను రాజు గుణములనే చెప్పుచుండవలయును.

అమాత్యో హి బలాద్ భోక్తుం రాజానం ప్రార్థయేత యః,
న స తిష్ఠేచ్చిరం స్థానం గచ్ఛేచ్చ ప్రాణసంకటమ్ 42

మొండిగా ఇతరులను గూర్చి రాజుతో చాడీలు చెప్పగోరు వాడు తన పదవిలో ఎక్కువ కాలము నిలువలేడు ప్రాణములకు కూడ ముప్పు వచ్చును.

శ్రేయః సదాత్మనో దృష్ట్వా పరం రాజ్ఞా న సంవదేత్,
విశేషయేచ్చ రాజానం యోగ్యభూమిషు సర్వదా. 43

రాజు నుండి తనకు కలుగు మేలును ఎల్లప్పుడు చూచుకొనుచు ఇతరుని రాజుతో సమానుడని చెప్పరాదు తగిన ప్రదేశములలో రాజును ఎక్కువ చేసి చెప్పవలయును. రాజునకు మెప్పు పుట్టింప వలయును.

అమ్లానో బలవాఞ్ఛూరశ్ఛాయేవానుగతః సదా
సత్యవాదీ మృదుర్దాన్తః స రాజవసతిం వసేత్. 44

42. భోక్తుమ్ - కుటిలముగా చేయుటకు;

44. అమ్లానః - ఉత్సాహము కలవాడు; బలవాన్ - బుద్ధిబలము కలవాడు మృదుః - మొరటుతనము లేనివాడు; దాన్తః - ఇంద్రియములపై అదుపు గలవాడు - వసులలో ఆరితేరిన వాడు.

అలసత లేనివాడు, బలము గలవాడు, శూరుడు, ఎవ్వడు నీడ వలె వెన్నంటి యుండువాడు, సత్యము పలుకువాడు, మెత్తనివాడు, ఇంద్రియములను జయించినవాడు రాజగృహమున నుండగలవాడు.

అన్యస్మిన్ ప్రేష్యమాణే తు పురస్తాద్ యః సముత్పతేత్,
అహం కింకరవాణీతి స రాజవసతిం వసేత్. 45

రాజొక పని నొకనికి చెప్పుచుండగా నన్నేమి చేయుమందురని ముందుకు వచ్చువాడు రాజగృహమున నుండుటకు యోగ్యుడు.

అన్తరే చైవ బాహ్యే చ రాజ్ఞా యశ్చాథ సర్వదా,
ఆదిష్టో నైవ కమ్పేత స రాజవసతిం వసేత్. 46

లోపల వెలుపల ఎల్లప్పుడు రాజాజ్ఞను బెదరక వెనుకాడక చేయువాడు సేవకు యోగ్యుడు.

యో వై గృహేభ్యః ప్రవసన్ ప్రియాణాం నానుసంస్మరేత్,
దుఃఖేన సుఖమన్విచ్ఛేత్ స రాజవసతిం వసేత్. 47

తనవారికి దూరమైతి ననుకొనక, తన ప్రియులను ఎల్లపుడు తలచుకొనుచుండక కష్టపడి సుఖము పొందగోరువాడు రాజసేవకు పాత్రుడు.

సమవేషం న కుర్వీత నోచ్చైః సంనిహితో వసేత్,
న మన్త్రం బహుధా కుర్యాదేవం రాజ్ఞః ప్రియో భవేత్. 48

రాజుతో సమానమగు వేషము ధరింపరాదు. మేరమీరి రాజు కడ నుండరాదు. గూఢాలోచనము మిక్కిలిగా చేయరాదు. ఇట్లైనచో రాజునకు ప్రియుడగును.

న కర్మణి నియుక్తః సన్ ధనం కిఞ్చిదపి స్పృశేత్,
ప్రాప్నోతి హి హరన్ ద్రవ్యం బన్ధనం యది వా వధమ్. 49

---

46. అంతరే - ధనము, అంతఃపురము, సంరక్షణము మున్నగు వానియందు; బాహ్యే - సామంతరాజులను జయించుట మున్నగువాని యందు;

47. ప్రియాణామ్ - స్త్రీ పుత్ర అన్న పానాది సుఖములను.

[5]

ఏదేని పనియందు రాజు నియమించినపుడు ధనమును కొంచెమైనను ముట్టరాదు. ధనము నపహరించినచో బంధనమో వధయో కలుగును.

యానం వస్త్రమలంకారం యచ్చాన్యత్ సంప్రయచ్ఛతి,
తదేవ ధారయేన్నిత్య మేవం ప్రియతరో భవేత్. 50

రాజిచ్చిన వాహనమో, వస్త్రమో, అలంకారమో, దానినే నిత్యము తాల్పవలయును. అప్పుడు రాజునకు మిక్కిలి యిష్టుడగును.

ఏవం సంయమ్య చిత్తాని యత్నతః పాణ్డునన్దనాః,
సంవత్సరమిమం తాత తథాశీలా బుభూషత,
అథ స్వవిషయం ప్రాప్య యథాకామం కరిష్యథ. 51

నాయనలారా! పాండుకుమారులారా! ఇట్లు మనస్సులను గట్టిగా అదుపులో పెట్టుకొని యీ సంవత్సరకాలము అట్టి నడవడితో మెలగుడు. అటుపై మీ దేశమును పొంది యిష్టము ననుసరించి ప్రవర్తింపవచ్చును.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లు పలికెను.

అనుశిష్టాః స్మ భద్రం తే నైతద్ వక్తాస్తి కశ్చన,
కుంతీమృతే మాతరం నో విదురం వా మహామతిమ్. 52

మీరు మాకు చక్కని ఉపదేశము చేసితిరి. మాతల్లి కుంతియు, గొప్ప మేధావి విదురుడు తప్ప ఇట్టి హితము చెప్పువారు మాకు ఎవ్వరు కలరు?

యదేవానన్తరం కార్యం తద్భవాన్ కర్తుమర్హతి,
తారణాయాస్య దుఃఖస్య ప్రస్థానాయ జయాయ చ. 53

50. రాజిచ్చిన వాహనాదులను ఇతరుల కీయరాదని భావము.

51. బుభూషత - ఐశ్వర్యమును పొందగోరుడు.

53. అనన్తరమ్ కార్యమ్ - వెనువెంటనే చేయదగిన శాంతిక పౌష్టిక క్రియా సముదాయమును, శాంతికమనగా కీడులను అణచివేయు క్రియ, పౌష్టికమనగా పుష్టిని కలిగించు క్రియ.

మేమీ దుఃఖమును దాటుటకు, ఇటనుండి బయలు దేరుటకును, జయము నొందుటకును చేయవలసిన శాంత్యాదిక్రియలు తామ చేయవలయును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

ఏవ ముక్త స్తతో రాజ్ఞా ధౌమ్యోఽథ ద్విజసత్తమః,
అకరోత్ విధివత్ సర్వం ప్రస్థానే యద్ విధీయతే. 54

రాజిట్లు పలుకగా బ్రాహ్మణశ్రేష్ఠుడగు ధౌమ్యుడు ప్రయాణకాలమున చేయదగు క్రియాకలాపమును శాస్త్రమున చెప్పి నట్లు చేసెను.

తేషాం సమిధ్య తానగ్నీన్ మన్త్రవచ్చ జుహావ సః,
సమృద్ధి వృద్ధి లాభాయ పృథివీవిజయాయ చ. 55

వారికి సమృద్ధి వృద్ధిలాభములు కలుగుటకు, భూమి మరల లభించుటకును ఆ అగ్నులను జ్వలింపజేసి మంత్రపూర్వకముగా హోమములు గావించెను.

అగ్నీన్ ప్రదక్షిణీకృత్య బ్రాహ్మణాంశ్చ తపోధనాన్,
యాజ్ఞసేనీం పురస్కృత్య షడేవాథ ప్రవవ్రజుః. 56

అగ్నులకు, తపోధనులైన బ్రాహ్మణులకు ప్రదక్షిణము చేసి ద్రౌపదిని ముందిడుకొని ఆ ఆరుగురే బయలుదేరిరి.

గతేషు తేషు వీరేషు ధౌమ్యోఽథ జపతాం వరః,
అగ్నిహోత్రాణ్యుపాదాయ పాఞ్చాలా నభ్యగచ్ఛత. 57

ఆ వీరులు అట్లు వెళ్ళగా తపోధనుడగు ధౌమ్యుడు అగ్ని హోత్రములను కైకొని పాంచాలదేశమున కరిగెను.

---

55. సమృద్ధిః - జనులతో కలయిక, వృద్ధిః - యుద్ధమున జయము, లాభః - రాజ్యలాభము. పృథివీవిజయాయ - లభించిన రాజ్యము వశమున నుండుటకు.

ఇన్ద్రసేనాదయశ్చైవ యథోక్తాః ప్రాప్య యాదవాన్,
రథా నశ్వాంశ్చ రక్షన్తః సుఖమూషుః సుసంవృతాః. ౫౪

ఇంద్రసేనుడు మొదలగువారు మున్ను చెప్పిన తీరున యాదవుల కడ కరిగి, రథములను, గుఱ్ఱములను కాపాడుచు గుట్టుగా సుఖముగా నుండిరి.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి పాణ్డవప్రవేశ పర్వణి ధౌమ్యోపదేశే చతుర్థోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారత విరాటపర్వమున పాండవ ప్రవేశపర్వమున ధౌమ్యుని ఉపదేశమను నాలుగవ అధ్యాయము.

## పఞ్చమోఽధ్యాయః — అయిదవ అధ్యాయము

పాణ్డవానాం విరాటనగరసమీపం గత్వా శ్మశానే శమీవృక్షే స్వకీయాస్త్ర శస్త్రాణాం స్థాపనమ్.

పాండవులు విరాటనగరముకడకరిగి శ్మశానమున జమ్మిచెట్టుపై తమ అస్త్రశస్త్రములను నిక్షేపించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

తే వీరా బద్ధనిస్త్రింశా స్తథా బద్ధకలాపినః,
బద్ధగోధాఙ్గులిత్రాణాః కాళిన్దీ మభితో యయుః. 1

ఆ వీరులు ఖడ్గములు అంపపొదులు చేతులకు వ్రేళ్ళకు తొడుగులు ధరించి, కాళింది ననుసరించి పయనించిరి.

తత స్తే దక్షిణం తీర మన్వగచ్ఛన్ పదాతయః,
నివృత్త వనవాసా హి స్వరాష్ట్రం ప్రేప్సవ స్తదా,
వసన్తో గిరిదుర్గేషు వనదుర్గేషు ధన్వినః. 2

1. నిస్త్రింశః - ఖడ్గము; బద్ధ కలాపినః - కట్టుకొనిన అంపపొదులుగలవారు
3. బద్ధగోధాంగుళి త్రాణాః - గోధ అనగా అల్లెత్రాటి ఒరిపిడి నుండి రక్షించు తొడుగు; అంగుళిత్రాణమ్ - వ్రేళ్ళ తొడుగు, - ఇవి కట్టుకొన్నవారు.

అంత వారు కాలినడకతో యమున కుడిఒడ్డున పయనించిరి. వనవాసము ముగించినవారు గావున తమరాజ్యమును పొందగోరిన వారై ఆ ధానుష్కులు కొండకోటలయందును, అరణ్య దుర్గముల యందును నిలుచుచు పయనించిరి.

విధ్యన్తో మృగజాతాని మహేష్వాసా మహాబలాః,
ఉత్తరేణ దశార్ణాం స్తే పఞ్చాలాన్ దక్షిణేన చ. 3

అన్తరేణ యకృల్లోమాన్ శూరసేనాంశ్చ పాణ్డవాః,
లుబ్ధాబ్రువాణా మత్స్యస్య విషయం ప్రావిశన్ వనాత్. 4

గొప్ప ధనువులు ధరించి మహాబలులైన పాండవులు ఉత్తరముగా దశార్ణదేశమును, దక్షిణముగా పాంచాలదేశమును వచ్చునట్లు, యకృల్లోమము, శూరసేనము అను దేశముల నడుమ ప్రయాణించుచు, వేటకాండ్రమని చెప్పుకొనుచు అడవినుండి మత్స్యదేశమునకు చేరుకొనిరి.

ధన్వినో బద్ధనిస్త్రింశా వివర్ణాః శ్మశ్రుధారిణః.

వారు విండ్లను కత్తులను ధరించియుండిరి. వన్నె తరిగియుండిరి. గడ్డములు, మీసములు మాసి యున్నవి.

తతో జనపదం ప్రాప్య కృష్ణా రాజాన మబ్రవీత్. 5

అంత గ్రామసీమను చేరుకొని ద్రౌపది రాజుతో నిట్లనెను.

పశ్యైకపద్యో దృశ్యన్తే క్షేత్రాణి వివిధానిచ,
వ్యక్తం దూరే విరాటస్య రాజధానీ భవిష్యతి,
వసామేహాపరాం రాత్రిం బలవాన్ మే పరిశ్రమః. 6

చూడుము. ఇచట పొలములకు పోవు బాటలు, అనేక విధములగు పొలములు కానవచ్చుచున్నవి. చూడగా విరాటుని రాజధాని

4 లుబ్ధాః - వేటకాండ్రు; రాజ్యమునందు కోరికకలవారు.
6. ఏకపద్యః - సన్నని దారులు.

చాల దూరమున నున్నట్లున్నది. ఇచట ఒక్కరాత్రి ఉండుము. నాకు అలసట మిక్కుటముగా నున్నది.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లు పలికెను.

ధనంజయ సముద్యమ్య పాఞ్చాలీం వహ భారత,
రాజధాన్యాం నివత్స్యామో విముక్తాశ్చ వనాదితః. 7

నాయనా! అర్జునా! ద్రౌపదిని ఎత్తుకొనుము. రాజధాని యందే ఆగుదము. అడవినుండి యిప్పుడే వెలువడితిమి.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

తామాదాయార్జునస్తూర్ణం ద్రౌపదీం గజరాడివ,
సంప్రాప్య నగరాభ్యాశ మవతారయదర్జునః. 8

గజరాజు వలె అర్జునుడు ఆమెను తేలికగా మోసికొని తెచ్చి నగరప్రాంతమును చేరిన పిమ్మట దింపెను.

స రాజధానీం సంప్రాప్య కౌన్తేయోఽర్జున మబ్రవీత్,
క్వాయుధాని సమాసజ్య ప్రవేక్ష్యామః పురం వయమ్. 9

రాజధానిని సమీపించి ధర్మజుడు అర్జునునితో ఇట్లనెను. మనమీ ఆయుధములను ఎచట భద్రపరచి పురము ప్రవేశింతము?

సాయుధాశ్చ ప్రవేక్ష్యామో వయం తాత పురం యది,
సముద్వేగం జనస్యాస్య కరిష్యామో న సంశయః. 10

నాయనా! మనమాయుధములతో పాటు పురమును ప్రవేశించినచో జనమునకు గుండెలలో దడపుట్టును. సందియములేదు.

గాణ్డీవం చ మహద్ గాఢం లోకే చ విదితం నృణామ్,
తచ్చేదాయుధ మాదాయ గచ్ఛామో నగరం వయమ్,
క్షిప్రమస్మాన్ విజానీయు ర్మనుష్యా నాత్రసంశయః. 11

ఈ గాండీవము మిక్కిలి దొడ్డది. లోకమున జనులు దీనిని బాగుగా ఎఱుగుదురు. దీనిని గైకొని మనము పురము ప్రవేశించితిమా జనులు మనలను తప్పక గుర్తింతురు. సందేహములేదు.

తతో ద్వాదశ వర్షాణి ప్రవేష్టవ్యం వనే పునః,
ఏకస్మిన్నపి విజ్ఞాతే ప్రతిజ్ఞాతం హి న స్తథా. 12

మనలో ఏ ఒక్కడు గుర్తింపబడినను మరల పండ్రెండు ఏండ్లు అడవిని బడవలయును. ఇట్లని మనము ప్రతిజ్ఞ చేసియుంటిమికదా !

అర్జున ఉవాచ - అర్జునుడిట్లు పలికెను.

ఇయం కూటే మనుష్యేన్ద్ర గహనా మహతీ శమీ,
భీమశాఖా దురారోహా శ్మశానస్య సమీపతః. 13

ఓ మహారాజా ! ఇదిగో ఈ ఎత్తైన తావున పెరపు గొలుపు కొమ్మలతో చొరశక్యముకాని పెద్ద జమ్మిచెట్టు ఎక్కుటకు వీలు లేనిదై శ్మశానము కడ నున్నది.

న చాపి విద్యతే కశ్చి న్మనుష్య ఇతి మే మతిః,
యోఽస్మాన్ నిదధతో ద్రష్టా భవేచ్ఛస్త్రాణి పాణ్డవాః. 14

పాండవులారా ! మన మిట ఆయుధములను భద్రపరచు చుండగా చూచెడు మనుష్యు డెవ్వడు ఇట కానరాడు.

ఉత్పథే హి వనే జాతా మృగవ్యాళనిషేవితే,
సమీపస్య శ్మశానస్య గహనస్య విశేషతః. 15

ఈ జమ్మి దారికి దూరముగా క్రూరమృగములు తిరుగు అడవిలో పుట్టినది. మీదుమిక్కిలి చొరరాని వల్లకాటికి దగ్గరగా నున్నది.

సమాధాయాయుధం శమ్యాం గచ్ఛామో నగరం ప్రతి,
ఏవ మత్ర యథాయోగం విహరిష్యామ భారత. 16

13. కూటే - కొండకొమ్మువలె ఎత్తైన ప్రదేశమున; దురారోహా-వల్లకాటిలో నుండుటచే ఎవ్వరికిని ఎక్కుటకు శక్యముకానిది.

15. ఉత్పథే - జనులు తిరుగుదారికి దూరమందు

ఈ జమ్మిపై మన ఆయుధములను నిక్షేపించి నగరమున కరుగుదము. అందు వీలయిన విధమున సంచరింతము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

ఏవ ముక్త్వా స రాజానం ధర్మరాజం యుధిష్ఠిరమ్,
ప్రచక్రమే నిధానాయ శస్త్రాణాం భరతర్షభ. 17

ఓ భరతశ్రేష్ఠా ! ఆతడిట్లు రాజైన ధర్మజునితో పలికి ఆయుధముల నచట భద్రపరుప నారంభించెను.

యేన దేవాన్ మనుష్యాంశ్చ సర్వాంశ్చైకరథోఽజయత్,
స్ఫీతా ఞ్జనపదాం శ్చాన్యా నజయత్ కురుపుఙ్గవః. 18

తదుదారం మహాఘోషం సంపన్న బలసూదనమ్,
అపజ్య మకరోత్ పార్థో గాణ్డీవం సుభయంకరమ్. 19

కురుశ్రేష్ఠుడగు అర్జునుడు ఇతరుల సాయము లేకయే ఏధనుస్సుతో దేవతలను సర్వమానవులను గెలిచెనో అట్టి దొడ్డదియు గొప్ప అల్లెత్రాటిధ్వని గలదియు, గొప్ప బలముగలవారినిగూడ మట్టుపెట్టునదియు, మిక్కిలి వెరపు గొలుపునదియు నగు గాండీవము నారిని సడలించెను.

యేన వీరః కురుక్షేత్ర మభ్యరక్షత్ పరంతపః,
అముఞ్చద్ ధనుష స్తస్య జ్యా మక్షయ్యాం యుధిష్ఠిరః. 20

ఏ ధనుస్సుతో యుధిష్ఠిరుడు శత్రుసంహారకుడై కురుక్షేత్రమును కాపాడెనో యట్టి ధనువు నారిని సడలించెను.

పాఞ్చాలాన్ యేన సంగ్రామే భీమసేనోఽజయత్ ప్రభుః,
ప్రత్యషేధత్ బహూనేకః సపత్నాం శ్చైవ దిగ్జయే. 21

నిశమ్య యస్య విస్ఫారం వ్యద్రవ న్త రణాత్ పరే,
పర్వతస్యేవ దీర్ణస్య విస్ఫోట మశనే రివ. 22

19. సంపన్న బలసూదనమ్ - దేవతల నారాధించి బలవిశేషము పొందిన రాక్షసాదులను గూడ మట్టుపెట్టునది.

సైన్ధవం యేన రాజానం పర్యామృషితవా నథ,
జ్యాపాశం ధనుష స్తస్య భీమసేనోఽవతారయత్. 23

సమర్థుడైన భీమసేనుడు ఆ ధనువుతో యుద్ధమున పాంచాలురను గెలిచెను. దిగ్విజయమున అనేకశత్రువుల నొక్కడై నిలువరించెను. కొండ పగులుచున్నట్లు, పిడుగు బ్రద్దలగుచున్నట్లు వచ్చు దాని పెద్దమ్రోత విని శత్రువులు యుద్ధమును వదలి పారిపోవుదురు. దానితో సింధురాజైన జయద్రథుని పరాభవించెను. అట్టి ధనువు త్రాటిని భీమసేనుడు పట్టు వదలించెను.

అజయత్ పశ్చిమా మాశాం ధనుషా యేన పాణ్డవః,
మాద్రీపుత్రో మహాబాహు స్తామ్రాస్యో మితభాషితా. 24

తస్య మౌర్వీ మపాకర్ష చ్ఛూరః సంక్రన్దనో యుధి,
కులే నాస్తి సమో రూపే యస్యేతి నకులః స్మృతః. 25

రూపమునందు కులమున సాటిలేని వాడు అను నర్థమున నకుల నామముతో ప్రసిద్ధికెక్కినవాడు, పొడవైన భుజములు, ఎఱ్ఱని మోము కలవాడు, మితభాషి, యుద్ధమున శత్రువులను ఏడిపించు వాడు అగు మాద్రికొడుకు ఏవింటితో పడమరదిక్కును జయించెనో, దాని అల్లెత్రాటిని వదులు చేసెను.

దక్షిణాం దక్షిణాచారో దిశం యేనాజయత్ ప్రభుః,
అపజ్య మకరోద్ వీరః సహదేవ స్తదాయుధమ్. 26

పరకార్యములను శీఘ్రముగా చేయువాడు, సమర్థుడు అయిన సహదేవుడు తాను దక్షిణదిక్కును ఏ ధనువుతో గెలిచెనో దానిని ఎక్కుడించెను.

---

25. సంక్రన్దనః - పగవారిని ఏడ్పించువాడు.

ఖడ్గాంశ్చ దీప్తాన్ దీర్ఘాంశ్చ కపాలాంశ్చ మహాధనాన్,
విపాఠాన్ క్షురధారాంశ్చ ధనుర్భిర్నిదధుః సహ. 27

గొప్ప కాంతికలవి, పొడవైనవి అగు ఖడ్గములను గొప్ప వెలగల అంపపొదులను పెద్ద అమ్ములను, పదునైన కత్తి వాతి అమ్ములను ధనువులతోపాటు నిక్షేపించిరి.

వైశంపాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

అథాన్వశాస న్నకులం కున్తీపుత్రో యుధిష్ఠిరః,
ఆరుహ్యేమాం శమీం వీర ధనూంష్యేతాని నిక్షిప. 28

పిదప కుంతీపుత్రుడగు యుధిష్ఠిరుడు, వీరుడా ! ఈ జమ్మినెక్కి యీ ధనువులను భద్రముచేయుమని నకులుని కాదేశించెను.

తాముపారుహ్య నకులో ధనూంషి నిదధే స్వయమ్,
యాని తస్యావకాశాని దివ్యరూపాణ్యమన్యత. 29

ఆ జమ్మిచెట్టునెక్కి దాని సందులను దివ్యరూపములని తలచి నకులుడు ధనువులను స్వయముగా నిక్షేపించెను.

యత్ర చాపశ్యత స వై తిరోవర్షాణి వర్షతి,
తత్ర తాని దృఢైః పాశైః సుగాఢం పర్యబన్ధత. 30

ఎదురుజల్లులు కురిసినను తడియుని తావులలో వానిని గట్టి త్రాళ్ళతో మిక్కిలిగట్టిగా కూర్చి కట్టెను.

శరీరం చ మృతస్యైకం సమబధ్నన్త పాణ్డవాః,
వివర్జయిష్యన్తి నరా దూరాదేవ శమీమిమామ్, 31

ఆబద్ధం శవమత్రేతి గన్ధమాఘ్రాయ పూతికమ్,
అశీతిశతవర్షేయం మాతా న ఇతి వాదినః. 32

---

28. వకాశాని - అవకాశములను - కొమ్మల నడుమభాగములను;

30. తిరోముఖాని - ఎదురుజల్లులు.

32. మాతా - తల్లివలె ఈజమ్మి మా ఆయుధములను రక్షించునని గూఢాభిప్రాయము.

పాండవులు చచ్చినవాని శవము నొకదానిని దానిపై కట్టిరి. దీని చెడుకంపువలన ఇందు శవమును కట్టిరని తలచి జనులు దూరము నుండియే ఈ జమ్మిచెట్టును తొలగిపోవుదురని తలచి ఈమె మాతల్లి నూటయెనుబదియేండ్ల వయసుది అని పలుకుచుండిరి.

కులధర్మోఽయ మస్మాకం పూర్వై రాచరితోఽపి వా,
సమాసజ్జ్యాథ వృక్షేఽస్మిన్నితి వై వ్యాహరన్తి తే. 33

ఇది మాకులధర్మము, మాపూర్వులిట్లే చేసిరి. మేముకూడ అట్లే చెట్టున కట్టితిమి. అనియును వారు పలుకుచుండిరి.

ఆగోపాలావిపాలేభ్య ఆచక్షాణాః పరంతపాః,
ఆజగ్ముర్నగరాభ్యాశం పార్థాః శత్రునిబర్హణాః. 34

పరులను కాల్చివేయువారగు ఆకుంతీతనయులు అటనున్న గొల్లలకు, గొఱ్ఱెల కాపరులకు చెప్పుచు నగరసమీపమున కరిగిరి.

జయో జయన్తో విజయో జయత్సేనో జయద్బలః,
ఇతి గుహ్యాని నామాని చక్రే తేషాం యుధిష్ఠిరః. 35

ధర్మరాజు వారికి వరుసగా జయుడు, జయంతుడు, విజయుడు, జయత్సేనుడు, జయద్బలుడు అను రహస్య నామములను ఏర్పరచెను.

తతో యథా ప్రతిజ్ఞాభిః ప్రావిశన్ నగరం మహత్,
అజ్ఞాతచర్యాం వత్స్యన్తో రాష్ట్రే వర్షం త్రయోదశమ్. 36

పిమ్మట వారు ఏర్పరచుకొన్న విధముగా రాష్ట్రమున పదుమూడవ యేడున అజ్ఞాతవాసము చేయగోరి ఆదొడ్డనగరమును ప్రవేశించిరి.

---

33. కులధర్మః - వంశాచారము, ఆయుధములను ఇట్లు దాచుట క్షత్రియ ధర్మమని గుట్టుగా చెప్పుట.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి పాణ్డవప్రవేశ
పర్వణి అస్త్రసంస్థాపనే పఞ్చమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారత విరాటపర్వమున పాండవప్రవేశ పర్వమున అస్త్రములు నిక్షేపించుట అను అయిదవ అధ్యాయము.

## షష్ఠోఽధ్యాయః - ఆరవ అధ్యాయము

యుధిష్ఠిర కర్తృకం దుర్గాదేవ్యాః స్తవనమ్
ప్రత్యక్ష మావిర్భూతాయా దేవ్యా స్తస్మై వరప్రదానం చ.

యుధిష్ఠిరుడు దుర్గాదేవిని స్తుతించుట, ప్రత్యక్షమైన దేవి ఆతనికి వరమిచ్చుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

విరాటనగరం రమ్యం గచ్ఛమానో యుధిష్ఠిరః,
అస్తువన్మనసా దేవీం దుర్గాం త్రిభువనేశ్వరీమ్. 1

ధర్మరాజు మనోజ్ఞమైన విరాటనగరమునకు పోవుచు ముల్లోకముల నేలు దుర్గాదేవిని మనస్సులో ఇట్లు స్తుతించెను.

యశోదాగర్భసంభూతాం నారాయణ వర ప్రియామ్,
నన్దగోపకులే జాతాం మంగల్యాం కులవర్ధనీమ్. 2

యశోద కడుపున పుట్టినది, నారాయణుడిచ్చిన వరములన్న [?] మగలది, నందగోపుని కులమున ఉదయించినది, మంగళముల నొసగునది, కులమును పెంపొందించునది అగు దేవిని స్తుతించెను.

---

1. దుర్గామ్ - దాటరాని ఆపదలను దాటించునది.
2. నారాయణ వరప్రియామ్ - ఉమ. భద్రకాళి మొదలగు పేర్లతో దేవతలు నిన్ను పూజింతురని విష్ణువు దుర్గాదేవికి వరములిచ్చినట్లు విష్ణుపురాణాదులలో ప్రసిద్ధి. అట్టి వరములయందు ప్రీతి కలదానిని.

కంస విద్రావణకరీ మసురాణాం క్షయంకరీమ్,
శిలాతట వినిక్షిప్తా మాకాశం ప్రతిగామినీమ్. 3

కంసుని బెదరగొట్టినది, రక్కసులను పరిమార్చునది, కంసుడు రాతిపై వేసికొట్టగా ఆకాశమున కెగిరిపోయినది యగు దుర్గను స్తుతించెను.

వాసుదేవస్య భగినీం దివ్యమాల్య విభూషితామ్,
దివ్యాంబర ధరాం దేవీం ఖడ్గఖేటక ధారిణీమ్. 4

శ్రీకృష్ణుని చెలియలు, దివ్యమైన మాలలతో అలంకరింప బడినది, దివ్యవస్త్రములను దాల్చునది, ఖడ్గము, డాలు, చేత పట్టినది యగు దేవిని స్తుతించెను.

భారావతరణే పుణ్యే యే స్మరన్తి సదాశివామ్,
తాన్ వై తారయసే పాపాత్ పఙ్కే గామివ దుర్బలామ్. 5

బరువు దింపుకొనవలసినపుడు, పుణ్యకాలమునందును, సదా శివ స్వరూపురాలవగు నిన్ను స్మరించువారిని, ఊబిలో దిగబడిన బక్కచిక్కిన ఆవునువలె, పాపమునుండి వెలికి లాగుదువు.

స్తోతుం ప్రచక్రమే భూయో వివిధైః స్తోత్ర సంభవైః,
ఆమన్త్ర్య దర్శనాకాంక్షీ రాజా దేవీం సహానుజః. 6

తమ్ములతోగూడి ఆరాజు దేవిదర్శనమును కాంక్షించుచు స్తుతికై పుట్టిన వివిధ నామములతో దేవిని స్తుతింప మొదలిడెను.

నమోఽస్తు వరదే కృష్ణే కుమారి బ్రహ్మచారిణి,
బాలార్క సదృశాకారే పూర్ణచన్ద్రనిభాననే. 7

4. ఖేటకమ్ - డాలు.

6. స్తోత్ర సంభవైః - దేవియొక్క అనేకనామములు ఆనులు స్తుతించుటకే పుట్టినవని భావము.

వరములనిచ్చుదానా ! కృష్ణస్వరూపిణీ ! కుమారీ ! బ్రహ్మ చారిణీ ! లేత సూర్యునివంటి ఆకారము గలదానా ! నిండుజాబిల్లి వంటి మోముగలదానా ! నీకు నమస్సు.

చతుర్భుజే చతుర్వక్త్రే పీనశ్రోణి పయోధరే,
మయూర పిచ్ఛవలయే కేయూరాఙ్గద ధారిణి,
భాసి దేవి యథా పద్మా నారాయణ పరిగ్రహః 8

నాలుగు భుజములు, నాలుగు మోములు, నిండైన పిరుదులు, స్తనములు, నెమలియీకలవంటి వలయములు, కేయూరములు, అంగదములు గలదానా ! నీవు శ్రీమన్నారాయణుని దేవి పద్మవలె విరాజిల్లుచున్నావు.

స్వరూపం బ్రహ్మచర్యం చ విశదం ఖగనేశ్వరి,
కృష్ణ చ్ఛవి సమా కృష్ణా సంకర్షణ సమాననా. 9

ఓ ఖేచరీ దేవీ ! నీ స్వరూపము, నీ బ్రహ్మచర్యము మిక్కిలి స్వచ్ఛమైనది. కృష్ణుని కాంతివంటి కాంతి కలదానవు. కృష్ణ స్వరూపిణివి. కృష్ణుని మోమువంటి మోము గలదానవు.

బిభ్రతీ విపులౌ బాహూ శక్ర ధ్వజ సముచ్ఛ్రియౌ,
పాత్రీ చ పఙ్కజీ ఘణ్టీ స్త్రీ విశుద్ధా చ యా భువి. 10

ఇంద్ర ధనుస్సు వలె పైకెత్తిన వరదాభయహస్తములు, పాత్రను పద్మమును, ఘంటను పట్టిన హస్తములు కలిగి భూమియందు పవిత్ర స్త్రీ స్వరూపముతో నుందువు.

పాశం ధను ర్మహా చక్రం వివిధా న్యాయుధాని చ,
కుణ్డలాభ్యాం సుపూర్ణాభ్యాం కర్ణాభ్యాం చ విభూషితా. 11

---

8. చతుర్భుజే అనుటవలన విష్ణుస్వరూపిణియనియు, చతుర్వక్త్రే అనుటవలన బ్రహ్మస్వరూపిణి యనియు తెలియుచున్నది.

9. బ్రహ్మచర్యమ్ - ఈమాట వలన ఆ తల్లి ఇతరులను చేరనిది యను నర్థము సిద్ధించుచున్నది.

పాశము, విల్లు, గొప్పచక్రము, వివిధములైన ఆయుధములు నీవు హస్తములతో పట్టి యుందువు. కుండలములతో నిండైన చెవులతో అలంకరింపబడి యుందువు.

చన్ద్రవిస్పర్ధినా దేవి ముఖేన త్వం విరాజసే,
ముకుటేన విచిత్రేణ కేశబన్ధేన శోభినా. 12

చంద్రునితో పంతగించు ముఖముతో అలరారుదువు. అందముగా విరాజిల్లు జుట్టు ముడి రూపమున నున్న కిరీటముతో వెలుగొందుదువు.

భుజఙ్గభోగ వాసేన శ్రోణిసూత్రేణ రాజతా,
విభ్రాజసే చాబద్ధేన భోగేనేవేహ మన్దరః. 13

పాముల దేహమువలె తళతళలాడు మొలనూలితో, వాసుకి చుట్టిన మందరపర్వతము వలె, విరాజిల్లుచున్నావు.

ధ్వజేన శిఖిపిచ్ఛానా ముచ్ఛ్రితేన విరాజసే,
కౌమారం వ్రత మాస్థాయ త్రిదివం పావితం త్వయా. 14

నెమలి యీకలు గల ఎత్తైన ధ్వజముతో విరాజిల్లుచున్నావు. కౌమార వ్రతమును పట్టి నీవు స్వర్గమును పవిత్ర మొనరించితివి.

తేన త్వం స్తూయసే దేవి త్రిదశైః పూజ్యసేఽపిచ,
త్రైలోక్య రక్షణార్థాయ మహిషాసుర నాశిని,
ప్రసన్నా మే సురశ్రేష్ఠే దయాం కురు శివా భవ. 15

కావుననే దేవతలు నిన్ను స్తుతింతురు, పూజింతురు. ముల్లోకముల రక్షణకై మహిషాసురుని మర్దించిన ఓతల్లీ! దేవతలలో అగ్రగణ్యురాలా! నాకు ప్రసన్నురాలవు కమ్ము దయ చేయుము. మంగళస్వరూపిణివి కమ్ము.

జయా త్వం విజయా చైవ సంగ్రామే చ జయప్రదా,
మమాపి విజయం దేహి వరదా త్వం చ సాంప్రతమ్. 16

నీవు జయ స్వరూపిణివి, విజయస్వరూపిణివి. యుద్ధమున జయ మొసగుదానవు. నాకును విజయము నొసగుము. నీవు వరముల నిచ్చు దానవు కాదగును.

వింధ్యే చైవ నగ శ్రేష్ఠే తవ స్థానం హి శాశ్వతమ్,
కాళి కాళి మహాకాళి ఖడ్గ ఖట్వాంగ ధారిణి. 17

పర్వతములలో శ్రేష్ఠమగు వింధ్యమునందు నీవు ఖడ్గము మంచపు కోడు ధరించుదానా!

కృతానుయాత్రా భూతైస్త్వం వరదా కామచారిణి.

వరముల నిచ్చు తల్లీ! ఇష్టమైన రూపముతో సంచరించు దానా! బ్రహ్మాదులును నీ వెంటనంటి తిరుగుదురు.

భారావతారే యేచత్వాం సంస్మరిష్యన్తి మానవాః, 18
ప్రణమన్తిచ యేత్వాం హి ప్రభాతే తు నరా భువి,
న తేషాం దుర్లభం కిఞ్చిత్ పుత్రతో ధనతోఽపివా. 19

మానవులు ఆపదల యందు నిన్ను స్మరింతురేని, ప్రాతః కాలమున నీకు ప్రణమిల్లుదురేని, సంతానము కాని ధనము గాని యేది కోరినను వారికి లభింపనిది కొంచెమైనను ఉండదు.

దుర్గాత్ తారయసే దుర్గే తత్ త్వం దుర్గా స్మృతా జనైః,
కాన్తారేష్వవసన్నానాం మగ్నానాం చ మహార్ణవే. 20

మహారణ్యములలో మడియువారైనను, మహా సముద్రము లలో మునుగువారైనను నిన్ను స్మరించినచో వారిని ఆ ఘోరమైన ఆపదనుండి దాట జేయుదువు. కావుననే నిన్ను దుర్గ అని జనులు పిలుతురు.

---

18. కృతానుయాత్రా - ప్రాచీనులగు బ్రహ్మాదులును నీవెంటబడి వత్తురని భావము.

దస్యుభి ర్వా నిరుద్ధానాం త్వం గతిః పరమా నృణామ్,
జలప్రతరణే చైవ కాన్తారేష్వటవీషు చ. 21

జలమార్గమునను, పోరాని ఘోరమైన బాటలయందును, మహారణ్యములందును దోపిడికాండ్రు అడ్డగించిన నరులకు నీవే పెద్దదిక్కు.

యే స్మరన్తి మహాదేవి న చ సీదన్తి తే నరాః,
త్వం కీర్తిః శ్రీర్ధృతిః సిద్ధి ర్హ్రీ ర్విద్యా సన్తతి ర్మతిః.
సంధ్యా రాత్రిః ప్రభా నిద్రా జ్యోత్స్నా కాన్తిః క్షమా దయా 22

ఓ మహాదేవీ ! నిన్ను స్మరించువారికి నాశములేదు. కీర్తి, లక్ష్మి, ధృతి, సిద్ధి, లజ్జ, విద్య, సంతానము - ఇవియన్నియు నాకు నీవే. నీవు సంధ్యవు, రాత్రివి, కాంతివి, నిద్రవు, వెన్నెలవు, వెలుగు, ఓర్పు, దయ అన్నియు నీవే.

నృణాం చ బన్ధనం మోహం పుత్రనాశం ధనక్షయమ్, 23
వ్యాధిం మృత్యుం, భయంచైవ పూజితా నాశయిష్యసి.

నిన్ను ఆరాధించు నరులకు బంధనము, అజ్ఞానము, పుత్రులు నశించుట, ధనముపోవుట, రోగము, చావు, భయము అనువానిని రూపుమాపుదువు.

సోఽహం రాజ్యాత్ పరిభ్రష్టః శరణం త్వాం ప్రపన్నవాన్. 24

రాజ్యమును కోల్పోయిన అట్టినేను నిన్ను శరణు పొందితిని.

ప్రణతశ్చ యథా మూర్ధ్నా తవ దేవి సురేశ్వరి,
త్రాహి మాం పద్మపత్రాక్షి సత్యే సత్యా భవస్వ నః. 25

అమ్మా ! దేవతల నేలుదానా ! నీకు తలతో ప్రణమిల్లుదును. పద్మపురేకులవంటి కనులుగల ఓ సత్యస్వరూపిణీ ! మాయెడల నీవు సత్యస్వరూపిణివై పాలింపుము.

శరణం భవ మే దుర్గే శరణ్యే భక్తవత్సలే.

ఓదుర్గా ! శరణమొసగుమాతా ! భక్తులయందు వాత్సల్యము గల తల్లీ ! నాకు శరణమిమ్ము.

ఏవం స్తుతా హి సా దేవీ దర్శయామాస పాణ్డవమ్, 26
ఉపగమ్యతు రాజాన మిదం వచన మబ్రవీత్.

ఇట్లు స్తుతిగొన్న ఆ దుర్గాదేవి పాండుపుత్రునకు దర్శన మొసగెను. ఆరాజును సమీపించి యిట్లు పలికెను.

దేవ్యువాచ - దేవి యిట్లు పలికెను.

శృణు రాజన్ మహాబాహో మదీయం వచనం ప్రభో, 27
భవిష్య త్యచిరాదేవ సంగ్రామే విజయ స్తవ.

ఓ రాజా ! మహాబాహూ ! నామాటవినుము. కొలదికాలమునకే నీకు యుద్ధమున విజయము సిద్ధించును.

మమ ప్రసాదా న్నిర్జిత్య హత్వా కౌరవ వాహినీమ్, 28
రాజ్యం నిష్కణ్టకం కృత్వా భోక్ష్యసే మేదినీం పునః,
భ్రాతృభిః సహితో రాజన్ ప్రీతిం ప్రాప్స్యసి పుష్కలామ్. 29

నా అనుగ్రహమువలన కౌరవసేనను హతమార్చి రాజ్యమును పీడలేనిదిగాచేసి, తిరిగి భూమి ననుభవింతువు. తమ్ములతోగూడి పుష్కలమైన ప్రీతిని పొందుదువు.

మత్ప్రసాదా చ్చ తే సౌఖ్య మారోగ్యం చ భవిష్యతి.

నా అనుగ్రహమువలన నీకు సౌఖ్యము, ఆరోగ్యము కలుగును.

యే చ సంకీర్తయిష్యన్తి లోకే విగత కల్మషాః,
తేషాం తుష్టా ప్రదాస్యామి రాజ్యమాయు ర్వపుః సుతమ్. 30

నన్ను కొనియాడు జనులు లోకమున పాపములేనివారగుదురు. వారికి తృప్తితో రాజ్యము, ఆయువు, చక్కని దేహము, సంతానము అనుగ్రహింతును.

ప్రవాసే నగరే చాపి సంగ్రామే శత్రుసంకటే, 31
అటవ్యాం దుర్గకాన్తారే సాగరే గహనే గిరౌ,

యే స్మరిష్యన్తి మాం రాజన్ యథాహం భవతా స్మృతా, 32
న తేషాం దుర్లభం కిఞ్చిదస్మిల్లోకే భవిష్యతి.

దేశమునువీడి పోయినపుడు, నగరమునందును, యుద్ధమునందును, శత్రువుల బాధ కలిగినపుడును, అడవియందును, ఘోరమైన మార్గమునందును, సముద్రమునందును, చొరరాని కొండయందును, నీవు నన్ను తలచిన విధముగా తలచిన జనులకు ఈలోకమున లభింపనిది కలుగదు.

ఇదం స్తోత్రవరం భక్త్యా శృణుయాద్ వా పఠేత వా, 33
తస్య సర్వాణి కార్యాణి సిద్ధిం యాస్యన్తి పాణ్డవాః.

పాండుసుతులారా! స్తోత్రములలో గొప్పదియగు దీనిని విన్నను, చదివినను వానికి సర్వకార్యములు సిద్ధించును.

మత్ప్రసాదాచ్చ వః సర్వాన్ విరాటనగరే స్థితాన్, 34
న ప్రజ్ఞాస్యన్తి కురవో నరా వా తన్నివాసినః.

నాఅనుగ్రహమువలన విరాటనగరముననున్న మిమ్ము కౌరవులుగాని, ఆ నగరవాసులుగాని గుర్తింపరు.

ఇత్యుక్త్వా వరదా దేవీ యుధిష్ఠిర మరిందమమ్,
రక్షాంకృత్వా చ పాణ్డూనాం తత్రైవాన్తరధీయత. 35

వరమునొసగు ఆ దుర్గాదేవి శత్రుమర్దనుడగు ధర్మరాజుతో ఇట్లుపలికి పాండవులకు రక్షనొసగి అచటనే అంతర్ధానమొందెను.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి పాణ్డవప్రవేశపర్వణి
దుర్గాస్తవే షష్ఠోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారత విరాటపర్వమున పాండవప్రవేశపర్వమున
దుర్గాస్తవమను ఆరవ అధ్యాయము.

## సప్తమోఽధ్యాయః — ఏడవ అధ్యాయము

యుధిష్ఠిరస్య రాజసభాయాం ప్రవిశ్య విరాటేన సహ సంలాప స్తత్ర నివాసశ్చ.

యుధిష్ఠిరుడు రాజసభయందు ప్రవేశించి విరాటునితో ప్రసంగించుట, అందు నివసించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతస్తు తే పుణ్యతమాం శివాం శుభాం
మహర్షి గన్ధర్వ నిషేవితోదకామ్,
త్రిలోకకాన్తా మవతీర్య జాహ్నవీ
మృషీంశ్చ దేవాంశ్చ పితౄ నతర్పయన్.

అంత వారు మిక్కిలి పుణ్యమైనదియు, మంగళస్వరూపిణియు, శుభస్వరూపిణియు, మహర్షులు గంధర్వులు సేవించిన జలము గలదియు, ముల్లోకములకు వాంఛింపదగినదియు నగు గంగానది లోనికి దిగి ఋషులకు, దేవతలకు, పితృదేవతలకు తర్పణము లిచ్చిరి.

వరప్రదానం హ్యనుచిన్త్య పార్థివో
హుతాగ్నిహోత్రః కృతజప్యమఙ్గలః,
దిశం తథైన్ద్రీ మభితః ప్రపేదివాన్
కృతాఞ్జలి ర్ధర్మముపాహ్వయచ్ఛనైః.

ఆరాజు యముడు వరమిచ్చిన విషయమును స్మరించి అగ్నిహోత్రమును వేల్చి, జపమును, మంగళకార్యములను ముగించుకొని తూర్పుదిక్కునకు తిరిగి మెల్లగా ధర్మరాజు నాహ్వానించెను.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లు పలికెను.

వరప్రదానం మమ దత్తవాన్ పితా
ప్రసన్నచేతా వరదః ప్రజాపతిః,
జలార్థినో మే తృషితస్య సోదరా
మయా ప్రయుక్తా వివిశుర్జలాశయమ్.

నాతండ్రి, ప్రసన్నచిత్తుడు, వరదుడు, ప్రజాపతి నాకు వర మొసగి యున్నాడు. దప్పిగొన్న నాకు నీరు తెచ్చుటకై నేను పంపగా నాతమ్ములు ఆ చెరువులోనికి ప్రవేశించిరి.

నిపాతితా యక్షవరేణ తే వనే
మహాహవే వజ్రభృతేవ దానవాః,
మయా చ గత్వా వరదోఽభితోషితో
వివక్షతా ప్రశ్నసముచ్చయం గురుః.

ఇంద్రుడు రాక్షసులను వలె మహాయుద్ధమున ఆయక్షవరుడు నా సోదరులను పడగొట్టెను. అంత నేనరిగి అడిగిన ప్రశ్నలన్నింటికి సమాధానముల నొసగుటచే ఆ నా తండ్రి మిక్కలి తృప్తి నొందెను.

స మే ప్రసన్నో భగవాన్ వరం దదౌ
పరిష్వజం శ్చాహ తథైవ సౌహృదాత్,
వృణీష్వ యుద్వాంభసి పాణ్డునన్దన
స్థితోఽన్తరిక్షే వరదోఽస్మి పశ్యతామ్.

ఆ భగవంతుడు నాయందు దయచేసి వరమొసగెను. ప్రేమతో కౌగిలించుకొని యిట్లు పలికెను. 'నాయనా ! పాండుకుమారా ! కోరిన వరమడుగుము. వరమొసగుటకై ఆకసమున నున్నాను. చూడుము.'

స వై మయోక్తో వరదః పితా ప్రభుః
స దైవ మే ధర్మరతా మతిర్భవేత్,
ఇమే చ జీవన్తు మమానుజాః ప్రభో
వపుశ్చ రూపం చ బలం తథాప్నుయుః.

అపుడు వరముల నొసగు ప్రభువగు నాతండ్రితో నిట్లంటిని. 'నాబుద్ధి ఎల్లప్పుడు ధర్మమున ప్రీతి కలదియగుగాక ! ఓ ప్రభూ !

ఈ నా సోదరులు బ్రదుకుదురుగాక. వారు దేహము, రూపము, బలము పొందుదురు గాక !

క్షమా చ కీర్తిశ్చ యథేష్టతో భవేత్
వ్రతం చ సత్యం చ సమాప్తి రేవచ,
వరో మమైషోఽస్తు యథానుకీర్తితో
న తన్మృషా దేవవరో యదబ్రవీత్.

'సహనము కీర్తియు కోరినవిధముగా సిద్ధించుగాక. సత్య వ్రతము సమాప్తి పొందుగాక. ఇదియే నాకు వరమగుగాక !' అని పలుకగా, ఆదేవవరుడు 'ఇది తప్పదు' అని పలికెను.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇత్యేవ ముక్త్వా ధర్మాత్మా ధర్మమేవానుచిన్తయన్
తదైవ తత్ప్రసాదేన రూపమేవాభజత్ స్వకమ్.

ధర్మరాజు ఇట్లు పలికి ఆ ధర్ముని నే ధ్యానించుచు అప్పుడే ఆతని అనుగ్రహమువలన తానుకోరిన (కంకభట్టు) రూపమును పొందెను.

స వై ద్విజాతి స్తరుణ స్త్రిదణ్డధృక్
కమణ్డలూష్ణీషధరోఽన్వ జాయత,
సురక్తమాంజిష్ఠ వరామ్బరః శిఖీ
పవిత్రపాణి ర్దదృశే తదద్భుతమ్.

అంత నా యుధిష్ఠిరుడు యువకుడు త్రిదండములను ధరించినవాడు, కమండలువు, తలపాగ కలవాడు, మంచిరంగుగల కాషాయ వస్త్రమును ధరించినవాడు, పిలక కలవాడు అగు బ్రాహ్మణుడుగా మారెను. అది అశ్చెరువు కొల్పెను.

తథైవ తేషామపి ధర్మచారిణాం
యథేప్సితా హ్యాభరణాంబరస్రజః,
క్షణేన రాజ న్నభవ న్మహాత్మనాం
ప్రశ_స్తధర్మాగ్ర్యఫలాభి కాఙ్క్షిణామ్.

అట్లే మహాత్ములు, శ్రేష్ఠమగు ధర్మముయొక్క గొప్ప ఫలములను వాంఛించువారు, ధర్మప్రవర్తనముగలవారునగు తక్కిన పాండవులకును కోరిన విధముగా ఆభరణములు, వస్త్రములు, మాటలు క్షణములో సమకూడెను.]

తతో విరాటం ప్రథమం యుధిష్ఠిరో
రాజా సభాయా ముపవిష్ట మావ్రజత్,
వైదూర్యరూపాన్ ప్రతిముచ్య కాఞ్చనా
నక్షాన్ స కక్షే పరిగృహ్య వాససా. 1

అంత ముందుగా యుధిష్ఠిర మహారాజు విరాటుడు కొలువుగా దీరి యుండగా, వైదూర్యములతో, బంగారముతో చేసిన పాచికలను వస్త్రమున కట్టికొని చంకకు తగిలించుకొని ప్రవేశించెను.

నరాధిపో రాష్ట్రపతిం యశస్వినం
మహాయశాః కౌరవవంశవర్ధనః,
మహానుభావో నరరాజ సత్కృతో
దురాసద స్తీక్ష్ణవిషో యథోరగః. 2

గొప్ప యశస్సు గలవాడు, కౌరవ వంశమును వృద్ధిపొందించువాడు, మహానుభావుడు, మహారాజులచేత మన్నింపబడువాడు, భయంకరవిషము గల సర్పమువలె ఇతరులకు చేర శక్యము కాని వాడు అగు ధర్మరాజు కీర్తిమంతుడగు విరాటుని చేరవచ్చెను.

బలేన రూపేణ నరర్షభో మహా
నపూర్వ రూపేణ యథా మర స్తథా,

మహాభ్రజాలై రివ సంవృతో రవి
ర్యథానలో భస్మవృతశ్చ వీర్యవాన్. 3

బలముతో రూపముతో గొప్ప మహాత్ముఁడైన ధర్మజుడు ఇప్పటి క్రొంగ్రొత్త రూపముతో దేవపురుషునివలె విరాజిల్లెను. ఆ వీర్యవంతుడు మేఘముల గుంపుతో కప్పబడిన సూర్యునివలె, భస్మము కప్పిన అగ్నివలె కానవచ్చెను.

తమా పతన్తం ప్రసమీక్ష్య పాణ్డవం
విరాటరా డిన్దుమివాభ్ర సంవృతమ్,
సమాగతం పూర్ణశశి ప్రభాననం
మహానుభావం నచిరేణ దృష్టవాన్ 4

మేఘములు కప్పిన చంద్రునివలె ఉన్నవాడు, నిండు చంద్రుని కాంతి వంటి కాంతి గల మోము గలవాడు, మహానుభావుడు అగు పాండుతనయుడు వచ్చుచుండగా విరాటుడు వెనువెంటనే చూచెను.

మంత్రి ద్విజాన్ సూతముఖాన్ విశస్తథా
యే చాపి కేచిత్ పరితః సమాసతే,
పప్రచ్ఛ కో౽యం ప్రథమం సమేయివాన్
నృపోపమో౽యం సమవేక్షతే సభామ్. 5

మంత్రులైన విప్రులను, సూతుడు మొదలగువారిని, వైశ్యులను, ఇంకను అచట కూర్చున్న సభ్యులను, 'ఈ వచ్చువాడెవరు? మహారాజువలె కానవచ్చుచున్నాడు' అని అడిగెను.

నతు ద్విజో౽యం భవితా నరోత్తమః
పతిః పృథివ్యా ఇతి మే మనోగతమ్,
న చాస్య దాసో న రథో న కుంజరః
సమీపతో భ్రాజతి చాయ మిన్ద్రవత్. 6

ఈ నరశ్రేష్ఠుడు బ్రాహ్మణుడై యుండడు. నామదికి మహారా జనిపించుచున్నాడు. ఈతనికి దాసుడు, రథము ఏనుగు లేకున్నను దగ్గరకు వచ్చిన దేవేంద్రుని వలె విరాజిల్లుచున్నాడు.

శరీరలింగై రుపసూచితో హ్యయం
మూర్ధాభిషిక్త ఇతి మే మనోగతమ్,
సమీప మాయాతి చ మే గతవ్యథో
యథా గజ స్తామరసీం మదోత్కటః. 7

ఈతని దేహచిహ్నములను చూడగా మూర్ధాభిషిక్తుడైన మహారాజు వలె నామదికి తోచుచున్నాడు. మదముచే బిరుసెక్కిన ఏనుగు తామరతీగను చేరినట్లుగా ఏ సంకోచములేక నాకడకు వచ్చుచున్నాడు,

వితర్కయన్తం తు నరర్షభ స్తథా
యుధిష్ఠిరోఽభ్యేత్య విరాట మ్రబవీత్,
సమ్రాడ్ విజానాత్విహ జీవనార్థినం
వినష్ట సర్వస్వ ముపాగతం ద్విజమ్. 8

విరాటుడిట్లు తలపోయుచుండగా నరశ్రేష్ఠుడగు ధర్మరాజు సమీపించి విరాటునితో ఇట్లనెను. 'ప్రభువులు నన్ను సర్వమును కోల్పోయి బ్రదుకు తెరువునకై వచ్చిన విప్రునిగా తెలియదగును'.

ఇహాహ మిచ్ఛామి తవానఘాన్తికే
వస్తుం యథా కామచర స్తథా విభో,
త మ్రబవీత్ స్వాగత మిత్యనన్తరం
రాజా ప్రహృష్టః ప్రతి సంగృహాణ చ. 9

7. శరీరలింగైః - పొడగరితనము మొదలగు వాని చేత :

'ఓ పుణ్యాత్ముడా! ఇచట నీకడ చిత్తమునకు వచ్చిన రీతిగా ఉండ గోరుదును.' అని పలుకగా రాజాతనికి స్వాగతము చెప్పి సంతోషముతో స్వీకరించి యిట్లు పలికెను.

తం రాజసింహం ప్రతిగృహ్య రాజా
ప్రీత్యాత్మనా చైన మిదం బభాషే,
కామేన తాతాభివదా మ్యహం త్వాం
కస్యాసి రాజ్ఞో విషయా దిహాగతః. 10

రాజు ప్రీతి గల మనస్సుతో ఆరాజసింహుని స్వీకరించి యిట్లు పలికెను. తండ్రీ! అనురాగముతో మీకు అభివాదనము చేయుచున్నాను, ఏ రాజు దేశమునుండి ఇక్కడకు వచ్చితివి ?

గోత్రం చ నామాపి చ శంస తత్త్వతః
కిం చాపి శిల్పం తవ విద్యతే కృతమ్. 11

నీ గోత్రము పేరు ఉన్నది ఉన్నట్లు చెప్పుము. నీకు ఏవిద్యలో నేర్పు గలదో తెలుపుము.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లు పలికెను.

యుధిష్ఠిర స్యాస మహం పురా సఖా
వైయాఘ్రపద్యః పునరస్మి విప్రః,
అక్షాన్ ప్రమోక్తుం కుశలోఽస్మి దేవితా
కఙ్కేతి నామ్నాస్మి విరాట విశ్రుతః. 12

---

12. యుధిష్ఠిరః, స్యాసం, సఖా - నీకు యుద్ధమున స్థిరముగా బాసటగా నుండు సఖుడనగు దునని యు నర్థము; వైయాఘ్ర పద్యః - వ్యాఘ్రము వలె ప్రాణులపై పడువాడు వ్యాఘ్రపాదుడు - యముడు - వైయాఘ్రపద్యుడనగా అతని కొడుకు; లేదా వైయాఘ్ర మనగా పులితోలు, అది తొడుగుగా గల రథము కూడ వైయాఘ్రమే. అట్టి రథము గలవాడు వైయాఘ్రపద్యుడు; విప్రః - బ్రాహ్మణాదుల కోరికలను విశేషముగా పూరించువాడని గూఢార్థము;

నేను మునుపు యుధిష్ఠిరుని చెలిమికాడను. వ్యాఘ్రపాద్గోత్రము వాడను. విప్రుడను. పాచికల నాడుటలో నేర్పుగలవాడను. జూదమాడుదును. ఓ విరాటరాజా! నన్ను కంకుడందురు.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

దదామి తే హన్త వరం యమిచ్ఛసి
ప్రశాధి మత్స్యాన్ వశగో హ్యహం తవ,
ప్రియాశ్చ ధూర్తా మమ దేవినః సదా
భవాంశ్చ దేవోపమ రాజ్య మర్హతి. 13

అయ్యా! నీవు కోరిన వరమిచ్చెదను. ఈ మత్స్యదేశ మేలుము. నేను నీవాడను. నాకు జూదమాడు వారన్నచో ఇష్టము దైవము వలెనున్న నీవు రాజ్యమున కర్హుడవు.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరాజిట్లు పలికెను :

ప్రాప్తో వివాదః ప్రథమం విశాంపతే
న విద్యతే కంచన మత్స్య హీనతః,
న మే జితః కశ్చన ధారయేద్ ధనం
వరో మమైషోఽస్తు తవ ప్రసాదజః. 14

ఓ రాజా! మత్స్యా! ద్యూతమున హీనుని వలనను గొప్ప వానికి వివాదము రాదనిలేదు. కావున నేను గెలిచినను ఓడినవాడు అప్పుపడినట్లు కాదు. నీ అనుగ్రహమువలన ఇదియే నాకు వర మగు గాక!

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

హన్యా మవధ్యం యది తేఽప్రియం చరేత్
ప్రవ్రాజయేయం విషయాద్ ద్విజాం స్తథా,
శృణ్వన్తు మే జానపదాః సమాగతాః
కఙ్కో యథాహం విషయే ప్రభు స్తథా. 15

14. ప్రథమమ్ - శ్రేష్ఠుని.

నీకెవరైన అప్రియము చేసినచో వారిని తప్పక చంపుదును. వారు బ్రాహ్మణులైనను దేశమునుండి వెడలగొట్టుదును. ఇట నున్న ఓ ప్రజలారా! వినుండు. ఈ రాజ్యమున నేనెట్లో కంకుడట్లే ప్రభువు.

సమానయానో భవితాసి మే సఖా
ప్రభూత వస్త్రో బహుపానభోజనః,
పశ్యే స్త్వ మన్తశ్చ బహిశ్చ సర్వదా
కృతం చ తే ద్వార మపావృతం మయా. 16

నీవు నా సఖుడవు. నావలె నీకు వాహనము, వస్త్రములు, పానీయములు, భోజనములు సమకూరును. నీవు నాయింటను, బయటను అరయుచుండుము. నీకు నాద్వారమెప్పుడు తెరచియే యుండును.

యే త్వానువాదేఽయు రనువృత్తి కర్శితా
బ్రూయాశ్చ తేషాం వచనేన మాం సదా,
దాస్యామి సర్వం తదహం న సంశయో
న తే భయం విద్యతి సన్నిధౌ మమ. 17

నీవు ప్రతిసంవత్సరము ఈయవలసిన వేతనమువంటి దానిని ఇచ్చుటకు వచ్చిన వారి పలుకును నాకెరిగింపుము. అది యంతయు నేనిత్తును. సంశయము లేదు. నాయొద్ద నీకే భయమును లేదు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు వలికెను.

[ఏవం తు రాజ్ఞః ప్రథమః సమాగమో
బభూవ మాత్స్యస్య యుధిష్ఠిరస్య చ,
విరాటరాజస్య హి తేన సంగమో
బభూవ విష్ణో రివ వజ్రపాణినా.

17. అనువాదే - ఏటికేటికింత వేతనమని నిర్ణయించు అధికారి మాట.
సదా - వేళకావేళలందును.

ఇట్లు ఆ విరాటునకును, ధర్మరాజునకును మొదటి సమాగమము జరిగెను. విరాటుని కాతనితోడి యీ సమాగమము విష్ణునికి ఇంద్రునితో జరిగిన సమాగమము వంటిదాయెను.

తమాసనస్థం ప్రియరూపదర్శనం
న్నిరీక్షమాణో న తతర్ప భూమిపః,
సభాం చ తాం ప్రజ్వలయన్ యుధిష్ఠిరః
శ్రియా యథా శక్ర ఇవ త్రివిష్టపమ్.

ఆసనమున ప్రియమైన రూపముతో కానవచ్చు ఆ ధర్మరాజును చూచుచున్న విరాటునకు తృప్తితీరలేదు. దేవేంద్రుడు ఐశ్వర్యముతో స్వర్గము నలరించునట్లు ధర్మరాజాసభను - అలరింప జేసెను ]

ఏవం స లబ్ధ్వా తు వరం సమాగమం
విరాటరాజేన నరర్షభ స్తథా ।
ఉవాస ధీరః పరమార్చితః సుఖీ
న చాపి కశ్చిత్ చరితం బుబోధ తత్. 18

ఇట్లు నరశ్రేష్ఠుడగు ధర్మజుడు విరాటరాజుతో మంచి మన్నన పొంది చక్కని పూజలు గొనుచు ధీరుడై సుఖముగా అందు నివసించెను. ఆతని యునికిని ఎవ్వడు తెలియ జాలకుండెను.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి పాణ్డవ ప్రవేశపర్వణి యుధిష్ఠిరప్రవేశో నామ
స ప్త మో౽ ధ్యా య ః

ఇది శ్రీ మహాభారత విరాటపర్వమున పాండవ ప్రవేశపర్వమున
యుధిష్ఠిర ప్రవేశమను ఏడవ అధ్యాయము.

---

18. వరం సమాగమమ్ - శ్రేష్ఠమైన ప్రీతిని,

## అష్టమోఽధ్యాయః - ఎనిమిదవ అధ్యాయము

భీమసేనస్య విరాటసభాయాం ప్రవేశో రాజకర్తృకం తస్యాశ్వాసనం చ.

భీమసేనుడు విరాటసభలో ప్రవేశించుట, రాజు అతనిని మన్నించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

అథాపరో భీమబలః శ్రియా జ్వల
న్నుపాయయా సింహ విలాస విక్రమః,
ఖజాంచ దర్వీంచ కరేణ ధారయ
న్నసిం చ కాలాఙ్గ మకోశ మవ్రణమ్. 1

పిమ్మట భయంకరమైన బలముగలవాడు, తేజస్సుతో వెలుగొందుచున్నవాడు సింహమువలె విలాసమైన విక్రమము గలవాడు అగు ఒక వ్యక్తి తెడ్డును గరిటను, మొక్కవోనిది అగు ఉక్కుకత్తిని చేత బట్టి చేరవచ్చెను.

స సూదరూపః పరమేణ వర్చసా
రవి ర్యథా లోక మిమం ప్రకాశయన్,
సకృష్ణవాసా గిరిరాజ సారవాం
స్తం మత్స్య రాజం సముపేత్య తస్థివాన్. 2

వంటలవాని వేషము గల ఆతడు గొప్పకాంతితో సూర్యునివలె లోకమును వెలుగొంద జేయుచు, నల్లని వస్త్రములు ధరించి పెద్దకొండ వంటి బలముతో విరాట రాజును సమీపించి నిలిచెను.

తం ప్రేక్ష్య రాజా వరయ న్నుపాగతం
తతోఽబ్రవీజ్జాన పదాన్ సమాగతాన్,

2. గిరిరాజ సారవాన్ - లోహ పాత్రసముదాయము కలవాడనియు నర్థము.

సింహోన్నతాంసోఽయ మతీవ రూపవాన్
ప్రదృశ్యతే కోను నరర్షభో యువా. 3

అట్లు వచ్చి నిలిచిన యాతనిని చూచి ఆనందపడుచు రాజు అచట నున్న జనులతో 'సింహమువలె ఎగు బుజములు గలిగి మిక్కిలి అందగాడై నరులలో శ్రేష్ఠుడై కానవచ్చు ఈ యువకు డెవరో ?' అని పలికెను.

అదృష్టపూర్వః పురుషో రవిర్యథా
వితర్కయన్ నాస్య లభామి నిశ్చయమ్
తథాస్య చిత్తం హ్యాపి సంవితర్కయన్
నరర్షభస్యాస్య జయామి తత్త్వతః. 4

మున్నితనిని చూచి యుండలేదు. సూర్యునివలె నున్నాడు. ఎంత ఆలోచించినను నిశ్చయము కలుగుటలేదు. ఎంత ఊహించినను ఈతని హృదయమేమో పట్టుపడకున్నది.

దృష్ట్వైవ చైనం తు విచారయామ్యహం
గన్ధర్వరాజో యది వా పురన్దరః,
జానీత కోఽయం మమ దర్శనే స్థితో
యదీప్సితం తల్లభతాం చ మా చిరమ్. 5

ఈతని చూచినంతనే గంధర్వరాజో దేవేంద్రుడో అను భావము కలుగుచున్నది. నా యెదుట నిలిచిన యీతడెవ్వరో కను గొనుడు. ఆతనికోరిక యేమో వెంటనే తీర్చెదు.

విరాటవాక్యేన చ తేన చోదితా
నరా విరాటస్య సుశీఘ్రగామినః
ఉపేత్య కౌన్తేయ మథా బ్రువం స్తదా
యథా సరాజా వదతాచ్యుతానుజమ్. 6

---

6. అచ్యుతానుజమ్ - ఇట అచ్యుతుడనగా ఫలమునొసగక మానని వాడను నర్థమున ధర్మరాజు, అతని తమ్ముడు.

విరాటుని ఆ పలుకుల ప్రేరణతో వేగరులగు రాజభటులు భీమసేనుని సమీపించి విరాటుని మాటను ధర్మని సోదరుడగు భీమునకు చెప్పిరి.

తతో విరాటం సముపేత్య పాణ్డవ
స్త్వదీన రూపం వచనం మహామనాః,
ఉవాచ సూదోఽస్మి నరేన్ద్ర వల్లవో
భజస్వ మాం వ్యంజన కారముత్తమమ్. 7

అంత పాండునేనయుడు విరాటుని చేర వచ్చి గంభీరమైన పలుకులతో రాజా! నేను వంటల వాడను. పేరు వల్లవుడు. పేరొందిన వంటలవాడను. నన్ను చేకొనుము ! అని పలికెను.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

న సూదతాం వల్లవ శ్రద్దధామి తే
సహస్రనేత్ర ప్రతిమో విరాజసే,
శ్రియా చ రూపేణ చ విక్రమేణ చ
ప్రభాససే త్వం నృవరో నరేష్విహ. 8

ఓయీ! నీవు వంటల వాడవని నేను నమ్మను. కాంతి, రూపము, పరాక్రమము అను వానిని చూడగా నీవు వేయి కన్నుల దేవర వలె విరాజిల్లుచున్నావు. నరులయందు ప్రభువు వలె పలుకుచున్నావు.

భీమ ఉవాచ - భీముడిట్లు పలికెను.

నరేన్ద్ర సూదః పరిచారకోఽస్మి తే
జానామి సూపాన్ ప్రథమం చ కేవలాన్
ఆస్వాదితా యే నృపతే పురాభవన్
యుధిష్ఠిరేణాపి నృపేణ సర్వశః. 9

రాజా ? నేను వంటలవాడను. నీ సేవకుడను. నాకు వంటలు చేయుట మాత్రమే తెలియును. మునుపు నావంటకములను మహారాజు యుధిష్ఠిరుడు కూడ రుచిచూచెను.

బలేన తుల్యశ్చ న విద్యతే మయా
నియుద్ధశీల శ్చ సదైవ పార్థివ,
గజైశ్చ సింహైశ్చ సమేయివా నహం
సదా కరిష్యామి తవానఘ ప్రియమ్. 10

బలమున నాకు సరి వచ్చువాడు లేడు. ఓ రాజా। ఎప్పుడు మల్లయుద్ధము కూడ చేయుచుందును. ఓ పుణ్యాత్ముడా ఏనుగులతో, సింహములతో పట్టుపట్టి నీకు వినోదము చేయుదును.

విరాట ఉవాచ - విరాటుడిట్లు పలికెను.

దదామి తే హన్త వరాన్ మహానసే
తథా చ కుర్యాః కుశలం ప్రభాషసే,
న చైవ మన్యే తవ కర్మ యత్ సమం
సముద్రనేమీం పృథివీం త్వమర్హసి. 11

లెస్స ! నీకు పాకశాలలో మంచి పని వారల నిత్తును. అట్లే చేయుము. నేర్పుగా పలుకుచున్నావు. నీకిది తగినపనికాదని నాతలపు సముద్రము ఎల్లలుగాగల భూమి నేలుటకు యోగ్యుడవు.

యథా హి కామో భవత స్తథాకృతం
మహానసే త్వం భవ మే పురస్కృతః,
నరాశ్చ యే తత్ర సమాహితాః పురా
భవాంశ్చ తేషా మధిపో మయా కృతః. 12

నీ కోరిక మేరకే కానిమ్ము. నా వంటశాలలో నీవు మొదటివాడవు. అందు ముదున్న వారందరికి నిన్ను నాయకునిగా చేసితిని.

11. కుశలం ప్రభాషసే - మానవులు చేయలేని పనులను పలుకుచున్నావు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

తథా స భీమో విహితో మహానసే
విరాటరాజ్ఞో దయితోఽభవద్ దృఢమ్.
ఉవాస రాజ్యే న స తం పృథగ్జనో
బుబోధ తత్రానుచరాశ్చ కేచన. 13

ఇట్లా భీముడు వంటశాల యందు నియుక్తుడై విరాట రాజునకు మిక్కిలి ప్రియుడయ్యెను. ఆ రాజ్యమున ఇతర జనులును, రాజసేవకులును ఆతనిని గుర్తింపకుండిరి.

ఇతి శ్రీ మహాభారతే విరాట పర్వణి
పాణ్డవప్రవేశ పర్వణి భీమప్రవేశే
అష్టమోఽధ్యాయః
ఇది శ్రీ మహాభారత విరాటపర్వమున
పాండవప్రవేశ పర్వమున భీముడు ప్రవేశించుట యను
ఎనిమిదవ అధ్యాయము

## నవమోఽధ్యాయః - తొమ్మిదవ అధ్యాయము.

సైరంధ్రీ రూపాయా ద్రౌపద్యా విరాట స్యాన్తః పురం
గత్వా సుదేష్ణయా సహ సంలాప స్తత్ర నివాసశ్చ.

సైరంధ్రీ రూపముతో ద్రౌపది విరాటుని అంతఃపురమున కరిగి సుదేష్ణతో ప్రసంగించుట, అందుండుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః కేశాన్ సముత్క్షిప్య వేల్లితాగ్రా ననిన్దితాన్,
కృష్ణాన్ సూక్ష్మాన్ మృదూన్ దీర్ఘాన్ సముద్గ్రథ్య శుచిస్మితా,
జుగూహే దక్షిణే పార్శ్వే మృదూ నసితలోచనా. 1

చిక్కువడిన, చక్కని, మెత్తని, సన్నని నల్లని పొడవైన కేశములను పైకెత్తి ముడిపెట్టి నిర్మలమైన చిరునవ్వుతో నల్లని కన్నుల ద్రౌపది కుడివైపున మాలచియుంచెను.

వాసశ్చ పరిధాయైకం కృష్ణా సుమలినం మహత్,
కృత్వా వేషం చ సైరంధ్ర్యా స్తతో వ్యచర దార్తవత్. 2

బాగుగా మాసిన ఒంటి వస్త్రమును ధరించి సైరంధ్రి వేషముతో ద్రౌపది ఏదో కష్టములో నున్నదానివలె తిరుగు చుండెను.

తాం నరాః పరిధావన్తీం స్త్రియశ్చ సముపాద్రవన్,
అపృచ్ఛం శ్చైవ తాం దృష్ట్వా కా త్వం కించ చికీర్షసి. 3

అట్లు తిరుగుచున్న ఆమెను గాంచి పురుషులు స్త్రీలు వెంట బడిరి. 'నీ వెవరవు ? ఏమి చేయగోరితివి' అని అడుగుచుండిరి.

సా తానువాచ రాజేన్ద్ర సైరంధ్ర్యహ మిహాగతా,
కర్మ చేచ్ఛామి వై కర్తుం తస్య యో మాం యుయుక్షతి. 4

ఆమె వారితో 'బాబూ! నేను సైరంధ్రిని. ఇటకు వచ్చితిని. నాకు పని యిచ్చు తలపున్న వానికి పని చేయుదును.' అని పలికెను.

తస్యా రూపేణ వేషేణ శ్లక్ష్ణయా చ తథా గిరా,
న శ్రద్దధత తాం దాసీ మన్నహేతో రుపస్థితామ్. 5

ఆమె రూపము, వేషము, తీరైన మాట అను వానిని బట్టి కూటికై వచ్చిన దాసిగా ఆమెను సంభావింప జాలరైరి.

విరాటస్య తు కైకేయీ భార్యా పరమసమ్మతా,
ఆలోకయన్తీ దదృశే ప్రాసాదాద్ ద్రుపదాత్మజామ్. 6

విరాటుని భార్య కేకయరాజపుత్రి, మిక్కిలి యోగ్యురాలు మేడపై నుండి అటునిటు చూచుచు ద్రౌపదిని పరికించెను.

సా సమీక్ష్య తథారూపా మనాథా మేక వాససమ్,
సమాహూయాబ్రవీద్ భద్రే కా త్వం కించ చికీర్షసి. 7

4. యుయుక్షతి - పనికి పెట్టుకొన గోరు వాడు;

అట్టి రూపవతిని, దిక్కులేని దానిని, ఒంటి వస్త్రముతో నున్న దానిని చూచి ఆమె పిలిచి 'అమ్మా నీవెవ్వరవు ? ఏమి పని చేయ గోరుచున్నావు' అని అడిగెను.

సా తా మువాచ రాజేన్ద్రి సైరంధ్ర్యహ ముపాగతా,
కర్మ చేచ్ఛా మ్యహం కర్తుం తస్య యోమాం యుయుక్షతి. 8

ఓ రాజేంద్రా ! ఆమె ఆమెతో ఇట్లనెను. అమ్మా ! నేను సైరంధ్రిగా వచ్చితిని. నన్ను పనిలో పెట్టుకొనదలచువారికి పని చేయుదును.

సుదేష్ణోవాచ - సుదేష్ణ యిట్లు పలికెను.

నైవం రూపా భవన్త్యేవ యథా వదసి భామిని,
ప్రేషయ న్తీవ వై దాసీ ర్దాసాంశ్చ వివిధాన్ బహూన్. 9

ఓ భామిని ! నీవంటివారు నీవు చెప్పుచున్నట్లు సైరంధ్రులు కాజాలరు. నిన్ను చూడగా పెద్దసంఖ్యలో పెక్కు విధముల దాస దాసీ జనమును నియోగించు దానవుగా కనుపట్టుచున్నావు.

నోచ్ఛగుల్ఫా సంహతోరు స్త్రి గంభీరా షడున్నతా,
రిక్తా పఞ్చసు ర క్తేషు హంసగద్గద భాషిణీ. 10

నీ మడమలు ఎత్తుగా లేవు. శబ్దము, బుద్ధి, నాభి అను మూడింట లోతు గలదు. ముక్కు, కనులు, చెవులు, గోళ్ళు, స్తనములు, పెడతల అను ఆరు ఉన్నతములై యున్నవి కాలు చేతుల తలములు కంటికొనలు, పెదవులు, నాలుక, గోళ్ళు అను నైదు భాగములు ఎరుపుగా నున్నవి. హంసవలె మధురమైన నాదము గలదానవు.

సుకేశీ సుస్తనీ శ్యామా పీన శ్రోణి పయోధరా,
తేన తేనైవ సంపన్నా కాశ్మీరీవ తురంగమీ. 11

చక్కని కురులు, వ్రతువగుబ్బలు. పీలి వన్నె, బలిసిన సనములు, పిరుదులు కలిగి ఎక్కడికక్క డ నిండుతనముతో కాశ్మీర దేశపు గుఱ్ఱము వలె నున్నావు.

అరాలపక్ష్మనయనా బింబోష్ఠీ తనుమధ్యమా,
కమ్బుగ్రీవా గూఢశిరా పూర్ణచన్ద్రనిభాననా. 12

వంపులు తిరిగిన నల్లని రెప్పలుగల కనులు, దొండపండు వంటి క్రింది పెదవి, సన్నని నడుము, శంఖము వంటి మెడ, వెలికి కనపడని నాడులు గలిగి యున్నావు.

శారదోత్పల పత్త్రాక్ష్యా శారదోత్పలగన్ధయా,
శారదోత్పల సేవిన్యా రూపేణ సదృశీ శ్రియా. 13

శరత్కాలపు కలువల రేకులవంటి కన్నులతో, అట్టి కలువల గంధము వంటి సువాసనతో, శరత్కాలపు కలువ తోటలో తిరుగాడు లక్ష్మికి రూపమున సాటి వచ్చుచున్నావు.

కాత్వం బ్రూహి యథా భద్రే నాసి దాసీ కథంచన,
యక్షీ వా యది వాదేవీ గన్ధర్వీ యది వాప్సరాః. 14

ఇట్టి నీవు నిజముగా నెవ్వరవో చెప్పుము. నీవెన్నటికిని దాసివి కావు. యక్షకాంతవా? దేవతరుణివా? గంధర్వభామినివా? అచ్చరవా?

దేవకన్యా భుజఙ్గీ వా నగర స్యాథ దేవతా,
విద్యాధరీ కిన్నరీవా యది వా రోహిణీ స్వయమ్. 15

దేవకన్యవా? నాగకన్యవా? లేక ఈనగరమును పాలించు దేవతవా? విద్యాధర వనితవా? కిన్నర జాతిస్త్రీవా? లేక సాక్షాత్తు రోహిణివా?

అలంబుసా మిశ్రకేశీ పుణ్డరీకాథ మాలినీ,
ఇన్ద్రాణీ వారుణీ వా త్వం త్వష్టు ర్ధాతుః ప్రజాపతేః,
దేవ్యో దేవేషు విఖ్యాతా స్తాసాం త్వం కతమా శుభే. 16

నీవు అలంబుస, మిశ్రకేశి, పుండరీక, మాలిని అను దేవ కాంతలలో ఒకతెవా ! శచీదేవివా ! వరుణుని భార్యవా ? విశ్వకర్మ, ధాత ప్రజాపతి అను వారి దేవులు పేరొందిన వారు కలరు, వారిలలో నీవొకతెవా ?

ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లు పలికెను.

నాస్మిదేవీ న గన్ధర్వీ నాసురీ న చ రాక్షసీ.
సైరంధ్రీతు భుజిష్యాస్మి సత్యమేతద్ బ్రవీమి తే. 17

నేను దేవకాంతను కాను. గంధర్విని కాను, అసుర వనితను కాను, రాక్షసవనితను కాను. నేను పనికై వచ్చిన సైరంధ్రిని ఇది నిజముగా చెప్పుచున్నాను.

కేశాన్ జానా మ్యహం కర్తుం పింషే సాధు విలేపనమ్.

చక్కగా జడ లల్లుదును. గంధములు తీయుదును.

మల్లికోత్పల పద్మానాం చంపకానాం తథా శుభే
గ్రథయిష్యే విచిత్రాశ్చ స్రజః పరమ శోభనాః. 18

మల్లెలు, కలువలు, పద్మములు, సంపెంగలు మున్నగు వానితో విచిత్రములు మిక్కిలి సొంపైనవి యగు మాలల నల్లగలను.

ఆరాధయం సత్యభామాం కృష్ణస్య మహిషీం ప్రియామ్.
కృష్ణాంచ భార్యాం పాణ్డూనాం కురూణా మేక సున్దరీమ్. 19

నేను మున్ను శ్రీకృష్ణుని పట్టపురాణి ప్రియురాలు అగు సత్యభామను కొలిచి యుంటిని. అట్లే పాండవులందరకు ఒక్కతెగా భార్య అయిన ద్రౌపదిని కూడ సేవించితిని.

తత్ర తత్ర చరామ్యేవం లభమానా సుభోజనమ్. 20

మంచి భోజనము లభించిన చోట ఇట్లే వృత్తిచేసి కొనుచున్నాను.

---

19. సత్యభామను సేవించితిననుట చట్టరికము వలనను, పాండవుల భార్యను సేవించితిననుట తన్నుతానుగా సేవించుకొనుట సంభవించునదే కావునను ఇది అబద్ధపుమాట కాదు.

వాసాంసి యావన్తి లభే తావత్తావద్ రమే తథా,
మాలినీత్యేవ మే నామ స్వయం దేవీ చకార సా,
సాహ మద్యాగతా దేవి సుదేష్ణే త్వన్నివేశనమ్. 21

కూడుగుడ్డ లిచ్చిన చాలు. ప్రీతి పొందుదును. నాకు మాలిని యను పేరు ఆయమ్మయే పెట్టినది. ఓసుదేష్ణా! ఆ నేను ఇప్పుడు నీ యింటికి వచ్చితిని.

సుదేష్ణోవాచ - సుదేష్ణ యిట్లు పలికెను.

మూర్ధ్ని త్వాం వాసయేయం వై సంశయో మే న విద్యతే,
న చేదిచ్ఛతి రాజా త్వాం గచ్ఛేత్ సర్వేణ చేతసా. 22

రాజు నిన్ను కోరకున్నచో నిన్ను తలపై పెట్టుకొని యుండెడి దానను. సంశయమే లేదు. కాని రాజు మనసంత నీ మీద పెట్టి నిన్ను వాంఛించును.

స్త్రియో రాజకులే యాశ్చ యాశ్చేమా మమ వేశ్మని,
ప్రసక్తాస్త్వాం నిరీక్షన్తే పుమాంసం కం న మోహయేః. 23

రాజగృహమునందును నాయింటనుగల స్త్రీలుకూడ నిన్ను విరుగబడి చూచుచున్నారు. నిన్నుచూచి మోహింపని మగవా డుండునా?

వృక్షాం శ్చావస్థితాన్ పశ్య య ఇమే మమ వేశ్మని,
తేఽపి త్వాం సంనమ న్తీవ పురుషం కం న మోహయేః. 24

ఈ నా భవనమున నున్న చెట్లుకూడ నీవైపు వ్రాలుచున్న ట్లున్నవి. అట్టి నీవు ఏపురుషుని మోహపెట్టకుందువు?

రాజా విరాటః సుశ్రోణి దృష్ట్వా వపు రమానుషమ్,
విహాయ మాం వరారోహే గచ్ఛేత్ సర్వేణ చేతసా. 25

21. మాలిని యను పేరు తానే పెట్టుకొనుటచే ఇదియు అసత్యకథనము కాజాలదు.

ఓ సుశ్రోణీ! వరారోహా! మా రాజు విరాటుడు మనుజులలో ఎందునులేని నీ పరమ సుకుమారతనువును చూచి నన్నువదలి మనసంతయు నీమీదనే యుంచును.

యం హి త్వమనవద్యాఙ్గి తరళాయత లోచనే,
ప్రసక్త మభివీక్షేథాః స కామవశగో భవేత్. 26

ఎందును దోషములేని అవయవములు, చంచలములు విశాలములు నైన కన్నులుగల ఓ భామా! నీ వెవనినైన తగిలి చూచితివా! వాడు తప్పక కాముపకు వశుడగును.

యశ్చ త్వాం సతతం పశ్యేత్ పురుష శ్చారుహాసిని,
ఏవం సర్వాన వద్యాఙ్గి స చానఙ్గవశో భవేత్. 27

ఓ చక్కని నవ్వులుగలదానా! నిన్నెవ్వడైన మగవాడు నిలిచిచూచెనో ఇదిగో ఈ స్త్రీలవలె చెట్టులవలెవాడు రాపడి మన్మథునకు వశుడగును.

అథ్యారోహేద్ యథావృక్షాన్ వశ్మాయైవాత్మనో నరః,
రాజవేశ్మని తే సుభ్రు గృహేతు స్యాత్ తథా మమ. 28

ఎవడైన నరుడు తనచావునకే రాజభవనమున చెట్లెక్కును. నిన్ను నాయింట నుంచుకొనుట అట్టిదే.

యథా చ కర్కటీ గర్భమాధత్తే మృత్యు మాత్మనః,
తథావిధ మహం మన్యే వాసం తవ శుచిస్మితే. 29

ఎండ్రకాయ తనకు చావైన చూలు ధరించునట్లు నీవు నాయింట నుండుట నాకట్టిదే యగును.

ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లు పలికెను.

నాస్మి లభ్యా విరాటేన న చాన్యేన కదాచన,
గన్ధర్వాః పతయో మహ్యం యువానః పఞ్చభామిని. 30

---

30. గన్ధర్వాః - పాండవులు దేవతాంశలతో పుట్టినవారు కనుక కేవలము మానవ సామాన్యులుకారను నర్థమున నిది సత్యోక్తి.

అమ్మా! విరాటుడు కాని మరొకడుగాని నాజోలికి రాలేదు. నాకు యువకులైన భర్తలు గంధర్వులైదుగురు కలరు.

పుత్రా గంధర్వ రాజస్య మహాసత్త్వస్య కస్యచిత్,
రక్షన్తి తే చ మాం నిత్యం దుఃఖాచారా తథాప్యహమ్. 31

వారొకానొక మహాబలవంతుడగు గంధర్వరాజు కుమారులు. నన్ను నిత్యము వారు రక్షింతురు. నేను తీవ్రవ్రతములతో కష్టమైన ఆచారము కలదానను. నేను ఆడుసింగమువంటి దానను. నాతో వ్యవహారము ప్రాణాంతకము.

యో మే న దద్యా దుచ్ఛిష్టం న చ పాదౌ ప్రధావయేత్,
ప్రీణేరం స్తేన వాసేన గన్ధర్వాః పతయో మమ. 32

నా కెంగిలికూడు పెట్టక, పాదములొత్తు మనక ఉండెడివారికడ నేనుండుటకు గంధర్వులైన నా భర్తలు ఒప్పుకొందురు.

యో హి మాం పురుషో గృధ్యేద్ యథాన్యాః ప్రాకృతాః స్త్రియః
తామేవ నివసేద్ రాత్రిం ప్రవిశ్య చ పరాం తనుమ్. 33

ఎవడైన సామాన్య స్త్రీలనువలె నన్ను కోరెనో వాడారాత్రికి రాత్రి మరొకదేహమును ప్రవేశించును.

న చాప్యహం చాలయితుం శక్యా కేనచి దఙ్గనే,
దుఃఖశీలా హి గన్ధర్వా స్తే చ మే బలినః ప్రియాః. 34

ప్రచ్ఛన్నాశ్చాపి రక్షన్తి తే మాం నిత్యం శుచిస్మితే.

---

31. గన్ధర్వరాజస్య - గంధర్వునివంటి రాజైన పాండురాజుయొక్క; దుఃఖాచారా- 'దుఃఖా, చ, అరా' అని పదవిభాగము - దుఃఖ - దుఃఖమును కలిగించునది ఆరా . ఆడు సింహమువంటిది. అపచారము చేయువానికి ఆపద కలిగించున దనియు, ఆడు సింహమువలె ఇతరులకు చేరశక్యముకానిదనియు భావము.

33. పరాం తనుం ప్రవిశ్య . చచ్చి.

ఓ కాంతా ! నన్నెవ్వరు కదిలింపజాలరు. నా భర్తలును నావలెనే దుఃఖములో ఉన్నారు. చాల బలవంతులు, నాకు మిక్కిలి ప్రియులు. వారెవ్వరికి కానరాక ఎల్లప్పుడు నన్ను రక్షించు చుందురు.

సుదేష్ణోవాచ - సుదేష్ణ యిట్లనెను.

ఏవం త్వాం వాసయిష్యామి యథా త్వం నన్దినీచ్ఛసి, 35
న చ పాదౌ నచోచ్ఛిష్టం స్ప్రక్ష్యసి త్వం కథంచన.

ఓబిడ్డా ! అట్లయినచో నీ యిష్టప్రకారము నిన్ను ఇచట ఉండనిత్తును. కాళ్ళు, ఎంగిలి నీవెన్నటికిని ముట్టనక్కరలేదు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం కృష్ణా విరాటస్య భార్యయా పరిసాన్త్వితా. 36
ఉవాస నగరే తస్మిన్ పతిధర్మవతీ సతీ,
న చైనాం వేద తత్రాన్యా స్తత్త్వేన జనమేజయ. 37

ఓ జనమేజయా ! ఇట్లు ద్రౌపది విరాటునిభార్య అనునయములో పలుకగా ధర్మమును రక్షించుకొనుచు ఆనగరమున నివసించెను. ఆమె నిజమున కెవ్వరో యెవగును ఎఱుగజాలరైరి.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి పాణ్డవప్రవేశ పర్వణి ద్రౌపదీప్రవేశే
నవమోఽధ్యాయః

ఇది శ్రీమహాభారత విరాటపర్వమున పాండవప్రవేశపర్వమున
ద్రౌపది ప్రవేశించుట యను తొమ్మిదవ అధ్యాయము

---

35. నన్దిని - సంతోషపెట్టుదానా !

## దశమోఽధ్యాయః - పదవ అధ్యాయము

సహదేవస్య విరాటేన సహ వార్తాలాపో గవా మవేక్షణాయ తస్య నియుక్తిశ్చ.

సహదేవుడు విరాటునితో ప్రసంగించుట, గోపాలనలో అతడు నియుక్తుడగుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

సహదేవోఽపి గోపానాం కృత్వా వేష మనుత్తమమ్,
భాషాం చైషాం సమాస్థాయ విరాట ముపయాదథ. 1

సహదేవుడును చక్కని గోపాలుని వేషముకట్టి గొల్లలవలె మాటాడుచు విరాటునికడ కేతెంచెను.

గోవ్ర మాసాద్య తిష్ఠన్తం భవనస్య సమీపతః,
రాజాథ దృష్ట్వా పురుషాన్ ప్రాహిణోజ్జాతవిస్మయః. 2

రాజభవనము సమీపమున గోశాలనుచేరి నిలిచిన అతనిని చూచి అచ్చెరువొంది రాజు అతనికడకు భటుల నంపెను.

తమాయాన్త మాభిప్రేక్ష్య భ్రాజమానం నరర్షభమ్,
సముపాస్థాయ వై రాజా పప్రచ్ఛ కురునన్దనమ్. 3

మంచి తేజస్సుతో వెలుగొందుచు వచ్చుచున్న ఆ నరశ్రేష్ఠుని గాంచి సమీపించి రాజు ఆ కురునందనునితో ఇట్లు పలికెను.

కస్య వా త్వం కుతో వా త్వం కిం వా త్వం తు చికీర్షసి,
న హి మే దృష్టపూర్వ స్త్వం తత్త్వం బ్రూహి నరర్షభ. 4

ఓ మనుజవరేణ్యా ! నీవెవ్వరివాడవు ? ఎటనుండి వచ్చితివి ? ఏమి చేయగోరుచున్నావు. నిన్ను మునుపుచూచి యుండలేదు. నిజము పలుకుము

సంప్రాప్య రాజాన మమిత్ర తాపనం
తతోఽబ్రవీన్మేఘ మహౌఘ నిస్స్వనః
వైశ్యోఽస్మి నామ్నాహ మరిష్టనేమి
ర్గో సంఖ్య ఆసం కురుపుఙ్గవానామ్. 5

శత్రువులను కాల్చివేయువాడగు రాజును దరిచేరి ఉరుము వంటి కంఠనాదముతో సహదేవు డిట్లు పలికెను. అయ్యా ! నేను వైశ్యుడను. అరిష్టనేమి అనుపేరివాడను. కురుశ్రేష్ఠుల గోశాలలో ఉంటిని.

వస్తుం త్వయీచ్ఛామి విశాం వరిష్ఠ
తాన్ రాజసింహాన నహీ వేద్మి పార్థాన్,
న శక్యతే జీవితు మన్యకర్మణా
న చ త్వదన్యో మమ రోచతే నృపః. 6

ఓ మహానుభావా ! నీయొద్ద నిలుచు కోరికకలదు. రాజ సింహ్యులైన ఆ కుంతీతనయు లెందు బోయిరో తెలియదు. పని యేమియు లేక బ్రదుకుట కష్టము. నీవు కాక మరియొక రాజన్న నాకు సరిపడదు.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

త్వం బ్రాహ్మణో యది వా క్షత్రియోఽసి
సముద్ర నేమీశ్వర రూపవానసి,
ఆచక్ష్వ మే తత్త్వ మమిత్ర కర్శన
న వైశ్యకర్మ త్వయి విద్యతే క్షమమ్. 7

5. వైశ్యః - వేశమనగా మరియొకరూపమును ప్రకటించుట. అది కలవాడు వైశ్యుడు, అరిష్టనేమిః - అడ్డులేని చక్రము కలవాడు. గోసంఖ్యః - గో అనగా ఇంద్రియము - ఇంద్రియముల సంఖ్య అయిదు. కావునపాండవులలో అయిదవ వాడను అని యిట్టివి గూఢార్థములు.

6. తాన్ - రాజసింహాన్, నహీ వేద్మి పార్థాన్ - ఆ కుంతీతనయులు రాజ సింహులుగా, ప్రస్తుతము లేరనుట యెరుగుదునని సత్యార్థము.

నీవు బ్రాహ్మణుడవో క్షత్రియుడవో అయి ఉందువు. చక్రవర్తివంటి రూపముతో కానవచ్చుచున్నావు కావున ఓ వీరుడా! నీ వెవ్వడవో నిజముగా చెప్పుము. నీయందు వైశ్యకర్మ యోగ్యముగా కానరాదు.

కస్యాసి రాజ్ఞో విషయాదిహాగతః
కిం వాపి శిల్పం తవ విద్యతే కృతమ్,
కథం త్వ మస్మాసు నివత్స్యసే సదా
వదస్వ కిం చాపి తవేహ వేతనమ్. 8

ఏ రాజు దేశమునుండి యిటకు వచ్చితివి? ఏ విద్యలో నేర్పు పొందితివి? మాయొద్ద ఎప్పుడునుందువా? నీవు కోరు వేతనమెయ్యది?

సహదేవ ఉవాచ - సహదేవు డిట్లు పలికెను.

పఞ్చానాం పాణ్డుపుత్రాణాం జ్యేష్ఠో భ్రాతా యుధిష్ఠిరః
తస్యాష్ట శతసాహస్రా గవాం వర్గాః శతం శతమ్. 9

పాండుపుత్రు లైదుగురిలో పెద్దవాడుండెనే ధర్మరాజు, ఆయనకు వందవంద చొప్పున ఉన్న ఆలమందలు నూటయెనిమిది వేలు కలవు.

అపరే శతసాహస్రా ద్విస్తావన్త స్తథాపరే,
తేషాం గోసంఖ్య ఆసం వై తన్తిపాలేతి మాం విదుః. 10

మరియొక నూరువేల మందలు, మరియును అంతకు రెండు రెట్లుగల మందలును ఆయనకు గలవు. నేను ఆ గోవులనరయుచుండెడి వాడను. నన్ను తంతిపాలుడందురు.

భూతం భవ్యం భవిష్యచ్చ యచ్చ సంఖ్యాగతం గవామ్,
న మేఽ స్త్యవిదితం కించిత్ సమన్తాద్ దశయోజనమ్. 11

---

10. గోసంఖ్యః - గోవులను పాలించువాడు, తన్తిపాలః - చెప్పినమాటను చేయువాడు.

గోవులపరీక్షలో నాకు తెలియని దేమియు ముందు, ఇప్పుడు లేదు. ఇటుపై ఉండదు. పది యోజనముల మేరలో నా అంత వాడు లేడు.

గుణాః సువిదితా హ్యాసన్ మమ తస్య మహాత్మనః,
అసకృత్ స మయా తుష్టః కురురాజో యుధిష్ఠిరః. 12

ఆమహాత్ముడు ధర్మరాజునకు నాగుణములు బాగుగా తెలియును. ఆ కురురాజు నావలన పలుమారులు తుష్టి నొందెను.

క్షిప్రం చ గావో బహులా భవన్తి
న తాసు రోగో భవతీహ కశ్చన,
తైస్తైరుపాయై ర్విదితం మమైత
దేతాని శిల్పాని మయి స్థితాని. 13

నేనంసినచో గోవులు త్వరగా ఎక్కువ దూడలను పెట్టును. వానియందేరోగమును కలుగదు. ఆయా యుపాయముల నన్నింటిని నేనెరుగుదును ఇది నాయందున్న పనితనము.

ఋషభాంశ్చాపి జానామి రాజన్ పూజితలక్షణాన్,
యేషాం మూత్ర ముపాఘ్రాయ అపి వన్ధ్యా ప్రసూయతే. 14

ఓ రాజా! శ్రేష్ఠమగు ఎద్దులనుగూర్చియు నాకు తెలియును. అట్టివాని మూత్రమును మూర్కొని గొడ్డుటావుకూడ బిడ్డను పెట్టును.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

శతం సహస్రాణి సమాహితాని
సవర్ణవర్ణస్య విమిశ్రితాన్ గుణైః,
పశూన్ సపాలాన్ భవతే దదామ్యహం
త్వదాశ్రయా మే పశవో భవన్త్విహ. 15

ఒకే రంగుగలవి, రంగుల కలయిక కలవి వేరువేరు గుణములు గలవి అగు గోవులు నాకు నూరువేలు కలవు. వాని నన్నింటిని గోపాలురతో పాటు నీకిత్తును. ఇచట నా పశువులు నీవశమున నుండు గాక !

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తథా స రాజ్ఞోఽవిదితో విశాంపతే
రువాస తత్రైవ సుఖం నరోత్తమః,
న చైవ మన్యేఽపి విదుః కథంచన
ప్రాదాచ్చ తస్మై భరణం యథేప్సితమ్. 16

అట్లు ఆ నరోత్తముడు రాజున కెరుకపడక సుఖముగా నందు నివసించెను. ఇతరులును వానిని గుర్తింపరైరి. రాజాతనికి కోరిన భరణమిచ్చెను.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి పాణ్డవప్రవేశపర్వణి సహదేవప్రవేశే దశమోఽధ్యాయః

ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున పాండవప్రవేశపర్వమున సహదేవుని ప్రవేశమను పదియవ అధ్యాయము.

## ఏకాదశోఽధ్యాయః — పదునొకటవ అధ్యాయము

అర్జునస్య విరాటసభాం గత్వా తేన సహాలాపః,
కన్యా నృత్యకలాం శిక్షయితుం తస్య నియుక్తిశ్చ.

అర్జునుడు విరాటసభ కరిగి ఆతనితో భాషించుట, కన్యలకు నృత్యము నేర్పుటకై యాతడు నియుక్తుడగుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

అథాపరోఽదృశ్యత రూపసంపదా
స్త్రీణా మలంకారధరో బృహత్పుమాన్,
ప్రాకారవప్రే ప్రతిముచ్య కుణ్డలే
దీర్ఘే చ కమ్బూపరి హాటకే శుభే. 1

పిదప మంచి అందముకలవాడు, స్త్రీలవలె అలంకారములను ధరించినవాడు, ఉన్నతపురుషుడొకడు పొడవైన కుండలములను ధరించి, బంగారుగాజులు తొడిగి కోటగోడయొద్ద కానవచ్చెను.

బాహూ చ దీర్ఘాన్ ప్రవికీర్య మూర్ధజాన్
మహాభుజో వారణతుల్య విక్రమః,
గతేన భూమిం ప్రతికమ్పయం స్తదా
విరాట మాసాద్య సభాసమీపతః. 2

ఏనుగువంటి నడకతో ఆ మహాభుజుడు పొడవైన చేతులను కేశములను ఊపుచు, భూమి అదురునట్లు నడచుచు విరాటుని సభలోనికి వచ్చెను.

తం ప్రేక్ష్య రాజోపగతం సభాతలే
వ్యాజాత్ ప్రతిచ్ఛన్న మరిప్రమాథినమ్,
విరాజమానం పరమేణ వర్చసా
సుతం మహేన్ద్రస్య గజేన్ద్ర విక్రమమ్. 3

సర్వా నపృచ్ఛచ్చ సభాను చారిణః,
కుతోఽయ మాయాతి పురా న మే శ్రుతః.
న చైన మూచు ర్విదితం తదా నరాః,
స విస్మయం వాక్య మిదం నృపోఽబ్రవీత్. 4

అట్లు సభలోనికి వచ్చినవాడు, నెపముతో గూఢముగా నున్నవాడు, శత్రుసంహారకుడు, గొప్పతేజస్సుతో విరాజిల్లుచున్నవాడు, ఏనుగునడక వంటి నడక కలవాడు అగు దేవేంద్రకుమారుని గాంచి విరాటుడు సభలో నున్న సేవకులందరిని 'ఈతడు ఎక్కడ నుండి వచ్చుచున్నాడు, మును పీతని గూర్చి వినియుండలేదు' అని అడిగెను. వారందరు మాకు తెలిసినవాడు కాదనిరి. అప్పుడు రాజు ఆశ్చర్యముతో ఇట్లు పలికెను.

సత్త్వోపపన్నః పురుషోఽమరోపమః
శ్యామో యువా వారణయూథపోపమః,
ఆముచ్య కమ్బ్వాపరి హాటకే శుభే,
విముచ్య వేణీ మపినహ్య కుణ్డలే. 5

గొప్పశక్తి గలవాడవు. దేవతాపురుషునివలె నున్నవాడవు, శ్యామ వర్ణము గలవాడవు, యువకుడవు, ఏనుగుల జేనివలె నున్నవాడవు, చక్కని బంగారు కుండలములను ధరించిన వాడవు, ముడి వీడిన జుట్టు గలవాడవు.

స్రగ్వీ సుకేశః పరిధాయ చాన్యథా
శుశోభ ధన్వీ కవచీ శరీ యథా,
ఆరుహ్య యానం పరిధావతాం భవాన్
సుతైస్సమో మే భవ వా మయా సమః. 6

మాలలు ధరించితివి. చక్కని కేశములు నీకు గలవు. వస్త్రము లోక విధముగా కట్టితివి. అయినను ధనువు, కవచము, బాణములు ధరించినవాని వలె శోభిల్లుచున్నావు. మంచి వాహనమెక్కి తిరుగ దగుదువు. నా పుత్రులతోడనో నాతోడనో సమానుడవు కమ్ము.

వృద్ధో హ్యహం వై పరిహారకామః
సర్వాన్ మత్స్యాం స్తరసా పాలయస్వ,
నైవంవిధాః క్లీబరూపా భవన్తి,
కథంచ నేతి ప్రతిభాతి మే మనః. 7

నేను ముసలివాడను బరువు తొలగించుకొనగోరుచున్నాను. ఈ మత్స్యదేశమును శక్తితో పాలింపుము. ఇట్టి వారెన్నటికి పేడి వారు కారని నా మదికి తోచుచున్నది.

[అర్జున ఉవాచ - అర్జును డిట్లనెను.

వేణీం ప్రకుర్యాం రుచిరే చ కుణ్డలే
తథా స్రజః ప్రావరణాని సంహరే,
స్నానం చరేయం విమృజే చ దర్పణం,
విశేషకేష్వేవ చ కౌశలం మమ.

రాజా! చక్కగా జడలల్లుదును. అందమైనకుండలముల నలంకరింతును. మాలలు కట్టుదును. వస్త్రములను సిద్ధము చేయుదును. స్నానము చేయింతును. అద్దమును శుభ్రము చేయుదును. ఇట్టి అలంకరణములందే నాకు నేర్పు కలదు.

క్లీబేషు బాలేషు జనేషు నర్తనే
శిక్షాప్రదానేషు చ యోగ్యతా మమ,
కరోమి వేణీషుచ పుష్పపూరణం
నమే స్త్రియః కర్మణి కౌశలాధికాః.

పేడి వాండ్రలో పిన్నవారిలో సాధారణజనములో తిరుగుదును. నర్తనము చేయుటలో నేర్పుటలో నాకు యోగ్యత కలదు. జడలలో పూవులను చక్కగా తురుముదును. ఈ పనియందు ఆడువారు కూడ నాకంటె ఎక్కువ నేర్పుకలవారు కారు.

తమబ్రవీత్ ప్రాంశు ముదీక్ష్య విస్మితో
విరాట రాజో పసృతం మహాయశాః.

ఇట్లని దగ్గరగా వచ్చిన ఆ పొడగరిని గాంచి ఆశ్చర్యపడుచు మహాయశస్వియగు విరాటరా జిట్లనెను.

విరాట ఉవాచ - విరాటుని ట్లు పలికెను.

నాత్వామస్తు వేషోఽయ మనూర్జిత స్తే
నాపుంస్త్వ మర్హో నరదేవ సింహ,
తవైవ వేషోఽశుభ వేష భూషణై
ర్విభూషితో భూతపతే రివ ప్రభో.

ఓ మహానుభావా ! నీకీ హీనమైన వేషము చెల్లదు. ఓనరదేవ సింహమా ! నీకీ పేడితనము తగదు. అమంగళములగు ఈ వేషము ఆభరణములతో నీయీ వేషము శివుని వేషమువలె, అలంకారమే యగుచున్నది.

విభాతి భానో రివ భానుమాలినో
ఘనావరుద్ధే గగనే ఘనైరివ,
ధను ర్హి మన్యే తవ శోభయేద్ భుజౌ
తథా హి పీనా వతి మాత్ర మాయతౌ.

మేఘముల చాటున మరుగువడిన కిరణమాలలుగల సూర్యుని తేజస్సునవలె నీరూపమున్నది. నీభుజములకు విల్లుగదా శోభ తెచ్చును. ఆ భుజములు అంతగా బలిసి పొడవై యున్నవి.]

అర్జున ఉవాచ - అర్జును డిట్లు పలికెను.

గాయామి నృత్యామ్యథ వాదయామి
భద్రోఽస్మి నృత్యే కుశలోఽస్మి గీతే,
త్వముత్తరాయై ప్రదిశస్వ మాం స్వయం
భవామి దేవ్యా నరదేవ నర్తకః. 8

ఓ మహారాజా ! పాడుదును. ఆడుదును. వాద్యములు వాయింతును. ఆట పాటలలో ఆరి తేరితిని. నన్ను స్వయముగా ఉత్తర కొరకై నియమింపుము. ఆమెకు నృత్యవిద్య నేర్పుదును.

ఇదం తు రూపం మమ యేన కిం తవ
ప్రకీర్తయిత్వా భృశ శోకవర్ధనమ్,
బృహన్నలాం మాం నరదేవ విద్ధి
సుతం సుతాం వా పితృమాతృ వర్జితామ్. 9

నా యీ రూపముతో నీకు పని యేమి ? దానిని గురించి చెప్పినచో దుఃఖమే పెరుగును. నేను బృహన్నలను. కొడుకనో, కూతురనో తలిదండ్రులు లేనిదానను.

విరాట ఉవాచ - విరాటుడిట్లు పలికెను.

దదామి తే హన్త వరం బృహన్నలే
సుతాంచ మే నర్తయ యాశ్చ తాదృశీః,
ఇదంతు తే కర్మ సమం న మే మతం
సముద్రనేమిం పృథివీం త్వమర్హసి. 10

ఓ బృహన్నలా ! మంచిది. నీకు వరమిత్తును. నాబిడ్డకును ఇంకను అట్టి కన్యలకును ఆట నేర్పుము. కాని ఇది నీ ఆకృతికి సరి వచ్చు పనికాదని నా అభిప్రాయము. సముద్రమే ఎల్లగాగల భూమి నంతటి నేలజాలుదువు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లుచెప్పెను.

బృహన్నలాం తామభివీక్ష్య మత్స్యరాట్
కలాసు నృత్యేషు తథైవ వాదితే,
సంమంత్ర్య రాజా వివిధైః స్వమన్త్రిభిః.
పరీక్ష్య చైనం ప్రమదాభి రాశు వై. 11

మత్స్య దేశపు రాజగు విరాటుడు కళలయందు, నృత్యముల యందు, వాద్యముల యందు బృహన్నలకు గల నేర్పును బాగుగా చూచి మంత్రు లందరితో బాగుగా ఆలోచించి స్త్రీలతో ఆతనిని పరీక్షించెను.

అపుంస్త్వ మప్యస్య నిశమ్య చ స్థిరం
తతః కుమారీపుర ముత్ససర్జ తామ్,
స శిక్షయామాస సగీతవాదితం
సుతాం విరాటస్య ధనంజయః ప్రభుః. 12

ఆతని నపుంసకత్వమును గట్టిగా గుర్తించి పిదప కుమారీజన ముందు భవనములకు పంపెను. సమర్థుడగు ధనంజయుడు విరాటుని పుత్రికకు పాటను వాద్యములను నేర్పెను,

సఖీశ్చ తస్యాః పరిచారికా స్తథా
ప్రియశ్చ తాసాం స బభూవ పాణ్డవః. 13

అట్లే ఆమె చెలులకు పరిచారికలకును నేర్పెను. ఇట్లా పాండు తనయుడు వారికి మిగుల ఇష్టుడాయెను.

తథా స సత్రేణ ధనంజయో వసన్
ప్రియాణి కుర్వన్ సహ తాభి రాత్మవాన్,
తథా చ తం తత్ర న జజ్ఞిరే జనా
బహిశ్చరా వాప్యథ చాన్తరే చరాః. 14

ఇట్లా ధనంజయుడు ఆ స్త్రీలతో కలిసి గూఢముగా నివసించుచు వారికి ప్రియములు చేయుచుండెను. అచట లోపలివారు గాని వెలుపలివారు గాని ఆతనిని గుర్తింపకుండిరి.

ఇది శ్రీ మహాభారతే విరాట పర్వణి పాణ్డవ ప్రవేశ
పర్వణి అర్జునప్రవేశో నామ ఏకాదశోఽధ్యాయః
ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున పాండవ ప్రవేశ
పర్వమున అర్జున ప్రవేశమను పదునొకండవ అధ్యాయము

## ద్వాదశోఽధ్యాయః - పంద్రెండవ అధ్యాయము

విరాట స్యాశ్వానాం శిక్షణే నిరీక్షణే చ నకులస్య నియుక్తిః.

విరాటుని గుఱ్ఱముల శిక్షణలో పరామరికలో నకులుడు కుదురుకొనుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

అథాపరోఽదృశ్యత పాణ్డవః ప్రభు
ర్విరాటరాజం తరసా సమేయివాన్,
తమాపతన్తం దదృశే పృథగ్జనో
విముక్త మభ్రాదివ సూర్యమణ్డలమ్. 1

పిమ్మట మఱియొక పాండుకుమారుడు విరాటరాజును వేగ ముగా సమీపించుచు కానవచ్చెను. అట్లు వచ్చుచున్న ఆతనిని సాధారణజనులు ఆకసమునుండి ఊడిపడిన సూర్యబింబమా! యన్నట్లు చూచిరి.

స వై హయా నీక్షతి తాం స్తత స్తతః
సమీక్షమాణం స దదర్శ మత్స్యరాట్,
తతోఽబ్రవీత్ తా ననుగాన్ నరేశ్వరః
కుతోఽయ మాయాతి నరోఽమరోపమః. 3

ఆతడు అందందు గుఱ్ఱములను పరీక్షించుచు వచ్చుచుండగా విరాటరాజు ఆతనిని చూచెను. అంత రాజు సేవకులతో ఇట్లు పలికెను. దేవజాతివానివలె నున్న ఈతడు ఎక్కడినుండి వచ్చు చున్నాడు.

స్వయం హయా నీక్షతి మామకాన్ దృఢం
ధ్రువం హయజ్ఞో భవితా విచక్షణః,
ప్రవేశ్యతా మేష సమీప మాశు మే
విభాతి వీరో హి యథామర స్తథా. 3

తనంతతాను నా గుఱ్ఱములను గట్టిగా పరీక్షించుచున్నాడు. మంచివివేకముగల అశ్వశాస్త్రవేత్త అయియుండవలయును. త్వరగా నాదరికి కొనిరండు. ఈ వీరుడు దివ్యపురుషునివలె ప్రకాశించు చున్నాడు.

అభ్యేత్య రాజాన మమిత్రహాఽబ్రవీ
జ్జయోఽస్తు తే పార్థివ భద్రమస్తు వః,
హయేషు యుక్తో నృప సమ్మతః సదా
తవాశ్వసూతో నిపుణో భవామ్యహమ్. 4

శత్రువినాశకుడగు రాజును సమీపించి రాజా! నీకు జయ మగుగాక! మీకెల్లరకు శుభమగుగాక! నన్ను గుఱ్ఱముల నరయు

టను నియమించినచో ఇష్టపూర్వకముగా నేర్పుతో నీ గుఱ్ఱములను చూచుకొందును.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను :

దదామి యానాని ధనం నివేశనం
మమాశ్వసూతో భవితుం త్వమర్హసి,
కుతోఽసి కస్యాసి కథం త్వమాగతః
ప్రబ్రూహి శిల్పం తవ విద్యతే చ యత్.     5

నీకు వలయు వాహనములను, ధనమును, గృహమును ఇత్తును. నా గుఱ్ఱములకు పాలకుడవగుము. ఎక్కడివాడవు ? ఎవ్వరివాడవు ? ఎట్లు వచ్చితివి ? ఏ విద్యలో నేర్పుకలదు ? చెప్పుము.

నకుల ఉవాచ - నకులు డిట్లనెను :

పఞ్చానాం పాణ్డుపుత్రాణాం జ్యేష్ఠో భ్రాతా యుధిష్ఠిరః,
తేనాహ మశ్వేషు పురా నియుక్తః శత్రుకర్శన.

ఓ శత్రుమర్దనా! పాండవులైదుగురు పెద్దఅన్న ధర్మరాజు. ఆయన మున్ను నన్ను గుఱ్ఱములపై అధికారిగా నియోగించెను.

అశ్వానాం ప్రకృతిం వేద్మి వినయం చాపి సర్వశః,
దుష్టానాం ప్రతిపత్తిం చ కృత్స్నం చైవ చికిత్సితమ్.     7

గుఱ్ఱముల స్వభావము, శిక్షణ, వాని దుడుకులను తొలగించుట వాని వైద్యము అనువానిని సంపూర్ణముగా తెలిసికొంటిని.

న కాతరం స్యాన్మమ జాతు వాహనం
న మేఽస్తి దుష్టా వడవా కుతో హయాః,

---

1. ప్రతిపత్తిమ్ - దోషములను తొలగించు పద్ధతిని

జనస్తు మామాహ స చాపి పాణ్డవో
యుధిష్ఠిరో గ్రన్థిక మేవ నామతః.

నా వాహన మొకనాడును పిరికిదికాదు- నాయొద్ద దుష్టమై
ఆడుగుఱ్ఱమేని లేదన్నచో మగగుఱ్ఱములసంగతి చెప్పనేల! జ
మును, ఆ పాండుకుమారుడు ధర్మరాజును నన్ను ఆకారణమున
గ్రంథికుడందురు,

[మాతలి రివ దేవపతే
ర్దశరథ నృపతే స్సుమన్త్రి ఇవ యన్తా,
సుమహా ఇవ జామదగ్నే
స్తథైవ తవ శిక్షయా మ్యశ్వాన్.

దేవేంద్రునికి మాతలివలె, దశరథమహారాజునకు సారథియై
సుమంత్రునివలె, జమదగ్నిపుత్రునకు సుమహునివలె నీకు సూతుడనై
నీ గుఱ్ఱములను తీర్చిదిద్దెదను.

యుధిష్ఠిరస్య రాజేన్ద్రి నరరాజస్య శాసనాత్,
శతసాహస్ర కోటీనా మశ్వానా మస్మి రక్షితా.

మహారాజు ధర్మరాజు శాసనమువలన ఓ రాజేంద్రా
ఆయనకుగల నూరువేలకోట్ల గుఱ్ఱములకు రక్షకుడనై నేనుంటిని.]

**విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.**

యదస్తి కించిన్మమ వాజివాహనం
తదస్తు సర్వం త్వదధీన మద్య వై,
యే చాపి కేచి న్మమ వాజియోజకా
స్త్వదాశ్రయాః సారథయశ్చ సన్తు మే.

నాకున్న కొంచెముపాటి గుఱ్ఱముల వాహనముల సంపదను
నేడు నీకప్పగించుచున్నాను. నాకున్న గుఱ్ఱముల పనివా
సారథులు నిన్ను ఆశ్రయింప వలయును.

---

**౧. గ్రంథికః - అశ్వశాస్త్రవేత్త**

ఇదం తవేష్టం యది వై సురోపమ
బ్రవీహి యత్ తే ప్రసమీక్షితం వసు,
న తేఽనురూపం హయకర్మ విద్యతే
ప్రభాసి రాజేవ హి సమ్మతో మమ. 10

ఓ దేవసదృశుడా! ఇది నీ కిష్టమైనచో నీకెంత ధనము కావలయునో చెప్పుము. నీకీ గుఱ్ఱముల పని తగదని నాఅభిప్రాయము నీవు నాకొక గొప్పరాజువలె కానవచ్చుచున్నావు.

యుధిష్ఠిరస్యేవ హి దర్శనేన మే
సమం తవేదం ప్రియమత్ర దర్శనమ్,
కథం తు భృత్యైః స వినాకృతో వనే
వసత్యనిన్ద్యో రమతే చ పాణ్డవః. 11

ఆ ధర్మరాజును చూచిన ఎంతప్రీతి కలుగునో ఇచట నీ దర్శనముచే అంత ప్రీతికలుగుచున్నది. పాపమా పుణ్యాత్ముడు సేవకులు లేక అడవిలో ఎట్లున్నాడో? ఏమి చేయుచున్నాడో!

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.
తథా స గన్ధర్వవరోపమో యువా
విరాటరాజ్ఞా ముదితేన పూజితః,
న చైన మన్యేఽపి విదుః కథంచన
ప్రియాభిరామం విచరన్త మన్తరా. 12

గంధర్వశ్రేష్ఠునివంటి ఆయువకుని విరాటుడు మిక్కిలి ప్రీతితో మన్నించెను. ప్రియముగా, మనోహరముగా అచట సంచరించుచున్న ఆతని నెవ్వరును గుర్తింపలేదు.

ఏవం చ మత్స్యే న్యవసన్త పాణ్డవా
యథా ప్రతిజ్ఞాభి రమోఘదర్శనాః

అజ్ఞాతచర్యాం వ్యచరన్ సమాహితాః
సముద్రనేమీ పతయోఽ తిదుః ఖితాః. 13

ఇట్లు వ్యర్థముకాని ముందుచూపుగల పాండవులు తాము నిర్ణయించుకొన్న పద్ధతిలో విరాటదేశమున నెలకొనిరి. సముద్రము చుట్టిన భూమికి ఏలికలైన వారు మిక్కిలి దుఃఖము ననుభవించుచు నెమ్మదితో అజ్ఞాతవాసమును. గావించిరి.

ఇతి శ్రీ మహాభారతే విరాట పర్వణి పాణ్డవప్రవేశ
పర్వణి నకుల ప్రవేశే ద్వాదశోఽధ్యాయః,
ఇది శ్రీ మహాభారతమున విరాట పర్వమున
పాండవప్రవేశ పర్వమున నకులప్రవేశమను పండ్రెండవ అధ్యాయము.



ఓమ్

# శ్రీ మన్మహాభారతమ్

## విరాటపర్వ - విరాటపర్వము

### సమయపాలనపర్వ - సమయపాలనపర్వము -

### త్రయోదశోఽధ్యాయః - పదుమూడవ అధ్యాయము

భీమసేన కర్తృకో జీమూతస్య వధః.

భీమసేనుడు జీమూతుని వధించుట.

జనమేజయ ఉవాచ - జనమేజయు డిట్లు పలికెను.

ఏవం తే మత్స్యనగరే ప్రచ్ఛన్నాః కురునన్దనాః,
అత ఊర్ధ్వం మహావీర్యాః కిమ కుర్వత వై ద్విజ. 1

ఓ బ్రహ్మణోత్తమా ! ఇట్లు మహాశక్తికల ఆ కురునందనులు మత్స్యనగరమున అజ్ఞాతముగా నుండి అటుపై ఏమిచేసిరి !

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

ఏవం మత్స్యస్య నగరే ప్రచ్ఛన్నాః కురునన్దనాః,
ఆరాధయన్తో రాజానం యదకుర్వత తచ్ఛృణు. 2

ఇట్లు మత్స్యనగరమున గుట్టుగా ఉన్న ఆ కురునందనులు రాజును కొలుచుచు ఏమిచేసిరో చెప్పెదను వినుము.

తృణబిన్దు ప్రసాదాచ్చ ధర్మస్య చ మహాత్మనః,
అజ్ఞాతవాస మేవం తు విరాటనగరే. ఽవసన్. 3

తృణబిందు మహర్షియొక్కయు, మహాత్ముడగు యమధర్మ
రాజుయొక్కయు అనుగ్రహమువలన వారిట్లు ఇతరులను తెలియ
రాకుండ నివసించిరి.

యుధిష్ఠిరః సభాస్తారో మత్స్యానామభవత్ ప్రియః,
తథైవ చ విరాటస్య సపుత్రస్య విశాంపతే. 4

ఓ రాజా ! సభాస్తారుడైన ధర్మరాజు మత్స్యదేశ ప్రజలకు,
విరాటునకు, ఆతని పుత్రులకును మిక్కిలి ప్రియుడయ్యెను.

స హ్యక్షహృదయజ్ఞ స్తాన్ క్రీడయామాస పాణ్డవః,
అక్షవత్యాం యథాకామం సూత్రబద్ధా నివ ద్విజాన్. 5

పాచికల హృదయమెఱిగిన పాండవుడు అచటి ద్విజుల నందరిని
ఒక త్రాట గట్టినట్లు ఒనర్చి ద్యూతక్రీడ యందు ఇష్టము వచ్చినట్లు
క్రీడించెను.

అజ్ఞాతం చ విరాటస్య విజిత్య వసు ధర్మరాట్,
భ్రాతృభ్యః పురుషవ్యాఘ్రో యథార్హం సంప్రయచ్ఛతి. 6

పురుషశ్రేష్ఠుడగు ధర్మరాజు విరాటుని ధనము గెలిచి గుట్టుగా
తమ్ములకు వలసినట్లిచ్చుచుండెను.

భీమ సేనోఽపి మాంసాని భక్ష్యాణి వివిధాని చ,
అతి సృష్టాని మత్స్యేన విక్రీణీతే యుధిష్ఠిరే. 7

భీమసేనుడును విరాటుడు ఉపయోగింపగా మిగిలిన
మాంసములను, వివిధములైన భక్ష్యములను ధర్మరాజాదులకు ఇచ్చు
చుండెడి వాడు.

వాసాంసి పరిజీర్ణాని లబ్ధాన్యన్తః పురేఽర్జునః,
విక్రీణానశ్చ సర్వేభ్యః పాణ్డవేభ్యః ప్రయచ్ఛతి. 8

అర్జునుడును అంతఃపురమున దొరకెడు పాత వస్త్రములను అందరకు అమ్ముకొని పాండవుల కిచ్చుచుండెడివాడు.

సహదేవోఽపి గోపానాం వేష మాస్థాయ పాణ్డవః,
దధి క్షీరం ఘృతం చైవ పాణ్డవేభ్యః ప్రయచ్ఛతి. 9

గోపవేషము ధరించిన పాండవుడు సహదేవుడును పెరుగు, పాలు, నేయి పాండవులకు ఇచ్చుచుండెడివాడు.

నకులోఽపి ధనం లబ్ధ్వా కృతే కర్మాణి వాజినామ్,
తుష్టే తస్మి న్నరపతౌ పాణ్డవేభ్యః ప్రయచ్ఛతి. 10

నకులుడును గుఱ్ఱముల పనులుచేయుగా రాజు మెచ్చి యిచ్చిన ధనమును పాండవుల కొసగుచుండెను.

కృష్ణా తు సర్వాన్ భ్రాతౄంస్తాన్ నిరీక్షన్తీ తపస్వినీ
యథా పున రవిజ్ఞాతా తథా చరతి భామినీ 11

ద్రౌపదియు దీనయై భర్తల నరసికొనుచు అజ్ఞాతవాసము చెడకుండునట్లు ప్రవర్తించినది.

ఏవం సంపాదయన్త స్తే తదాన్యోన్యం మహారథాః,
విరాటనగరే చేరుః పున ర్గర్భధృతా ఇవ. 12

ఇట్లు ఆమహారథులు వారిలో వారు మంచితనమును పెంచుకొనుచు విరాటనగరమున మరల గర్భముననున్నవారి వలె మెలగిరి.

సాశఙ్కా ధార్తరాష్ట్రస్య భయాత్ పాణ్డుసుతా స్తదా,
ప్రేక్షమాణా స్తదా కృష్ణా మూషు శ్ఛన్నా నరాధిప. 13

ఓ రాజా! ఆ పాండవులు దుర్యోధనుని భయమువలన నెల్లపుడు శంకించుచు, ద్రౌపదిని కాపాడుకొనుచు గూఢముగా నివసించిరి.

అథ మాసే చతుర్థే తు బ్రహ్మణః సుమహోత్సవః,
ఆసీత్ సమృద్ధో మత్స్యేషు పురుషాణాం సుసమ్మతః. 14

పిమ్మట నాల్గవమాసమున మత్స్యదేశమున జనులందరకు ఇష్టమైన గొప్ప బ్రహ్మోత్సవము నిండుతనములో జరిగెను.

తత్ర మల్లాః సముత్పేతు ర్దిగ్భ్యోరాజన్ సహస్రశః
సమాజే బ్రహ్మణో రాజన్ యథా పశుపతే రివ. 15

ఓ రాజా ! ఆ ఉత్సవమునకు అన్నిదిక్కులనుండియు వేల కొలది మల్లులు, సత్యలోకమున బ్రహ్మకొలువునకు, కైలాసమున శివుని కొలువునకు వచ్చినట్లు వచ్చిరి.

మహాకాయా మహావీర్యాః కాలఖఞ్జా ఇవాసురాః,
వీర్యోన్మత్తా బలోదగ్రా రాజ్ఞా సమభి పూజితాః. 16

కాలఖంజులను రక్కసులవలె గొప్పదేహము గొప్పశక్తికలిగి, శక్తితో ఒడలెఱుగనివారై, బలముతో భయంకరులై ఆ మల్లులు రాజువలన గొప్ప సంమానములను పొందిరి.

సింహస్కన్ధ కటిగ్రీవాః స్వవదాతా మనస్వినః,
అసకృల్లబ్ధలక్షా స్తే రఙ్గే పార్థివ సన్నిధౌ. 17

వారి భుజములు, పిరుదులు, మెడయు సింహమునకు వలె నున్నవి. వారు నిర్మలులు. అభిమానవంతులు. చాలమారులు గెలుపుగొన్నవారు. అట్టివారు రాజసన్నిధియందు రంగమునకు విచ్చేసిరి

తేషా మేకో మహానాసీత్ సర్వమల్లా నథాహ్వయత్,
ఆ వల్గమానం తం రఙ్గే నో పతిష్ఠతి కశ్చన. 18

14. బ్రహ్మణః సుమహోత్సవః - కొన్నిప్రాంతములలో శరత్కాలమున క్రొత్త ధాన్యములు వచ్చునపుడు జనులందరు చేసికొను వేడుక.
17. స్వవదాతాః - మిక్కిలి స్వచ్ఛతకలవారు.

అందులో ఒక మహాబలశాలి కలడు, అతడు మల్లులనందరను కవ్వించెను. గరిడీయందు గంతులు వైచుచున్న వానితో నొక్కడును పోరకుండెను।

యదా సర్వే విమనస స్తే మల్లా హతచేతసః,
అథ సూదేన తం మల్లం యోధయామాస మత్స్యరాట్. 19

అట్లా మల్లులందరు మనసు చంపుకొని పోరుటకు పెడమొగము పెట్టగా విరాటుడు వంటలవాడగు భీమునితో వానిని పోరించెను.

నోద్యమాన స్తదా భీమో దుఃఖేనైవా కరోన్మతిమ్,
నహి శక్నోతి వివృతే ప్రత్యాఖ్యాతుం నరాధిపమ్. 20

రాజు తన్నట్లు ప్రేరేపగా భీముడు అనిష్టముగనే సిద్ధపడెను. ఒకసారి తెలియవచ్చినచో రాజును కాదనుటకు వీలు లేదుగదా !

తతః స పురుషవ్యాఘ్రః శార్దూల శిథిల శ్చరన్,
ప్రవివేశ మహారఙ్గం విరాట మభిపూజయన్. 21

అంత పులివంటి ఆ పురుషుడు విరాటునికి మొక్కులిడుచు, బిగువుసడలిన పులివలె మహారంగమున ప్రవేశించెను.

బబన్ధ కక్ష్యాం కౌన్తేయ స్తతః సంహర్షయ ఞ్జనమ్,
తతస్తు వృత్ర సంకాశం భీమో మల్లం సమాహ్వయత్, 22
జీమూతం నామ తం తత్ర మల్లం ప్రఖ్యాత విక్రమమ్,

అంత జనమునకు సంతోషమును పెంచుచు భీముడు నడుమునకు గుడ్డ బిగించెను, పిదప వృత్రునివలె నున్న ఆ మల్లుని, జీమూతుడను వానిని లోకమున పెద్ద పేరున్నవానిని, కవ్వించెను,

20. దుఃఖేనైవ - పరతంత్రుడనని, బయటపడుదునేమో యని భయముచేత కలిగిన దుఃఖముచేత, ఓడుదునను దుఃఖముకాదు.

తావుభౌ సుమహోత్సాహౌ వుభౌ భీమపరాక్రమౌ, 23
మత్తా వివ మహాకాయౌ వారణౌ షష్టిహాయనౌ,
తతస్తౌ నరశార్దూలౌ బాహుయుద్ధం సమీయతుః, 24

భయంకరమైన పరాక్రమముగల వారిరువురు గొప్ప ఊపుగల వారై యుండిరి, గొప్పదేహముగల మదించిన అరువదియేండ్ల ఏనుగులవలె నుండిరి, అంత నానరశ్రేష్టు లిరువురు బాహు యుద్ధమునకు గడగిరి,

వీరౌ పరమ సంహృష్టౌ వన్యోన్యజయ కాంక్షిణౌ,
ఆసీత్ సుభీమః సంపాతో వజ్రపర్వతయో రివ, 25

ఆ వీరు లిద్దరు నిండైన సంతోషముతో ఒకరి నొకరు గెలువవలయునను కోరికతో నుండిరి. వారిరువురు తలపడుట వజ్ర పర్వతములవంటిదై యుండెను,

ఉభౌ పరమసంహృష్టౌ బలేనాతిబలా వుభౌ
అన్యోన్యస్యాన్తరం ప్రేప్సూ పరస్పర జయైషిణౌ, 26

ఇద్దరు మిక్కిలి ఉల్లాసముగా నుండిరి. ఇద్దరు అతిబలులు కావున బలమంతయు కూడ గట్టుకొని పోరుచుండిరి. పరస్పరము అవకాశముకై చూచుచు గెలువగోరుచుండిరి.

ఉభౌ పరమ సంహృష్టౌ మత్తా వివ మహాగజౌ,
కృత ప్రతికృతై శ్చిత్రై ర్బాహుభిశ్చ సుసంకటైః,
సంని పాతావధూతైశ్చ ప్రమాథోన్మథనై స్తథా. 27

ఒకచోట పట్టినొక్కుట, వదలుట, పిడికిలితో చేతులను గట్టిగా పట్టి బలహీనముగా చేయుట, దేహమును గట్టిగా ఒడిసి పట్టుట, దూరముగా త్రోయుట, నేల బడగొట్టి మర్దించుట, పైకి లేవనెత్తి మర్దించుట - అను విధానములతో వారిరువును మంచి ఉబ్బులలో పోరిరి.

క్షేపణై ర్ముష్టిభి శ్చైవ వరాహోద్ధత నిఃస్వనైః
తలై ర్వజ్రనిపాతైశ్చ ప్రసృష్టాభి స్తథైవచ. 28

ఉన్నచోట నుండి లాగి పడగొట్టుట, రొమ్ము వడుము రెండు పిడికిళ్ళతో కొట్టుట మెడలువంచి చేతులను భుజముపై పెట్టినొక్కి చఱచునప్పుడు పుట్టు వరాహోద్ధత ధ్వని పుట్టించుట, పిడుగు పాటు వంటి చరపులు చరచుట, వ్రేళ్ళు పట్టుకొని లాగుట - అను విధానములతో పట్టులు పట్టిరి.

శలాకానఖ పాతైశ్చ పాదోద్ధూతైశ్చ దారుణైః,
జానుభి శ్చాశ్మనిర్ఘోషైః శిరోభిశ్చావఘట్టనైః. 29

వ్రేళ్ళువంచక నిడివిగా పెట్టి గోళ్ళతో పొడుచుటలు కాళ్ళు చాచి తన్నుటలు, పెద్దఱాలు మీద పడినట్లు పడు మోకాలి పోట్లు, తలతో పొడుచుటలు - అను విధములతో పోరిరి.

తద్ యుద్ధమభవద్ ఘోర మశస్త్రం బాహుతేజసా,
బల ప్రాణేన శూరాణాం సమాజోత్సవ సంనిధౌ. 30

ఇట్లు వారిసవురకు శూరులదైన ఆ ఉత్సవములో ఘోరము నింద్యమునగు యుద్ధము బాహువుల సత్త్వతో దేహమనో బలములతో జరిగెను.

అరజ్యత జనః సర్వః సోత్కృష్టనినదోత్థితః,
బలినోః సంయుగే రాజన్ వృత్రవాసవయోరివ. 31

30. అశస్త్రమ్ - నింద్యము - 'బాహుయుద్ధం హి మల్లానా మశస్త్ర మృషిభిః స్మృతమ్, మృతస్య తస్య న స్వర్గో యశో నేహాపి విద్యతే'- మల్లశాస్త్రము ఋషులు మల్లుర యుద్ధమును నింద్యమనిరి. అందు చచ్చిన వానికి స్వర్గము గాని గెలిచిన వానికి కీర్తి గాని లేదు.

31. సోత్కృష్టనినదః - హీహీ అనుచు ఓడిన వానిని వెక్కిరించు ధ్వని.

ఆ యిద్దరు బలవంతులు వృత్రాసుర దేవేంద్రులవలె ఘోరముగా పోరుచుండగా జన మంతయు ఉత్సాహముతో హీహీ కారములు చేయుచు ఆనందించెను.

ప్రకర్షణా కర్షణయో రభ్యాకర్ష వికర్షణైః,
ఆకర్షతు రథాన్యోన్యం జానుభిశ్చాపి జఘ్నతుః. 32

ఒక్కపెట్టున లాగి ముద్దగాచేయుట, ముందు వెనుకలకు గుంజుట, వేగముగా వెనుకకుత్రోసి పడగొట్టుట అను విధానములను ఒకరినొకరు ప్రయోగించుకొనిరి. మోకాళ్ళతో పొడుచుకొనిరి.

తతః శబ్దేన మహతా భర్త్సయన్తౌ పరస్పరమ్,
వ్యూఢోరస్కౌ దీర్ఘభుజౌ నియుద్ధ కుశలా వుభౌ,
బాహుభి స్సమసజ్జేతా మాయసైః పరిఘై రివ. 33

గొప్ప అరపులతో ఒకరినొకరు బెదరించుకొనుచు వెడద రొమ్ములు, పొడవైన చేతులుగల ఆ మల్లయుద్ధ విశారదులిద్దరు ఉక్కుపరిఘలవలెనున్న బాహువులతో పోరాడిరి.

చకర్ష దోర్భ్యా ముత్పాట్య భీమో మల్లమమిత్రహా,
వినద న్త మభిక్రోశన్ శార్దూల ఇవ వారణమ్. 34

శత్రుసంహారకుడగు భీముడు రెండు భుజములతో బొబ్బలిడు చున్న ఆ మల్లుని, పులి ఏనుగును పట్టినట్లు పట్టి అరచుచు గుంజెను.

ముద్యమ్య మహాబాహు [illegible] మయామాస వీర్యవాన్.
మల్లాశ్చ మత్స్యాశ్చ [illegible] స్మయం చక్రిరేపరమ్. 35

మహాబాహువు వీర్యవంతుడునగు భీముడు ఆ మల్లుని రెండు [illegible] ట్టియెత్తి గిరగిర త్రిప్పె[illegible]. దానికి అచట మల్లులును [illegible]త్స్యులును మిక్కుటముగు ఆశ్చర్యమును పొందిరి.

భ్రామయిత్వా శతగుణం గతస త్త్వ మచేతనమ్,
ప్రత్యపింష న్మహాబాహు ర్మల్లం భువి వృకోదరః. 36

అట్లు నూరుమార్లు, త్రిప్పి, బుద్ధిమాలి శవముపలెనున్న ఆ మల్లుని మహాభుజుడగు వృకోదరుడు నేలపై పెట్టి మర్దించెను.

తస్మిన్ వినిహతే వీరే జీమూతే లోకవిశ్రుతే,
విరాటః పరమం హర్ష మగచ్ఛద్ బాన్ధవైః సహ. 37

లోకమున ప్రసిద్ధిగన్న వీరు డా జీమూతుడు చావగా చుట్టములతో పాటు పరమానందమందెను.

ప్రహర్షాత్ ప్రదదౌ విత్తం బహు రాజా మహామనాః,
వల్లవాయ మహారంగే యథా వైశ్రవణ స్తథా. 38

దొడ్డబుద్ధిగల ఆరాజు ఎంతో సంబరపడి వల్లవునకు ఆ మహారంగమున కుబేరుడిచ్చినట్లు గొప్పధన మిచ్చెను.

ఏవం స సుబహూన్ మల్లాన్ పురుషాంశ్చ మహాబలాన్;
వినిఘ్నన్ మత్స్యరాజస్య ప్రీతి మాహర దుత్తమామ్, 39

ఇట్లా భీముడు అనేక మల్లులను, మహాబలముగల పురుషులను చంపి మత్స్యరాజునకు గొప్పప్రీతిని చేకూర్చెను.

యదాస్య తుల్యః పురుషో న కశ్చిత్ తత్ర విద్యతే,
తతో వ్యాఘ్రైశ్చ సింహైశ్చ ద్విరదై శ్చాప్యయోధయత్. 40

భీమునితో సాటివచ్చు పురుషుడు లేనిసమయములలో విరాటుడు ఆతనిని పులులతో, సింహములతో, ఏనుగులతో పోరించెడివాడు.

పున ర న్తః పురగతః స్త్రీణాం మధ్యే వృకోదరః
యోధ్యతే స విరాటేన సింహైర్మత్తైర్మహాబలైః. 41

36. గతసత్త్వమ్ - బుద్ధిమాలినవానిని,

మఱియు ఆ విరాటుడు అంతఃపురమున స్త్రీలనడుమ నుండి గొప్పబలముతో మదించియున్న సింహములతో భీముని పోరించెడి వాడు.

బీభత్సు రపి గీతేన స్వనృత్యేన చ పాణ్డవః,
విరాటం తోషయామాస సర్వాశ్చాన్తః పురస్త్రియః. 42

అర్జునుడు ఆటతో పాటతో, విరాటుని, అంతఃపురస్త్రీల నందరను సంతోషపెట్టు చుండెడివాడు.

అశ్వై ర్వినీతై ర్జవనై స్తత్ర తత్ర సమాగతైః
తోషయామాస రాజానం నకులో నృపసత్తమమ్: 43

తస్మై ప్రదేయం ప్రాయచ్ఛత్ ప్రీతో రాజా ధనం బహు.

నకులుడును చక్కని శిక్షణగలవియు ఆ యా దేశములనుండి వచ్చినవియు వేగముకలవియునగు గుర్రములతో రాజులలో గొప్ప వాడగు విరాటుని అలరించెను. రాజాతనికి ప్రీతుడై ఈయవలసిన ధనమును పెల్లుగానిచ్చెను.

వినీతాన్ వృషభాన్ దృష్ట్వా సహదేవస్య బాభితః,
ధనం దదౌ బహువిధం విరాటః పురుషర్షభః. 44

పురుషవరుడగు విరాటుడు సహదేవుని చుట్టునుగల చక్కని అదుపుగల ఎద్దులను పరిశీలించి అతనికిని బహుధన మొసగెను.

ద్రౌపదీ ప్రేక్ష్య తాన్ సర్వాన్ క్లిశ్య మానాన్ మహారథాన్,
నాతి ప్రీతి మనా రాజన్ నిఃశ్వాసపరమా భవత్. 45

అట్లా మహారథులు నలగిపోవుచుండగా చూచి ద్రౌపది దుఃఖముతో నిరంతరము నిట్టూర్పులు పుచ్చుచు ఉండెను.

ఏవం తే వ్యవసం స్తత్ర ప్రచ్ఛన్నాః పురుషర్షభాః,
కర్మాణి తస్య కుర్వాణా విరాటనృపతే స్తదా. 46

ఇట్లా పురుషవ శ్రేణ్యులు గూఢముగా ఆ విరాటునికి సేవలు చేయుచు నందు నివసించిరి.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి సమయపాలన
పర్వణి జీమూతవధే త్రయోదశోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారత విరాటపర్వమున సమయపాలన
పర్వమున జీమూతుని వధయను పదుమూడవఅధ్యాయము

ఓమ్

# శ్రీ మన్మహాభారతమ్

## విరాటపర్వ - విరాటపర్వము

### కీచకవధపర్వ - కీచకవధపర్వము -

### చతుర్దశోఽధ్యాయః - పదునాల్గవ అధ్యాయము

ద్రౌపదీం దృష్ట్వా తస్యా మాసక్తస్య కీచకస్య తాంప్రతి ప్రణయ ప్రార్థనం ద్రౌపదీ కర్తృకం తస్య భర్త్సనం చ.

ద్రౌపదిని గాంచి యామెయందు మరులుగొన్న కీచకుడు ఆమె ప్రణయమును ప్రార్థించుట, ద్రౌపది వానిని బెదిరించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లనెను.

వసమానేషు పార్థేషు మత్స్యస్య నగరే తదా,
మహారథేషు చ్ఛన్నేషు మాసా దశ సమాయయుః. 1

ఇట్లు మహారథులగు కుంతీతనయులు విరాటుని నగరమున అజ్ఞాతముగా నివసించుచుండగా పది మాసములు గడచెను.

యాజ్ఞసేనీ సుదేష్ణాంతు శుశ్రూషన్తీ విశామ్పతే,
అవసత్ పరిచారార్హా సుదుఃఖం జనమేజయ. 2

యజ్ఞసేన మహారాజు పుత్రిక, ఇతరులసేవకు యోగ్యురాలు అగు ఆ ద్రౌపది సుదేష్ణను సేవించుచు మిక్కిలి దుఃఖపడచు అందు నివసించెను.

తథా చరన్తీ పాఞ్చాలీ సుదేష్ణాయా నివేశనే,
తాం దేవీం తోషయామాస తథా చాన్తః పురస్త్రియః. 3

పాంచాలి సుదేష్ణభవనమున అట్లు చరించుచు ఆ దేవిని, ఇతర అంతఃపుర కాంతలను సంతోషపెట్టెను.

తస్మిన్ వర్షే గతప్రాయే కీచకస్తు మహాబలః,
సేనాపతి ర్విరాటస్య దదర్శ ద్రుపదాత్మజామ్. 4

ఆ ఏడు ఇంచుమించుగా పూర్తియగుచుండగా విరాటుని సేనాపతి, మహాబలుడు కీచకుడు ద్రౌపదిని చూచెను.

తాం దృష్ట్వా దేవగర్భాభాం చరన్తీం దేవతామివ,
కీచకః కామయామాస కామ బాణ ప్రపీడితః. 5

దేవుని కన్నతల్లివలె, దేవతవలె ఉన్న ఆమెను చూచి, కీచకుడు కామబాణములచే మిక్కిలిగా పీడితుడై ఆమెను మోహించెను.

స తు కామాగ్నిసంతప్తః సుదేష్ణా మభిగమ్య వై,
ప్రహసన్నివ సేనానీ రిదం వచన మబ్రవీత్. 6

ఆతడు మన్మథుడనెడు మంటకు బాగుగా తపించి మెల్లగా సుదేష్ణ కడకు చేరి నగుమొగముతో ఇట్లు పలికెను.

నేయం మయా జాతు పురేహ దృష్టా
రాజ్ఞో విరాటస్య నివేశనే శుభా,
రూపేణ చోన్మాదయతీవ మాం భృశం
గన్ధేన జాతా మది రేవ భామినీ. 7

విరాటరాజు భవనమున మున్నెన్నడు ఈ శోభ నాంగిని చూచి యుండలేదు. మద్యము తన సువాసనతో కైపెక్కించునట్లు ఈ భామిని తన రూపముతో నాకు పిచ్చి యెక్కించుచున్నది.

కా దేవరూపా హృదయఙ్గమా శుభే
హ్యాచక్ష్వ మే కస్య కుతోఽత్ర శోభనే,
చిత్తం హి నిర్మథ్య కరోతి మాం వశే
న చాన్యదత్రౌషధ మస్తి మే మతమ్. 8

ఓ పుణ్యాత్మురాలా ! దేవతల రూపము వంటి రూపముతో గుండెలోనికి చొచ్చుకొనిపోవుచున్న ఈమె ఎవ్వరిది ? ఎక్కడినుండి యిటకు వచ్చెను ? నాకు చెప్పుము. ఈమెనా మనసును మథించి నన్ను తన వశము చేసికొనుచున్నది. దీనికి మరియొక మందు లేదని పించుచున్నది.

అహో తవాయం పరిచారికా శుభా
ప్రత్యగ్రరూపా ప్రతిభాతి మామియమ్,
అయుక్తరూపం హి కరోతి కర్మ తే
ప్రశాస్తు మాం యచ్చ మమాస్తి కించన. 9

ఈ శుభాంగి నీ పరిచారికయా ? నాకేమో దివ్యరూపముతో కానవచ్చుచున్నది. నీకీమె సేవకురాలనగా మిక్కిలి అయోగ్యమైన విషయముగదా ! ఈమె నన్ను నాకున్నదానిని కొంచెమును పాలించుగాక !

ప్రభూత నాగాశ్వరథం మహాధనం
సమృద్ధియుక్తం బహుపాన భోజనమ్,
మనోహరం కాంచనచిత్రభూషణం
గృహం మహచ్ఛోభయతా మియం మమ. 10

పెద్దసంఖ్యలో ఏనుగులు, గుఱ్ఱములు, రథములు కలదియు, గొప్ప ధనము గలదియు, అంతులేని ఐశ్వర్యము, అధికములగు పానీయములు, భోజనములు, సువర్ణమయములగు చిత్రములైన

---

9. ప్రత్యగ్రరూపా - దివ్యమైనరూపము గలది.

ఆభరణములు గలిగి మనోజ్ఞమైన నా పెద్ద భవనమును ఈమె అలంకరించుగాక !

తతః సుదేష్ణా మనుమన్త్ర్య కీచక
స్తతః సమభ్యేత్య నరాధిపాత్మజామ్,
ఉవాచ కృష్ణా మభిసాన్త్వయం స్తదా
మృగేన్ద్రకన్యామివ జమ్బుకో వనే. 11

అంత నాకీచకుడు సుదేష్ణను వీడ్కొని మహారాజపుత్రిక యగు ద్రౌపదిని, వనమున సింహపుపిల్లను నక్కవలె, సమీపించి ప్రతిమాలుచు నిట్లు పలికెను.

కా త్వం కస్యాసి కల్యాణి కుతో వా త్వం వరాననే,
ప్రాప్తా విరాటనగరం తత్ త్వమాచక్ష్వ శోభనే. 12

ఓ కళ్యాణీ ! చక్కనిమోముగలదానా ! మంచిదానా ! నీ వెవరవు ? ఎవ్వరిదానవు ? ఎచటనుండి యీ విరాటనగరమునకు వచ్చితివి ! నిజము పలుకుము,

రూప మగ్ర్యం తథా కాన్తిః సౌకుమార్య మనుత్తమమ్,
కాన్త్యా విభాతి వక్త్రం తే శశాఙ్క ఇవ నిర్మలమ్. 13

నీ రూపము అన్నిటికన్న మిన్న, కాంతియునట్టిదే. నీ సౌకుమార్యము పరమోత్తమమైనది. నీమోము కాంతితో మచ్చలేని చంద్రునివలె విరాజిల్లుచున్నది,

నేత్రే సువిపులే సుభ్రు పద్మపత్రనిభే శుభే,
వాక్యం తే చారుసర్వాఙ్గి పరపుష్టరుతోపమమ్, 14

కనుబొమలు తీర్చిదిద్దినట్లున్న ఓ అంగనా ! పద్మపత్రములవలె నీ కనులు విశాలముగా నున్నవి. అన్ని అంగములు సుందర

---

14. పరపుష్టరుతమ్ - కోకిలకూత.

ముగా నున్న ఓ కాంతా! నీ పలుకు కోకిల కూతవలె కమ్మగా నున్నది.

ఏవం రూపా మయా నారీ కాచి దన్యా మహీతలే,
న దృష్ట పూర్వా సుశ్రోణి యాదృశీ త్వమనిన్దితే. 15

ఎందును దోషములేని ఓ యింతీ! చక్కని జఘనముగల ఓ భామినీ! నీ వంటి రూపముగల వనితను నేనీ భూమిపై చూచి యుండలేదు.

లక్ష్మీః పద్మాలయా కా త్వమథ భూతిః సుమధ్యమే,
హ్రీః శ్రీః కీర్తి రథో కాన్తిరాసాం కా త్వం వరాననే. 16

సన్నని నడుము, శ్రేష్ఠమైన మోము గలదానా? పద్మమున నివసించియుండు లక్ష్మివా యేమి? లేక ఈశ్వరివా? హ్రీ, శ్రీ, కీర్తి, కాంతి అనువారలలో నీ వెవరవు?

అతీవ రూపిణీ కిం త్వ మనఙ్గాఙ్గ విహారిణీ,
అతీవ భ్రాజసే సుభ్రు ప్రభే వేన్దో రనుత్తమా. 17

ఇంత రూపవతివి నీవు మన్మథుని దేహమున విహరించు రతివా యేమి? చక్కని కనుబొమలుగల ఓ కాంతా! అత్యుత్తమమైన చంద్రుని కాంతివలె మిక్కిలి వెలుగొందుచున్నావు.

అపి చేక్షణ పక్ష్మాణాం స్మితం జ్యోత్స్నోపమం శుభమ్,
దివ్యాంశు రశ్మిభి ర్వృత్తం దివ్యకాన్తి మనోరమమ్. 18

నీ కను రెప్పలపై వెన్నెలవలె వెలుగొందు కాంతిరేఖ దివ్య కిరణముల పరిధితో దివ్యకాంతులతో మనోహరమై యొప్పారుచున్నది.

నిరీక్ష్య వక్త్ర చంద్రం తే లక్ష్మ్యానుపమయా యుతమ్,
కృత్స్నే జగతి కో నేహ కామస్య వశగో భవేత్. 19

సాటిలేని శోభతో గూడిన నీ ముఖచంద్రుని జూచి ఈ ముత్తములోకమున కామునకు వశుడుకాని జనుడుండునా!

హారాలంకార యోగ్యా తు స్తనౌ చౌభౌ సుశోభనౌ,
సుజాతౌ సహితౌ లక్ష్మ్య పీనౌ వృత్తౌ నిరన్తరౌ. 20

చక్కగా రూపు దిద్దుకొన్నవి, నిండుకాంతితో అలరారు చున్నవి. బలిసినవి, వర్తులముగానున్నవి, నడుమ వ్యవధానము లేనివి అగు నీ స్తనములు రెండును హారములకు, అలంకారములకు యోగ్యమైనవి.

కుడ్మలాంబు రుహాకారౌ తవ సుభ్రు పయోధరౌ,
కామ ప్రతోదా వివ మాం తుదత శ్చారు హాసిని. 21

మనోజ్ఞమగు నవ్వుగలదానా! చక్కని కనురెప్పలు కల దానా! నీయీ స్తనములు పద్మపు మొగ్గలవలెనుండి మన్మథుని అంకుశములవలె నన్ను పొడుచుచున్నవి.

వలీ విభఙ్గ చతురం స్తనభార వినామితమ్,
కరాగ్ర సమ్మితం మధ్యం తవేదం తను మధ్యమే. 22

సన్నని నడుముగల ఓ తన్వంగీ! నీయీనడుము చక్కగా ఏర్పడినముడుతలతో అందమైనది. స్తనముల బరువుచే కొంచెము వంగినది, పిడికిలి పట్టునకు సరిపోవునది అయి ఒప్పుచున్నది.

దృష్ట్వైవ చారు జఘనం సరిత్పులిన సంభవమ్,
కామ వ్యాధి రసాధ్యో మా మప్యా క్రామతి భామిని. 23

నదియందలి తిన్నెవలె ఏర్పడిన నీ అందమైన జఘనమును చూచినంతనే అసాధ్యమగు కామ జ్వరము నన్ను పట్టుకొనుచున్నది.

జజ్వాల చాగ్నిమదనో దావాగ్ని రివ నిర్దయః,
త్వత్సంగమాభి సంకల్ప వివృద్ధో మాం దహత్యయమ్. 24

ఈ అగ్నివంటి మన్మథుడు దావాగ్ని వలె నీ కలయికను కోరుటచేత పిచ్చరేగిన వాడై మండిపోవుచు దయలేక నన్ను కాల్చివేయుచున్నాడు.

ఆత్మ ప్రదాన వర్షేణ సంగమాంభోధరేణ చ
శమయస్వ వరారోహే జ్వలన్తం మన్మథానలమ్. 25

ఓ కామినీ! నిన్ను నాకర్పించుకొనుటయను వర్షముచేతను, కలయికయను మేఘముచేతను ఈ మండుచున్న మన్మథాగ్నిని చల్లార్పుము.

మచ్చిత్తోన్మాదన కరా మన్మథస్య శరోత్కరాః,
త్వత్సంగమాశా నిశితా స్తీవ్రాః శశినిభాననే,
మహ్యం విదార్య హృదయ మిదం నిర్దయ వేగితాః. 26

ఈ మన్మథుని బాణముల సముదాయములు, ఓ జాబిల్లి వంటి మోము గలదానా! నా మదికి ఉన్మాదమును పుట్టించుచున్నవి. నీ కలయికను గోరుటచే అవి పదునెక్కినవి, నిర్దయతో వేగమును పుంజుకొన్నవి. నాగుండెను చీల్చి వేయుచున్నవి

ప్రవిష్టా హ్యసితాపాఙ్గి ప్రచణ్డా శ్చణ్డ దారుణాః,
అత్యున్మాద సమారంభాః ప్రీత్యున్మాద కరా మమ,
ఆత్మ ప్రదాన సంభోగై ర్మాముద్ధర్తు మిహార్హసి. 27

తీవ్రములు దారుణములు, నీకలయిక యందలి ఆశతో వాడియైనవి అగు మన్మథుని బాణములు నాలో ప్రవేశించి, నల్లని కడకన్నులతో అందమైనదానా! నాకు సన్నిపాతరోగమును పుట్టించుచున్నవి. ప్రేమపిచ్చిని ముదురజేయుచున్నవి. నిన్నర్పించుకొని సంభోగములతో నన్నుద్ధరింపుము.

---

27. అత్యున్మాదః - ఛావుదశలో పుట్టు రోగము.

చిత్ర మాల్యామ్బరధరా సర్వాభరణభూషితా,
కామం ప్రకామం సేవ త్వం మయా సహ విలాసిని. 28

ఓ విలాసినీ ! చక్కని మాలలు వస్త్రములు ధరించు, సర్వాభరణములతో భూషితవై నాతోపాటు మిక్కిలికోరికతో యథేచ్ఛగ మన్మథుని సేవింపుము.

నార్హాసీహాసుఖం వస్తుం సుఖార్హా సుఖవర్జితా,
ప్రాప్నుహ్యానుత్తమం సౌఖ్యం మత్త స్త్వం మత్తగామిని! 29

ఓ మత్తగామినీ ! నీవు సుఖములకు యోగ్యమైనదానవు. ఇచట సుఖములనువదలి దుఃఖములతో నివసింపరాదు. నావలన అత్యుత్తమమైన సుఖమును పొందుము.

స్వాదూన్య మృత కల్పాని పేయాని వివిధాని చ,
పిబమానా మనోజ్ఞాని రమమాణా యథాసుఖమ్. 30

మిక్కిలి రుచిగలవి, అమృతమువంటివి అగు వివిధములైన పానీయములను మదికింపైనవానిని త్రాగుచునుండుము, ఇష్టము వచ్చినట్లు క్రీడించుచుండుము.

భోగోపచారాన్ వివిధాన్ సౌభాగ్యం చాప్యనుత్తమమ్,
పానం పిబ మహాభాగే భోగై శ్చానుత్తమైః శుభైః. 31

వివిధములైన భోగములను, సేవలను, అతిశ్రేష్ఠమైన సౌభాగ్యమును అనుభవింపుము. ఓ అదృష్టవతీ! మిక్కిలి గొప్పభోగములతో పానసుఖమును పొందుము.

ఇదం హి రూపం ప్రథమం తవానఘే
నిరర్థకం కేవల మద్య భామిని,
అధార్యమాణా స్రగివోత్తమా శుభా
న శోభసే సున్దరి శోభనా సతీ, 32

ఓ పుణ్యవతీ ! ఓ సుందరీ ! నీ యీ రూపము రూపములక మొట్టమొదటిది. చక్కని శుభమైన మాల ధరింపబడనిచో ఎట్లో అట్లు నేడు కేవలము వ్యర్థమగుచున్నది. కీచకుడిట్లున్నచో రాణి ప్రవ్రు.

త్యజామి దారాన్ మమ యే పురాతనా
భవన్తు దాస్య స్తవ చారుహాసిని
అహం చ తే సున్దరి దాసవత్ స్థితః
సదా భవిష్యే వశగో వరాననే. 33

మునుపు నాకున్న భార్యలను వదలివైతును. వారు నీకు దాసులగుదురు. నేనును, ఓ సుందరీ ! నీకుదాసుడనై నీకు వశుడనై ఎల్లప్పుడునుందును.

ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లుపలికెను.

అప్రార్థనీయా మిహ మాం సూతపుత్రాభి మన్యసే,
నిహీనవర్ణాం సైరంధ్రీం బీభత్సాం కేశకారిణీమ్. 34

ఓ సూతపుత్రుడా ! నేను మిక్కిలిహీనకులముదానను సైరంధ్రిని. జడలల్లుకొని బ్రదుకుదానను, ఏవగొలుపుదానను, ఇట్టి నన్ను నీవు కోరదగనిదానిని కోరుచున్నాడవు.

[స్వేషుదారేషు మేధావీ కురుతే యత్నముత్తమమ్,
స్వదారనిరతో హ్యాశు నరో భద్రాణి పశ్యతి.

తెలివిగలవాడు తన భార్యయందు తగిన యత్నము చేయును! తన భార్యయందు ఆసక్తిగల నరుడు శీఘ్రముగా శుభముల బడయును.

న చాధర్మేణ లిప్యేత నాపకీర్తి మవాప్నుయాత్,
స్వదారేషు రతిర్ధర్మో మృతస్యాపి నసంశయః.

54. అభిమన్యసే - కామించుచున్నావు.

అధర్మమంటకుండుగాక ! అపకీర్తి పొందకుండుగాక ! చచ్చినను తనభార్యయందు ప్రీతియుండుట ధర్మము సందియము లేదు.

స్వజాతిదారా మర్త్యస్య ఇహలోకే పరత్ర చ
ప్రేత కార్యాణి కుర్వన్తి నివాపై స్తర్పయన్తిచ.
తదక్షయ్యం చ ధర్మ్యంచ స్వర్గ్యమాహుర్మనీషిణః.

మానవునకు ఈలోకమున తనజాతి భార్య పరలోకమునను ప్రేతకార్యములను చేయును. నివాపజలముతో తర్పణము చేయును. అది తరుగవోనిది ధర్మమును, స్వర్గమును కలిగించునది యని పండితులు చెప్పుదురు.

ప్రియా హి ప్రాణినాం దారా స్తస్మాత్త్వం ధర్మభాగ్భవ,
పరదారరతో మర్త్యో నచ భద్రాణి పశ్యతి.

ప్రాణులకు భార్య మిక్కిలి ప్రియురాలు కదా ! కావున ధర్మవంతుడవు కమ్ము. ఇతరస్త్రీలయందు ఆసక్తికల మానవుడు శుభములు పొందడు.]

పరదారాస్మి భద్రం తే నయుక్తం తవ సామ్ప్రతమ్,
దయితాః ప్రాణినాం దారా ధర్మం సమనుచిన్తయ. 35

నేను పరుని భార్యను. నీకు మేలయ్యెడు. ఇది నీకు తగదు. ప్రాణులకు భార్య మిక్కిలి ప్రియమైనవి. ధర్మమును వకలక తలపుము.

పరదారే నతే బుద్ధి ర్జాతు కార్యా కథంచన,
వివర్జనం హ్యకార్యాణా మేతత్ సుపురుషవ్రతమ్. 36

పరభార్యలయం దెన్నటికిని బుద్ధిని నిలుపరాదు. చేయరాని పనులను వదలుట మంచివారి లక్షణము.

మిథ్యాభి గృధ్నోహి నరః పాపాత్మా మోహ మాస్థితః
అయశః ప్రాప్నుయాద్ ఘోరం మహద్ వా ప్రాప్నుయాత్ భయమ్. 37

వ్యర్థవిషయములను కాంక్షించునరుడు పాపాత్ముడు, మోహమున చిక్కువడినవాడు. వానికి ఘోరమైన అపకీర్తియో, గొప్ప భయమో ప్రాప్తించును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

ఏవ ముక్తస్తు సైరంధ్ర్యా కీచకః కామమోహితః,
జానన్నపి సుదుర్బుద్ధిః పరదారాభిమర్శనే. 38

దోషాన్ బహూన్ ప్రాణహరాన్ సర్వలోకవిగర్హితాన్,
ప్రోవాచేదం సుదుర్బుద్ధి ర్ద్రౌపదీ మజితేన్ద్రియః. 39

ఇంద్రియనిగ్రహము లేనివాడు, కామముచే కనుగాననివాడునగు కీచకుడు ఇతరస్త్రీలను చేపట్టుటయందు సంభవించు ప్రాణముల తీయునవి, లోకమెల్ల నిందించునవియగు దోషముల నెరిగినవాడయ్యు మిక్కిలి దుష్టబుద్ధియై ద్రౌపదితో నిట్లు పలికెను.

నార్హస్యేవం వరారోహే ప్రత్యాఖ్యాతుం వరాననే,
మాం మన్మథ సమావిష్టం త్వత్కృతే చారుహాసిని. 40

ఓ వరారోహా ! ఓ వరాననా ! ఓ చారుహాసినీ ! నీవలన మన్మథునిపూనక మొందిన నన్ను ఇట్లు తిరస్కరింపదగదు.

ప్రత్యాఖ్యాయ చ మాం భీరు వశగం ప్రియవాదినమ్,
నూనం త్వ మసితాపాఙ్గి పశ్చాత్తాపం కరిష్యసి. 41

ఓ భీరూ ! నల్లని కడకన్నులదానా ! నేను నీకు వశుడనై యుంటిని. ప్రియములు పలుకుచున్నాను. ఇట్టి నన్ను తిరస్కరించి నీవు తప్పక పశ్చాత్తాప పడుదువు.

---

37. మహద్భయము - చావు

అహం హి సుభ్రు రాజ్యస్య కృత్స్నస్యాస్య సుమధ్యమే,
ప్రభు ర్వాసయితా చైవ వీర్యే చాప్రతిమః క్షితౌ. 42

నేననగా ఓ సుందరాంగీ! ఈ రాజ్యము మొత్తమునకు ప్రభువను. జనులందరు నావలన నిలుచుచున్నారు. శక్తిలో నాకు సాటియైనవాడు ఈ భూమిపై లేడు.

పృథివ్యాం మత్సమో నాస్తి కశ్చి దన్యః పుమానిహ,
రూపయౌవన సౌభాగ్యై ర్భోగై శ్చానుత్తమైః శుభైః. 43

రూపము, యౌవనము, సౌభాగ్యము, అత్యుత్తమ భోగములు అను వానివిషయమున నాతో సమానుడగు పురుషుడు మరియొకడు ఈ భూమిలో లేడు.

సర్వకామ సమృద్ధేషు భోగేష్వను పమేష్విహ
భోక్తవ్యేషు చ కల్యాణి కస్మాద్ దాస్యే రతా హ్యసి. 44

ఓ కల్యాణీ! అన్ని కామములను తీర్పగల సాటిరాని భోగము లిచట అనుభవించుటకు సిద్ధము గానుండగా నీకు దాస్యమునందు ప్రీతి యేల?

మయా దత్త మిదం రాజ్యం స్వామిన్యసి శుభాననే,
భజస్వ మాం వరారోహే భుఙ్క్ష్వ భోగా ననుత్తమాన్. 45

ఇదిగో రాజ్యమంతయు నీ కొసగితిని. ఓ చక్కని మోము గలదానా! దీనికి నీవు ప్రభువవు. నన్ను పొందుము. ఈ గొప్ప భోగముల ననుభవింపుము.

ఏవ ముక్తాతు సాసాధ్వీ కీచకేనా శుభం వచః,
కీచకం ప్రత్యువా చేదం గర్హయ న్త్యస్య తద్వచః, 46

ఆ కీచకుడట్లు అమంగళమగు మాట పలుకగా సాధ్వియగు ఆ ద్రౌపది వాని మాటకు ఏవగించుచు వానితో నిట్లు పలికెను.

సైరంధ్ర్యువాచ - సైరంధ్రి యిట్లు పలికెను.

మా సూతపుత్ర ముహ్యస్వ మాద్య త్యక్షస్వ జీవితమ్,
జానీహి పఞ్చభి ర్ఘోరై ర్నిత్యం మామభిరక్షితామ్. 47

ఓయీ ! సూత సుతా ! మోహము వలదు. ఈ దినమున జీవితమును వదలకుము. అయిదుగురు ఘోరరూపులు నన్ను అనుక్షణము కాపాడుచుందురు. గుర్తింపుము.

న చాప్యహం త్వయా లభ్యా గన్ధర్వాః పతయో మమ,
తే త్వాం నిహన్యుః కుపితాః సాధ్వలం మా వ్యనీనశః. 48

నేను నీకు చేజిక్కను నాపతులు గంధర్వులు. వారు కోపగించినచో నిన్ను చంపుదురు. చాలు ఊరక చావకుము.

అశక్యరూపం పురుషై రధ్వానం గన్తు మిచ్ఛసి,
యథా నిశ్చేతనో బాలః కూలస్థః కూలముత్తరమ్,
తర్తు మిచ్ఛతి మన్దాత్మా తథా త్వం కర్తుమిచ్ఛసి. 49

జనులకు అసాధ్యమైన దారిలో నడవగోరుచున్నావు. బుద్ధిలేని మొద్దుబాలుడు ఒకయొడ్డునుండి మరియొక ఒడ్డునకు చేరగోరినట్లు నీవును చేయగోరుచున్నావు.

అన్తర్మహీం వా యది వోర్ధ్వ ముత్పతేః
సముద్రపారం యది వా ప్రధావసి,
తథాపి తేషాం నవిమోక్ష మర్హసి
ప్రమాథినో దేవసుతా హి ఖేచరాః. 50

భూమిలో ప్రవేశింపుము, లేక ఆకసమున కెగురుము. సముద్రపు ఆవలి ఒడ్డునకు పరువెత్తుము, అయినను వారినుండి తప్పించుకొనజాలవు. వారు దేవసుతులు, ఆకసమున సంచరించువారు పీల్చిపిప్పిచేయుదురు.

[మాం హి త్వ మవమన్వాన పూతపుత్ర వినజ్క్ష్యసి,
అసు చాద్యైవ నచిరాత్ సపుత్రః సహ బాన్ధవః.

ఓయీ సూతుడా! నన్ను నవమానించితివో ఎప్పుడో కాదు, ఇప్పుడే, ఈక్షణముననే పుత్రులతో బంధువులతో కూడ కలిసి చత్తువు.

దుర్లభా మభిమన్వానో మాం వీరై రభిరక్షితామ్,
పతిష్య స్యవశ స్తూర్ణం వృన్తాత్ తాలఫలం యథా.

అందనిదానను వీరుల రక్షణముననున్నదానను అగునన్ను కామింతువేని పట్టుసడలిన తాటిపండు తొడిమనుండి రాలినట్లు వెనువెంటనే కూలిపోవుదువు.

యో మామజ్ఞాయ కామార్తః అబద్ధాని ప్రభాషసే,
అశక్తస్తు పుమాఞ్ఛైలం న లఙ్ఘయితు మర్హతి.

నాసంగతి యెఱుగక కామరోగముతో తులువ పలుకులు ప్రేలుచున్నావు. శక్తిహీనుడు కొండనుదాటునా?

దిశః ప్రపన్నో గిరిగహ్వరాణి వా
గుహాం ప్రవిష్టోఽ న్తరితోఽపివా క్షితేః,
జుహ్వన్ జపన్ వా ప్రపతన్ గిరే స్తటా -
ద్ధుతాశనాదిత్యగతిం గతోఽపి వా,
భార్యాభిమన్తా పురుషో మహాత్మనాం
న జాతు ముచ్యేత కథంచనాహతః.

దిక్కులను శరణుపొందినను, కొండగుహలలో దూరినను, పాతాళములోనికి చొరబారినను, భూగర్భములోనికి ప్రవేశించినను, హోమములు చేయుచున్నను, జపము ఒనరించుచున్నను కొండకొమ్మునుండి దూకుచున్నను, అగ్నివలె, ఆదిత్యునివలె పరువెత్తుచున్నను మహాత్ముల భార్యను అవమానించినవాడు చావక ఎన్నటికిని తప్పించుకొనజాలడు.

మోఘం తవేదం వచనం భవిష్యతి
ప్రతోలనం వా తులయా మహాగిరేః,
హుతాశనం ప్రజ్వలితం మహావనే
నిదాఘ మధ్యాహ్న ఇవాతురః స్వయమ్.
ప్రవేష్టు కామోఽసి వధాయ చాత్మనః
కులస్య సర్వస్య వినాశనాయ చ.

నీమాట తప్పక పొల్లుపోవును. కొండను త్రాసుతో తూచుటయా? మొదలే కాలిచచ్చుచున్న నీవు స్వయముగా నీచావునకై, నీకులమంతయు నశించుటకై మహారణ్యమున వేసవికాలపు మట్టమధ్యాహ్నమున మండుచున్న అగ్నిలో ప్రవేశింప గోరుచున్నావు.

సదేవ గన్ధర్వ మహర్షి సంనిధౌ
న నాగలోకాసుర రక్షసాలయే,
గూఢస్థితాం మా మవమన్య చేతసా
న జీవితార్థీ శరణం త్వం మాప్స్యసి.

ఏదో గుట్టుగా బ్రదుకుచున్న నన్ను మనసుతో అవమానింతువేని దేవగంధర్వమహర్షుల సమీపమునగాని, పాతాళమున గాని, రాక్షసుల లోకమునగాని, బ్రదుకగోరినచో, నీకు శరణము లభింపదు.]

త్వం కాలరాత్రీ మివ కశ్చిదాతురః
కిం మాం దృఢం ప్రార్థయసేఽద్య కీచక,
కిం మాతురఙ్కే శయితో యథా శిశు -
శ్చన్ద్రం జిఘృక్షు రివ మన్యసే హి మామ్. 51

51. చన్ద్రం జిఘృక్షోరివ - పసివానికి చంద్రుదెట్లందదో నీకు నేనట్లే యని భావము.

ఓ కీచకా! రోగిమృత్యుదేవతనువలె నన్నేల యింత గాఢముగా వాంఛింతువు? తల్లి యొడిలో పడుకొనియున్న శిశువు చంద్రుని పట్టుకో గోరినట్లు నన్ను పొందగోరుదువా!

తేషాం ప్రియాం ప్రార్థయతో నతే భువి
గత్వా దివం వా శరణం భవిష్యతి,
న వర్తతే కీచక తే దృశా శుభం
యా తేన సంజీవన మర్థయేత సా. 52

ఆ గంధర్వుల ప్రియమైన యిల్లాలిని నన్ను కామించు నీకు భూమిపైగాని ఆకసమునగాని రక్షకుడుండడు, ఓ కీచకా! నీకు శుభమును చేకూర్చెడు చూపులేదు. ఉన్నచో అది నీకు బ్రతుకు నిచ్చునది యగును.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి కీచకవధపర్వణి కీచక కృష్ణాసంవాదే
చతుర్దశో௨ధ్యాయః
ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున కీచకవధ పర్వమున కీచక కృష్ణ
సంవాదమున పదునాల్గవ అధ్యాయము

## పఞ్చదశో௨ధ్యాయః - పదునైదవ అధ్యాయము

సుదేష్ణాకర్తృకం కీచకస్య గృహే ద్రౌపద్యాః ప్రేషణమ్, సుదేష్ణ కీచకుని యింటికి ద్రౌపదిని పంపుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

ప్రత్యాఖ్యాతో రాజపుత్ర్యా సుదేష్ణాం కీచకో௨బ్రవీత్,
అమర్యాదేన కామేన ఘోరేణాభిపరిప్లుతః. 1

ఇట్లు ద్రుపదరాజపుత్రి ధిక్కరింపగా కీచకుడు సుదేష్ణ కడకరిగి ఘోరమైన హద్దులులేని కామమున మునిగినవాడై యిట్లు పలికెను.

యథా కైకేయి సైరంధ్రీ స పీ యాత్ తద్విధీయతామ్
యేనోపాయేన సైరంధ్రీ భజేన్మాం గజగామినీ
తం సుదేష్ణే పరీప్సస్వ ప్రాణాన్ మోహాత్ ప్రహాసిషమ్.

ఓ కేకయ రాజపుత్రీ ! సుదేష్ణా ! సైరంధ్రి నన్ను పొందు వట్లు చేయుము. ఆ గజగామిని నన్ను పొందు నుపాయమును ఆలోచింపుము. ఆ ఉపాయము వలన నేను ప్రాణములు వదలకుండ వలయును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్య సా బాహుశః శ్రుత్వా వాచం విలపత స్తదా,
విరాట మహిషీ దేవీ కృపాం చక్రే మన స్వినీ.

ఆ విరాటుని పట్టపు రాణి అభిమానవతి యయ్యు ఆ విధముగా విలపించుచున్న వాని పలుకులు విని వాని యందు దయ పూనెను.

[సుదేష్ణోవాచ - సుదేష్ణ యిట్లు పలికెను.

శరణా గతేయం సు శ్రోణీ మయా దత్తాభయా చసా,
శుభాచారా చ భద్రం తే నైనాం వక్తు మిహోత్సహే.

ఆమె నన్ను శరణు చొచ్చినది. ఆమెకు నేను అభయ మిచ్చితిని. ఆమె నడవడి చాలమంచిది. నీకు పుణ్యముండును. నేనామెకు చెప్పజాలను.

నైషా శక్యాహి చాన్యేన స్ప్రష్టుం పాపేన చేతసా,
గన్ధర్వాః కిల పత్న్యైనాం రక్షన్తి రమయన్తిచ,

ఇతరు డెవ్వడును ఆమెను పాపబుద్ధితో ముట్ట జాలడు. ఆమెను అయిదుగురు గంధర్వులు రక్షింతురట సుఖపెట్టుదురట.

---

2. మా, ఊహాత్: ప్రాణాన్, ప్రహాసిషమ్-ఏదైన ఉపాయమువలననా ప్రాణములు పోకుండ కాపాడుమని భావము.

ఏవ మేషా మహా చష్టే తథా ప్రథమ సఙ్గమే,
తథైవ గజనా సోయాః సత్య మాహ మమాన్తికే
తే హి క్రుద్ధా మహాత్మానో నాశయేయుర్హి జీవితమ్.

ఇట్లని ఈమె మొట్టమొదటనే నాకు చెప్పినది. మఱియు ఏనుగుతొండమువంటి ఊరువులు గల ఆ యితి, ఆ మహాత్ములు కోపించినచో జీవితము నాశనము చేయుదురని నాకడ సత్యమే చెప్పినది.

రాజా చైవ సమీాక్ష్యైనాం సంమోహం గత వా నిహ,
మయాచ సత్యవచనై రనునీతో మహీ పతిః,
సోఽప్యేనా మనిశం దృష్ట్వా మనసై వాభ్యనన్దత

రాజుకూడ ఈమెను చూచి మొదట మోహ పడెను. నేను మంచి మాటలతో రాజును దారికి తెచ్చితిని. అది మొదలు ఈమెను చూచి రాత్రింబవళ్ళు మనసులోనే మెచ్చుచుండెను.

భయాద్ గన్ధర్వముఖ్యానాం జీవిత ప్రోష ఘాతినామ్,
మన సాపి తత స్త్వేనాం నచిన్తయతి పార్థివః.

ప్రాణాంతకులగు గంధర్వముఖ్యుల భయము వలన అటుపై ఈమెను రాజు మనసులో కూడ తలచుటలేదు.

తేహి క్రుద్ధా మహాత్మానో గరుడానిల తేజసః,
దహేయు రపి లోకాంస్త్రీన్ యుగాన్తేష్వివ భాస్కరాః.

గరుడుని వంటి, అగ్నివంటి తేజస్సు గల ఆ మహాత్ములు క్రుద్ధులై, ప్రళయ కాలమునాటి భాస్కరులవలె మూడు లోకములను గూడ కాల్చివేయుదురు.

సైరన్ధ్ర్యా హ్యేత దాఖ్యాతం మమ తేషాం మహద్ బలమ్,
తవ చాహ మిదం గుహ్యం స్నేహాదాఖ్యామి బన్ధవత్.

వారి యీ గొప్ప బలమును గూర్చి సైరంధ్రి నాకు చెప్పినది. నీవు చుట్టమవు కనుక స్నేహముతో చేసే రహస్యమును నీకు చెప్పుచున్నాను.

మా గమిష్యసి వైళ్ళచ్ఛ్రి గతిం పరమ దుర్గమామ్.
బలిన స్తే రుజం కుర్యుః కులస్య చ ధనస్యచ.

నాయనా ! పొందరాని ఘోరమైన గతిని పొందకుము. బల వంతులగు వారు నీ కులమునకు, ధనమునకు ముప్పు తెత్తురు.

తస్మా న్నాస్యాం మనః కర్తుం యది ప్రాణాః ప్రియా స్తవ,
మా చి న్తయేథా మా గా స్త్వం మత్ప్రియం చ యదీచ్ఛసి,

అందువలన నీకు ప్రాణములపై తీపి ఉన్నచో ఆమె యందు మనసు పెట్టి ఆలోచన చేయకు. నా ప్రియమును కోరినచో అటు వైపు పోకుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ ము క్త స్తు దుష్టాత్మా భగినీం కీచకోఽ బ్రవీత్

ఆమె యిట్లనగా దుష్టాత్ముడగు కీచకుడు అక్కతో ఇట్లు పలికెను.

కీచక ఉవాచ - కీచకు డిట్లు పలికెను.

గన్ధర్వాణాం శతం వాపి సహస్ర మ యుతానివై,
అహ మేకో హనిష్యామి గన్ధర్వాన్ సఞ్ఛ కింపునః,

నూరుగురు కాదు వేయిమంది లేక పదివేలమంది కాసమ్మ గంధర్వులను నే నొక్కడనై చంపుదును. ఈ యైదుగురు నాకో లెక్కయా ?

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ ముక్తా సుదేష్ణా తు శోకేనాభి ప్రపీడితా,
అహో దుఃఖ మహో కృచ్ఛ్రి మహో పాప మితిస్మహా,
ప్రారుదద్ భృశదుః ఖార్తా విపాకం తస్య వీక్ష్య సా.

కీచకు డిట్లనగా సుదేష్ణకు పెనుదుఃఖము కలిగెను. ఆయ్యో ఏమి కష్టము వచ్చిపడినది ? ఎంత పాపము, ఏమి దుఃఖము అని వాపోవుచు వాని పండినపాపమును చూచి ఆర్తయై విలపించినది.

పాతాలేషు పతత్యేష విలపన్ వడవాముఖే,
త్వత్కృతే వినశిష్యన్తి భ్రాతరః సుహృదశ్చ మే.

వీడిట్లేడ్చుచు అధోలోకముల పడనున్నాడు. బడబాగ్నిలో కూలుచున్నాడు. ఓరీ నీ మూలమున నా తమ్ములకు, చెలులకు చావు మూడినది.

కిం ను శక్యం మయా కర్తుం యత్త్వమేవ మభిప్లుతః,
న చ శ్రేయోఽభిజానీషే కామమేవాను వర్తసే.

నీ విట్లు నిండుగా మునిగినచో నేనేమి చేయ జాలుదును ! మేలేదో యెఱుగవు. కామమువైపే పోవుచున్నావు.

ధ్రువం గతాయు స్త్వం పాప యదేవం కామమోహితః,
అకర్తవ్యే హి మాం పాపే నియునఙ్క్షి నరాధమ.

నిజముగా నీకు పోగాలము వచ్చినది. కావుననే యిట్లు కామముచే ఒడలెఱుగకున్నావు. ఓరి నీచుడా! చేయరాని పాప కార్యమున నన్ను నియోగించుచున్నావు.

అపి చైతత్ పురా ప్రోక్తం నిపుణైర్మను జోత్తమైః,
ఏకస్తు కురుతే పాపం స్వజాతి స్తేన హన్యతే.

అందువలననే లోకతత్త్వ మెఱిగిన ఉత్తమ పురుషులు, ఒక్కడు పాపము చేయును. దానితో వాని కులమంతయు నాశన మగునని మునుపు చెప్పియే యున్నారు.

గత స్త్వం ధర్మరాజస్య విషయం నాత్ర సంశయః,
అదూషక మిమం సర్వం స్వజనం ఘాతయిష్యసి.

అయిపోయినది. నీవు యముని దేశమునకు చేరుకొంటివి. నా
ఏపాపమెఱుగని నీ వారినందరిని చంపించుచున్నావు.

ఏతత్ తు మే దుఃఖతరం యేనాహం భ్రాతృసౌహృదాత్,
విదితార్థా కరిష్యామి తుష్టోభవ కులక్షయాత్.

ఇది నాకు మరియు దుఃఖమును కలిగించుచున్నది, తమ్ము
మీది మక్కువతో ఎరిగి ఎరిగి ఈ పాపమున కొడిగట్టుచున్నాను
కులమంతయు రూపుమాయుటవలన నీవు తుష్టిపొందుము].

స్వత స్త్రి మభి సన్ధాయ తస్యార్థ మనుచిన్త్య చ,
ఉద్యోగం చైవ కృష్ణాయాః సుదేష్ణా సూత మబ్రవీత్.

సుదేష్ణ వాని అదుపులేని తనమును గుర్తించి, ద్రౌపది వా
లభించు ఉపాయమును ఆలోచించి వానితో ఇట్లనెను.

పర్వణి త్వం సముద్దిశ్య సురా మన్నం చ కారయ,
తత్రైనాం ప్రేషయిష్యామి సురాహారీం తవా న్తికమ్.

పండుగనాడు నాకొరకని అందరకు తెలియునట్లు మద్యము
అన్నమును చేయింపుము. అపుడు నేను ఆమెను సురను తెచ్చుట
నీ కడకు పంపుదును.

తత్ర సంప్రేషితా మేనాం విజనే నిరవగ్రహే,
సాన్త్వయేథా యథా కామం సాన్త్వ్యమానా రమేద్ యది.

అట్లు పంపగా ఆమెను జనము లేనిచోట, అడ్డులేని
నీ కోరిక మేరకు ఒప్పింపుము. ఆమెయు ఇష్టపడినచో అ
భవింపుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇత్యుక్తః స వినిష్క్రమ్య భగిన్యా వచనాత్ తథా,
సురా మా హార యామా స రాజార్హాం సుపరిష్కృతామ్.

---

1. నిరవగ్రహే - ఏ అడ్డును లేనిచోట.

ఇట్లామె చెప్పగా అతడు అటనుండి వెడలి అక్కమాటపై
చక్కగా రూపొందిన, రాజులకు తగిన మద్యమును తెప్పించెను.

భక్ష్యాంశ్చ వివిధాకారాన్ బహూంశ్చోచ్చావచాం స్తదా
కారయామాస కుశలై రన్నం పానం సుశోభనమ్. 8

మంచినేర్పుగల వంటలవారితో అనేకవిధములగు పిండి
వంటలను, అన్నమును పానమును పెద్దమొత్తున చేయించెను.

తస్మిన్ కృతే తదా దేవీ కీచకే నోపమన్త్రితా.

అన్నియు సిద్ధమైన పిదప కీచకుడు సుదేష్ణను ప్రార్థించెను.

[త్వరావాన్ కాలపాశేన కంఠే బద్ధః పశుర్యథా
నావబుధ్యత మూఢాత్మా మరణం సముపస్థితమ్.

కాలపాశము మెడకు చుట్టుకొన్న పశువువలె మూఢబుద్ధి
యగు ఆ కీచకుడు తొందరపడుచు వచ్చిపడిన చావునెరుగకుండెను.

కీచక ఉవాచ కీచకుడిట్లు అనెను.

మధు మత్స్యం బహువిధం భక్ష్యాశ్చ వివిధాః కృతాః,
సుదేష్ణే బ్రూహి సైరంధ్రీం యథా సా మే గృహం వ్రజేత్,

ఓ సుదేష్ణా! చక్కని తేనె, మద్యము, వివిధములగు తిను
బండారములు చేయించితిని. ఆ సైరంధ్రి నాయింటికి వచ్చు
విధమున పలుకుము.

కేనచిత్ త్వద్య కార్యేణ త్వర శీఘ్రం మమ ప్రియమ్.

ఏదో ఒక పనిమీద ఆమెను పంపుము తర్వపడుము. నాకు
ప్రియ మాచరింపుము.

అహం హి శరణం దేవం ప్రపద్యే వృషభ ధ్వజమ్
సమాగమం మే సైరంధ్ర్యా మరణం వా దిశేతి వై.

ఓ స్వామీ! నాకు సైరంధ్రి కలయికనో, మరణమునో ఇమ్మని నేను వృషభధ్వజుడగు దేవుని శరణు చొచ్చితిని.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

సా తమాహ వినిఃశ్వస్య ప్రతిగచ్ఛ స్వకం గృహమ్,
ఏ షాహ మపి సైరంధ్రీం సురార్థే తూర్ణ మాదిశే,

ఆమె నిట్టూర్చి వానితో నీవు నీ యింటికి పొమ్ము ఇదిగో నేను సైరంధ్రికి మద్యమునకై ఆజ్ఞ పెట్టుచున్నాను అని పలికెను.

ఏవ ముక్తస్తు పాపాత్మా కీచక స్త్వరితః పునః,
స్వగృహం ప్రావిశత్ తూర్ణం సైరంధ్రీ గతమానసః.

ఆమె యట్లనగా పాపాత్ముడగు కీచకుడు సైరంధ్రిని మనసున పెట్టుకొని త్వరత్వరగా తన యింటిలోనికి దూరెను.]

సుదేష్ణా ప్రేషయామాస సైరంధ్రీం కీచకాలయమ్. 9

సుదేష్ణ సైరంధ్రిని కీచకు నింటికి పంపెను.

సుదేష్ణోవాచ - సుదేష్ణ యిట్లు పలికెను.

ఉత్తిష్ఠ గచ్ఛ సైరంధ్రి కీచకస్య నివేశనమ్,
పాన మానయ కల్యాణి పిపాసా మాం ప్రబాధతే 10

సైరంధ్రీ లే! కీచకుని యింటికి వెళ్ళు. మంచిదానవు నాకు మద్యము తెచ్చిపెట్టు. మద్యము త్రాగు వాంఛ నన్ను మిక్కిలి బాధించుచున్నది.

సైరంధ్ర్యువాచ - సైరంధ్రి యిట్లనెను.

న గచ్ఛేయ మహం తస్య రాజపుత్రి నివేశనమ్,
త్వ మేవ రాజ్ఞి జానాపి యథా స నిరపత్రపః 11

ఓ రాజపుత్రీ! నేను వాని యింటికి పోను. ఓ రాణీ! అతడెంత సిగ్గుమాలిన వాడో నీకే తెలియును.

న చాహ మనవద్యాఙ్గి తవ వేశ్మని భామిని,
కామ వృత్తా భవిష్యామి పతీనాం వ్యభిచారిణీ. 12

ఓయమ్మా! నేను నీయింట ఇష్టము వచ్చినట్లు తిరుగుచు భర్తల విషయమున హద్దు మీరజాలను.

త్వంచైవ దేవి జానాపి యథా స సమయః కృతః,
ప్రవిశన్త్యా మయా పూర్వం తవ వేశ్మని భామిని. 13

ఓ దేవీ! నేను నీ యిల్లుచేరు దినమునవే ఏ కట్టుబాటు చేసితినో నీకు తెలియును.

కీచకస్తు సుకేశాన్తే మూఢో మదన దర్పితః,
సోऽవ మంస్యతి మాం దృష్ట్వా న యాస్యే తత్ర శోభనే. 14

కీచకుడన్ననో మూఢుడు. కామముచే మద మెక్కి యున్నాడు. నన్ను చూచనంతనే అవమానించును. నేనచటికి పోను.

సన్తి బహ్వ్య స్తవ ప్రేష్యా రాజపుత్రి వశానుగాః,
అన్యాం ప్రేషయ భద్రం తే సహి మామవమంస్యతే. 15

ఓ రాజపుత్రీ నీ చెప్పు చేతలలో ఉన్న సేవకురాండ్రు చాల మంది కలరు. నీకు పుణ్యముండును. మరి యొకతెను పంపుము. నన్నాతడవమానించును.

సుదేష్ణోవాచ - సుదేష్ణ యిట్లు పలికెను.

నైవ త్వాం జాతు హింస్యాత్ స ఇతః సంప్రేషితాం మయా,
ఇత్యుక్త్వా ప్రదదౌ పాత్రం సపిధానం హిరణ్మయమ్. 16

నేను ఇటనుండి పంపగా వాడు నిన్నెన్నటికి బాధింపడు. అని పలికి మూతగల బంగారు పాత్రను చేతి కిచ్చెను.

సా శఙ్కమానా రుదతీ దైవం శరణ మీయుషీ,
ప్రాతిష్ఠత సురాహారీ కీచకస్య నివేశనమ్. 17

ఆమె శంకించుచు ఏడ్చుచు దైవమును శరణు వేడుచు సురను తెచ్చుటకై కీచకుని యింటికి బయలుదేరెను.

సైరంధ్ర్యువాచ - సైరంధ్రి యిట్లు పలికెను.

యథాహ మన్యం భర్తృభ్యో నాభిజానామి కఞ్చన,
తేన సత్యేన మాం ప్రాప్తాం మా కుర్యాత్ కీచకో వశే. 18

నేను నాభర్తలకంటె ఇతరుని ఎఱుగని దాన నైనచో ఆ వ్రతమువలన అటకుచేరిన నన్ను కీచకుడు చేపట్టకుండు గాక!

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఉపాతిష్ఠత సా సూర్యం ముహూర్త మబలా తతః,
స తస్యా స్తను మధ్యాయాః సర్వం సూర్యోఽవ బుద్ధవాన్. 19

ఆ అబల ఒక్క ముహూర్తకాలము సూర్యుని ధ్యానించెను. ఆ సూర్యుడును ఆ కోమలి విషయమంతయు చక్కగా ఎరిగెను.

అన్తర్హితం తత స్తస్యా రక్షో రక్షార్థ మాదిశత్,
తచ్చైనాం నాజహాత్ తత్ర సర్వావస్థా స్వనిన్దితామ్. 20

ఆమె రక్షణకొరకు అదృశ్యముగా నుండు ఒక రక్షస్సును నియోగించెను. అదియును దోషమెరుగని ఆమెను అన్నిదశలలో వదలక కాపాడుచుండెను.

తాం మృగీ మివ సంత్రస్తాం దృష్ట్వా కృష్ణాం సమీపగామ్,
ఉదతిష్ఠ న్ముదా సూతో నావం లబ్ధ్వేవ పారగః. 21

ఆడులేడి వలె బెదరిపోవుచు తనకడకు వచ్చుచున్న ద్రౌపదిని గాంచి కీచకుడు, ఒడ్డున నున్నవాడు నావను చూచి లేచినట్లు లేచెను.

ఇతి శ్రీమహాభారతే విరాట పర్వణి కీచకవధ
పర్వణి ద్రౌపదీ సురాహరణే పఞ్చదశోఽధ్యాయః
ఇది శ్రీ మహాభారత విరాట పర్వమున కీచకవధ పర్వమున
ద్రౌపది మద్యమున కరుగుట యను
పదునైదవ అధ్యాయము

## షోడశోఽధ్యాయః - పదునారవ అధ్యాయము

కీచకకృతం ద్రౌపద్యా అపమానమ్. కీచకుడు చేసిన ద్రౌపది అవమానము.

కీచక ఉవాచ - కీచకు డిట్లు పలికెను.

స్వాగతం తే సుకేశాన్తే సువ్యుష్టా రజనీ మమ,
స్వామినీ త్వమనుప్రాప్తా ప్రకురుష్వ మమ ప్రియమ్. 1

చక్కని ముంగురులుగల ఓ అంగనా! నీకు స్వాగతము. నాకు రాత్రి యంతయు నిదురలేదు. నన్నేలుదానవు వచ్చితివి. నాకు ప్రియ మొనరింపుము.

సువర్ణమాలాః కంబూశ్చ కుణ్డలే పరిహాటకే
నానా పత్తనజే శుభ్రే మణిరత్నంచ శోభనమ్
ఆహరన్తు చ వస్త్రాణి కౌశికా న్యజినాని చ. 2

సువర్ణహారములు, శంఖములు తాపిన వలయములు అనేక పత్తనములలో లభించు చక్కని బంగారు కమ్మలు, మణులు, రత్నములు, వస్త్రములు, పట్టుచీరలు, చర్మాసనములు మా వాండ్రు నీకై తెత్తురు.

అస్తి మే శయనం దివ్యం త్వదర్థ ముపకల్పితమ్,
ఏహి తత్ర మయా సార్ధం పిబస్వ మధు మాధవీమ్. 3

నా శాక దివ్యమైన పాన్పుకలదు. అది నీకై ఏర్పాటు చేసితిని. రా! నాతో అచట వసంతిర్తుపుష్పముల మదిరను త్రావుము.

ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లు పలికెను.

[నాహం శక్యా త్వయా స్ప్రష్టుం నిషాదీనేవ బ్రాహ్మణీ
మా గమిష్యసి దుర్బుద్ధే గతిం దుర్గాంతరాంతరమ్.

ఓరి నీచ బుద్ధీ! బ్రాహ్మణస్త్రీని ఆటవికుడు తాకజాలనట్లు నన్ను నీవు తాకజాలవు. ఘోరాతిఘోరమైన గతికి పోకుము.

యత్ర గచ్ఛన్తి బహవః పరదారాభి మర్శకాః,
నరాః సంభిన్న మర్యాదాః కీటవచ్ఛ గుహాశయాః.

పరభార్యలను కోరు అనేకులు, మర్యాదలేనివారు గుహలలో పురుగులవలె నుండుచోటికి పోకుము.]

అపై ప్రేషీద్ రాజపుత్రీ మాం సురాహారీం తవా న్తికమ్,
పాన మాహర మే క్షిప్రం పిపాసా మేఽతి చాబ్రవీత్.

రాజపుత్రి సుదేష్ణ మదిర తెమ్మని నీకడకు పంపినది. నాకు పానీయము తెమ్మ. త్రాగు కోరిక మిక్కుటముగా నున్నదనియు పలికినది.

కీచక ఉవాచ - కీచకు డిట్లు పలికెను.

అన్యా భద్రే నయిష్యన్తి రాజపుత్ర్యాః ప్రతిశ్రుతమ్,
ఇత్యేతాం దక్షిణే పాణౌ సూతపుత్రః పరామృశత్.

రాజపుత్రికి ఇత్తు నన్న మదిరను మఱియొకరు కొనిపోవుదురు లెమ్మ అని కీచకుడు ఆమె కుడి చేతిని పట్టెను.

ద్రౌపద్యు వాచ - ద్రౌపది యిట్లు పలికెను.

యథై వాహం నాభిచరే కదాచిత్
పతీన్ మదాద్ వై మనసాపి జాతు,
తేనైవ సత్యేన వశీకృతం త్వాం
ద్రష్టాస్మి పాపం పరికృష్యమాణమ్.

నేను పతులవిషయమున మదముతో మనసుననైనను మర్యాద తప్పని దాననైనచో ఆ సత్యమే నిన్ను పట్టి బంధించి ఈడ్చుకొని పోవుచుండగా చూతును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను,

సతా మభి ప్రేక్ష్య విశాలనేత్రాం
జిఘృక్షమాణః పరిభర్త్సయన్తీమ్,
జగ్రాహ తాము త్తర వస్త్ర దేశే
సకీచక స్తాం సహసా క్షిప న్తీమ్.

వెడదకన్నులు గల ఆ ద్రౌపది అట్లు తూలనాడు చుండగా కీచకుడు ఆమెను పట్టుకొనఁ గోరుచు, విదలించికొట్టుచున్నను, ఆమె ఉత్తరీయమును పట్టుకొనెను.

ప్రగృహ్యమాణా తు మహాజవేన
ముహుర్వినిఃశ్వస్య చ రాజపుత్రీ
తయా సమాక్షిప్తతనుః స పాపః
పపాత శాఖీవ నికృత్తమూలః. 8

వాడట్లు పట్టుకొనుచుండగా ఆరాజపుత్రి నిట్టూర్పులు పుచ్చుచు మిక్కిలివడిగా విదలించి కొట్టెను. అంత నాపాపాత్ముడు మొదలు నరికిన చెట్టువలె గభాలున కూలెను.

సా గృహీతా విధున్వానా భూమా వాక్షిప్య కీచకమ్,
సభాం శరణ మాగచ్ఛద్ యత్ర రాజా యుధిష్ఠిరః. 9

అట్లు తన్ను పట్టిన కీచకుని నేలపై కూలద్రోసి వణకిపోవుచు రాజు, యుధిష్ఠిరుడు ఉన్న సభలోనికివచ్చి శరణు చొచ్చెను.

తాం కీచకః ప్రధావన్తీం కేశపాశే పరామృశత్,
అథైనాం పశ్యతో రాజ్ఞః పాతయిత్వా పదాదదీత్. 10

పరువెత్తుచున్న ఆమెను వెంటనంటి కీచకుడు జుట్టుపట్టి, రాజు చూచుచుండగా పడవైచి కాలితో తన్నెను.

తస్యాయోఽసౌ తదార్కేణ రాక్షసః సంనియోజితః
స కీచక మపోవాహ వాతవేగేన భారత. 11

ఓ భారతా! అంత సూర్యుడు పంపిన రాక్షసుడు వాయువేగముతో కీచకుని దూరముగా తూలనేసెను.

---

9. విధున్వానా - వణకిపోవుచున్నదై

స పపాత తదా భూమౌ రక్షోబల సమాహతః
విఘూర్ణమానో నిశ్చేష్ట శ్ఛిన్నమూల ఇవద్రుమః. 12

అంత నారక్కసి బలముతో దెబ్బతిన్న ఆ కీచకుడు మొదలు నరికిన చెట్టువలె దొరలుచు చేష్టలుడిగి నేలగూలెను.

[సభాయాం పశ్యతో రాజ్ఞో విరాటస్య మహాత్మనః,
బ్రాహ్మణానాం చ వృద్ధానాం క్షత్రియాణాం చ పశ్యతామ్,
తస్యాః పాదాభితప్తాయా ముఖాద్ రుధిర మాస్రవత్.

దొడ్డబుద్ధిగల విరాటుడు, వృద్ధులైన బ్రాహ్మణులు, క్షత్రియులు చూచుచుండగా కీచకుడు కాలదన్నిన ద్రౌపది మోము నుండి నెత్తురు స్రవించెను.

తాం దృష్ట్వా తత్ర తే సభ్యా హాహాభూతాః సమన్తతః,
న యుక్తం సూతపుత్రేతి కీచకేతి చ మానవాః,
కిమియం వధ్యతే బాలా కృపణా చాప్యబాన్ధవా,

అట్లున్న ద్రౌపదిని చూచి సభలో నున్న మానవులందరు అయ్యో! అయ్యో! అనుచు కీచకా! సూతపుత్రా ఇది తగదు. అయ్యయ్యో! వీడు ఈ దీనురాలిని, దిక్కులేని పిల్లను చంపునా! యేమి? అనుచుండిరి.

తాం చాసీనౌ దదృశతు ర్భీమసేన యుధిష్ఠిరౌ,
అమృష్యమాణౌ కృష్ణాయాః కీచకేన పరాభవమ్. 13

అపుడచట కూర్చున్న భీమసేనుడు, ధర్మరాజు కీచకుని వలన ద్రౌపదికి కలిగిన పరాభవమును చూచి క్రోధము వహించిరి.

తస్య భీమో వధం ప్రేప్సుః కీచకస్య దురాత్మనః,
దన్తైర్దన్తాం స్తదా రోషా న్నిష్పిపేష మహామనాః. 14

పాడుబుద్ధిగల ఆ కీచకుని వధింపగోరి గొప్పమనసుగల భీముడు రోషముతో పండ్లు పటపట కొరికెను.

ధూమచ్ఛాయా హ్యభజటాం నేత్రే చోచ్ఛ్రిత పక్ష్మణీ,
పస్వేదా భ్రుకుటీ చోగ్రా లలాటే సమవర్తత. 15

విప్పారిన రెప్పలుగల కనులపై పొగచారలు క్రమ్మెను. నొసటిపై చెమటతో నిండిన భయంకరమైన బొమముడి యేర్పడెను.

హస్తేన మమృజే చైవ లలాటం పర వీరహా,
భూయశ్చ త్వరితః క్రుద్ధః సహసోత్థాతు మైచ్ఛత. 16

శత్రువుల నంతమొందించు భీముడు పట్టరాని కోపముతో చేతితో నొసటిపై రుద్దుకొనెను. మరియు తొందరతో ఒక్కపెట్టున లేవనుంకించెను.

అథా వమృద్నా దఙ్గుష్ఠ మఙ్గుష్ఠేవ యుధిష్ఠిరః,
ప్రబోధన భయాద్ రాజా భీమం తం ప్రత్యషేధయత్, 17

అంత ధర్మరాజు కాలి బొట్టనవ్రేలిని చేతి బొట్టనవ్రేలితో నొక్కుచుండెను. తాము తెలిసిపోదుమన్న భయముతో భీముని వారించెను.

తం మత్త మివ మాతఙ్గం వీక్షమాణం వనస్పతిమ్,
స తమావారయామాస భీమసేనం యుధిష్ఠిరమ్. 18

మదించిన ఏనుగువలె మహావృక్షమును చూచుచున్న ఆ భీమసేనుని ధర్మరాజు ఇట్లు వారించెను.

ఆలోకయసి కిం వృక్షం సూద దారుకృతేన వై
యది తే దారుభిః కృత్యం బహిర్వృక్షా న్నిగృహ్యతామ్. 19

ఓయీ వలలా ! కట్టెల కొరకు ఈచెట్టును చూచుచున్నావేమి ? కట్టెలతో పనియున్నచో బయటి చెట్లులను కొట్టదగును.

---

17. అఙ్గుష్ఠ - మఙ్గుష్ఠేన - కాలిబొట్టనవ్రేలిని చేతిబొట్టనవ్రేలితో - సాధారణముగా ఇట్లగుట లోకమున చూచుచుందుము.

[యస్య చార్ద్రస్య వృక్షస్య శీతచ్ఛాయాం సమాశ్రయేత్,
న తస్య పర్ణం ద్రుహ్యేత పూర్వవృత్త మనుస్మరన్.

ఇది పచ్చిది, దీని చల్లని నీడ నాశ్రయించితిమి. మునుపటి వృత్తాంతమును తలచుచు మనము దీని ఆకునుకూడ త్రుంపరాదు.

ఇఙ్గితజ్ఞః సతు భ్రాతు స్తూష్ణీ మాసీద్ వృకోదరః,
భీమస్యతు సమారంభం దృష్ట్వా రాజ్ఞశ్చ చేష్టితమ్,
ద్రౌపద్యభ్యధికం క్రుద్ధా ప్రారుదత్ సా పునః పునః,
కీచకే నానుగమనాత్ కృష్ణా తామ్రాయతేక్షణా.

అన్నగారి ఇంగితమెరిగిన భీముడు ఊరకుండెను. కీచకుడు వెంటబడి తరుముటవలన భీముడు విజృంభించుట, ధర్మరాజు చేసిన సన్నను చూచి ద్రౌపది మరింతపెరిగిన కోపముతో, కనులెఱ్ఱవడినదై పెల్లుగా ఏడ్చెను.]

సా సభాద్వార మాసాద్య రుదతీ మత్స్య మబ్రవీత్,
అవేక్షమాణా సుశ్రోణీ పతీం స్తాన్ దీనచేతసః. 20

ఆ వనిత సభాద్వారమునుచేరి దీనమైన మనసులుగల భర్తలను చూచుచు విరాటునితో నిట్లు పలికెను.

ఆకార మభిరక్షన్తీ ప్రతిజ్ఞా ధర్మసంహితా,
దహ్యమానేవ రౌద్రేణ చక్షుషా ద్రుపదాత్మజా. 21

తన ఆకారమును ఎరుగరాకుండ ప్రతిజ్ఞా ధర్మమున కట్టుపడినదై అతిభయంకరమగు చూపుతో మండిపోవుచున్నదానివలెనై ఆ ద్రౌపది యిట్లుపలికెను.

[ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లు పలికెను.

ప్రజారక్షణ శీలానాం రాజ్ఞాం హ్యమిత తేజసామ్,
కార్యం హి పాలనం నిత్యం ధర్మే సత్యే చ తిష్ఠతామ్.

---

21. ప్రతిజ్ఞా ధర్మసంహితా - ప్రతిజ్ఞను పాలించుటయను ధర్మమునకు కట్టుబడి యున్నదై.

గొప్ప తేజస్సుకలిగి ప్రజలను రక్షించుటయే స్వభావముగా గల రాజులకు ధర్మముపై సత్యముపై నిలకడగలవారిని పాలించుటయే నిత్యమైన విధి.

స్వప్రజాయాం ప్రజాయాం చ విశేషం నాధిగచ్ఛతామ్,
ప్రియేష్వపి చ ద్వేష్యేషు సమత్వం యే సమాశ్రితాః.

అట్టి రాజులు తమ కన్నబిడ్డలయందును. ప్రజలయందును, భేదమును పాటింపరు. వారు ప్రియులయందును, ద్వేషింపదగినవారియందును సమభావమునే కలిగియుందురు.

వివాదేషు ప్రవృత్తేషు సమం కార్యానుదర్శినా,
రాజ్ఞా ధర్మాసనస్థేన జితౌ లోకావుభావపి.

ధర్మాసనమున కూర్చున్నరాజు వివాదములు వచ్చినపుడు సమముగా కార్యమును పరీక్షించినచో రెండులోకములను జయించును.

రాజన్ ధర్మాసనస్థోఽపి రక్షమాం త్వమనాగసీమ్,

ఓ రాజా ! ధర్మాసనమున నున్నాడవు. ఏపాప మెరుగని నన్ను రక్షింపుము.

అహం త్వన వగాధ్యస్తి కీచకేన దురాత్మనా,
పశ్యత స్తే మహారాజ హతా పాదేన దాసవత్.

ఏ తప్పునెరుగని నన్ను ఈ పాపాత్ముడు కీచకుడు నీవు చూచుచుండగా ఓ మహారాజా ! దాసినువలె కాలితో తన్నెను.

మత్స్యాధిప ప్రజారక్ష పితా పుత్రా నివౌరసాన్,

ఓ మత్స్యదేశపు ప్రభూ ! తండ్రి కన్నబిడ్డలనువలె ప్రజలను రక్షింపుము.

అస్త్వ ధర్మేణ కార్యాణి మోహాత్మా కురుతే నృపః,
అచిరాత్ తం దురాత్మానం వశే కుర్వన్తి శత్రవః.

మోహబుద్ధితో అధర్మముతో కార్యముల నాచరించు దురాత్ముడగు రాజును శీఘ్రముగా శత్రువులు ఆక్రమింతురు.

మత్స్యానాం కులజ స్త్వం హి తేషాం సత్యం పరాయణమ్,
త్వం కిలైవంవిధో జాతః కులే ధర్మ పరాయణే

నీవు మత్స్యులకులమున పుట్టితివి. వారికి సత్యమే ఆయువు పట్టు. అట్టి ధర్మమునందు పట్టుదలగల కులమున నీవంటివాడు పుట్టెనట

అతస్త్వాహ మభిక్రన్దే శరణార్థం నరాధిప,
త్రాహి మామద్య రాజేన్ద్ర కీచకాత్ పాపపూరుషాత్.

అందులకే అయ్యా! ఓ మహారాజా! నీతో మొర పెట్టు కొనుచున్నాను. ఓ రాజేంద్రా! ఈ పాపపురుషుడు కీచకునినుం నన్నీనాడు రక్షింపుము.

అనాథా మిహ మాం జ్ఞాత్వా కీచకః పురుషాధమః,
ప్రహరత్యేవ నీచాత్మా నతు ధర్మ మవేక్షతే.

నేనిచట దిక్కులేని దానననని ఈ పురుషాధముడు, నీచాత్ముడు కీచకుడు నన్ను బాధించుచునే యుండును. వాడు ధర్మ మెరుగడు

అకార్యాణా మనారంభాత్ కార్యాణా మను పాలనాత్,
ప్రజాసు యే సువృత్తా స్తే స్వర్గ మాయాన్తి భూమిపాః.

చేయరాని పనులకు పోకుండుట, చేయదగిన వానిని ప రక్షించుట అను పనులవలన ప్రజలలో ప్రతిష్ఠ పొందిన రాజులు స్వర్గమున కరుగుదురు.

కార్యాకార్య విశేషజ్ఞాః కామకారేణ పార్థివ,
ప్రజాసు కిల్బిషం కృత్వా నరకం యాన్త్యధో ముఖాః.

ఓ రాజా! కార్యము అకార్యము అను వాని విశేషము నెరిగియు ఇష్టమువచ్చినట్లు ప్రజల విషయమున పాపము చేయువా తలక్రిందులుగా వ్రేలుచు నరకమున కరుగుదురు.

నైవ ధర్మైర్నదానైర్న గురో రుపసేవయా,
ప్రాప్నువన్తి తథా ధర్మం యథా కార్యాను పాలనాత్.

కర్తవ్యమును చక్కగా పాలించుట వలన ధర్మమును పొందినట్లు ఇతరధర్మములచేత గాని, దానములచేత గాని, గురువునకు సేవ చేయుటచేత గాని పొందజాలరు.

క్రియాయామక్రియాయాంచ ప్రాపణే పుణ్యపాపయోః,
ప్రజాయాం సృజ్యమానాయాం పురా హ్యేత దుదాహృతమ్.

కార్యమేది, అకార్యమేది పుణ్యపాపములను పొందించునది యేది యనువిషయమున ప్రజలనుసృజించునపుడు మునుపు ఇది చెప్పబడినది.

ఏతద్ వో మానుషాః సమ్యక్ కార్యం ద్వన్ద్వతయా భువి,
అస్మిన్ సునీతే దుర్నీతే లభతే కర్మజం ఫలమ్.

ఇదిగో మానవులారా! భూమిపై మీరు చేయవలసిన కార్యము. ఇది రెండువిధములుగా నున్నది. చక్కగా చేయుట, పాడుచేయుట అను వానిని బట్టి మానవుడు కర్మఫలమును పొందును.

కల్యాణకారీ కల్యాణం పాపకారీ చ పాపకమ్,
తేన గచ్ఛతి సంసర్గం స్వర్గాయ నరకాయ వా.

శుభమైన పనులు చేయువాడు పుణ్యమును, పాపములు చేయువాడు పాపమును పొందును. దానితో నాతడు స్వర్గమో నరకమో పొందును.

సుకృతం దుష్కృతం వాపి కృత్వా మోహేన మానవః,
పశ్చాత్తాపేన తప్యేత స్వబుద్ధ్యా మరణం గతః.

మానవుడు అజ్ఞానముతో మంచిగాని చెడుకాని చేసి పిదప పశ్చాత్తాపముతో బాధపడినను తనబుద్ధితో తాను మరణము పొందినట్లే.

ఏవ ముక్త్వా పరం వాక్యం విససర్జ శతక్రతుమ్,
శక్రోఽప్యాపృచ్ఛ్య బ్రహ్మాణం దేవరాజ్యము పాలయత్.

బ్రహ్మదేవుడిట్లు ఉత్తమమైన పలుకు పలికి దేవేంద్రుని పంపెను. దేవేంద్రుడును. బ్రహ్మకడ సెలవు గైకొని దేవరాజ్యము పాలించెను.

యథోక్తం దేవదేవేన బ్రహ్మణా పరమేష్ఠినా
తథా త్వమపి రాజేన్ద్ర కార్యా కార్యే స్థిరో భవ.

పరమేష్ఠి, దేవదేవుడు అగు బ్రహ్మ పలికిన విధముగా నీవు కార్యము, అకార్యము అను వానియందు స్థిరుడవు కమ్ము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం విలపమానాయాం పాఞ్చాల్యాం మత్స్యపుంగవః,
అశక్తః కీచకం తత్ర శాసితుం బలదర్పితమ్,
విరాట రాజః సూతం తు సాన్త్వేనైవన్య వారయత్.

ఇట్లా ద్రౌపది దుఃఖముతో పలుమాట లాడుచుండగా విరాటుడు బలగర్వితుడైన కీచకుని శిక్షింపజాలని వాడై సామ మార్గముననే వానిని వారించెను.

కీచకం మత్స్యరాజేన కృతాగస మనిన్దితా,
నాపరాధాను రూపేణ దణ్డేన ప్రతిపాదితమ్.
పాఞ్చాల రాజస్య సుతా దృష్ట్వా సురసుతోపమా,
ధర్మజ్ఞా వ్యవహారాణాం కీచకం కృతకిల్బిషమ్,
పునః ప్రోవాచ రాజానం స్మరన్తీ ధర్మ ముత్తమమ్.

మత్స్యరాజిట్లు పాపమొనర్చిన కీచకునకు తప్పునకు తగిన శిక్ష వేయకుండుటను చూచి దోష మెరుగనిది, దేవతాకాంత వంటిది అగు పాంచాలరాజతనయ ఇట్టి వ్యవహారముల ధర్మముల నెరిగినది కావున ఉత్తమమైన ధర్మమును స్మరించుచు పాపకర్ముడగు కీచకుని గూర్చి రాజుతో మరల నిట్లు పలికెను.

సంప్రేక్ష్య చ వరారోహా సర్వాంస్తత్ర సభాసదః,
విరాటం చాహ పాఞ్చాలీ దుఃఖేనావిష్ట చేతనా.

ఆ వనిత సభలో నున్నవారందరిని చూచి దుఃఖము ఆవేశించిన హృదయముతో విరాటరాజుతో మరియు నిట్లు పలికెను.]

యేషాం వైరీ న స్వపితి షష్ఠేఽపి విషయే వసన్,
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః పదావధీత్. 22

ఎవరి శత్రువు ఆరు దేశముల కవతలనుండియు నిద్రింప జాలడో అట్టివారి భార్యను, అభిమానవతిని నన్ను ఈ సూతపుత్రుడు కాలితో తన్నెను.

యే దద్యుర్నచ యాచేయుర్బ్రహ్మణ్యాః సత్యవాదినః
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః పదావధీత్. 23

ఇచ్చుటయేకాని పుచ్చుకొనుట యెరుగరు బ్రహ్మవేత్తలు. సత్యమునే పలుకువారు అట్టివారి భార్యను, మానినిని నన్ను కీచకుడు కాలితో తన్నెను.

యేషాం దున్దుభి నిర్ఘోషో జ్యాఘోషః శ్రూయతేఽనిశమ్,
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః పదావధీత్. 24

ఎవరి అల్లెత్రాటి మ్రోత దుందుభి మ్రోత వలె ఎల్లపుడు విన వచ్చునో అట్టివారి భార్యను అభిమానవతిని నన్ను కీచకుడు కాలితో తన్నెను.

---

22. షష్ఠేఽపి విషయే న స్వపితి - మధ్య అయిదు దేశములు వ్యవధానమున్నను నిద్రింపడు. పాండవులు సార్వభౌములుకనుక అని భావము లేదా అయిదు ఇంద్రియముల దృష్ట్యా ఆరవవిషయమనగా మనస్సు మనస్సునకు మాత్రమే సంబంధించిన కలలు, కోరికలు అనువాని యందును సుఖముగా నుండ జాలడని భావము.

యే చ తేజస్వినో దాన్తా బలవన్తోఽతి మానినః,
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః పదావధీత్. 25

వారు గొప్ప తేజస్సు కలవారు, ఇంద్రియనిగ్రహము కలవారు, బలవంతులు, గొప్ప అభిమానము కలవారు. అట్టివారి పత్నిని నన్ను కీచకుడు కాలదన్నెను.

సర్వలోక మిమం హన్యుః ధర్మ పాశసితాస్తు యే.
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః పదావధీత్. 26

ధర్మ పాశమున కట్టుపడి యుండిరి కాని లేనిచో ఈపాటికి ఈ లోకము సంతతిని నాశనము చేసి యుండెడివారు. అట్టివారి భార్యను నన్ను సూతపుత్రుడు కాలదన్నెను.

శరణం యే ప్రపన్నానాం భవన్తి శరణార్థినామ్,
చరన్తి లోకే ప్రచ్ఛన్నాః క్వను తేఽద్య మహారథాః. 27

మీరే గతియని శరణుచొచ్చినవారికి రక్షకులై యుందురు. లోకమున అజ్ఞాతముగా తిరుగుచుందురు. అట్టి మహారథులు నేడెందు బోయిరో కదా!

కథం తే సూతపుత్రేణ వధ్యమానాం ప్రియాం సతీమ్,
మర్షయన్తి యథా క్లీబా బలవన్తోఽమితౌజసః. 28

తమ ప్రియభార్యను సూతపుత్రుడు హింసించుచుండగా మహాబలవంతులు, గొప్ప గుండె బలముగలవారు అయియు, పేడి వాండ్రవలె ఎట్లు సహించుచున్నారు?

క్వను తేషా మమర్షశ్చ వీర్యం తేజశ్చ వర్తతే,
న పరీప్సన్తి యే భార్యాం వధ్యమానాం దురాత్మనా. 29

వారి క్రోధము, వీర్యము, తేజస్సు ఎందుబోయినవి? దురాత్ముడు భార్యను పీడించుచుండగా రక్షింపగోరకున్నారు.

మయాఽత్ర శక్యం కిం కర్తుం విరాటే ధర్మదూషకే,
యః పశ్యన్ మాం మర్షయతి ధవ్యమానా మనాగసమ్. 30

ఏ పాప మెరుగని నన్ను హింసించుచుండగా చూచుచు సహించియున్నాడు. ఇట్లు ఈ విరాటుడు ధర్మమునకు ద్రోహము చేయుచుండగా నేనిందు చేయగలిగినది యేమి?

న రాజా రాజవత్ కించిత్ సమాచరతి కీచకే,
దస్యూనామివ ధర్మస్తే న హి సంసది శోభతే. 31

ఈ రాజు రాజుచేయవలసిన దానిని కీచకుని యందు కొంచెమైనను చేయకున్నాడు. ఇట్టి దొంగల ధర్మమువంటిది సభలో రాణింపదు.

నాహమేతేన యుక్తం వై హన్తుం మత్స్య తవాన్తికే,
సభా సదోఽత్ర పశ్యన్తు కీచకస్య వ్యతిక్రమమ్. 32

ఓ విరాట రాజా! నీ ఎదుట వీడిట్లు నన్ను తన్నుట న్యాయమా? ఓ సభాసదులారా! ఈ కీచకుని నిరంకుశత్వమును చూడుడు.

కీచకో న చ ధర్మజ్ఞో నచ మాత్స్యః కథంచన,
సభా సదోఽ ప్యధర్మజ్ఞా య ఏనం పర్యు పాసతే 33

కీచకుడు ధర్మ మెరుగడు. ఈ విరాటుడును ధర్మ మెరుగని వాడే. ఇట్టి రాజును కొలిచియున్న ఈ సభా సదులును ధర్మము నెరుగని వారే.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవంవిధై ర్వచోభిః సా తదా కృష్ణాశ్రు లోచనా
ఉపాలభత రాజానం మత్స్యానాం వర వర్ణినీ. 34

ఆ స్త్రీరత్నము ద్రౌపది కన్నీరొడ్చుచు ఈ విధమైన మాటలతో మత్స్యులరాజగు విరాటుని దూషించెను.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

పరోక్షం నాభిజానామి విగ్రహం యువయో రహమ్,
అర్థతత్త్వ మవిజ్ఞాయ కిం ను స్యాత్ కౌశలం మమ. 35

చాటున జరిగిన మీయిరువురి కలహము స్వరూపము నాకు తెలియదు. విషయము పూర్తిగా ఎరుగక నేను చేయగలిగిన దేమి!

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతస్తు సభ్యా విజ్ఞాయ కృష్ణాం భూయోఽభ్యపూజయన్,
సాధు సాధ్వితి చాప్యాహుః కీచకం చ వ్యగర్హయన్. 36

అంత సభ్యులు విషయమంతయు నెఱిగి ద్రౌపదిని మిక్కిలిగా కొనియాడిరి. మేలు మేలని పలికిరి కీచకుని నిందించిరి.

సభ్యా ఊచుః - సభ్యు లిట్లు పలికిరి.

యస్యేయం చారు సర్వాఙ్గీ భార్యా స్యాదాయ తేక్షణా,
పరో లాభస్తు తస్య స్యా న్న చ శోచేత్ కథంచన. 37

ఇంత మనోజ్ఞమైన రూపము, విశాలమైన కనులు గల ఈ కాంతను భార్యగా పొందినవాడు గొప్పలాభమే పొందవలయును. కాని ఎన్నటికిని దుఃఖపడరాదు

[యస్యా గాత్రం శుభం పీనం ముఖం జయతి పఙ్కజమ్,
గతి ర్హాసం స్మితం కున్దం సైషా నార్హతి పద్వధమ్,

ఈమె దేహము శుభముగా పుష్టిగా నున్నది. మోము పద్మమును గెలుచుచున్నది. నడక హంసను, నవ్వు మల్లె మొగ్గను గెలుచుచున్నవి. అట్టి యీమె కాలితాపు పడవలసినది కాదు.

ద్వాత్రింశద్ దశనా యస్యాః శ్వేత మాంస నిబన్ధనాః
స్నిగ్ధాశ్చ మృదవః కేశాః సైషా నార్హతి పద్వధమ్.

ఈమె ముప్పదిరెండు పండ్లును తెల్లగా చిగుళ్ళలో చక్కగా అమరి యున్నవి. ఈమె జుట్టు నిగనిగలాడుచు మెత్తగా నున్నది. ఇట్టి యీమె కాలితాపు పొందరాదు.

పద్మం చక్రం ధ్వజం శఙ్ఖం ప్రాసాదో మకర స్తథా,
యస్యాః పాణితలే సన్తి సైషా నార్హతి పద్వధమ్.

ఈమె అరచేతియందు పద్మము, చక్రము, ధ్వజము, శంఖము, భవనము, మొసలి అను రేఖ లున్నవి. ఈమె కాలితాపు పడరానిది.

ఆవర్తాః ఖలు చత్వారః సర్వే చైవ ప్రదక్షిణాః,
సమం గాత్రం శుభం స్నిగ్ధం యస్యా నార్హతి పద్వధమ్.

కుడివైపుగా చుట్టివచ్చిన నాలుగు సుడులున్నవి. దేహము సమముగా శుభముగా నిగనిగ లాడుచునున్నది. ఇట్టి యీమె కాలితాపు పడరానిది.

అచ్ఛిద్ర హస్తపాదా చ అచ్ఛిద్రదశనా చ యా,
కన్యా కమల పత్రాక్షీ కథ మర్హతి పద్వధమ్.

చేతులు కాళ్ళు, దంతములు కుదురుగా చక్కగా అమరి యున్నవి. కన్నులు కమలముల రేకులవలె నున్నవి. అట్టి ఈ కన్యను కాలితో ఎట్లు తన్నగలడు. ?

సేయం లక్షణ సంపన్నా పూర్ణచన్ద్రనిభాననా,
సురూపిణీ సువదనా సేయం యోగ్యా పదావధమ్.

ఈమె యందు మంచిలక్షణము లన్నియు నిండుగా నున్నవి. ఈమె మోము నిండుచంద్రుని బోలి యున్నది. చక్కని రూపము, చక్కని మోము గల యీమె కాలితాపు పడరాదు.

దేవదేవీవ సుభగా శక్రదేవీవ శోభనా
అప్సరా ఇవ సారూప్యా న్నేయం యోగ్యా పదా వధమ్.

దేవతల దేవివలె సౌభాగ్యము, ఇంద్రుని దేవివలె గొప్పతనము కలిగి, మంచి రూపము:డుట వలన అప్సరస వలె నున్న యీమెను కాలితో తన్న వచ్చునా !]

న హీదృశీ మనుష్యేషు సులభా వరవర్ణినీ,
నారీ సర్వానవద్యాఙ్గీ దేవీం మన్యామహే వయమ్. 38

ఇంత గొప్ప దేహకాంతిగల ఈమె మనుష్యులలో సాధారణముగా ఉండునది కాదు. ఇంతగా లోపములేని అన్ని అవయవములతో నున్న ఈమెను దేవకాంతగా భావించుచున్నాము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం సంపూజయన్త స్తే కృష్ణాం ప్రేక్ష్య సభాసదః,
యుధిష్ఠిరస్య కోపాత్ తు లలాటే స్వేద ఆగమత్. 39

సభాసదులందరు ద్రౌపదినిచూచి యిట్లు గొప్పగా భావించిరి. ధర్మరాజునకు మాత్రము కోపమువలన నుదుటిపై చెమట గ్రమ్మెను.

[సా వినిఃశ్వస్య సుశ్రోణీ భూమావన్తర్ముఖీ స్థితా
తూష్ణీ మాసీత్ తదా దృష్ట్వా వివక్షన్తం యుధిష్ఠిరమ్.

ఆయమ నిట్టూర్చుచు నేలవైపు చూచుచు ఏదో పలుకగోరిన ధర్మరాజును గాంచి ఊరకుండెను].

అథాబ్రవీ ద్రాజపుత్రీం కౌరవ్యో మహిషీం ప్రియామ్,
గచ్ఛ సైరంధ్రి మాత్రస్థాః సుదేష్ణాయా నివేశనమ్. 40

అంత ధర్మరాజు తమ ప్రియమహిషి ద్రౌపదితో ఇట్లు పలికెను. 'సైరంధ్రి' వెళ్లు ! ఇక్కడ నిలువకు ! సుదేష్ణ భవనమున కరుగుము.

భర్తార మను రుద్ధన్త్యః క్లిశ్యన్తే వీరపత్నయః,
శుశ్రూషయా క్లిశ్యమానాః పతిలోకం జయన్త్యుత. 41

వీరులపత్నులు భర్త అడుగుజాడలలో నడచునప్పుడు కష్టముల పాలగుదురు. శుశ్రూషతో నలుగు వారు పతిలోకమును చేరుదురు.

---

40. మాత్రస్థా - అత్ర, మా, స్థాః - ఇక్కడ నిలువకు.

మన్యేవ కాలం క్రోధస్య పశ్యన్తి పతయ స్తవ
తేన త్వాం నాభి ధావన్తి గన్ధర్వాః సూర్యవర్చసః. 42

నీ పతులు సూర్యునివంటి తేజముగల గంధర్వులు చూచు చునే యుందురు. బహుశః ఇది కోపమునకు తగు సమయము కాదను కొందురు. కావుననే నీకయి పరువెత్తుకొని రాలేదు.

శ్రూయన్తాం తే సుకేశాన్తే మోక్షధర్మాశ్రయాః కథాః,
యథా ధర్మః కులస్త్రీణాం దృష్టో ధర్మానురోధనాత్.

ఓ వనితా! ధర్మము ననుసరించుటవలన కులస్త్రీలు పొందు ధర్మమెట్టిదో వానినిగూర్చి మోక్షధర్మము గూర్చిన కథలు విన వచ్చుచున్నవి.

నాస్తి కశ్చిత్ స్త్రియా యజ్ఞో న శ్రాద్ధం నాప్యుపోషణమ్,
యా చ భర్తరి శుశ్రూషా సా స్వర్గాయాభి జాయతే.

స్త్రీ యజ్ఞము, శ్రాద్ధము, ఉపవాసము మున్నగునవి చేయ నక్కరలేదు. భర్తశుశ్రూషయే ఆమెను స్వర్గము నందించును.

పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే,
పుత్రస్తు స్థావిరే భావే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి.

బాల్యమున తండ్రి, యౌవనమున భర్త; ముసలితనమున పుత్రుడు స్త్రీని రక్షించును. కావున స్త్రీకి స్వాతంత్ర్యము లేదు.

భర్తౄన్ ప్రతి యథా పత్న్యో న క్రుధ్యన్తి కదాచన,
బహుభిశ్చ పరిక్లేశై రవజ్ఞాతాశ్చ శత్రుభిః,
అనన్యభావ శుశ్రూషాః పుణ్యలోకం వ్రజన్త్యుత.

అనేక క్లేశములను కలిగించి శత్రువులు అవమానించినను పత్నులు భర్తల విషయమున ఎన్నటికిని కోపింపరు. చెదరని మనో భావముతో సేవచేసి పుణ్యలోకమున కరుగుదురు.

న క్రుద్ధాన్ ప్రతియాయాద్ వై పతీం స్తే వృత్రహా అపి.

నీ భర్తలు కోపించినచో వారిమీదికి దేవేంద్రుడు కూడ రాజాలడు.

యది తే సమయః కశ్చిత్ కృతో హ్యాయతలోచనే,
తం స్మరస్వ క్షమా శీలే క్షమా ధర్మో హ్యనుత్తమః.

ఓ విశాలనేత్రా! ఒకవేళ నీభర్తలు ఏదైన ప్రతిజ్ఞ పట్టియుండిరేమో! ఓర్పునకు పెన్నిధానమైన ఓ వనితా! గుర్తుతెచ్చుకొనుము. ఓర్పును మించిన ధర్మములేదు,

క్షమా సత్యం క్షమా దానం క్షమా ధర్మః క్షమా తపః.
క్షమావతా మయం లోకః పరలోకః క్షమావతామ్.

ఓర్పే సత్యము, ఓర్పే దానము, ఓర్పే ధర్మము, ఓర్పే తపము. క్షమకలవారికే ఈలోకము. క్షమగలవారికే పరలోకము.

ద్వ్యంశినో ద్వాదశాఙ్గస్య చతుర్వింశతి పర్వణః
కః షష్టిత్రి శతారస్య మాసోన స్యాత్క్షమీ భవేత్,

రెండు అంశములు, పండ్రెండు అంగములు, ఇరువదినాలుగు కణుపులు, మూడువందల అరువది అరలుగల దానిలో నెల తక్కువ యుండగా ఓర్పు నెవ్వడు కోల్పోవును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

ఇతీవ ముక్త్వా తిష్ఠన్తీం పునరేవాహ ధర్మరాట్.

ధర్మజుడు, ఇట్లుపలుకగా నిలిచియున్న ద్రౌపదితో మరియు నిట్లనెను.]

1. ఈశ్లోకమున మన అజ్ఞాతవాసము సంవత్సరకాలము, ఒక్క నెల మాత్రమే మిగిలియున్నది. ఆ కొంచెమునందు మన మోపికపట్టవలయునన్న భావము గూఢముగా కలదు. రెండు అంశములు - అయనములు, పండ్రెండు అంగములు - నెలలు ఇరువదినాలుగు కణుపులు - పక్షములు. మూడువందల అరువది అరలు - దినములు,

అకాలజ్ఞాసి సైరంధ్రి శైలూషీవ విరోదిషి,
విఘ్నం కరోషి మత్స్యానాం దీవ్యతాం రాజసంసది. 43

ఓ సైరంధ్రీ సమయాసమయములు తెలియకున్నావు. నట్టువకత్తెవలె పెద్దగా ఏడ్చుచున్నావు. రాజసభలో జూదమాడుచున్న విరాటరాజులకు విఘ్నము కలిగించుచున్నావు.

గచ్ఛ సైరంధ్రి గన్ధర్వాః కరిష్యన్తితవ ప్రియమ్,
వ్యపనేష్యన్తి తే దుఃఖం యేన తే విప్రియం కృతమ్. 44

సైరంధ్రీ! వెళ్ళు. గంధర్వులు నీకు ప్రియ మొనరింతురు. నీకు కీడుచేసి బాధపెట్టిన వానిని వారు రూపుమాపుదురు.

సైరంధ్ర్యువాచ - సైరంధ్రి ఇట్లు పలికెను.

అతీవ తేషాం ఘృణినాం మర్థేఽహ ధర్మచారిణీ,
తస్య తస్యైవ తే వధ్యా యేషాం జ్యేష్ఠోఽక్షదేవితా. 45

నేను మిక్కిలి దయగలవారి ధర్మచారిణిని వారిలో పెద్దవాడు ఎప్పుడు జూదమాడుచుండును. కావున ఎల్లవాడును వారిని హింసించువాడే.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను

ఇత్యుక్త్వా ప్రాద్రవత్ కృష్ణా సుదేష్ణాయా నివేశనమ్,
కేశాన్ ముక్త్వాచ సుశ్రోణీ సంరంభాల్లోహితేక్షణా. 46

అని పలికి కృష్ణ సుదేష్ణ యింటికి పరువెత్తెను. ఆమె కేశములు చెదరిపోయెను. ఆవేగముచేత కన్నులెఱ్ఱవడెను.

శుశుభే వదనం తస్యా రుదత్యాః సుచిరం తదా,
మేఘలేఖా వినిర్ముక్తం దివీవ శశి మణ్డలమ్. 47

43. శైలూషీవ - నటివలె సిగ్గులేనిదానవై.

చాలసేపు ఏడ్చుచున్న ఆమె మోము, ఆకసమున మబ్బు తెర తొలగిన చంద్రబింబమువలె మిక్కిలిగా ప్రకాశించెను.

[పాంసు కుణ్ఠిత సర్వాఙ్గీ గజరాజవధూ రివ,
ప్రతస్థే నాగనాసోరూ ర్భర్తు రాజ్ఞాయ శాసనమ్.

ఏనుగులరేని వధువువలె దుమ్ము కొట్టుకున్న మొత్తము వొడలు గలదియై ఏనుగు తొండముల వంటి తొడలుగల ఆ ద్రౌపది భర్తృశాసనమును పాటించి బయలుదేరెను.

విముక్తా మృగశాబాక్షీ నిరస్తరస మోధరా,
ప్రభా నక్షత్ర రాజస్య కాలమేఘై రివావృతా.

లేడిపిల్ల కనులవంటి కనులు బిగువైన వక్షస్సు కలగిన ఆ ద్రౌపది కారుమేఘములు క్రమ్మి విడిచిన చంద్రుని ప్రభవలె నుండెను.

యస్యా హ్యర్థే పాణ్డవేయా స్త్యజేయు రపి జీవితమ్,
తాం తే దృష్ట్వా తథా కృష్ణాం క్షమన్తో ధర్మచారిణః,
సమయం నాతివర్తన్తే వేలామివ మహోదధిః.

ఆమెకొఱకు పాండవులు ప్రాణములనైన విడుతురు. అయినను ధర్మమును పాటించు ఆ క్షమామూర్తులు అట్టి ద్రౌపదిని చూచియు సముద్రము చెలియలికట్టను దాటని విధమున పట్టిన ప్రతిజ్ఞను దాటరైరి.]

సుదేష్ణోవాచ - సుదేష్ణ యిట్లు పలికెను.

కస్త్వావధీద్ వరారోహే కస్మాద్ రోదిషి శోభనే,
కస్యాద్య న సుఖం భద్రే కేన తే విప్రియం కృతమ్. 48

ఓ వరారోహా ! నిన్నెవ్వరు కొట్టిరి ? ఏల ఏడ్చెదవు ? ఈరోజుతో సుఖమెవ్వనికి తీరినది, నీ కపకారము చేసిన దెవ్వరు ?

[కిమిదం పద్మసంకాశం సుదన్త్యోష్ఠాక్షి నాసికమ్,
రుదన్త్యా అపమృష్టాస్రం పూర్ణేన్దు సమవర్చసమ్

బింబోష్ఠం కృష్ణతారాభ్యా మాకర్ణాన్తరుచిర ప్రభమ్,
నయనాభ్యా మజిహ్మాభ్యాం ముఖం తే ముఞ్చతే జలమ్.

ఇది యేమి ? పద్మమువంటిది, మంచి పలువరుసయు, కనుముక్కుతీరును, నిండుచందురుని కాంతివంటి కాంతియు, దొండపండువంటి క్రింది పెదవియుకలిగి మిక్కిలి మనోహరమైన శోభగల నీమోము వక్రభావములేని నల్లని కనుపాపలుగల నేత్రములనుండి కన్నీటిని వదలుచున్నది ?

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

తాః నిఃశ్వ స్యాబ్రవీత్ కృష్ణా జాన న్నీనామ పృచ్ఛసి,
భ్రాత్రీ త్వం మామను ప్రేష్య కిమే వం త్వం వికత్థసే.

[ద్రౌపది నిట్టూర్చి ఆమెతో ఇట్లనెను. 'తెలిసి తెలిసి వన్ను అడిగెద వన్నమాట ! నీతమ్మునికడకు నన్నుపంపి ఇట్టీ ప్రలాపము లేల ?']

ద్రౌపద్యువాచ - ద్రౌపది ఇట్లు పలికెను.

కీచకో మావధీ త్తత్ర సురాహారీం గతాం తవ,
సభాయాం పశ్యతో రాజ్ఞో యథైవ విజనే వనే. 49

నీకై మద్యము తేబోయిన నన్ను కీచకుడు రాజు చూచుచుండగా మనుజులులేని అడవియందువలె, నిండుసభలో తన్నెను.

సుధేష్ణో ఉవాచ - సుదేష్ణ యిట్లు పలికెను.

ఘాతయామి సుకేశాన్తే కీచకం యది మన్యసే,
యోఽసౌ త్వాం కామసమ్మత్తో దుర్లభా మవమన్యతే. 50

ఓ సుందరీ ! నీవు ఊఁ అన్నచో ఒడలెరుగని కామముతో పొందశక్యముకాని నిన్ను అవమానించిన ఆ కీచకుని చంపింతును.

సైరంధ్ర్యువాచ - సైరంధ్రి యిట్లు పలికెను.

అన్యే చైనం వధిష్య న్తి యేషా మాగః కరోతి సః,
మన్యే చైవాద్య సువ్య క్తం యమలోకం గమిష్యతి. 51

వాడెవరికి అపకారమొనర్చెనో వారే వానిని మట్టుపెట్టుదురు. బహుశః ఈనాడే వాడు యమలోకమున కరుగునని నాకనిపించుచున్నది.

భ్రాతుః ప్రయచ్ఛ త్వరితా జీవశ్రాద్ధం త్వమద్యవై,
సుదృష్టం కురువై చైనం నాసూన్ మన్యే ధరిష్యతి.

త్వరత్వరగా తమ్మునికి నేడే జీవ శ్రాద్ధమును పెట్టుకొనుము. కడసారి గట్టిగా చూచుకొనుము, ప్రాణములు నిలుచు నమ్మకములేదు.

తేషాం హి మమ భర్తౄణాం పఞ్చానాం ధర్మచారిణామ్.
ఏకో దుర్ధర్షణోఽత్యర్థం బలే చాప్రతిమో భువి.

ఆ నా ధర్మప్రవృత్తిగల ఐదుగురు భర్తలలో ఒకడు మిక్కిలి అసాధ్యుడు కలడు. బలమున అతనికి చాలినవారు భూమిలో లేరు.

నిర్మనుష్య మిమం లోకం కుర్యాత్ క్రుద్ధో నిశా మిమామ్,
న చ సంక్రుధ్యతే తావద్ గన్ధర్వః కామరూప ధృక్.

అతడు క్రోధము వహించినచో ఈ రాత్రికి రాత్రి ఈలోకమంతటిని మనుజుడన్నమాట లేకుండ చేయును. అతడు గంధర్వుడు, కోరిన రూపము పొందగలవాడు. ఇప్పటికి కోపము రాలేదు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

సుదేష్ణా మేవ ముక్త్వాతు సైరంధ్రీ దుఃఖమోహితా,
కీచకస్య వధార్థాయ వ్రతదీక్షా ముపాగమత్.

సైరంధ్రి సుదేష్ణతో ఇట్లని దుఃఖముతో కుమిలి పోవుచు కీచకుని వధకై వ్రతదీక్షను పూనెను.

అభ్యర్థితా చ నారీభి ర్మానితా చ సుదేష్ణయా,
నచ స్నాతి న చాశ్నాతి న పాంసూన్ పరిమార్జతి,
రుధిరక్లిన్న వదనా బభూవ రుదితేక్షణా.

స్త్రీ లెంత బతిమాలినను, సుదేష్ణ ఎంతగా లాలించినను స్నానము చేయలేదు. అన్నము తినలేదు. ఒంటిపైనున్న దుమ్మును కూడ దులుపుకొనలేదు. ఏడుపు కన్నులతో, రక్తపు మరకలు గల మోముతో వట్లే యుండెను.

తాం తథా శోకసంతప్తాం దృష్ట్వా ప్రరుదితాం స్త్రియః
కీచకస్య వధం సర్వా మనోభి శ్చ కశంసిరే.

అట్లు దుఃఖముతో ఉడికిపోవుచు పెద్దగా నేడ్చుచున్న ఆమెను గాంచి స్త్రీలందరు మనస్సులలో కీచకుని చావును భావించిరి.

జనమేజయ ఉవాచ - జనమేజయు డిట్లు పలికెను.

ఆహో దుఃఖతరం ప్రాప్తా కీచకేన పదా హతా,
పతివ్రతా మహాభాగా ద్రౌపదీ యోషితాం వరా.

అయ్యో! పాపము! పతివ్రత, పుణ్యాత్మ, స్త్రీలలో రత్నము అయిన ద్రౌపది కీచకుని తాపువడి ఎంత దుఃఖము పొందినది!

దుఃశలాం మానయన్తీ యా భర్తౄణాం భగినీం శుభామ్,
నాశపత్ సింధురాజం తం బలాత్కారేణ వాహితా.

ఆ నీచుడు సైంధవుడు బలాత్కారముగా కొనిపోయినను తన భర్తల చెలియలు దుస్సలను మన్నించుచు వానిని శపింపకుండెను.

కిమర్థం ధర్షణాం ప్రాప్తా కీచకేన దురాత్మనా,
నాశపత్ తం మహాభాగా కృష్ణా పాదేన తాడితా.

దురాత్ముడగు కీచకుడు కాలదన్నగా ఏటువడిన ఆ పుణ్యాత్మురాలు వాని నేల శపింపకుండెను?

తేజోరాశి రియం దేవీ ధర్మజ్ఞా సత్యవాదినీ,
కేశపక్షే పరామృష్టా మర్ష యిష్యత్యశక్తవత్.

వెలుగులప్రోవు, ధర్మముల నెఱిగినది సత్యమే పలుకునది అగు ఆ దేవి నీచుడు జుట్టు పట్టుకొనగా ఏమియు చేయులేని దానివలె సహించినదేమి ?

నైతత్ కారణ మల్పం హి శ్రోతుకామోఽస్మి సత్తమ,
కృష్ణాయాస్తు పరిక్లేశా న్మనో మే దూయతే భృశమ్.

ఆ కారణమేదో చిన్నదిగా యుండదు. ఓ పూజ్యుడా ! నేను దానిని వినవలతును. ద్రౌపది పడినపాటు వలన నా హృదయము మిక్కిలిగా వేదన పొందుచున్నది.

కస్య వంశే సము ద్భూతః సచ దుర్లలితో మునే,
బలోన్మత్తః కథంచాసీ చ్ఛ్యాలో మాత్స్యస్య కీచకః.

ఓ మునీ ! మత్స్యరాజు బావమరిది, దుష్ట కీచకుడు ఏ వంశమున పుట్టెను ? ఇంతగా బలోన్మత్తు డెట్లాయెను ?

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

త్వదుక్తోఽయ మనుప్రశ్నః కురూణాం కీర్తివర్ధన,
ఏతత్ సర్వం తథా వక్ష్యే విస్తరేణైవ పార్థివ.

ఓ రాజా ! కురుకుల కీర్తివర్ధనుడా ! నీవడిగినది చక్కని ప్రశ్నము. ఇది యంతయు విస్తరముగనే చెప్పెదను.

బ్రాహ్మణ్యాం క్షత్రియాజ్జాతః సూతో భవతి పార్థివ,
ప్రాతిలోమ్యేన జాతానాం స హ్యేకో ద్విజ ఏవతు.

ఓ రాజా ! క్షత్రియుని వలన బ్రాహ్మణస్త్రీకి పుట్టిన పుత్రుడు సూతుడగును. ఇట్లు విలోమముగా పుట్టిన వారిలో అతడు ద్విజుడే యగును.

రథ కార మితీమం హి క్రియాయుక్తం ద్విజన్మనామ్,
క్షత్రి యాదవరం వైశ్యాదీ విశిష్టమితి చక్షతే.

ద్విజులలో ఈతనిని రథమునడపు పనివాడందురు. ఈతడు క్షత్రియుని కంటె తక్కువ, వైశ్యుని కంటె ఎక్కువ అని భావింతురు.

సహ సూతేన సంబంధః కృతపూర్వో నరేశ్వరైః
తథాపి తైర్మహీపాల రాజశబ్దో న లభ్యతే.

పూర్వము రాజులు సూతునితో సంబంధము చేసికొనిరి. అయినను సూతులకు రాజ నామమును పొందరైరి.

తేషాం తు సూత విషయః సూతానాం నామతః కృతః,
ఉపజీవ్య చ యత్ క్షేత్రం లబ్ధం సూతేన యత్ పురా,
సూతానా మధిపో రాజా కేకయో నామ విశ్రుతః.

సూతులపేరుమీద ఆ రాజ్యమునకు సూతదేశమని పేరు వచ్చినది. పూర్వమొక సూతుడు దానిని ఒక రాజును సేవించి పొందెను. ఆ సూతుల రాజు కేకయుడను వాడొకడుండెను.

రాజ కన్యా సముద్భూతః సారథ్యేఽను పమోఽభవత్,
పుత్రా స్తస్య కురు శ్రేష్ఠ మాలవ్యాం జజ్ఞిరే తదా.

అతడు రాజకన్యకు పుట్టినవాడు. రథము నడపుపనిలో సాటిలేనివాడు. ఆతనికి మాలవ రాజకన్య యందు పుత్రులు పుట్టిరి.

తేషా మతిబలో జ్యేష్ఠః కీచకః సర్వజిత్ ప్రభో,
ద్వితీయాయాం తు మాలవ్యాం చిత్రా వ్యావరజాఽభవత్,
తాం సుదేష్ణేతి వై ప్రాహు ర్విరాట మహిషీం ప్రియామ్.

వారిలో పెద్దవాడు మిక్కిలిబలము గలవాడు. అందరిని జయించినవాడు అగు కీచకుడు. మరియొక మాలవి యందు వానికి చెల్లెలై 'చిత్ర' అను నామె పుట్టెను. ఆమె యే విరాటుని పట్టపు రాణి. ఆమెను సుదేష్ణ యనియు నందురు.

తాం విరాటస్య మాత్స్యస్య కేకయః ప్రదదౌ ముదా,
సురథాయాం మృతాయాం తు కౌసల్యాం శ్వేతమాతరి.

కోసల రాజకన్యక, శ్వేతుని తల్లి సురథ అను విరాటుని మొదటి భార్య చనిపోగా కేకయరాజు మత్స్యదేశరాజగు విరాటునకు సుదేష్ణను ముదముతో నిచ్చెను.

సుదేష్ణాం మహిషీం లబ్ధ్వా రాజా దుఃఖ మపానుదత్,
ఉత్తరం చోత్తరాం చైవ విరాటాత్ పృథివీపతే,
సుదేష్ణా సుషువే దేవీ కైకేయీ కులవృద్ధయే.

సుదేష్ణను పట్టపురాణిగా పొంది రాజు దుఃఖమును మాపుకొనెను. ఆ సుదేష్ణ కులవృద్ధికై విరాటుని వలన ఉత్తరుడు, ఉత్తర అను పుత్రులను పొందెను.

మాతృష్వస్ర సుతాం రాజన్ కీచకస్తామనిన్దితామ్,
సదా పరి చరన్ ప్రీత్యా విరాటే న్యవసత్ సుఖీ.

ఓ రాజా! కీచకుడు తల్లి చెల్లెలి బిడ్డయగు సుదేష్ణను ప్రీతితో సేవించుచు విరాటనగరమున సుఖముగా నివసించుచుండెను.

భ్రాతర స్తస్య విక్రాన్తాః సర్వే చ తమను వ్రతాః
విరాటస్యైవ సంహృష్టా బలం కోశం చ వర్ధయన్.

ఆతని తమ్ములు పరాక్రమము కలవారు, అన్నయందు భక్తి కలవారు. మిక్కిలి ప్రీతితో విరాటుని సేనను ధనాగారమును పెంపొందించుచుండిరి.

కాలేయా నామ దైతేయాః ప్రాయశో భువి విశ్రుతాః,
జజ్ఞిరే కీచకా రాజన్ బాణో జ్యేష్ఠ స్తతోఽభవత్.

కాలేయులను రాక్షసులు లోకమున ప్రసిద్ధి కెక్కినవారు కలరు వారే కీచకులై పుట్టిరి. వారిలో జ్యేష్ఠుడగు బాణుడే కీచకులలో పెద్దవాడు.

సహి సర్వాస్త్ర సంపన్నో బలవాన్ భీమ విక్రమః,
కీచకో నష్ట మర్యాదో బభూవ భయదో నృణామ్.

ఆతడు అస్త్రము లన్నింటిని సంపూర్ణముగా సాధించెను. మిక్కిలి బలవంతుడు. భయంకరమైన పరాక్రమము కలవాడు. దానితో అదుపు లేనివాడై నరులకు భయంకరుడయ్యెను.

తం ప్రాప్య బలసంమత్తం విరాటః పృథివీ పతిః.
జిగాయ సర్వాంశ్చ రిపూన్ యథేన్ద్రో దానవానివ.

అట్లు బలముచే మదించిన కీచకుని పొంది విరాటరాజు శత్రువుల నందరను, ఇంద్రుడు రాక్షసులను వలె, గెలిచెను.

మేఖలాంశ్చ త్రిగర్తాంశ్చ దశార్ణాంశ్చ కశేరుకాన్
మాలవాన్ యవనాంశ్చైవ పులిందాన్ కాశికోసలాన్,
అంగాన్ వంగాన్ కలింగాంశ్చ తఙ్గణాన్ పరతఙ్గణాన్,
మలదాన్నిషధాంశ్చైవ తుణ్డికేరాంశ్చ కోఙ్కణాన్,
కరదాంశ్చ నిషిద్ధాంశ్చ శివాన్ దుశ్ఛల్లికాం స్తథా.

కీచకుని సాయమున విరాటుడు మేఖలులు, త్రిగర్తులు, దశార్ణులు, కశేరుకులు, మాలవులు, యవనులు, పులిందులు, కోసలులు, అంగులు, వంగులు, కళింగులు, తంగణులు, పరతంగణులు, మలదులు, నిషధులు, తుండికేరులు, కోంకణులు, కరదులు, నిషిద్ధులు, శివులు, దుశ్ఛల్లికులు - అను వారిని గెలిచెను.

అన్యే చ బహవః శూరా నానా జనపదేశ్వరాః,
కీచకేన రణే భగ్నా వ్యద్రవన్త దిశో దశ.

ఇంకను అనేకులు శూరులు, బహుదేశములకు రాజులు కీచకుని చే భంగపడి పది దిక్కులకును పారిరి.

తమేవం వీర్య సంపన్నం నాగాయుత బలం రణే,
విరాట స్తత్ర సేనాయా శ్చకార పతి మాత్మనః.

అట్లు గొప్ప శక్తితో నిండిన వాడు, పదివేలయేనుగుల బలము కలవాడునగు కీచకుని విరాటుడు తనకు సేనాపతిగా చేసికొనెను.

విరాట భ్రాతరశ్చైవ దశ దాశరథోపమాః,
తే చైనా మన్వవర్తన్త కీచకాన్ బలవత్తరాన్.

విరాటునికి పదిమంది తమ్ములు కలరు. వారు దశరథుని కుమరుల వంటివారు. వారును మిక్కిలి బలముగల కీచకులకులోబడి యుండిరి.

ఏవం విధబలోపేతాః కీచకా స్తేన తద్విధాః,
రాజ్ఞః శ్యాలా మహాత్మానో విరాటస్య హితైషిణః.

కీచకు లందరు గొప్ప బలము కలవారే. కాని పెద్దకీచకుని యంత వారు కారు. రాజునకు బావమరదులై విరాటుని హితము కోరుచుండురు.

ఏతత్ తే కథితం సర్వం కీచకస్య పరాక్రమమ్,
ద్రౌపదీ న శశా పైనం యస్మాత్ తద్గదతః శృణు.

ఇదిగో నీకు కీచకుని పరాక్రమమును గూర్చి యింతయు చెప్పితిని. ఇంక ద్రౌపది వాని నేల శపింపలేదో చెప్పెదను వినుము.

క్షరతీతి తపః క్రోధాద్ ఋషయో న శపన్తి హి,
జానన్తీ తద్ యథా తత్త్వం పాఞ్చాలీ న శశాప తమ్.

ఋషులు కోపమువలన తపము భ్రష్టమగునని శపింపరు. ఆ తత్త్వ మెరిగిన ద్రౌపది వానిని శపింపలేదు.

క్షమా ధర్మః క్షమా దానం క్షమా యజ్ఞః క్షమా యశః,
క్షమా సత్యం క్షమా శీలం క్షమా కీర్తిః క్షమా పరమ్,
క్షమా పుణ్యం క్షమా తీర్థం క్షమా సర్వమితి శ్రుతిః.
క్షమావతా మయం లోకః పరశ్చైవ క్షమా వతామ్,
ఏతత్ సర్వం విజాన న్తీ సాక్షమా మవ్వ పద్యత.

ఓర్పే ధర్మము దానము, యజ్ఞము, యశస్సు, సత్యము, శీలము, కీర్తి, పరము. పుణ్యము, తీర్థము - ఇవి యన్నియు క్షమా స్వరూపములే. క్షమ గలవారికే ఇహము, క్షమ గలవారికే పరము సిద్ధించును. ఇది యంతయు ఎఱిగియే ఆమె ఓర్చియుండెను.

భర్తౄణాం మత మాజ్ఞాయ క్షమిణాం ధర్మచారిణామ్,
నాశపత్ తం విశాలాక్షీ సతీ శక్తా పి భారత.

ఓ భారతా! ఓర్పు కలవారు, ధర్మము నాచరించువారు నగు భర్తల అభిమత మెరిగి ఆ వనిత, శక్తి యున్నను. వానిని శపింపలేదు.

పాణ్డవాశ్చాపి తే సర్వే ద్రౌపదీం ప్రేక్ష్య దుఃఖితాః,
క్రోధాగ్నినా వ్యదహ్యన్త తదా కాల వ్యపేక్షయా.

ఆ పాండవులందఱును ఆమెను గాంచి దుఃఖితులై కాలము కలిసి రాని కారణమున క్రోధాగ్నిచే కుమిలిపోయిరి.

అథ భీమో మహాబాహుః సూద యిష్యంస్తు కీచకమ్,
వారితో ధర్మ పుత్రేణ వేల యేవ మహోదధిః,
సంధార్య మనసా రోషం దివారాత్రం వినిఃశ్వసన్,
మహానసే తదా కృచ్ఛ్రాత్ సుష్వాప రజనీంచ తామ్.

మహాబాహు వైన భీముడును కీచకుని మట్టుపెట్ట గోరియు, పొంగివచ్చు సముద్రమును చెలియలికట్ట ఆపినట్లు, ధర్మరాజు అడ్డు

వడగా రోషమును మదిలో బిగియ పట్టి, ఆ పగలును రాత్రియు నిట్టూర్చుచు ఎట్టకేలకు వంట యింట ఆ రాత్రికి నిదురపోయెను.]

ఇతి శ్రీ మహా భారతే విరాట పర్వణి కీచక వధ
పర్వణి ద్రౌపదీ పరిభవే షోడశోఽ ధ్యాయః
ఇది శ్రీ మహా భారతము విరాటపర్వమున కీచక వధ
పర్వమున ద్రౌపదీ పరాభవ మను పదునారవ అధ్యాయము

## సప్తదశోఽధ్యాయః - పదునేడవ అధ్యాయము

ద్రౌపద్యా భీమసేన సమీపే గమనమ్.

ద్రౌపది భీమసేనుని కడ కరుగుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

సా హతా సూతపుత్రేణ రాజపుత్రీ యశస్వినీ,
వధం కృష్ణా పరీప్సన్తీ సేనావాహస్య భామినీ. 1

ఆ రాజపుత్రి, యశస్విని కృష్ణ, సూతపుత్రుడు తన్నగా కోపముతో ప్రజ్వరిల్లుచు సేనానాయకుడగు, కీచకుని వధను గూర్చి చింతించుచుండెను.

జగామావాస మేవాథ సా తదా ద్రుప దాత్మజా,
కృత్వా శౌచం యథాన్యాయం కృష్ణా సా తను మధ్యమా. 2

పిమ్మట సన్నని నడుముగల ద్రుపద రాజ తనయ కృష్ణ తగు విధముగా శుద్ధి చేసికొని తన నెలవున కరిగెను.

గాత్రాణి వాససీ చైవ ప్రక్షాళ్య సలిలేన సా,
చిన్తయామాస రుదతీ తస్య దుఃఖస్య నిర్ణయమ్. 3

అవయవములను వస్త్రములను నీటితో కడుగుకొని పొంగి వచ్చు నేడ్పుతో దుఃఖము కడ తేరు పద్ధతి నాలోచించెను.

1. సేనా వాహస్య - సేనాపతి యొక్క.

కిం కరోమి ! క్వ గచ్ఛామి ? కథం కార్యం భవేన్మమ ?,
ఇత్యేవం చిన్తయిత్వా సా భీమం వై మనసాగమత్. 4

ఏమి చేయుదును ? ఎందు బోదును ? ఈ వాపని యెట్లగును ? అని ఆలోచించుచు మనసున భీముని స్మరించెను.

నాన్యః కర్తా ఋతే భీమా న్మమాద్య మనసః ప్రియమ్,
తత ఉత్థాయ రాత్రౌ సా విహాయ శయనం స్వకమ్, 5

ప్రాద్రవ న్నాథ మిచ్ఛన్తీ కృష్ణా నాథవతీ సతీ,
భవనం భీమసేనస్య క్షిప్ర మాయతలోచనా. 6

నా మనసునకు ప్రియ మొనరించుటకు భీముడు కాక మఱియొకడు లేడు, అని ఆ రాత్రివేళ లేచి పాన్పువదలి నాథులుగల ద్రౌపది రక్షకుని కోరుచు శీఘ్రముగా భీమసేనుని భవనమునకు పరుగునబోయెను.

దుఃఖేన మహతా యుక్తా మనసేన మనస్వినీ.

ఆ అభిమానవతి మది నిండుగా పెద్ద దుఃఖముతో కూడి యుండెను.

సైరంధ్ర్యువాచ - సైరంధ్రి యిట్లు పలికెను.

తస్మిన్ జీవతి పాపిష్ఠే సేనా వాహే మమ ద్విషి.
తత్ కర్మ కృతవానద్య కథం నిద్రాం నిషేవసే. 7

ఆ పాపిష్ఠుడు, సేనాపతి నా పగవాడు అంతటి పాడుపని చేసినవాడు బ్రదికి యుండగా నీకు నిద్ర యెట్లు పట్టినది !

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ ముక్త్వాథ తాం శాలాం ప్రవివేశ మనస్వినీ,
యస్యాం భీమ స్తథా శేతే మృగరాజ ఇవ శ్వసన్. 8

అని పలికి ఆ మానవతి, సింహము వలె ఊర్పులు పుచ్చుచు నిద్రించుచున్న భీముడున్న శాలలోనికి ప్రవేశించెను.

తస్యా రూపేణ సా శాలా భీమస్య చ మహాత్మనః,
సమూర్ఛితేవ కౌరవ్య ప్రజజ్వాల చ తేజసా. 9

మహాత్ముఁడగు భీముని ఆ శాల ఆమె రూపముచే తళతళ లాడినట్లు ఆమె తేజస్సుతో వెలుగొందెను.

సా వై మహానసం ప్రాప్య భీమసేనం శుచిస్మితా, 10
సర్వశ్వేతేవ మాహేయీ వనే జాతా త్రిహాయణీ,
ఉపాతిష్ఠత పాఞ్చాలీ వాసితేవ వరర్షభమ్. 11

చక్కని చిరునవ్వుగల ఆ ద్రౌపది, అంతటను తెల్లదనము గలది జలమున పుట్టినది అగు ఆడుకొంగవలెను, మూడేండ్ల వయసు గలిగి ఒడలంత తెల్లగా నున్న గోవువలెను, ఉండి కామాతుర వలె నరవరుడగు భీమసేనుని కడ నిలిచెను.

సా లతేవ మహాశాలం ఫుల్లం గోమతి తీరజమ్,
పరిష్వజత పాఞ్చాలీ మధ్యమం పాణ్డునన్దనమ్. 12

11. సర్వశ్వేతా - ఆడుకొంగ ; వనే జాతా - నీటఁ బుట్టినది దీనిచేత పుష్కలముగ తిండి గల ఆడుకొంగ మగకొంగను చూచినప్పుడు ఎట్లు పిచ్చియెక్కిన విధముగా ప్రవర్తించునో ద్రౌపది స్థితి యా విధముగా నున్నదను భావము వ్యక్తమగును. అట్లే, సర్వశ్వేతా - ఒడలంత తెల్లగా నున్న; త్రిహాయణీ - మూడేండ్ల వయసు గల; మాహేయీ ఇవ - ఆవువలె - దీని చేతను ద్రౌపది ఒడలెఱుగని స్థితి వ్యక్తమగు చున్నది; వాసితా కామాతుర. కామాతురయైన యింతికి లోక నిందమున్నగునవి, యెట్లు పట్టవో ద్వేషాతుర యగు ద్రౌపదికి అజ్ఞాతవాస భంగాది భయములు తత్కాలమున అట్లే పట్టలేదని చెప్పుటకై ఈః యుపమానద్వయము.

12. మధ్యమం పాణ్డునన్దనమ్ - నకుల సహదేవులు కవలలు కావున ఇద్దఱు కనిష్ఠులే. ధర్మరాజు జ్యేష్ఠుడు. ఇక పాండవులలో మధ్యము డనగా భీమసేనుడును అర్జునుడును కావచ్చును. ప్రకరణమును బట్టి భీమసేనునే చెప్పుకొనవలయును.

గోమతినది యొడ్డున పుట్టిన పెద్ద వృక్షమును చుట్టుకొన్నలత వలె ఆ ద్రౌపది పాండునందనులలో మధ్యముడగు భీమసేనుని కౌగిలించుకొనెను.

బాహుభ్యాం పరిరభ్యైనం ప్రాబోధయ దనిన్దితా,
సింహం సుప్తం వనే దుర్గే మృగరాజవధూ రివ. 13

అడవిలో చొరరాని చోట నిద్రించుచున్న సింహమును ఆడు సింహము వలె. ఎందునునిందలేని ద్రౌపది భీముని రెండు చేతులతో కౌగిలించి మేల్కొలిపెను.

భీమసేన ముపాశ్లిష్య ద్ధస్తినీవ మహాగజమ్.

మహాగజమును ఆడేనుగు కౌగిలించినట్లు భీముని ద్రౌపది కౌగిలించెను.

వీణేవ మధురాలాపా గాన్ధారం సాధు మూర్ఛతీ,
అభ్యభాషత పాఞ్చాలీ భీమసేన మనిన్దితా, 14

కమ్మని నాదముగలిగి గాంధార స్వరమును పలుకుచున్న వీణ వలె ద్రౌపది భీమునితో ఇట్లు పలికెను.

ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే భీమసేన యథా మృతః,
నా మృతస్య హి పాపీయాన్ భార్యా మాలభ్య జీవతి - 15

భీమసేనా లే! లే! చచ్చిన వాని వలె ఏల నిద్రింతువు. చావని వాని భార్యను అంటి పాపిష్ఠి వాడు జీవింపడు.

స సంప్రహాయ శయనం రాజపుత్ర్యా ప్రబోధితః
ఉపాతిష్ఠత మేఘాభః పర్యఙ్కే సోపసంగ్రహే, 16

అట్లా రాజపుత్రి మేల్కొలుపగా పాన్పువదలి, మేఘము వలె నున్న భీముడు, తూలిక గల పర్యంకము కడ నిలిచెను.

అథా బ్రవీద్ రాజపుత్రీం కౌరవ్యో మహిషీం ప్రియామ్,
కేనాస్య్ర్థేన సంప్రాప్తా త్వరితేవ మమాన్తికమ్. 17

పిమ్మట భీముడు ప్రియమహిషి యగు రాజపుత్రితో ఇట్లు పలికెను. తొందరగలదాని వలె ఏ పనిమీద నాకడకు వచ్చితివి?

న తే ప్రకృతి మాన్ వర్ణః కృశా పాణ్డుశ్చ లక్ష్యసే,
ఆ చక్ష్వ పరిశేషేణ సర్వం విద్యా మహాం యథా 18

నీ వన్నె పూర్వము వలె లేదు. చిక్కి పాలిపోయినట్లు కన్పించుచున్నావు విషయ మేమో అంతయు నాకు తెలియునట్లు చెప్పుము.

సుఖం వా యదివా దుఃఖం ద్వేష్యం వా యది వా ప్రియమ్,
యథావత్ సర్వమాచక్ష్వ శ్రుత్వా జ్ఞాస్యామియత్ క్షమమ్. 19

అది సుఖమో, దుఃఖమో, ద్వేషింపదగినదో, ప్రియమైనదో ఉన్నది ఉన్నట్లంతయు చెప్పుము. విని చేయుదగిన ఉపాయ మాలోచింతును.

అహ మేవ హి తే కృష్ణే విశ్వాస్యః సర్వకర్మ సు,
అహ మాపత్సు చా పి త్వాం మోక్షయామి పునః పునః. 20

ఓ కృష్ణా! నేనే కదా నీకన్ని పనులయందును నమ్మదగినవాడను. నీకు వచ్చిపడిన ఆపదలను మాటిమాటికి పోగొట్టువాడను.

శీఘ్ర ముక్త్వా యథా కామం యత్ తే కార్యం వివక్షితమ్,
గచ్ఛవై శయనా యైవ పురా నాన్యేన బుధ్య తే. 21

నీవు చెప్పదలచిన దానిని వలచినట్లు చెప్పి, మరియొకడు ఎరుగకముందు, నీ పాన్పుకడకు అరుగుము.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి కీచకవధపర్వణి ద్రౌపదీభీమ సంవాదే సప్తదశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున కీచకవధపర్వమున ద్రౌపదీభీమసేన సంవాదమున పదునేడవ అధ్యాయము.

---

18. విద్యామ్ - ఎఱుగుదును. (ఇది క్రియాపదము)

## అష్టాదశోఽధ్యాయః - పదునెనిమిదవ అధ్యాయము

### ద్రౌపద్యా భీమ సంనిధౌ స్వీయదుఃఖోద్గార ప్రకటనమ్.

ద్రౌపది భీమునికడ తన దుఃఖమును వెల్లగక్కుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

[సా లజ్జమానా భీతా చ అధోముఖముఖీ తతః,
నో వాచ కిఞ్చిద్వచనం బాష్పదూషితలోచనా.

ఆమె సిగ్గుపడుచు భయముతో తలవాచినదై కన్నులలో నీరు తిరుగుచుండగా నేమియు చెప్పకుండెను.

అథాబ్రవీద్ భీమపరాక్రమో బలీ
వృకోదరః పాణ్డవముఖ్య సమ్మతః,
ప్రబ్రూహి కిం తే శరవాణి సున్దరి
ప్రియం ప్రియే వారణ ఖేలగామిని.

అంత భయంకర విక్రమము, అత్యధికబలముగల భీముడు, 'ఓ ప్రియురాలా! సుందరీ! చెప్పు! నీకేమి ప్రియ మొనరింతును' అనెను].

ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లు పలికెను.

అశోచ్యత్వం కుత స్తస్యా యస్యా భర్తా యుధిష్ఠిరః,
జానని సర్వాణి దుఃఖాని కిం మాం త్వం పరిపృచ్ఛసి.

ఎవతె మగడు ధర్మరాజో అట్టిదానికి శోకింపకుండుట యెక్కడిది? నా దుఃఖములన్నియు నెరిగియు నన్నేల అడిగెదవు?

యన్మాం దాసీప్రవాదేన ప్రాతికామీ తదానయత్,
సభాపరిషదో మధ్యే తన్మాం దహతి భారత. 2

2. సభా పరిషదః - శాలలోని జనసమూహముయొక్క, తదా - అప్పుడు - జూదమాడిన వేళ;

ఓ భరతముఖ్యుడా ! దాసియనుచు ప్రాతికామి నన్ను సభ లోనికి కొనివచ్చెనే యదియే నన్ను కాల్చి వేయుచున్నది.

[క్షత్రియై స్తత్ర కర్ణాద్యై ర్దృష్టా దుర్యోధనేన చ,
శ్వశురాభ్యాం చ భీష్మేణ విదురేణ చ ధీమతా,
ద్రోణేన చ మహాబాహో కృపేణ చ పరంతప.

ఓ మహాబాహూ ! శత్రుసంహారకా ! అచట కర్ణుడు మొద లగు క్షత్రియులు, దుర్యోధనుడు అత్తమామలు, భీష్ముడు, బుద్ధి మంతుడగు విదురుడు. ద్రోణుడు నన్ను చూచిరి.

సాహం శ్వశురయో ర్మధ్యే భ్రాతౄనుధ్యే చ పాణ్డవ,
కేశే గృహీత్వైవ సభాం నీతా జీవతి వై త్వయి.

అట్టి నన్ను అత్తమామల యెదుర, సోదరుల నడుమ, నీవు బ్రదికి యుండగనె, జుట్టుపట్టి లాగుకొని వచ్చెను.]

పార్థివస్య సుతా నామ కాను జీవతి మాదృశీ,
అనుభూ యేదృశం దుఃఖ మన్యత్ర ద్రౌపదీం ప్రభో. 3

ద్రౌపది కాక మరియొక రాచబిడ్డ నావంటిది, ఇంత పాటు పడి జీవించునా ?

వనవాస గతాయాశ్చ సైన్ధవేన దురాత్మనా;
పరామర్శో ద్వితీయో వై సోఢు ముత్సహతే తు కా. 4

వనవాససమయమున దురాత్ముడగు సైంధవుడు చేసిన అవ మానము రెండవది. మరియొకతె సహింపగలదా ?

[పద్భ్యాం పర్యచరం చాహం దేశాన్ విషమ సంస్థితాన్,
దుర్గా శ్ఛ్వాపద సంకీర్ణాం స్త్వయిజీవతి పాణ్డవ.

ఓ పాండుతనయా ! నీవు జీవించియుండగానే ఎగుడు దిగుళ్లైన భూములను, క్రూరమృగములతో చొరశక్యము కానివానిని కాలి నడకతో తిరిగితిని.

తతో౽హం ద్వాదశే వర్షే వన్యమూలఫలాశనా,
ఇదం పుర మనుప్రాప్తా సుదేష్ణా పరిచారికా.

అటుపై పన్నెండవయేడు ముగియగా అడవిదుంపలు, పండ్లు తినుచు సుదేష్ణదాసిగా ఈపురమును చేరితిని.

పరస్త్రియ ముపాతిష్ఠే సత్యధర్మపథ స్థితా,
గోశీర్షకం పద్మకం చ హరిశ్యామం చ చన్దనమ్,
నిత్యం పింషే విరాటస్య త్వయి జీవతి పాణ్డవ.

సత్యధర్మమార్గమున నిలిచిన నేను పరస్త్రీని సేవించు చున్నాను. మీరు జీవించియుండగనే గోశీర్షకము, పద్మకము, హరి చందనము అను గంధములను విరాటునికై ప్రతిదినము నూరు చున్నాను.

సాహం బహూని దుఃఖాని గణయామి న తే కృతే,
ద్రుపదస్య సుతా చాహం ధృష్టద్యుమ్నస్య చానుజా
అగ్నికుణ్డాత్ సముద్భూతా నోర్వ్యాం జాతు చరామి భోః.

[ద్రుపదమహారాజు పుత్రికను ధృష్టద్యుమ్నుని చెలియలను అగ్నికుండమున పుట్టినదానను కాలుక్రిందపెట్టక తిరిగినదానను. అట్టి నేను మీకొరకై యిట్టి పలుదుఃఖములను లెక్కచేయక బ్రతుకు చున్నాను.]

మత్స్యరాజ సమక్షం తు తస్య ధూర్తస్య పశ్యతః;
కీచకేన పరామృష్టా కా ను జీవతి మాదృశీ. 5

మత్స్యరాజు ఎదుట, ఆ ధూర్తుడు చూచుచుండగా కీచకుడు నన్ను ముట్టెను. నావంటిది మరియొకతె జీవించునా?

ఏవం బహువిధైః క్లేశైః క్లిశ్యమానాం చ భారత,
న మాం జానాసి కౌన్తేయ కిం ఫలం జీవితేన మే, 6

ఇట్టి అనేక విధములగు క్లేశములతో నలిగిపోవుచున్న నన్ను పట్టించుకొనకున్నావు. ఇంక నేను బ్రదికి ఫలమేమి ?

యోఽయం రాజ్ఞో విరాటస్య కీచకో నామ భారత,
సేనానీః పురుషవ్యాఘ్ర శ్యాలః పరమదుర్మతిః. 7

స మాం సైరంధ్రి వేషేణ వసన్తీం రాజవేశ్మని,
నిత్య మేవాహ దుష్టాత్మా భార్యా భవ మమేతి వై. 8

ఓ పురుషవరేణ్యా! భారత! ఈ విరాటుని బావమరిది, సేనాని, పరమదుష్టుడు కీచకుడు సైరంధ్రివేషమున రాజభవనమున నున్న నన్ను నిత్యము నాకు భార్యవు కమ్మని అడుగుచున్నాడు.

తేనోపమన్త్ర్యమాణాయా వధార్హేణ సపత్నహన్,
కాలేనేవ ఫలం పక్వం హృదయం మే విదీర్యతే ! 9

ఓ శత్రుసంహారకా ! వధించుటకు తగిన ఆ నీచుడు నన్నట్లు అడుగుచుండగా కాలమున పండినపండువలె నాగుండె చీలిపోవుచున్నది;

[విజానామి తవామర్షం బలం వీర్యం చ పాణ్డవ,
తతోఽహం పరిదేవామి బాగ్రతస్తే మహాబల.

ఓయీ పాండుకుమారా ! నీక్రోధము, బలము, శక్తి నాకు తెలియును. కావుననే నీముందు మొత్తుకొనుచున్నాను.

యథా యూథపతి ర్మత్తః కుఞ్జరః షష్టి హాయనః,
భూమా నిపతితం బిల్వం పద్భ్యా మాక్రమ్య పీడయేత్,
తథైవ చ శిర స్తస్య నిపాత్య ధరణీతలే,
వామేన పురుషవ్యాఘ్ర మర్ద పాదేన పాణ్డవ.

బాగుగా మదించిన అరువది యేండ్ల గజరాజు నేలపై పడిన మారేడు పండును. కాళ్ళక్రింద వేసి నలిపి వైచినట్లు వాని తల నేల బడగొట్టి, ఓ పురుష శ్రేష్ఠా! ఎడమ కాలితో మట్టగింపుము.

స చే దుద్యన్త మాదిత్యం ప్రాత రుత్థాయ పశ్యతి,
కీచకః శర్వరీం వ్యుష్టాం నాహంజీవితు ముత్సహే.

రేపు ప్రొద్దున ఉదయించుచున్న సూర్యుని కీచకుడు చూచెనో ఈరాత్రికి నిద్రింపని నేను బ్రదుకఁగోరను.]

భ్రాతరం చ విగర్హాస్య జ్యేష్ఠం దుర్ద్యూత దేవినమ్,
యస్యాస్మి కర్మణా ప్రాప్తా దుఃఖ మేత దనన్తకమ్. 10

నాకీ అంతులేని ఏడుపు ఎవని పనివలన కలిగెనో ఆ మీ పెద్దన్నను, దుష్టద్యూత క్రీడా పరాయణుని ఏమి యైన అనదగును.

కో హి రాజ్యం పరిత్యజ్య సర్వస్వం చాత్మనా సహ,
ప్రవ్రజ్యాయైవ దీవ్యేత వినా దుర్ద్యూత దేవినమ్. 11

ఈ మాయజూదరి మీ యన్న కాక మరియెవడైన రాజ్యమును వదలి తన తోపాటు సర్వస్వమును కోల్పోయి కేవలము దేశద్రిమ్మరి యగుటకై జూదమాడునా?

యది నిష్కసహస్రేణ యచ్చాన్యత్ సారవద్ధనమ్,
సాయంప్రాత రదేవిష్య దపి సంవత్సరాన్ బహూన్. 12

రుక్మం హిరణ్యం వాసాంసి యానం యుగ్య మజావికమ్,
అశ్వాశ్వతర సంఘాంశ్చ నజాతు క్షయ మావహేత్. 13

వేలకొలది బంగారునాణెములు, సారవంతమైన ధనము, వెండి బంగారములు, వస్త్రములు. వాహనములు, ఎద్దులు, మేకలు, గుఱ్ఱములు, కంచరగాడిదలు - ఈ అన్నింటిని పణముగా పెట్టి బహు వత్సరములు ద్యూత మాడినను ఒకనాటికిని తరుగుట యుండదు.

సోఽయం ద్యూత ప్రవాదేన శ్రియః ప్రత్యవరోపితః,
తూష్ణీమాస్తే యథామూఢః స్వాని కర్మాణి చిన్తయన్. 14

అట్టి యీయన జూదమను నెపముతో సంపదను ఊడగొట్టుకొని మూఢునివలె తనచేష్టలను తలచుకొనుచు ఊరకున్నాడు.

దశ నాగసహస్రాణి హయానాం హేమమాలినామ్,
గచ్ఛం యాన్త మను యాన్తీహ సోఽయం ద్యూతేన జీవతి. 15

ఈయన పోవుచుండగా వెనుక పదివేల యేనుగులు, బంగారు గొలుసులుగల పదివేల గుఱ్ఱములు వెంటనంటి వచ్చుచుండెడివి. అట్టి యీయన జూదముతో బ్రదుకు వెళ్ళదీయుచున్నాడు.

రథాః శతసహస్రాణి నృపాణా మమితౌజసామ్,
ఉపాసన్త మహారాజ మిన్ద్రప్రస్థే యుధిష్ఠిరమ్. 16

గొప్ప దేహబలముగల రాజులరథములు నూరువేలు ఇంద్రప్రస్థమున మహారాజైన యుధిష్ఠిరుని కొలిచి యుండెడివి.

శతం దాసీ సహస్రాణాం యస్య నిత్యం మహానసే,
పాత్రీ హస్తం దివారాత్ర మతిథీన్ భోజయన్త్యుత. 17

ఆయన వంటశాలలో నూరువేల పరిచారికలు రాత్రింబవళ్లు పాత్రములు చేతబట్టి అతిథులకు అన్నము పెట్టుచుండెడివారు.

ఏష నిష్కసహస్రాణి ప్రదాయ దదతాం వరః,
ద్యూతజేన హ్యనర్థేన మహతా సముపాశ్రితః. 18

దాతలలో శ్రేష్ఠుడగు నీ మహారాజు వేయి నిష్కముల చొప్పున దానమిచ్చి ఇప్పుడు జూదమువలన పుట్టిన గొప్పకీడును పొందియున్నాడు.

ఏనం హి సర్వసంపన్నా బహవః సూతమాగధాః,
సాయంప్రాత రుపాతిష్ఠన్ సుమృష్టమణి కుణ్డలాః. 19

సర్వసంపదలుగలవారు; చక్కగా తీర్చిదిద్దిన మణికుండలములు గలవారు నగు వంది మాగధు లీయనను ఉదయాస్తమయ కాలములలో సేవించియుండెడివారు.

సహస్ర మృషయో యస్య నిత్య మాసన్ సభాసదః,
తపఃశ్రుతోపసంపన్నాః సర్వకామై రుపస్థితాః. 20

ప్రతిదినము ఈయన కొలువులో తపస్సు, విద్య సమృద్ధిగా గల వారు, కోరిక లన్నింటిని తీర్చుకొనినవారు నగు వేయిమంది ఋషులు ఉండిరి.

అష్టాశీతి సహస్రాణి స్నాతకా గృహమేధినః,
త్రింశద్దాసీక ఏకైకో యాన్ బిభర్తి యుధిష్ఠిరః. 21

ఒక్కొక్కరికి ముప్పదిమంది చొప్పున దాసీజనముగల స్నాతకులైన గృహస్థులను ఎనుబది ఎనిమిదివేల సంఖ్యలవారిని యుధిష్ఠిరుడు పోషించెను.

అప్రతిగ్రాహిణాం చైవ యతీనా మూర్ధ్వరేతసామ్,
దశ చాపి సహస్రాణాం సోఽయ మాస్తే నరేశ్వరః. 22

ఈ మహారాజు, దానము పుచ్చుకొనని ఊర్ధ్వరేతసులైన యతులను పదివేలమందిని పోషించెను.

ఆనృశంస్య మనుక్రోశం సంవిభాగ స్తథైవ చ,
యస్మి న్నేతాని సర్వాణి సోఽయమాస్తే నరేశ్వరః. 23

మెత్తదనము, దయ, వివేకము మున్నగు సర్వగుణములుగల ఈ మహారాజు నే డిట్లున్నాడు.

అన్ధాన్ వృద్ధాన్ తథానాథాన్ బాలాన్ రాష్ట్రేషు దుర్గతాన్,
బిభర్తి వివిధాన్ రాజా ధృతిమాన్ సత్యవిక్రమః,
సంవిభాగమనా నిత్య మానృశంస్యాద్ యుధిష్ఠిరః. 24

చక్కని వివేకము, దయగల ఈ యుధిష్ఠిర మహారాజు ధీరభావము, సత్యవిక్రమము కలవాడై మార్దవముతో గ్రుడ్డివారిని, ముసలివారిని, దిక్కులేనివారిని, దేశములందు నీచదశ పొందినవారిని మరియు ననేకులను భరించెను.

స ఏష నిరయం ప్రాప్తో మత్స్యస్య పరిచారకః,
సభాయాం దేవితా రాజ్ఞః కంకో బ్రూతే యుధిష్ఠిరః. 25

25. నిరయమ్ - పరతంత్రతను,

అట్టి యీ మహారాజు పరతంత్రను పొంది విరాటరాజునకు పరిచారకుఁడై, కంకుడనని చెప్పుకొనుచు సభలో జూదమాడు చున్నాడు.

ఇన్ద్రప్రస్థే నివసతః సమయే యస్య పార్థివాః,
ఆసన్ బలిభృతః సర్వే సోఽద్యాన్యైర్భృతి మిచ్ఛతి. 26

ఇంద్రప్రస్థమున నివసించు సమయమున రాజులందరు ఈతనికి కప్పములు చెల్లించిరి. అట్టి ఈయన నేడు ఇతరులనుండి భృతిని కోరుచున్నాడు.

పార్థివాః పృథివీపాలా యస్యాసన్ వశవర్తినః,
స వశే వివశో రాజా పరేషా మద్య వర్తతే. 27

ఒకనాడు చక్రవర్తులను కూడ వశమున పెట్టుకొన్న ఈ మహారాజు నేడు ఇతరులకు వశుడై తిరుగుచున్నాడు.

ప్రతాప్య పృథివీం సర్వాం రశ్మిమానివ తేజసా,
సోఽయం రాజ్ఞో విరాటస్య సభాస్తారో యుధిష్ఠిరః. 28

తన తేజస్సుతో భూమినంతటిని సూర్యునివలె వెలుగొంద జేసిన యీ యుధిష్ఠిరుడు నేడు విరాటరాజునకు కొలువుచేయు చున్నాడు.

యముపాసన్త రాజానః సభాయా మృషిభిః సహ,
తముపాసీన మద్యాన్యే పశ్య పాణ్డవ పాణ్డవమ్. 29

ఋషులతోపాటు రాజులందరు ఎవనిని కొలిచియుండిరో అట్టి పాండుకుమారుడు ఓ పాండవా! నేడు మఱియొకనిని కొలిచి యున్నాడు చూడు.

సదస్యం యముపాసీనం పరస్య ప్రియవాదినమ్,
దృష్ట్వా యుధిష్ఠిరం కోపో వర్ధతే మా మసంశయమ్. 30

సభలో కూర్చుండి ఇతరునికి ఇచ్చకములు పలుకుచున్న ధర్మరాజును చూచినపుడు నాకు కోపము మిక్కుటమగుచున్నది.

అతదర్హాం మహాప్రాజ్ఞం జీవితార్థేఽభి సంస్థితమ్,
దృష్ట్వా కస్య న దుఃఖం స్యాద్ ధర్మాత్మానం యుధిష్ఠిరమ్. 31

అట్టి సేవకు అయోగ్యుడు, గొప్ప ప్రజ్ఞకలవాడు, అగు యుధిష్ఠిరుడు, బ్రదుకు తెరువునకై యిటచేరి యుండగా చూచినచో ఎవ్వనికి దుఃఖము కలుగదు ?

ఉపాస్తే స్మ సభాయాం యం కృత్స్నా వీర వసున్ధరా,
తముపాసీన మద్యాన్యం పశ్యభారత భారతమ్. 32

సభయందు ఎవనిని సమస్త భూమియు సేవించెనో అట్టి పాండుతనయుడు మరియొకని కొలిచి యుండెను, ఓ భారతా! చూడు.

ఏవం బహువిధై ర్దుఃఖైః పీడ్యమానా మనాథవత్,
శోకసాగర మధ్యస్థాం కిం మాం భీమ న పశ్యసి. 33

ఇట్లు దిక్కులేని దానివలె బహువిధములైన దుఃఖములతో పీడింపబడుచు శోకసముద్రమునడుమ నున్న నన్ను ఓ భీమా! ఏల చూడవు ?

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి కీచకవధ పర్వణి ద్రౌపదీ భీమసంవాదే
అష్టాదశోఽధ్యాయః

ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున కీచకవధ పర్వమున
ద్రౌపదీభీమ సంవాదమున పదునెనిమిదవ అధ్యాయము

## ఏకోనవింశోఽధ్యాయః — పందొమ్మిదవ అధ్యాయము

పాణ్డవానాం దుఃఖేన దుఃఖితాయా ద్రౌపద్యా
భీమసేనస్య సంముఖే విలాపః.

పాండవుల దుఃఖమునకు కుములుచున్న ద్రౌపది భీముని యెదుట విలపించుట.

ద్రౌపద్యువాచ - ద్రోపది యిట్లు పలికెను

ఇదంతు తే మహాద్ దుఃఖం యత్ ప్రవక్ష్యామి భారత,
న మేఽభ్యసూయా కర్తవ్యా దుఃఖాదేతి బ్రవీమ్యహమ్, 1

ఓ భారత ! నా యీ పలుకులు నీకు చాల దుఃఖము కలిగించును. అయినను నాయందలుగకుము. నేను దుఃఖముతో పలుకుచున్నాను.

సూద కర్మణి హీనే త్వ మసమే భంతర్షభ,
బ్రువన్ వల్లవ జాతీయః కస్య శోకం నవర్ధయేః. 2

నీచము, తగనిది అయిన ఈ వంటపని యందు కుదురుకొని వంటలవాడనని పలుకుచున్న నిన్ను చూచినచో ఎవనికి శోకము పెరుగకుండును ?

సూపకారం విరాటస్య వల్లవం త్వా విదుర్జనాః,
ప్రేష్యత్వం సమను ప్రాప్తం తతో దుఃఖతరంను కిమ్. 3

నిన్ను జనులందరు విరాటుని వంటలవానినిగా, సేవకునిగానే ఎరుగుదురు. ఇంతకంటె మించిన దుఃఖమేముండును ?

యథా మహానసే సిద్ధే విరాట ముపతిష్ఠసి,
బ్రువాణో వల్లవ స్సూద స్తదా సీదతి మే మనః. 4

నీవు ఏనాడు విరాటుని వంటశాలలో వల్లవుడనని చెప్పుకొనుచు కుదురుకొంటివో అప్పుడే నాగుండె తరుగుకొని పోయినది.

[illegible]ా ప్రహృష్టః సమ్రాట్ త్వాం సంయోధయతి కుఞ్జరైః,
వ[illegible]న్త్య న్తః పురే నార్యో మమ తూద్విజతే మనః. 5

చక్రవర్తి ఆనందముతో నిన్ను ఏనుగులతో పోరించునపుడు అంతఃపుర కాంతలందరు ఆనందపడుచుందురు. నాకో గుండె దడదడలాడును.

శార్దూలై ర్మహిషైః సింహై రాగారే యోధ్యసే యదా,
కైకేయ్యాః ప్రేక్షమాణాయా స్తదా మే కశ్మలం భవేత్; 6

పులులతో, దున్నలతో, సింహములతో రాజు నిన్ను పోరించునపుడు, సుదేష్ణ చూచుచుండగా నా మనసున కలత కలుగును.

తత ఉత్థాయ కైకేయీ సర్వా స్తాః ప్రత్యభాషత,
ప్రేష్యాః సముత్థితా శ్చాపి కైకేయీం తాం స్త్రియోఽబ్రువన్ 7
ప్రేక్ష్య మా మనవద్యాఙ్గీం కశ్మలోపహతా మివ.

అంత లేచిన కేకయరాజపుత్రి సుదేష్ణ ఆపరిచారికలతో, ఆపరిచారికలు ఆమెతో నామనసున ఏదో దోషమున్నట్లు ఏపాప మెరుగని నన్నుగూర్చి యిట్లాడుకొందురు.

స్నేహాత్ సంవాసజాద్ ధర్మాత్ సూదమేషా శుచిస్మితా. 8
యోధ్యమానం మహావీర్య మియం సమనుశోచతి.

కలిసియున్న స్నేహమువలనను, ధర్మమువలనను ఈచక్కని నవ్వులది వల్లవునిచే రాజు పోరించుచుండగా దుఃఖించుచున్నది.

కల్యాణరూపా సైరంధ్రీ వల్లవశ్చాపి సున్దరః. 9
స్త్రీణాం చిత్తం చ దుర్జ్ఞేయం యుక్తరూపౌ చ మే మతా.

ఈ సైరంధ్రి చక్కనిరూపముకలది. ఆ వల్లవుడు సుందరుడు. ఆడువారి మనస్సు తెలియశక్యము కానిది. వారిద్దరు ఒకరికొకరు తగినవారని నా తలపు.

సైరంధ్రీ ప్రియసం వాసా న్నిత్యం కరుణవాదినీ. 10

సైరంధ్రి ప్రియునితో కలిసియుండినది. కాన నిత్యము అతనిని గూర్చి దీనపుపలుకులు పలుకు చుండును.

---

10. ప్రియసం వాసాత్ - ప్రియునిసహవాసమువలన, సంబంధమువలన, కరుణ వాదినీ - జాలిమాటలు గలది.

అస్మిన్ రాజకులే చోభౌ తుల్యకాల నివాసినౌ,
ఇతి బ్రువాణా వాక్యాని సా మాం నిత్య మతర్జయత్. 11

ఈరాజభవనమున నిరువురు ఒక్కకాలములో అడుగుపెట్టిరి. ఈ మొదలగు మాటలాడుచు నన్ను ప్రతిదినము ఆమె బెదరించుచుండును.

క్రుధ్యన్తీం మాంచ సంప్రేక్ష్య సమశఙ్కత మాం త్వయి,
తస్యాం తథా బ్రువత్యాం తు దుఃఖం మాం మహదావిశత్. 12

కోపగించు నన్నుచూచి నీవిషయమున ఆమె మరియు శంకించుచుండును. ఆమె అట్లు పలుకుచుండగా నాకు పెను దుఃఖము కలుగుచుండును.

త్వయ్యేవం నిరయం ప్రాప్తే భీమే భీమ పరాక్రమే,
శోకే యౌధిష్ఠిరే మగ్నా నాహం జీవితు ముత్సహే. 13

భయంకర పరాక్రమముగల భీముడవు, నీవిట్లు దుఃఖమును పొందగా ధర్మరాజునకు సంబంధించిన శోకమున మునిగిన నాకు బ్రదుకుపై ఆశపోవుచున్నది.

యః స దేవాన్ మనుష్యాంశ్చ సర్వాం శ్చైకరథోఽజయత్,
సోఽయం రాజ్ఞో విరాటస్య కన్యానాం నర్తకో యువా. 14

దేవతలను, మనుష్యులను రెండవతోడు లేక జయించిన అర్జునుడు నేడిచట విరాటరాజు కన్యలకు ఆటనేర్పు యువకుడై యుండెను.

యోఽతర్పయ దమేయాత్మా ఖాండవే జాతవేదసమ్,
సోఽన్తఃపురగతః పార్థ కూపేఽగ్ని రివ సంవృతః. 15

ఊహింప నలవిగాని ఆత్మబలముగల అర్జునుడు నాడు ఖాండవమున అగ్నిహోత్రుని తృప్తిపరచెను. నేడు నూతిలోని నిప్పువలె అంతఃపురమున మరుగుపడియుండెను.

13. నిరయమ - దుఃఖము.

యస్మాద్ భయ మమిత్రాణాం సదైవ పురుషర్షభాత్,
స లోక పరిభూతేన వేషేణాస్తే ధనంజయః. 16

ఈ పురుషవరేణ్యుని చూచి శత్రువులందరు ఎల్లప్పుడు అడలు చుండెడివారు. అట్టి యీ ధనంజయుడు లోకము నిందించు వేషము ధరించియున్నాడు.

యస్య జ్యాక్షేపకఠినౌ బాహూ పరిఘ సంనిభౌ,
స శఙ్ఖపరిపూర్ణాభ్యాం శోచన్నాస్తే ధనంజయః. 17

నాడాతని బాహువులు పరిఘులవలె దృఢములై అల్లెత్రాటి ఒరిపిడికి బిరుసెక్కియుండెడివి. అట్టి ధనంజయుడు నేడు శంఖము లతో నిండిన చేతులతో దుఃఖించుచు ఉన్నాడు.

యస్య జ్యాఘాత నిర్ఘోషాత్ సమకమ్పత శత్రవః,
స్త్రియో గీతస్వనం తస్య ముదితాః పర్యుపాసతే. 18

నాడు ఈతని అల్లెత్రాటిధ్వనికి శత్రువులు వణకిపోయెడివారు. నేడీతని పాటలచప్పుళ్ళకు స్త్రీలు ఆనందపడుచు సేవించుచున్నారు.

కిరీటం సూర్యసంకాశం యస్య మూర్ధ న్యశోభత,
వేణీవికృతకేశాన్తః సోఽయ మద్య ధనంజయః. 19

నాడీతని తలపై సూర్యునివలె వెలుగొందు కిరీటము ప్రకాశించుచుండెడిది. నేడట్టి ధనంజయుడు జడలతో ఏవగొలుపు జుట్టుతో నున్నాడు.

తం వేణీకృతకేశాన్తం భీమధన్వాన మర్జునమ్,
కన్యాపరివృతం దృష్ట్వా భీమ సీదతి మే మనః. 20

భయంకరమగు ధనువుగల అర్జునుడు నేడు ఆడుపిల్లలనడుమ జడలుకట్టిన జుట్టుతో ఉండగా చూచిన నాగుండె కుమిలిపోవు చున్నది.

---

16. లోక పరిభూతేన - లోకము ఏవగించుకొను.

యస్మి న్నస్త్రాణి దివ్యాని సమస్తాని మహాత్మని,
ఆధారః సర్వవిద్యానాం స ధారయతి కుణ్డలే. 21

ఏ మహాత్మునియందు దివ్యములగు అస్త్రములన్నియు నెల కొని యున్నవో, సర్వవిద్యలకు ఆధారమైన అట్టివాడు నేడు ఆడు దానివలె కుండలములను ధరించియున్నాడు.

స్పర్ధిష్టం రాజసహస్రాణి తేజసా ప్రతిమాని వై,
సమరే నాభ్యవర్తన్త వేలా మిద మహార్ణవః. 22

తేజస్సున సాటిలేని వేలకొలది రాజులు యుద్ధమున, మహా సముద్రము చెలియలికట్టనువలె ఈతనిని తాకుటకును రాజాలకుండిరి.

సోఽయం రాజ్ఞో విరాటస్య కన్యానాం వర్తకో యువా,
ఆస్తే వేషప్రతిచ్ఛన్నః కన్యానాం పరిచారకః. 23

అట్టి అర్జునుడు నేడు విరాటుని కన్యలకు ఆటగరపుయువకుడై వేషముతో మరుగువడి కన్నెపిల్లలకు పరిచారకుడై యున్నాడు.

యస్య స్మ రథఘోషేణ సమకమ్పత మేదినీ,
సపర్వతవనా భీమ సహాస్థావరజఙ్గమా. 24

ఆతని రథఘోషముతో పర్వతములతో, అడవులతో, స్థావర జంగమము లన్నింటితో కూడినభూమి దద్దరిల్లెడిది.

యస్మిఞ్జాతే మహాభాగే కున్త్యాః శోకో వ్యనశ్యత,
స శోచయతి మామద్య భీమసేన తవానుజః. 25

ఆ మహిళాత్ముడు పుట్టగా కుంతికి శోకము నశించినది. అట్టి నీతమ్ముడు నేడు నాకు దుఃఖము కలిగించుచున్నాడు.

భూషితం తమలంకారైః కుణ్డలైః పరిహాటకైః,
కంబుపాణిన మాయాన్తం దృష్ట్వా సీదతి మే మనః. 26

22. తేజసా, అప్రతిమాని - అని విభాగము.

అలంకారములతో, బంగారపు కుండలములతో శంఖములు కట్టిన చేతులతో అతడు వచ్చుచుండగా చూచు నాకు గుండె తరుగు కొనిపోవును.

యస్య నాస్తి సమో వీర్యే కశ్చిదుర్వ్యాం ధనుర్ధరః,
సోఽద్య కన్యాపరివృతో గాయన్నాస్తే ధనంజయః. 27

వీర్యమున నీతనికి సాటివచ్చు విలుకాడు ఈ మొత్తము భూమిలో లేడు. అట్టి యీ ధనంజయుడు కన్యలనడుమ పాటలు పాడుకొనుచున్నాడు.

ధర్మే శౌర్యే చ సత్యే చ జీవలోకస్య సమ్మతమ్,
స్త్రీవేషవికృతంపార్థం దృష్ట్వా సీదతి మే మనః. 28

ధర్మము, శౌర్యము, సత్యము - అనువాని విషయమున జీవలోకమంతయు ఈతనిని మన్నించును. అట్టివాడు నేడు ఆడంగి వేషముతో వికృతముగా నుండగా నామనసు కుమిలిపోవు చున్నది.

యదా హ్యేనం పరివృతం కన్యాభి ర్దేవరూపిణమ్,
ప్రభిన్న మివ మాతఙ్గం పరికీర్ణం కరేణుభిః. 29

దివ్యరూపములో నున్న ఈతడు కన్యలనడుమ నుండునపుడు, ఆడేనుగులు చుట్టుకొన్న మత్తగజమువలె కానవచ్చును.

మత్స్య మర్థపతిం పార్థం విరాటం సముపస్థితమ్.
పశ్యామి తూర్యమధ్యస్థం దిశో నశ్యన్తి మే తథా. 30

ఈ కుంతీతనయుడు ధనముగల విరాటరాజును సేవించుచు వాద్యములనడుమ నున్నపుడు చూచితినో నాకు దిక్కుతోచదు.

నూన మార్యా న జానాతి కృచ్ఛ్రం ప్రాప్తం ధనంజయమ్,
అజాత శత్రుం కౌరవ్యం మగ్నం దుర్ద్యూతదేవినమ్. 31

30. దిశో నశ్యన్తి మే - దుఃఖము చేత దిక్కులు కానరాని గ్రుడ్డితనము కలుగు చున్నదని భావము.

పాప మాపుణ్యాత్మురాలు కుంతి ఇంతకష్టపాటు పొందిన ఈ అర్జునుని, మాయజూదమాడి ఆపదలో మునిగిన ధర్మరాజును తెలియకున్నది.

[ఐన్ద్రై) వారుణ వాయవ్య బ్రాహ్మాగ్నే యైశ్చ వైష్ణవైః,
అగ్నీన్ సంతర్పయన్ పార్థః సర్వాం శ్చైకరథోఽజయత్.

ఇంద్రుడు, వరుణుడు, వాయువు, బ్రహ్మ, అగ్ని, విష్ణువు - దేవతలుగాగల గొప్ప అస్త్రములతో అగ్నులను తృప్తిపరచుచు ఈ అసహాయ శూరులు సర్వులను గెలిచెను.

దివ్యై రస్త్రై రచిన్త్యాత్మా సర్వశత్రు నిబర్హణః,
దివ్యం గాన్ధర్వ మస్త్రం చ వాయవ్య మథ వైష్ణవమ్,
బ్రాహ్మం పాశుపతం చైవ స్థూణా కర్ణంచ దర్శయన్,
పౌలోమాన్ కాలకేయాంశ్చ ఇన్ద్రశత్రూన్ మహాసురాన్,
నివాతకవచైః సార్ధం ఘోరా నేకరథోఽజయత్.

ఊహింప నలవికాని ఆత్మకల ఈ శత్రుసంహారకుడు దివ్యమైన గాంధర్వాస్త్రము, వాయవ్యాస్త్రము, వైష్ణవాస్త్రము, బ్రహ్మాస్త్రము, పాశుపతము, స్థూణాకర్ణము అను వానిని ప్రయోగించి ఇంద్రశత్రువులగు పౌలోమ కాలకేయ లనురాక్షసులను, నివాత కవచులనువారితో పాటుగా ఒక్కడై జయించెను.

సోఽన్తఃపుర గతః పార్థః కూపేఽగ్ని రివ సంవృతః,

అట్టి అర్జునుడు, నూతిలో నిప్పువలె, అంతః పురమున మరుగు వడి యుండెను.

కన్యాపురగతం దృష్ట్వా గోష్ఠే ష్వివ మహర్షభమ్,
స్త్రీవేష వికృతం పార్థం కున్తీం గచ్ఛతి మేమనః.

గోశాలలలోని మహావృషభమువలె అంతఃపురమున ఆడంగి వేషముతో వికారముగా కానవచ్చు అర్జునుని చూచినపుడెల్ల నామదిలో కుంతి మెదలును.]

తథా దృష్ట్వా యవీయాంసం సహదేవం గవాంపతిమ్,
గోషు గోవేష మాయాన్తం పాణ్డుభూతాస్మి భారత. 32

అట్లే మా చిన్నారి తమ్ముడు సహదేవుడు గోవులలో కలిసి ఆబోతువలె వచ్చుచుండగా చూచుచున్న పాండురాజు ఆవేశించి నట్లుండును.

సహదేవస్య వృత్తానిచిన్తయన్తీ పునః పునః,
న నిద్రా మభిగచ్ఛామి భీమసేన కుతోరతిమ్. 33

మాటిమాటికి సహదేవుని నడవడులను స్మరించు నాకు నిద్రయే పట్టదు. ఇంక ప్రీతి మాట చెప్పనేల ?

న విన్దామి మహాబాహో సహదేవస్య దుష్కృతమ్,
యస్మిన్నేవం విధం దుఃఖం ప్రాప్నుయాత్ సత్య విక్రమః. 34

ఓ మహా బాహూ! సహదేవుడే పాపము చేసి యెరుగడు. అట్టి సత్య విక్రమునకు ఇంతటి దుఃఖము వచ్చిపడినది.

దూయామి భరతశ్రేష్ఠ దృష్ట్వా తే భ్రాతరం ప్రియమ్,
గోషు గోవృష సంకాశం మత్స్యేనాభి నివేశితమ్. 35

మత్స్యరాజు గోవుల యందు నియమించిన నీ అనుగు తమ్ముడు ఆ బోతువలె కాన రాగా నా గుండె చెదరిపోవుచున్నది.

సంరబ్ధం రక్త నేపథ్యం గోపాలానాం పురోగమమ్,
విరాట మభినన్దన్త మథ మే భవతి జ్వరః. 36

ఎఱ్ఱని వేషము ధరించి ఆర్భాటము చేయుచు గోపాలకుల ముందు నడచుచు విరాటుని పొగడుచు ఆతనిని చూచినంతనే నాకు జ్వరము వచ్చును.

---

32. గోవేషమ - ఆబోతువలె నున్నవానిని;
35. దూయామి- ఏడ్చుచున్నాను;

సహదేవం హి మే వీర నిత్య మార్యా ప్రశంసతి,
మహాభిజన సంపన్నః శీలవాన్ వృత్తవానితి. 37

ఓ వీరుడా ! ఈ సహదేవుడు, గొప్పకులాభిమానము, శీలము, నడివడి కలవాడని మా యత్త ఎప్పుడు పొగడు చుండెడిది.

హ్రీనిషేవో మధురవాగ్ ధార్మికశ్చ ప్రియశ్చమే,
స తేఽరణ్యేషు వోఢవ్యో యాజ్ఞసేని క్షపాస్వపి. 38

'ఈతడు సిగ్గుపడుచుండును. మధురమైన మాటలు కలవాడు. ధార్మికుడు, నా కీతడన్న ఎంతో ఇష్టము. ఓ ద్రౌపదీ అడవులలో వీనిని చక్కగా చూచుకొనుము. రాత్రులందును కాపాడుము.'

సుకుమారశ్చ శూరశ్చ రాజానం చాప్యనువ్రతః,
జ్యేష్ఠాప చాయినం వీరం స్వయం పాఞ్చాలి భోజయేః. 39

మిక్కిలి మెత్తనివాడు, శూరుడు. ధర్మరాజు వెంటనంటి యుండుటయే యాతని వ్రతము. పెద్దవారిని పూజించు ఈ వీరునికి ఓ ద్రౌపదీ ! నీవే స్వయముగా అన్నము పెట్టుము.

ఇత్యువాచ హి మాం కున్తీ రుదతీ పుత్రగృద్ధినీ,
ప్రవ్రజన్తం మహారణ్యాం తం పరిష్వజ్య తిష్ఠతీ. 40

ఆ కుంతీదేవి మహారణ్యములకు అరుగుచున్న ఈ కొడుకును కౌగిలించుకొని పుత్రప్రేమతో ఏడ్చుచు నాతో ఈమాట లనెను.

తం దృష్ట్వా వ్యాపృతం గోషు వత్సచర్మక్షపాశయమ్,
సహదేవం యుధాం శ్రేష్ఠం కిం ను జీవామి పాణ్డవ. 41

అట్టి సహదేవుడు, యోధులలో అగ్రేసరుడు గోవులలో కలిసి దూడల చర్మములపై రాత్రు లందు నిద్రించుచుండగా చూచియు నేనేల బ్రదికే యున్నాను ?

---

39. జ్యేష్ఠ - అపచాయినమ్ - పెద్ద అన్నను పూజించువానిని;
41. వత్స చర్మ, క్షపా, శయమ్ - దూడల చర్మములందు రాత్రివేళ నిదురించు వానిని;

యస్త్రిభి ర్నిత్యసంపన్నో రూపేణా స్త్రేణ మేధయా,
సోఽశ్వబన్ధో విరాటస్య పశ్య కాలస్య పర్యయమ్. 42

రూపము, అస్త్రము, బుద్ధి - అను మూడును నిత్యము పుష్కలముగా గల ఆ నకులుడు విరాటుని గుఱ్ఱముల కాపరి యాయెను. కాల పాశ మెట్టిదో చూడుము.

అభ్యకీర్యన్త వృన్దాని దామగ్రన్థి ముదీక్ష్య తమ్,
వినయన్తం జవేనాశ్వాన్ మహారాజస్య పశ్యతః. 43

ఈ దామగ్రంథిని చూచి మున్ను శత్రువులమూకలు చెల్లా చెదరయ్యెడివి. ఆతడిప్పుడు మహారాజు చూచుచుండగా శక్తిగొలది గుఱ్ఱములను తీర్చి దిద్దుచుండెను.

అపశ్య మేనం శ్రీమన్తం మత్స్యం భ్రాజిష్ణు ముత్తమమ్,
విరాట ముపతిష్ఠన్తం దర్శయన్తం చ వాజినః. 44

శ్రీమంతుడు, ఉత్తముడు, కాంతితో విరాజిల్లువాడు నగు నీతడు విరాటుని కొలుచుచు, గుఱ్ఱములను చూపుచునుండగా చూచితిని.

కిం ను మాం మన్యసే పార్థ సుఖి నీతి పరన్తప,
ఏవం దుఃఖ శతావిష్టా యుధిష్ఠిర నిమిత్తతః. 45

ఇట్లు ధర్మరాజు కారణముగా నూరుదుఃఖములలో మునిగిన నేను సుఖముగా ఉన్నానని తలచితివా !

అతః ప్రతివిశిష్టాని దుఃఖా న్యన్యాని భారత,
వర్తన్తే మయి కౌన్తేయ వక్ష్యామి శృణు తాన్యపి. 46

ఇంత కన్నను ఘోరమైన దుఃఖములు నా కెన్నో కలవు. ఓ భరత వంశము వాడా ! కుంతీపుత్రుడా ! చెప్పగొందును. వానిని కూడ వినుము.

యుష్మాసు ధ్రియమాణేషు దుఃఖాని వివిధాన్యుత,
శోషయన్తి శరీరం మే కింను దుఃఖ మతః పరమ్. 47

మీరు జీవించియుండగా ఇట్టి వివిధములైన దుఃఖములు నా శరీరమును పీల్చి పిప్పిచేయుచున్నవి. ఇంతకన్న దుఃఖ మేమి కలదు.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి కీచకవధపర్వణి ద్రౌపదీభీమసంవాదే
ఏ కో న విం శో ఽ ధ్యా యః,
ఇది శ్రీమహాభారత విరాటపర్వమున కీచకవధపర్వమున ద్రౌపదీభీమసంవాదమున
పం దొ మ్మి ద వ అ ధ్యా య ము.

## వింశోఽధ్యాయః - ఇరువదవ అధ్యాయము

ద్రౌపద్యా భీమసేనం ప్రతి స్వకీయదుఃఖ నివేదనమ్.
ద్రౌపది భీమసేనునకు తన దుఃఖముల నెఱింగించుట.

ద్రౌపద్యువాచ - ద్రౌపదియిట్లు పలికెను.

అహం సైరంధ్రివేషేణ చరన్తీ రాజవేశ్మని,
శౌచదాస్మి సుదేష్ణాయా అక్షధూర్తస్య కారణాత్. 1

ఈ పాచికజూదరి కారణమున నేను రాజభవనమున సైరంధ్రి వేషమున తిరుగుచు, సుదేష్ణకు స్నానాదులు చేయించుదాన నైతిని.

విక్రియాం పశ్య మే తీవ్రాం రాజపుత్ర్యాః పరంతప,
ఆత్మకాల ముదీక్షన్తీ సర్వం దుఃఖం కిలాన్తవత్. 2

ఓ శత్రుసంహారకా! రాచపుట్టుక పుట్టిన నాకు కలిగిన యీ తీవ్ర వికారమును చూడుము. చావువంటి యీకష్టమంతటిని మంచి కాలము వచ్చునని ఎదురుచూచుచు భరించుచున్నాను.

అనిత్యా కిల మర్త్యానా మర్థసిద్ధి ర్జయాజయౌ,
ఇతి కృత్వా ప్రతీక్షామి భర్తృణా ముదయం పునః. 3

1. శౌచదా - మట్టి, నీరు మున్నగు శుద్ధిచేయు సాధనమ్ములను సమకూర్చు దానను.

మనుజులకు అర్థములు సిద్ధించుటయు, గెలుపు ఓటములును అనిత్యము గదా అని నాపతులు మరల ఉన్నతి పొందుటను ఎదురు చూచుచు ఉన్నాను.

చక్రవత్పరివర్తన్తే హ్యర్థాశ్చ వ్యసనాని చ,
ఇతి కృత్వా ప్రతీక్షామి భర్తౄణా ముదయం పునః. 4

అర్థములును, కష్టములును చక్రమువలె క్రిందు మీదగు చుండును - అనుభావముతో నాపతుల అభివృద్ధికై ఎదురు చూచు చున్నాను.

య ఏవ హేతు ర్భవతి పురుషస్య జయావహః,
పరాజయే చ హేతుశ్చ సఇతి ప్రతిపాలయే,
కిం మాం న ప్రతిజానీషే భీమసేన మృతామివ. 5

పురుషునకు జయమును గల్గించు హేతువే ఒక్కొక్కమారు ఓటమికిని కారణమగునని తగుకాలమునకై ఎదురు చూచు చున్నాను. అట్టి నన్ను ఓ భీమసేనా ! చచ్చిన దానినివలె ఏల అరయకున్నావు.

దత్వా యాచన్తి పురుషా హత్వా వధ్యన్తిచాపరే,
పాతయిత్వా చ పాత్యన్తే పరై రితి చ మే శ్రుతమ్. 6

ఇచ్చినవారే బిచ్చమెత్తుదురు. కొట్టినవారే దెబ్బతినుటయు గలదు. ఇతరులను గూల్చినవారును ఇతరులచే కూలుదురు - కాల మహిమ ఇట్టిదని నేను వినియుంటిని.

---

5. పురుషస్య - దుర్యోధనునివంటి మనుజునకు, జయావహః - గెలుపును కూర్చునదై య ఏవ = ఏకాలము, హేతుః, భవతి = కారణమాయెనో, స ఏవ = ఆకాలమే, పరాజయే చ - ఓటమియందును, హేతుః - కారణము, భవతి - అగును, ఇతి = అని, ప్రతిపాలయే - అట్టి కాలమునకై ఎదురు చూచుచున్నాను.

న దైవ స్యాతిభారోఽస్తి న చైనాస్యాతివర్తనమ్,
ఇతి చాప్యాగమం భూయో దైవస్య ప్రతిపాలయే. 7

దైవమునకు దుష్కరమైనదిలేదు. దైవము నతిక్రమించుటయు జరుగదు. కావున తిరిగి దైవము రాకకై ఎదురు చూచుచున్నాను.

స్థితం పూర్వం జలం యత్ర పునస్తత్రైవ గచ్ఛతి,
ఇతి పర్యాయ మిచ్ఛన్తీ ప్రతీక్షే ఉదయం పునః. 8

మున్ను సిరెందుండునో మరల అచటి చేరును. అట్టి దశ నపేక్షించుచు మరల అభ్యున్నతిని ప్రతీక్షించు చున్నాను.

దైవేన కిల యస్యార్థః సునీతోఽపి విపద్యతే,
దైవస్య చాగమే యత్నస్తేన కార్యో విజానతా. 9

తన కార్యము ఎంతచక్కగా చేసినను దైవముచేత చెడినచో బుద్ధిమంతుడు మరల దైవము రాకకొరకే ప్రయత్నింప వలయును.

యత్ తు తే వచనస్యాస్య కథితస్య ప్రయోజనమ్.
పృచ్ఛ మాం దుఃఖితాం తత్త్వం పృష్టా చాత్ర బ్రవీమి తే. 10

నీకు చెప్పిన మాటకు ప్రయోజనమేమో దుఃఖితనగు నన్నడుగుము. అడిగినచో నీకు తత్త్వము నెరిగింతును.

మహిషీ పాణ్డుపుత్రాణాం మహితా ద్రుపదస్య చ
ఇమా మవస్థాం సంప్రాప్తా మదన్యా కా జిజీవిషేత్. 11

పాండు పుత్రుల పట్టపురాణిని ద్రుపదుని కూతురను నాకిట్టి గతి పట్టినది. నాకంటె వేరొకతె బ్రదుకగోరునా ?

7. దైవమునకు వశమై ఏర్పును దిగమ్రింగుకొనుచున్న దానవని భావము.
8. ఎండినకాలను నిండినట్లు మరల సంపద మనకు సిద్ధించుటను వేచియున్నదానని భావము.
9. అగమే - అనుకూల్యమునందు,

కురూన్ పరిభవేత్ సర్వాన్ పిఞ్చాతానపి భారత,
పాణ్డవేయాంశ్చ సంప్రాప్తో మమక్లేశో హ్యరిందమ. 12

ఓ శత్రుమర్దనా ! నాకు వాటిల్లిన కీడు కుంతీ పుత్రులగు నిమ్ములను చేరి భీష్మాది కురు వీరులను, ద్రుపదుడు మున్నగు పాంచాలురను నాశనము చేయును.

భ్రాతృభిః శ్వశురైః పుత్రైర్బహుభిః పరివారితా,
ఏవం సముదితా నారీ కాత్వన్యా దుఃఖితా భవేత్. 13

అన్నదమ్ములు, మామలు, పుత్రులు పెక్కురు గల స్త్రీ మఱియొకతె ఇట్లు దుఃఖితయగునా ?

నూనం హి బాలయా ధాతుర్మయా వై విప్రియం కృతమ్,
యస్య ప్రసాదాద్ దుర్నీతం ప్రాప్తాస్మి భరతర్షభ. 14

నేను చిన్నతనమున బ్రహ్మకేదో అపరాధము చేసియుంటిని. అతని దయవలన నాకీ దురవస్థ ఘటిల్లినది.

వర్ణావకాశ మపి మే పశ్య పాణ్డవ యాదృశమ్,
తాదృశో మే న తత్రాసీద్ దుఃఖే పరమకే తదా. 15

ఓ పాండుతనయా ! నా యొడలివన్నె ఎంత తరిగినదో చూడు. ఆ అడవిలో అంత దుఃఖము అనుభవించునప్పుడును అది యిప్పటివలె లేదు.

త్వమేవ భీమ జానీషే యన్మే పార్థ సుఖం పురా,
సాహం దాసీత్వ మాపన్నా న శాన్తి మవశా లభే. 16

12. పాణ్డవేయాన్ - పాండుని భార్య పాండవి - కుంతి - ఆమె పుత్రులు - పాండవేయులు.
13. సముదితా - చక్కని పుట్టుక కలది.
14. బాలయా - చేసినతప్పు తెలియుట లేదని తాత్పర్యము.
15. వర్ణావకాశః - దేహకాంతి తగ్గుట.

ఓ భీమా ! కుంతీ తనయా ! మునుపు నేనెట్టి సుఖము ననుభవించితినో నీకే తెలియును. అట్టి నేను దాసినై పరాధీనురాలనై శాంతి లేనిదాననైతిని.

నాద్రైవిక మహం మన్యే యత్ర పార్థో ధనంజయః,
భీమధన్వా మహాబాహు రాస్తే ఛన్న ఇవానలః. 17

ఇది కేవలము దైవము వలన కలిగినది కాదని చెప్పజాలను ఏలయిన భయంకర ధనువు గల మహా బాహువు ధనంజయుడు బూడిద కప్పిన నిప్పువలె నున్నాడు.

అశక్యా వేదితుం పార్థ ప్రాణినాం వై గతి ర్నరైః,
వినిపాత మిమం మన్యే యుష్మాకం హ్యావిచి న్తితమ్. 18

ప్రాణులకు సంభవించు నవస్థను నరులెవ్వరు ఎఱుగ జాలరు. అట్లే మీ కీపరాభవము తెలియకయే వచ్చిపడినదని తలంతును.

యస్యా మమ ముఖప్రేక్షా యూయ మిన్ద్రసమాః సదా,
సా ప్రేక్షే ముఖ మన్యాసా మవరాణాం వరాసతీ. 19

నా ముఖమును ఇంద్రసములైన మీరు చూచుచుండెడి వారు. అట్టి నేను! శ్రేష్ఠురాలనై యుండియు, హీన స్త్రీల ముఖము చూచుచున్నాను

పశ్య పాణ్డవ మేఽవస్థాం యథా నార్హామి వై తథా,
యుష్మాసు ధ్రియమాణేషు పశ్య కాలస్య పర్యయమ్. 20

ఓ పాండు కుమారా ! చూడు ! మీరు జీవించి యుండగనే నా కెట్టి నీచదశ పట్టినదో చూడు ! కాలపాశము ఎట్టిదో చూడు.

యస్యాః సాగర పర్యన్తా పృథివీ వశవర్తినీ,
ఆసీత్ సాద్య సుదేష్ణాయా భీతాహం వశవర్తినీ. 21

18. వినిపాతమ్ - పరాభవము

ఏనాఁడు సముద్రమే అవధిగాగల భూమి యంతయు వశమై యుండెడిదో ఆ నేను నేడు భయముతో సుదేష్ణ చెప్పు చేతలలో ఉన్నాను.

యస్యాః పురస్సరా ఆసన్ పృష్ఠతశ్చానుగామినః,
సాహ మద్య సుదేష్ణాయాః పురః పశ్చాచ్చ గామినీ. 22

మునుపు నాకు ముందు వెనుకలలో నడచు పరిచారకులు చాలమంది ఉండెడివారు. అట్టి నేను నేడు సుదేష్ణకు ముందు వెనుకలలో నడచుచున్నాను.

ఇదంతు దుఃఖం కౌన్తేయ మమాసహ్యం నిబోధ తత్,
యా న జాతు స్వయం పింషే గాత్రోద్వర్తన మాత్మనః,
అన్యత్ర కున్త్యా భద్రంతే సా పినష్మ్యద్య చన్దనమ్. 23

ఓ కుంతీకుమారా! ఈ నా దుఃఖము ఎంత సహింపరానిదో చూడుము. మా అత్త కుంతికి తప్ప ఎన్నడు నా దేహమునకును నలుగు బెట్టని దానను ఈనాడు ఇక్కడ గంధములు తీయుచున్నాను.

పశ్య కౌన్తేయ పాణీ మే నైవాభూతాం హి యౌ పురా,
ఇత్యస్య దర్శయామాస కిణవన్తౌ కరౌ శుభౌ. 24

చూడు ఈ నా చేతులు మున్నెన్నడైన నిట్లుండెనా! అని కాయలు కాచిన తన రెండు చేతులను చూపెను.

బిభేమి కున్త్యా యా నాహం యుష్మాకం వా కదాచన,
సా ద్యాగ్రతో విరాటస్య భీతా తిష్ఠామి కిఙ్కరీ. 25

నేను కుంతికి కాని, మీకు కాని యెన్నడు భయపడలేదు. అట్టి నేనీ నాడు విరాటుని యెదుట భయముతో దాసినై నిలిచి యుందును.

కిం ను వక్ష్యతి సమ్రాణ్మాం వర్ణకః సుకృతోనవా,
నాన్యపిష్టం హి మత్స్యస్య చన్దనం కిల రోచతే. 26

మై పూత చక్కగా కుదరనిచో చక్రవర్తి నన్నేమేమి మాటలాడును ! ఆ విరాటునకు నేను తీసిన గంధము తప్ప రుచింపదట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

సా కీర్తయన్తీ దుఃఖాని భీమసేనస్య భామినీ,
రురోద శనకైః కృష్ణా భీమసేన ముదీక్షతీ. 27

ఇట్లా భామిని ద్రౌపది భీమసేనునకు తన పాటులను చెప్పకొనుచు నాతనిని చూచుచు మెల్లగా నేడ్చెను.

సా బాష్పకలయా వాచా నిఃశ్వసన్తీ పునః పునః,
హృదయం భీమసేనస్య ఘట్టయన్తీన మబ్రవీత్. 28

ఆమె మాటి మాటికి నిట్టూర్పులు పుచ్చుచు డగ్గుత్తికతో మనోజ్ఞ మగు వాక్కుతో భీముని ఎడదకు రాపిడి కలిగించుచు ఇట్లు పలికెను.

నాల్పం కృతం మయా భీమ దేవానాం కిల్బిషం పురా,
అభాగ్యా యత్ర జీవామి కర్తవ్యే సతి పాణ్డవ. 29

ఓయీ ! భీమా ! నేను పూర్వము దేవతలకు చేసిన కీడు చిన్నదై యుండదు. కావుననే చావవలసిన చోట హీనముగా బ్రదుకు చున్నాను.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తత స్తస్యాః కరౌ సూక్ష్మౌ కిణవన్తౌ వృకోదరః,
ముఖ మానీయ వై పత్న్యా రురోద పరవీర హా. 30

---

26. వర్ణకః - మైపూత
29. కర్తవ్యే - చావలసి యుండగా: "కృతాహింసా యామ్" - అనుధాతువని రూప మిది

అంత శత్రువుల రూపుమాపు వృకోదరుడు కాయలు కాచిన ఆమె సన్నని చేతులను ముఖముపై చేర్చుకొని ఏడ్చెను.

తౌ గృహీత్వా చ కౌన్తేయో బాష్పముత్సృజ్య వీర్యవాన్,
తతః పరమ దుఃఖార్త ఇదం వచన మబ్రవీత్. 31

వీర్యవంతుడగు ఆ కుంతీకుమారుడు ఆ చేతులను పట్టుకొని, కన్నీరు విడుచుచు, మిక్కిలి దుఃఖముతో, ఇట్లు పలికెను.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి కీచకవధపర్వణి
ద్రౌపదీభీమసంవాదే వింశోఽధ్యాయః

ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున కీచకవధ
పర్వమున ద్రౌపదీభీమసంవాదమను నిరువదియవ అధ్యాయము.

## ఏక వింశోఽధ్యాయః – ఇరువదియొకటవ అధ్యాయము

భీమసేన ఉవాచ – భీమసేను డిట్లు పలికెను.

ధిగస్తు మే బాహు బలం గాణ్డీవం ఫాల్గునస్య చ,
యత్ తే రక్తౌ పురా భూత్వా పాణీ కృతకిణా విమౌ. 1

పూర్వము ఎఱ్ఱని వన్నెతో సుకుమారముగనుండు నీ చేతులు కాయలు కాచిన వనగా ఛీ ఛీ! నా బాహు బలమేల? అర్జునుని గాండీవ మేల?

సభాయాం తు విరాటస్య కరోమి కదనం మహత్,
తత్ర మే కారణం భాతి కౌన్తేయో యత్ ప్రతీక్షతే. 2

అట సభలో ధర్మరాజు ఏ హేతువుతో నావైపు చూచెనో అది నాకు తోచినది. లేకపోయిన ఆ విరాటుని కొలువులో పెద్ద యుద్ధము చేసి యుండెడి వాడను.

అథవా కీచకస్యాహం పోథయామి పదా శిరః,
ఐశ్వర్య మదమత్తస్య క్రీడన్నివ మహా ద్విపః. 3

ఐశ్వర్య గర్వముచే ఒడలు తెలియని ఆ కీచకుని తలను మహా గజము ఆటలాడుచున్నట్లు కాలితో మట్టగించి యుండెడి వాడను.

అపశ్యం త్వాం యదా కృష్ణే కీచకేన పదా హతామ్,
తదైవాహం చికీర్షామి మత్స్యానాం కదనం మహత్. 4

కీచకుడు నిన్ను కాలితో తన్నుట నెప్పుడు చూచితినో అప్పుడే మత్స్యులతో గొప్ప యుద్ధము చేయ గోరితిని.

తత్ర మాం ధర్మరాజస్తు కటాక్షేణ న్యవారయత్,
తదహం తస్య విజ్ఞాయ స్థిత ఏ వాస్మి భామిని!. 5

అప్పుడు ధర్మరాజు నన్ను కడకంటితో నిలు వరించెను. నేను ఆతని భావ మెరిగి అట్లే నిలబడి పోయితిని.

యచ్చ రాష్ట్రాత్ ప్రచ్యవనం కురూణా మవధశ్చ యః,
సుయోధనస్య కర్ణస్య శకునేః సౌబలస్య చ, 6
దుఃశాసనస్య పాపస్య యన్మయా నాహృతం శిరః,
తన్మే దహతి గాత్రాణి హృది శల్య మివార్పితమ్.

రాజ్యమునుండి భ్రష్టులమగుట, కౌరవుల చంపకుండుట, సుయోధనుడు, కర్ణుడు, సుబలతనయు డగు శకుని, పాపుడగు దుశ్శాసనుడు అను వారి తలలు తరుగకుండుట అనునవి నా గుండెలో గ్రుచ్చుకొన్నము లుకుల వలె నా ఒడలు మండించుచున్నవి.

మా ధర్మం జహి సుశ్రోణి క్రోధం జహి మహామతే, 7

ఓ సుందరీ! ధర్మమును విడువకు. ఓ బుద్ధిశాలినీ! క్రోధమును విడువుము.

ఇమం తు సముపాలంభం త్వత్తో రాజా యుధిష్ఠిరః,
శృణుయా ద్యది కల్యాణి కృత్స్నం జహ్యాత్ స జీవితమ్. 8

యుధిష్ఠిర మహారాజు నీవు చేసిన యీ నిందను విన్నచో ప్రాణములను వదలుదు.

ధనంజయో వా సుశ్రోణి యమౌ వా తనుమధ్యమే,
లోకాన్తర గతేష్వేషు నాహం శక్ష్యామి జీవితుమ్. 9

అట్లే అర్జునుడును, కవలలును. వారు పరలోకమున కరిగినచో నేను బ్రదుకజాలను.

పురా సుకన్యా భార్యా చ భార్గవం చ్యవనం వనే,
వల్మీకభూతం శామ్యన్త మన్వపద్యత భామినీ. 10

పూర్వము భృగువంశము వాడగు చ్యవనుని, భార్య సుకన్య అతడడవిలో పుట్టవలెనై ముదిమిలో నుండగా ఆతనినే అనుసరించెను.

నారాయణీ చేన్ద్రసేనా రూపేణ యది తే శ్రుతా
పతి మన్వచరద్ వృద్ధం పురా వర్షసహస్రిణమ్. 11

నీవు వినియే యుందువు. రూపవతి నారాయణియగు ఇంద్రసేన వేయివత్సరముల వయస్సుగల ముసలి మగనిని సేవించెను.

దుహితా జనకస్యాపి వైదేహీ యది తే శ్రుతా
పతి మన్వచరత్ సీతా మహారణ్య నివాసినమ్. 12

జనకునిబిడ్డ వైదేహి సీత మహారణ్యములో నివసించు భర్తనే యనుసరించెను. వినియుందు వనుకొందును.

రక్షసా నిగ్రహం ప్రాప్య రామస్య మహిషీ ప్రియా,
క్లిశ్యమానాపి సుశ్రోణి రామమే వాన్వపద్యత. 13

రాముని ప్రియ మహిషి సీత రక్కసునిచేత చిక్కువడి ఎన్నో దుఃఖములు పొందియు రామునే యనుసరించెను.

---

10. అన్వపద్యత - అనుసరించెను,

లోపాముద్రా తదా భీరు వయోరూప సమన్వితా,
అగస్త్యి మన్వయా ద్ధిత్వా కామాన్ సర్వా నమానుషాన్. 14

చక్కని రూపము వయస్సుగల లోపాముద్రయు దివ్యములైన సర్వకామములను విడనాడి అగస్త్యునే వెంటనంటెను.

ద్యుమత్సేన సుతం వీరం సత్యవన్త మనన్దితా,
సావిత్ర్యనుచచారైకా యమలోకం మనస్వినీ. 15

ఆత్మాభిమానముగలదియు, ఏదొసగు లేనిదియు నగు సావిత్రియు ద్యుమత్సేనుని కుమారుడు వీరుడునగు సత్యవంతునే అనుసరించి ఒంటిగా యమలోకము వరకు నరిగెను.

యథైతాః కీర్తితా నార్యో రూపవత్యః పతివ్రతాః,
తథా త్వమపి కల్యాణి సర్వైః సముదితా గుణైః. 16

రూపవతులు, పతివ్రతలు నగు నీ వనితలవలె నీవను మంచి గుణములన్నియు కలదానవు.

మాదీర్ఘం క్షమ కాలం త్వం మాస మర్ధంచ సమ్మితమ్,
పూర్ణే త్రయోదశే వర్షే రాజ్ఞాం రాజ్ఞీ భవిష్యసి. 17

కొంచెముకాల మోపిక పట్టుము. ఒకనెలపై సగముమాత్రమే గడువు కలదు. పదుమూడవ యేడు నిండినంతనే మహారాజులకు రాణి వగుదువు.

[సత్యేన తే శపే చాహం భవితా నాన్యథేతి హ,
సర్వాసాం పరమస్త్రీణాం ప్రామాణ్యం కర్తు మర్హసి.

ఇట్లుకాక మరియొకవిధముగా కాదని సత్యముగా ఒట్టువేసి చెప్పుచున్నాను. నీవు ఉత్తమస్త్రీలందరకు మేలుబంతి వగుదువు.

సర్వేషాం చ నరేన్ద్రాణాం మూర్ధ్ని స్థాస్యసి భామిని,
భర్తృభక్త్యా చ వృత్తేన భోగాన్ ప్రాప్స్యసి దుర్లభాన్,

మహారాజులందరి తలలపై నుందువు. భర్తలయందలి భక్తి చేతను, సీశీలముచేతను పొందశక్యముకాని భోగములు పొందుదువు.]

ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లనెను.

ఆర్తయైతన్మయా భీమ కృతం బాష్పప్రమోచనమ్,
అపారయన్త్యా దుఃఖాని న రాజాన ముపాలభే. 18

ఓ భీమా! దుఃఖితురాలనై కన్నీరు నించితిని. దుఃఖములను తట్టుకొనలేక అంటినికాని నిజముగా రాజును నిందింపలేదు.

కిముక్తేన వ్యతీతేన భీమసేన మహాబల,
ప్రత్యుపస్థితకాలస్య కార్యస్యానన్తరో భవ. 19

ఓ మహాబలా! భీమసేనా! గడచిన దానినిగూర్చి పలికి ప్రయోజనమేమి? ప్రస్తుత కాలమునకు చేయదగిన పనికి సన్నద్ధుడ వగుము.

మమేహ భీమ కైకేయీ రూపాభిభవశఙ్కయా,
నిత్య ముద్విజతే రాజా కథం నేయా దిమా మితి. 20

ఓ భీమా! సుదేష్ణ నారూపమువలన అవమానమును శంకించుచు రాజు నన్నెట్లు పొందకుండునా? అని మనసులో సంకటపడుచున్నది.

తస్యా విదిత్వా తం భావం స్వయం చానృతదర్శనః,
కీచకోఽయం సుదుష్టాత్మా సదా ప్రార్థయతే హి మామ్. 21

ఆమె ఆభావమెరిగి స్వయముగా కుత్సితపు చూపుగలమిక్కిలి దుష్టాత్ముడు కీచకుడు ప్రతిదినము నన్ను కోరుచున్నాడు,

---

19. అనన్తరః - ఆ సన్నుతవు, సన్నద్ధుడవు, భవ - ఆగుము.
20. నేయాత్ - న + ఈయాత్ - పొందకుండుదురు.
21. తం భావమ్ - కీచకుడు చేజిక్కించు కొన్నచో రాజు విరక్తుడగు ననుభావమును.

తమహాం కుపితా భీమ పునః కోపం నియమ్య చ,
అబ్రువం కామసంమూఢ మాత్మానం రక్ష కీచక. 22

వానిపై చాల కోపగించితిని. కాని మరల కోపము నణచు
కొని కామముచే మత్తెక్కిన వానితో నిట్లంటిని. ఓయీ కీచకా!
నిన్ను నీవు రక్షించుకొనుము.

గన్ధర్వాణా మహం భార్యా పఞ్చానాం మహిషీ ప్రియా,
తే త్వాం విహన్యుః కుపితాః శూరాః సాహసకారిణః. 23

'నేను అయిదుగురు గంధర్వులకు భార్యను. వారిప్రియమైన
ఇల్లాలను శూరులు, సాహసముతో ప్రవర్తించు వారునగు ఆ గంధ
ర్వులు కోపించిరేని నిన్ను చంపుదురు.

ఏవ ముక్తః సుదుష్టాత్మా కీచకః ప్రత్యువాచ హ,
నాహం బిభేమి సైరంధ్రి గన్ధర్వాణాం శుచిస్మితే. 24

నేనిట్లు పలుకగా ఆదుష్టాత్ముడు కీచకుడు ఇట్లు బదులు
పలికెను. 'ఓ సైరంధ్రీ! చక్కని చిరునగవుగలదానా! నేను
గంధర్వులకు భయపడను.

శతం శతసహస్రాణి గన్ధర్వాణాం మహం రణే,
సమాగతం హనిష్యామి త్వం భీరు కురు మేక్షణమ్. 25

'గంధర్వులు వందవేల వందలు వచ్చినను యుద్ధమున చంప
గలను. ఓ భీరూ! నీవు నన్ను స్వీకరింపుము,'

ఇత్యుక్తే చాబ్రువం మత్తం కామాతుర మహం పునః,
న త్వం ప్రతిబల శ్చైషాం గన్ధర్వాణాం యశస్వినామ్, 26

వాడిట్లు పలుకగా కామరోగముతో పొగరెక్కిన వానితో
మరల నిట్లంటిని. ఆ గంధర్వులు మిక్కిలి యశస్వులు, నీవు వారిని
మార్కొనజాలవు.

---

25. క్షణమ్ - స్వీకారము,

ధర్మే స్థితాస్మి సతతం కులశీల సమన్వితా,
నేచ్ఛామి కంచిద్ వధ్యన్తం తేన జీవసి కీచక! 27

నేనెల్లపుడు ధర్మమున నిలచియుందును. కులము శీలము కల దానను. కావున ఎవడైన చంపబడుచుండుటను కోరను. కీచకా! అందువలన బ్రదికితివి.

ఏవముక్తః స దుష్టాత్మా ప్రాహసత్ స్వనవత్ తదా,
అథ మాం తత్ర కైకేయీ ప్రైషయత్ ప్రణయేనతు. 28

నేనిట్లనగా ఆ దుష్టాత్ముడు వికటాట్టహాసము చేసెను. పిమ్మట సుదేష్ణ బ్రతిమాలి నన్నటకు పంపెను.

తేనైవ దేశితా పూర్వం భ్రాతృప్రియ చికీర్షయా,
సురా మానయ కల్యాణి కీచకస్య నివేశనాత్. 29

వాడే ఆమె కుపదేశించెను. ఆమెయు సోదరునకు ప్రియము చేయగోరి 'మంచిదానా! కీచకుని భవనమునుండి మద్యము తెమ్మ' అని చెప్పి పంపెను.

సూతపుత్రస్తు మాం దృష్ట్వా మహత్ సాన్త్వ మవర్తయత్,
సాన్త్వే ప్రతిహతే క్రుద్ధః పరామర్శమనాభవత్. 30

ఆ కీచకుడును నన్నుచూచి పెద్దగా బ్రియవాక్యము లారంభించెను. అది పెడిసికొట్టగా క్రుద్ధుడై బలాత్కారమునందు బుద్ధి పెట్టెను.

విదిత్వా తస్య సంకల్పం కీచకస్య దురాత్మనః,
తథాహం రాజశరణం జవే నైవ ప్రధావితా. 31

27. వధ్యన్తమ్ - వధింపబడుచున్నవానిని,
30 సాన్త్వమ్ - బ్రతిమాలుటను; అవర్తయత్ - చేసెను.
31, రాజ్ఞః సందర్శనే - రాజునెదుట.

ఆ దురాత్ముని సంకల్ప మెరిగి నేను మిక్కిలి వేగముతో రాజున్న తావునకు పరుగుదీసితిని.

సందర్శనే తు మాం రాజ్ఞః సూతపుత్రః పరామృశత్,
పాతయిత్వా తు దుష్టాత్మా పదాహం తేన తాడితా. 32

రాజు నన్ను చూచుచుండగా దుష్టాత్ముడగు సూతపుత్రుడు నన్ను ముట్టి పడగొట్టి కాల దన్నెను.

ప్రేక్షతేస్మ విరాటస్తు కఙ్కస్తు బహవో జనాః,
రథినః పీఠమర్దాశ్చ హస్త్యారోహాశ్చ నైగమాః. 33

ఆ విరాటము, ఆ కంకభట్టు మఱియు ననేకజనులు రథులు, రాజు ప్రియులు, ఆశ్వికులు, వర్తకులు - అందరు నన్ను చూచు చునే యున్నారు.

ఉపాలబ్ధో మయా రాజా కఙ్కశ్చాపి పునః పునః,
తతో న వారితో రాజ్ఞా న తస్యావినయః కృతః. 34

నేను పలుమారులు రాజును కంకుని నిందించితిని. అప్పటికిని రాజు వానిని నివారింపలేదు. వాని ఆగడమును మాన్పలేదు.

సోఽయం రాజ్ఞో విరాటస్య కీచకో నామ సారథిః,
త్యక్తధర్మా నృశంసశ్చ నరస్త్రీ సమ్మతః ప్రియః. 35

ఈ కీచకుడను వాడు రాజైన విరాటునకు సారథి ధర్మము మాలినవాడు. క్రూరుడు, రాజునకు రాజు భార్యకు ఇష్టుడు, ప్రియుడు.

శూరోఽభిమానీ పాపాత్మా సర్వార్థేషు చ ముగ్ధవాన్,
దారామర్శీ మహాభాగ లభతేఽర్థాన్ బహూనపి. 36

---

33. పీఠమర్దాః- రాజునకు ప్రియమైనవారు; నైగమాః- నగరము వారు లేక వ్యాపారులు :

34. నకృతః - మాన్పబడలేదు.

35. నరస్త్రీ సమ్మతః- నరుడనగా ఇచట రాజు, స్త్రీ అనగా అతని భార్య సుదేష్ణ, వారికి ఇష్టుడు-చుట్టరికము వలన.

క్రూరుడు, అభిమాని, పాపాత్ముడు, అన్ని విషయము లందును మూఢుడు. నీ భార్యను ముట్టినవాడు. బహు ధనములను సంపాదించు చుండును.

ఆహరే దపి విత్తాని పరేషాం క్రోశతా మపి,
న తిష్ఠతి స్మ సన్మార్గే న చ ధర్మం బుభూషతి. 37

ఇతరుల సొమ్ములను, వారు మొత్తుకొనుచున్నను, అపహరించుచుండును. సన్మార్గమున నిలువడు. ధర్మమును సాధింపగోరడు.

పాపాత్మా పాపభావశ్చ కామబాణ వశానుగః,
అవినీతశ్చ దుష్టాత్మా ప్రత్యాఖ్యాతః పునః పునః. 38

పాపాత్ముడు, పాప భావములే చేయుచుండును. కాముని బాణములు త్రిప్పినట్లు తిరుగును. నీతి మాలినవాడు. దుష్టాత్ముడు - వానిని మాటి మాటికి తిరస్కరించితిని.

దర్శనే దర్శనే హన్యాద్ యది జహ్యాం చ జీవితమ్,
తద్ ధర్మే యతమానానాం మహాన్ ధర్మో నశిష్యతి, 39

ఇట్లు కంటబడి నపుడెల్ల వాడు నన్ను తన్నుచుండినచో, నేనాబాధ పడలేక ప్రాణములు విడిచినచో, ధర్మమునకై పాటుపడు మీ గొప్ప ధర్మము నశించును.

సమయం రక్షమాణానాం భార్యా వో న భవిష్యతి.
భార్యాయాం రక్ష్యమాణాయాం ప్రజా భవతి రక్షితా. 40

అన్నమాట దక్కించుకొనుచున్న మీకు మీ భార్య దక్కదు. భార్యను రక్షించుకొన్నపుడే సంతానము రక్షణ కలది యగును.

ప్రజాయాం రక్ష్యమాణా యా మాత్మా భవతి రక్షితః,
ఆత్మా హి జాయతే తస్యాం తేన జాయాం విదుర్బుధాః. 41

సంతానము రక్షింపబడినపుడు ఆత్మ రక్షింపబడును. ఆత్మయే కదా భార్యయందు జనించును. కావుననే పండితులు భార్యను జాయయందురు.

భర్తా తు భార్యయా రక్ష్యః కథం జాయా స్మమోదరే,
వదతాం వర్ణధర్మాంశ్చ బ్రాహ్మణానా మితి శ్రుతః. 42

భార్యకూడ భర్త తనకడుపున పుట్టును గావున ఆతనిని రక్షించుకొనవలయును. వర్ణధర్మములను చెప్పెడు బ్రాహ్మణుల వలన వర్ణధర్మము లిట్లు వినవచ్చును.

క్షత్రియస్య సదాధర్మో నాన్యః శత్రు నిబర్హణాత్.

పగవానిని రూపుమాపుటకంటె క్షత్రియునకు సముచితమైన ధర్మము మరియొకటి ఎన్నటికిని లేదు.

పశ్యతో ధర్మరాజస్య కీచకో మాం పదావధీత్, 43
తవ చైవ సమక్షే వై భీమసేన మహాబల !

ఓ మహాబలా ! భీమసేనా ! ధర్మరాజు చూచుచుండగా నీకన్నుల యెదుట కీచకుడు నన్ను కాలదన్నెను.

త్వయా హ్యహం పరిత్రాతా తస్మాద్ ఘోరాజ్జటాసురాత్. 44
జయద్రథం తథైవ త్వ మజైషీ భ్రాతృభిః సహ.

మునుపు నీవు అంత ఘోర స్వరూపుడు జటాసురునివలన రక్షించితివి గదా ! అట్లే తమ్ములతో కలిసి సైంధవుని గెలిచితివి గదా !

జహీమ మపి పాపిష్ఠం యోఽయం మామవమన్యతే. 45

అట్లే నన్నవమానించు ఈ పాపిష్ఠుని గూడ చంపుము.

కీచకో రాజవాల్లభ్యా చ్ఛోకకృన్మమ భారత,
తమేవం కాము సంమత్తం భిన్ధి కుంభ మివాశ్మని. 46

రాజిచ్చిన చనవువలన కీచకుడు నన్నేడ్పించుచున్నాడు. కామముచే బాగుగా మత్తిల్లిన వానిని రాతిపై కుండను వేసి కొట్టి నట్లు కొట్టుము.

యో నిమిత్త మనర్థానాం బహూనాం మమ భారత,
తం చేజ్జీవ న్త మాదిత్యః ప్రాత రభ్యుదయిష్యతి. 47

విషమాలోడ్య పాస్యామి మా కీచక వశం గమమ్,
శ్రేయోహి మరణం మహ్యాం భీమసేన తవాగ్రతః 48

నాయిన్ని యిడుమలకు కారణమైన ఆ కీచకుడు రేపు సూర్యోదయమగు నప్పటికి బ్రదికి యున్నచో విషము కలుపుకొని త్రావుదును, కీచకునికి మాత్రము చేజిక్కను. ఓయి భీమసేనా! నీముందు చచ్చుటయే నాకు మేలుగదా!

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇత్యుక్త్వా ప్రారుదత్ కృష్ణా భీమస్యోరః సమాశ్రితా,
భీమశ్చ తాం పరిష్వజ్య మహత్ సాన్త్వం ప్రయుజ్యచ. 49

కృష్ణ యిట్లుపలికి భీముని రొమ్ముపై వ్రాలి పెద్దగా నేడ్చెను. భీముడును ఆమెను కౌగిలించుకొని పెద్దగా ఓదార్చెను.

ఆశ్వాసయిత్వా బహుశో భృశ మార్తాం సుమధ్యమామ్,
హేతుతత్త్వార్థ సంయుక్తై ర్వచోభి ర్ద్రుపదాత్మజామ్. 50

ఎంతో దుఃఖముతో కుమిలిపోవుచున్న ఆ ద్రౌపదిని ఉపపత్తులు సత్యార్థములుగల మాటలతో ఊరడిల్ల జేసెను.

ప్రమృజ్య వదనం తస్యాః పాణి నాశ్రు సమాకులమ్,
కీచకం మనసా గచ్ఛత్ సృక్విణీ పరిసంలిహన్,
ఉవాచ చైనాం దుఃఖార్తాం భీమః క్రోధ సమన్వితః. 51

కన్నీటితో మలినమైన ఆమె మోమును చేతితో తుడిచెను. అంత భీముని మదిలో కీచకుడు మెదలెను. భీముడు కోపముచే సెలవులు నాకుచు దుఃఖపీడిత యగు ద్రౌపదితో నిట్లు పలికెను.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వాణి కీచకవధపర్వణి ద్రౌపదీసాన్త్వనే ఏకవింశోఽధ్యాయః

ఇది శ్రీమహాభారత విరాటపర్వమున కీచకవధ పర్వమున ద్రౌపది నమనయించుట అను ఇరువదియొకటవ అధ్యాయము

## ద్వావింశోఽధ్యాయః - ఇరువది రెండవ అధ్యాయము

కీచక భీమసేనయోః సంగ్రామే కీచకవధః.

కీచక భీమసేనుల యుద్ధమున కీచకవధ.

భీమసేన ఉవాచ - భీమసేను డిట్లు పలికెను,

తథా భద్రే కరిష్యామి యథా త్వం భీరు భాషసే,
అద్య తం సూదయిష్యామి కీచకం సహబాన్ధవమ్. 1

ఓ ద్రౌపదీ! నీవన్నట్లే చేయుదును. ఈనాడు కీచకుని, వాని బంధువులతో పాటు, చంపివైతును,

అస్యాః ప్రదోషే శర్వర్యాః కురుష్వానేన సంగతమ్,
దుఃఖం శోకం చ నిర్ధూయ యాజ్ఞసేని శుచిస్మితే. 2

ఓ యజ్ఞసేనపుత్రీ! ఈ రాత్రి ప్రదోషసమయమున నీవు దుఃఖమును శోకమును వెలిబుచ్చక వానితో సంభాషింపుము.

యైషా నర్తనశాలేహ మత్స్యరాజేన కారితా,
దివాత్ర కన్యా నృత్యన్తి రాత్రౌ యాన్తి యథాగృహమ్. 3

మత్స్యరాజు కట్టించిన ఈ నర్తనశాల యున్నదే దానియందు పగలు కన్యలు నృత్యమాడుదురు. రాత్రులందు వారి వారి యిండ్లకు కరుగుదురు.

---

2. సంగతమ్ - సంభాషణము, నిర్ధూయ - కప్పివుచ్చి,

తత్రా౽స్తి శయనం దివ్యం దృఢాఙ్గం సుప్రతిష్ఠితమ్,
తత్రాస్య దర్శయిష్యామి పూర్వప్రేతాన్ పితామహాన్. 4

అచట దివ్యమైన పాన్పుకలదు. దానిఅవయవములుగట్టివి. అది అచ్చట చక్కఁగా పాదుకొని యున్నది. దానిపై వానికి చచ్చిన వాని తాతలను చూపింతును.

యథా చ త్వాం నపశ్యేయుః కుర్వాణాం తేన సంవిదమ్,
కుర్యా స్తథా త్వం కల్యాణి యథా సంనిహితో భవేత్. 5

వానిలో మాటాడు నిన్ను ఇతరులు చూడకుండు విధమున, వాడు నీదరిజేరినట్లు ప్రయత్నింపుము.

వైశంప్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తథా తౌ కథయిత్వా తు బాష్ప ముత్సృజ్య దుఃఖితౌ,
రాత్రి శేషం తమత్యుగ్రం ధారయామాసతు ర్హృది. 6

వారిద్దరట్లు కూడబలుకుకొని దుఃఖములో కన్నీరు విడచుచు అతిభయంకరమైన ఆ మిగిలిన రాత్రిలో శోకమును గుండెలో బిగబట్టి యుండిరి.

తస్యాం రాత్ర్యాం వ్యతీతాయాం ప్రాత రుత్థాయ కీచకః,
గత్వా రాజకులాయైవ ద్రౌపదీ మిద మబ్రవీత్. 7

ఆ రాత్రి గడువగా కీచకుడు ప్రాంతఃకాలమున లేచి రాజభవనమునకే యరిగి ద్రౌపదితో ఇట్లు పలికెను.

సభాయాం పశ్యతో రాజ్ఞః పాతయిత్వా పదా హనమ్,
న చైవాలభసే త్రాణ మభిపన్నా బలీయసా. 8

నిండుసభలో రాజు చూచుచుండగా పడద్రోసి కాలితో తన్నితిని. ఆపదలో నున్న నిన్ను ఏబలవంతుడైన ఆదుకొన వచ్చెనా?

8. పదా - ఆహనమ్ - కాలితో తన్నితిని.

ప్రవాదేనే హ మత్స్యానాం రాజా నామ్నాయ ముచ్యతే,
అహమేవ హి మత్స్యానాం రాజా వై వాహినీపతిః. 1

విరాటుడు ఈ మత్స్యదేశమునకు ఊరక పేరునకు మాత్రపు రాజు. నేనే నిజమైన రాజును సేనాపతిని.

మాం సుఖం ప్రతిపద్యస్వ దాసో భీరు భవామి తే,
అహ్నాయ తవ సుశ్రోణి శతం నిష్కాన్ ధదామ్యహమ్. 10

ఓ భీతహరిణాక్షీ! ఓ సుశ్రోణీ! సుఖముగా నన్ను చేరుము. నేను నీకు దాసుడనగుదును. నీకు ఇప్పటికిప్పుడు నూరుబంగారు నాణెముల నిత్తును.

దాసీశతం చ తే దద్యాం దాసానామపి చాపరమ్,
రథం చాశ్వతరీయుక్త మస్తు నౌ భీరు సంగమః. 11

నీకు నూరుమంది పరిచారికలను, మరియొక నూరుమంది పరిచారకులను, కంచరగాడిదలుకట్టిన రథమును ఇత్తును. మన యిరువురకు సంగమ మగునుగాక!

ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లు పలికెను.

ఏవం మే సమయం త్వద్య ప్రతిపద్యస్వ కీచక.
నత్వాం సఖా వా భ్రాతా వా జానీయాత్ సంగతం మయా. 12

ఓ కీచకా! ఇదిగో ఒక కట్టుబాటు చేయుము. నేను నీతో కూడిన విషయమును నీ ప్రాణమిత్రునకుగాని నీ సోదరునకుగాని తెలియరాదు.

అనుప్రవాదాద్ భీతాస్మి గన్ధర్వాణానాం యశస్వినామ్,
ఏవం మే ప్రతిజానీహి తతో ఽహం వశగా తవ. 13

ప్రసిద్ధికెక్కిన ఆ గంధర్వులనుగూర్చిన వదంతివలన భయపడుచున్నాను. ఇట్లని నాకు మాటయిమ్ము. అపుడు నీకు వశమగుదును.

కీచక ఉవాచ - కీచకు డిట్లు పలికెను.

ఏవ మేతత్ కరిష్యామి యథా సుశ్రోణి భాషసే,
ఏకో భద్రే గమిష్యామి శూన్య మావసథం తవ. 14

నీవు చెప్పినట్లే చేయుదును. ఒంటిగానే ఎవ్వరులేని నీ యింటికి వత్తును.

సమాగ మార్థం రమ్భోరు త్వయా మదనమోహితః,
యథా త్వాం నైవ పశ్యేయు ర్గన్ధర్వాః సూర్యవర్చసః. 15

కామ మోహితుడనైన నేను ఓ రంభోరూ ! నీతో కలయిక కొరకు, నిన్ను ఆ సూర్యునివంటి తేజస్సుగల గంధర్వులు చూడని తీరున వత్తును.

ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లు పలికెను:

యదేత న్నర్తనాగారం మత్స్యరాజేన కారితమ్,
దివాత్ర కన్యా నృత్యన్తి రాత్రౌ యాన్తి యథాగృహమ్. 16

ఇదిగో మత్స్యరాజు కట్టించిన యీ నర్తన గృహముఉన్నదే, దానియందు పగలు కన్యలు ఆటలాడుదురు. రాత్రియందు వారివారి గృహముల కరుగుదురు.

తమిస్రే తత్ర గచ్ఛథా గన్ధర్వా స్తన్నజానతే,
తత్ర దోషః పరిహృతో భవిష్యతి న సంశయః. 17

చీకటి పడినపిదప అక్కడకు రా ! గంధర్వులది యెరుగరు. అక్కడ ఆదోషము తప్పిపోవును సంశయములేదు.

[కీచక ఉవాచ - కీచకు డిట్లు పలికెను.

తథా భద్రే కరిష్యామి యథా త్వం భీరు మన్యసే,
ఏకః స న్నర్తనాగార మాగమిష్యామి శోభనే,
సమాగమార్థం సుశ్రోణి శపేచ సుకృతేన మే.

ఓ భీరూ! మంచిదానా! నీవు తలచినట్లే చేయుదును. నర్తన శాలకు నీతోడికలయికకై ఒక్కడనే వత్తును. నా పున్నెము మీద ఒట్టు.

యథా త్వాం నావబుధ్యన్తే గన్ధర్వా వర వర్ణిని,
సత్యం తే ప్రతి జానామి గన్ధ ర్వేభ్యో నతే భయమ్.

ఓ కాంతా! నిన్ను గంధర్వులు తెలియ జాలరు ఇది సత్యము ఒట్టు. ఆ గంధర్వులవలన నీకు భయము లేదు.]

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తమర్థ మపి జల్పన్త్యాః కృష్ణాయాః కీచ కేవ హ,
దివసార్థం సమభవ న్మాసేనైవ సమం నృప. 18

కీచకునితో అట్లు పలుకుచున్న ద్రౌపదికి ఆ ఒక్క దినము నెలవలె ఆయెను.

కీచ కోఽథ గృహం గత్వా భృశం హర్ష పరిప్లుతః,
సైరంధ్రీ రూపిణం మూఢో మృత్యుం తం నావబుద్ధవాన్. 19

కీచకుడు ఆ నందముతో ఉబ్బిపోయి యింటి కేగి మూఢుడై సైరంధ్రి రూపమున నున్న మృత్యువు నెరుగ కుండెను.

గన్ధా భరణ మాల్యేషు వ్యాసక్తః సవిశేషతః,
అలంచక్రే తదాత్మానం సత్వరః కామమోహితః. 20

గంధములు, ఆభరణములు మాలలు మున్నగు వానియందు ప్రతిదినము కంటె విశేషముగా తగులువడి త్వరతో కామముతో మత్తెక్కి తన్నుదా నలంకరించుకొనెను.

తస్య తత్ కుర్వతః కర్మ కాలో దీర్ఘ ఇవాభవత్,
అను చిన్తయత శ్చాపి తామేవాయత లోచనామ్. 21

అట్లా పనిచేయుచు, ఆ విశాలాక్షినే నిరంతరము ధ్యానించు చున్న ఆతనికి కాలము దీర్ఘ మైనట్లు తోచెను.

ఆ సీదభ్యధికా చాపి శ్రీః శ్రియం ప్రముముచుతః,
నిర్వాణకాలే దీపస్య వర్తి మివ దిధక్షతః. 22

సంపదలు చెడగొట్టుకొనువానికి సంపదలు పెరిగినట్లు, ఆరి పోవుదీపము వత్తిని కాల్చుచు పెద్దగా వయినట్లు వానికి కాలము దీర్ఘమాయెను.

కృతసంప్రత్యయ స్తస్యాః కీచకః కామమోహితః,
నాజానాద్ దివసం యాన్తం చిన్తయానః సమాగమమ్. 23

ఆమె నమ్మకము కలుగునట్లు పలుకగా కామముతో ఒడలెరుగని ఆ కీచకుడు, ఆమె సమాగమమునే చింతించుచు గడచుచున్న పగటిని గుర్తింపకుండెను.

తతస్తు ద్రౌపదీ గత్వా తదా భీమం మహానసే,
ఉపాతిష్ఠత కల్యాణీ కౌరవ్యం పతి మన్తికమ్. 24

అంత నట ద్రౌపది వంటశాలలో భీముని కడకరిగి ఆతని దగ్గర నుండెను.

తమువాచ సుకేశాన్తా కీచకస్య మయా కృతః,
సంగమో నర్తనాగారే యథావోచః పరన్తప. 25

అంత నొక్కని ముంగురులు గల ద్రౌపది భీమునితో ఇట్లు పలికెను. నీవు చెప్పినట్లు ఓ పరంతపా ! కీచకునకు నర్తనాగారమున సమాగమ మేర్పాటు చేసితిని.

శూన్యం స నర్తనాగార మాగమిష్యతి కీచకః.
ఏకో నిశి మహాబాహో కీచకం తం నిషూదయ. 26

23. కృతసంప్రత్యయః - పుట్టిన నమ్మకము కలవాడు.

ఈ రాత్రికి కీచకుడొంటిగా ఎవ్వరులేని నర్తనశాలకు వచ్చును. ఓ మహాబాహూ! వానిని కడతేర్పుము.

తం సూతపుత్రం కౌన్తేయ కీచకం మదదర్పితమ్.
గత్వా త్వం నర్తనాగారం నిర్జీవం కురు పాణ్డవ. 27

ఓ కుంతీకుమారా! పాండుతనయా! మదముచే క్రొవ్వెక్కియున్న ఆ సూతపుత్రుని, నీవు నర్తనాగారమున కరిగి, సంహరింపుము.

దర్పాచ్చ సూతపుత్రోఽసౌ గన్ధర్వా నవమన్యతే,
తం త్వం ప్రహరతాం శ్రేష్ఠ హ్రదాన్నాగ మివోద్ధర, 28

క్రొవ్వెక్కియున్న ఆ సూతుడు గంధర్వులను లెక్కచేయకున్నాడు. ఓ వీరవరుడా! నీవు వానిని, కృష్ణుడు యమునా హ్రదము నుండి కాళియుని లాగివైచినట్లు, లాగివేయుము.

అశ్రు దుఃఖాభిభూతాయా మమ మార్జస్వ భారత,
ఆత్మనశ్చైవ భద్రం తే కురు మానం కులస్యచ. 29

ఓ భారతా! దుఃఖముతో కుమిలిపోవుచున్న నాకన్నీటిని తుడువుము. నీ దుఃఖమును పోకార్చుకొనుము. నీకు మేలయ్యెడు. నీకులగౌరవమును నిలుపుము.

భీమసేన ఉవాచ - భీమసేను డిట్లు పలికెను.

స్వాగతం తే వరారోహే యన్మాం వేదయసే ప్రియమ్,
న హ్యన్యం కఞ్చిదిచ్ఛామి సహాయం వరవర్ణిని. 30

ఓ కాంతా నీకు స్వాగతము. నాకు ప్రియమైన మాట చెప్పితివి. ఓ సుందరీ! నాకు మరియొకని సాయమక్కరలేదు.

---

28. హ్రదాత్ నాగ మివోద్ధర - యమునానదినుండి కాళియ సర్పమును లాగి అవల పారవేసినట్లు ఈ లోకమునుండి దూరముగా విసరివేయుము.

యా మే ప్రీతి_స్త్వయా ఖ్యాతా కీచకస్య సమాగమే,
హత్వా హిడిమ్బం సా ప్రీతి ర్మమాసీద్ వరవర్ణిని. 31

ఈనాడు నీవు కీచకుని సమాగమమునుగూర్చి చెప్పగా కలిగిన ప్రీతి నాడు హిడింబుని చంపినప్పటి ప్రీతివంటిది.

సత్యం భ్రాతౄంశ్చ ధర్మంచ పురస్కృత్య బ్రవీమి తే,
కీచకం నిహనిష్యామి వృత్రం దేవపతి ర్యథా. 32

సత్యమును, సోదరులను, ధర్మమును ముందిడుకొని చెప్పుచున్నాను. దేవేంద్రుడు వృత్రుని చంపినట్లు కీచకుని చంపుదును.

తం గహ్వరే ప్రకాశే వా పోథయిష్యామి కీచకమ్,
అథ చేదపి యోత్స్యన్తి హింసే మత్స్యానపి ధ్రువమ్. 33

చాటుననైనను వెలుపలనైనను ఆ కీచకుని పొడిపొడి చేయుదును. ఒకవేళ మత్స్యులందరు ఎత్తివచ్చినచో వారినందరను మట్టుపెట్టుదును.

తతో దుర్యోధనం హత్వా ప్రతిపత్స్యే వసున్ధరామ్,
కామం మత్స్య ముపాస్తాం హి కున్తీపుత్రో యుధిష్ఠిరః. 34

అటుపై దుర్యోధనుని వధించి భూమినంతటిని వశపరచుకొందును. కుంతీపుత్రుడగు యుధిష్ఠిరుడు ఇచ్చవచ్చినట్లు విరాటుని సేవించుచుండుగాక !

ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లనెను.

తథా న సంత్య జేథా_స్త్వం సత్యం వై మత్కృతే విభో,
నిగూఢ_స్త్వం తథా పార్థ కీచకం తం నిషూదయ. 35

ఓ ప్రభూ ! కుంతీకుమారా ! నాకై సత్యమును వీడకుము కీచకుని గుట్టుగానే చంపుము.

భీమసేన ఉవాచ - భీమసేను డిట్లు పలికెను.

ఏవ మేతత్ కరిష్యామి యథా త్వం భీరు భాషసే,
అద్య తం సూదయిష్యామి కీచకం సహ బాన్ధవైః. 36

ఓ భీరూ ! నీవు పలికినట్లే చేసెదను. నేడు కీచకుని చుట్టము లతోపాటు సంహరించెదను.

అదృశ్యమాన స్తస్యాథ తమస్విన్యా మనిన్దితే.
నాగో బిల్వ మివాక్రమ్య పోథయిష్యా మ్యహం శిరః,
అలభ్యా మిచ్ఛత స్తస్య కీచకస్య దురాత్మనః. 37

ఓ నిర్మలచరితా ! చీకటిలో వానికి కానరాక పొందశక్యము కాని నిన్ను కోరిన దురాత్ముడగు ఆ కీచకుని తలను, ఏనుగు మారేడుకాయనువలె, పిప్పిచేసెదను.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

భీమోఽథ ప్రథమం గత్వా రాత్రౌ ఛన్న ఉపావిశత్,
మృగం హరి రివాదృశ్యః ప్రత్యాకాఙ్క్షత కీచకమ్. 38

అంత భీముడు రాత్రివేళ ముందుగా ఎవ్వరికి కానరాకుండ నరిగి, లేడికై పొంచియున్న సింహమువలె, కీచకునికై పొంచి యుండెను.

కీచకశ్చాప్యలంకృత్య యథా కామ ముపాగమత్,
తాం వేలాం నర్తనాగారం పాఞ్చాలీ సంగమాశయా. 39

కీచకుడును చక్కగా నచ్చిన విధముగా అలంకరించుకొని ఆ వేళకు పాంచాలి పొందుగోరి నర్తనాగారమునకు వచ్చెను.

మన్యమానః స సంకేత మాగారం ప్రావిశచ్చ తత్,
అతడు అదియే తలచుచు ఆ సంకేతపు చోటునకు వచ్చెను.

ప్రవిశ్య చ స తద్ వేశ్మ తమసా సంవృతం మహత్. 40

పూర్వాగతం తత స్తత్ర భీమ మప్రతిమౌజసమ్.

ఏకాన్తా వస్థితం చైన మాససాద సదుర్మతిః. 41

ఆ దుష్టబుద్ధి, పెనుచీకటితో నిండిన ఆ భవనములోనికి ప్రవేశించి అంతకుముందే అక్కడకు వచ్చియున్నవాడు సాటిలేని దేహబలముగలవాడు, ఏకాంతమున నున్న వాడునగు భీమసేనుని సమీపించెను.

శయానం శయనే తత్ర సూతపుత్రః పరామృశత్,

జాజ్వల్యమానం కోపేన కృష్ణాధర్షణజేనహ. 42

అచట పాన్పుపై పడుకొనియున్న భీముని, కృష్ణను పీడించిన కారణముగా పుట్టినకోపముతో మండిపడుచున్న వానిని కీచకుడు స్పృశించెను.

ఉపసంగమ్య చైవైనం కీచకః కామమోహితః,

హర్షోన్మథిత చిత్తాత్మా స్మయమానో ఒభ్యభాషత. 43

కామముచే ఒడలెరుగని కీచకుడు భీముని సమీపించి సంతోషముతో బాగుగా నలిగిన చిత్తము కలవాడై నవ్వుచు నిట్లు పలికెను.

ప్రాపితం తే మయా విత్తం బహురూప మనన్తకమ్,

యత్ కృతం ధనరత్నాఢ్యం దాసీశత పరిచ్ఛదమ్. 44

అనేకవిధములైన, అంతములేని ధనరూపముతో రత్నముల రూపములతో ఉన్న నే నార్జించిన విత్తమంతయు, నూరుమంది దాసీజనముతోపాటు నీకిచ్చితిని.

రూపలావణ్య యుక్తాభి ర్యువతీభి రలంకృతమ్,

గృహం చాన్తఃపురం సుభ్రు క్రీడారతి విరాజితమ్,

తత్ సర్వం త్వాం సముద్దిశ్య సహసా సాహము పాగతః. 45

చక్కని అందము, దేహకాంతిగల యువతులతో అలరారు చున్నది, క్రీడారతికై శోభిల్లుచున్నది అగు నా అంతఃపుర గృహమును నీకై ఏర్పరచి నేను వడివడిగా నిటకు వచ్చితిని.

అకస్మాన్మాం ప్రశంసన్తి సదా గృహగతాః స్త్రియః,
సువాసా దర్శనీయశ్చ నాన్యోఽస్తి త్వాదృశః పుమాన్. 46

నాయిలు చేరిన యింతులందరు ఒక్కపెట్టున చక్కని వస్త్రములు ధరించి చూడముచ్చటయైన నీవంటి మగవాడు మఱియొకడు లేడనుచు నన్ను కొనియాడుచుందురు.

భీమసేన ఉవాచ - భీమసేను డిట్లు పలికెను.

దిష్ట్యా త్వం దర్శనీయోఽథ దిష్ట్యాత్మానం ప్రశంససి,
ఈదృశస్తు త్వయా స్పర్శః స్పృష్టపూర్వో న కర్హిచిత్. 47

మేలు మేలు నీవు చూడముచ్చటయైనవాడవు. భాగ్యము. నిన్ను నీవు ప్రశంసించుకొనుచున్నావు. కాని ఇటువంటి స్పర్శ నీకు మును పెన్నడు కలిగియుండదు,

స్పర్శం వేత్సి విదగ్ధస్త్వం కామధర్మవిచక్షణః,
స్త్రీణాం ప్రీతికరో నాన్యస్త్వత్సమః పురుషస్త్విహ. 48

మంచి నేర్పరివి. కామధర్మముల వివేకముగల వాడవు. స్పర్శను ఎఱుగుదువు; స్త్రీలకు నీవలె ప్రీతిచేయగల మగవాడు మరియొకఁ డిట లేడు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇత్యుక్త్వా తం మహాబాహుర్భీమో భీమపరాక్రమః,
సహసోత్పత్య కౌన్తేయః ప్రహస్యేద ముహాచహ. 49

---

46. ప్రశంసన్తిః నీవు నన్ను వరించుటయే వారి ప్రశంసకు కారణము.

అని పలికి మహాబాహువు, రుద్రునిపరాక్రమమువంటి పరాక్రమము కలవాడు, కుంతీపుత్రుడు నగు భీముడు ఒక్కపెట్టున దుమికి కహాకహా నవ్వి ఇట్లు పలికెను.

అద్య త్వాం భగినీ పాపం కృష్యమాణం మయా భువి,
ద్రక్ష్యతేఽద్రి ప్రతీకాశం సింహేనేవ మహాగజమ్. 50

నేడు నేను సింహము ఏనుగువలె నేల కీడ్చుచున్న పాపుని, పర్వతమువలె పడియున్న నిన్ను నీ సోదరి చూచును.

నిరాబాధా త్వయి హతే సైరంధ్రీ విచరిష్యతి,
సుఖమేవ చరిష్యన్తి సైరంధ్ర్యాః పతయః సదా. 51

నీవు చావగా సైరంధ్రి బాధలేనిదై తిరుగును. సైరంధ్రి పతులు ఎల్లపుడు సుఖముగా తిరుగుదురు.

తతో జగ్రాహ కేశేషు మాల్యవత్సు మహాబలః,
స కేశేషు పరామృష్టో బలేన బలినాం వరః. 52
ఆక్షిప్య కేశాన్ వేగేన బాహ్వోర్జగ్రాహ పాండవమ్,
బాహుయుద్ధం తయో రాసీత్ క్రుద్ధయో ర్నరసింహయోః. 53

అంత మహాబలుడగు భీముడు పూలదండలుగల కీచకుని జుట్టు పట్టెను. అట్లు బలముతో జుట్టుపట్టుకొనగా బలముగలవారిలో గొప్పవాడగు కీచకుడు వేగముతో జుట్టు విదలించుకొని భీముని భుజములను పట్టుకొనెను. అంత మహాక్రోధముగల ఆ నరసింహులకు బాహుయుద్ధము జరిగెను.

వసన్తే వాసితాహేతో ర్బలవద్గజయోరివ,
కీచకానాంతు ముఖ్యస్య నరాణా ముత్తమస్యచ. 54

54. వాసితాహేతోః - పెంటిఏనుగు కారణముగా.

వసంతమున ఆడేనుగుకొఱకై మహాబలముగల రెండు ఏనుగులవలె కీచకముఖ్యునకును, నరశ్రేష్ఠుడగు భీమునకును యుద్ధమాయెను.

వాలి సుగ్రీవయో ర్భ్రాత్రోః పురేవ కపిసింహయోః,

పూర్వము కపులలో సింహములవంటివారు, అన్నదమ్ములగు వాలి సుగ్రీవులకు జరిగిన యుద్ధమువంటి యుద్ధము జరిగెను.

అన్యోన్య మపి సంరబ్ధౌ పరస్పర జయైషిణౌ. 55
తతః సముద్యమ్య భుజౌ పఞ్చశీర్షా వివోరగౌ,
నఖదంష్ట్రాభి రన్యోన్యం ఘ్నతః క్రోధ విషోద్ధతౌ. 56

పిమ్మట నిరువురు పెద్ద ఆర్భాటముతో నొకరి నొకరు గెలువగోరి అయిదుతలల పాములవంటి భుజముల నెత్తి గోళ్ళనెడు కోరలతో క్రోధమనెడు విషముతో ఉద్ధతులై కొట్టుకొనిరి.

వేగే నాభిహతో భీమః కీచ కేన బలీయసా,
స్థిర ప్రతిజ్ఞః స రణే పదా న్నచలితః పదమ్. 57

మిక్కిలి బలముగల కీచకుడు వడిగా భీముని తాడించెను. అయినను స్థిరమైన ప్రతిజ్ఞగల భీముడు ఒక్కఅడుగైన కదలక నిలిచెను.

తా వన్యోన్యం సమాశ్లిష్య ప్రకర్షన్తౌ పరస్పరమ్,
ఉభావపి ప్రకాశేతే ప్రవృద్ధౌ వృషభా వివ. 58

వారిరువురు పరస్పరము దేహములను బిగియపట్టి గుంజుకొనిరి. బాగుగా బలిసిన యెద్దులవలె ప్రకాశించిరి.

తయో ర్హ్యాసీత్ సుతుములః సంప్రహారః సుదారుణః,
నఖదన్తాయుధవతో ర్వ్యాఘ్రయోరివ దృప్తయోః. 59

గోళ్ళు, కోరలే ఆయుధములుగాగల మదించిన పెద్దపులుల యుద్ధమునవలె వారిరువురి యుద్ధము దారుణముగా భీకరముగా సాగెను.

అభిపత్యాథ బాహుభ్యాం ప్రత్యగృహ్ణా దమర్షితః,
మాతఙ్గ ఇవ మాతఙ్గం ప్రభిన్న కరటా ముఖమ్. 60

అంత కీచకుడు మిక్కిలి కోపముతో రెండుచేతులతో పగిలిన గండస్థముగల ఏనుగును ఏనుగు పట్టినట్లు భీముని మీదబడి పట్టెను.

సచాప్యేనం తదా భీమః ప్రతిజగ్రాహ వీర్యవాన్,
త మాక్షిపత్ కీచకోఽథ బలేన బలినాం వరః. 61

భీముడును మిక్కిలి వీర్యముతో వాని నొడిసి పట్టెను. అంత గొప్పబలముగల కీచకుడును భీముని విదలించి కొట్టెను.

తయోర్భుజ వినిష్పేషా దుభయో ర్బలినో స్తదా,
శబ్దః సమభవద్ ఘోరో వేణు స్ఫోట సమో యుధి. 62

వారిరువురి భుజముల తాకుళ్ళధ్వని వెదుళ్ళు పగిలిన శబ్దములవలె యుద్ధభూమిలో ఘోరమై వెలువడెను;

అథైన మాక్షిప్య బలాద్ గృహమధ్యే వృకోదరః,
ధూనయామాస వేగేన వాయు శ్చణ్డ ఇవ ద్రుమమ్. 63

పిదప భీముడు వానిని బలముతో నర్తనశాల నడుమ కీడ్చి ప్రచండమైన గాలి చెట్టునువలె గిరగిర త్రిప్పెను.

భీమేన చ పరామృష్టో దుర్బలో బలినా రణే,
ప్రాస్పన్దత యథా ప్రాణం విచకర్ష చ పాణ్డవమ్, 64

గొప్పబలముగల భీముడట్లు పట్టి త్రిప్పగా బలముచచ్చిన కీచకుడు ప్రాణముంతయు కూడగట్టుకొని భీముని త్రోసి లాగెను.

ఈషదాకలితం చాపి క్రోధాద్ ద్రుతపదం స్థితమ్,
కీచకో బలవాన్ భీమం జానుభ్యా మాక్షిపద్ భువి. 65

---

60. ప్రభిన్న కరటాముఖమ్– కరటమనగా ఏనుగు గండస్థలమున మదజలము పుట్టుచోటు – పగిలిన అట్టిచోటుగల ఏనుగును,

కొంచెము మాత్రము పట్టుచిక్కి క్రోధముతో త్రుటువడు కాళ్ళతో నిలిచిన భీముని బలవంతుడగు కీచకుడు మోకాళ్ళతో పొడిచి నేలపై బడగొట్టెను.

పాతితో భువి భీమస్తు కీచకేన బలీయసా,
ఉత్పపాతాథ వేగేన దణ్డపాణి రివాన్తకః. 66

అట్లు బలవంతుడగు కీచకుడు నేలబడగొట్టగా భీముడు వేగముతో దండము చేత బట్టిన యమునివలె పైకి లేచెను.

స్పర్థయా చ బలోన్మత్తౌ తావు భౌ సూత పాణ్డవౌ.
నిశీథే పర్యకర్షేతాం బలినౌ నిర్జనే స్థలే. 67

బలముచే ఒడలెరుగని వారగు ఆ కీచక పాండవు లిరువురు స్పర్థతో ఆ అర్ధరాత్రమున జనములేని తావున మల్లయుద్ధము చేసిరి.

తత స్తద్ భవనం శ్రేష్ఠం ప్రాకమ్పత ముహుర్ముహుః,
బలవచ్చాపి సంక్రుద్ధా వన్యోన్యం ప్రతి గర్జతః. 68

మిక్కిలి బలముతో క్రోధముతో బొబ్బలిడుచున్న వారి యరపులతో ఆ గొప్ప భవనము మాటిమాటికి ఊగులాడెను.

తలాభ్యాం సతు భీమేన వక్షస్యభిహతో బలీ,
కీచకో రోష సంతప్తః పదా న్న చలితః పదమ్. 69

భీముడు రెండు అరచేతులతో వాని రొమ్మున చరచెను. బలవంతుడైన కీచకుడు రోషముతో ఉడికి పోవుచు అడుగు తీసి అడుగు వేయలేదు.

ముహూర్తం స తు తం వేగం సహిత్వా భువి దుస్సహమ్,
బలాదహీయత తదా సూతో భీమబలార్దితః. 70

భూమిలో తట్టుకొనుటకు సాధ్యముకాని ఆవేగమును ఒక్క ముహూర్తకాలము తట్టుకొని సూతుడు భీముని బలముచే పీడితుడై నీరసపడెను.

తం హీయమానం విజ్ఞాయ భీమసేనో మహాబలః,
వక్షస్యానీయ వేగేన మమర్దైనం విచేతసమ్. 71

వాడు బలహీనుడగుట గుర్తించి మహాబలుడగు భీమసేనుడు వేగముతో రొమ్మున గదియించి స్పృహలేని ఆ కీచకుని నలిపి వైచెను.

క్రోధావిష్టో వినిఃశ్వస్య పునశ్చైనం వృకోదరః,
జగ్రాహ జయతాం శ్రేష్ఠః కేశేష్వేవ తదా భృశమ్. 72

పెల్లురేగిన కోపముతో భీముడు రొజుచు ఆకీచకుని కేశములను గట్టిగా పట్టెను.

గృహీత్వా కీచకం భీమో విరరాజ మహాబలః,
శార్దూలః పిశితాకాంక్షీ గృహీత్వేవ మహామృగమ్. 73

మహాబలముగల భీముడు వాని జుట్టుపట్టి, మాంసమును వాంఛించిన బెబ్బులి మహామృగమును పట్టిన విధమున విరాజిల్లెను.

తత ఏనం పరిశ్రాన్త ముపలభ్య వృకోదరః,
యోక్త్రయామాస బాహుభ్యాం పశుం రశనయా యథా. 74

అంతట వృకోదరుడు కీచకుడు సొమ్మసిల్లెనని గుర్తించి పశువును పగ్గముతో బంధించినట్లు రెండు చేతులతో వానిమెడను బిగించెను.

నదన్తం చ మహానాదం భిన్నభేరీ సమస్వనమ్,
భ్రామయామాస సుచిరం విస్ఫురన్త మచేతనమ్. 75

పగిలిన భేరివంటి ధ్వనితో పెద్దగా కూతలిడుచు వణకిపోవుచు స్పృహతొలగిపోయిన ఆ కీచకుని భీముడు చాలసేపు గిరగిర త్రిప్పెను.

74. యోక్త్రయామాస - మెడను త్రాటితో బిగించెను.

ప్రగృహ్య తరసా దోర్భ్యాం కణ్ఠం తస్య వృకోదరః,
అపీడయత కృష్ణాయా స్తదా కోపోపశాన్తయే. 76

వృకోదరుడు రెండు చేతులతో వాని మెడ బలముగా పట్టి ద్రౌపది కోపము శాంతించునట్లుగా పీడించెను.

అథ తం భగ్న సర్వాఙ్గం వ్యావిద్ధ నయనామ్బరమ్,
ఆక్రమ్య చ కటీదేశే జానునా కీచకాధమమ్,
అపీడయత బాహుభ్యాం పశుమార మమారయత్. 77

అవయవములన్నియు విరిగినవాడు, తిరుగుడుపడిన గ్రుడ్లు గుడ్డలుగల వాడునగు ఆ కీచకుని పైకి ఎక్కి భీముడు మోకాటితో నడుమును విరుగబొడిచి చేతులతో పీడించి పశువును చంపినట్లు చంపెను.

తం విషీదన్త మాజ్ఞాయ కీచకం పాణ్డు నన్దనః.
భూతలే భ్రామయామాస వాక్యం చేద ముబాచహ. 78

కీచకుడట్లు సత్తువలేనివాడాయెనని గుర్తించి భీముడు వానిని నేలపై విసరికొట్టెను, మరియు నిట్లు పలికెను.

అద్యాహ మనృణో భూత్వ భ్రాతా ర్భార్యాపహారిణమ్,
శాన్తిం లబ్ధోస్మి పరమాం హత్వా సైరంధ్రి కంటకమ్. 79

నేడు నేను భార్యనపహరించిన వాడు సైరంధ్రికి పీడకుడు నగు వానిని చంపి అన్నగారి ఋణము తీర్చికొని పరమశాంతిని నొందితిని.

ఇత్యేవ ముక్త్వా పురుషప్రవీర
స్తం కీచకం క్రోధ సరాగనేత్రః,
ఆస్రస్తవస్త్రాభరణం స్ఫురన్త
ముద్భ్రాన్త నేత్రం వ్యసు ముత్ససర్జ. 80

77. వ్యావిద్ధ నయనామ్బరమ్ - ఆకీచకుని కనుగ్రుడ్లు తిరుగుడు వడినవి, కట్టిన వస్త్రములు చిక్కుపడినవని భావము.

ఆ పురుషవరేణ్యుడు క్రోధముతో ఎరుపెక్కిన కనులు గల వాడై యిట్లుపలికి, పూర్తిగా చెదరిన వస్త్రములు, ఆభరణములు గలవాడును, విలవిలలాడుచున్న దేహముగలవాడు, తిరుగుడువడిన కనుగ్రుడ్లు గలవాడు, ప్రాణములు పోయినవాడు నగు కీచకుని వదలెను.

నిష్పిష్య పాణినా పాణిం సందష్టౌష్ఠ పుటం బలీ,
సమాక్రమ్య చ సంక్రుద్ధో బలేన బలినాం వరః. 81

తస్య పాణీచ పాదౌ చ శిరోగ్రీవాం చ సర్వశః,
కాయే ప్రవేశయామాస పశో రివ పినాకధృత్. 82

చేతితో చేతిని పిసికికొని పెదవులు కొరికికొని మిక్కిలి బలముగ ఆభీముడు మరల క్రోధముతో వానిపై బడి వాని చేతులను కాళ్ళను, తలను, మెడను, శివుడు పశువును చేసినట్లు మొండెములోనికి కూరెను.

తం సంమథిత సర్వాఙ్గం మాంసపిణ్డోపమం కృతమ్,
కృష్ణాయా దర్శయామాస భీమసేనో మహాబలః. 83

మహాబలుడగు భీమసేనుడు, ఆ కీచకుని అవయవముల నన్నింటిని పిండిచేసి మాంసపుముద్దవలె నొనరించి ద్రౌపదికి చూపెను.

ఉవాచ చ మహాతేజా ద్రౌపదీం యోషితాం వరామ్,
పశ్యైన మేహి పాఞ్చాలి కాముకోఽయం యథాకృతః. 84

ఆ గొప్ప తేజస్సుగల ఆ భీముడు స్త్రీ రత్నమగు ద్రౌపదితో ఇట్లనెను. ఓ ద్రౌపదీ! ఇటురా! ఈ కాముకుడేమాయెనో చూడు.

ఏవ ముక్త్వా మహారాజ భీమో భీమపరాక్రమః,
పాదేన పీడయామాస తస్య కాయం దురాత్మనః. 85

ఓ మహారాజా! భయముగొల్పు పరాక్రమముగల భీము డిట్లు పలికి ఆ దురాత్ముని కాయమును కాలితో మట్టగించెను.

తతోఽగ్నిం తత్ర ప్రజ్వాల్య దర్శయిత్వాతు కీచకమ్,
పాఞ్చాలీం స తదా వీర ఇదం వచన మబ్రవీత్. 86

అంత నచట అగ్నిని జ్వలింపజేసి ద్రౌపదికి కీచకుని చూపి ఆ వీరుడామెతో ఇట్లు పలికెను.

ప్రార్థయన్తి సుకేశాన్తే యే త్వాం శీలగుణాన్వితామ్,
ఏవం తే భీరు వధ్యన్తే కీచకః శోభతే యథా. 87

చక్కని అలకలుగల ఓ ద్రౌపదీ! శీలము గుణముగల నిన్ను ఎవరేని వాంఛించిరో, యిదిగో ఈ కీచకునివలె వారు శోభిల్లుదురు.

తత్ కృత్వా దుష్కరం కర్మ కృష్ణాయాః ప్రియముత్తమమ్,
తథా స కీచకం హత్వా గత్వా రోషస్య వై శమమ్. 88
ఆమన్త్ర్య ద్రౌపదీం కృష్ణాం క్షిప్ర మాయాన్మహానసమ్.

భీము డావిధముగ ద్రౌపదికి మిక్కిలి ప్రియమైన అసాధ్య కార్యమును నిర్వహించి, ఆ కీచకుని పరిమార్చి రోషమును శమింప జేసికొని, ద్రౌపదిని వీడ్కొని వేగముగా వంటశాలకు చేరుకొనెను.

కీచకం ఘాతయిత్వా తు ద్రౌపదీ యోషితాం వరా,
ప్రహృష్టా గతసంతాపా సభాపాలా నువాచ హ. 89

ద్రుపదుని కూతురగు కృష్ణ అట్లు కీచకుని చంపించి, మిక్కిలి హర్షముపొందినదై, దుఃఖమును విడనాడి, ఆ భవనము కాపులను పిలిచి యిట్లు చెప్పెను.

---

87. శోభతే - ఇది పరిహాసవచనము. ఇట్లే ధృతరాష్ట్రుని కొడుకులను కూడ సంహరింతునని అభిప్రాయము.

కీచకోఽయం హతః శేతే గన్ధర్వైః పతిభి ర్మమ,
పరస్త్రీకామసంమత్త స్తత్రాగచ్ఛత పశ్యత. 90

పరకాంతల మీది కామముతో క్రొవ్వెక్కిన యీ కీచకుడు నా భర్తలగు గంధర్వులచే చచ్చెను. ఇటు రండు! చూడుడు!

తచ్ఛ్రుత్వా భాషితం తస్యా నర్తనాగారరక్షిణః,
సహసైవ సమాజగ్ము రాదాయోల్కాః సహస్రశః. 91

నర్తనశాలకాపరులు ఆ మాట విని త్వరత్వరగా వేలకొలది కాగడాలను పుచ్చుకొని వచ్చిరి.

తతో గత్వాథ తద్ వేశ్మ కీచకం వినిపాతితమ్,
గతాసుం దదృశు ర్భూమౌ రుధిరేణ సముక్షితమ్. 92

వారందరు ఆ భవనమున కరిగి, నేలగూలి, ప్రాణములు విడి నెత్తుటిలో దొరలాడుచున్న కీచకుని గాంచిరి.

పాణిపాదవిహీనం తు దృష్ట్వా చ వ్యథితా భవన్,
నిరీక్షన్తి తతః సర్వే పరం విస్మయ మాగతాః 93

కాలు చేతులు లేని ఆ మొండెమును వారందరు పరమాశ్చర్యముతో దుఃఖించుచు చూచు చుండిరి.

అమానుషం కృతం కర్మ తం దృష్ట్వా వినిపాతితమ్,
క్వాస్య గ్రీవా క్వ చరణౌ క్వ పాణీ క్వశిర స్తథా,
ఇతి స్మ తం పరీక్షన్తే గన్ధర్వేణ హతం తదా. 94

అట్లు నేలపై పడియున్న వానిని గాంచి, మానవ సాధ్యము కాని ఆ కృత్యమును గని, వీని మెడ యెక్కడ! కాళ్ళెక్కడ!

చేతులెక్కడ ? తల యెక్కడ ? అని గంధర్వుని చేత చచ్చిన వానిని పరీక్షించిరి.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి కీచకవధపర్వణి
కీచకవధే ద్వావింశోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున కీచకవధపర్వమున
కీచకవధమను ఇరువది రెండవ అధ్యాయము.

## త్రయోవింశోఽధ్యాయః — ఇరువది మూడవ అధ్యాయము

సైరంధ్రీం నిబద్ధ్యోపకీచకానాం తస్యాః శ్మశానభూమౌ నయనం తాన్ నిహత్య భీమసేన కర్తృకం సైరంధ్ర్యా మోచనం చ.

సైరంధ్రిని పట్టి ఉపకీచకులు ఆమెను శ్మశానభూమికి తీసికొని పోవుట, వారిని చంపి భీముడు సైరంధ్రిని విడిపించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్మిన్ కాలే సమాగమ్య సర్వే తత్రాస్య బాన్ధవాః,
రురుదుః కీచకం దృష్ట్వా పరివార్య సమన్తతః. 1

ఆ సమయమున కీచకుని బంధువులందరు అచటికి వచ్చి వానిని చూచి చుట్టుముట్టి ఏడ్చిరి.

సర్వే సంహృష్టరోమాణః సంత్రస్తాః ప్రేక్ష్య కీచకమ్,
తథా సంభిన్నసర్వాఙ్గం కూర్మం స్థల ఇవోద్ధృతమ్. 2

అట్లు అవయవములన్నియు చూర్ణమై నేలకు ఈడ్వబడిన తాబేలు వలె నున్న ఆ కీచకుని చూచి వారందరు భయముతో గగుర్పొడిచిన దేహము కలవారైరి.

పోథితం భీమసేనేన తమిన్ద్రేణేవ దానవమ్.
సంస్కారయితు మిచ్ఛన్తో బహి ర్నేతుం ప్రచక్రముః. 3

ఇంద్రుడు రాక్షసుని చేసినట్లు, భీమసేనుడు నుగ్గుచేసి చంపిన కీచకునికి అగ్నిసంస్కారము చేయుటకై వెలుపలికి తీసికొనిరా నారంభించిరి.

దదృశు స్తే తతః కృష్ణాం సూతపుత్రాః సమాగతాః,
అదూరా చ్చానవద్యాఙ్గీం స్తంభ మాలింగ్య తిష్ఠతీమ్. 4

అంత నచటికి చేరిన సూత పుత్రులు, అల్లంత దూరమున స్తంభము నానుకొని నిలిచి యున్న శోభనాంగి యగు ద్రౌపదిని చూచిరి.

సమవేతేషు సర్వేషు తా మూచు రుప కీచకాః,
హన్యతాం శీఘ్ర మసతీ యత్కృతే కీచకో హతః. 5

ఉపకీచకు లందరును అక్కడ కూడుకొని తమలో నిట్లు పలికి కొనిరి. ఈ పాడుదానిని త్వరగా చంపుడు. దీని వలననే కీచకుడు చచ్చెను.

అథవా నైవ హన్తవ్యా దహ్యతాం కామినా సహ,
మృత స్యాపి ప్రియం కార్యం సూతపుత్రస్య సర్వథా. 6

కాదు కాదు చంపవలదు దీనిని కాముకుడగు కీచకునితో కలిపి కాల్చుడు దానితో సర్వవిధముల చచ్చిన కీచకునకు ప్రియము చేసినట్లగును.

తతో విరాట మూచు స్తే కీచకోఽస్యాః కృతే హతః,
సహానే నాద్య దహ్యేమ తదనుజ్ఞాతు మర్హసి. 7

అంత వారు విరాటుని కడకరిగి, 'కీచకుడీమె కారణముగా చచ్చెను. వానితో కలిపి దీనిని మంటఁ బెట్టెదము నీవు అనుమతింప వలయును' అని పలికిరి.

పరాక్రమం తు సూతానాం మత్వా రాజాన్వమోదత,
సైరన్ధ్ర్యాః సూతపుత్రేణ సహ దాహం విశాంపతిః. 8

రాజు కూడ, సూతుల పరాక్రమ మెరిగినవాడు కనుక సైరంధ్రిని కీచకునితో కలిపి దహనము చేయుట కంగీకరించెను.

తాం సమాసాద్య విత్రస్తాం కృష్ణాం కమలలోచనామ్,
మోముహ్యమానాం తే తత్ర జగృహుః కీచకా భృశమ్. 9

భయపడుచు, దిక్కెరుగక యున్న పద్మపత్రాక్షి ద్రౌపదిని సమీపించి కీచకులు గట్టిగా పట్టుకొనిరి.

తతస్తు తాం సమారోప్య నిబధ్య చ సుమధ్యమామ్,
జగ్ము రుద్యమ్య తే సర్వే శ్మశానాభిముఖా స్తదా. 10

అంతవారు ఆమెను పాడెపై నెక్కించి కట్టి వల్లకాటివైపుగా బయలుదేరిరి.

హ్రియమాణా తు సా రాజన్ సూతపుత్రై రనిన్దితా,
ప్రాక్రోశ న్నాథ మిచ్ఛన్తీ కృష్ణా నాథవతీ సతీ. 11

అట్లు ఏపాపమెరుగని ఆ ద్రౌపది తన్ను కీచకులు లాగుకొని పోవుచుండగా, నాథులుకలది యయ్యు రక్షించునాథుడెవరా!' యని చూచుచు మొరలిడెను.

ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లు పలికెను.

జయో జయన్తో విజయో జయత్సేనో జయద్బలః,
తే మే వాచం విజానన్తు సూతపుత్రా నయన్తి మామ్. 12

జయుడు, జయంతుడు, విజయుడు, జయత్సేనుడు, జయద్బలుడు నామాట విందురుగాక! ఈ సూతపుత్రులు నన్ను ఈడ్చుకొని పోవుచున్నారు.

యేషాం జ్యాతల నిర్ఘోషో విస్ఫూర్జిత మివాశనేః,
వ్యశ్రూయత మహాయుద్ధే భీమఘోష స్తరస్వినామ్, 13

రథఘోషశ్చ బలవాన్ గన్ధర్వాణాం తరస్వినామ్,
తే మే వాచం విజానన్తు సూతపుత్రా నయన్తి మామ్. 14

మీ అల్లెత్రాటి ధ్వని పిడుగుపాటు వంటిదై మహా యుద్ధమున భయంకరమగు ఘోషతో వినవచ్చును. వేగముగల గంధర్వులగు మీ రథఘోష మిక్కిలి శక్తికలది. అట్టిమీరు నామొర నాలకింపుడు. సూతపుత్రులు నన్ను కొనిపోవుచున్నారు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్యాస్తాః కృపణా వాచః కృష్ణాయాః పరిదేవితమ్,
శ్రుత్వైవాభ్యపతద్ భీమః శయనా దవిచారయన్. 15

ఆ ద్రౌపది దీనవాక్కులు, రోదనము వినిన వెంటనే భీముడు మరియొక ఆలోచన చేయక పడకనుండి దుమికెను.

అహం శృణోమి తే వాచం త్వయా సైరన్ధ్రి భాషితమ్,
తస్మాన్ తే సూతపుత్రేభ్యో భయం భీరు న విద్యతే. 16

ఓ సైరంధ్రీ నీవు పలికిన నీ మాట నేను వింటిని. కావున నీకు సూతపుత్రులవలన భయములేదు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇత్యుక్త్వా స మహాబాహు ర్విజజృంభే జిఘాంసయా,
తతః స వ్యాయతం కృత్వా వేషం విపరివర్త్య చ. 17

అద్వారే ణాభ్యవస్కన్ద్య నిర్జగామ బహి స్తదా,
స భీమసేనః ప్రాకారా దారుహ్య తరసా ద్రుమమ్. 18

శ్మశానాభిముఖః ప్రాయాద్ యత్ర తే కీచకా గతాః

17. వ్యాయతం కృత్వా - వ్యాపారమును, ప్రయత్నమునుచేసి, వేషం విపరివర్త్య - గంధర్వునకు తగిన వేషముగా మార్చికొని.

18. అభ్యవస్కన్ద్య - దుమికి, ద్రుమమారుహ్య - చెట్టెక్కి, చెట్టెక్కుట ద్రౌపది కనబడుటకు.

ఇట్లని మహాబాహువగు భీమసేనుడు వారిని చంపఁగోరికతో విజృంభించెను. గట్టి ప్రయత్నముతో వేషము మార్చి దొడ్డిదారి నుండి వెలుపలికి వచ్చెను. ప్రాకారము నుండి చెట్టెక్కి వల్లకాటి వైపు కీచకులున్న చోటికి పరుగు దీసెను.

స లఙ్ఘయిత్వా ప్రాకారం నిఃసృత్య చ పురోత్తమాత్,
జవేన పతితో భీమః సూతానా మగ్రత స్తదా. 19

కోటగోడదాటి పురమును వెలువడి ఆ భీముడు వడిగా కీచకుల ముందు వచ్చిపడెను.

చితాసమీపే గత్వా స తత్రాపశ్యద్ వనస్పతిమ్,
తాలమాత్రం మహాస్కన్ధం మూర్ధశుష్కం విశాంపతే. 20

ఓ రాజా! అతడు కాటి కడకరిగి తాటిచెట్టంతది, పెద్ద శాఖలుగలది, ఎండిన తలగలది అగు ఒక చెట్టును గాంచెను.

తం నాగవదుపక్రమ్య బాహుభ్యాం పరిరభ్య చ,
స్కన్ధ మారోపయామాస దశవ్యామం పరంతప. 21

ఏనుగువలె దానిని పట్టి రెండుచేతులతో పెకలించి పది బారల కొలతగల ఆవృక్షమును భుజముపై పెట్టుకొనెను.

స తం వృక్షం దశవ్యామం సస్కన్ధవిటపం బలీ,
ప్రగృహ్యాభ్యద్రవత్ సూతాన్ దణ్డపాణి రివాన్తకః. 22

పదిబారల కొలతగల కొమ్మలతో కూడిన ఆ చెట్టును గైకొని, దండమును ధరించిన యమునివలె, ఆ సూతులపై ఉరికెను.

ఊరువేగేన తస్యాథ న్యగ్రోధాశ్వత్థ కింశుకాః,
భూమౌ నిపతితా వృక్షా సంఘశ స్తత్ర శేరతే. 23

20. మూర్ధశుష్కమ్ - తలయెండినది. ఇట్లనుటవలన చెట్టుయొక్క ముదిరినతనము తెలియుచున్నది. దానివలన గట్టితనము వ్యక్తమగును.

ఆతని తొడల తాకిడికి మఱ్ఱి, రావి, మోదుగ మొదలగు చెట్లు గుములు గుములుగా కూలిపడినవి.

తం సింహ మివ సంక్రుద్ధం దృష్ట్వా గన్ధర్వ మాగతమ్,
విత్రేసుః సర్వశః సూతాః విషాదభయ కమ్పితాః. 24

బాగుగా క్రోధము వహించిన సింహమువలె వచ్చుచున్న ఆ గంధర్వుని గాంచి, విషాదభయములతో వణకిపోవుచు ఆసూతులు చెల్లా చెదరయిరి.

గన్ధర్వో బలవా నేతి క్రుద్ధ ఉద్యమ్య పాదపమ్,
సైరంధ్రీ ముచ్యతాం శీఘ్రం యతో నో భయమాగతమ్. 25

అదిగో గంధర్వుడు, గొప్ప బలము కలవాడు, క్రోధము వహించి చెట్టు నెత్తికొని వచ్చుచున్నాడు. మనకు ముప్పుతెచ్చి పెట్టిన ఆ సైరంధ్రిని వెంటనే వదలుడు.

తే తు దృష్ట్వా తదా విద్ధం భీమసేనేన పాదపమ్,
విముచ్య ద్రౌపదీం తత్ర ప్రాద్రవ న్నగరం ప్రతి. 26

అట్లు భీమసేనుడు పెకలించి తెచ్చిన చెట్టును చూచి ద్రౌపదిని అచట వదలి నగరమువైపు పరువెత్తిరి.

ద్రవత స్తాంస్తు సంప్రేక్ష్య స వజ్రీ దానవా నివ
శతం పఞ్చాధికం భీమః ప్రాహిణోద్ యమసాదనమ్. 27
వృక్షేణైతేన రాజేన్ద్ర ప్రభఞ్జన సుతో బలీ.

అట్లు పరువెత్తుచున్న వారినిగాంచి, ఇంద్రుడు రక్కసులను వలె వాయుదేవుని కొడుకగు భీముడు ఆ చెట్టుతో నూటయిదుగురు కీచకులను యమలోకమున కంపెను.

తత ఆశ్వాసయత్ కృష్ణాం స విముచ్య విశాంపతే. 28

పిమ్మట కట్లూడదీసి ద్రౌపదిని ఊరడించెను.

ఉవాచ చ మహాబాహుః పాఞ్చాలీం తత్ర ద్రౌపదీమ్,
అశ్రుపూర్ణముఖీం దీనాం దుర్ధర్షః స వృకోదరః. 29

ఓ రాజా! అంత మహాభుజుడు, ఎవ్వరికి అణపశక్యము కాని వాడు నగు భీముడు పాంచాలరాజపుత్రిని కన్నీటితో నిండిన ముఖముతో దీనయై యున్న దానిని ద్రౌపదిని గూర్చి యిట్లు పలికెను.

ఏవం తే భీరు వధ్యన్తే యే త్వాం క్లిశ్యన్త్యనాగసమ్.
ప్రైహి త్వం నగరం కృష్ణే నభయం విద్యతే తవ. 30

ఓ భీరూ! ఏపాప మెరుగని నిన్ను కష్టపెట్టు వారు ఇట్లే నాచేత చత్తురు. ఓ కృష్ణా! నీవింక నగరమునకు పొమ్ము. నీకు భయము లేదు.

అన్యేనాహం గమిష్యామి విరాటస్య మహానసమ్. 31

మరియొక మార్గమున నేను విరాటుని వంటయింటి కరుగుదును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను,
పఞ్చాధికం శతం తచ్చ నిహతం తేన భారత,
మహావన మివ చ్ఛిన్నం శిశ్యే విగలిత ద్రుమమ్. 32

ఓ భారతా! ఆ నూట అయిదుగురు గల మూక చచ్చి, విరిగిన చెట్లతో పాడువడిన పెద్దతోట వలె, కూలి యుండెను.

ఏవం తే నిహతా రాజన్ శతం పఞ్చ చ కీచకాః,
స చ సేనాపతిః పూర్వ మిత్యేతత్ సూత షట్శతమ్. 33

ఓ రాజా! ఇట్లిచట చచ్చిన కీచకులు నూటయిదుగురు, ముందు చచ్చిన సేనాపతి - మొత్తమువారు నూరారుగురు.

తద్ దృష్ట్వా మహదాశ్చర్యం నరా నార్యశ్చ సంగతాః,
విస్మయం పరమం గత్వా నోచుః కిఞ్చన భారత. 34

31. అన్యేన - మరియొక మార్గమున.

ఓ భారతా! ఆ గొప్ప ఆశ్చర్య విషయమును స్త్రీ పురుషు లందరు మూగి చూచి, పరమాశ్చర్యమును పొంది నోట మాట రాకుండిరి.

ఇతి శ్రీ మహా భారతే విరాటపర్వణి కీచకవధపర్వణి త్రయోవింశోఽధ్యాయః

ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున కీచకవధపర్వమున
నిరువదిమూడవ అధ్యాయము

## చతుర్వింశోఽధ్యాయః — ఇరువది నాల్గవఅధ్యాయము

శ్మశానతో నివృత్య రాజభవనం సమాగతాయా ద్రౌపద్యా బృహన్నలయా సుదేష్ణయా చ సహ వార్తాలాపః.

శ్మశానము నుండి తిరిగి రాజభవనమునకు వచ్చిన ద్రౌపది బృహన్నలతో, సుదేష్ణతో సంభాషించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తే దృష్ట్వా నిహతాన్ సూతాన్ రాజ్ఞే గత్వా న్యవేదయన్,
గన్ధర్వై ర్నిహతా రాజన్ సూతపుత్రా మహాబలాః 1

జనులందరు చచ్చిన కీచకులను చూచి రాజు కడ కరిగి 'మహారాజా! మహాబలులైన సూతపుత్రులు గంధర్వులచేత చచ్చిరి' అని నివేదించిరి.

యథా వజ్రేణ వై దీర్ణం పర్వతస్య మహచ్ఛిరః,
వ్యతికీర్ణాః ప్రదృశ్యన్తే తథా సూతా మహీతలే. 2

వజ్రముచేత పగిలిన కొండ కొమ్ము వలె, సూతులందరు నేలపై చెల్లాచెదరుగా పడి కానవచ్చుచున్నారు.

సైరన్ధ్రీ చ విముక్తా సా పున రాయాతి తే గృహమ్,
సర్వం సంశయితం రాజన్ నగరం తే భవిష్యతి. 3

సైరంధ్రియు విడుదల పొంది మరల నీ యింటికి వచ్చు చున్నది. రాజా! నీ నగరము మొత్తము సంశయములో పడనున్నది.

యథా రూపా చ సైరన్ధ్రీ గన్ధర్వాశ్చ మహాబలాః,
పుంసా మిష్టశ్చ విషయో మైథునాయ నసంశయః. 4

సైరంధ్రి పూర్వరూపముతోడనే యున్నది. గంధర్వులా మహాబలులు. పురుషులకు మిథునకర్మము ఇష్టమైన విషయము అనుటలో సందేహములేదు.

యథా సైరన్ధ్రిదోషేణ న తే రాజ న్నిదం పురమ్,
వినాశ మేతి వై క్షిప్రం తథా నీతి ర్విధీయతామ్. 5

ఈ సైరంధ్రిదోషముతో నీ పురము నశింపని నీతిని త్వరగా ప్రయోగింపవలయును.

తేషాం తద్వచనం శ్రుత్వా విరాటో వాహినీపతిః,
అబ్రవీత్ క్రియతా మేషాం సూతానాం పరమక్రియా. 6

విరాటమహారాజు వారి మాటను విని ముందీ సూతులకు దహనక్రియ చేయుడని పలికెను.

ఏకస్మిన్నేవ తే సర్వే సుసమిద్ధే హుతాశనే,
దహ్యన్తాం కీచకాః శీఘ్రం రత్నై ర్గన్ధైశ్చ సర్వశః. 7

ఒక్క పాడెపై వీరిని బెట్టి మంట దరికొలిపి రత్నములలో గంధములతో కీచకులందరిని కాల్చుడు.

సుదేష్ణా మబ్రవీద్ రాజా మహిషీం జాతసాధ్వసః,
సైరన్ధ్రీ మాగతాం బ్రూయా మమైవ వచనా దిదమ్. 8

రాజు భయపడుచు పట్టపురాణియగు సుదేష్ణతో నిట్లనెను: సైరంధ్రి రాగానే నామాటగా ఆమెతో ఇట్లనుము.

గచ్ఛ సైరన్ధ్రి భద్రం తే యథా కామం వరాననే,
బిభేతి రాజా సుశ్రోణి గన్ధర్వేభ్యః పరాభవాత్. 9

'ఓ సైరంధ్రీ! నీ యిచ్ఛ వచ్చినచోటికి కరుగుము. గంధర్వుల వలన ఏమి మూడునో యని రాజు భయపడు చున్నాడు.

న హిత్వా ముత్సహే వక్తుం స్వయం గన్ధర్వరక్షితామ్,
స్త్రియా స్త్వదోష స్త్వాం వక్తు మత స్త్వాం ప్రబ్రవీమ్యహమ్. 10

'పంపివేయ దగినదానవే అయినను గంధర్వులు రక్షించుచున్న నీకు నేను స్వయముగా చెప్పజాలను. స్త్రీ చెప్పిన తప్పులేదు. కావున నేను నీకు చెప్పుచున్నాను.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

అథ ముక్తా భయాత్ కృష్ణా సూతపుత్రాన్ నిరస్య చ,
మోక్షితా భీమసేనేన జగామ నగరం ప్రతి. 11

అంత ద్రౌపది భీమసేనుని చేత విడిపింపబడి భయమునుండి విడుదల పొంది, సూతపుత్రులను వదలి నగరమునకు వచ్చెను.

త్రాసితేవ మృగీ బాలా శార్దూలేన మనస్వినీ,
గాత్రాణి వాససీ చైవ ప్రక్షాళ్య సలిలేన చ. 12

పెద్దపులి బెదరగొట్టిన ఆడులేడి వలె నున్న ఆ సుకుమారవతి, అభిమానవతియు నగు ద్రౌపది ఒడలిని, బట్టలను జలముతో కడిగికొని నగరము వైపు బయలుదేరెను.

తాం దృష్ట్వా పురుషా రాజన్ ప్రాద్రవన్త దిశో దశ
గన్ధర్వాణాం భయత్రస్తాః కేచిద్ దృష్ట్వా న్యమీలయన్. 13

10. హిత్వామ్ - వదల దగిన దానివి; అహమ్ - నేను అనగా రాజు; త్వాం వక్తుమ్ - నీకు - సైరంధ్రికి చెప్పుటకు;

రాజా! మగవారు ఆమెను చూచి, గంధర్వుల భయముచే అడలినవారై పదిదిక్కులకు పరువెత్తిరి. కొందరు దానిని చూచి కనులు మూసికొనిరి.

తతో మహానస ద్వారి భీమసేన మవస్థితమ్,
దదర్శ రాజన్ పాఞ్చాలీ యథా మత్తం మహాద్విపమ్. 14

అంత వంటశాల ద్వారముకడ మదించిన పెద్ద యేనుగువలె నిలిచి యున్న భీమసేనుని పాంచాలి చూచెను.

తం విస్మయన్తీ శనకైః సంజ్ఞాభి రిద మబ్రవీత్,
గన్ధర్వరాజాయ నమో యేనాస్మి పరిమోచితా. 15

ఆతని గాంచి మెల్లగా చిరునవ్వు నవ్వుచు సన్నలతో 'నన్ను విడిపించిన గంధర్వరాజునకు మ్రొక్కుదును' అని పలికెను.

భీమసేన ఉవాచ - భీమసేను డిట్లు పలికెను.

యే పురా విచర న్తీహ పురుషా వశవర్తినః,
తస్యాస్తే వచనం శ్రుత్వా హ్యనృణా విహర న్త్వతః. 16

మున్ను నీకు వశమయి తిరుగు పురుషులు ఈ నీ మాట విని ఋణము తీరినవారై తిరుగుదురు గాక!

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః సా నర్తనాగారే ధనంజయ మపశ్యత,
రాజ్ఞః కన్యా విరాటస్య నర్తయానం మహాభుజమ్, 17

---

16. వశవర్తినః, పురుషాః - నీ ఆజ్ఞను పాలించు పురుషులు - అనగా పాండవులమైన మేము; తే వచనం - నీమాటను, - గంధర్వ రాజునకు నమస్సు అన్న నీ మాటను, శ్రుత్వా - విని, అనృణాః - ఆజ్ఞను నిర్వహించి, లేక అజ్ఞాతవాసమును ముగించుకొని కృతకృత్యులై, విహరన్తు - తిరుగుదురు గాక - ఇది గూఢార్థము.

విదప ఆమె నర్తనశాలలో విరాటుని కన్నియలకు ఆట నేర్పుచున్న మహాభుజుడగు ధనంజయుని చూచెను.

తత స్తా నర్తనాగారాద్ వినిష్క్రమ్య సహార్జునాః,
కన్యా దదృశు రాయాన్తీం క్లిష్టాం కృష్ణా మనాగసమ్. 18

అంత నా కన్యలు, అర్జునుని తోపాటు నర్తనశాల నుండి వెలుపలికి వచ్చి ఏ పాప మెరుగకయే యింత పాటుపడి వచ్చుచున్న కృష్ణను చూచిరి.

కన్య ఊచుః - కన్య లిట్లనిరి,

దిష్ట్యా సైరన్ధ్రి ముక్తాసి దిష్ట్యాసి పున రాగతా,
దిష్ట్యా వినిహతాః సూతా యే త్వాం క్లిశ్య న్త్యనాగసమ్. 19

అమ్మయ్యా ! ఓ సైరంధ్రీ ! అదృష్టము. విడుదల పొందితివి. భాగ్యవశమున తిరిగి వచ్చితివి. పుణ్యాత్మురాల వగు నిన్ను కష్ట పెట్టిన కీచకులు, భాగ్యవశమున, చచ్చిరి.

బృహన్నలో వాచ - బృహన్నల యిట్లనెను.

కథం సైరన్ధ్రి ముక్తాసి కథం పాపాశ్చ తే హతాః,
ఇచ్ఛామి వై తవ శ్రోతుం సర్వమేవ యథాతథమ్. 20

సైరంధ్రీ ! నీకు విముక్తి యెట్లు కలిగెను ? ఆ పాపు లెట్లు చచ్చిరి. నీ వృత్తాంత మంతయు ఉన్నదున్నట్లు విన గోరుచున్నాను.

సైరన్ధ్ర్యు వాచ - సైరంధ్రి యిట్లు పలికెను.

బృహన్నలే కిం ను తవ సైరన్ధ్ర్యా కార్య మద్య వై,
యా త్వం వససి కల్యాణి సదా కన్యాపురే సుఖమ్. 21

బృహన్నలా ! ఎప్పుడు కన్యల భవనమున సుఖముగా నున్న నీకు ఇప్పుడు సైరంధ్రితో పనియేమి !

న హి దుఃఖం సమాప్నోషి సైరన్ధ్రి యదు హాసన్నతే,
తేన మాం దుఃఖితామేవం పృచ్ఛసే ప్రహసన్నివ. 22

సైరంధ్రి కేమయినను నీకు దుఃఖమురాదు. కావుననే యింత దుఃఖపడిన నన్ను నవ్వుచు పలుకరించుచున్నావు.

బృహన్నలోచ వాచ - బృహన్నల యిట్లనెను.

బృహన్నలాపి కల్యాణి దుఃఖమాప్నోత్యనుత్తమమ్,
తిర్యగ్యోనిగతా బాలే న చైనామవబుధ్యసే. 23

ఓ కల్యాణీ! బృహన్నలకును పెద్ద దుఃఖము కలుగుచునే యున్నది. ఈ పాడు దేహమును పొందిన దాని సంగతి నీకు తెలియదా!

త్వయా సహోషితా చాస్మి త్వంచ సర్వైః సహోషితా,
క్లిశ్యన్త్యాంత్వయి సుశ్రోణి కోను దుఃఖం న చిన్తయేత్. 24

నీతో కలిసి యుంటిని. నీవును అందరితో కలిసి బ్రదుకు చున్నావు. నీకు కష్టము కలుగగా దుఃఖింపని వాడెవడుండును?

నతు కేనచి దత్యంతం కస్యచి ద్ధృదయం క్వచిత్,
వేదితుం శక్యతే నూనం తేన మాం నావబుధ్యసే. 25

ఎవ్వనికిని ఎన్నటికిని ఎవ్వని హృదయము పూర్తిగా తెలియుట సాధ్యముకాదు. కావుననే నన్ను నీవు తెలియకున్నావు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను,

తతః సహైవ కన్యాభి ర్ద్రౌపదీ రాజవేశ్మ తత్,
ప్రవివేశ సుదేష్ణాయాః సమీపముపగామినీ. 26

---

22. ప్రహసన్ - బృహన్నల స్త్రీ లింగ శబ్దము - ఇది పుంలిగము - నిజము నకు పురుషుడే కావున నిది సరిపడును.

23. తిర్యగ్యోనిగతా - తిర్యక్ - నీచ మయిన, యోనిః - శరీరము - దానిని పొందినది.

అంత ద్రౌపది ఆ కన్నియలతో గూడి రాజభవనమున కరిగి సుదేష్ణ కడ కేగెను.

తామబ్రవీ ద్రాజపుత్రీ విరాటవచనా దిదమ్,
సైరన్ధ్రి గమ్యతాం శీఘ్రం యత్ర కామయసే గతిమ్. 27

సుదేష్ణ విరాటుని మాట మీద ద్రౌపదితో 'సైరంధ్రీ! నీవు వేగమే నీ యిచ్ఛ వచ్చినచోటికి పొమ్ము', అని పలికెను.

రాజా బిభేతి తే భద్రే గన్ధర్వేభ్యః పరాభవాత్,
త్వం చాపి తరుణీ సుభ్రు రూపేణా ప్రతిమా భువి.
పుంసా మిష్టశ్చ విషయో గన్ధర్వా శ్చాతికోపనాః. 28

ఓయమ్మా! గంధర్వుల వలన నేమి మూడునో యని రాజు భీతిల్లుచున్నాడు. నీవేమో తరుణివి. రూపమున భూమిపై నీకు సాటిలేదు. పురుషులకు మిథునకర్మ మన్న నిష్టము. ఆ గంధర్వులా! అతికోపము కలవారు.

సైరంధ్ర్యువాచ - సైరంధ్రి యిట్లు పలికెను.

త్రయోదశాహ మాత్రం మే రాజా క్షామ్యతు భామిని,
కృతకృత్యా భవిష్యన్తి గన్ధర్వా స్తే నసంశయః. 29

ఓ భామినీ! ఇంక పదుమూడు దినములు మాత్రము రాజు నన్ను క్షమించుగాక! అంత గంధర్వులు కార్యము ముగింతురు. సందియములేదు.

తతో మా ముపనేష్యన్తి కరిష్యన్తి చ తే ప్రియమ్,
ధ్రువం చ శ్రేయసా రాజా యోక్ష్యతే సహబాన్ధవైః. 30

అటుపై వారు నన్నుకొని పోవుదురు. నీకు ప్రియ మొనరింతురు. రాజునకు, ఆయన బంధువులకు శ్రేయమును కూర్తురు.

[రాజ్ఞా కృతోపకారాశ్చ కృతజ్ఞాశ్చ సదా శుభే,
సాధవశ్చ బలోత్సిక్తాః కృతప్రతి కృతేప్సవః.

రాజు నా పతులను ఉపకారము చేసెను. వారెన్నడు చేసిన మేలు మరువరు. మంచివారు. బలముగలవారు. చేసిన దానికి ప్రత్యుపకారము చేయగోరుచున్నారు.

అర్థినీ ప్రబ్రవీమ్యేషా యద్వా తద్వేతి చిన్తయ,
భరస్వ తద హార్మాత్రం తతః శ్రేయో భవిష్యతి.

నేను నిన్నడుగుకొనుచు పలుకుచున్నాను. అదియా! ఇదియా! అని ఆలోచింపుము కొన్నిరోజులు మాత్రము నన్ను భరింపుము. అటుపై మీకు మేలు కలుగును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్యా స్తద్వచనం శ్రుత్వా కైకేయీ దుఃఖమోహితా,
ఉవాచ ద్రౌపదీ మార్తా భ్రాతృవ్యసన కర్శితా.

ఆమె ఆ మాటవిని కేకయపుత్రి సుదేష్ణ దుఃఖముతో పీడితయై తమ్ముల కష్టమునకు కుమిలిపోవుచు ద్రౌపదితో నిట్లనెను.

వస భద్రే యథేష్టం త్వం త్వామహం శరణం గతా,
త్రాయస్వ మమ భర్తారం పుత్రాంశ్చైవ విశేషతః.

ఓ తల్లీ! నీ యిష్టము వచ్చినట్లు ఉండుము. నేను నిన్ను శరణు చొచ్చితిని. విశేషించి నా భర్తలను పుత్రులను కాపాడుము.]

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి కీచకవధ పర్వణి
కీచకదాహే చతుర్వింశోఽధ్యాయః

ఇది శ్రీ మహా భారతము విరాటపర్వమున కీచకవధపర్వమున
కీచకుల దహించుట అను ఇరువది నాల్గవ అధ్యాయము

సమాప్తం కీచకవధ పర్వ -
కీచకవధ పర్వము సమాప్తము.

ఓమ్

# శ్రీ మన్మహాభారతమ్

## విరాటపర్వ - విరాటపర్వము

### గోహరణ పర్వ - గోహరణ పర్వము

### పఞ్చవింశోఽధ్యాయః - ఇరువదియైదవ అధ్యాయము

దుర్యోధన సంనిధి ముపాగతానాం దూతానాం పాణ్డవ ప్రవృత్త్యభిజ్ఞతా కథనం కీచకవధ వృత్తాన్త శ్రావణం చ.

దుర్యోధనుని కడకు వచ్చిన దూతలు పాండవుల వార్త తెలియరాకుండుటను చెప్పుట, కీచకవధ వృత్తాంతమును వినిపించుట.

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

[కీచకేతు హతే రాజా విరాటః పరవీరహా,
శోక మాహారయత్ తీవ్రం సామాత్యః సపురోహితః.

కీచకుడు చావగా పరవీరుల, పరిమార్చు విరాటనరపతి, మంత్రులతో పురోహితులతో కూడ పెద్దగా దుఃఖించెను.]

కీచకస్య తు ఘాతేన సానుజస్య విశామ్పతే,
అత్యాహితం చిన్తయిత్వా వ్యస్మయన్త పృథగ్ జనాః. 1

1. అత్యాహితమ్ - పెనుకీడు

ఓ మహారాజా! తమ్ములతో గూడి కీచకుడట్లు చావగా ఏదో కీడు మూడినదని జనులందరు అశ్చర్యపడిరి.

తస్మిన్ పురే జనపదే సంజల్పోఽభూచ్చ సంఘశః,
శౌర్యాద్ధి వల్లభో రాజ్ఞో మహాసత్త్వః స కీచకః. 2

ఆసీత్ ప్రహర్తా సైన్యానాం దారామర్శీ చ దుర్మతిః,
స హతః ఖలు పాపాత్మా గన్ధర్వై ర్దుష్టపూరుషః. 3

ఆ విరాట పురమున రాష్ట్రమున జనులు గుంపులుగా గుంపులుగా కూడి యిట్లు గుసగుసలాడుకొనిరి. ఆ కీచకుడు గొప్ప బలము కలవాడు. శౌర్యమువలన రాజునకు ప్రియుడు. సేనాపతిగా నుండెను. పరభార్యలను పట్టును. దుష్టబుద్ధి పాపాత్ముడు కావున గంధర్వులు వానిని చంపిరి.

ఇత్యజల్పన్ మహారాజ పరానీక వినాశనమ్,
దేశే దేశే మనుష్యాశ్చ కీచకం దుష్ప్రధర్షణమ్. 4

ఓ మహారాజా! పరసేనలను పరిమార్చువాడు, ఎవ్వరికిని అసాధ్యుడు అగు కీచకుని గూర్చి ప్రతిదేశము నందును జను లిట్లు పలుక జొచ్చిరి.

అథ వై ధార్తరాష్ట్రేణ ప్రయుక్తా యే బహిశ్చరాః,
మృగయిత్వా బహూన్ గ్రామాన్ రాష్ట్రాణి నగరాణి చ. 5

అట దుర్యోధనుడు పంపిన గూఢచారులు పలు గ్రామములను రాష్ట్రములను నగరములను (పాండవులకై) గాలించిరి.

సంవిధాయ యథా దృష్టం యథాదేశ ప్రదర్శనమ్,
కృతకృత్యా న్యవర్తన్త తే చరా నగరం ప్రతి. 6

---

6. కృతకృత్యాః - కీచకవధ తెలియుటచేత పాండవులు అక్కడనే యుంది యుందురని దుర్యోధనాదులు అనుమానించి తెలిసికొందురని అభిప్రాయము, ఆ విధముగా వారు తమ పని నెరవేరినవారు.

ఆయా దేశములందు చూచిన విషయము లన్నింటిని కూర్చు కొని కృతకృత్యులై ఆ గూఢ చారులు నగరమునకు తిరిగి వచ్చిరి.

తత్ర దృష్ట్వా తు రాజానం కౌరవ్యం ధృతరాష్ట్రజమ్,
ద్రోణకర్ణకృపైః సార్ధం భీష్మేణ చ మహాత్మనా. 7

సంగతం భ్రాతృభి శ్చాపి త్రిగర్తై శ్చ మహారథైః,
దుర్యోధనం సభామధ్యే ఆసీన మిద మబ్రువన్. 8

వారు, సభా మధ్యమున నున్న ద్రోణుడు, కర్ణుడు, కృపుడు, మహాత్ముడగు భీష్ముడు, సోదరులు, మహారథులగు త్రిగర్తులు మొదలగు వారితో కొలువు తీరి యున్న ధృతరాష్ట్ర కుమారుడగు దుర్యోధనుని గాంచి యిట్లు పలికిరి.

చరా ఊచుః - చారు లిట్లు పలికిరి.

కృతో౽స్మాభిః పరో యత్న స్తేషా మన్వేషణా సదా,
పాణ్డవానాం మనుష్యేన్ద్ర తస్మిన్ మహతి కాననే. 9

నిర్జనే మృగసంకీర్ణే నానాద్రుమలతాకులే,
లతాప్రతానబహులే నానాగుల్మసమావృతే. 10

మహారాజా ! జనము లేనిది, మృగములు మెల్లుగా గలది, అనేక వృక్షములతో తీగలతో అల్లుకొన్న తీగలుగల తావులతో పొదలతో నిండినది అగు ఆ మహారణ్యమున ఆ పాండవులను వెదకుటలో గొప్ప ప్రయత్నము ఎడతెగక చేసితిమి.

నచ విద్మో గతా యేన పార్థాః సుదృఢ విక్రమాః,
మార్గమాణాః పదన్యాసం తేషు తేషు తథాతథా. 11

మిక్కిలి పటువైన పరాక్రమముగల పాండవులు ఎటుపోయిరో తెలియదు. మేము కాలిగుర్తులనుబట్టి ఆ యా తావులలో అన్నివిధ ముల వెదకితిమి.

గిరికూటేషు తుఙ్గేషు నానాజనపదేషు చ,
జనాకీర్ణేషు దేశేషు ఖర్వటేషు పురేషు చ. 12

నరేన్ద్ర బహుశోఽన్విష్టా నైవ విద్మశ్చ పాణ్డవాన్,
అత్యన్తం వా వినష్టాస్తే భద్రం తుభ్యం నరర్షభ. 13

కొండ శిఖరములలో పలుపల్లెలలో, జనసమ్మర్దముగల తావులలో కొండలోయల పల్లెలలో, పురములలో ఎన్నోపర్యాయములు వెదకితిమి. పాండవులు కానరాలేదు. వారు బహుశః నశించియుందురు. ఓరాజా ! నీకు మేలగుగాక.

వర్త్మన్యన్వేష్యమాణా వై రథినాం రథిసత్తమ,
నహి విద్మో గతిం తేషాం వాసం హి నరసత్తమ. 14

ఓ రథికవరా! నరసత్తమా ! ఆరథికవరుల మార్గములన్నియు వెదకితిమి. వారు పోయిన దారిగాని వారున్న నెలవుగాని తెలియరాలేదు.

కించిత్కాలే మనుష్యేన్ద్ర సూతానామనుగా వయమ్,
మృగయిత్వా యథాన్యాయం వేదితార్థాః స్మతత్త్వతః. 15

మేము వారి సూతుల వెంటనంటి కొంతకాలము అనువైనంతవరకు వెదకి విషయము నెరిగితిమి.

ప్రాప్తా ద్వారవతీం సూతా వినా పార్థైః పరన్తప,
న తత్ర కృష్ణా రాజేన్ద్ర పాణ్డవాశ్చ మహావ్రతాః. 16

పాండవులు లేకయే సారథులు ద్వారవతికి చేరిరి. మహావ్రతము పట్టిన పాండవులును కృష్ణయును అందు లేరు.

సర్వథా విప్రణష్టాస్తే నమస్తే భరతర్షభ,
నహి విద్మో గతిం తేషాం వాసం వాపి మహాత్మనామ్. 17

12. గిరికూటేషు- కొండకొమ్ములయందు, ఖర్వటేషు-కొండలోయలలోనుండు పల్లెలయందు,

ఓ భరతవరేణ్యా ! వారు సర్వవిధములఁ నశించియుందురు. ఆ మహాత్ముల స్థితిగతు లేమియు తెలియరాలేదు.

పాణ్డవానాం ప్రవృత్తించ విద్మః కర్మాపి వా కృతమ్,
స నః శాధి మనుష్యేన్ద్ర అతఊర్ధ్వం విశాంపతే. 18

పాండవులెట్లు ఎచట ఏపనిచేయుచునున్నారో ఏమియు నెరుగము. ఓ రాజేంద్రా అటుపై మమ్మేమిచేయుమందువో ఆనతిమ్ము.

అన్వేషణే పాణ్డవానాం భూయః కింకరవామహే,
ఇమాం చ నః ప్రియాం వీర వాచం భద్రవతీం శృణు. 19

పాండవులను వెదకుటలో మరియు మేమేమిచేయవలయునో సెలవిమ్ము. మఱియు, మేలైనది, ప్రియమైనది అగు మా మాట ఒకటి కలదు వినుము.

యేన త్రిగర్తా నిహతా బలేన మహతా నృప,
సూతేన రాజ్ఞో మత్స్యస్య కీచకేన బలీయసా. 20

స హతః పతితః శేతే గన్ధర్వై ర్నిశి భారత,
అదృశ్యమానై ర్దుష్టాత్మా భ్రాతృభిః సహ సోదరైః. 21

గొప్పబలముగల మత్స్యరాజు సూతుడు కీచకుండుండెనే అతడు - మనత్రిగర్తులను గొప్పసేనతో వచ్చి నాశనము చేసిన వాడు - తమ్ములతో పాటుగా అదుష్టాత్ముని రాత్రియందు అదృశ్యముగా ఉన్న గంధర్వులు చంపిరి. వాడు చచ్చిపడి యుండెను.

[శ్యాలో రాజ్ఞో విరాటస్య సేనాపతి రుదారధీః
సుదేష్ణాయాః సవై జ్యేష్ఠః శూరో వీరో గతవ్యథః.

ఉత్సాహవాన్ మహావీర్యో నీతిమాన్ బలవానపి,
యుద్ధజ్ఞో రిపువీరఘ్నః సింహతుల్యపరాక్రమః

ప్రజారక్షణదక్షశ్చ శత్రుగ్రహణశక్తిమాన్,
విజితారి ర్మహాయుద్ధే ప్రచణ్డో మానవత్ పరః

నరనారీమనోహ్లాదీ ధీరో వాగ్మీ రణప్రియః,
స హతో నిశి గన్ధర్వైః స్త్రీనిమిత్తం నరాధిప.

ఓ రాజా! ఆ కీచకుడు విరాటుని బావమరది, సేనాపతి, గొప్ప బుద్ధిగలవాడు, సుదేష్ణ అన్న, శూరుడు, వీరుడు, చీకు చింతలు లేనివాడు, ఉత్సాహము, గొప్పశక్తి, నీతి, బలము కలవాడు, యుద్ధనీతి యెరిగినవాడు, శత్రువీరులను చంపగలవాడు, సింహముతో తుల్యమగు పరాక్రమము గలవాడు, ప్రజలరక్షించు టలో సమర్థుడు, శత్రువులను పట్టుకొనుటలో శక్తిగలవాడు, మహ యుద్ధమున శత్రువులను గెలిచినవాడు, ప్రచండుడు, అభిమానవంతుడు, స్త్రీ పురుషులను సంతోష పరచుచుండును. ధీరుడు. మాటనేర్పుగల వాడు. రణప్రియుడు. అట్టివాడు స్త్రీకారణముగా రాత్రివేళ గంధ ర్వులచేత చచ్చెను.

అమృష్యమాణో దుష్టాత్మా నిశీథే సహసోదరైః,
సుహృద శ్చాస్య నిహతా యోధాశ్చ ప్రవరా హతాః.

వాని దుష్టస్వభావమును సహింపని గంధర్వులు అర్ధరాత్ర మున సోదరులతో, మిత్రులతో, గొప్ప యోధులతో పాటు వానిని మట్టుపెట్టిరి.]

ప్రియ మేత దుపశ్రుత్య శత్రూణాం చ పరాభవమ్,
కృతకృత్యశ్చ కౌరవ్య విధత్స్వ యదనన్తరమ్. 22

ఓ కురువరా! ఇట్టి శత్రువుల పరాభవమును గూర్చిన ప్రియమైన వార్త విని కృతకృత్యుడవై ఇటుపై ఏమి చేయవలయునో యది చేయుము.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి చారప్రత్యాగమనే పఞ్చవింశోఽధ్యాయః

ఇది శ్రీమహాభారత విరాటపర్వమున గోహరణపర్వమున చారులుతిరిగి వచ్చుట అను ఇరువదియైదవ అధ్యాయము.

## షడ్వింశోఽధ్యాయః - ఇరువదియారవ అధ్యాయము

దుర్యోధనస్య పాణ్డవాను సన్ధాన విషయే సదస్యైః సహ,
పరామర్శ స్తత్ర కర్ణదుఃశాసనయోః సమ్మతిశ్చ.

దుర్యోధనుడు పాండవులను గుర్తించు విషయమున సభ్యులతో ఆలోచించుట - కర్ణదుశ్శాసనులు సమ్మతించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు చెప్పెను.

తతో దుర్యోధనో రాజా జ్ఞాత్వా తేషాం వచ స్తదా,
చిర మన్తర్మనా భూత్వా ప్రత్యువాచ సభాసదః. 1

అంత దుర్యోధన మహారాజు వారిమాటలను విని చాలసేపు లోలోపల ఆలోచించి సదస్యులతో నిట్లు పలికెను.

సుదుఃఖా ఖలు కార్యాణాం గతి ర్విజ్ఞాతు మన్తతః,
తస్మాత్ సర్వే నిరీక్షధ్వం క్వను తే పాణ్డవా గతాః. 2

కర్తవ్యములపద్ధతిని తుదిముట్ట నిర్ణయించుట కష్టమైన పనిగదా! కావున మీరందరు ఆ పాండవు లెందుబోయిరో పరీక్షింపుడు.

అల్పావశిష్టం కాలస్య గతభూయిష్ఠ మన్తతః,
తేషా మజ్ఞాత చర్యాయా మస్మిన్ వర్షే త్రయోదశే. 3

ఈ పదుమూడవ వత్సరమున వారు చేయు అజ్ఞాతవాసకాలము చాలభాగము పూర్తియైనది. కొంచెము కాలము మాత్రము మిగిలినది.

అస్య వర్షస్య శేషం చేద్ వ్యతీయు రిహ పాణ్డవాః,
నివృత్తసమయా స్తేహి సత్యవ్రత పరాయణాః. 4

క్షరన్త ఇవ నాగేన్ద్రాః సర్వే హ్యాశీవిషోపమాః,
దుఃఖా భవేయుః సంరబ్ధాః కౌరవాన్ ప్రతి తే ధ్రువమ్. 5

---

5. దుఃఖాః - దుఃఖమును కలిగించువారు;

ఈ మిగిలిన వత్సరభాగమును పాండవులు మాటపై నిలబడి పూర్తిచేసినచో సత్యవ్రతపరాయణులగు వారు దూసికొనివచ్చు నాగుపాములవలె క్రోధముతో దుఃఖమును కలిగించుచు కౌరవ కులముపై వచ్చిపడుదురు. ఇది సత్యము.

సర్వే కాలస్య వేత్తారః కృచ్ఛ్రరూపధరాః స్థితాః,
ప్రవిశేయు ర్జితక్రోధా స్తావదేవ పునర్వనమ్. 6

వారందరు కాలమును చక్కగా నెరిగినవారు. కష్టమైన రూపములను తాల్చియున్నారు. వారు కోపముల నదుపులో పెట్టుకొని మరల వనమునే చేరునట్లు యత్నింపవలయును.

తస్మాత్ క్షిప్రం బుభూషధ్వం యథా తేఽత్యన్తమవ్యయమ్,
రాజ్యం నిర్ద్వన్ద్వమవ్యగ్రం నిఃసపత్నం చిరం భవేత్. 7

అట్లైనచో ఈ రాజ్యము వినాశము బొందక, శత్రువులు లేక దాయాదులు లేక స్తిమితముగా నుండును. ఈ విధానమునకై మీరు యత్నింపవలయును.

అథాబ్రవీత్ తతః కర్ణః క్షిప్రం గచ్ఛన్తు భారత,
అన్యే ధూర్తా నగా దక్షా నిభృతాః క్షిప్రకారిణః. 8

అప్పుడు కర్ణు డిట్లనెను : అట్లైనచో, ఓ భారతా ! మరి కొందరు నేర్పరులు, నిబ్బరముకలవారు, శీఘ్రముగా పనులు చేయువారు నగు ధూర్తులను పంపుము.

చరన్తు దేశాన్ సంవీతాః స్ఫీతా జ్జనపదాకులాన్,
తత్ర గోష్ఠీషు రమ్యాసు సిద్ధప్రవ్రజితేషు చ. 9

8. ధూర్తాః - జిత్తులమారివారు,

9. గోష్ఠీషు - విద్వాంసులు సభచేయుచోటులందు, సిద్ధప్రవ్రజితేషు - సిద్ధులు తిరుగు ప్రదేశములయందు - మునుల ఆశ్రమములందని భావము,

పరిచారేషు తీర్థేషు వివిధేష్వాకరేషు చ,
విజ్ఞాతవ్యా మనుష్యైస్తై స్తర్కయా సువినీతయా. 10

వారు విడివిడిగా దట్టముగా జనసమ్మర్దముగల గ్రామము లందును, రమ్యములైన గోష్ఠులయందును, సిద్ధులైన మునులు తిరుగు ఆశ్రమములందును, రాజపురములయందును, తీర్థము లందును, వివిధములైన ఇతర ప్రదేశములందును ఇష్టపూర్వకముగా పాండవుల నెరుగుటకై తిరుగవలయును.

వివిధై స్తత్పరైః సమ్యక్ తజ్జై ర్నిపుణసంవృతైః,
అన్వేష్టవ్యా సునిపుణైః పాణ్డవా శ్ఛన్నవాసినః. 11

అదియేపనిగ పెట్టుకొని, నేర్పుగా తామెవరో తెలియకుండ ప్రావీణ్యముతో గూఢముగా నివసించుచున్న పాండవులను వెదుక వలయును.

నదీకుఞ్జేషు తీర్థేషు గ్రామేషు నగరేషు చ,
ఆశ్రమేషు చ రమ్యేషు పర్వతేషు గుహాసు చ. 12

నదులకడనున్న పొదలలో, తీర్థములలో, గ్రామములలో, నగరములలో, రమ్యములైన ఆశ్రమములలో, పర్వతములలో, గుహాలలో వెదుకవలయును.

అథాగ్రజా న న్తరజః పాపభావానురాగవాన్,
జ్యేష్ఠం దుశ్శాసన స్తత్ర భ్రాతా భ్రాతర మబ్రవీత్. 13

10. పరిచారేషు - అందరు వచ్చి తిరుగుచోటులందు - రాజపురములందు, తర్కయా - కాంక్షతో,

13. అగ్రజ, అనన్తరజ. - అగ్రజుడు .. జ్యేష్ఠుడు - అనన్తరజః - తరువాత బుట్టినవాడు - సోదరులలో రెండవవాడు.

పిమ్మట దుర్యోధనుని పెద్ద తమ్ముడు, పాపభావముల యందు అనురాగము గలవాడు అగు దుశ్శాసనుడు పెద్ద అన్నగారితో ఇట్లు పలికెను.

యేషు నః ప్రత్యయో రాజం శ్చారేషు మనుజాధిప,
తే యాన్తు దత్తదేయా వై భూయ స్తాన్ పరిమార్గితుమ్. 14

మనకు విశ్వాసమున్న చారులను, ఓ మహారాజా, వలసిన ధనమిచ్చి పాండవులను వెదకుటకై మరల పంపదగును.

ఏతచ్చ కర్ణో యత్ప్రాహ సర్వ మీహామహే తథా,
యథోద్దిష్టం చరా స్సర్వే మృగయన్తు యత స్తతః. 15

ఈ కర్ణుడు చెప్పిన విధముగా సంతయు చేయుదము. చారులందరు. వారివారికి నిర్దిష్టములైన తావులలో వెదుకవలయును.

ఏ తే చాన్యే చ భూయాంసో దేశాద్దేశం యథా విధి,
నతు తేషాం గతి ర్వాసః ప్రవృత్తి శ్చోపలభ్యతే. 16

అత్యన్తం వా నిగూఢాస్తే పారం చోర్మిమతో గతాః,
వ్యాలై శ్చాపి మహారణ్యే భక్షితాః శూరమానినః. 17

వీరును, ఇంకను గొప్పవారును దేశదేశములను క్షుణ్ణముగా వెదుకవలయును. అప్పటికి వారి స్థితి గతులు తెలియనిచో వారు మిక్కిలి గూఢముగా నున్నారన్నమాట, లేదా ద్వీపాంతరముల కరిగియుందురు. కాదా మహారణ్యములో కొండ చిలువలకు, శూరులమను కొని ఆ పాండవులు, బలియై యుందురు.

అథవా విషమం ప్రాప్య వినష్టాః శాశ్వతీః సమాః,
తస్మా న్మానస మవ్యగ్రం కృత్వా త్వం కురునన్దన,
కురు కార్యం మహోత్సాహం మన్యసే యన్నరాధిప. 18

17. ఊర్మిమత :- అలలు గలదానియొక్క సముద్రముయొక్క

శేష కాల మనుకూలింపకేగని శాశ్వతములైన వత్సరములు వెలి! రాజాలని వారైయుందురు. నీవు మనసు పదిలపరచుకొని తలచిన పనిని మంచి ఉత్సాహముతో చేయుము.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి
కర్ణదుఃశాసన వాక్యే షడ్వింశోఽధ్యాయః
ఇది శ్రీ మహాభారత విరాటపర్వమున గోహరణపర్వమున
కర్ణ దుశ్శాసనుల మాటయను నిరువది యారవ అధ్యాయము

## సప్తవింశోఽధ్యాయః – ఇరువదియేడవ అధ్యాయము

### ద్రోణాచార్య సంమతిః-ద్రోణాచార్యుని సమ్మతి.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

అథాబ్రవీ న్మహావీర్యో ద్రోణ స్తత్త్వార్థ దర్శివాన్,
న తాదృశా వినశ్య న్తి న ప్రయా న్తి పరాభవమ్. 1

అంత గొప్ప వీర్యము కలవాడు, తత్వమెరిగినవాడును అగు ద్రోణాచార్యు డిట్లు పలికెను. 'అట్టివారు నశింపరు. పరాభవము పొందరు'.

శూరాశ్చ కృతవిద్యా శ్చ బుద్ధిమన్తో జితేన్ద్రియాః,
ధర్మ జ్ఞాశ్చ కృతజ్ఞాశ్చ ధర్మరాజ మను వ్రతాః. 2

వారు శూరులు, విద్యలను చక్కగా నేర్చినవారు, బుద్ధిమంతులు, ఇంద్రియములను గెలిచినవారు, ధర్మమెరిగినవారు, కృతజ్ఞులు, ధర్మరాజును బట్టి ప్రవర్తించువారు.

నీతిధర్మార్థత త్త్వజ్ఞం పితృవచ్చ సమాహితమ్,
ధర్మే స్థితం సత్యధృతిం జ్యేష్ఠం జ్యేష్ఠానుయాయినః. 3

నీతి, ధర్మము, అర్థము అనువాని తత్త్వమెరిగినవాడు, తండ్రివలె అరయువాడు, ధర్మమునందు పట్టుగలవాడు, సత్యము

నందు శ్రద్ధ కలవాడు నగు పెద్దఅన్నను వారు భక్తిలో అనుసరింతురు.

అనువ్రతా మహాత్మానం భ్రాతరో భ్రాతరం నృప,
అజాతశత్రుం శ్రీమన్తం సర్వభ్రాతౄ ననువ్రతమ్. 4

ఓ రాజా! తమ్ములందరను అనుసరించు స్వభావము గల శ్రీమంతుడు, అజాతశత్రువు మహాత్ముడువగు ధర్మరాజును తమ్ములందరు ప్రీతితో అనుసరింతురు.

తేషాం తథా విధేయానాం నిభృతానాం మహాత్మనామ్,
కిమర్థం నీతిమాన్ పార్థః శ్రేయో నైషాం కరిష్యతి. 5

అట్లు విధేయులు, నిండుమనసు కలవారు, మహాత్ములు అగు తమ్ములకు నీతిమంతుడగు కుంతీ తనయుడు ధర్మరాజు శ్రేయమేల చేయకుండును.

తస్మాద్ యత్నాత్ ప్రతీక్షన్తే కాలస్యోదయ మాగతమ్,
న హి తే నాశ మృచ్ఛేయు రితి పశ్యామ్యహం ధియా. 6

కావున వారు అతిప్రయత్నముతో అభివృద్ధి సమయము రాక నెదురు చూచుచున్నారు. నశించియుండరని నా బుద్ధికితోచుచున్నది.

సాంప్రతం చైవ యత్ కార్యం తచ్చ క్షిప్ర మకాలికమ్,
క్రియతాం సాధు సంచిన్త్య వాస శ్చైషాం ప్రచిన్త్యతామ్, 7
యథావత్ పాణ్డుపుత్రాణాం సర్వార్థేషు ధృతాత్మనామ్.

ప్రకృతము చేయవలసినదేదో అది కాలము మించిపోకుండ చక్కగా చేయవలయును. అన్ని విషయములలో మనస్సునదుపులో పెట్టుకొనగల పాండుపుత్రు లెందుండిరో ఆ నెలవు కనుగొనవలయును.

---

7, అకాలికమ్ - ఆలస్యము చేయకుండ.

దుర్జ్ఞేయాః ఖలు శూరాస్తే దురాపా స్తపసా వృతాః 8

వారు శూరులు కావ తెలియరారు. తపస్సుతో ఆవరింప బడినవారు. కావ పొందవి వారు.

శుద్ధాత్మా గుణవాన్ పార్థః సత్యవాన్ నీతిమాన్ శుచిః,
తేజోరాశి రసంఖ్యేయో గృహ్ణీయా దపి చక్షుషా. 9

ఆ ధర్మరాజు శుద్ధమైన ఆత్మ కలవాడు. గుణవంతుండు, సత్యవంతుడు, నీతిమంతుడు, పవిత్రుడు, తేజముల ప్రోవు. కంటి కగుపడినను గుర్తింపరానివాడు.

విజ్ఞాయ క్రియతాం తస్మాద్ భూయశ్చ మృగయామహే,
బ్రాహ్మణై శ్చారకైః స్సిద్ధై ర్యే చాన్యే తద్విదో జనాః 10

కావున మరియు బాగుగా నెరిగిన బ్రాహ్మణులు, సిద్ధులునగు చారులతో అన్వేషింపజేయుదము.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి
ద్రోణవాక్యే చారప్రత్యాచారే సప్తవింశోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారత విరాటపర్వమున గోహరణపర్వమున ద్రోణవాక్యమున
చారులను పంపుట యను ఇరువది యేడవ అధ్యాయము.

## అష్టవింశోఽధ్యాయః - ఇరువది యెనిమిదవ అధ్యాయము

యుధిష్ఠిరమహాత్మ్యా ముపవర్ణ్యయతో భీష్మస్య పాణ్డవాను స్థానవిషయే సమ్మతిః -

యుధిష్ఠిరుని గొప్పతనమును వర్ణించి భీష్ముడు పాండవులను గుర్తించుటకై సమ్మతించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః శాన్తనవో భీష్మో భరతానాం పితామహః,
శ్రుతవాన్ దేశకాలజ్ఞ స్తత్త్వజ్ఞః సర్వధర్మవిత్, 1

ఆచార్యవాక్యోపరమే తద్వాక్యమభిసందధత్,
హితార్థం సమువాచైనాం భారతీం భారతాన్ప్రతి. 2

పిమ్మట, శంతను కుమారుడు, భరతవంశమువారికి శాస్త్ర, వేదములు చక్కగా అధ్యయనము చేసినవాడు, దేశకాలములను చక్కగా నెరిగినవాడు, తత్త్వమెరిగినవాడు, సర్వధర్మములను ఎరిగినవాడు నగు భీష్ముడు ద్రోణుని వాక్యము ముగిసిన పిదప తన మాటను దానితో కలుపుచు అక్కడ ఉన్న భరత వంశమువారి నుద్దేశించి అందరిహితమునకై ఈ భారతియైన మాట పలికెను.

యుధిష్ఠిరే సమాసక్తాం ధర్మజ్ఞే ధర్మసంవృతామ్,
అసత్సు దుర్లభాం నిత్యం సతాం చాభిమతాం సదా, 3
భీష్మః సమవదత్ తత్ర గిరం సాధుభి రర్చితామ్.

ధర్మజ్ఞుడైన ధర్మరాజునకు సంబంధించినదియు, ధర్మముతో నిండినదియు, సత్పురుషులు కాని వారికి బొత్తుగా దుర్లభమైనదియు, సత్పురుషులకు ఎల్లపుడు బాగుగా నిష్టమైనదియు, సజ్జనులు మన్నించునదియు నగు పక్షపాత రహితమైన వాక్కును భీష్ముడు అచట పలికెను.

యశ్చైష బ్రాహ్మణః ప్రాహ ద్రోణః సర్వార్థతత్త్వవిత్, 4
సర్వలక్షణసంపన్నాః సాధువ్రతసమన్వితాః,
శ్రుతవ్రతోపపన్నాశ్చ నానాశ్రుతిసమన్వితాః. 5

సర్వవిషయములను మూలముట్టుగా నెరిగిన ఈ బ్రాహ్మణుడు ద్రోణుడు పలికినట్లు పాండవులు మంచి లక్షణములన్నియు సమృద్ధిగా కలవారు. చక్కని ఆచారములతో కూడినవారు. శాస్త్రములయందు నిష్ఠ పెల్లుగా కలవారు. అనేకములగు ఇతిహాసములజ్ఞానము కలవారు.

2. అభిసందధత్ - ద్రోణునిపలుకు ననుసరించుచు, భారతీమ్ - భరతవంశమువారైన పాండవులకు సంబంధించినదానిని,

వృద్ధానుశాసనే యుక్తాః సత్యవ్రతపరాయణాః,
సమయం సమయజ్ఞాస్తే పాలయన్తః శుచివ్రతాః. 6

పెద్దలమాటలను జవదాటరు. సత్యమును పాటించుటలో దీక్ష గలవారు. సమయము నెరిగినవారు, పవిత్రమైన నడవడి గలవారు. ప్రతిజ్ఞను పాలించువారు.

క్షత్రధర్మరతా నిత్యం కేశవానుగతాః సదా,
ప్రవీరపురుషాస్తేవై మహాత్మానో మహాబలాః,
నావసీదితుమర్హాన్తి ఉద్వహన్తః సతాం ధురమ్. 7

క్షత్రియధర్మమునందు ఆసక్తి కలవారు. నిత్యము శ్రీకృష్ణుని అడుగుజాడలలో నడచువారు. గొప్పవీరులు. ఉదారమైన చిత్తము, గొప్పబలము గలవారు. ధర్మమును తల దాల్చినవారు. అట్టివారు నశింపరు.

ధర్మతశ్చైవ గుప్తాస్తే సువీర్యేణ చ పాణ్డవాః,
న నాశమధిగచ్ఛేయురితి మే ధీయతే మతిః. 8

వారిధర్మమే, మరియు, వారి గొప్పవీర్యమే వారిని కాపాడుచున్నది. అట్టివారు నశించియుండరని నాబుద్ధికి తోచుచున్నది.

తత్ర బుద్ధిం ప్రవక్ష్యామి పాణ్డవాన్ ప్రతి భారత,
న తు నీతిః సునీతస్య శక్యతేఽన్వేషితుం పరైః. 9

పాండవుల విషయమున నా ఉద్దేశమును చెప్పుచున్నాను వినుడు. మిక్కిలి నేర్పుగలవాని నీతిని ఇతరులు అనుసరింప జాలరు.

యత్తు శక్యమిహాస్మాభిస్తాన్ వై సంచిన్త్య పాణ్డవాన్,
బుద్ధ్యా ప్రయుక్తం న ద్రోహాత్ ప్రవక్ష్యామి నిబోధత. 10

7. సతాం ధురమ్ - సజ్జనులధర్మమును.
9. పరైః - నీతిమాలినవారిచేత అని భావము. అన్వేషితుమ్ - అనుసరించుటకు

పాండవులను గూర్చి బాగుగా ఆలోచించి ద్రోహముతో కాక, సద్బుద్ధితో మనము చేయదగిన దానిని చెప్పుచున్నాను. మీరు శ్రద్ధగా తెలిసికొనుడు.

నత్వియం మాదృశై ర్నీతి స్తస్య వాచ్యా కథంచన,
సాత్వియం సాధువ క్తవ్యా న త్వనీతిః కథంచన. 11

ద్రోహబుద్ధి కలవానికి మావంటి వారెన్నటికిని నీతిని చెప్ప రాదు. చెప్పినచో మంచిదానినే చెప్పవలయును. ఎన్నటికి అవి నీతిని ఎవ్వరికిని చెప్పరాదు.

వృద్ధానుశాసనే తాత తిష్ఠతా సత్యశీలినా,
అవశ్యం త్విహ ధీరేణ సతాం మధ్యే వివక్షతా. 12
యథార్హ మిహ వక్తవ్యం సర్వథా ధర్మలిప్సయా,

నాయనా! పెద్దలమాటపై నిలబడు సత్యశీలము గలవాడు, సజ్జనుల నడుమ పలుకునపుడు తప్పనిసరిగ ధీరుడై పలుకవలయును. ఎన్నటికిని ధర్మమును సాధించు కోరికతో యోగ్యమైన విధముగా పలుకవలయును.

13
తత్ర నాహం తథా మన్యే యథాయ మితరో జనః,
నివాసం ధర్మరాజస్య వర్షేఽస్మిన్ వై త్రయోదశే,
14
తత్ర తాత న తేషాం హి రాజ్ఞాం భావ్య మసాంప్రతమ్.
పురే జనపదే చాపి యత్ర రాజా యుధిష్ఠిరః.

ఇట్లు పలుకవలసివచ్చినవుడు, ఈ వీరందరు తలచినట్లు నేను సంభావింపను. ఈ పదమూడవవత్సరమున అది పట్టణముగానీ, గ్రామముగానీ ధర్మరాజు నివసించినచోటున ఆ రాజులకు అమంగళమును ఊహింపజాలము.

---

11. తస్య - దుర్జనుడైన నీవంటివానికని గూఢమైన అభిప్రాయము.
14. అసాంప్రతమ్ - అమంగళమును.

దానశీలో వదాన్యశ్చ నిభృతో హ్రీనిషేవకః,
జనో జనపదే భావ్యో యత్ర రాజా యుధిష్ఠిరః.

ధర్మరాజు నివసించు దేశమున నున్న జనుడు దానశీలుడు, ప్రియము పలుకువాడు, ఇంద్రియ నిగ్రహము కలవాడు, ఉచితమైన లజ్జ కలవాడు నై యుండును.

ప్రియవాదీ సదా దాన్తో భవ్యః సత్యపరో జనః,
హృష్టః పుష్టః శుచి ర్దక్షో యత్ర రాజా యుధిష్ఠిరః. 16

యుధిష్ఠిరుడున్న దేశమున జనుడు ప్రియములు పలుకువాడు, ఎల్లప్పుడు ఇంద్రియములపై అదుపు కలవాడు, సత్యమునందు నిష్ఠ కలవాడు, హర్షము, పుష్టి, పవిత్రత, నేర్పు, అను గుణములు కలవాడు నై యుండును.

నాసూయకో నాచాపీర్ష్యుర్నాభిమానీ నమత్సరీ,
భవిష్యతి జన స్తత్ర స్వయం ధర్మమనువ్రతః. 17

ధర్మరాజున్నతావున నున్న జనుడు పరులగుణములను దోషములుగా నిరూపింపడు. ఇతరుల ఉన్నతి సహింపని వాడు కాజాలడు. తన్ను గొప్పవాడని భావింపడు. పరులకు ద్రోహము చేయడు. ధర్మమునందు నిష్ఠ కలిగియుండును.

బ్రహ్మఘోషాశ్చ భూయాంసః పూర్ణాహుత్య స్తథైవ చ,
క్రతవశ్చ భవిష్యన్తి భూయాంసో భూరిదక్షిణాః. 18

ధర్మరాజున్న దేశమున వేదఘోషములు పిక్కటిల్లుచుండును. గొప్ప దక్షిణలుగల యజ్ఞములు మిక్కిలి ఎక్కువగా జరుగుచుండును.

16. వదాన్యః - ప్రియవాది ; నిభృతః - ఇంద్రియముల అదుపు కలవాడు.

సదా చ తత్ర పర్జన్యః సమ్యగ్వర్షీ న సంశయః,
సంపన్నసస్యా చ మహీ నిరాతఙ్కా భవిష్యతి. 19

ఆతడున్న దేశమున వానదేవుడు మంచివర్షము కురియును. ఇందు సందియము లేదు. పంటలు బాగుగా పండి భూమి బాధలు లేనిది యగును.

గుణవన్తి చ ధాన్యాని రసవన్తి ఫలాని చ,
గన్ధవన్తి చ మాల్యాని శుభశబ్దా చ భారతీ. 20

ధాన్యములు మంచిలక్షణములతో నుండును. ఫలములు రసవంతములై యుండును. మాలలు మంచివాసనతో అలరారును. వాక్కు మంగళములైన శబ్దముల కలదియై యొప్పారును.

వాయుశ్చ సుఖసంస్పర్శో నిష్ప్రతీపం చ దర్శనమ్,
న భయం త్వావిశేత్ తత్ర యత్ర రాజా యుధిష్ఠిరః. 21

యుధిష్ఠిర మహారాజున్నతావున వాయువు సుఖమైన స్పర్శ కలిగినదై యుండును. ధర్మబ్రహ్మముల స్వరూపమును దర్శించుట నాస్తిక మార్గమును వదలినదై యుండును. భయము కలుగదు.

గావశ్చ బహులా స్తత్ర న కృశా న చ దుర్బలాః,
పయాంసి దధి సర్పీంషి రసవన్తి హితాని చ. 22

ధర్మజుడున్న దేశమున గోవులు మిక్కుటముగా నుండును. బక్క చిక్కినవి, బలములేనివి ఉండవు. వాని పాలు పెరుగు నేయి మంచిరుచితో హితములై యుండును.

గుణవన్తి చ పేయాని భోజ్యాని రసవన్తి చ,
తత్ర దేశే భవిష్యన్తి యత్ర రాజా యుధిష్ఠిరః. 23

21. దర్శనమ్ - ధర్మబ్రహ్మస్వరూప దర్శనము; నిష్ప్రతీపమ్ - పాషండ మార్గము లేనిదై.

ధర్మజుడున్న దేశమున పానీయములు గుణవంతములై యుండును. భోజనపదార్థములు రసవంతములై యుండును.

రసాః స్పర్శాశ్చ గన్ధాశ్చ శబ్దా శ్చాపి గుణాన్వితాః,
దృశ్యాని చ ప్రసన్నాని యత్ర రాజా యుధిష్ఠిరః. 24

యుధిష్ఠిరుడున్న వెలవున రసములు, స్పర్శలు, గంధములు, శబ్దములు మంచి లక్షణములు కలవియై యుండును. రూపములు ప్రసన్నములై యుండును.

ధర్మాశ్చ తత్ర సర్వైస్తు సేవితాశ్చ ద్విజాతిభిః,
స్వైః స్వైర్గుణైశ్చ సంయుక్తా అస్మిన్ వర్షే త్రయోదశే.
దేశే తత్ర భవిష్యన్తి తాత పాణ్డవసంయుతే. 25

నాయనా! ఈ పదుమూడవయేట ధర్మరాజున్న చోట, మూడువర్ణములవారును తమతమ గుణములతో కూడుకొని ధర్మములను సేవించుచు నుందురు.

సంప్రీతిమాన్ జనస్తత్ర సంతుష్టశ్శుచి రవ్యయః, 26
దేవతాతిథి పూజాసు సర్వభావానురాగవాన్,

ఇష్టదానో మహోత్సాహః స్వస్వ ధర్మ పరాయణః. 27

అందు జనుడు మిక్కిలి ప్రీతితో నుండును. తృప్తి కలిగి యుండును. పవిత్రుడై యుండును. క్షీణతనొందడు. దేవతల, అతిథుల పూజలయందు నిండుహృదయముతో అనురాగము కలిగియుండును. దానములందిష్టము, గొప్ప ఉత్సాహము కలవాడై యుండును. తన తన ధర్మమునందు దీక్ష కలిగియుండును.

అశుభాద్ధి శుభప్రేప్సు రిష్టయజ్ఞః శుభవ్రతః, 28
భవిష్యతి జనస్తత్ర యత్ర రాజా యుధిష్ఠిరః.

---

24. దృశ్యాని - రూపములు.
28. అశుభాత్ - అశుభంత్యక్త్వా - అశుభమైనదానిని వదలి;

ధర్మజుడున్న రాష్ట్రమున జనుడు అశుభకార్యములు వదలి శుభములను పొందగోరును. యజ్ఞముల నాచరించును, శుభమైన పనులయందు నిష్ఠకలిగియుండును.

త్యక్తవాక్యానృత స్తాత శుభకల్యాణమఙ్గలః,
శుభార్థేప్సుః శుభమతి ర్యత్ర రాజా యుధిష్ఠిరః. 29
భవిష్యతి జన స్తత్ర నిత్యం చేష్టప్రియవ్రతః.

నాయనా! ధర్మరాజున్న తావున జనుడు అసత్య వాక్యములను త్యజించును. శుభములు, కల్యాణములు, మంగళములు కలిగియుండును. శుభ విషయములను వాంఛించును. శుభమైన బుద్ధికలిగియుండును. యాగములు, పరసుఖము కలిగించు సత్కార్యములు మొదలగువానిని ఆచరించుచుండును.

ధర్మాత్మా శక్యతే జ్ఞాతుం నాపి తాత ద్విజాతిభిః, 30
కింపునః ప్రాకృతై స్తాత పార్థో విజ్ఞాయతే క్వచిత్.

ఇట్టి ధర్మాత్ముడగు పార్థుని ద్విజులు కూడ తెలియ జాలరు. ఇంక సాధారణుల మాట చెప్పనేల?

యస్మిన్ సత్యం ధృతి ర్దానం పరా శాన్తి ర్ధ్రువా క్షమా, 31
హ్రీః శ్రీః కీర్తిః పరం తేజ ఆనృశంస్య మథార్జవమ్.

ఆ ధర్మరాజునందు సత్యము, ధైర్యము, దానము, గొప్ప శాంతి, చెదరనిఓర్పు, సిగ్గు, సంపద, కీర్తి, గొప్ప తేజము, కృతజ్ఞత, ఋజుత్వము అను గుణములు గలవు.

తస్మాత్ తత్ర నివాసం తు ఛన్నం యత్నేన ధీమతః,
గతిం చ పరమాం తత్ర నోత్సహే వక్తు మన్యథా. 32

---

30. ఇష్ట ప్రియ వ్రతః - ఇష్టమనగా యాగము మొదలగునది, ప్రియమనగా ఇతరులకు సుఖము నిచ్చునది, వానియందు వ్రతము కలవాడు.

కావునసే ఆ బుద్ధిమంతుని నివాసము ప్రవృత్తియు గొప్ప యత్నముతో అతి గూఢముగా నున్నవి. విషయమును దాచిపెట్టి ఇచ్చకములాడుట నాకు రుచింపదు.

ఏవ మేత త్తు సంచిన్త్య యత్కృతే మన్యసే హితమ్,
తత్ క్షిప్రం కురు కౌరవ్య యద్యేవం శ్రద్దధాసి మే. 33

కాబట్టి నాయనా! నాయందు నీకు నమ్మకమున్నచో నేను చెప్పినదానిని బాగుగా ఆలోచించి నీకేది హితమని తోచునో దానిని త్వరగా ఆచరింపుము.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి చారప్రత్యాచారే భీష్మవాక్యే అష్టావింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున చారుల తిరిగి రాక యందు భీష్మవాక్యమున ఇరువది యెనిమిదవ అధ్యాయము

## ఏకోనత్రింశోఽధ్యాయః - ఇరువది తొమ్మిదవ అధ్యాయము

కృపాచార్యస్య సంమతిః, దుర్యోధనస్య నిశ్చయశ్చ, కృపాచార్యుని సమ్మతి, దుర్యోధనుని నిశ్చయము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తత శ్శారద్వతో వాక్య మిత్యువాచ కృప స్తదా,
యుక్తం ప్రాప్తం చ వృద్ధేన పాణ్డవాన్ ప్రతి భాషితమ్. 1

ధర్మార్థ సహితం శ్లక్ష్ణం త త్త్వతశ్చ సహేతుకమ్,
తత్రానురూపం భీష్మేణ మమా ప్యత్ర గిరం శృణు. 2

అంతట శరద్వంతుని కుమారుడగు కృపాచార్యు డిట్లు పలికెను. 'ఈ వృద్ధుడగు భీష్ముడు పాండవులను గూర్చి ఉపపత్తులతో కూడినదియు, కాలమునకు తగినదియు నగు పలుకు పలికెను. అది

1. యుక్తం - యుక్తి కలది; ప్రాప్తం - సరియైన కాలమున వచ్చినది; తత్త్వతశ్చ సహేతుకం - యుక్తులవలె పైకి మాత్రమే కనబడునట్టివి లేనిది;

ధర్మార్థములతో కూడి సూటిగా ఉన్నది. అందు భ్రాంతికి తావు లేదు. మిక్కిలి యోగ్యమైనది. ఈ విషయమున నా మాట కూడ వినుము.

తేషాం చైవ గతి స్తీర్థై ర్వాస శ్చైషాం ప్రచిన్త్యతామ్,
నీతి ర్విధీయతాం చాపి సాంప్రతం యా హితా భవేత్. 3

పాండవుల స్థితిగతులను చారులతో ఎరుగదగును. ఇప్పటికి మన కేది హితమగునో ఆ నీతిని ప్రయోగింపవలయును.

నావజ్ఞేయో రిపు స్తాత ప్రాకృతోఽపి బుభూషతా,
కింపునః పాణ్డవా స్తాత సర్వాస్త్రకుశలా రణే. 4

నాయనా! మేలుగోరువాడు శత్రువు సామాన్యుడైనను వానిని చులకనబుద్ధితో చూడరాదు. అట్టియెడ సర్వాస్త్రములలో ఆరితేరిన పాండవుల మాట చెప్పనేల?

తస్మాత్ సత్రం ప్రవిష్టేషు పాణ్డవేషు మహాత్మసు,
గూఢభావేషు చ్ఛన్నేషు కాలే చోదయ మాగతే. 5

అందువలన పాండవులు మారువేసములతో గుట్టుగా తెలియరాకుండ ఉన్నారు. వారు ప్రతిజ్ఞ చేసిన కాలమా గడువ వచ్చినది.

స్వరాష్ట్రే పరరాష్ట్రే చ జ్ఞాతవ్యం బలమాత్మనః
ఉదయః పాణ్డవానాం చ ప్రాప్తకాలే న సంశయః. 6

మన రాష్ట్రమునందును, మన మిత్రుల దేశములందును మన బల మెంతటిదో చక్కగా ఎఱుగ వలయును. అజ్ఞాతకాలము ముగిసిన వెంటనే పాండవులు పైకి వత్తురు సందియము లేదు.

నివృత్తసమయాః పార్థా మహాత్మానో మహాబలాః,
మహోత్సాహా భవిష్యన్తి పాణ్డవా హ్యమితౌజసః 7

---

3. తీర్థైః - యోగ్యులైన చారులచేత.

5. సత్రమ్ - వేషాంతరము ధరించుట యను మిష.

ప్రతిజ్ఞలు తీర్చుకొన్న పాండవులు, గొప్పబలము, గొప్ప ఆత్మశక్తి, గుండె దిటవు కలవారు కనుక గొప్ప ఉత్సాహము కలవారగుదురు.

తస్మాద్ బలం చ కోశశ్చ నీతిశ్చాపి విధీయతామ్,
యథా కాలోదయే ప్రాప్తే సమ్యక్ తైః సందధామహే. 8

కావున మనము సేనను, ధనకోశమును, నీతిని చక్కగా అమర్చుకొనవలయును. యుద్ధము వచ్చిపడినచో వారితో తలపడ వచ్చును. (పాండవులకు అభివృద్ధి కాలము వచ్చినచో వారితో సంధి చేసికొనవచ్చును).

తాత బుద్ధ్యాపి తత్ సర్వం బుధ్యస్వ బలమాత్మనః,
నియతం సర్వమిత్రేషు బలవత్ స్వబలేషు చ. 9

నాయనా! మన మిత్రులందరిలో - వారు బలవంతులైనను, దుర్బలులైనను - నీ బల మెంతటిదో నీ బుద్ధితో దృఢముగా ఎరుగుము.

ఉచ్చావచం బలం జ్ఞాత్వా మధ్యస్థం చాపి భారత,
ప్రహృష్ట మప్రహృష్టం చ సందధామ తథా పరైః. 10

ఎక్కువ తక్కువలు, సమస్థితులు గల బలమును చక్కగా నెరిగి అనురాగ ద్వేష భావములను గుర్తించి మనము పరులతో తలపడవలయును (కలియవలయును).

---

8. యథా తైః సందధామహే - అనుకూలమైనచో దండెత్తుదము, లేనిచో సంధి చేసికొందము అని తాత్పర్యము.

9. నియతమ్ - స్థిరముగా.

10. శత్రువుల బలము కంటె మన బలము అధికమైనచో లేదా సమముగానున్నచో కలవడవలయును. హీనమైనచో సంధి చేసికొనవలయునని తాత్పర్యము.

సామ్నా దానేన భేదేన దణ్డేన బలికర్మణా,
న్యాయేనాక్రమ్య చ పరాన్ బలాచ్చానమ్య దుర్బలాన్, 11
సాన్త్వయిత్వా చ మిత్రాణి బలం చాభాష్యతాం సుఖమ్,
సుకోశబలసంవృద్ధః సమ్యక్ సిద్ధిమవాప్స్యసి. 12

శత్రువులను సామము, దానము, భేదము, దండము, పన్ను గొనుట అను పద్ధతులతో స్వాధీనము చేసికొని, అంతగా బలము లేనివారిని బలముతో లొంగదీసికొని, మిత్రులను మంచిమాటలతో వశపరచుకొని, సేనను సుఖముగా పలుకరించుచుండవలయును. ఇట్లు ధనాగారమును, సేనను బాగుగా పెంచుకొన్నవాడవై జయమును పొందగలవు.

యోత్స్యసే చాపి బలిభి రరిభిః ప్రత్యుపస్థితైః,
అన్యై స్త్వం పాణ్డవై శ్చాపి హీనైః స్వబలవాహనైః. 13

ఇట్లైనచో ఎంతటి బలవంతులగు శత్రువులు వచ్చి పడినను - వారు సేన వాహనములు లేని పాండవులే కానీ ఇతరులేకానీ, వారితో పోరగలవు.

ఏవం సర్వం వినిశ్చిత్య వ్యవసాయం స్వధర్మతః,
యథాకాలం మనుష్యేన్ద్ర చిరం సుఖ మవాప్స్యసి. 14

కావున నీధర్మము ననుసరించి, ఓ మహారాజా ! సంపూర్ణమైన ఒక్క కర్తవ్యమును కాలమునకు యోగ్యమైన దానిని నిర్ణయించి చిరకాలము సుఖమును పొందగలవు.

[వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.
తతో దుర్యోధనో వాక్యం శ్రుత్వా తేషాం మహాత్మనామ్,
ముహూర్త మివ సంచిన్త్య సచివా నిద మబ్రవీత్.

11. పరులు తమతో సములైనచో సామభేదోపాయములు, తమకంటె గొప్పవారైనచో దానము, తక్కువవారైనచో దండము, యుద్ధమున పడగొట్టలేక పన్నుగొనుట అనుతీరున ప్రయోగింపదగునని భావము.

అంత దుర్యోధనుడు ఆ మహాత్ముల పలుకులను విని కొంత వడి ఆలోచించి మంత్రులతో ఇట్లు పలికెను.

దుర్యోధన ఉవాచ - దుర్యోధను డిట్లు పలికెను.

శ్రుతం హ్యేతన్మయా పూర్వం కథాసు జనసంసది,
వీరాణాం శాస్త్రవిదుషాం ప్రాజ్ఞానాం మతినిశ్చయే,
కృతినాం సారఫల్గుత్వం జానామి నయచక్షుషా.

పూర్వము సభలలో జనులాడుకొను మాటలలో నేనిది విని యున్నాను. వీరులు, శాస్త్రవేత్తలు, బుద్ధిమంతులు, కార్యసిద్ధి పొందినవారు - ఇట్టివారిలో సారము, పొల్లు ఎట్టివో నేను నీతి అను నేత్రముతో తెలిసికొనుచుందును.

సత్త్వే బాహుబలే ధైర్యే ప్రాణే శారీరసంభవే,
సాంప్రతం మానుషే లోకే సదైత్య నరరాక్షసే,
చత్వారస్తు నరవ్యాఘ్రా బలే శక్రోపమా భువి,
ఉత్తమాః ప్రాణినాం తేషాం నాస్తి కశ్చిద్ బలేసమః,
సమప్రాణ బలా నిత్యం సంపూర్ణ బలపౌరుషాః.

సత్త్వ, భుజబలము, ధైర్యము, దేహమునందలి ప్రాణశక్తి అనువానివిషయమున ప్రకృతము రాక్షసులతో కూడిన మానవ లోకమున ఉత్తములైన నరశ్రేష్ఠులు, బలములో భూలోకమున దేవేంద్రునితో సాటివచ్చువారు నలుగురు కలరు. వానికి సాటి వచ్చువాడు మరియొకడు కాడు. వారు సమానమగు ప్రాణబలము, దేహబలము పౌరుషము కలవారు.

బలదేవశ్చ భీమశ్చ మద్రరాజశ్చ వీర్యవాన్,
చతుర్థః కీచక స్తేషాం పఞ్చమం నానుశుశ్రుమః.

బలరాముడు, భీముడు, వీర్యశాలియగు మద్రరాజుశల్యుడును నాలుగవవాడు కీచకుడు. వారితో సాటివచ్చు అయిదవవానిని గూర్చి వినము.

అన్యోన్యానంతరబలాః పరస్పరజయైషిణః,
బాహుయుద్ధ మభీప్సన్తో నిత్యం సంరబ్ధమానసాః.

వారొకరికొకరు వాసిలేని బలముకలవారు, ఒకరినొకరు గెలువగోరుచుందురు. బాహుయుద్ధము నభిలషింతురు. నిత్యము వారిహృదయములు ఉత్సాహముతో పరవళ్లు త్రొక్కుచుండును.

తే నాహ మవగచ్ఛామి ప్రత్యయేన వృకోదరమ్,
మనస్యభినివిష్టం మే వ్యక్తం జీవన్తి పాణ్డవాః.

ఆ నమ్మకమును బట్టి నేను భీమసేనుని జాడ గుర్తుపట్టు చున్నాను. మనసులో నున్నది యిప్పుడు స్పష్టమైనది. పాండవులు బ్రదికియే యున్నారు.

తత్రాహం కీచకం మన్యే భీమసేనేన మారితమ్,
సైరన్ధ్రీం ద్రౌపదీం మన్యే నాత్ర కార్యా విచారణా.

అందు కీచకుడు భీమునిచేత చచ్చెనని నా అనుమానము. సైరంధ్రి ద్రౌపది యనుకొందును. ఇంక విచారముతో పనిలేదు.

శఙ్కే కృష్ణానిమిత్తం తు భీమసేనేన కీచకః,
గన్ధర్వవ్యపదేశేన హతో నిశి మహాబలః.

మహాబలుడైన కీచకుని భీమసేనుడు గంధర్వుడనెడి పేరున ద్రౌపది కారణముగా అర్ధరాత్రమున మట్టుపెట్టెనని నాయనుమానము.

కోహి శక్తః పరో భీమాత్ కీచకం హన్తు మోజసా,
శస్త్రం వినా బాహువీర్యాత్ తథా సర్వాఙ్గమార్దనే,
మర్దితుం వా తథాశీఘ్రం చర్మమాంసాస్థి చూర్ణితమ్.

ఆయుధము పట్టక కేవలము చేతులబలిమితో అట్లు అన్ని అవయవములను పిండిగొట్టుటలో అంత త్వరగా చర్మము, మాంసము, ఎముకలు పొడిచేసి మర్దించుటలో భీమునికంటె చాలిన వాడు మరియొకడుండునా ?

రూప మన్యత్ సమాస్థాయ భీమస్యైతద్ విచేష్టితమ్.

ఈపని మారువేసమును దాల్చిన భీమునిదే.

ధ్రువం కృష్ణానిమిత్తం తు భీమసేనేన సూతజాః,
గన్ధర్వవ్యపదేశేన హతా యుధి న సంశయః.

భీమసేనుడు ద్రౌపది కారణముగా గంధర్వుడను నెపముతో ఉపకీచకులనందరను వధించియుండును. ఇందుసందియములేదు.

పితామహేన యేచోక్తా దేశస్య చ జనస్య చ,
గుణాస్తే మత్స్యరాష్ట్రస్య బహుశోఽపి మయా శ్రుతాః.

తాత చెప్పిన దేశలక్షణములు, జనలక్షణములు మత్స్యని దేశమున ఉన్నవని నేను పలుమారులు వినియుంటిని.

విరాటనగరే మన్యే పాణ్డవా శ్ఛన్నచారిణః,
నివసన్తి పురే రమ్యే తత్ర యాత్రా విధీయతామ్.

కావున రమ్యమైన విరాటనగరమున పాండవులు గుట్టుగా తిరుగుచు నివసించుచున్నారని నా అనుమానము కావున మన మచటకు యాత్ర చేయవలయును.

మత్స్యరాష్ట్రం హనిష్యామో గ్రహీష్యామశ్చ గోధనమ్,
గృహీతే గోధనే నూనం తేఽపి యోత్స్యన్తి పాణ్డవాః.

మత్స్య రాష్ట్రముపై దెబ్బకొట్టుదము. వారి గోధనమును పట్టుకొందము. అట్లు గోధనమును పట్టుకొన్నచో పాండవులును తప్పక పోరవత్తురు.

అపూర్ణే సమయే చాపి యది పశ్యేమ పాణ్డవాన్,
ద్వాదశాన్యాని వర్షాణి ప్రవేక్ష్యన్తి పునర్వనమ్.

గడువు ముగియక ముందు మనము పాండవులను గుర్తించి నచో వారు తిరిగి పండ్రెండువేండ్లు అడవిలోని కరుగుదురు.

తస్మాద దన్యతరేణాపి లాభోఽస్మాకం భవిష్యతి,
కోశవృద్ధి రిహాస్మాకం శత్రూణాం నిధనం భవేత్.

అట్లు కాక మరియొక విధముగానైనను మనకు లాభమే కలుగును. మన ధనాగారము అభివృద్ధి చెందును. శత్రువులకు నాశము కలుగును.

కథం సుయోధనం గచ్ఛేద్ యుధిష్ఠిర భృతః పురా,
ఏతచ్చాపి వదత్యేవ మాత్స్యః పరిభవాన్మయి.

ఆ విరాటుడును నన్ను లెక్క చేయక, మున్ను ధర్మరాజు తాల్చిన వానిని సుయోధనుడెట్లు పొందును? అనుచుండునట.

తస్మాత్ కర్తవ్య మేతద్వై తత్ర యాత్రా విధీయతామ్,
ఏతత్ సునీతం మన్యేఽహం సర్వేషాం యది రోచతే.

కావున ఇదియే మన కర్తవ్యము. అందు దండయాత్ర చేయుదము. మీకందరకు ఇష్టమైనచో ఇది మంచినీతి యని నా భావన.]

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి
చారప్రత్యాచారే కృపవాక్యే ఏకోనత్రింశోఽధ్యాయః
ఇది మహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున చారుల తిరిగి రాక
యందు కృపుని వాక్యము అను ఇరువది తొమ్మిదవ అధ్యాయము.

## త్రింశోఽధ్యాయః - ముప్పదవ అధ్యాయము

"సుశర్మణః ప్రస్తావ మనుసృత్య త్రిగర్తానాం కురూణాం చ మత్స్యదేశం ప్రత్యాక్రమణమ్."

"సుశర్మ ప్రసంగము ననుసరించి త్రిగర్తులు, కౌరవులును మత్స్యదేశముపై దండెత్తుట"

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

అథ రాజా త్రిగర్తానాం సుశర్మా రథయూథపః,
ప్రాప్తకాల మిదం వాక్య మువాచ త్వరితో బలీ. 1

పిమ్మట గొప్పరథసేనగల త్రిగర్తదేశరాజు సుశర్మ కాలమునకు తగినట్లు శీఘ్రముగా ఇట్లు పలికెను.

అసకృన్నికృతాః పూర్వం మత్స్యశాల్వేయకైః ప్రభో,
సూతేనైవ చ మత్స్యస్య కీచకేన పునః పునః. 2

ఓ జనమేజయ మహారాజా! ఆ త్రిగర్తులు మత్స్యులచేత పలుమారులు దెబ్బతిని యుండిరి. బలవంతుడైన కీచకుడు ఆసుశర్మను బంధువులతో పాటు పలుమారులు బాధించియుండెను.

బాధితో బన్ధుభిః సార్ధం బలాద్ బలవతాం విభో,
స కర్ణమభ్యుదీక్ష్యాథ దుర్యోధన మభాషత. 3

అట్లు బంధువులతో పాటు పీడనొందిన సుశర్మ బలవంతులగు కౌరవులస్వామి భీష్ముని యెదుట కర్ణుని చూచి దుర్యోధనునితో ఇట్లు పలికెను.

అసకృన్మత్స్యరాజ్ఞా మే రాష్ట్రం బాధిత మోజసా,
ప్రణేతా కీచక స్తస్య బలవా నభవత్ పురా. 4

2. నికృతాః - వంచితులు - త్రిగర్తులు

రాజా! ఆ మత్స్యరాజు విరాటుడు నా దేశమును బలముతో పలుమారులు బాధించెను. వాని నాయకుడు గొప్పబలముగల కీచకుడు.

క్రూరోఽమర్షీ స దుష్టాత్మా భువి ప్రఖ్యాత విక్రమః,
నిహతః సతు గన్ధర్వైః పాపకర్మా నృశంసవాన్. 5

ఆ కీచకుడు క్రూరుడు, దుష్టాత్ముడు, భూమియందు ప్రఖ్యాతి కెక్కిన పరాక్రమము గలవాడు, క్రోధఘ్నుడు, పాపకర్ముడు. వాడు గంధర్వులచేత చచ్చెను.

తస్మిన్ వినిహతే రాజా హృతదర్పో నిరాశ్రయః.
భవిష్యతి నిరుత్సాహో విరాట ఇతి మే మతః. 6

వాడట్లు చావగా విరాటరాజు గర్వమణగి, దిక్కులేక, ఉత్సాహము లేనివాడగునని నా అభిప్రాయము.

తత్ర యాత్రా మమ మతా యది తే రోచతేఽనఘ,
కౌరవాణాం చ సర్వేషాం కర్ణస్య చ మహాత్మనః. 7

ఓ పుణ్యాత్ముడా! నీకిది యిష్టమైనచో నేను, ఈ కౌరవులందరు, మహాత్ముడగు కర్ణుడును వానిపై దాడికి పోవుట మంచిది.

ఏతత్ ప్రాప్త మహం మన్యే కార్య మాత్యయికం హి నః,
రాష్ట్రం తస్యాభియాస్యామో బహుధాన్య సమాకులమ్. 8

ఇది యిప్పటికి మనకు తప్పనిసరి కార్యమని తలచుచున్నాను. గొప్ప ధాన్యసంపదగల యాతని రాష్ట్రముపై దండెత్తుదము.

ఆదదామోఽస్య రత్నాని వివిధాని వసూని చ,
గ్రామాన్ రాష్ట్రాణి వా తస్య హరిష్యామో విభాగశః.

ఆతని రత్నములను, వివిధములగు ధనములను, గ్రామములను, రాష్ట్రములను విడివిడిగా కొల్లగొట్టుదము.

అథవా గోసహస్రాణి శుభాని చ బహూని చ,
వివిధాని హరిష్యామః ప్రతిపీడ్య పురం బలాత్. 10

లేదా వాని పురమును బలముతో ముట్టడించి ఆతనికి గల వివిధములైన మంచి వేలకొలది గోవులను అపహరింతము.

కౌరవైః సహ సంగత్య త్రిగర్తైశ్చ విశాంపతే,
గాస్తస్యాపహరామోఽద్య సర్వైశ్చైవ సుసంహతాః. 11

రాజా! మీ కౌరవులు, మా త్రిగర్తులు అందరము ఒక్కుమ్మడిగా వాని గోవులను నేడు పట్టుకొందము.

సంవిభాగేన కృత్వా తు నిబధ్నీమోఽస్య పౌరుషమ్,
హత్వా చాస్య చమూం కృత్స్నాం వశే మే వానయామహే. 12

విడివిడిగా ఏర్పాటు చేసికొని వాని పౌరుషమును నిలువరింతము. వాని సేననంతటిని చావగొట్టి వశపరచుకొందము.

తం వశే న్యాయతః కృత్వా సుఖం వత్స్యామహే వయమ్,
భవతాం బలవృద్ధిశ్చ భవిష్యతి న సంశయః. 13

వాని నట్లు నీతి ననుసరించి వశపరచుకొని మనము సుఖముగా ఉందము. మీకు బలవృద్ధియు నగును. సందియము లేదు.

తచ్ఛ్రుత్వా వచనం తస్య కర్ణో రాజాన మబ్రవీత్,
సూక్తం సుశర్మణా వాక్యం ప్రాప్తకాలం హితం చ నః. 14

ఆ సుశర్మ మాట విని కర్ణుడు రాజుతో నిట్లు పలికెను. 'సుశర్మ లెస్స మాట పలికెను. అది కాలమునకు తగినది. మనకు హితమైనది'.

తస్మాత్ క్షిప్రం వినిర్యామో యోజయిత్వా వరూథినీమ్,
విభజ్య చాప్యనీకాని యథా వా మన్యసేఽనఘ. 15

'అందువలన శీఘ్రముగా సేనను కూర్చుకొని తగువిధముగా పంచుకొని నీవు తలచినరీతిగా దాడి వెడలుదము'.

ప్రాజ్ఞో వా కురువృద్ధోఽయం సర్వేషాం నః పితామహః,
ఆచార్యశ్చ యథా ద్రోణః కృపః శారద్వత స్తథా,
మన్యన్తే తే యథా సర్వే తథా యాత్రా విధీయతామ్. 16

బుద్ధిశాలి, కురువృద్ధుడు, మన కందరకు తాత అగు ఈ భీష్ముడు, ఆచార్యుడు ద్రోణుడు, కృపాచార్యుడు, - ఈ అందరు తలచినరీతిగా దాడి పోవుదము.

సంమన్త్ర్య చాశు గచ్ఛామః సాధనార్థం మహీ పతేః,
కించ నః పాణ్డవైః కార్యం హీనార్థబల పౌరుషైః. 17

ఆ విరాటరాజును సాధించుటకై మనము చక్కగా ఆలోచించుకొని శీఘ్రముగా బయలుదేరుదము. ధనము, బలము, పౌరుషము కోల్పోయిన పాండవులతో మనకు పనియేమి?

అత్యన్తం వా ప్రణష్టాస్తే ప్రాప్తా వాపి యమక్షయమ్,
యామో రాజన్ నిరుద్విగ్నా విరాటనగరం వయమ్,
ఆదాస్యామో హి గా స్తస్య వివిధాని వసూని చ. 18

వారు పూర్తిగా నశించియుందురు, యమలోకమున కరిగి యుందురు. కాన మనము ఆందోళనను వీడి విరాట నగరముపై దండెత్తుదము. వాని గోవులను, అనేక విధములగు ధనములను కొల్లగొట్టుదము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతో దుర్యోధనో రాజా వాక్యమాదాయ తస్య తత్,
వైకర్తనస్య కర్ణస్య క్షిప్ర మాజ్ఞాపయత్ స్వయమ్,
శాసనే నిత్య సంయుక్తం దుఃశాసన మనన్తరమ్. 19

అంత దుర్యోధన మహారాజు సూర్యపుత్రుడగు కర్ణుని మాటను బట్టి స్వయముగా, ఎల్లప్పుడు తనమాటపై నిలుచు తమ్ముడు దుశ్శాసనుని ఇట్లాజ్ఞాపించెను.

సహ వృద్ధైస్తు సంమన్త్ర్య క్షిప్రం యోజయ వాహినీమ్,
యథోద్దేశం చ గచ్ఛామః సహితా స్తత్ర కౌరవైః. 20

పెద్దలకు చెప్పి వెంటనే సేనను సిద్ధపరపుము. కౌరవులందరితో కలిసి అనుకొన్న విధముగా పోవుదము.

సుశర్మా చ యథోద్దిష్టం దేశం యాతు మహారథః,
త్రిగర్తై స్సహితో రాజా సమగ్రబలవాహనః,
ప్రాగేవ హి సుసంవీతో మత్స్యస్య విషయం ప్రతి. 21

మహారథుడగు ఈ సుశర్మ త్రిగర్తులతో కలిసి నిండైన బలము, వాహనములు గలవాడై అనుకొన్న రీతిగా మున్నే మత్స్య దేశమును ముట్టడించును.

జఘన్యతో వయం తత్ర యాస్యామో దివసాన్తరే,
విషయం మత్స్యరాజస్య సుసమృద్ధం సుసంహతాః. 22

వెనుకగా మనము మరునాడు అందరముకూడి మంచి సమృద్ధి గల విరాటదేశమును ముట్టడింతము.

తే యాన్తు సహితా స్తత్ర విరాటనగరం ప్రతి,
క్షిప్రం గోపాన్ సమాసాద్య గృహ్ణన్తు విపులంధనమ్. 23

ఆ త్రిగర్తులందరు కూడి విరాటనగరమున కరుగవలయును. హఠాత్తుగా గోపాలకులను సమీపించి, వారి విపులమైన ధనమును పట్టుకొనవలయును.

19. వైకర్తనస్య - వికర్తనుడు - సూర్యుడు - అతని కొడుకు.
21. యథోద్దేశమ్ - అనుకొన్న తీరున ఉత్తరదిక్కుగా గానీ దక్షిణదిక్కుగా గానీ.

గవాం శత సహస్రాణి శ్రీమన్తి గుణవన్తిచ,
వయ మప్యనుగృహ్ణీమో ద్విధా కృత్వా వరూథినీమ్. 24

ఇట్లు సేనను రెండు భాగములుగా చేసికొని మనమును వెను వెంటనే శోభయు గుణములుగల వేలకొలదిగానున్న గోవుల మందలను పట్టుకొందము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

తే స్మ గత్వా యథోద్దిష్టం దిశం వహ్నేర్మహీపతే,
సంనద్ధా రథినః సర్వే సపదాతా బలోత్కటాః,
ప్రతివైరం చికీర్షన్తో గోషు గృద్ధా) మహాబలాః. 25

ఓ రాజా! ఆ సుశర్మాదులు అనుకొన్న తీరుగా అన్ని ఏర్పాటులు చేసికొని రథసులతో కాల్బలముతో కూడి బలము పిక్కటిల్లగా గోవులయందలి ఆశతో వైరము తీర్చుకొన గోరి ఆగ్నేయదిక్కుగా బయలువెడలిరి.

ఆదాతుం గాః సుశర్మాథ కృష్ణపక్షస్య సప్తమీమ్. 26

సుశర్మ కృష్ణపక్ష సప్తమినాడు గోవులను బట్టఁ బోయెను.

అపరే దివసే సర్వే రాజన్ సంభూయ కౌరవాః,
అష్టమ్యాం తేన్యగృహ్ణన్త గోకులాని సహస్రశః. 27

రాజా! మరునాడు అష్టమితిథి యందు కౌరవులందరు కూడి వేలకొలదిగా ఉన్న ఆలమందలను పట్టుకొనిరి.

**ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి దక్షిణగోగ్రహణే సుశర్మాభియానే త్రింశోఽధ్యాయః**

**ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున దక్షిణగోగ్రహణమున సుశర్మ దండయాత్ర యను ముప్పదవ అధ్యాయము**

## ఏకత్రింశోఽధ్యాయః - ముప్పదియొకటవ అధ్యాయము

చతుర్భిః పాణ్డవైః సహితస్య రాజ్ఞో విరాటస్య సేనయా సహ యుద్ధాయ ప్రస్థానమ్.

నలుగురు పాండవులతో కూడి విరాటరాజు సేనతో యుద్ధమునకు బయలుదేరుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

తత స్తేషాం మహారాజ తత్రైవామిత తేజసామ్,
ఛద్మలిఙ్గ ప్రవిష్టానాం పాణ్డవానాం మహాత్మనామ్. 1

వ్యతీతః సమయః సమ్యగ్ వసతాం వై పురోత్తమే,
కుర్వతాం తస్య కర్మాణి విరాటస్య మహీపతేః. 2

ఓ మహారాజా! గొప్పతేజస్సు గలవారు, మహాత్ములు, మారువేసములతో నున్నవారు నగు పాండవులు ఆ విరాటుని పురమున భద్రముగా ఆయా వృత్తులను చేయుచుండగా, వారిగడువు చక్కగా పూర్తి అయినది.

కీచకే తు హతే రాజా విరాటః పరవీరహా,
పరాం సంభావనాం చక్రే కున్తీపుత్రే యుధిష్ఠిరే. 3

పరవీరులను పరిమార్చు విరాటుడు, కీచకుడు చావగా కుంతీపుత్రుడగు ధర్మరాజునందు గొప్ప ఆశ పెట్టుకొనియుండెను.

తత స్త్రయోదశస్యాన్తే తస్య వర్షస్య భారత,
సుశర్మణా గృహీతం తద్ గోధనం తరసా బహు. 4

అంత ఆ పదుమూడవ యేటి చివర సుశర్మ ఒక్క పెట్టున గోధనమును పట్టుకొనెను.

---

3. పరాం సంభావనాం చక్రే - కీచకునివలె నితడును నాకు జయము కూర్చువాడగునని ఆశ పెట్టుకొనెనని భావము.

[తతః శబ్దో మహానాసీద్ రేణుశ్చ దివ మస్పృశత్,
శఙ్ఖదున్దుభిఘోషశ్చ భేరీణాం చ మహాస్వనః,
గవాశ్వరథ నాగానాం నరాణాం చ పదాతినామ్.

అంత పెద్ద శబ్దము పుట్టెను. ధూళి మింటికెగసెను. శంఖములయు దుందుభులయు ఘోషయు, భేరుల పెనుసవ్వడియు, గోవులు, గుఱ్ఱములు, ఏనుగులు, మానవులు, కాల్బంటులు - అను వాని సవ్వడియు మిన్ను ముట్టెను.

ఏవం తైస్త్వభి నిర్యాయ మత్స్యరాజస్య గోధనే,
త్రిగర్తైర్గృహ్యమాణే తు గోపాలాః ప్రత్యషేధయన్.

ఇట్లా త్రిగర్తులు దండువెడలి విరాటుని గోధనమును పట్టుకొనగా గోపాలకులు వారి నడ్డగించిరి.

అథ త్రిగర్తా బహవః పరిగృహ్య ధనం బహు,
పరిక్షిప్య హయైః శీఘ్రై రథవ్రాతైశ్చ భారత,
గోపాలాన్ ప్రత్యయుధ్యన్త రణే కృత్వా జయే ధృతిమ్.

అంత చాలామంది త్రిగర్తులు గోధనమును పట్టుకొని వేగము గల గుఱ్ఱములతో రథముల సముదాయములతో చుట్టుముట్టి జయమును గట్టిగా నమ్ముకొనుచు గోపాలురతో యుద్ధము గావించిరి.

తే హన్యమానా బహుభిః ప్రాసతోమర పాణిభిః,
గోపాలా గోకులే భక్తా వారయామాసు రోజసా.

ఆ గోపాలురు, చాలమంది త్రిగర్తులు బల్లెములతో, తోమరములతో చావమోదుచున్నను గోవులయందు భక్తి కలవారై శక్తినంతటి నుపయోగించి వారిని వారించిరి.

పరశ్వథైశ్చ ముసలై ర్భిన్దిపాలైశ్చ ముద్గరైః,
గోపాలాః కర్షణై శ్చిత్రై ర్జఘ్ను రశ్వాన్ సమన్తతః.

గొడ్డళ్లు, రోకళ్లు, విడిచివాటు గుదియలు, ఇనుప గుదియలు అనువానితో గోపాలురు, చిత్రముగా గుంజుచు గుజ్జములను అన్నివైపులనుండియు చావమోదిరి.

తే హన్యమానాః సంక్రుద్ధా స్త్రిగర్తా రథయోధినః,
విసృజ్య శరవర్షాణి గోపాన్ వ్యద్రావయన్ రణే.

ఇట్లు రథవీరులగు త్రిగర్తులు దెబ్బతిని, మిక్కిలి కోపముతో అంపవానలను కురిపించి గోపాలకులను రణమునందు పారద్రోలిరి.]

తతో జవేన మహతా గోపః పుర మథా వ్రజత్,
స దృష్ట్వా మత్స్య రాజంచ రథాత్ ప్రస్కన్ద్య కుణ్డలీ. 5

అంత నొక గోపుడు గొప్ప వేగముతో పురమును చేరెను. కుండలముగల ఆ గోపుడు రథమునుండి క్రిందికి ఉరికి మత్స్యరాజును గాంచెను.

శూరైః పరివృతం యోధైః కుణ్డలాఙ్గదధారిభిః, 6
సంవృతం మన్త్రిభిః సార్ధం పాణ్డవైశ్చ మహాత్మభిః.
తం సభాయాం మహారాజ మాసీనం రాష్ట్రవర్ధనమ్, 7
సోఽబ్రవీదుపసంగమ్య విరాటం ప్రణత స్తదా.

ఆ గోపుడు, శూరులతో, కుండలములను, భుజకీర్తులను ధరించిన యోధులతో, మంత్రులతో, మహాత్ములగు పాండవులతో కొలువుతీరియున్న రాష్ట్ర వర్ధనుడగు విరాటరాజును సమీపించి మ్రొక్కి యిట్లు పలికెను.

అస్మాన్ యుధి వినిర్జిత్య పరిభూయ సబాన్ధవాన్, 8
గవాం శత సహస్రాణి త్రిగర్తాః కాలయన్తి తే,
తాన్ పరీప్సస్వ రాజేన్ద్ర మా నేశుః పశవ స్తవ.

మమ్ము యుద్ధమున ఓడించి మా బంధువులతోపాటు మమ్మవమానించి త్రిగర్తులు నీ నూర్వేల గోవులను తోలుకొనిపోవు

చున్నారు. మహారాజా! వానిని కాపాడుము, నీ గోవులు నశింప కుండుగాక!

తచ్ఛ్రుత్వా నృపతిః సేనాం మత్స్యానాం సమయోజయత్ 9
రథానా మశ్వకలితాం పత్తిధ్వజ సమాకులామ్.

అది విని విరాటరాజు రథములతో గుఱ్ఱములతో కూడినదియు, కాల్బలముతో, పతాకములతో నుడివడుచున్నదియు నగు సేనను సమాయుత్తము చేయించెను.

రాజానో రాజపుత్రాశ్చ తనుత్రాణ్యథ భేజిరే, 10
భానుమన్తి విచిత్రాణి శూరసేవ్యాణి భాగశః.

రాజులును, రాజపుత్రులును కాంతులీను, విచిత్రములైన, శూరులు ధరించు కవచములను ఎన్నుకొని ధరించిరి.

స వజ్రాయస గర్భం తు కవచం తత్ర కాంచనమ్. 11
విరాటస్య ప్రియో భ్రాతా శతానీకోఽభ్యహారయత్.

విరాటుని అనుగుతమ్ముడు శతానీకుడు వజ్రములు పొదిగిన బంగారపు తొడుగుగల ఉక్కు కవచమును ధరించెను.

సర్వపారసవం వర్మ కల్యాణపటలం దృఢమ్. 12
శతానీకాదవరజో మదిరాక్షోఽభ్యహారయత్.

అన్ని విధములగు శస్త్రములను తట్టుకొనగలదియు, బంగారపు తొడుగు గలదియునగు గట్టి కవచమును, శతానీకుని తమ్ముడు మదిరాక్షుడు ధరించెను.

---

9. మానేశః - దూరముగా పోకుండుగాక అని భావము.

10. తనుత్రాణి - కవచములను.

12. సర్వపారసవమ్ - పరాన్ సునోతి ఇతి పరసవమ్ - ఇతరులను పీడించునది. అదియే పారసవము - అనగా శస్త్రము - సర్వపారసవమనగా అన్ని శస్త్రములను తట్టుకొనగలదని భావము.

శతసూర్యం శతావర్తం శతబిన్దు శతాక్షిమత్ 13
అభేద్యకల్పం మత్స్యానాం రాజా కవచ మాహరత్.

నూరు సూర్యరూపములు, నూరు చంద్రరూపములు, నూరు బిన్నచక్రరూపములు, నూరు కంటిరూపములు గలదియు, భేదించుటకు శక్యము కానిదియు నగు కవచమును విరాటరాజు ధరించెను.

ఉత్సేధే యస్య పద్మాని శతం సౌగన్ధికాని చ, 14
సువర్ణపృష్ఠం సూర్యాభం సూర్యదత్తోఽభ్యహారయత్.

నిలువెల్ల నూరు సౌగంధిక పద్మములు గలదియు, సూర్యునివలె వెలుగొందుచున్నదియు, బంగారు తొడుగుగలదియునగు కవచమును సూర్యదత్తుడు ధరించెను.

దృఢ మాయస గర్భం చ శ్వేతం వర్మ శతాక్షిమత్, 15
విరాటస్య సుతో జ్యేష్ఠో వీరః శఙ్ఖోఽభ్యహారయత్.

లోపల గట్టి యినుము కలిగినదియు, నూరుకన్నులు కలదియు, గట్టిదియునగు తెల్లని కవచమును విరాటుని పెద్దకొడుకు వీరుడు శంఖుడు ధరించెను.

శతశశ్చ తనుత్రాణి యథాస్వం తే మహారథాః; 16
యోత్స్యమానా అనహ్యన్త దేవరూపాః ప్రహారిణః.

దేవతలవంటి రూపము కలవారు, పోటుగాండ్రు మహారథులునగు ఆ వీరులు వారివారి వైభవముకొలది కవచములను ధరించిరి.

సూపస్కరేషు శుభ్రేషు మహత్సు చ మహారథాః. 17
పృథక్ కాంచన సంనాహాన్ రథేష్వశ్వా నయోజయన్.

---

13. శతావర్తమ్ - మాటిమాటికి పెరుగుట తరుగుట అను మార్పులు గలుగుట వలన ఆవర్తశబ్దము ఇచట చంద్రునిగాని పద్మమునుగాని బోధించును. అట్టి నూరు గుర్తులు గలది.

చక్కని అలంకారములుగల శుభ్రములైన పెద్ద రథములకు మహారథులు స్వర్ణమయ పరికరములుగల గుఱ్ఱములను పూన్చిరి.

సూర్యచన్ద్రప్రతీకాశే రథే దివ్యే హిరణ్మయే. 18
మహానుభావో మత్స్యస్య ధ్వజ ఉచ్ఛ్రిశ్రియే తదా,

సూర్యచంద్రులవలె వెలుగొందుచున్నదియు, దివ్యమైనదియు నగు విరాటుని బంగారు రథమున గొప్ప మహిమగల పతాకము ఎత్తబడెను.

అథాన్యాన్ వివిధాకారాన్ ధ్వజాన్ హేమపరిష్కృతాన్. 19
యథాస్వం క్షత్రియాః శూరా రథేషు సమయోజయన్,

పిమ్మట వివిధములైన ఆకారములు బంగారు ఆభరణములు గల ధ్వజములను శూరులైన క్షత్రియులు వైభవము కొలదిగా కూర్చుకొనిరి.

[రథేషు యుజ్యమానేషు కఙ్కో రాజాన మబ్రవీత్
మయాప్యస్త్రం చతుర్మార్గ మవాప్త మృషిసత్తమాత్.

ఇట్లు రథములు సిద్ధమగుచుండగా కంకభట్టు రాజుతో నిట్లనెను. 'నాకొక ఋషిశ్రేష్ఠుడు నాలుగు విధములైన అస్త్రములను అనుగ్రహించెను'.

దంశితో రథమాస్థాయ పదం నిర్యామ్యహం గవామ్.

కవచము తొడిగి రథమెక్కి నేనును గోవులున్న చోటికి బయలుదేరుదును.

అయం చ బలవా ఇఝ్ఖారో వల్లవో దృశ్యతేఽనఘ,
గోసంఖ్య మశ్వబన్ధం చ రథేషు సమయోజయ,
నైతే న జాతు యుధ్యేయు ర్గవార్థమితి మే మతిః.

---

దంశితః - కవచము తొడిగినవాడు.

ఈ బలవంతుడు వల్లవుడు శూరుడుగా కానవచ్చుచున్నాడు. అట్లే గోపాలక అశ్వపాలకులును. వీరిని రథములందు నిలుపుము. వీరు గోవులకొరకు పోరాడ జాలనివారు కారని నా అభిప్రాయము]

అథ మత్స్యోఽబ్రవీ ద్రాజా శతానీకం జఘన్యజమ్,
కఙ్క వల్లవ గోపాలా దామగ్రన్థిశ్చ వీర్యవాన్, 20
యుధ్యేయు రితి మే బుద్ధి ర్వర్తతే నాత్ర సంశయః 21

అంత విరాటుడు తమ్ముడు శతానీకునితో ఇట్లు అనెను: 'శంకభట్టు' వల్లవుడు, గోపాలకుడగు తంతిపాలుడును, వీర్యవంతుడగు దామగ్రంథియు యుద్ధము చేయగలవారని నా తలపు. ఇందు సందియములేదు.

ఏతేషా మపి దీయన్తాం రథా ధ్వజపతాకినః,
కవచాని చ చిత్రాణి దృఢాని చ మృదూని చ. 22

వీరికి కూడ ధ్వజములు పతాకములుగల రథములను, చిత్రములు దృఢములు, మెత్తనివియునైన కవచములను ఇమ్ము.

ప్రతిముఞ్చన్తు గాత్రేషు దీయన్తా మాయుధాని చ,
వీరాఙ్గరూపాః పురుషా నాగరాజ కరోపమాః. 23
నేమే జాతు న యుధ్యేర న్నితి మే ధీయతే మతిః.

వారా కవచములను ధరింతురుగాక. వారికి ఆయుధముల నొసగుము. వీరులకువలె వీరి అవయవములు రూపములు కానవచ్చుచున్నవి. వీరి భుజములు ఏనుగు తొండములవలె నున్నవి. ఇట్టి వీరు యుద్ధము చేయజాలరని నేననుకొనను.

ఏతచ్ఛ్రుత్వాతు నృపతే ర్వాక్యం త్వరిత మానసః,
శతానీకస్తు పార్థేభ్యో రథాన్ రాజన్ సమాదిశత్, 24
సహదేవాయ రాజ్ఞేచ భీమాయ నకులాయ చ.

శతానీకు డా రాజు పలికిన మాట విని త్వరపడు మనస్సుతో కుంతీపుత్రులగు ధర్మజ, భీమ, నకుల, సహదేవులకు రథములను సమకూర్చెను.

తాన్ ప్రహృష్టాం స్తతః సూతా రాజభ క్తిపురస్కృతాః,
నిర్దిష్టా నరదేవేన రథాన్ శీఘ్ర మయోజయన్. 25

అంత రాజభ క్తిపరులైన సారథులు సంతోషముతో నున్న కుంతీపుత్రులకు, రాజాజ్ఞ ననుసరించి, రథములను కూర్చిరి.

కవచాని విచిత్రాణి మృదూని చ దృఢాని చ,
విరాటః ప్రాదిశద్ యాని తేషా మక్లిష్ట కర్మణామ్. 26

తా న్యాముచ్య శరీరేషు దంశితా స్తే పరంతపాః,
రథాన్ హయైః సుసంపన్నా నాస్థాయ చ నరోత్తమాః
నిర్యయు ర్ముదితాః పార్థాః శత్రు సంఘావ మర్దినః. 27

విచిత్రములు, మెత్తనివి, గట్టివియునగు కవచములను విరాటుడు ఆ పాండవుల కొసగగా వారవి దేహములపై ధరించిరి. పరులను తపింపజేయువారు, ఆయుధములను పట్టినవారు, సులువుగా కార్యములను జేయగలవారు, శత్రువుల మూకలను నుగ్గునుగ్గుచేయు వారునగు వారు యుద్ధమునకు సంతోషముతో బయలుదేరిరి.

తరస్వినశ్ఛన్నరూపాః సర్వే యుద్ధవిశారదాః,
రథాన్ హేమపరిచ్ఛన్నా నాస్థాయ చ మహారథాః. 28

విరాట మన్వయుః పార్థాః సహితాః కురుపుఙ్గవాః,
చత్వారో భ్రాతరః శూరాః పాణ్డవాః సత్యవిక్రమాః. 29

వేగవంతులు, గూఢరూపులు, యుద్ధమున నారి తేరినవారు, మహారథులు, కురువరేణ్యులు, శూరులు, సత్యవిక్రములునగు పాండవ సోదరులు నలుగురు బంగారుతొడుగులు గల రథముల నధిరోహించి విరాటుని వెంట నరిగిరి.

[దీర్ఘాణాం చ దృఢానాం చ ధనుషాం తే యథాఽబలమ్,
ఉత్కృష్య పాశాన్ మౌర్వీణాం వీరా శ్చాపేష్వ యోజయన్.

వారు వారివారి బలములకు తగిన విధముగా పొడవైనవి, గట్టివియునగు ధనువులకు అల్లెత్రాడులను బిగించిరి.

తతః సువాససః సర్వే తే వీరా శ్చన్దనోక్షితాః,
చోదితా నరదేవేన క్షిప్రమశ్వా నచోదయన్.

చక్కని వస్త్రములను గట్టి, మంచిగంధము పూసికొని ఆ వీరులు రాజప్రేరణతో శీఘ్రముగా గుఱ్ఱముల నదలించిరి.

తే హయా హేమసంఛన్నా బృహన్తః సాధువాహినః,
చోదితాః ప్రత్యదృశ్యన్త పక్షిణా మివ పఙ్క్తయః.

బంగారు తొడవులు గలవియు, పెద్ద ఆకారముగలవియు, చక్కని శిక్షణ గలవియునగు ఆ గుఱ్ఱములు తోలిన వెంటనే పక్షులబారులవలె కానవచ్చినవి.]

భీమాశ్చ మత్తమాతఙ్గాః ప్రభిన్నకరటాముఖాః,
క్షరన్తశ్చైవ నాగేన్ద్రాః సుదన్తాః షష్టిహాయనాః, 80
స్వారూఢా యుద్ధకుశలైః శిక్షితా హస్తిసాదిభిః,
రాజాన మన్వయుః పశ్చా చ్చలన్త ఇవ పర్వతాః. 81

భయము పుట్టించునవి, మదించినవి, మదముతో చీలికలు వడిన చెక్కిళ్లుకలవి, మంచిదంతములు కలవి, అరువది వత్సరముల ఈడుగలవి, యుద్ధనిపుణులు ఎక్కినవి, మావటులచే చక్కగా తీర్చి దిద్దబడినవియునగు ఏనుగులు కదలుచున్న కొండలవలె సాగుచు రాజువెంట బయలుదేరినవి.

విశారదానాం ముఖ్యానాం హృష్టానాం చారుజీవినామ్,
అష్టౌ రథసహస్రాణి దశ నాగశతాని చ. 82

షష్టి శ్చాశ్వసహస్రాణి మత్స్యానా మభినిర్యయుః, 33
తదనీకం విరాటస్య శుశుభే భరతర్షభ. 34

యుద్ధములలో చక్కని అనుభవము కలవారు, సంతోష ముతో నున్నవారు, చక్కని జీవనము గలవారునగు మత్స్యులు ఎనిమిదివేల రథములతో, పదినూర్ల ఏనుగులతో, అరువదివేల గుఱ్ఱములతో యుద్ధమునకు బయలుదేరిరి. ఓ భరతశ్రేష్ఠా! ఆ విరాటుని సేవ చక్కగా ఒప్పియుండెను.

సంప్రయాతం తదా రాజన్ నిరీక్షన్తం గవాం పదమ్,
తద్ బలాగ్ర్యం విరాటస్య సమ్ప్రస్థిత మశోభత,
దృఢాయుధ జనాకీర్ణం గజాశ్వరథ సంకులమ్. 34

అట్లు బయలుదేరి గోవులున్నచోటిని అరయుచున్న ఆ విరాటుని సేన గట్టి ఆయుధములుగల జనములతో క్రిక్కిరిసి, ఏనుగలతో గుఱ్ఱములతో నిండి యొప్పారెను.

ఇది శ్రీ మహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి దక్షిణగోగ్రహణే మత్స్యరాజరణోద్యోగే ఏకత్రింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారత విరాటపర్వమున గోహరణపర్వమున దక్షిణగోగ్రహణమున మత్స్యరాజుయుద్ధప్రయత్నము అను ముప్పదియొకటవ అధ్యాయము.

## ద్వాత్రింశోఽధ్యాయః - ముప్పదిరెండవ అధ్యాయము

మత్స్యత్రిగర్త దేశీయసైన్యానాం మిథోయుద్ధమ్.

మత్స్య త్రిగర్త దేశ సైనికుల పరస్పర యుద్ధము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

నిర్యాయ నగరా చ్ఛూరా వ్యూఢానీకాః ప్రహారిణః,
త్రిగర్తా నస్పృశన్ మత్స్యాః సూర్యే పరిణతే సతి. 1

1, సూర్యే పరిణతే సతి - పగటి భాగము నైదుగా విభజింపగా నందు నాల్గవ భాగము రాగా;

ప్రొద్దొకింత ఎక్కినప్పటికి చక్కగా పన్నిన సేనలుగల పోటుగాండ్రగు మత్స్యులు నగరము వెలువడి త్రిగర్తులను తాకిరి.

తే త్రిగర్తాశ్చ మత్స్యాశ్చ సంరబ్ధా యుద్ధదుర్మదాః,
అన్యోన్య మభిగర్జన్తో గోషు గృద్ధా మహాబలాః. 2

మహాబలులగు ఆ త్రిగర్తులును మత్స్యులును యుద్ధోన్మాదముతో తలపడి గొప్ప సంరంభముతో ఒకరిపై నొకరు కేకలిడుచు గోవులమీది ఆశతో పోరాడిరి.

భీమాశ్చ మత్తమాతఙ్గా స్తోమరాఙ్కుశనోదితాః,
గ్రామణీయై[1] సమారూఢాః కుశలై ర్హస్తిసాదిభిః. 3

ఆ సేనలందలి మదించిన ఏనుగులు భయంకరముగా నున్నవి. నేర్పరులగు మావటివాండ్రు వానిని, తోమరములతో అంకుశములతో తోలుచుండిరి, రాజులు వానిపై ఎక్కియుండిరి.

తేషాం సమాగమో ఘోర స్తుములో లోమహర్షణః,
ఘ్నతాం పరస్పరం రాజన్ యమరాష్ట్ర వివర్ధనః. 4

ఒకరినొకరు కొట్టుకొనుచున్నవారి ఆ దొమ్మి యుద్ధము గగుర్పాటు పుట్టించుచుండెను. ఘోరముగా సాగెను యముని లోకమును పెంపొందించుచుండెను.

దేవాసుర సమో రాజ న్నాసీత్ సూర్యేఽవలమ్బతి,
పదాతి రథనాగేన్ద్ర హయారోహ బలౌఘవాన్. 5

రాజా! ప్రొద్దు కొంచెము వ్రాలునప్పటికి కాల్బలము, రథములు, ఏనుగులు, గుఱ్ఱపురౌతులు వెల్లుగా గల ఆ యుద్ధము దేవదానవుల పోరువంటి దాయెను.

అన్యోన్య మభ్యాపతతాం నిఘ్నతాం చేతరేతరమ్,
ఉదతిష్ఠత్ రజో భౌమం న ప్రాజ్ఞాయత కిఞ్చన. 6

1. గ్రామణీయైః - రాజకీయులచేత;

ఒకరిపై నొకరు విరుచుకొనిపడుచు పరస్పరము కొట్టుకొను చుండగా నేల దుమ్ము మిన్నంటెను. ఏమియు కానరాకుండెను.

పక్షిణశ్చాపతన్ భూమౌ సైన్యేన రజసా వృతాః,
ఇషుభి ర్వ్యతిసర్పద్భి రాదిత్యోఽన్తరధీయత. 7

సేనవలన లేచిన దుమ్ముతో పాటు పక్షులు కూడ నేల కూలినవి. అన్నివైపుల క్రమ్మిన బాణములతో సూర్యుడు మరుగున బడెను.

ఖద్యోతై రివ సంయుక్త మన్తరిక్షం వ్యరాజత,
రుక్మపృష్ఠాని చాపాని వ్యతిషిక్తాని ధన్వినామ్,
పతతాం లోకవీరాణాం సవ్యదక్షిణ మస్యతామ్. 8

ఆకసము మిణుగురులతో నిండినట్లు విరాజిల్లెను. కుడియెడమ చేతులలో బాణములు గుప్పించుచు దుముకుచున్న లోకైకవీరులగు విలుకాండ్ర సువర్ణధనువులు చేతులు మారుచున్నవి.

రథా రథై స్సమాజగ్ముః పాదాతైశ్చ పదాతయః,
సాదినః సాదిభి శ్చైవ గజైశ్చాపి మహాగజాః. 9

రథములు రథములతో కాల్బలము కాల్బలముతో గుఱ్ఱపు రాతులు గుఱ్ఱపురాతులతో ఏనుగులు ఏనుగులతో తలపడెను.

అసిభిః పట్టిసైః ప్రాసైః శక్తిభి స్తోమరై రపి,
సంరబ్ధాః సమరే రాజన్ నిజఘ్ను రితరేతరమ్. 10

కత్తులు, కటార్లు, ఈటెలు, శక్తులు, తోమరములు అను వానితో విజృంభించి యుద్ధమున పరస్పరము కొట్టుకొనిరి.

నిఘ్నన్తః సమరేఽన్యోన్యం శూరాః పరిఘబాహవః,
నశేకు రభిసంరబ్ధాః శూరాన్ కర్తుం పరాఙ్ముఖాన్. 11

---

7. సైన్యేన రజసా - సేనవలన లేచిన దుమ్ముతో;
8. వ్యతిషిక్తాని - ఒకచేతినుండి మఱియొక చేతికి చేరినవి;

పరిఘలుపట్టిన శూరులు మిక్కిలి ఆవేశముతో పోరాడుచు ఇతరులను వెన్ను చూపునట్లు చేయజాలరైరి.

కృత్తోత్తరోష్ఠం సునసం కృత్తకేశ మలంకృతమ్,
అదృశ్యత శిరశ్ఛిన్నం రజోధ్వస్తం సకుణ్డలమ్. 12

తెగిపడిన పై పెదవి, చక్కని ముక్కు, కత్తిరింపబడిన కేశములు, అలంకారములు, కుండలములు గల తెగిపడినతల దుమ్ము కొట్టుకొని కానవచ్చెను.

అదృశ్యం స్తత్ర గాత్రాణి శరైశ్ఛిన్నాని భాగశః,
శాలస్కన్ధనికాశాని క్షత్రియాణాం మహామృధే. 13

ఆ మహాయుద్ధమున క్షత్రియుల అవయవములు బాణములతో తునకలై పెనువృక్షము కొమ్మలవలె కానవచ్చినవి.

నాగభోగనికాశైశ్చ బాహుభిశ్చన్దనోక్షితైః, 14
ఆస్తీర్ణా వసుధా భాతి శిరోభిశ్చ సకుణ్డలైః.

మంచి గందపు పూతకలిగి సర్పముల దేహములతో సాటి వచ్చు బాహువులతోడను, కుండలములుగల తలలతోడను పరచి యున్న ఆ భూమి విరాజిల్లెను.

రథినాం రథిభిశ్చాత్ర సమ్ప్రహారోఽభ్యవర్తత, 15
సాదిభిః సాదినాం చాపి పదాతీనాం పదాతిభిః.

రథవీరులతో రథవీరులకు, గుఱ్ఱపు రౌతులతో గుఱ్ఱపు రౌతులకు, కాల్బలముతో కాల్బలమునకు యుద్ధము జరిగెను.

ఉపాశామ్యద్ రజో భౌమం రుధిరేణ ప్రసర్పతా. 16
కశ్మలం చావిశద్ ఘోరం నిర్మర్యాద మవర్తత.

14. నాగభోగ నికాశైః - పెనుబాముల దేహములతో సాటివచ్చు.
16. కశ్మలం చ ఆవిశద్ - (శూరులకు) మూర్ఛయు వచ్చెను.

వెల్లువ కట్టిన రక్తముతో నేలధూళి అణగెను. హద్దులేని ఘోరమైన మూర్ఛయు శూరుల నావేశించెను.

[యధిష్ఠిరోఽపి ధర్మాత్మా భ్రాతృభిః సహిత స్తదా,
వ్యూహం కృత్వా విరాటస్య అన్వయుధ్యత పాణ్డవః.

ధర్మాత్ముఁడగు యుధిష్ఠిరుడును తమ్ములతో గూడి వ్యూహము కావించి విరాటుని వెంట యుద్ధమాడెను.

ఆత్మానం శ్యేనవత్ కృత్వా తుణ్డ మాసీద్ యుధిష్ఠిరః,
పక్షే యమౌ చ భవతః పుచ్ఛ మాసీద్ వృకోదరః,
సహస్రం న్యహనత్ తత్ర కున్తీపుత్రో యుధిష్ఠిరః.

డేగ వ్యూహము పన్ని ధర్మరాజు తాను ముక్కు ఆయెను. కవలలు రెక్కలయిరి. భీముడు తోక ఆయెను కుంతీపుత్రుడగు ధర్మరాజు అందు వేయిమందిని చంపెను.

భీమసేనః సుసంక్రుద్ధః సర్వశస్త్ర భృతాం వరః,
ద్విసహస్రం రథాన్ వీరః పరలోకం ప్రవేశయత్.

ఆయుధము పట్టువారందరిలో మిన్నయగు భీమసేనుడు మిక్కిలి క్రోధముతో రెండు వేలమంది రథవీరులను పరలోకమున కంపెను.

నకుల స్త్రిశతం జఘ్నే సహదేవ శ్చతుఃశతమ్.

నకులుడు మున్నూరు మందిని, సహదేవుడు నన్నూరు మందిని చంపెను]

ఉపావిశన్ గరుత్మన్తః శరై ర్గాఢం ప్రవేజితాః.
అన్తరిక్షే గతిర్యేషాం దర్శనం చాప్యరుధ్యత. 17

ఆకసమున సంచారము, చక్కని దర్శనము గల పక్షులు గూడ బాణములతో మిక్కిలిగా ఉద్వేగమును పొంది కదలజాలక ధ్వజాగ్రాదుల యందు నిలిచిపోయినవి.

తే ఘ్నన్తః సమరేఽన్యోన్యం శూరాః పరిఘబాహవః,
నశేకు రథిసంరబ్ధాః శూరాన్ కర్తుం పరాఙ్ముఖాన్. 18

పరిఘలు పట్టిన శూరులు పరస్పరము చావమోదికొనుచు శూరులను వెనుకకు త్రిప్పజాలరైరి.

శతానీకః శతం హత్వా విశాలాక్షశ్చతుః శతమ్,
ప్రవిష్టౌ మహతీం సేనాం త్రిగర్తానాం మహారథౌ. 19

శతానీకుడు నూరుమందిని, విశాలాక్షుడు నన్నూరుమందిని చంపి త్రిగర్తుల మహాసేనలోనికి మహారథులై చొచ్చుకొనిపోయిరి.

తౌ ప్రవిష్టౌ మహాసేనాం బలవన్తౌ మనస్వినౌ,
ఆర్ఛేతాం బాహుసంరబ్ధౌ కేశాకేశి రథారథి. 20

గొప్పబలము, అభిమానముగల ఆ వీరులు ఆ మహాసేనలోనికి చొరబడి జుట్టుజుట్టు పట్టుకొని, రథముతో రథమును జోడించి పోరి దానిని మూర్ఛపడునట్లు చేసిరి.

లక్షయిత్వా త్రిగర్తానాం తౌ ప్రవిష్టౌ రథవ్రజమ్,
అగ్రతః సూర్యదత్తశ్చ మదిరాక్షశ్చ పృష్ఠతః. 21

త్రిగర్తుల రథముల గుంపులో ప్రవేశించిన వారిరువురను గాంచి ముందునుండి సూర్యదత్తుడు, వెనుకనుండి మదిరాక్షుడును వచ్చి ఆడుకొనిరి.

విరాట స్తత్ర సంగ్రామే హత్వా పఞ్చశతాన్ రథాన్,
హయానాం చ శతాన్యష్టౌ హత్వా పఞ్చ మహారథాన్, 22

చరన్ స వివిధాన్ మార్గాన్ రథేన రథసత్తమః,
త్రిగర్తానాం సుశర్మాణ మార్ఛద్ యుక్మరథం రణే. 23

ఆ యుద్ధమున విరాటుడు ఐదు వందల రథములను, ఎనిమిది వందల గుఱ్ఱములను, ఐదుగురు మహారథులను నాశనముచేసి, రథ

ముతో పలుపోకలు పోవుచు బంగారు రథముగల త్రిగర్తరాజు సుశర్మను తాకెను.

తౌ వ్యవాహరతాం తత్ర మహాత్మానౌ మహాబలౌ,
అన్యోన్య మభిగర్జన్తౌ గోష్ఠేషు వృషభా వివ 24

మహాత్ములు, మహాబలులునగు వారిరువురు గోశాలలోని ఆబోతులవలె రంకెలు వేయుచు పోరిరి.

తతో రాజా త్రిగర్తానాం సుశర్మా యుద్ధదుర్మదః,
మత్స్యం సమాయాద్ రాజానం ద్వైరథేన నరర్షభః. 25

అంత యుద్ధోన్మాదము గల త్రిగర్తరాజు సుశర్మ విరాటరాజు రథమునకు తన రథమును తాకించెను.

తతో రథాభ్యాం రథినౌ వ్యతీయతు రమర్షణౌ,
శరాన్ వ్యసృజతాం శీఘ్రం తోయధారా ఘనా ఇవ. 26

అంత నా రథికు లిరువురు మిక్కిలి కోపముకలవారై రథములతో తలపడి నీటిధారలు గల మేఘములవలె బాణములను గుప్పించిరి.

అన్యోన్యం చాపి సంరబ్ధౌ విచేరతు రమర్షణౌ,
కృతాస్త్రౌ నిశితై ర్బాణై రసిశక్తి గదా భృతౌ. 27

మిక్కిలి క్రోధముగలవారు, అస్త్రములను సాధించినవారు, కత్తులు, శకులు, గదలు తాల్చినవారు నగు వారిరువురు వాడి బాణములతో మిక్కిలి ఆవేశముతో తిరుగాడిరి.

తతో రాజా సుశర్మాణం వివ్యాధ దశభిః శరైః,
పఞ్చభిః పఞ్చభి శ్చాస్య వివ్యాధ చతురో హయాన్. 28

విరాటరాజు అంత పది బాణములతో సుశర్మను పొడిచెను. అయిదేసి బాణములతో వాని నాలుగు గుఱ్ఱములను తూట్లు పొడిచెను.

---

31. ఆ విరాట సుశర్మలు.

తథైవ మత్స్య రాజానం సుశర్మా యుద్ధ దుర్మదః,
పఞ్చాశతా శితై ర్బాణై ర్వివ్యాధ పరమాస్త్రవిత్. 29

పరమాస్త్రములు నేర్చిన యుద్ధ దుర్మదుడగు సుశర్మ అట్లే విరాటరాజును ఏబది వాడి బాణములతో తూట్లు గావించెను.

తతః సైన్యం మహారాజ మత్స్యరాజ సుశర్మణోః,
నాభ్యజానాత్ తదా న్యోన్యం సైన్యేన రజసా వృతమ్. 30

ఓ మహారాజా! అపుడు విరాట సుశర్మలసేన సేనవలన లేచిన ధూళి క్రమ్ముకొనగా ఒకదానినొకటి తెలియ రాకుండెను.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి దక్షిణ గోగ్రహణే
విరాట సుశర్మయుద్ధే ద్వాత్రింశోఽధ్యాయః
ఇది శ్రీమహాభారత విరాటపర్వమున గోహరణపర్వమున దక్షిణ గోగ్రహణమున
విరాట సుశర్మల యుద్ధమను ముప్పది రెండవ అధ్యాయము

## త్రయస్త్రింశోఽధ్యాయః – ముప్పది మూడవ అధ్యాయము

సుశర్మణా నిగృహీతస్య విరాటస్య పాండవ ప్రయత్నేన మోక్షణం, భీమ కర్తృకం సుశర్మణో నిగ్రహణం, తత్ర సానుగ్రహేణ యుధిష్ఠిరేణ తస్య మోచనమ్.

సుశర్మకు పట్టుపడిన విరాటుడు పాండవ ప్రయత్నముచే విడుదల నొందుట, భీముడు సుశర్మను పట్టుట, దయగల ధర్మరాజు వానిని విడిపించుట.

వైశమ్పాయన ఉవాచ – వైశంపాయను డిట్లు చెప్పెను.

తమసాభిప్లుతే లోకే రజసా చైవ భారత,
అతిష్ఠన్ వై ముహూర్తం తు వ్యూఢానీకాః ప్రహారిణః. 1

1. ముహూర్తమ్ – కొంతసేపు, రెండు గడియల కాలమని కాదు, చంద్రోదయ మగుసంతవరకు.

ఒకవైపు చీకటియు, మరియొకవైపు ధూళియు లోకమును ముంచియెత్తగా వ్యూహములు పన్నిన ఆయుధధారులు కొంత కాలము ఊరకుండిరి.

తతో ఽన్ధకారం ప్రణుద న్నుదతిష్ఠత చన్ద్రమాః,
కుర్వాణో విమలాం రాత్రిం నన్దయన్ క్షత్రియాన్ యుధి. 2

అంత చీకటిని చీల్చివైచుచు, రాత్రిని స్వచ్ఛమైనదిగా చేయుచు, క్షత్రియులను యుద్ధభూమిలో సంతోషపెట్టుచు చంద్రుడుదయించెను.

తతః ప్రకాశ మాసాద్య పునర్యుద్ధ మవర్తత,
ఘోరరూపం తత స్తే స్మ నావైక్షన్త పరస్పరమ్. 3

అంత వెన్నెల రాగా ఘోరమైన యుద్ధము మరల సాగెను. వారొకరినొకరు కానరాకైరి.

తతః సుశర్మా త్రైగర్తః సహ భ్రాత్రా యవీయసా,
అభ్యద్రవ న్మత్స్యరాజం రథవ్రాతేన సర్వశః. 4

అంత త్రిగర్తరాజు సుశర్మ తమ్మునితో కూడి రథసముదాయముతో విరాటరాజును చుట్టుముట్టి తరిమెను.

తతో రథాభ్యాం ప్రస్కన్ద్య భ్రాతరౌ క్షత్రియర్షభౌ,
గదాపాణీ సుసంరబ్ధౌ సమభ్యద్రవతాం రథాన్. 5

క్షత్రియశ్రేష్ఠులగు నా సోదరులిరువురు మిక్కిలి విజృంభించి రథములనుండి దుమికి గదలు చేపట్టి రథములను తరిమి కొట్టిరి.

[మత్తావివ వృషా వేతౌ గజా వివ మదోద్ధతౌ,
సింహావివ గజగ్రాహౌ శక్రవృత్రా వివోత్థితౌ.

వారిరువురు బలిసిన ఆబోతులవలె, మదముతో ఎగసి పడెడు ఏనుగులవలె, ఏనుగులను పట్టిన సింహములవలె దేవేంద్ర వృత్రాసురులవలె విజృంభించిరి.

ఉభౌ తుల్యబలోత్సాహా వుభౌ తుల్యపరాక్రమౌ,
ఉభౌ తుల్యాస్త్రవిదుషా వుభౌ యుద్ధవిశారదౌ.

వారిరువురు సమానమగు బలము, ఊపు, పరాక్రమము, అస్త్రపాండిత్యము, యుద్ధనైపుణ్యము కలవారు.]

తథైవ తేషాం తు బలాని తాని
క్రుద్ధా న్యథాన్యోన్య మభిద్రవన్తి,
గదాసి ఖడ్గైశ్చ పరశ్వథైశ్చ
ప్రాసైశ్చ తీక్ష్ణాగ్ర సుపీతధారైః. 6

అట్లే వారి సేవలును గదలు, కత్తులు, గొడ్డళ్లు, వాడి ముడుకులు, బాగుగా పదునుగల అంచులుగల ఈటెలు అనువానితో, మిక్కిలి క్రుద్ధములై పరస్పరము కొట్టుకొనినవి.

బలం తు మత్స్యస్య బలేన రాజా
సర్వం త్రిగర్తాధిపతిః సుశర్మా
ప్రమథ్య జిత్వా చ ప్రసహ్య మత్స్యం,
విరాట మోజస్విన మభ్యధావత్. 7

త్రిగర్తరాజు సుశర్మ బలముతో విరాటుని సేవనంతటిని ఓడించి గెలిచి హఠాత్తుగా గొప్ప దేహబలముగల విరాటునిపై బడెను.

తౌ నిహత్య పృథగ్ ధుర్యా వుభౌ తౌ పార్ష్ణిసారథీ,
విరథం మత్స్యరాజానం జీవగ్రాహ మగృహ్ణతామ్. 8

ఆ అన్నదమ్ములు విడివిడిగా విరాటుని గుఱ్ఱములను, పార్శ్వరక్షకులను, సారథిని చంపి రథములేని విరాటుని ప్రాణములతో పట్టుకొనిరి.

6. తీక్ష్ణాగ్రసుపీతధారైః - వాడియైన అగ్రములు, పదునుపెట్టబడిన అంచులుగల;

తమున్మథ్య సుశర్మాథ యువతీ మివ కాముకః,
స్యన్దనం స్వం సమారోప్య ప్రయయౌ శీఘ్రవాహనః. 9

కాముకుడు యువతినివలె సుశర్మ విరాటుని మర్దించి తన రథమెక్కించుకొని వేగముగల గుఱ్ఱములతో పారెను.

తస్మిన్ గృహీతే విరథే విరాటే బలవత్తరే,
ప్రాద్రవన్త భయా న్మత్స్యా స్త్రిగర్తై రర్దితా భృశమ్. 10

రథముకోల్పోయి బలవత్తరుడైన విరాటు డట్లు పట్టువడగా మత్స్యసైనికులు త్రిగర్తులచే మిక్కిలి పీడనొంది భయముతో పరువెత్తిరి.

తేషు సంత్రస్యమానేషు కున్తీపుత్రో యుధిష్ఠిరః,
ప్రత్యభాష న్మహాబాహుం భీమసేన మరిన్దమమ్. 11

వారట్లు భయపడుచుండగా కుంతీపుత్రుడగు యుధిష్ఠిరుడు శత్రువుల మర్దించు శక్తిగల మహాబాహువగు భీమసేనునితో ఇట్లు పలికెను.

మత్స్యరాజః పరామృష్ట స్త్రిగర్తేన సుశర్మణా,
తం మోచయ మహాబాహో నగచ్ఛేద్ ద్విషతాం వశమ్. 12

ఓ మహాభుజుడా ! మత్స్యరాజు త్రిగర్తరాజగు సుశర్మకు చిక్కెను. అతనిని విడిపింపుము. అతడు శత్రువులకు వశము కారాదు.

ఉషితాః స్మ సుఖం సర్వే సర్వకామైః సుపూజితాః,
భీమసేన త్వయా కార్యా తస్య వాసస్య నిష్కృతిః। 13

మన మిచట సుఖముగా నున్నాము. అతడు మనము కోరినదెల్ల ఇచ్చి మన్నించెను. కావున మననివాసమునకు పరిహారమును చెల్లింపవలయును.

భీమసేన ఉవాచ - భీమసేను డిట్లు పలికెను.

అహమేనం పరిత్రాస్యే శాసనాత్ తవ పార్థివ,
పశ్య మే సుమహత్ కర్మ యుధ్యతః సహ శత్రుభిః. 14

రాజా! నీ ఆజ్ఞతో ఈతనిని నేను రక్షింతును. శత్రువులతో తలపడి నేను చేయు కార్యమెంత గొప్పగా ఉండునో చూడుము.

సుబాహుబల మాశ్రిత్య తిష్ఠ త్వం భ్రాతృభిః సహ,
ఏకాన్తమాశ్రితో రాజన్ పశ్య మేఽద్య పరాక్రమమ్. 15

ఓ రాజా! నీవు నీ భుజబలము నాడగా గొని తమ్ములతో పాటు ఏకాంత ప్రదేశమున నిలువుము. నా పరాక్రమమెట్టిదో నేడు చూడుము.

సుస్కన్ధోఽయం మహావృక్షో గదారూప ఇవస్థితః,
అహమేన మపారుజ్య ద్రావయిష్యామి శాత్రవాన్. 16

ఇదిగో ఈ పెనువృక్షము పెద్దకొమ్మలతో గదవలె నిలిచి యున్నది. దీనిని పెకలించి శత్రువులను తరిమికొట్టెదను.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తం మత్త మివ మాతఙ్గం వీక్షమాణం వనస్పతిమ్,
అబ్రవీద్ భ్రాతరం వీరం ధర్మరాజో యుధిష్ఠిరః. 17

మదించిన ఏనుగువలె చెట్టువైపు చూచుచున్న వీరుడగు సోదరునితో ధర్మరాజిట్లు పలికెను.

మా భీమ సాహసం కార్షీ స్తిష్ఠ త్వేష వనస్పతిః,
మా త్వాం వృక్షేణ కర్మాణి కుర్వాణ మతి మానుషమ్, 18
జనాః సమవబుధ్యేరన్ భీమోఽయ మితి భారత!
అన్యదేవా యుధం కిఞ్చిత్ ప్రతిపద్యస్వ మానుషమ్. 19

16. అపారుజ్య - పెకలించి,

భీమా! సాహసము చేయకుము. ఆ చెట్టునచట నుండనీ చెట్టు పట్టుకొని అమానుషకార్యములను చేసెడునిన్ను జనులు ఇతడు భీముడని గుర్తింపకుందురా! కావున మనుష్యసాధారణమగు ఆయుధము నొకదానిని చేపట్టుము.

చాపం వా యది వా శక్తిం నిస్త్రింశం వా పరశ్వథమ్,
యదేవ మానుషం భీమ భవేదన్యై రలక్షితమ్,
తదే వాయుధ మాదాయ మోక్షయాశు మహీపతిమ్. 20

విల్లో, శక్తియో, ఖడ్గమో, గొడ్డలియో - మనుష్య సాధారణమగు ఆయుధమైనచో ఇతరులు గుర్తింపరు. అట్టిదానిని చేపట్టి తొందరగా రాజును విడిపింపుము.

యమౌ చ చక్రరక్షౌ తే భవితారౌ మహాబలౌ,
సహితాః సమరే తత్ర మత్స్యరాజం పరీప్సత. 21

నీకు మహాబలులగు కవలలు చక్రరక్షకులగుదురు. మీరు ముగ్గురు కలిసి యుద్ధమున విరాటుని రక్షింపుడు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.
ఏవ ముక్తస్తు వేగేన భీమసేనో మహాబలః,
గృహీత్వాతు ధనుః శ్రేష్ఠం జవేన సుమహాజవః,
వ్యముఞ్చ చ్ఛరవర్షాణి సతోయ ఇవ తోయదః. 23

ధర్మజు డిట్లు పలుకగా మహాబలుడు, గొప్పవడి కలవాడునగు భీమసేనుడు గొప్ప వింటిని చేపట్టి నీరు గల మేఘమువలె బాణముల వాన కురిపించెను.

తం భీమో భీమకర్మాణం సుశర్మాణ మథాద్రవత్
విరాటం సమ వీక్ష్యైనం తిష్ఠ తిష్ఠేతి చాబ్రవత్. 24

24. విరాటం సమ - విరాటుని ఓ సాధూ అని సంభావించి అనిభావము, ఏనం వీక్ష్య - ఆ సుశర్మను చూచి;

భీముడు భీమకర్ముడగు సుశర్మను వెంటనంటెను. ఓ సాధూ! అని విరాటుని సంభావించి సుశర్మను నిలునిలుమని పలికెను.

సుశర్మా చిన్తయామాస కాలాన్తక యమోపమమ్,
తిష్ఠ తిష్ఠేతి భాషన్తం పృష్ఠతో రథపుఙ్గవః,
పశ్యతాం సుమహత్ కర్మ మహద్యుద్ధ ముపస్థితమ్. 25

రథికవరుడగు సుశర్మ తన్ను వెనుదవిలి నిలునిలు మని పలుకుచు కాలాంతకుడగు యముని వలెనున్న వాడెవడా ? అనియు, వీడు చేయు ఘన కార్యము చూతము నా చేయు ఘనకార్యము వాడు చూచుగాక ! మహా యుద్ధము వచ్చి పడెననియు చింతించెను.

పరావృత్తో ధనుర్గృహ్య సుశర్మా భ్రాతృభిః సహ,
నిమేషాన్తర మాత్రేణ భీమసేనేన తే రథాః. 26

అంత సుశర్మ తమ్ములతోపాటు ధనువును చేపట్టి మరలెను ఒక్క త్రుటి కాలములో భీమసేనుడు ఆ రథములను సమీపించెను.

రథానాం చ గజానాం చ వాజినాం చ ససాదినామ్,
సహస్ర శత సంఘాతాః శూరాణా ముగ్ర ధన్వినామ్, 27
పాతితా భీమసేనేన విరాటస్య సమీపతః,
పత్తయో నిహతా స్తేషాం గదాం గృహ్య మహాత్మనా. 28

భీమసేనుడు విరాటుని దరిజేరి నూర్లకొలదిగా, వేలకొలదిగా రథములను, ఏనుగులను, రౌతులతో కూడిన గుఱ్ఱములను, భయంకర ధనువులు గల శూరులను చంపెను. ఆ మహాత్ముడు గదగొని పదాతులను చావమోదెను.

25. పశ్యతామ్ - ఒకరి ఘనకార్యము నటియొకరు చూతురుగాక।
26. తేరథాః - ఆ రథములు భీమసేనునికి అందుబాటు లోనికి వచ్చినవని తాత్పర్యము.

తద్ దృష్ట్వా తాదృశం యుద్ధం సుశర్మా యుద్ధదుర్మదః,
చిన్తయామాస మనసా కింశేషం హి బలస్యమే.
అపరో దృశ్యతే సైన్యే పురా మగ్నో మహాబలే. 29

అట్టి ఆ యుద్ధమును గాంచి యుద్ధపు పొగరెక్కిన సుశర్మ 'నా సేనకు నీచమైన వధ కలుగునాయేమి? నా తమ్ముడు ముందే మహాబలముగల సేనలో మునిగిపోయెను?' అని చింతించెను.

ఆ కర్ణపూర్ణేన తదా ధనుషా ప్రత్యదృశ్యత,
సుశర్మా సాయకాం స్తీక్ష్ణాన్ క్షిపతే చ పునః పునః. 30

అపుడు సుశర్మ చెవివరకు లాగిన ధనువుతో విరాజిల్లుచు కానవచ్చెను. వాడి బాణములను మీదమీద విరజిమ్మెను.

తత స్సమస్తా స్తే సర్వే తురగా నభ్యచోదయన్,
దివ్య మస్త్రం వికుర్వాణా స్త్రిగర్తాన్ ప్రత్యమర్షణాః. 31

అంత విరాటదేశము వారందరు దివ్యములగు అస్త్రములను ప్రయోగించుచు త్రిగర్తులపై క్రోధముతో గుఱ్ఱముల నదలించిరి.

తాన్ నివృత్తరథాన్ దృష్ట్వా పాణ్డవాన్ సా మహాచమూః,
వైరాటిః సరమక్రుద్ధో యుయుధే పరమాద్భుతమ్. 32

ఆ పెద్దసేన రథములను మరలించిన పాండవులను చూచెను. విరాటపుత్రుడు మిక్కిలి క్రోధముతో మిక్కిలి అచ్చెరువు గొలుపునట్లు యుద్ధము చేసెను,

సహస్ర మవధీత్ తత్ర కున్తీపుత్రో యుధిష్ఠిరః,
భీమ స్సప్తసహస్రాణి యమలోక మదర్శయన్. 33

కుంతీపుత్రుడగు యుధిష్ఠిరుడు అందు వేయిమందిని సంహరించెను. భీముడు ఏడువేలమందికి యమలోకమును చూపెను.

29, 30 శేషమ్ = నీచమైన వధను; అపరః (భ్రాతా)-ఒక తమ్ముడు;

నకుల శ్చాపి సప్తైవ శతాని ప్రాహిణో చ్ఛరైః ।
శతాని త్రీణి శూరాణాం సహదేవః ప్రతాపవాన్ । 34
యుధిష్ఠిర సమాదిష్టో నిజఘ్నే పురుషర్షభః ॥

నకులుడు ఏడువందల మందిని బాణములతో చంపెను. ప్రతాపముగల పురుషశ్రేష్ఠుడు సహదేవుడును, ధర్మజుని మాటపై మూడువందలమంది శూరులను మట్టుపెట్టెను.

తతో౽భ్యపత దత్యుగ్రః సుశర్మాణ ముదాయుధః ॥ 35

అంత పరమోగ్రుడైన ధర్మరాజు ఆయుధ మెత్తికొని సుశర్మపై బడెను.

హత్వా తాం మహతీం సేనాం త్రిగర్తానాం మహారథః ।
తతో యుధిష్ఠిరో రాజా త్వరమాణో మహారథః ॥ 36
అభిపత్య సుశర్మాణం శరై రభ్యాహనద్ భృశమ్ ।

మహారథుడగు యుధిష్ఠిర మహారాజు త్వరలో త్రిగర్తుల మహాసేనను మడియించి సుశర్మపైపడి గాఢముగా బాణములతో కొట్టెను.

సుశర్మాపి సుసంరబ్ధ స్త్వరమాణో యుధిష్ఠిరమ్ । 37
అవిధ్య న్నవభి ర్బాణై శ్చతుర్భి శ్చతురో హయాన్ ॥

సుశర్మయు మిక్కిలి ఉద్రేకముతో తొమ్మిది బాణములతో ధర్మరాజును, నాల్గింటితో నాలుగు గుఱ్ఱములను పొడిచెను.

తతో రాజ న్నాశుకారీ కున్తీపుత్రో వృకోదరః । 38
సమాసాద్య సుశర్మాణ మశ్వా నస్య వ్యపోథయత్ ॥

అంతవడికాడైన కుంతీపుత్రుడు వృకోదరుడు సుశర్మ దరిజేరి వాని గుఱ్ఱములను హింసించెను.

35. అత్యుగ్రః - సందర్భానుసారముబట్టి ఈ అత్యుగ్రుడు ధర్మరాజు.

పృష్ఠగోపాంశ్చ తస్యాథ హత్వా పరమసాయకైః, 39
అథాస్య సారథిం క్రుద్ధో రథోపస్థా దపాతయత్.

వాని వెనుకనున్న రక్షకులను గొప్పబాణములతో సంహరించి మిక్కిలి కోపముతో వాని సారథిని నొగలనుండి క్రిందపడవైచెను.

చక్రరక్షశ్చ శూరో వై మదిరాక్షోఽతివిశ్రుతః, 40
సమాయాద్ విరథం దృష్ట్వా త్రిగర్తం ప్రాహరత్ తదా.

శూరుడు, ప్రసిద్ధికెక్కినవాడు చక్రరక్షకుడునగు మదిరాక్షుడు, రథము కోల్పోయిన త్రిగర్తుని చూచి వాని కడకరిగి బాగుగా కొట్టెను.

తతో విరాటః ప్రస్కన్ద్య రథాదథ సుశర్మణః, 41
గదాం తస్య పరామృశ్య తమేవాభ్యద్రవద్ బలీ.

అపుడు బలవంతుడగు విరాటుడు సుశర్మరథమునుండి దుమికి వానిగదను చేపట్టి వానినే తరిమి కొట్టెను.

స చచార గదాపాణి ర్వృద్ధోఽపి తరుణో యథా. 42

గదను పట్టిన ఆ విరాటుడు ముదుసలి యయ్యును పడుచువాని వలె వీరవిహారము చేసెను.

పలాయమానం త్రైగర్తం దృష్ట్వా భీమోఽభ్యభాషత,
రాజపుత్ర ! నివర్తస్వ న తే యుక్తం పలాయనమ్. 43

పారిపోవుచున్న త్రిగర్తరాజును గాంచి భీముడిట్లు పలికెను. రాజపుత్రా ! మరలుము ! నీకు పారిపోవుట తగదు.

అనేన వీర్యేణ కథం గా స్త్వం ప్రార్థయసే బలాత్,
కథం చానుచరాం స్త్యక్త్వా శత్రుమధ్యే విషీదసి. 44

ఈమాత్రపు శక్తితో బలాత్కారముగా గోవులనెట్లు కొనిపోవుదువు ? అనుచరులను శత్రువులనడుమ వదలి ఎట్లు ఏడ్తువు ?

ఇత్యుక్తః సతు పార్థేన సుశర్మా రథయూథపః,
తిష్ఠ తిష్ఠేతి భీమం స సహసాఽభ్యద్రవద్ బలీ. 45

భీముడిట్లు పలుకగా రథయూథములుగల సుశర్మ బలము తెచ్చుకొని నిలు నిలుమని భీముని పైకి ఒక్కపెట్టున వచ్చిపడెను.

భీమస్తు భీమసంకాశో రథాత్ ప్రస్కన్ద్య పాణ్డవః,
ప్రాద్రవత్ తూర్ణ మవ్యగ్రో జీవితేప్సుః సుశర్మణః. 46

భీమునివంటి భీముడు రథమునుండి దుమికి మిక్కిలి వేగముతో సంకోచ మింతయు లేక సుశర్మ ప్రాణముల గొనుటకై వానిపై బడెను.

తం భీమసేనో ధావన్త మభ్యధావత వీర్యవాన్,
త్రిగర్తరాజ మాదాతుం సింహః క్షుద్రమృగం యథా. 47

వీర్యశాలియగు భీమసేనుడు పారుచున్న త్రిగర్తరాజును పట్టుటకై, సింహము నీచమృగమును పట్టుటకై పరువెత్తినట్లు, పరువెత్తెను.

అభిద్రుత్య సుశర్మాణం కేశపక్షే పరామృశత్,
సముద్యమ్య తు రోషాత్తం నిష్పిపేష మహీతలే. 48

అట్లు వెంటనంటి భీముడు సుశర్మ జుట్టుపట్టుకొనెను. రోషముతో పైకి లేవనెత్తి నేలపై త్రోసి పిండియగునట్లు కొట్టెను.

పదా మూర్ధ్ని మహాబాహుః ప్రాహరద్ విలపిష్యతః,
తస్య జానుం దదౌ భీమో జఘ్నే చైన మరత్నినా,
స మోహ మగమద్ రాజా ప్రహార వర పీడితః. 49

46. భీమసంకాశః - ఇది అనన్వయాలంకారము. ఆ సమయమున భీమునకు సాటి వచ్చువాడు లేడని భావము.

48, 49. కేశపక్షే - జుట్టుముడియందు, నీతిశాస్త్రమిట్లు చెప్పుచున్నది.

"వామపాణికచోత్పీడా (1) భూమౌ నిష్పేషణం బలాత్ (2) మూర్ధ్ని

గొప్ప భుజములుగల ఆ భీముడు, వాడు మొత్తుకొనుచుండగా కాలితో దల దన్నెను. మోకాటితో పొడిచెను. పిడికిటితో గ్రుద్ది కొట్టెను. అట్టి గట్టి దెబ్బలకు ఆ రాజు మూర్ఛ పొందెను.

తస్మిన్ గృహీతే విరథే త్రిగర్తానాం మహారథే,
అభజ్యత బలం సర్వం త్రైగర్తం తద్ భయాతురమ్. 50

త్రిగర్తులలో మహారథుడగు ఆతడు రథములేనివాడు కాగా త్రిగర్తులసేన యంతయు భయపీడితమై చెల్లాచెదరాయెను.

నివర్త్య గా స్తతః సర్వాః పాణ్డుపుత్రా మహారథాః.
అవజిత్య సుశర్మాణం ధనం చాదాయ సర్వశః. 51

స్వబాహుబలసంపన్నా హ్రీనిషేవా యతవ్రతాః,
విరాటస్య మహాత్మనః పరిక్లేశ వినాశనాః, 52
స్థితాః సమక్షం తే సర్వే త్వథ భీమోఽభ్యభాషత. 53

ఇట్లు మహారథులగు పాండుపుత్రులు గోవులను మరలించి సుశర్మ నోడించి పూర్తిగా ధనమును గ్రహించి బాహుబల సంపన్నులై, ఉచితమగు వినయముతో, నియతమగు వ్రతము గలవారై

---

పాదప్రహరణమ్ (8) జాను నోదరమర్దనమ్ (4) మాలూరాకారయా ముష్ట్యా కపోలే దృఢతాడనమ్ (5) కఫోణిపాతోఽప్యసకృత్ (6) పర్యస్తలతాడనమ్ (7) శాలేన యుద్ధే భ్రమణమ్ (8) మారణం స్మృత మష్టధా చతుర్భిః క్షత్రియం హన్యాత్ పఞ్చభిః క్షత్రియాధమం".

ఎడమచేతితో జుట్టుపట్టుట. నేలపైచి మర్దించుట. తలపై కాలితో తన్నుట, మోకాలితో పొట్టపై పొడుచుట. పిడికలితో చెంపపై గట్టిగా కొట్టుట, చాలమారులు మోచేతితో పొడుచుట, అన్నియెడల అరచేతితో చఱచుట, యుద్ధమున చప్పటలు చఱచుచు తిరుగుట అను నీ యెనిమిదియు శత్రువుల చంపుటలోని విధములు. ఇందు క్షత్రియునిపై నాల్గును, క్షత్రియాధమునిపై ఐదును ప్రయోగింపదగును. భీముడు సుశర్మపై అయిదింటిని ప్రయోగించె ననుటచేత సుశర్మ క్షత్రియులలో అధముడని తెలియుచున్నది.

మహాత్ములై విరాటుని ఆపదను పోగొట్టి ఆతని యెదుట నిలిచిరి. అంత భీము డిట్లుపలికెను.

నాయం పాపసమాచారో మత్తో జీవితు మర్హతి,
కింతు శక్యం మయా కర్తుం యద్ రాజా సతతం ఘృణీ. 54

మత్తేక్కిన యీ పాపకర్ముడు బ్రతుకరాదు. కాని నేనేమి చేయుదును? ఈ రాజెల్లప్పుడు జాలిపడుచుండును.

గలే గృహీత్వా రాజాన మాసీయ వివశం వశమ్,
తత ఏనం విచేష్టన్తం బద్ధ్వా పార్థో వృకోదరః. 55

రథ మారోపయామాస విసంజ్ఞం పాంసు గుణ్ఠితమ్,
అభ్యేత్య రణ మధ్యస్థ మభ్యగచ్ఛద్ యుధిష్ఠిరమ్. 56

పిమ్మట ఒడలెరుగని ఆ రాజు మెడబట్టి వశపరచుకొని గింజుకొనుచుండగా పట్టుకొని వృకోదరుడు చేష్టలుడిగి దుమ్ముకొట్టుకొన్న వానిని రథ మెక్కించి రణభూమి నడుమ నున్న ధర్మరాజు కడకు ఏగెను.

దర్శయామాస భీమస్తు సుశర్మాణం నరాధిపమ్,
ప్రోవాచ పురుషవ్యాఘ్రో భీమ మాహవ శోభినమ్. 57

నరపతి యగు సుశర్మను భీముడు ధర్మరాజునకు చూపెను. అంతట పురుషశ్రేష్ఠుడు ధర్మరాజు యుద్ధమున విరాజిల్లుచున్న భీమునితో నిట్లు పలికెను.

తం రాజా ప్రాహసద్ దృష్ట్వా ముచ్యతాం వై నరాధమః,
ఏవ ముక్తోఽబ్రవీద్ భీమః సుశర్మాణం మహాబలమ్. 58

వానిని చూచి నవ్వుచు ధర్మజుడు ఈ నరాధముని వదిలివేయుమనెను. అంత భీముడు మహాబలుడగు సుశర్మతో నిట్లనెను.

భీమ ఉవాచ - భీము డిట్లుపలికెను.

జీవితుం చేచ్ఛసే మూఢ హేతుం మే గదతః శృణు,
దాసోఽస్మీతి త్వయా వాచ్యం సంసత్సు చ సభాసు చ. 59

---

54. ఘృణీ - జాలిచూపువాడు.

ఓరీ మూఢుడా ! నీవు బ్రదుకగోరినచో ఉపాయమును చెప్పు చున్నాను వినుము. నీవు సభలయందును, గోష్ఠులయందును దాసుడ నని పలుకవలయును.

ఏవం తే జీవితం దద్యా మేష యుద్ధజితో విధిః,
త ముశాచ తతో జ్యేష్ఠో భ్రాతా సప్రణయం వచః. 60

'ఇట్లైనచో నిన్ను బ్రదుకనిత్తును. యుద్ధమున ఓడినవాని కిది కర్తవ్యము.' అంత ధర్మరాజు ప్రేమపూర్వకముగా భీమునితో నిట్లనెను.

యుధిష్ఠిర ఉవాచ - యుధిష్ఠిరు డిట్లు పలికెను.

ముఞ్చ ముఞ్చాధమాచారం ప్రమాణం యది తేవయమ్,
దాసభావం గతో హ్యేష విరాటస్య మహీపతేః.
అదాసో గచ్ఛ ముక్తోఽసి మైవం కార్షీః కదాచన. 61

భీమా ! మేము నీకు ప్రమాణమైనచో ఈ నీచకర్మని వద లుము. వీడు విరాటమహీపతికి దాసుడైనాడు. ఓయీ ! విడుదల పొందితివి. దాసుడవుకావు పొమ్ము. మరల నెన్నడు నిట్లు చేయకుము.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి దక్షిణగోగ్రహే
త్ర య స్త్రిం శో ఽ ధ్యా యః.
ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున దక్షిణగోగ్రహమున
ము ప్ప ది మూ డ వ అ ధ్యా య ము.

## చతుస్త్రింశోఽధ్యాయః - ముప్పదినాలుగవ అధ్యాయము

రాజ్ఞా విరాటేన పాణ్డవానాం సంమానం, యుధిష్ఠిరేణ రాజ్ఞోఽభినన్దనం, విరాటనగరే తద్విజయ ఘోషణా.

విరాటరాజు పాండవులను సమ్మానించుచు, యుధిష్ఠిరుడు రాజును అభినందించుట. విరాటనగరమున వారి విజయమును ఘాటించుచుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ ముక్తే తు సవ్రీడః సుశర్మాసీ దధోముఖః,
సముక్తోఽభ్యేత్య రాజాన మభివాద్య ప్రతస్థివాన్. 1

ధర్మజుడిట్లు పలుకగా సుశర్మ సిగ్గుపడి తలవాల్చి యుండెను. విడుదలపొంది రాజునకు ప్రణమిల్లి వెడలెను.

విసృజ్య తు సుశర్మాణం పాణ్డవా స్తే హతద్విషః,
స్వబాహు బలసంపన్నా హ్రీనిషేవా యతవ్రతాః. 2
సంగ్రామ శిరసో మధ్యే తాం రాత్రిం సుఖినోఽవసన్.

శత్రుసంహారకులు, బాహుబలము సమృద్ధిగా గలవారు, వినయవంతులు, సంయమనము వ్రతముగా గలవారునగు పాండవులు సుశర్మను వదలి ఆరాత్రి యుద్ధభూమికడ సుఖముగా నుండిరి.

తతో విరాటః కౌన్తేయా నతిమానుషవిక్రమాన్,
అర్చయామాస విత్తేన మానేన చ మహారథాన్. 3

అంత విరాటుడు అతిమానుషపరాక్రమముగల మహారథులగు పాండవులను ధనముతో మన్ననతో అర్చించెను.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

యథైవ మమ రత్నాని యుష్మాకం తాని వై తథా,
కార్యం కురుత వై సర్వే యథాకామం యథాసుఖమ్. 4

అయ్యా! రత్నము లన్నియు నాకెట్లో మీకును అట్లే. మీ యిచ్ఛ వచ్చినట్లు, మీకు సుఖమైన తీరున వీనిని ఉపయోగింపుడు.

దదామ్యలంకృతాః కన్యా వసూని వివిధాని చ,
మనస శ్చాప్యభిప్రేతం యద్వః శత్రునిబర్హణాః. 5

చక్కఁగా అలంకరించుకొన్న కన్యలను, అనేకవిధములగు ధనములను మీ కిత్తును. యుద్ధమున శత్రువులను పరిమార్చిన మీ కేదికోరిన అది ఇత్తును.

యుష్మాకం విక్రమా దద్య ముక్తోఽహం స్వస్తిమా నిహ,
తస్మాద్ భవన్తో మత్స్యానా మీశ్వరాః సర్వ ఏవ హి. 6

మీ విక్రమము వలన నేను నేడు విడుదలనొంది సుఖము నందితిని. కావున మీరే ఈమత్స్యదేశము వారికి ప్రభువులు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తథేతి వాదినం మత్స్యం కౌరవేయాః పృథక్ పృథక్,
ఊచుః ప్రాఞ్జలయః సర్వే యుధిష్ఠిరపురోగమాః. 7

ఆ విధముగా పలుకుచున్న విరాటునితో ధర్మరాజు మున్నుగా పాండవు లందరు దోసిలొగ్గి ఇట్లు పలికిరి.

ప్రతినన్దామ తే వాక్యం సర్వం చైవ విశామ్పతే,
ఏతేనైవ ప్రతీతాః స్మః యత్త్వం ముక్తోఽద్య శత్రుభిః. 8

మహారాజా ! నీవాక్యము మాకు ముచ్చటగా నున్నది. నీవు శత్రువులనుండి విడుదల పొందితివి. దాని చేతనే మేము సంతసించితిమి.

తతోఽబ్రవీత్ ప్రీతమనా మత్స్యరాజో యుధిష్ఠిరమ్,
పునరేవ మహాబాహు ర్విరాటో రాజసత్తమః. 9

ఏహి త్వా మభిషేక్ష్యామి మత్స్యరాజస్తు నో భవాన్. 10

మహాబాహువు, రాజసత్తముడు నగు విరాటుడు ప్రీతినొందిన మనస్సుతో ధర్మరాజుతో మరియు నిట్లనెను: తమ్ముడా. నిన్ను అభిషేకింతును. మాకు నీవే మత్స్యరాజవు.

౧. ప్రతీతాః - సంతసించిన వారము.

మనసశ్చాప్యభిప్రేతం యత్తేష్టం భువి దుర్లభమ్,
తత్ తేఽహం సంప్రదాస్యామి సర్వ మర్హతి నో భవాన్. 11

నీమనసున కేది యిష్టమో భూమియందు దుర్లభమైన దైనను, నీకోరికమేరకు దానిని నేను నీకు అర్పింతును. మాకు సంబంధించిన సర్వమును నీవు పొందదగుదువు.

రత్నాని గాః సువర్ణం చ మణిముక్త మథాపి చ,
వైయాఘ్రపద్య విప్రేన్ద్ర సర్వథైవ నమోఽస్తు తే. 12

రత్నములు, గోవులు, బంగారము, మణులు, ముత్యములు - ఇట్టివి ఏవియైనను ఇత్తును. ఓవిప్రవరేణ్యా! వైయాఘ్ర పద్యా! ఇదిగో నీకు సర్వవిధముల నమస్సు.

త్వత్కృతే హ్యద్య పశ్యామి రాజ్యం సన్తాన మేవ చ,
యతశ్చ జాతసంరంభో న చ శత్రువశం గతః. 13

ఇంత పెనుభీతి కలిగినను శత్రువులకు చేజిక్కక నీ వలన మరల రాజ్యమును, బిడ్డలను చూచుకొనుచున్నాను.

తతో యుధిష్ఠిరో మత్స్యం పున రేవాభ్యభాషత,
ప్రతినన్దామి తే వాక్యం మనోజ్ఞం మత్స్య భాషసే,
ఆనృశంస్యపరో నిత్యం సుసుఖీ సతతం భవ. 14

అంత యుధిష్ఠిరుడు మత్స్యరాజుతో మరల నిట్లు పలికెను. రాజా! నీమాట మనసునకు ముచ్చట గొలుపుచున్నది. నీవు నిత్యము కృతజ్ఞుడవై సుఖవంతుడ వగుము.

[వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.
పునరేవ విరాటశ్చ రాజా కఙ్క మభాషత,
అహో సూదస్య కర్మాణి వల్లవస్య ద్విజోత్తమ,
సోఽహం సూదేన సంగ్రామే వల్లవే నాభిరక్షితః.

11. నః సర్వమ్ - మాకు సంబంధించిన సర్వమును.

విరాటరాజు మరియు కంకునితో నిట్లనెను. ఓద్విజోత్తమా! ఈవంటలవాడగు వల్లవుని పను లెంత ఆశ్చర్యకరములు! ఆ నేను యుద్ధమున ఈవల్లవుని వలన రక్షింపబడితిని.

త్వత్కృతే సర్వ మేవైత దుపపన్నం మమానఘ !,
వరం వృణీష్వ భద్రం తే బ్రూహి కిం కరవాణి తే.

ఓ పుణ్యాత్మా! నీవలన నా కిది యంతయు సిద్ధించినది. వరము కోరుకొనుము. నీకు మేలగుగాక! చెప్పు! నీ కేమి చేయుదును!

దదామి తే మహాప్రీత్యా రత్నా న్యుచ్చావచాని చ,
శయనాసనయానాని కన్యాశ్చ సమలంకృతాః,
హస్త్యశ్వరథసంఘాంశ్చ రాష్ట్రాణి వివిధాని చ,
ఏతాని చ మమ ప్రీత్యా ప్రతిగృహ్ణీష్వ సువ్రత.

మహాప్రీతితో అనేక విధములగు రత్నములను, పాన్పులను, ఆసనములను, వాహనములను, చక్కగా అలంకరించిన కన్యలను, ఏనుగులను, గుఱ్ఱములను, రథములసముదాయములను, వివిధములగు రాష్ట్రములను నీ కిత్తును. ఓ సువ్రతుడా! నా తృప్తికై వీనిని నీవు గ్రహింపుము.

తం తథావాదినం తత్ర కౌరవ్యః ప్రత్యభాషత,
ఏకైవ తు మమ ప్రీతి ర్యత్త్వం ముక్తోఽసి శత్రుభిః.

ఇట్లు పలుకుచున్న రాజుతో ధర్మరాజిట్లనెను. నీవు శత్రువుల నుండి ముక్తి పొందితివి. నా కది యొక్కటియే ప్రీతి.

ప్రతీతశ్చ పురం తుష్టః ప్రవేక్ష్యసి తదానఘ,
దారైః పుత్రైశ్చ సంశ్లిష్య సా హి ప్రీతి ర్మమాతులా.

పుణ్యాత్ముడా! సంతోషముతో బయలుదేరి పురమును ప్రవేశింతువు. భార్యాపుత్రులతో కలియుదువు. అదియే నాకు మిక్కిలి ప్రీతికరమైన విషయము]

గచ్ఛన్తు దూతా స్త్వరితం నగరం తవ పార్థివ,
సుహృదాం ప్రియ మాఖ్యాతుం ఘోషయన్తు చ తే జయమ్. 15

ఓరాజా! నీమిత్రములకు ప్రియము చెప్పుటకై త్వరగా నీ దూతలు పురమున కరుగవలయును. నగరమునం దన్నియెడల నీ జయమును చాటవలయును.

తత స్తద్వచనా న్మత్స్యో దూతాన్ రాజా సమాదిశత్. 16

అంత రాజామాటపై దూతల కిట్లాజ్ఞాపించెను.

ఆచక్షధ్వం పురం గత్వా సంగ్రామవిజయం మమ,
కుమార్యః సమలంకృత్య పర్యాగచ్ఛన్తు మే పురాత్,
వాదిత్రాణి చ సర్వాణి గణికాశ్చ స్వలంకృతాః. 17

మీరు పురమున కరిగి నాయుద్ధవిజయమును అందరకు చెప్పుడు. చక్కగా అలంకరించుకొన్న కన్యలు, అన్నివిధములగు వాద్యములు, భూషితలగు వేశ్యలు నగరమునుండి నా కెదురు రావలయును.

ఏతాం చాజ్ఞాం తతః శ్రుత్వా రాజ్ఞా మత్స్యేన నోదితాః,
తా మాజ్ఞాం శిరసా కృత్వా ప్రస్థితా హృష్టమానసాః. 18

అంత ఆ దూతలు విరాటునిఆజ్ఞను విని తలదాల్చి పొంగి వచ్చి సంతోషముతో పురమునకు బయలుదేరిరి.

తే గత్వా తత్ర తాం రాత్రి మథ సూర్యోదయం ప్రతి,
విరాటస్య పురాభ్యాశే దూతా జయ మఘోషయన్. 19

వారట నుండి ఆరాత్రి బయలుదేరి తెల్లవారుసరికి నగరమున కరిగి విరాటుని జయమును చాటిరి.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి దక్షిణగోగ్రహే విరాట జయఘోషే చతుస్త్రింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున దక్షిణగోగ్రహణమున విరాటుని జయఘోషమను ముప్పదినాలుగవ అధ్యాయము.

## పఞ్చత్రింశోఽధ్యాయః - ముప్పదియైదవ అధ్యాయము

కౌరవై రుత్తరతో విరాటస్య గవా ముపహారణం, గోపాధ్యక్షేణ రాజకుమారస్యోత్తరస్య యుద్ధాయ ప్రోత్సాహనం చ.

కౌరవు లుత్తరమువైపుగా విరాటుని గోవులను పట్టుట, రాజకుమారుడగు ఉత్తరుని గోపాధ్యక్షుడు యుద్ధమునకై ప్రోత్సహించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

యాతే త్రిగర్తాన్ మత్స్యే తు పశూం స్తాన్ వై పరీప్సతి,
దుర్యోధనః సహామాత్యో విరాట ముపయా దథ. 1

పశువులను తిరిగి పొందగోరి విరాటుడు త్రిగర్తులమీదికి పోగా దుర్యోధనుడు మంత్రులతో కూడి విరాట నగరముపై దండెత్తెను.

భీష్మో ద్రోణశ్చ కర్ణశ్చ కృపశ్చ పరమాస్త్రవిత్,
ద్రౌణిశ్చ సౌబల శ్చైవ తథా దుశ్శాసనః ప్రభో. 2

వివింశతి ర్వికర్ణశ్చ చిత్రసేనశ్చ వీర్యవాన్,
దుర్ముఖో దుశ్శల శ్చైవ యే చైవాన్యే మహారథాః. 3

ఏతే మత్స్యా నుపాగమ్య విరాటస్య మహీపతేః,
ఘోషాన్ విద్రావ్య తరసా గోధనం జహ్రు రోజసా. 4

భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, గొప్ప అస్త్రముల నెరిగిన కృపుడు, అశ్వత్థామ, శకుని, దుశ్శాసనుడు, వివింశతి, వికర్ణుడు,

వీర్యవంతుడగు చిత్రసేనుడు, దుర్ముఖుడు, దుశ్శలుడు, మరియు ఇతరమహారథులు - వీరందరు మత్స్యదేశమునకు వచ్చి గోశాల లోనికి జొచ్చి హఠాత్తుగా విరాటునిగోవులను బలముతో హరించిరి.

షష్టిం గతాం సహస్రాణి కురవః కాలయన్తి చ,
మహతా రథవంశేన పరివార్య సమన్తతః. 5

గొప్పరథముల సముదాయముతో అన్నివైపుల చుట్టుముట్టి కౌరవులు అరువదివేలగోవులను తీసికొనిపోవుచుండిరి.

గోపాలానాం తు ఘోషస్య హన్యతాం తైర్మహారథైః,
ఆరావః సుమహానాసీత్ సంప్రహారే భయంకరే. 6

భయంకరమైన ఆదొమ్మిలో ఆ మహారథులు చావబాదుచుండగా గోశాలలోని గోపాలకుల రొద పిక్కటిల్లెను.

గోపాధ్యక్షో భయత్రస్తో రథమాస్థాయ సత్వరః,
జగామ నగరాయైవ పరిక్రోశంస్తదార్తవత్. 7

అంత భయముతో దిక్కుతోచక ఆర్తునివలె విలపించుచు గోపాధ్యక్షుడు రథమెక్కి వడివడిగా నగరమున కరిగెను.

స ప్రవిశ్య పురం రాజ్ఞో నృపవేశ్మాభ్యయాత్ తతః,
అవతీర్య రథాత్తూర్ణమాఖ్యాతుం ప్రవివేశ హ. 8

అతడు రాచనగరు ప్రవేశించి రాజమందిరమున కరిగి వేగముగా రథమును దిగి వార్తచెప్పుటకై లోన ప్రవేశించెను.

దృష్ట్వా భూమింజయం నామ పుత్రం మత్స్యస్య మానినమ్,
తస్మై తత్ సర్వమాచష్ట రాష్ట్రస్య పశుకర్షణమ్. 9

---

౬. కాలయన్తి - తోలుకొని పోవుచున్నారు.

౯. భూమింజయమ్ - ఉత్తరునికే యది మరియొక పేరు.

మత్స్యరాజు కుమారుడు, అభిమానవంతుడు, భూమింజయుడను వానిని చూచి రాష్ట్రములోని పశువుల నపహరించిన వృత్తాంతమంతయూ విన్నవించెను.

షష్టిం గవాం సహస్రాణి కురవః కాలయన్తి తే,
తద్ విజేతుం సముత్తిష్ఠ గోధనం రాష్ట్రవర్ధన. 10

ఓయీ! రాష్ట్రవర్ధనా! కౌరవులు నీ అరువదివేల గోవులను తోలుకొని పోవుచున్నారు. గోధనమును సాధించుటకు లెమ్ము.

రాజపుత్ర హితప్రేప్సుః క్షిప్రం నిర్యాహి చ స్వయమ్,
త్వాం హి మత్స్యో మహీపాలః శూన్యపాలమిహాకరోత్. 11

రాజపుత్రా, హితమును పొందగోరినవాడవై త్వరగా స్వయముగా బయలుదేరుము. రాజా, రాజులేనివేళ నిన్నిచట పాలకునిగా చేసెనుగదా!

త్వయా పరిషదో మధ్యే శ్లాఘతే స నరాధిపః,
పుత్రో మ మానురూపశ్చ శూరశ్చేతి కులోద్వహః. 12

'ఈ నాకుమారుడు నాకు తగినవాడు, శూరుడు, కులమును ఉద్ధరించును' అని ఆరాజు సభలో నిన్ను పొగడుచుండును.

ఇష్వస్త్రే నిపుణో యోధః సదా వీరశ్చ మే సుతః,
తస్య తత్ సత్యమేవాస్తు మనుష్యేన్ద్రస్య భాషితమ్. 13

ఈనాపుత్రుడు బాణప్రయోగములో నేర్పుగల యోధుడు, వీరుడు' అని రాజనును. ఆమహారాజు అనెడు మాట నేడు నిజమగుగాక!

ఆవర్తయ కురూన్ జిత్వా పశూన్ పశుమతాం వర,
నిర్దహైషా మనీకాని భీమేన శరతేజసా. 14

---

11. శూన్యపాలమ్ - రాజులేనపుడు పాలకునిగా;
12. త్వయా పరిషదో మధ్యే - సభలో నీతోకూడియున్నపుడు అని భావము.

పశుధన మధికముగా గలవారిలో నీవు శ్రేష్ఠుడవు. కురు వంశము వారిని జయించి పశువులను మరలింపుము. భయంకరమైన శరముల మంటలో ఆసేనలను కాల్చివేయుము.

ధనుశ్చ్యుతై రుక్మపుఙ్ఖైః శరైః సంనతపర్వభిః,
ద్విషతాం భిన్ధ్యనీకాని గజానా మివ యూథపః. 15

ఏనుగులలో మదించిన ఏనుగువలె వంగినకణుపులు, బంగారు పిడులు గలిగి, వింటినుండి దూసికొనివచ్చిన బాణములతో శత్రువుల మూకలను చీల్చి చెండాడుము.

పాశోపధానాం జ్యాతన్త్రీం చాపదణ్డాం మహాస్వనామ్,
శరవర్ణాం ధనుర్వీణాం శత్రుమధ్యే ప్రవాదయ. 16

నాశములనెడు కీలలు, అల్లెత్రాడనెడు తంత్రులు, వింటిబద్ద అనెడు దండము, నరములనెడు స్వరములు, గొప్పనాదము గల నీ ధనస్సనెడు వీణను శత్రువుల నడుమ ప్రయోగింపుము.

శ్వేతా రజతసంకాశా రథే యుజ్యన్తు తే హయాః,
ధ్వజం చ సింహం సౌవర్ణ ముచ్ఛ్రయన్తు తవ ప్రభో. 17

ఓ ప్రభూ! తెల్లగా వెండివలె నొప్పారు నీ గుఱ్ఱములను బంగారు సింహముగల ధ్వజమును రథమున పూన్పుము.

రుక్మపుఙ్ఖాః ప్రసన్నాగ్రా ముక్తా హస్తవతా త్వయా,
ఛాదయన్తు శరాః సూర్యం రాజ్ఞాం మార్గనిరోధకాః. 18

బంగారు పిడులు మిక్కిలి సన్నని అంచులు గల నీశరములు దృఢమైన చేతులతో నీవు వదలగా రాజులమార్గముల నడ్డగించుచు సూర్యుని కప్పివేయుగాక!

---

17. సింహమ్ - సింహపు గుర్తుగల:
18. హస్తవతా - ప్రశస్తమైన చేయిగల:

రణే జిత్వా కురూన్ సర్వాన్ వజ్రపాణి రివాసురాన్,
యశో మహ దవాప్య త్వం ప్రవి శేదం పురం పునః. 19

దేవేంద్రుడు రాక్షసులనువలె, రణమున కౌరవుల నందరను గెలిచి, గొప్పకీర్తిని పొంది, తిరిగి పురమును ప్రవేశింపుము.

త్వం హి రాష్ట్రస్య పరమా గతి ర్మత్స్యపతేః సుతః,
యథాహి పాణ్డుపుత్రాణా మర్జునో జయతాం వరః. 20

పాండవులలో జయశాలియగు అర్జును డెట్లో ఇప్పుడు మత్స్యరాజు కుమారుడవు నీవే ఈ రాష్ట్రమునకు పెద్దదిక్కు.

ఏవ మేవ గతి ర్నూనం భవాన్ విషయ వాసినామ్,
గతిమన్తో వయం త్వద్య సర్వే విషయవాసినః. 21

ఇట్లు నీవే ఈ దేశప్రజలకు గతివి. ఇది నిశ్చయము. ఈదేశవాసులము మేమందరము నేడు నీవలన గతి గలవారమగుదుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.
స్త్రీ మధ్య ఉక్తస్తేనాసౌ తద్ వాక్య మభయంకరమ్,
అన్తఃపురే శ్లాఘమాన ఇదం వచన మబ్రవీత్. 22

ఇట్లాతడు అంతఃపురమున ఆడువారినడుమ ఆతనినట్లు పొగడగా ఆతడు ఇట్లు పలికెను.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తర గోగ్రహే గోపవాక్యే పఞ్చత్రింశోఽధ్యాయః

ఇది శ్రీ మహాభారతవిరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహణమున గోపవాక్యము అను ముప్పదియైదవ అధ్యాయము.

## షట్త్రింశోఽధ్యాయః - ముప్పదిఆరవ అధ్యాయము

సారథి మనుసంధిత్సు ముత్తరం ప్రతి పార్థసంమతాద్ద్రౌపద్యా సారథ్యాయ బృహన్నలా నామ్నా నిర్దేశః.

సారథిని కూర్చుకొనగోరు ఉత్తరునకు, అర్జునుని అనుమతితో ద్రౌపది సారథ్యమునకై బృహన్నలపేరు సూచించుట.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లనెను.

అద్యాహ మనుగచ్ఛేయం దృఢధన్వా గవాం పదమ్,
యది మే సారథిః కశ్చిద్ భవే దశ్వేషు కోవిదః. 1.

గుఱ్ఱములవిద్యలో ఆరితేరిన సారథి ఒకడు దొరకినచో ఇప్పుడే గట్టివిల్లు పూని నేను గోవులున్నచోటికి పోయియుండెడి వాడను.

తం త్వహం నాధిగచ్ఛామి యో మే యన్తా భవే న్నరః,
పశ్యధ్వం సారథిం క్షిప్రం మమ యుక్తం ప్రయాస్యతః. 2

నాకు సారథి కాగల నరుడు కానవచ్చుట లేదు. దండు పోయెడునాకు తగిన సారథిని త్వరగా చూడుడు.

అష్టావింశతి రాత్రం వా మాసం వా నూన మన్తతః,
యత్ తదాసీ న్మహద్యుద్ధం తత్ర మే సారథి ర్హతః. 3

ఇరువది యెనిమిది దినములో లేక నిండుగా ఒక నెలయో యయినది. అపుడు జరిగిన మహాయుద్ధమున నాసారథి చచ్చెను.

స లభేయం యదా త్వన్యం హయయానవిదం నరమ్,
త్వరావా నద్య యాత్వాహం సముచ్ఛ్రిత మహాధ్వజమ్. 4
విగాహ్య తత్ పరానీకం గజవాజి రథాకులమ్,
శస్త్రప్రతాప నిర్వీర్యాన్ కురూన్ జిత్వా నయే పశూన్. 5

అట్టి నాకు గుఱ్ఱములను నడపుట యెరిగిన నరుడు దొరికినచో ఇప్పుడే పోయి, ఎత్తినధ్వజములతో, ఏనుగులతో, గుఱ్ఱములతో రథములతో గజిబిజిగానున్న శత్రువులసేనలో చొరబడి కురువంశమువారిని నా ఆయుధముల మంటతో శక్తిహీనులను చేసి పసువులను తెత్తును.

దుర్యోధనం శాన్తనవం కర్ణం వైకర్తనం కృపమ్,
ద్రోణం చ సహ పుత్రేణ మహేష్వాసాన్ సమాగతాన్. 6
విద్రావయిత్వా సంగ్రామే దానవా నివ వజ్రభృత్,
అనేనైవ ముహూర్తేన పునః ప్రత్యానయే పశూన్. 7

దుర్యోధనుని, భీష్ముని, సూర్యుని కొడుకగు కర్ణుని, కృపుని, పుత్రునితో పాటుగ ద్రోణుని ఇంకను వచ్చిన గొప్ప విలుకాండ్రను, ఇంద్రుడు దానవులనువలె పారద్రోలి ఈక్షణమందే పశువులను మరలించి తెత్తును.

శూన్య మాసాద్య కురవః ప్రయాన్త్యాదాయ గోధనమ్,
కిం ను శక్యం మయా కర్తుం యదహం తత్ర నాభవమ్. 8

ఎవ్వరులేని సమయమున కౌరవులు గోధనమును పట్టుకొని పోవుచున్నారు. అచట నేను లేను. ఏమి చేయుదును?

పశ్యేయు రద్య మే వీర్యం కురవస్తే సమాగతాః,
కిం ను పార్థోఽర్జునః సాక్షా దయ మస్మాన్ ప్రబాధతే. 9

"ఏమి? కుంతీపుత్రుడగు అర్జునుడే స్వయముగా వచ్చి మనలను హింసించుచున్నాడా?" అనుకొనుచు నిట వచ్చిన కౌరవులు నేడు నాప్రతాపమును చూతురుగాక!

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

శ్రుత్వా తదర్జునో వాక్యం రాజ్ఞః పుత్రస్య భాషతః,
అతీతసమయే కాలే ప్రియాం భార్యా మనిన్దితామ్. 10
ద్రుపదస్య సుతాం తన్వీం పాఞ్చాలీం పావకాత్మజామ్,
సత్యార్జవగుణోపేతాం భర్తుః ప్రియహితే రతామ్,
ఉవాచ రహసి ప్రీతః కృష్ణాం సర్వార్థకోవిదః. 11

రాజపుత్రు డిట్లు పలుకుచుండగా విని సర్వవిషయములయం దును ప్రజ్ఞగల అర్జునుడు అజ్ఞాతవాసకాలము ముగిసె నని యెరిగి

తన ప్రియభార్య, దోషములేని, పాంచాలరాజపుత్రి, అగ్నిలో పుట్టినది, సత్యము, ఋజుత్వము అను గుణములు గలది భర్తకు ప్రియము హితము కూర్చుటలో ప్రీతి కలది అగు ద్రౌపదితో ఏకాంతమున ఇట్లు ప్రీతితో పలికెను.

ఉత్తరం బ్రూహి కల్యాణి క్షిప్రం మద్వచనా దిదమ్. 12
అయం వై పాణ్డవ స్యాసీత్ సారథిః సంమతో దృఢః,
మహాయుద్ధేషు సంసిద్ధః స తే యన్తా భవిష్యతి. 13

ఓ కల్యాణీ! నామాటగా ఉత్తరునితో "ఇతడు మున్ను పాండవునకు ఇష్టుడు గట్టివాడు నగుసారథి. మహాయుద్ధములందు అనుభవము కలవాడు. నీకు సారథి కాగలడు." అని చెప్పుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.
తస్య తద్ వచనం స్త్రీషు భాషతశ్చ పునః పునః,
న సామర్షత పాఞ్చాలీ బీభత్సోః పరికీర్తనమ్. 14

ఆడువారినడుమ అట్లు మాటిమాటికి అర్జునునితో పోల్చుకొని ఉత్తరు డాడుమాటలను ద్రౌపది సహింపజాలనిదాయెను.

అథైన ముపసంగమ్య స్త్రీమధ్యాత్ సా తపస్వినీ,
వ్రీడమానేవ శనకై రిదం వచన మబ్రవీత్. 15

ఆతపస్విని స్త్రీలమధ్యనుండి మెల్లగా ఆతనిని సమీపించి సిగ్గుపడుచున్నట్లు మెల్లగా నిట్లనెను.

యోఽసౌ బృహద్వారణాభో యువా సుప్రియదర్శనః,
బృహన్నలేతి విఖ్యాతః పార్థస్యాసీత్ స సారథిః. 16

పెద్దఏనుగువలె నొప్పుచున్న ఆరూపవంతుడైన యువకుడు బృహన్నల యని యుండెనే, ఆతడు అర్జునునకు సారథిగా నుండెను.

15. తపస్వినీ - వ్రతనిష్ఠగలది.

ధనుష్యనవర శ్చాసీత్ తస్య శిష్యో మహాత్మనః,
దృష్టపూర్వో మయా వీర చరన్ పార్థ పాణ్డవాన్ప్రతి. 17

అమహాత్ముడగు అర్జునునిశిష్యుడగు ఈతడు ధనుస్సునందును తక్కువవాడు కాడు. ఓవీరుడా! పాండవులకడ తిరుగుచున్న నీతనిని పూర్వము చూచియుంటిని.

యదా తత్ పావకో దావ మదహత్ ఖాణ్డవంప్రతి,
అర్జునస్య తదానేన సంగృహీతా హయోత్తమాః. 18

అగ్నిదేవుడు ఖాండవవనమును దహించినప్పుడు, అర్జునుని ఉత్తమాశ్వములను ఈతడు నడపెను.

తేన సారథినా పార్థః సర్వభూతాని సర్వశః,
అజయత్ ఖాణ్డవప్రస్థే నహి యన్తాస్తి తాదృశః. 19

ఆపార్థుడు ఈసారథిసాయముతోడనే ఖాండవప్రస్థమున సర్వభూతములను సమగ్రముగ జయించెను. అట్టిసారథి మరియొకడు లేడు.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.
సైరంధ్రి జానాసి తథా యువానం
నపుంసకో నైవ భవేద్ యథాసౌ,
అహం న శక్నోమి బృహన్నలాం శుభే
వక్తుం స్వయం యచ్ఛ హయాన్ మమేతి వై. 20

ఓసైరంధ్రీ! ఈతడు నపుంసకుడు కాడు యువకుడని నీవు భావించుచున్నావు. నేను మాత్రము నాగుఱ్ఱములను నడుపుమని పలుకనైన పలుకజాలను.

ద్రౌపద్యువాచ - ద్రౌపది యిట్లు పలికెను.
యేయం కుమారీ సుశ్రోణీ భగినీ తే యవీయసీ,
అస్యాః స వీర వచనం కరిష్యతి న సంశయః. 21

ఈకన్నియ నీ చెల్లెలున్నదే, ఈమె మాటను అతడు తప్పక పాటించును. సంశయము లేదు.

యది వై సారథిః స స్యాత్ కురూన్ సర్వాన్ న సంశయః,
జిత్వా గాశ్చ సమాదాయ ధ్రువమాగమనం భవేత్. 22

అతడు సారథి యైనచో కౌరవుల నందరిని గెలిచి గోవులను మరలించి తెచ్చుట తథ్యము.

ఏవ ముక్తః స సైరంధ్ర్యా భగినీం ప్రత్యభాషత,
గచ్ఛ త్వ మనవద్యాఙ్గి తా మానయ బృహన్నలామ్. 23

సైరంధ్రి యిట్లు పలుకగా ఉత్తరుడు చెల్లెలితో ఓయమ్మా! వెళ్ళి! ఆ బృహన్నల నిటు తెమ్మా! అని పలికెను.

సా భ్రాత్రా ప్రేషితా శీఘ్ర మగచ్ఛ న్నర్తనాగృహమ్,
యత్రాస్తే స మహాబాహు శ్ఛన్నః సత్రేణ పాణ్డవః. 24

అట్లు అన్న పంపగా ఆమె మహాబాహువగు పాండవుడు గూఢముగా నున్న నర్తనశాలకు పరువున చనెను.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే
బృహన్నలా సారథ్యకథనే షట్త్రింశోఽధ్యాయః

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున
బృహన్నలసారథ్యమును గూర్చి చెప్పుట అను ముప్పది ఆరవ అధ్యాయము

## సప్తత్రింశోఽధ్యాయః – ముప్పది ఏడవ అధ్యాయము

బృహన్నలాం సారథిం కృత్వోత్తరస్య రణాయ ప్రస్థానమ్.

బృహన్నలను సారథిగా చేసికొని ఉత్తరుడు రణమునకు బయలుదేరుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

సా ప్రాద్రవత్ కాఞ్చనమాల్యధారిణీ
జ్యేష్ఠేన భ్రాత్రా ప్రహితా యశస్వినీ,
సుదక్షిణా వేదివిలగ్నమధ్యా
సా పద్మపత్త్రాభనిభా శిఖణ్డినీ. 1

సువర్ణహారములు గలది, సోదరునియిష్టమునుబట్టి నడచుకొను నది, వేదివంటి సన్నని నడుముగలది, పద్మపత్రములయందు విరాజిల్లు లక్ష్మివంటిదీప్తి కలది, నెమలియీకల భూషణములుగలదియు నగు ఆ ఉత్తర అన్న పంపగా పరుగున పోయెను.

తన్వీ శుభాఙ్గీ మణిచిత్రమేఖలా
మత్స్యస్య రాజ్ఞో దుహితా శ్రియా వృతా,
తన్నర్తనాగార మరాలపక్ష్మా
శతహ్రదా మేఘ మివాన్వపద్యత. 2

సన్ననిది, చక్కని అవయవములుగలది, మణులతో చేసిన చిత్రమైన మొలనూలుగలది, కాంతితో ఒప్పారునది, చక్కని వంపులుగల కనురెప్పలు గలది అగు విరాటుని పుత్రిక, మెరుపుతీగ మేఘములోనికి ప్రవేశించినట్లు, నర్తనశాలలోనికి ప్రవేశించెను.

సా హస్తిహస్తోపమసంహితోరూః
స్వనిన్దితా చారుదతీ సుమధ్యమా,
ఆసాద్య తం వై వరమాల్యధారిణీ
పార్థం శుభా నాగవధూ రివ ద్విపమ్. 3

1. సుదక్షిణా - అన్నయిష్టముప్రకారము నడచుకొనునది,
వేదివిలగ్నమధ్యా - వేదికవలె సన్నని నడుముకలది.
పద్మపత్రాభనిభా - పద్మపత్రములయందు ప్రకాశించు లక్ష్మివలె విరాజిల్లునది,
శిఖణ్డినీ - నెమలియీకలఅలంకారములుకలది.

ఏనుగుతొండములు రెండు చక్కగా అంటియున్నట్లున్న తొడలు, చక్కనిపలువరసయు, సన్ననినడుము, గొప్పహారములుగల ఆబాల ఆడుఏనుగు మగఏనుగుకడ కరిగినట్లు అర్జునుని సమీపించెను.

సా రత్నభూతా మనసః ప్రియార్చితా
సుతా విరాటస్య యథేన్ద్రలక్ష్మీః,
సుదర్శనీయా ప్రముఖే యశస్వినీ
ప్రీత్యాబ్రవీ దర్జున మాయతేక్షణా. 4

రత్నపు బొమ్మవంటిది, మనసునకు ప్రియమైనది, మన్నన కలది, ప్రతిష్ఠ పొందినది, విశాలమగు కన్నులు కలదియు నగు విరాటపుత్రిక ఇంద్రలక్ష్మి వలె అర్జునుని యెదుట నిలిచి ప్రీతితో పలుకరించెను.

సుసంహతోరూం కనకోజ్జ్వలత్వచం
పార్థః కుమారీం స తదాభ్యభాషత,
కి మాగమః కాఞ్చనమాల్యధారిణి !
మృగాక్షి ! కిం త్వం త్వరితేవ భామిని !
కిం తే ముఖం సున్దరి ! న ప్రసన్న
మాచక్ష్వ తత్త్వం మమ శీఘ్ర మఙ్గనే ! 5

చక్కగా అంటియున్న ఊరువులు, బంగారమువలె మెరయుచున్న దేహముగల ఆ కుమారిని గాంచి పార్థు డిట్లనెను: 'ఓ మృగాక్షీ! ఏమి యిటు వచ్చితివి? ఓ భామినీ! ఏదో తొందరతో వచ్చినట్లున్నావు? ఓసుందరీ! నీమోము ప్రసన్నముగా లేదేమి? అంగనా! విషయ మేమో త్వరగా చెప్పుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

స తాం దృష్ట్వా విశాలాక్షీం రాజపుత్రీం సఖీం తథా,
ప్రహస న్నబ్రవీద్ రాజన్ కి మాగమన మిత్యుత. 6

విశాలాక్షియు, ప్రాణసమయు నగు ఆరాజపుత్రిని చూచి అర్జునుడు నవ్వుచు 'నీ రాకకు కారణమేమి ?' యని పలికెను.

తమబ్రవీద్ రాజపుత్రీ సముపేత్య నరర్షభమ్
ప్రణయం భావ.యన్తీ సా సఖీమధ్య ఇదం వచః. 7

ఆ రాజపుత్రి నరవరుడగు నాతనిని సమీపించి వినయము తో చునట్లుగా సఖులనడుమ నిలిచి యిట్లు పలికెను.

గావో రాష్ట్రస్య కురుభిః కాల్యన్తే నో బృహన్నలే,
తా విజేతుం మమ భ్రాతా ప్రయాస్యతి ధనుర్ధరః. 8

ఓ బృహన్నలా ! మా ఆవులను కౌరవులు తోలుకొని పోవు చున్నారు. వారిని గెలుచుటకై మాయన్న విల్లుగొని అరుగు చున్నాడు.

నాచిరం నిహత స్తస్య సంగ్రామే రథసారథిః,
తేన నా స్తి సమః సూతో యోఽస్య సారథ్య మాచరేత్. 9

ఆతనిరథసారథి ఈనడుమనే యుద్ధమున చనిపోయెను. అత నితో సమముగా సారథ్యము చేయగల సూతుడు కానరాడు.

తస్మై ప్రయతమానాయ సారథ్యర్థం బృహన్నలే,
ఆచచక్షే హయజ్ఞానే సైరంధ్రీ కౌశలం తవ. 10

ఓ బృహన్నలా ! సారథికై మాయన్న ప్రయత్నించు చుండగా సైరంధ్రి నీకు గుఱ్ఱముల విషయమున గల నేర్పును గూర్చి వక్కాణించినది.

అర్జునస్య కిలాసీ స్త్వం సారథి ర్దయితః పురా,
త్వయాజయత్ సహాయేన పృథివీం పాణ్డవర్షభః. 11

1. ప్రణయం భావయన్తీ - వినయము తోచునట్లుగా.

మునుపు నీవు అర్జునునకు ప్రియమైన సారథివట! నీవు తోడుగా ఆ పాండవశ్రేష్ఠుడు భూమి నంతటిని గెలిచెనట!

సా సారథ్యం మమ భ్రాతుః కురు సాధు బృహన్నలే,
పురా దూరతరం గావో హ్రియన్తే కురుభిర్హి నః. 12

బృహన్నలా అట్టి నీవు మా అన్నకు చక్కగా రథము నడపుము. కౌరవులు చాలదూరము గోవులను తోలుకొని పోకముందే మీరు బయలు దేరవలయును.

అథైతద్ వచనం మేఽద్య నియుక్తా న కరిష్యసి,
ప్రణయా దుచ్యమానా త్వం పరిత్యక్ష్యామి జీవితమ్. 13

నేడు నేను చెప్పినమాట చేయవో, ఇదిగో వినయముతో పలుకుచున్నాను, ప్రాణములను వదలెదను.

ఏవ ముక్త స్తు సుశ్రోణ్యా తయా సఖ్యా పరంతపః,
జగామ రాజపుత్రస్య సకాశ మమితౌజసః. 14

ఇట్లా సుశ్రోణి పలుకగా ఆ చెలితో కూడి పరంతపుడగు అర్జునుడు చక్కని దేహసౌష్ఠవముగల రాజపుత్రునికడ కరిగెను.

తమావ్రజన్తం త్వరితం ప్రభిన్నమివ కుఞ్జరమ్,
అన్వగచ్ఛద్ విశాలాక్షీ గజం గజవధూరివ. 15

త్వరత్వరగా మదగజము వలె నడచుచున్న ఆతనిని ఆ విశాలాక్షి ఏనుగును వెంట నంటిన ఆడయేనుగువలె అనుసరించెను.

దూరాదేవ తు తాం ప్రేక్ష్య రాజపుత్రోఽభ్యభాషత,
త్వయా సారథినా పార్థః ఖాణ్డవేఽగ్ని మతర్పయత్. 16

ఆ బృహన్నలను దూరమునుండియే చూచి రాజపుత్రుడు ఇట్లు పలికెను. పార్థుడు నిన్ను సారథిగా గొని ఖాండవమున అగ్నిదేవుని తృప్తిపరచెనట.

పృథివీ మజయత్ కృత్స్నాం కున్తీపుత్రో ధనంజయః,
సైరంధ్ర్యా త్వం సమాచష్టే సాహి జానాతి పాణ్డవాన్. 17

కుంతీపుత్రుడగు ధనంజయుడు నీ సారథ్యము వలననే సమస్త భూమిని గెలిచెను. సైరంధ్రి నిన్ను గూర్చి చెప్పినది. ఆమె పాండవుల నెరిగినదియే కదా!

సంయచ్ఛ మామకా నశ్వాం స్తథైవ త్వం బృహన్నలే,
కురుభి ర్యోత్స్యమానస్య గోధనాని పరీప్సతః. 18

కౌరవులతో యుద్ధమునకు పోవుచున్నాను. గోవులను మరలింప గోరుచున్నాను. ఓ బృహన్నలా! నీవు నా గుఱ్ఱములకు సారథి వగుము.

అర్జునస్య కిలాసీ స్త్వం సారథి ర్దయితః పురా,
త్వయాజయత్ సహాయేన పృథివీం పాణ్డవర్షభః. 19

నీవు మున్ను అర్జునునకు ప్రియమైన సారథివట! నీవు తోడుగా నాతడు భూమినంతటిని గెలిచెనట.

ఏవ ముక్తా ప్రత్యువాచ రాజపుత్రం బృహన్నలా,
కా శక్తి ర్మమ సారథ్యం కర్తుం సంగ్రామ మూర్ధని. 20

ఉత్తరు డిట్లనగా బృహన్నల రాజపుత్రునితో ఇట్లు పలికెను: 'మొనతలలో నిలిచి సారథ్యము చేయు శక్తి నా కెక్కడిది?'

గీతం వాయది వా నృత్యం వాదిత్రం వా పృథగ్విధమ్,
తత్ కరిష్యామి భద్రం తే సారథ్యంతు కుతో మమ. 21

పాటయో, ఆటయో లేక ఆయా వాద్యములను పలికించుటయో చేయగలను కాని, నీ పున్నెమామె, నాకు సారథ్య మెక్కడిది!

ఉత్తర ఉవాచ - ఉత్తరుడిట్లు పలికెను.

బృహన్నలే గాయనో వా నర్తనో వా పునర్భవ,
క్షిప్రం మే రథమాస్థాయ నిగృహ్ణీష్వ హయోత్తమాన్. 22

బృహన్నలా ! పాటగాడవో ఆటగాడవో తరువాత నగుదువు. ముందు నారథమెక్కి గుఱ్ఱములను నడపుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

స తత్ర నర్మసంయుక్త మకరోత్ పాణ్డవో బహు,
ఉత్తరాయాః ప్రముఖతః సర్వం జాన న్నరిందమః. 23

ఆ శత్రుమర్దనుడు అన్నియు తెలిసినవాడయ్యు ఉత్తర ముందు వేళాకోళపు పనులు చాల చేసెను.

ఊర్ధ్వ ముత్క్షిప్య కవచం శరీరే ప్రత్యముఞ్చత,
కుమార్య స్తత్ర తం దృష్ట్వా ప్రాహసన్ పృథులోచనాః. 24

కవచమును తలక్రిందుగా పైకెత్తి శరీరమునకు తొడిగెను. అది చూచి కన్నులింత చేసికొని బాలికలు పెద్దగా నవ్విరి.

సతు దృష్ట్వా విముహ్యన్తం స్వయమే వోత్తర స్తతః,
కవచేన మహార్హేణ సమనహ్యాద్ బృహన్నలామ్. 25

ఉత్తరుడట్లు పొరపడుచున్న ఆతనిని గాంచి స్వయముగా గొప్ప విలువగల కవచమును బృహన్నలకు తొడిగెను.

స బిభ్రత్ కవచం చాగ్ర్యం స్వయమప్యంశుమత్ప్రభమ్,
ధ్వజం చ సింహ ముచ్ఛ్రిత్య సారథ్యే సమకల్పయత్. 26

ఆతడు తనకును సూర్యునివలె వెలుగొందుచున్న కవచమును తొడిగికొని సింహధ్వజమెత్తి బృహన్నలను సారథ్యమున కూర్చుకొనెను.

ధనూంషి చ మహార్హాణి బాణాం శ్చ రుచిరాన్ బహూన్,
ఆదాయ ప్రయయౌ వీరః సబృహన్నలసారథిః. 27

బృహన్నల సారథిగాగల ఆవీరుడు గొప్పవిలువగల ధనుస్సులను, కాంతిగల బాణములను పెక్కింటిని గ్రహించి బయలుదేరెను.

అథో _త్తరా చ కన్యాశ్చ సఖ్య స్తా మబ్రువం _స్తదా,
బృహన్నలే ఆనయేథా వాసాంసి రుచిరాణి చ. ౨౮

పాఞ్చాలికార్థం చిత్రాణి సూక్ష్మాణి చ మృదూని చ,
విజిత్య సంగ్రామగతాన్ భీష్మద్రోణముఖాన్ కురూన్. ౨౯

అంత ఉ _త్తరయు చెలులగు కన్యలును బృహన్నలతో నిట్లనిరి. 'బృహన్నలా ! యుద్ధమునకు వచ్చిన భీష్ముడు, ద్రోణుడు మున్నగు కౌరవులను గెలిచి సన్ననివి, మె _త్తనివి, అందమైనవి అగు వస్త్రములను బొమ్మలకై తెచ్చిపెట్టుము.

ఏవం తా బ్రువతీః కన్యాః సహితాః పాణ్డునన్దనః,
ప్రత్యువాచ హసన్ పార్థో మేఘదున్దుభినిఃస్వనః. ౩౦

ఇట్లా కన్యలందరు కూడి పలుకుచుండగా అర్జునుడు నవ్వుచు మేఘమువంటి, దుందుభివంటి కంఠస్వరముతో ఇట్లు పలికెను.

బృహన్నలోవాచ - బృహన్నల యిట్లు పలికెను.

యద్యు _త్తరోఽయం సంగ్రామే విజేష్యతి మహారథాన్,
అథాహరిష్యే వాసాంసి దివ్యాని రుచిరాణి చ. ౩౧

ఈ ఉ _త్తరకుమారుడు యుద్ధమున మహారథులను గెలిచినచో తప్పక దివ్యములు, రుచిరములునైన వస్త్రములను తెత్తును.

...ాన్,
౩౨

...ములు, పతాక

...ం.

...ను.

వైశమ్పాయన ఉవాచ -

స్త్రియశ్చ కన్యాశ్చ ద్విజాశ్చ సువ్రతాః
ప్రదక్షిణం చక్రుః రథోచు రజ్గనాః 33

ఉత్తమమగు రథమున బృహన్నలతో కూడియున్న మహా భుజుడగు ఉత్తరుని గాంచి కన్యలు, స్త్రీలు, చక్కనినిష్ఠగల బ్రాహ్మణులు ప్రదక్షిణము చేసిరి. పిదప స్త్రీలిట్లు పలికిరి.

యదర్జునస్యర్ష భతుల్యగామినః
పురాభవత్ ఖాణ్డవదాహమంగలమ్.
కురూన్ సమాసాద్య రణే బృహన్నలే
సహోత్తరేణాద్య తదస్తు మజ్గలమ్. 34

ఓ బృహన్నలా! పూర్వము సుందరమగు వృషభమువలె నడచు అర్జునునకు ఖాండవదహనమున నెట్టి శుభము కలిగెనో ఇప్పుడు ఉత్తరునితో కూడి కౌరవుల నెదుర్కొనుచున్న నీకు అట్టి మంగళమే సిద్ధించుగాక!

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే
ఉత్తరనిర్యాణం నామ సప్తత్రింశోఽధ్యాయః

ఇది శ్రీమహాభారత విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున
ఉత్తరుడు వెడలుట అను ముప్పది యేడవ అధ్యాయము

## అష్టత్రింశోఽధ్యాయః - ముప్పది యెనిమిదవ అధ్యాయము

బిభ్యత ముత్తరమాశ్వాస్యార్జునేన తస్య రథే సమారోపణమ్.

భయపడుచున్న ఉత్తరుని ఓదార్చి అర్జునుడు ఆతనిని రథ మెక్కించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

స రాజధాన్యా నిర్యాయ వైరాటి రకుతోభయః,
ప్రయాహీత్యబ్రవీత్ సూతం యత్ర తే కురవోగతాః. 1

ఆవిరాటునికుమారుడు ఎందును భయములేనివాడై రాజధానిని వెలువడి సారథితో ఆ కౌరవులెందుబోయిరో అచటికి పోనిమ్మని పలికెను.

సమవేతాన్ కురూన్ సర్వాన్ జిగీషూ నవజిత్య వై,
గా స్తేషాం క్షిప్రమాదాయ పునరేష్యామ్యహం పురమ్. 2

గెలుపొందగోరి యిటకు చేరిన కౌరవులనందరను చిత్తుగా ఓడించి వారికడనున్నగోవులను గ్రహించి ఒక్కపెట్టున పురమునకు అరుగుదును.

తతస్తాం శ్చోదయామాస సదశ్వాన్ పాణ్డునన్దనః,
తేహయా నరసింహేన నోదితా వాతరంహసః,
ఆలిఖన్త ఇవాకాశ ముహాహుః కాఞ్చనమాలినః. 3

అంత పాండుసందనుడు ఆ మంచిగుఱ్ఱములను అదలించెను. నరవరుడగు ఆతడట్లు తోలగా బంగారుమాలలుగల ఆ గుఱ్ఱములు ఆకాశము నొరసికొనుచు పరువెత్తినవి.

నాతిదూర మథో గత్వా మత్స్యపుత్ర ధనంజయౌ,
అవేక్షేతా మమిత్రఘ్నౌ కురూణాం బలినాం బలమ్. 4

అల్లంత దూరముననే శత్రు సంహారకులగు ఉత్తర ధనంజయులు బలవంతులగు కౌరవులసేనను గాంచిరి.

శ్మశాన మభితో గత్వా ఆససాద కురూనథ,
తాం శమీ మన్వవీక్షేతాం వ్యూఢానీకాంశ్చ సర్వశః. 5

శ్మశానము వైపుగా నరిగి కౌరవులను సమీపించిరి. ఆ జమ్మిచెట్టును, చక్కగా మోహరించిన మొగ్గరములుగల సేనను చూచిరి.

తదనీకం మహత్ తేషాం విబభౌ సాగరోపమమ్,
సర్పమాణ మివాకాశం వనం బహులపాదపమ్. 6

పెద్దది యగు ఆసేన సముద్రమువలె ప్రకాశించినది. చెట్లు సమృద్ధిగా గల ఒకఅడవి ఆకాశమునకు చరచర ప్రాకుచున్నదా! అన్నట్లుండెను.

దదృశే పార్థివో రేణు ర్జనిత స్తేన సర్వతా,
దృష్టిప్రణాశో భూతానాం దివస్పృక్ కురుసత్తమ. 7

ఓ కురువరా! సాగుచున్న సేనవలన రేగిన దుమ్ము జీవుల చూపును రూపుమాపుచు ఆకాశమునంటుచు ఉత్తరునకు కానవచ్చెను.

తదనీకం మహద్ దృష్ట్వా గజాశ్వరథసంకులమ్,
కర్ణదుర్యోధనకృపై ర్గుప్తం శాన్తనవేన చ, 8
ద్రోణేన చ సపుత్రేణ మహేష్వాసేన ధీమతా,
హృష్టరోమా భయోద్విగ్నః పార్థం వైరాటి రబ్రవీత్. 9

ఏనుగులతో, గుఱ్ఱములతో, రథములతో, నిండినది; కర్ణుడు, దుర్యోధనుడు, కృపుడు, గొప్పవిలుకాడు ధీమంతుడు పుత్రసహితుడు నగు ద్రోణుడు అనువారు కాపాడుచున్నది. యునగు ఆ గొప్ప సేనను చూచి ఒడలు గగుర్పొడువగా భయము వలన చెదరిన గుండెతో విరాటునిపుత్రుడు అర్జునునితో ఇట్లు పలికెను.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

నోత్సహే కురుభి ర్యోద్ధుం రోమహర్షం హి పశ్యమే.

నేను కౌరవులతో యుద్ధమాడ జాలను. నామేన గగుర్పాటు చూడు.

బహు ప్రవీర మత్యుగ్రం దేవై రపి దురాసదమ్,
ప్రతియోద్ధుం న శక్ష్యామి కురుసైన్యమనన్తకమ్. 10

౯. హృష్టరోమా - గగుర్పాటు నొందినవాడు;

అందు వీరాగ్రేసరులు చాలమంది కలరు. అది పరమ భయంకరముగా నున్నది. దేవతలు కూడ దానిని సమీపింపజాలరు. అంతులేని ఆ కురుసేనను ఎదిరించుటకు నాకు శక్తి లేదు.

నాలంసే భారతీం సేనాం ప్రవేష్టుం భీమకార్ముకామ్,
రథనాగాశ్వకలిలాం పత్తిధ్వజ సమాకులామ్. 11

ఈ భారతుల సేన భయంకరములగు విల్లులతో, రథములతో గుఱ్ఱములతో ఏనుగులతో మహాగహనమై యున్నది. పదాతులతో, ధ్వజములతో నిండియున్నది. దీనిని ప్రవేశింపజాలను.

దృష్ట్వైవహి పరానాజౌ మనః ప్రవ్యథతీవ మే,
యత్ర ద్రోణశ్చ భీష్మశ్చ కృపః కర్ణో వివింశతిః, 12

అశ్వత్థామా వికర్ణశ్చ సోమదత్తశ్చ బాహ్లికః,
దుర్యోధన స్తథా వీరో రాజా చ రథినాం వరః. 13

ద్యుతిమన్తో మహేష్వాసాః సర్వే యుద్ధవిశారదాః. 14

ఇక్కడ ద్రోణుడు, భీష్ముడు, కృపుడు, కర్ణుడు, వివింశతి, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుడు, బాహ్లికుడు, వీరుడు రాజు రథికులలో శ్రేష్ఠుడునగు దుర్యోధనుడు - వీరందరు పెద్ద పెద్ద ధనువులతో, గొప్ప తేజస్సుతో యుద్ధమున ఆరితేరిన వారై ఉన్నారు. ఇట్టి శత్రువులను యుద్ధమున చూచినంతనే గుండె కుమిలిపోవుచున్నట్లున్నది.

[మత్తా ఇవ మహానాగా యుక్తధ్వజ పతాకినః,
నీతిమన్తో మహేష్వాసా సర్వాస్త్ర కృత నిశ్చయాః,
దుర్జయాః సర్వ సైన్యానాం దైవైరపి సవాసవైః.

12. కలిలామ్ - చొరశక్యము కాని దానిని.

పెద్దపెద్ద ధ్వజములపై ఎగురుచున్న పతాకములు కలవారు, యుద్ధనీతి బాగుగా నెఱిగినవారు, అస్త్రవిద్యలలో ఆరితేరినవారు, గొప్పధనుస్సులు కలవారు నగు ఈయోధులు మదించిన మహా గజములవలె నున్నారు. దేవతలందరు ఇంద్రునితో కూడి వచ్చినను వీరిని గెలువ శక్యము కాదు.

పతాకినశ్చ మాతఙ్గాః సధ్వజాశ్చ మహారథాః,
విప్రకీర్ణాః కృతోద్యోగా వాజినశ్చిత్ర భూషితాః,
తాన్ జేతుం సమరే శూరాన్ దుర్బుద్ధి రహ మాగతః.

ఏనుగులు పతాకలతో కూడి యున్నవి. మహారథులు ధ్వజము లెత్తి ఉన్నారు. చిత్రములగు భూషణములు గలిగిన గుఱ్ఱములు అందందు నిలిచి యుద్ధమునకు దూకుచున్నవి. ఇట్టి శూరులను గెలుచుటకై బుద్ధిమాలిన నేను ఇటకు వచ్చితిని.]

హృషితాని చ రోమాణి కశ్మలం చాగతం మమ. 15

నా రోమములు నిక్కబొడుచుకొన్నవి. నాకు మూర్ఛ వచ్చి పడినది.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

అవిజాతో విజాతస్య మాత్స్యాద్ ధూర్తస్య పశ్యతః,
పరిదేవయతే మన్దః సకాశే సవ్యసాచినః. 16

కపటవేషము ధరించినవాడును, అసాధారణుడును అగు కవ్వడి చూచుచుండగా మందబుద్ధి యగు ఉత్తరుడు మొఱకుతనముతో సామాన్యజనుని వలె ఏడువసాగెను.

త్రిగర్తాన్ మే పితా యాతః శూన్యే సమ్ప్రణిధాయ మామ్,
సర్వాం సేనా ముపాదాయ న మే సన్తీహ సైనికాః. 17

15. కశ్మలమ్ - మూర్ఛ
16. అవిజాతః- జాత మనగా సామాన్యము, విజాతుడనగా పోయిన సామాన్యము గలవాడు అనగా అసాధారణుడు. అవిజాతుడనగా అట్టివాడు కానివాడు - అనగా సామాన్యుడు.

మా నాయన ఎవ్వరులేని నగరమున నన్నొక్కనినుంచి సేన నంతటిని తీసికొని త్రిగర్తులపై కరిగెను. నాకిచట సైనికులు లేరు.

సోఽహ మేకో బహూన్ బాలః కృతాస్త్రాన్ అకృతశ్రమః,
ప్రతి యోద్ధుం న శక్ష్యామి నివర్తస్వ బృహన్నలే. 18

బాలుడను, ఒంటివాడను, అస్త్రవిద్యలో పరిశ్రమ చేయలేదు. ఆవల అస్త్రములందారి తేరినవారు చాలమంది కలరు. వారిని నేనెదుర్కొనజాలను. అయ్యో ! బృహన్నలా తేరు మరలింపుము.

బృహన్నలోవాచ - బృహన్నల యిట్లు పలికెను.

భయేన దీన రూపోఽసి ద్విషతాం హర్ష వర్ధనః,
న చ తావత్ కృతం కర్మ పరైః కిఞ్చి ద్రణాజిరే. 19

ఓయీ ! ఇంతవరకు శత్రువులు యుద్ధభూమిలో చేసినది ఆ వంతయులేదు. నీవూరక భయముతో బేలమోము పెట్టుచున్నావు. శత్రువులకు సంతోషమును పెంచుచున్నావు.

స్వయమేవ చ మామాత్థ వహ మాం కౌరవాన్ ప్రతి,
సోఽహం త్వాం తత్ర నేష్యామి యత్రైతే బహులా ధ్వజాః 20

కౌరవులకడకు కొనిపొమ్మని స్వయముగా నీవేకదా చెప్పితివి. ఇదిగో పతాకలు అధికముగా గల వారి కడకు నిన్ను చేర్తును.

మధ్య మామిష గృధ్రాణాం కురూణా మాతతాయినామ్,
నేష్యామి త్వాం మహాబాహో పృథివ్యా మపి యుధ్యతామ్. 21

అల్లరిమూకలు, మాంసమునకు వలె పశువులకై దురాశతో వచ్చినవారు భూమి నిమిత్తముగా యుద్ధము చేయువారు నగు నీ కౌరవులనడుమకు నిన్ను కొనిపోవుదును.

---

21. ఆమిష గృధ్రాణామ్ - మాంసము పైకి వ్రాలు గ్రద్దల వలె గోవులపై ఆశతో వచ్చినవారు;

తథా స్త్రీషు ప్రతిశ్రుత్య పౌరుషం పురుషేషు చ,
కత్థమానోఽభి నిర్యాయ కిమర్థం న యుయుత్ససే. 22

అట్లు అచట ఆడువారికి మాట ఇచ్చి, మగవారి ముందు బీరములాడి పురము వెలువడి యిప్పుడు యుద్ధమాడనందు వేమి!

న చేద్ విజిత్య గా స్తా స్త్వం గృహాన్ వై ప్రతియాస్యసి,
ప్రహసిష్య న్తి వీరా స్త్వాం నరా నార్యశ్చ సంగతాః. 23

నీవాగోవులను గెలువక ఇంటికి వెడలితివో, ఆడువారు మగవారు అందరుమూగి నిన్ను వెక్కిరింతురు.

అహ మప్యత్ర సైరంధ్ర్యా ఖ్యాతా సారథ్యకర్మణి,
న చ శక్ష్యా మ్యనిర్జిత్య గాః ప్రయాతుం పురంప్రతి. 24

ఆ సైరంధ్రియు రథమునడపుపనిలో నన్ను పెద్దగా చెప్పినది. కావున గోవులను మరలింపక పురమున కేగజాలను.

స్తోత్రేణ చైవ సైరంధ్ర్యా స్తవ వాక్యేన తేన చ,
కథం నయుధ్యేయ మహం కురూన్ సర్వాన్ స్థిరోభవ. 25

సైరంధ్రి చేసిన ఆ పొగడికవలనను, ఆ నీ వాక్యమువలనను నేనీ కౌరవులతో పోరాడక యెట్లుందును! నీవు చెదరక నిలువుము.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

కామం హరన్తు మత్స్యానాం భూయాంసః కురవో ధనమ్,
ప్రహసన్తు చ మాం నార్యో నరా వాపి బృహన్నలే. 26

సంగ్రామే న చ కార్యం మే గావో గచ్ఛన్తు చాపిమే,
శూన్యం మే నగరం చాపి పితుశ్చైవ బిభేమ్యహమ్. 27

బృహన్నలా! ఆ కౌరవులు మత్స్యదేశపు సొమ్మంతయు కొల్లగొట్టనిమ్ము. ఆడువారును మగవారును నన్నుచూచి నవ్విన

నప్పుదురుగాక! ఆ గోవులు పోయిన పోవుగాక. నాకు యుద్ధమున పనిలేదు. నగరము శూన్యముగా నున్నది. మావారియన ఏమన్నా భయముగానున్నది.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇత్యుక్త్వా ప్రాద్రవద్ భీతో రథాత్ ప్రస్కన్ద్య కుణ్డలీ,
త్యక్త్వా మానం చ దర్పంచ విసృజ్య సశరం ధనుః. 28

ఇట్లుపలికి కుండలములు ధరించిన ఉత్తరుడు భయముతో రథమునుండి దుమికి, అభిమానము దర్పమును వదలి బాణములతో పాటు చాపమును పారవైచి పరువెత్తెను.

బృహన్నలోవాచ - బృహన్నల యిట్లనెను.

నైష శూరైః స్మృతో ధర్మః క్షత్రియస్య పలాయనమ్,
శ్రేయస్తు మరణం యుద్ధే నభీతస్య పలాయనమ్. 29

క్షత్రియుడు పారిపోవుట అనునది శూరులమదిలో మెదలరాని అధర్మము. భయపడి పారిపోవుటకంటె యుద్ధమున మరణమే మేలు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ ముక్త్వా తు కౌన్తేయః సోవప్లుత్య రథోత్తమాత్,
తమన్వధావద్ ధావన్తం రాజపుత్రం ధనంజయః,
దీర్ఘాం వేణీం విధున్వానః సాధు రక్తే చ వాససీ. 30

ఇట్లు పలికి కుంతీకుమారుడు పొడవైన జడను విదలించుచు, ఎఱ్ఱని వస్త్రములను సవరించుకొనుచు మేలుజాతి రథమునుండి దూకి పారిపోవుచున్న రాజకుమారుని వెంటబడెను.

31

విధూయ వేణీం ధావన్త మజానన్తోఽర్జునం తదా,
సైనికాః ప్రాహసన్ కేచిత్ తథారూప మవేక్ష్య తమ్.

జడలను విదలించి పరువెత్తుచున్నవాడర్జునుడని యెఱుగక సైనికులు కొందరు ఆరూపమును గాంచి నవ్విరి.

తం శీఘ్రమభిధావన్తం సంప్రేక్ష్య కురవోఽబ్రువన్, 32
క ఏష వేష సంఛన్నో భస్మనేవ హుతాశనః,
కించిదస్య యథా పుంసః కించిదస్య యథా స్త్రియః. 33

అట్లు వేగముగా వెంటబడుచున్న వానిని చూచి కౌరవులిట్లు అనుకొనిరి. "ఎవరీతడు? బూడిదలకప్పిననిప్పువలె వేషముతో మరుగు పడియున్నాడు. కొంత మగతనము కొంత ఆడుతనము కానవచ్చు చున్నది.

సారూప్యమర్జునస్యేవ క్లీబరూపం బిభర్తి చ,
తదేవైతచ్ఛిరోగ్రీవం తౌ బాహూ పరిఘోపమౌ,
తద్వదేవాస్య విక్రాన్తం నాయమన్యో ధనంజయాత్. 34

అర్జునునితో సమానమగురూపము కానవచ్చుచున్నది. పేడి రూపము పొందియున్నాడు. ఆతల, ఆమెడ, గడియల వంటి ఆ చేతులు, ఆ నడకతీరు అంతయునతనిదే. ఈతడు అర్జునునికంటె ఇతరుడు కాడు.

అమరేష్వివ దేవేన్ద్రో మానుషేషు ధనంజయః,
ఏకః కోఽస్మానుపాయాయాదన్యో లోకే ధనంజయాత్. 35

దేవతలలో దేవేంద్రుడెట్టివాడో మానవులలో అర్జునుడట్టి వాడు. ధనంజయుడు కాక మరియొకడు ఒక్కడై మనపై ఎత్తి వచ్చునా?

ఏకః పుత్రో విరాటస్య శూన్యే సంనిహితః పురే,
స ఏష కిల నిర్యాతో బాలభావాన్న పౌరుషాత్. 36

శూన్యమగు పురమున విరాటుని పుత్రుడొక్కడు మిగిలియుం డును. పౌరుషముతో కాక పిల్లతనముతో నిట్లు వెడలివచ్చి యుండును.

సత్రేణ నూనం ఛన్నం హి చరన్తం పార్థమర్జునమ్,
ఉత్తరః సారథిం కృత్వా నిర్యాతో నగరాద్ బహిః. 37

కపటముతో గుట్టుగా మెలగుచున్న కుంతీతనయుడగు అర్జునుని సారథిని చేసికొని ఈతడు పురము వెలుపలికి వచ్చియుండును. ఇది నిశ్చయము.

స నో మన్యామహే దృష్ట్వా భీత ఏష పలాయతే,
తం నూన మేవ ధావన్తం జిఘృక్షతి ధనంజయః. ౩౮

ఆతడు మనలనుగాంచి భీతుడై పారిపోవుచున్నాడు. అట్లు పోవుచున్నవానిని అర్జునుడు పట్టుకొనగోరుచున్నాడు. ఇది తథ్యము.

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇతి స్మ కురవః సర్వే విమృశన్తః పృథక్ పృథక్,
నచ వ్యవసితుం కిఞ్చి దుత్తరం శక్నువన్తితే,
ఛన్నం తథా తం సత్రేణ పాణ్డవం ప్రేక్ష్య భారత. ౩౯

ఓ భారతా! కౌరవులందరు ఇట్లు వేరువేరుగా విమర్శించుచు, కపటముతో గూఢముగా ఉన్న అర్జునుని చూచి ఒక నిర్ణయమునకు రాజాలరైరి.

[దుర్యోధన ఉవాచేదం సైనికాన్ రథసత్తమాన్,
అర్జునో వాసుదేవో వా రామః ప్రద్యుమ్న ఏవ వా,
తే హి నః ప్రతి సంయాతుం సంగ్రామే నచ శక్నుయుః.

అంత దుర్యోధనుడు రథికవరులగు సైనికులతో ఇట్లు పలికెను. అర్జునుడో, వాసుదేవుడో, బలరాముడో, ప్రద్యుమ్నుడో ఎవరైననేమి? వారు మనలను యుద్ధమున నెదిరింపజాలరు.

అన్యో వా క్లీబరూపేణ యద్యా గచ్ఛేద్ గవాంపదమ్
అర్పయిత్వా శరైస్తీక్ష్ణైః పాతయిష్యామి భూతలే.

పేడి వేసమున వాడెవడైన కానిమ్ము. గోవులున్నచోటికి వచ్చినా! వాడిబాణములు ప్రయోగించి నేలపై పడగూల్తును.

కథ మేకతర స్తేషాం సమస్తాన్ యోధయేత్ కురూన్,

వారిలో నొక్కడు కురుయోధులందరితో నెట్లుపోరగలడు.

అర్జునో నేతి చేత్యేనం నవ్యవస్యన్తి తే పునః,
ఇతి స్మ కురవః సర్వే మన్త్రయన్తో మహారథాః.

అర్జునుడని, కాదని వారిలో వారు ఆలోచనలు చేయుచు ఆమహారథులగు కౌరవులు ఒక నిర్ణయమునకు రాజాలరైరి.

దృఢ వేధీ మహాసత్త్వః శక్రతుల్యపరాక్రమః,
అద్యాగచ్ఛతి యో యోద్ధుం సర్వం సంశయితం బలమ్,
నచాప్యన్యం నరం తత్ర వ్యవస్యన్తి ధనంజయాత్.

గట్టిపోటరి, మహాబలశాలి, ఇంద్రునితో సమానమగు పరాక్రమము గలవాడు ఇప్పుడు పోరాడవచ్చును అని సేనయంతయు సంశయావస్థలో పడినది. అర్జునునికాక ఇంకొకనిని వారు నిర్ణయింప జాలకుండిరి]

ఉత్తరం తు ప్రధావన్త మభిద్రుత్య ధనంజయః,
గత్వా పదశతం తూర్ణం కేశపక్షే పరామృశత్. 40

పరువెత్తుచున్న ఉత్తరుని వెంటబడి ధనంజయుడు నూరడుగులు వేసి శీఘ్రముగా జుట్టుపట్టుకొనెను.

సోఽర్జునేన పరామృష్టః పర్యదేవయ దార్తవత్,
బహులం కృపణం చైవ విరాటస్య సుతస్తదా. 41

ఇట్లర్జునుడు పట్టుకొనగా విరాటుని కుమారుడు దీనముగా పలుమాటలాడుచు ఎంతో బాధపొందినవానివలె విలపించెను.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు చెప్పెను.

శృణుయా స్త్వం హి కల్యాణి బృహన్నలే సుమధ్యమే,
నివర్తయ రథం క్షిప్రం జీవన్ భద్రాణి పశ్యతి. 42

ఓ కల్యాణీ! బృహన్నలా! నామాట విను. రథము మరలింపుము. బ్రదికియున్నచో భద్రములను పడయవచ్చు.

శాతకుమ్భస్య శుద్ధస్య శతం నిష్కాన్ దదామి తే,
మణీ నష్టౌ చ వైదూర్యాన్ హేమబద్ధాన్ మహాప్రభాన్. ౪౩

మేలిమిబంగారుకుండతో నూరు నిష్కముల నిచ్చెదను. మంచికాంతిగల, బంగారమున పొదిగిన వైదూర్యమణుల నెనిమిదింటి నిత్తును.

హేమదణ్డ ప్రతిచ్ఛన్నం రథం యుక్తం చ సువ్రతైః,
మత్తాంశ్చ దశ మాతఙ్గాన్ ముఞ్చ మాం త్వం బృహన్నలే. ౪౪

బృహన్నలా! నన్ను వదలుము. బంగారు కడ్డీలతోకూడిన మంచిగుఱ్ఱములు లాగెడు రథమిత్తును, మదించిన ఏనుగులను పదింటి నిత్తును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ మాదీని వాక్యాని విలపన్త మచేతసమ్,
ప్రహస్య పురుషవ్యాఘ్రో రథస్యాన్తిక మానయత్. ౪౫

ఈ మొదలైన పలుకులతో మతిదప్పి ఏడ్చుచున్న ఆ ఉత్తరుని చూచి నవ్వి పురుషవరేణ్యుడగు అర్జునుడు రథముకడకు గొనివచ్చెను.

అథైన మబ్రవీత్ పార్థో భయార్తం నష్టచేతసమ్,
యది నోత్సహసే యోద్ధుం శత్రుభిః శత్రుకర్షణ,
ఏహి మే త్వం హయాన్ యచ్ఛ యుధ్యమానస్య శత్రుభిః. ౪౬

భయపీడితుడై మతిదప్పిన ఆ ఉత్తరునితో అర్జును డిట్లనెను. ఓయీ! శత్రువులతో పోరాడదలపనిచో రా! నేను యుద్ధమొనరింతును. గుఱ్ఱములను పట్టుము.

ప్రయాహ్యేతద్ రథానీకం మద్బాహుబలరక్షితః,
అప్రధృష్యతమం ఘోరం గుప్తం వీరైర్మహారథైః. 47

నా బాహుబలము నిన్ను రక్షించును. మహారథులగు వీరులు కాపాడు ఈ ఘోరమైన, అణాపశక్యముకాని రథముల గుంపులోనికి ప్రవేశింపుము.

మా భైస్త్వం రాజపుత్రాగ్ర్య క్షత్రియోఽసి పరంతప,
కథం పురుషశార్దూల శత్రుమధ్యే విషీదసి. 48

ఓయీ! రాజకుమారులలో అగ్రేసరుడవు. క్షత్రియుడవు. శత్రుసంహారకా! భయపడకుము. శత్రువులనడుమ నీరుగారిపోయెద వేల?

అహం వై కురుభిర్యోత్స్యే విజేష్యామి చ తే పశూన్,
ప్రవిశ్యైత ద్రథానీక మప్రధృష్యం దురాసదమ్. 49

మిక్కిలి పౌరుషముతో చొరశక్యముకాని ఈరథసేనను ప్రవేశించి నేను కౌరవులతో పోరాడుదును. నీ గోవులను గెలుతును.

యన్తా భవ నరశ్రేష్ఠ యోత్స్యేఽహం కురుభిః సహ.

ఓ నరవరా! నీవు నాకు సారథి వగుము. నేను కౌరవులతో యుద్ధమాడుదును.

ఏవం బ్రువాణో బీభత్సుర్వైరాటి మపరాజితః,
సమాశ్వాస్య ముహూర్తం త ముత్తరం భరతర్షభ. 50

ఇట్లు ఓటమి యెఱుగని వివ్వచ్చుడు విరాటతనయునితో పలుకుచు కొంతవడి ఆతనిని ఊరడించెను.

తత ఏనం విచేష్టన్త మకామం భయపీడితమ్,
రథ మారోపయామాస పార్థః ప్రహరతాం వరః. 51

యుద్ధవీరులలో శ్రేష్ఠుడగు అర్జునుడు, భయపీడితుడు, విశృతచేష్టలుగలవాడునగు ఉత్తరుని బలవంతముగా రథమెక్కించెను.

[గాణ్డీవం పున రాదాతు ముపాయా త్తాం శమీం ప్రతి,
ఉత్తరం స సమాశ్వాస్య కృత్వా యన్తార మర్జునః.

ఇట్లు ఉత్తరుని తేర్చి సారథిగా చేసికొని అర్జునుడు గాండీవ మును తిరిగి గ్రహించుటకై ఆ జమ్మిచెట్టుకడ కరిగెను ]

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే ఉత్తరాశ్వాసనే అష్టత్రింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున ఉత్తరునూరడించుట అను ముప్పది యెనిమిదవ అధ్యాయము.

## ఏకోన చత్వారింశోఽధ్యాయః - ముప్పదితొమ్మిదవ అధ్యాయము

ద్రోణకృత మర్జున పరాక్రమ ప్రశంసనమ్.

ద్రోణుడు అర్జునుని పరాక్రమమును పొగడుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తం దృష్ట్వా క్లీబవేషేణ రథస్థం నరపుంగవమ్,
శమీ మభిముఖం యాన్తం రథ మారోప్యచోత్తరమ్. 1

భీష్మద్రోణ ముఖా స్తత్ర కురవో రథి సత్తమాః
విత్రస్త మనసః సర్వే ధనంజయ కృతాద్ భయాత్. 2

పేడి రూపమున రథమున నున్నవాడు, ఉత్తరుని రథ మెక్కించుకొని జమ్మిచెట్టున కెదురుగా పోవుచున్నవాడు, నరవరుడు వగు అర్జునుని చూచి రథికశ్రేష్ఠులగు భీష్మద్రోణాది కౌరవులకు అతనివలన కలిగినభయముచే గుండెలు చెదరినవి.

తానవేక్ష్య హతోత్సాహా నుత్పాతా నపి చాద్భుతాన్,
గురుః శస్త్రభృతాం శ్రేష్ఠో భారద్వాజోఽ భ్యభాషత. 3

ఉత్సాహము చచ్చిన ఆ కౌరవులను, అశ్చర్యపు గొలుపు పాడుశకునములను గాంచి శస్త్రధారులలో శ్రేష్ఠుడగు ఆచార్యుడు ద్రోణుడు ఇట్లు పలికెను.

చణ్డాశ్చ వాతాః సంవాన్తి రూక్షాః శర్కరవర్షిణః,
భస్మవర్ణప్రకాశేన తమసా సంవృతం నభః. 4

తీవ్రములు, భయంకరములువగు దుమ్మెత్తి పోయు గాలులు వీచుచున్నవి. ఆకాశమున బూడిదరంగు చీకటి క్రమ్మినది.

రూక్షవర్ణాశ్చ జలదా దృశ్యన్తేఽద్భుత దర్శనాః,
నిఃసరన్తి చ కోశేభ్యః శస్త్రాణి వివిధాని చ. 5

మేఘములు ముదురు వన్నెతో కన్నులకు వింతగా తోచుచున్నవి. వివిధములగు ఆయుధములు ఒరలనుండి వెలుపలికి జారుచున్నవి.

శివాశ్చ వినదన్త్యేతా దీప్తాయాం దిశి దారుణాః,
హయా శ్చాశ్రూణి ముఞ్చన్తి ధ్వజాః కమ్పన్త్యకమ్పితాః. 6

ఇవిగో పట్టపగలు దారుణములై నక్కలరచుచున్నవి. గుఱ్ఱములు కన్నీరు కార్చుచున్నవి. ధ్వజములు వానియంతటనవి ఊగిపోవుచున్నవి.

యాదృశా న్యత్ర రూపాణి సంధృశ్యన్తే బహూని చ,
యత్తా భవన్త స్తిష్ఠన్తు సాధ్వసం సముపస్థితమ్. 7

ఇట్టివి మరియు వనేకరూపములు కానవచ్చుచున్నవి. మీరందరు సిద్ధముగా నుండుడు. మనకేదో భయము ప్రాప్తించినది.

రక్షధ్వమపి చాత్మానం వ్యూహధ్వం వాహినీమపి,
వైశసం చ ప్రతీక్షధ్వం రక్షధ్వం చాపి గోధనమ్. 8

7. యత్తాః - సిద్ధపడినవారు;
8 వైశసమ్ - వైరము లేక యుద్ధము.

మిమ్ము మీరు రక్షించుకొనుడు. సేనను చక్కగా అమర్చు కొనుడు. యుద్ధమునకు సిద్ధముకండు. గోధనమును కాపాడుడు.

ఏష వీరో మహేష్వాసః సర్వశస్త్రభృతాం వరః,
ఆగతః క్లీబవేషేణ పార్థో నాస్త్యత్ర సంశయః. 9

వీడుగో వీరుడు, గొప్ప విలుకాడు, ఆయుధము పట్టినవారిలో మిన్న, పేడివేసమున అర్జునుడే వచ్చెను. ఇందు సందియము లేదు.

నదీజ లఙ్కేశవనారికేతు
ర్నగాహ్వయో నామ నగారిసూనుః,
ఏషోఽఙ్గనావేషధరః కిరీటీ
జిత్వా వయం నేష్యతి చాద్య గావః. 10

ఓ భీష్మాచార్యా ! హనుమంతుడు పతాకయందుగలవాడు, చెట్టుపేరుగలవాడు (అర్జునమని ఒక చెట్టు - అర్జునుడని భావము), ఇంద్రుని కుమారుడు, ఆడుకట్టు కట్టి ఈదుర్యోధనుని గెలిచి గోవులను తోలుకొనిపోవచ్చినాడు. ఆ దుర్యోధనుని రక్షింపుము.

స ఏష పార్థో విక్రాన్తః సవ్యసాచీ పరన్తపః,
నాయుద్ధేన నివర్తేత సర్వైరపి సురాసురైః. 11

10. లఙ్కా - ఈశ, వన, అరి, కేతుః - లంకకు ప్రభువగు రావణుని వనమును నశింపజేసిన హనుమంతుడు ధ్వజముగాగలవాడు - అర్జునుడు, నగ-ఆహ్వయః, చెట్టుపేరుగా గలవాడు - (అర్జునమని ఒక చెట్టు) : నగ - అరి, సూనుః - పర్వతముల శత్రువగు ఇంద్రుని కుమారుడు, అఙ్గనావేషధరః - ఆడుకట్టు కట్టినవాడు. యమ్ - ఎవనిని (ఏదుర్యోధనుని, జిత్వా - గెలిచి, తమ్ - ఆ వః - మీ, గాః - ఆవులను, నేష్యతి - తోలుకొనిపోవునో, దుర్యోధనుని, అవ - కాపాడుము, ఇది గూఢ భాషణము, ఇందు నదీజలమ్, కేశవ, నారికేతుః, జిత్వా, వయమ్, గావః - అను పదములు శ్రోతలను తికమక పెట్టుటకై ప్రయోగింపబడినవి. నదీజ, లఙ్కేశ .... తుః, జిత్వా, అవ, యం, గాః, వః - ఇత్యాదిగా పదవిభజనము చేసికొనవలయును.

నిక్కముగా నితడు మహాపరాక్రమము కలిగి శత్రువుల రూపు మాపు అర్జునుడు. కుడి ఎడమ చేతులయందు బాణముల ప్రయోగించు నేర్పుకలవాడు. దేవతలు రాక్షసులు మొత్తముగా ఎత్తివచ్చినను యుద్ధముచేయక వెనుదిరుగడు.

క్లేశితశ్చ వనే శూరో వాసవేనాపి శిక్షితః,
అమర్షవశ మాపన్నో వాసవప్రతిమో యుధి,
నేహాస్య ప్రతియోద్ధార మహం పశ్యామి కౌరవాః. 12

ఈతనిని వనమున కష్టపెట్టియుంటిమి. దేవేంద్రుడును ఈతనికి విద్యలు నేర్పియుండెను. మనపై తీవ్రకోపముతో వచ్చియున్నాడు. యుద్ధమున నతనికి ఇంద్రుడే సాటి. కౌరవులారా! వీనికెదురు నిలిచి పోరాడు మొనగాడు నాకు కానవచ్చుటలేదు.

మహాదేవోఽపి పార్థేన శ్రూయతే యుధి తోషితః,
కిరాతవేష ప్రచ్ఛన్నో గిరౌ హిమవతి ప్రభుః. 13

సర్వ సమర్థుడగు మహాదేవుడును కిరాతవేషముతో తెలియరాకుండ వచ్చి హిమవత్పర్వతమున నీతనితో పోరి మెచ్చుకొనెనని వినికిడి.

కర్ణ ఉవాచ - కర్ణుడిట్లు పలికెను.
సదా భవాన ఫాల్గునస్య గుణైరస్మాన్ వికత్థసే,
న చార్జునః కలాపూర్ణో మమ దుర్యోధనస్య చ. 14

తమరెప్పుడు అర్జునుని గుణములతో మమ్ముల బెదరించుచుందురు. నిజమునకు అర్జునుడు నాయొక్కయు దుర్యోధనుని యొక్కయు పదునారవభాగమునకు కూడ సాటిరాడు.

దుర్యోధన ఉవాచ - దుర్యోధను డిట్లు పలికెను.
యద్యేష పార్థో రాధేయ కృతం కార్యం భవేన్మమ,
జ్ఞాతాః పునశ్చరిష్యన్తి ద్వాదశాబ్దాన్ విశాంపతే. 15

14. కలాపూర్ణః - పదునారవ భాగమునకు చాలినవాడు.

కర్ణా ! ఈత డర్జునుడే అయినచో మనపని సిద్ధించినట్లే. వీరు మన కెరుకపడినచో తిరిగి పండ్రెండేండ్లు అడవిలో తిరుగుదురు.

అథైష కశ్చి దేవాన్యః క్లీబవేషేణ మానవః,
శరై రేనం సునిశితైః పాతయిష్యామి భూతలే. 16

అట్లుగాక పేడిరూపము తాల్చిన మరియొక డెవ్వడైన అగుచో నా వాడి బాణములతో వానిని నేల కూల్తును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్మిన్ బ్రువతి తద్వాక్యం ధార్తరాష్ట్రే పరన్తప.
భీష్మో ద్రోణః కృపో ద్రౌణిః పౌరుషం తదపూజయన్. 17

ఆ ధృతరాష్ట్రకుమారుడు అట్లు పలుకగా భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామయు ఆతని పౌరుషమును మెచ్చుకొనిరి.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే
అర్జున ప్రశంసాయా మేకోనచత్వారింశోఽధ్యాయః
ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున
అర్జునప్రశంస యను ముప్పదితొమ్మిదవ అధ్యాయము

## చత్వారింశోఽధ్యాయః – నలుబదియవ అధ్యాయము

శమీవృక్షా దస్త్ర మవతారయితు ముత్తరం ప్రత్యర్జున స్యాదేశః

జమ్మిచెట్టునుండి అస్త్రమును దింపుటకు అర్జునుడు ఉత్తరుని ఆదేశించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తాం శమీ ముపసంగమ్య పార్థో వైరాటి మబ్రవీత్,
సుకుమారం సమాజ్ఞాయ సంగ్రామే నాతికోవిదమ్. 1

అర్జునుడు ఆ శమీవృక్షమును దరిజేరి, సుకుమారుడనియు, యుద్ధమున చక్కని ప్రజ్ఞలేనివాడనియు నెరిగి ఉత్తరునితో ఇట్లు పలికెను.

సమాదిష్టో మయా క్షిప్రం ధనూం ష్యవహరోత్తర,
నేమాని హి త్వదీయాని సోఢుం శక్ష్యన్తి మే బలమ్,
భారం చాపి గురుం వోఢుం కుంజరం వా ప్రమర్దితుమ్, 2
మమ వా బాహువిక్షేపం శత్రూనిహ విజేష్యతః.

ఉత్తరా! నా మాటమీద త్వరగా ధనువులను దింపుము. ఈ నీ ఆయుధములు నా బలమును తట్టుకొనజాలవు. పెద్దబరువును మోయజాలవు. ఏనుగును మర్దింపజాలవు. శత్రువులను జయించు నా చేతివిసరును తాళజాలవు.

[నైభిః కామ మలం కర్తుం కర్మ వై జయికం త్విహ,
అతిసూక్ష్మాణి హ్రస్వాని సర్వాణి చ మృదూని చ,
ఆయుధాని మహాబాహో తవైతాని పరన్తప.

ఈ నీ ఆయుధములతో విజయకార్యము చేయనలవికాదు. ఇవి మిక్కిలి చిన్నవి, పొట్టివి, మెత్తనివి.]

తస్మాద్ భూమింజయారోహ శమీ మేతాం పలాశినీమ్. 3

కావున ఓ భూమింజయా! దట్టముగా ఆకులుగల ఈ జమ్మి నెక్కుము.

అస్యాం హి పాణ్డుపుత్రాణాం ధనూంషి నిహితాన్యుత,
యుధిష్ఠిరస్య భీమస్య బీభత్సో ర్యమయో స్తథా,
ధ్వజాః శరాశ్చ శూరాణాం దివ్యాని కవచాని చ. 4

1. పలాశినీమ్ - ఎక్కువ ఆకులు గలది;

ధర్మరాజు, భీముడు, అర్జునుడు, కవలలు ఈ చెట్టుపై తమ ధనువులను నిక్షేపించిరి. అట్లే తమ ధ్వజములను, బాణములను, దివ్యములగు కవచములను ఆ శూరులిందు భద్రము చేసిరి.

అత్ర చైత న్మహావీర్యం ధనుః పార్థస్య గాణ్డివమ్, 5
ఏతం శతసహస్రేణ సమ్మితం రాష్ట్రవర్ధనమ్,
వ్యాయామసహ మత్యర్థం తృణరాజసమం మహత్. 6
సర్వాయుధ మహామాత్రం శత్రు సంబాధకారకమ్,
సువర్ణ వికృతం దివ్యం శ్లక్ష్ణ మాయత మవ్రణమ్,
అలం భారం గురుం వోఢుం దారుణం చారుదర్శనమ్. 7

ఇక్కడ అర్జునుని గాండీవమను దొడ్డ శక్తిగల విల్లు కలదు. అది నూరువేల విండ్ల యంతటిది. శత్రువులకు ఉపద్రవమును పెల్లుగా చేయునది. ఎంతటిశ్రమకైన నోర్చును. తాటిచెట్టంత పెద్దది. ఆయుధము లన్నింటికన్న మిన్నయైనది. శత్రువులను చీల్చి చెండాడునది. సువర్ణముతో చేయబడినది. దివ్యమైనది. పొడవైనది. మొక్కవోనిది. ఎట్టి బరువైనను సహించునది. భయంకరమైనది. చూడ ముచ్చట అయినది.

తాదృశా న్యేవ సర్వాణి బలవ న్తి దృఢాని చ,
యుధిష్ఠిరస్య భీమస్య బీభత్సో ర్యమయో స్తథా. 8

ధర్మజ భీమార్జున నకులసహదేవుల విండ్లుకూడ అట్లే బలముగలవి, దృఢమైనవి.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే అర్జునాస్త్రకథనే చత్వారింశోఽధ్యాయః

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున అర్జునుని అస్త్రముగూర్చి చెప్పుట అను నలువదియవ అధ్యాయము

---

6. తృణరాజః - తాటిచెట్టు,
7. మహామాత్రమ్ - గొప్ప ప్రమాణము కలది.

## ఏకచత్వారింశోఽధ్యాయః - నలుబదియొకటవ అధ్యాయము

అర్జునస్యాదేశే నోత్తరః కర్తృకం శమీవృక్షాత్ పాణ్డవానాం దివ్యధనురాదీనా మవతారణమ్.

అర్జునుని ఆదేశముచేత ఉత్తరుడు శమీవృక్షమునుండి పాండవుల దివ్యధనురాదికమును దింపుట.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

అస్మిన్ వృక్షే కిలోద్బద్ధం శరీర మితి నః శ్రుతమ్,
తదహం రాజపుత్రః సన్ స్పృశేయం పాణినా కథమ్. 1

ఈ చెట్టుపై శవమొకటి కట్టబడెనని మేము వినియుంటిమి. రాజపుత్రుడనై యుండి దానిని నేను చేతితో ఎట్లు తాకుదును ?

నైవం విధం మయా యుక్త మాలబ్ధుం క్షత్రయోనినా,
మహతా రాజపుత్రేణ మన్త్రయజ్ఞవిదా సతా. 2

మంత్రములు యజ్ఞములు తెలిసిన సత్పురుషుడను. గొప్ప రాజపుత్రుడను. క్షత్రియవనితకు పుట్టినవాడను. అట్టినేను ఇట్టివానిని తాకుట తగదు.

స్పృష్టవన్తం శరీరం మాం శవవాహ మివాశుచిమ్,
కథం వా వ్యవహార్యం వై కుర్వీథా స్త్వం బృహన్నలే. 3

బృహన్నలా! శరీరమును ముట్టి శవమును మోసినవానివలె అపవిత్రుడనైన నన్ను నీవెట్లు ఉపయోగించుకొందువు ?

బృహన్నలోవాచ - బృహన్నల యిట్లు పలికెను.

వ్యవహార్యశ్చ రాజేన్ద్ర శుచిశ్చైవ భవిష్యసి,
ధనూం ష్యేతాని మాభైస్త్వం శరీరం నాత్ర విద్యతే. 4

2. ఆలబ్ధుమ్ - తాకుటకు.

అయ్యా! రాజేంద్రా! నీవు నాకు పనికివత్తువు. నీవు దించి వేయగుదువు. ఇవి ధనుస్సులు. భయపడకుము. ఇట శవము లేదు.

దాయాదం మత్స్యరాజస్య కులే జాతం మనస్వినామ్,
త్వాం కథం నిన్దితం కర్మ కారయేయం నృపాత్మజ. 5

మత్స్యరాజు కొడుకవు, మానవంతుల కులమున పుట్టినవాడవు అగు నిన్ను నీచకార్యమున కెట్లు వినియోగింతును?

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ ముక్తః స పార్థేన రథాత్ ప్రస్కన్ద్య కుణ్డలీ,
ఆరురోహ శమీవృక్షం వైరాటి రవశ స్తదా. 6

అర్జును డిట్లు పలుకగా విరాటుని కుమారుడు రథమునుండి దుమికి బింకముమాని శమీవృక్షము నెక్కెను.

తమన్వశాస చ్ఛత్రుఘ్నో రథే తిష్ఠన్ ధనంజయః,
అవరోపయ వృక్షాగ్రాద్ ధనూంష్యేతాని మా చిరమ్. 7

పరివేష్టన మేతేషాం క్షిప్రం చైవ వ్యపానుద.

శత్రుసంహారకుడగు అర్జునుడు రథమున నిలిచి ఉత్తరునితో 'ఓయీ చెట్టుకొననుండి ధనువులను దింపుము. ఆలసింపకుము. త్వరగా కట్టు ఊడదీయుము' అని శాసించెను.

సోఽపహృత్య మహార్హాణి ధనూంషి పృథువక్షసామ్,
పరివేష్టనపత్రాణి విముచ్య సముపానయత్. 8

ఆతడును వెడదరొమ్ములుగల పాండవుల వెలగల ధనువులను క్రిందికి తెచ్చి కట్టుగా చుట్టిన ఆకులను సడలించి వెలికి తీసెను.

తథా సంనహనా న్యేషాం పరిముచ్య సమన్తతః,
అపశ్యద్ గాణ్డీవం తత్ర చతుర్భి రపరైః సహ. 9

8. అపహృత్య - చెట్టునుండి దింపి,
9. సంనహనాని - మోపులను,

అట్లా కట్టులను వదలించి పూర్తిగా వెలికి తీసి తళుకున్న వాల్గింటితో పాటు గాండీవమును చూచెను.

తేషాం విముచ్యమానానాం ధనుషా మర్కవర్చసామ్,
వినిశ్చేరుః ప్రభా దివ్యా గ్రహాణా ముదయే ష్వివ. 10

అట్లు కట్లు సడలించుచుండగా సూర్యుని కాంతులవంటి కాంతులుగల ఆ ధనువుల దివ్యప్రభలు గ్రహములుదయించునప్పుడు వలె అన్నివైపులకు ప్రసరించినవి.

స తేషాం రూప మాలోక్య భోగినా మివ జృంభతామ్,
హృష్టరోమా భయోద్విగ్నః క్షణేన సమపద్యత. 11

నోరు తెరచి మీదపడుచున్న పాములవలె నున్న వాని రూపమును గాంచి ఉత్తరుడు గగుర్పాటు నొంది భయముతో గుండె చెదరి క్షణకాలములో నిలువద్రొక్కుకొనెను.

సంస్పృశ్య తాని చాపాని భానుమన్తి బృహన్తి చ,
వైరాటి రర్జునం రాజ న్నిదం వచన మబ్రవీత్. 12

కాంతులతో తళతళలాడుచు పెద్దగా నున్న ఆ చాపములను తాకి ఉత్తరుడు అర్జునునితో ఇట్లు పలికెను.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి
ఉత్తరగోగ్రహే అస్త్రావరోపణే ఏకచత్వారింశోఽధ్యాయః.
ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున
ఉత్తరగోగ్రహమున అస్త్రములను దింపుటయను నలువదియొకటవ అధ్యాయము

## ద్విచత్వారింశోఽధ్యాయః – నలువది రెండవ అధ్యాయము

ఉత్తరస్య బృహన్నలాం ప్రతి పాణ్డవానా మస్త్రశస్త్ర విషయే ప్రశ్నః

ఉత్తరుడు బృహన్నలను పాండవుల అస్త్రశస్త్రములను గూర్చి ప్రశ్నించుట.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

బిన్దవో జాతరూపస్య శతం యస్మిన్ నిపాతితాః,
సహస్రకోటి సౌవర్ణాః కస్యైతద్ ధను రుత్తమమ్. 1

నూరు బంగారుచుక్కలు కూర్చినదియు, గొప్పబలము గలదియు, ఉత్తమమును అగు ఈ ధనువు ఏకీర్తిమంతునిది?

వారణా యత్ర సౌవర్ణాః పృష్ఠే భాసన్తి దంశితాః,
సు పార్శ్వం సుగ్రహం చైవ కస్యైతద్ ధను రుత్తమమ్. 2

వెనుకవైపు బంగారుపువ్వులు అలంకరింపబడినదియు, చక్కని ప్రక్కభాగములు కలదియు, సన్నని నడిమిభాగము కలదియునగు ఈ ఉత్తమధను వెవ్వరిది?

తపనీయస్య శుద్ధస్య షష్టి ర్యస్యేన్ద్రగోపకాః,
పృష్ఠే విభక్తాః శోభన్తే కస్యైతద్ ధనురుత్తమమ్. 3

దీని వెనుక మేలిమిబంగారముతో చేయబడిన ఆర్ద్రపురుగుల వంటి పువ్వులు అరువది కలవు. అవి చక్కగా విడివిడిగా కానవచ్చుచున్నవి. ఈ ఉత్తమధను వెవ్వరిది?

సూర్యా యత్ర చ సౌవర్ణా స్త్రయో భాసన్తి దంశితాః,
తేజసా ప్రజ్వలన్తో హి కస్యైతద్ ధనురుత్తమమ్. 4

---

1. జాతరూపస్య - జాతమైన కీర్తికలవాని, సహస్రకోటి - సహస్ - అనగా బలము, సహస్ర - బలముగల, కోటి - అంచులు కలది, సహస్ శబ్దముపై కలది అనునర్థమున 'ర' ప్రత్యయముచేరగా 'సహస్ర' అయినది.
2. సుగ్రహమ్ - గ్రహమనగా పట్టుకొనుచోటు కనుక వింటినడిమిభాగము - చక్కని నడిమిభాగము కలది యని భావము,
3. తపనీయస్య - బంగారముయొక్క, ఇన్ద్రగోపకాః - ఆర్ద్రపురుగులవంటి పువ్వులు,

ఇదిగో దీనియందు మూడు బంగారు సూర్యబింబములు దీప్తులను వెలిగ్రక్కుచు అలంకరింపబడియున్నవి. ఈ శ్రేష్ఠమగు విల్లెవరిది?

శలభా యత్ర సౌవర్ణా స్తపనీయ విభూషితాః,
సువర్ణమణిచిత్రం చ కస్యైతద్ ధను రుత్తమమ్. 5

నల్లని అగురుతో చేయబడి బంగారముతో అలంకరింపబడిన మిడుతలు గలదియు, చుక్కలు కలదియు నగు ఈ గొప్ప విల్లెవరిది?

ఇమే చ కస్య నారాచాః సాహస్రా లోమవాహినః,
సమన్తాత్ కలధౌతాగ్రా ఉపాసంగే హిరణ్మయే. 6

చక్కని పక్షిఈకలతో వెండియంచులతో బంగారుపొదిలో వేలకొలదిగా ఉన్న ఈ బాణము లెవరివి?

విపాఠాః పృథవః కస్య గార్ధ్రిపత్రాః శిలాశితాః,
హారిద్రవర్ణాః సుముఖాః పీతాః సర్వాయసాః శరాః. 7

లావైన దండము కలిగి పెద్దవియై గ్రద్ద ఈకలు కలిగి రాతిపై వాడిదేరిన పసుపువన్నెతో అలరారు ఈ ఉక్కు శరములు ఎవరివి?

కస్యాయ మసిత శ్చాపః పఞ్చశార్దూల లక్షణః,
వరాహ కర్ణవ్యామిశ్రాన్ శరాన్ ధారయతే దశ.  8

5. సౌవర్ణాః - సువర్ణమనగా నల్లని అగురు, దానితో చేయబడినవి "సువర్ణశ్చ సువర్ణా చ కృష్ణాగురు మఖాంతరే" అని విశ్వము, తపనీయ విభూషితాః - బంగారముతో విరాజిల్లునవి, సువర్ణమణిచిత్రమ్ - మంచివన్నెగల మణులతో చిత్రమైనది.

6. సాహస్రాః - వేలకొలదిగా నున్నవి, లోమవాహినః - పక్షుల ఈకలుకలవి, ఉపాసఙ్గే - పొదియందు,

7. విపాఠాః - లావైనదండముగల బాణములు - "విపాఠః స్థూలదణ్డః స్యాత్" అని కల్పద్రుమము, గార్ధ్రిపత్రాః - గ్రద్దఈకలు కలవి, శిలాశితాః - అకుడాతియందు పదునుపెట్టబడినవి, పీతాః - కమ్మరిచేత పదునెక్కించు నీటిని త్రాగినవి, సర్వాయసాః - కేవలము ఉక్కుతో చేయబడినవి,

ఇదిగో ఈ విల్లు నల్లగా అయిదు పెద్దపులుల గుర్తులు కలిగి యున్నది. అడవిపంది చెవులవంటి ములుకులు గల పది బాణములను తాల్చియున్నది. ఇది ఎవ్వరిది?

కస్యేమే పృథవో దీర్ఘా శ్చన్ద్రబింబార్ధదర్శనాః,
శతాని సప్త తిష్ఠన్తి నారాచా రుధిరాశనాః. 9

పెద్దవి, పొడవుగానున్నవి, అర్ధచంద్రునివలె కానవచ్చుచున్నవి, రక్తమే అన్నముగా కలవి అగు ఏడునూర్ల బాణములున్నవి. ఇవి యెవరివి?

కస్యేమే శుకపత్రాభైః పూర్వైర్ధైః సువాససః,
ఉత్తరై రాయసైః పీతై ర్హేమపుఙ్ఖైః శిలాశితైః. 10

మొదటిసగము చిలుక రెక్కలవంటి వన్నెతో రెండవసగము బాగుగా పదునుపెట్టబడిన బంగారు ములుకులతో ఉన్న ఇనుప అమ్ములు కలవు. ఇవి యెవరివి?

గురుభారసహో దివ్యః శాత్రవాణాం భయంకరః,
కస్యాయం సాయకో దీర్ఘః శిలీపృష్ఠః శిలీముఖః. 11

ఇదిగో ఈ ఖడ్గము పొడవుగా నున్నది. పిడివద్ద ఆడు కప్ప బొమ్మ కలదు. అగ్రము కప్పముఖమువలె నున్నది. శత్రువులకు గుండెదడ పుట్టించును. ఎంతటి భారమునైనను సహించును. దివ్యముగా నున్నది. ఇది ఎవరిది?

వైయాఘ్రకోశే నిహితో హేమచిత్రో దురాసదః,
సుఫల శ్చిత్రకోశశ్చ కింకిణీసాయకో మహాన్. 12

పులితోలు ఒరలో ఉన్నదియు, బంగారు అలంకారములతో చిత్రమైనదియు, తాకుటకే అలవికానిదియు, అందమైన అంచు

11. శిలీ - ఆడుకప్ప, సాయకః - ఖడ్గము,
12. సుఫలః - చక్కని అంచుగలది.

కలదియు, చిత్రమైన పిడికలదియు, చిరుమువ్వలు గలదియునగు ఈ మహాఖడ్గము ఎవరిది ?

కస్య హేమత్సరు ర్దివ్యః ఖడ్గః పరమ నిర్మలః,
కస్యాయం విమలః ఖడ్గో గవ్యే కోశే సమర్పితః. 13

ఇదిగో ఈ ఖడ్గము బంగారుపిడితో పరమస్వచ్ఛముగా నున్నది. గోచర్మపు ఒరలో ఉంచబడినది ఇది ఎవరిది ?

హేమత్సరు రనాధృష్యో నైషధ్యో భారసాధనః,
కస్య పాఞ్చనఖే కోశే సాయకో హేమవిగ్రహః. 14

బంగారుపిడి కలిగి, పట్టశక్యముకానిదై, ఎంతటి బరువైన కార్యముకూడ సాధించునదియై నిషధదేశమున రూపొందినదియై బంగారు పూతకలదియై, మేకతోలు ఒరలో ఉన్న ఈ ఖడ్గ మెవ్వరిది ?

ప్రమాణరూప సంపన్నః పీత ఆకాశసంనిభః,
కస్య హేమమయే కోశే సుతప్తే పావకప్రభే. 15

బాగుగా కాకతీరి అగ్నివలె వెలుగొందుచున్న బంగారపు ఒరలో పదునుతీరి ఆకాశమువలె నల్లనివన్నెతో ప్రమాణమునకు తగిన రూపసంపదగల ఈఖడ్గ మెవ్వరిది !

నిస్త్రింశోఽయం గురుః పీతః సాయకః పర నిర్వ్రణః,
కస్యాయ మసితః ఖడ్గో హేమబిందుభి రావృతః. 16

13. గవ్యేకోశే - గోచర్మపు ఒరయందు,

14. నైషధ్యః - నిషధదేశమున రూపొందినది. పాఞ్చనఖే కోశే - మేకతోలు ఒరయందు - "పఞ్చనఖోఽజే కూర్మే" అని విశ్వము.

16. నిస్త్రింశః - ముప్పది అంగుళములకంటె మించిన పొడవుగలది, పర నిర్వ్రణః - మఱియొక ఆయుధముచేత మొక్కవోనిది.

ముప్పది అంగుళములను మించిన పొడవు కలదియు, ఇతరుల ఆయుధముల చేత మొక్కవోనిదియు మంచి పదునుగలదియు, బంగారుపూలతో నిండినదియునగు ఈ నల్లని ఖడ్గమెవ్వరిది ?

ఆశీవిషసమస్పర్శః పరకాయప్రభేదనః,
గురుభారసహో దివ్యః సపత్నానాం భయప్రదః. 17

త్రాచుపాము స్పర్శవంటి స్పర్శకలదియు, ఇతరుల దేహమును చీల్చివేయునదియు, ఎంతటి భారమునైనను సహించునదియు, శత్రువులకు భయము పుట్టించునదియునగు ఈ దివ్య ఖడ్గమెవ్వరిది !

నిర్దిశస్వ యథాతత్త్వం మయా పృష్టా బృహన్నలే,
విస్మయో మే పరో జాతో దృష్ట్వా సర్వమిదం మహత్. 18

ఓ బృహన్నలా ! నిన్నడుగుచున్నాను. వీని తత్త్వమును నాకు ఉన్నదున్నట్లు చెప్పుము. ఇది యంతయు చూడగా నాకు పరమాశ్చర్యము కలుగుచున్నది.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే ఉత్తరవాక్యం నామ ద్విచత్వారింశోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున ఉత్తరవాక్యమను నలుబది రెండవ అధ్యాయము.

## త్రిచత్వారింశోఽధ్యాయః — నలుబదిమూడవ అధ్యాయము

బృహన్నలా కర్తృకం పాణ్డవాయుధ పరిచయ దానమ్.

బృహన్నలచేసిన పాండవాయుధ పరిచయము.

బృహన్నలోవాచ - బృహన్నల యిట్లు చెప్పెను,

యన్మాం పూర్వ మిహాపృచ్ఛః శత్రుసేనాపహారిణమ్,
గాణ్డీవ మేతత్ పార్థస్య లోకేషు విదితం ధనుః. 1

నన్ను మొదట అడిగితివే, శత్రువులరూపుమాపు ఆధనువు గాండీవము అర్జుననిది. లోకమున ప్రసిద్ధికెక్కినది.

సర్వాయుధ మహామాత్రం శాతకుంభ పరిష్కృతమ్,
ఏత త్తదర్జునస్యాసీద్ గాణ్డీవం పరమాయుధమ్. 2

ఆయుధములన్నియు కలిసినంతటి ప్రమాణముకలదియు, కాంచనాలంకారములు కలదియునగు ఈ పరమాయుధము అర్జునుని గాండీవము.

యత్ తచ్ఛత సహస్రేణ సమ్మితం రాష్ట్రవర్ధనమ్,
యేన దేవాన్ మనుష్యాంశ్చ పార్థో విజయతే మృధే. 3

లక్షధనువుల పెట్టైనదియు, ఉపద్రవమును పెంచునదియునగు ఈ ధనువుతో అర్జునుడు యుద్ధమున దేవతలను మనుష్యులను గెలుచును.

చిత్ర ముచ్చావచై ర్వర్ణైః శ్లక్ష్ణ మాయత మవ్రణమ్,
దేవదానవగన్ధర్వైః పూజితం శాశ్వతీః సమాః. 4

బహువిధములగు వన్నెలతో చిత్రమైనదియు, పొడవైనదియు, నొక్కులుపడనిదియు అగు ఈ వింటిని చిరకాలము దేవతలు, దానవులు, గంధర్వులు పూజించిరి.

ఏతద్ వర్షసహస్రంతు బ్రహ్మా పూర్వమధారయత్,
తతో ఽనన్తర మేవాథ ప్రజాపతి రధారయత్, 5
త్రీణి పఞ్చ శతం చైవ శక్రో ఽశీతిచ పఞ్చచ.

5, 6. బ్రహ్మాదులు ధరించిన కాలము దేవమానము ప్రకారమే 8 వ శ్లోకము నందలి వర్షశబ్దమునకు 'వృష్టి' అనునర్థము స్వీకరించి, ఏటికి రెండు వర్షములని ప్రమాణము చూపి అరువదియైదు వర్షములనగా ముప్పదిరెండున్నర ఏండ్లని నీలకంఠులు ప్రతిపాదించిరి. వనవాసము 13 సంగలు, అంతకుముందు ద్రౌపదీధర్మరాజులున్న గృహమున కేగిన సందర్భమున ప్రాయశ్చిత్తముగా తీర్థములు తిరిగినవి 12 సంగలు, మరియు తత్పూర్వము దిగ్విజయ రాజసూయాదియాగములకై తిరిగినవి ఏడున్నర సంవత్సరములుకూడగా ముప్పది రెండున్నర వత్సరములని గాండీవము పొందినతరువాత గడచినట్లును నిరూపించెను.

దీనిని తొలుత బ్రహ్మ వేయి వత్సరములు తనకడనుంచుకొనెను. అటుపై ప్రజాపతి అయిదు వందల మూడు సంవత్సరములు తాల్చెను. ఆవెనుక ఇంద్రుడు ఎనుబదియైదు ఏండ్లు ధరించెను.

సోమః పఞ్చశతం రాజా తథైవ వరుణః శతమ్,
పార్థః పఞ్చ చ షష్టించ వర్షాణి శ్వేతవాహనః. 6

రాజైన చంద్రుడు అయిదు వందల సంవత్సరములు పట్టెను. వరుణుడు నూరేండ్లు తాల్చెను. తెల్లగుఱ్ఱములుగల అర్జునుడు ముప్పది రెండున్నర సంవత్సరములు ధరించెను.

మహావీర్యం మహాదివ్య మేత ద్ధను రు త్తమమ్,
ఏతత్ పార్థ మనుప్రాప్తం వరుణా చ్చారు దర్శనమ్. 7

గొప్పశక్తికలది, దివ్యమైనది, చూచుటకింపైనదియునగు ఆ ఈ ధనువు వరుణునివలన క్రమముగా అర్జునునకు లభించినది.

పూజితం సురమ ర్త్యేషు బిభ ర్తి పరమం వపుః,
సుపార్శ్వం భీమసేనస్య జాతరూపగ్రహం ధనుః,
యేన పార్థోఽజయత్ కృత్స్నాం దిశం ప్రాచీం పరంతపః. 8

దేవమనుష్యలోకములలో మన్ననకలదియు, చక్కని విగ్రహము కలదియు, తీర్చిదిద్దిన ప్రక్కభాగములు కలదియు, బంగారపు మధ్యభాగము కలదియునగు ధనువు భీమసేనునిది. దీనితో ఆశత్రుహంత తూర్పుదిక్కు నంతటిని జయించెను.

ఇన్ద్రగోపకచిత్రం చ య దేతచ్చారుదర్శనమ్,
రాజ్ఞో యుధిష్ఠరస్యైతద్ వై రాటే ధను రు త్తమమ్. 9

ఉత్తరా! ఆర్ద్రపురుగులతో చిత్రమై, చూడముచ్చటగొలుపు ఆ ఉత్తమధనువు యుధిష్ఠిర మహారాజులవారిది.

సూర్యా యస్మింస్తు సౌవర్ణా స్తపనీయ విచిత్రితాః,
తేజసా ప్రజ్వలన్తో వై నకులస్యైతదాయుధమ్. 10

బంగారపు సూర్యుల కాంతులతో తళతళలాడుచున్న ఆధనువు నకులునిది.

శలభా యత్ర సౌవర్ణా స్తపనీయ విచిత్రితాః,
ఏతన్మాద్రీసుతస్యాపి సహదేవస్య కార్ముకమ్. 11

నల్లని అగురుతో చేయబడి బంగారుభూషణములున్న మిడుతలు గల ఆధనువు మాద్రికొడుకగు సహదేవునిది.

యే త్విమే క్షురసంకాశాః సహస్రా లోమవాహినః,
ఏతేఽర్జునస్య వైరాటే శరాః సర్పవిషోపమాః. 12

పాము విషమువలెనున్నవియు, చురకత్తులవంటివియు, ఈకలు కలవియునగు ఆ కాంతితో వెలుగొందు వేలకొలది బాణములున్నవే అవి అర్జునునివి.

ఏతే జ్వలన్తః సంగ్రామే తేజసా శీఘ్రగామినః,
భవన్తి వీర స్యాక్షయ్యా వ్యూహతః సమరే రిపూన్. 13

ఈ బాణములు తేజస్సుతో మంటలను గ్రక్కుచుండును. వేగముతో చొచ్చుకొనిపోవును. యుద్ధమున శత్రువులను చీల్చుచున్న అర్జునునకు తరుగువోనివై యుండును.

యే చేమే పృథవో దీర్ఘా శ్చన్ద్రబింబార్ధ దర్శనాః,
ఏతే భీమస్య నిశితా రిపుక్షయకరాః శరాః, 14
హారిద్రవర్ణా యే త్వేతే హేమపుఙ్ఖాః శిలాశితాః.

పెద్దగా పొడవుగా అర్ధచంద్రునివలె కానవచ్చుచున్నవే, పచ్చనివన్నెతో ఆకురాతిపై వాడితేరి బంగారు పిడులతో ఉన్న ఆ శత్రుసంహారకములగు బాణములు భీమునివి.

నకులస్య కలాపోఽయం పఞ్చశార్దూల లక్షణః. 15
యేనాసౌ వ్యజయత్ కృత్స్నాం ప్రతీచీం దిశమాహవే,
కలాపో హ్యేష తస్యాసీ న్మాద్రీ పుత్రస్య ధీమతః. 16

అయిదు పులుల చిన్నెలుగల ఆచాపము నకులునిది. దీనితో నాతడు పశ్చిమదిక్కునంతటిని యుద్ధమున గెలిచెను.

యే త్విమే భాస్కరాకారాః సర్వపారసవాః శరాః,
ఏతే చిత్రక్రియోపేతాః సహదేవస్య ధీమతః. 17

సూర్యునివంటి చిన్నెలుకలవియు, పగవారిమూకలనెల్ల రూపుమాపునవియు, చిత్రమైన చేష్టలతో కూడినవియునగు ఈబాణములు బుద్ధిమంతుడగు సహదేవునివి.

యే త్విమే నిశితాః పీతాః పృథవో దీర్ఘవాససః,
హేమపుఙ్ఖా స్త్రిపర్వాణో రాజ్ఞ ఏతే మహాశరాః. 18

అవిగో వాడిగా, పచ్చగా, పెద్దగా, పొడవుగా, బంగారు పుంఖములు కలిగి, మూడు కణుపులతో ఉన్న ఈమహాశరములు ధర్మరాజువి.

య స్త్వయం సాయకో దీర్ఘః శిలీపృష్ఠః శిలీముఖః,
అర్జునస్యైవ సంగ్రామే గురుభారసహో దృఢః. 19

పిడివద్ద ఆడుకప్పబొమ్మయు, అగ్రమున కప్పవంటి ఆకారమును కలిగి పొడవైన ఆఖడ్గము అర్జునునిది. చాల గట్టిది. యుద్ధమున ఎంత బరువునైన తట్టుకొనునది.

వైయాఘ్రకోశః సుమహాన్ భీమసేనస్య సాయకః,
గురుభారసహో దివ్యః శాత్రవాణాం భయంకరః. 20

పులుతోలు ఒరలో ఉన్న ఆపెద్దఖడ్గము భీమసేనునిది. దివ్యమైనది. ఎంతగొప్పశ్రమకైనను ఓర్చునది. శత్రువులకు భయంకరమైనది.

---

17. సర్వపారసవాః - సమస్తమైన పరుల సమూహమును హింసించునవి.
పారమ్ - పరుల సముదాయము.

సుఫలశ్చిత్రకోశశ్చ హేమత్సరు రనుత్తమః,
నిస్త్రింశః కౌరవస్యైష ధర్మరాజస్య ధీమతః. 21

చిత్రమైన ఒర బంగారు పిడియు కలిగిన ఆ సర్వోత్తమమగు ఖడ్గము బుద్ధిమంతుడు కురువంశము వాడునగు ధర్మరాజుది.

యస్తు పాఞ్చనఖే కోశే నిహితశ్చిత్ర యోధనే,
నకులస్యైష నిస్త్రింశో గురుభారసహో దృఢః. 22

మేక తోలు ఒరలో ఉన్న ఆ ఖడ్గము నకులునిది. అది చిత్ర యుద్ధముల కుపయోగపడును చాల గట్టిది. ఎంతటి భారమునైన సహించును.

య స్త్వయం విపులః ఖడ్గో గవ్యే కోశే సమర్పితః,
సహదేవస్య విద్ధ్యేనం సర్వభారసహం దృఢమ్. 23

ఇదిగో గోచర్మపు ఒరలో ఉన్న ఈ వెడల్పుగల ఖడ్గము సహదేవునిది. ఎట్టి దెబ్బనైన ఓర్చునంత గట్టిది.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి
ఉత్తరగోగ్రహే ఆయుధవర్ణనం నామ త్రిచత్వారింశోఽధ్యాయః
ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున
ఉత్తరగోగ్రహమున ఆయుధ వర్ణన మను నలుబదిమూడవ అధ్యాయము

## చతుశ్చత్వారింశోఽధ్యాయః :- నలుబదినాల్గవ అధ్యాయము

అర్జున కర్తృకం స్వస్య భ్రాతౄణాం చోత్తరాయ యథార్థ పరిచయదానమ్.

అర్జునుడు తన్ను తనసోదరులను యథార్థముగా ఉత్తరునకు పరిచయము చేయుట.

---

22. చిత్ర యోధనే - చిత్రమగు యుద్ధమునకొఱకు, నిహితః- భద్రము చేయబడినది.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

సువర్ణవికృతా నీమా న్యాయుధాని మహాత్మనామ్,
రుచిరాణి ప్రకాశన్తే పార్థానా మాశు కారిణామ్. 1

మహాత్ములు, శీఘ్రముగా కార్యములను నెరవేర్చువారు నగు పాండవుల ఈ ఆ యుధములు సువర్ణమయములై మనోజ్ఞముగా ప్రకాశించుచున్నవి.

క్వనుస్వి దర్జునః పార్థః కౌరవ్యో వా యుధిష్ఠిరః,
నకులః సహదేవశ్చ భీమసేనశ్చ పాణ్డవః. 2

కుంతీపుత్రుడు ఆ అర్జునుడెక్కడ ఉండెనో గదా! కురువంశ వరుడు ధర్మరాజెట నుండెనో? నకులుడు, సహదేవుడు, ఆ భీముడును ఎందుండిరో?

సర్వ ఏవ మహాత్మానః సర్వా మిత్రవినాశనాః,
రాజ్య మక్షైః పరాకీర్య న శ్రూయన్తే కథంచన. 3

వారందరు మహాత్ములు శత్రువులందరిని మట్టుపెట్ట గలవారు పాచికలచేత రాజ్యమును కోల్పోయి, ఎందుబోయిరో వార్తకూడ వినరాలేదు.

ద్రౌపదీ క్వచ పాఞ్చాలీ స్త్రీ రత్న మితి విశ్రుతా,
జితా నక్షై స్తదా కృష్ణా తానే వాన్వగమద్ వనమ్. 4

స్త్రీ రత్నమని ప్రసిద్ధి కెక్కిన పాంచాల రాజపుత్రి ద్రౌపది ఎక్కడ? పాచికలతో ఓడిన పతులతో పాటే ఆ కృష్ణ ఆనాడు అడవి కరిగినది కదా!

అర్జున ఉవాచ - అర్జును డిట్లు చెప్పెను.

అహ మస్మ్యర్జునః పార్థః సభాస్తారో యుధిష్ఠిరః, 5
బల్లవో భీమసేనస్తు పితు స్తే రసపాచకః.

ఓయీ నేనే ఆ కుంతీపుత్రుడను అర్జునుడను. కొలువున నుండువాడు యుధిష్ఠిరుడు. మీ నాయనకు రుచికరములగు పదార్థములను వండిపెట్టు వల్లవుడే భీమసేనుడు.

అశ్వబన్ధోఽథ నకులః సహదేవస్తు గోకులే,
సైరంధ్రీం ద్రౌపదీం విద్ధి యత్కృతే కీచకా హతాః. 6

గుఱ్ఱములను పాలించినవాడు నకులుడు. గోశాలలందున్నవాడు సహదేవుడు. సైరంధ్రియే ద్రౌపది. ఆమెకారణముగనే కీచకులందరు చచ్చిరి.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

దశ పార్థస్య నామాని యాని పూర్వం శ్రుతాని మే,
ప్రబ్రూయాస్తాని యది మే శ్రద్దధ్యాం సర్వమేవ తే. 7

నేను మునుపు విన్న అర్జునుని పేర్లను పదింటిని నీవు చెప్పినచో ఈ నీ సంగతి అంతయు నమ్మెదను.

అర్జున ఉవాచ - అర్జునుడిట్లు పలికెను.

హన్త తేఽహం సమాచక్షే దశనామాని యాని మే,
వైరాటే శృణు తాని త్వం యాని పూర్వం శ్రుతాని తే. 8

ఓయీ విరాటకుమారా! నీవు పూర్వము విని యున్న ఆ నా పది నామములను చెప్పెదను వినుము.

ఏకాగ్రమానసో భూత్వా శృణు సర్వం సమాహితః.

మనస్సును చక్కగా పదిలపరచుకొని నేను చెప్పెదానిని శ్రద్ధగా వినుము.

అర్జునః ఫాల్గునో జిష్ణుః కిరీటీ శ్వేతవాహనః,
బీభత్సు ర్విజయః కృష్ణః సవ్యసాచీ ధనంజయః. 9

---

8. ఏకాగ్రమానసః - నరరూపుడనైన మహావిష్ణుస్వరూపుడనగు నా నామములు ఆ పదలందు స్మరించినచో విజయమును కలిగించును. కాన చెదరని మనసుతో వినుము అని తాత్పర్యము.

అర్జునుడు, ఫాల్గునుడు, జిష్ణువు, కిరీటి, శ్వేతవాహనుడు, బీభత్సువు విజయుడు, కృష్ణుడు, సవ్యసాచి ధనంజయుడు.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

కేనాసి విజయో నామ కేనాసి శ్వేతవాహనః,
కిరీటీ నామ కేనాసి సవ్యసాచీ కథం భవాన్. 10

ఏ కారణమున విజయుడవైతివి! ఏ కారణముతో శ్వేతవాహనుడవు. ఏ నిమిత్తముగా కిరీటి వయితివి? సవ్యసాచి యను పేరెట్లు కలిగినది?

అర్జునః ఫాల్గునో జిష్ణుః కృష్ణో బీభత్సు రేవ చ,
ధనంజయశ్చ కేనాసి బ్రూహి తన్మము తత్త్వతః. 11

అర్జునుడు, ఫాల్గునుడు, జిష్ణువు, కృష్ణుడు, బీభత్సువు, ధనంజయుడు - అను పేర్లు ఏ కారణముగా కలిగెను? ఉన్నదున్నట్లు నాకు చెప్పుము.

శ్రుతా మే తస్య వీరస్య కేవలా నామహేతవః,
తత్ సర్వం యది మే బ్రూయాః శ్రద్దధ్యాం సర్వమేవ తే. 12

నేనా వీరుని నామములే హేతువులచే కలిగెనో మునుపు విని యుంటిని. అది యంతయు నాకు నీవు చెప్పుదువేని నేను నమ్మెదను.

అర్జున ఉవాచ - అర్జునుడిట్లు చెప్పెను.

సర్వా ఞ్జనపదా ఞ్జిత్వా విత్తమాదాయ కేవలమ్,
మధ్యే ధనస్య తిష్ఠామి తేనాహు ర్మాం ధనంజయమ్. 13

దేశముల నన్నింటిని గెలిచి ఉన్న ధనమంతయు తెచ్చి దాని నడుమ నిలుతును. అందులకు నన్ను ధనంజయు డందురు.

అభిప్రయామి సంగ్రామే యదహం యుద్ధదుర్మదాన్,
నాజిత్వా వినివర్తామి తేన మాం విజయం విదుః. 14

యుద్ధమున యుద్ధదుర్మదులపైకి ఉరుకుదును. గెలువక మరలను. కావున నన్ను విజయు డందురు.

శ్వేతాః కాఞ్చనసన్నాహా రథే యుజ్యన్తి మే హయాః,
సంగ్రామే యుధ్యమానస్య తేనాహం శ్వేతవాహనః. 15

యుద్ధమున పోరునపుడు తెల్లనివి, బంగారుకవచములవియు నగు గుఱ్ఱములు నారథమును లాగును. ఆ కారణమున నన్ను శ్వేతవాహనుడందురు.

ఉత్తరాభ్యాం ఫల్గునీభ్యాం నక్షత్రాభ్యామహం దివా,
జాతో హిమవతః పృష్ఠే తేన మాం ఫాల్గునం విదుః. 16

చంద్రుడు ఉత్తరఫల్గునీ నక్షత్రముతో కూడియున్న వేళ పగటిభాగమున, హిమవత్పర్వత ప్రాంతమున పుట్టితిని, అందుచే నన్ను ఫాల్గునుడందురు.

పురా శక్రేణ మే దత్తం యుధ్యతో దానవర్షభైః,
కిరీటం మూర్ధ్ని సూర్యాభం తేనాహుర్మాం కిరీటినమ్. 17

పూర్వము రాక్షసులతో పోరునపుడు దేవేంద్రుడు నాతలపై సూర్యునివలె వెలుగొందు కిరీటముంచెను. దానివలన కిరీటి నయితిని.

న కుర్యాం కర్మ బీభత్సం యుధ్యమానః కథంచన,
తేన దేవమనుష్యేషు బీభత్సురితి విశ్రుతః. 18

యుద్ధముచేయుచు ఏవగొలుపు పని నెన్నటికిని చేయను. ఆ కారణమున దేవతలలో మనుష్యులలో నేను బీభత్సువనని ప్రసిద్ధి కెక్కితిని.

---

16. నక్షత్రాభ్యామ్ - ఉత్తరఫల్గుణీనక్షత్రములతో చంద్రుడుకూడియున్న కాలమున అని అర్థము.

18. బీభత్సుః - బధి కల్యాణే అను ధాతువునకు సన్ ప్రత్యయము చేరినరూపము, మంగళకార్యములు చేయఁగోరువాడని తాత్పర్యము.

ఉభౌ మే దక్షిణౌ పాణీ గాణ్డీవస్య వికర్షణే,
తేన దేవమనుష్యేషు సవ్యసాచీతి మాం విదుః. 19

గాండీవమును లాగుటలో నా రెండుచేతులును సమర్థములు. కావున దేవతలలో మానవులలో సవ్యసాచి యనుపేరు నాకుగల్గినది.

పృథివ్యాం చతురన్తాయాం వర్ణో మే దుర్లభః సమః,
కరోమి కర్మ శుక్లం చ తస్మాన్మామర్జునం విదుః. 20

ఈభూమి నాలుగు అంచులలో నా వన్నెకు సమమగు వన్నె ఎందును కానరాదు, శుద్ధమైన పనినే చేయుదును, దానివలన నన్ను అర్జునుడని యెరుగుదురు.

అహం దురాపో దుర్ధర్షో దమనః పాకశాసనిః,
తేన దేవ మనుష్యేషు జిష్ణు ర్నామాస్మి విశ్రుతః 21

నన్నెవ్వరు లోగొనజాలరు. అణపజాలరు. నేనందరిని అణతును. దేవేంద్రుని పుత్రుడను. అట్టి నేను దేవమనుష్య లోకములలో జిష్ణుడని పేరొందితిని.

కృష్ణ ఇత్యేవ దశమం నామ చక్రే పితా మమ,
కృష్ణావదాతస్య తతః ప్రియత్వాద్ బాలకస్య వై. 22

నా పసి తనమున ముద్దుగా నీలపువన్నెతో పరిశుద్ధముగా నున్ననాకు నాతండ్రి కృష్ణుడను పదియవ పేరు పెట్టెను.

---

19. సవ్యసాచీ - సవ్యేన ఎడమచేతితోకూడ, సచితుమ్ - అల్లెత్రాటిని లాగుట మున్నగు పనియందు శీలము కలవాడు సవ్యసాచి.

20. అర్జునః - 'ఋజ - గతిస్థానార్జనోపార్జనేషు' అను ధాతువునకు 'ఉనన్' ప్రత్యయము రాగా 'అర్జున' అయినది.

22. కృష్ణావదాతస్య - నల్లనిదై వెలుగొందు వర్ణముయొక్క : మనోహరమైన ధ్వనియొక్క భావము, కర్షతి చిత్తమితి - కృష్ణః ...

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః స పార్థం వైరాటి రభ్యవాదయ దన్తికాత్,
అహం భూమింజయో నామ నామ్నాహమపి చోత్తరః. 23

అంత విరాట తనయుడు కుంతీతనయుని సన్నిధికి చేరి నమస్కరించెను. నేను భూమింజయుడను. నన్ను ఉత్తరుడనియు నందురు.

దిష్ట్యా త్వాం పార్థ పశ్యామి స్వాగతం తే ధనంజయ,
లోహితాక్ష మహాబాహో నాగరాజ కరోపమ. 24

పార్థా! అదృష్టవశమున నిన్ను చూచుచున్నాను. కెంపెక్కిన కనులు, మహాబాహువులును, ఐరావతము తొండమువంటి చేతులు గల ఓధనంజయా! నీకు స్వాగతము.

యదజ్ఞానా దవోచం త్వాం క్షన్తుమర్హసి తన్మమ.
యత స్త్వయా కృతం పూర్వం చిత్రం కర్మ సుదుష్కరమ్,
అతో భయం వ్యతీతం మే ప్రీతిశ్చ పరమా త్వయి. 25

నేను తెలివిమాలి నిన్నేదో అంటిని ఆ నా తెలివితక్కువతనమును క్షమింపుము. నీవింతకు పూర్వ మితరులకు చేయనలవి కాని ఆశ్చర్యకరమగు పనులు చేసి యుంటివి. కావున నా భయము తీరినది. నీ యందు నాకు మిక్కిలి ప్రీతి కలిగినది.

[దాసోఽహం తే భవిష్యామి పశ్య మా మనుకమ్పయా.
యా ప్రతిజ్ఞా కృతా పూర్వం తవసారథ్య కర్మణే,
మనఃసాఫల్యం చ మే జాతం జాతం భాగ్యంచ మే మహత్.

నేను నీదాసుడను. నన్ను దయజూడుము. నీకు ముందు చెప్పినట్లు సారథ్యము చేయుదును నామనస్సు కుదుటపడినది. ఇది నాకు మహాభాగ్యము.]

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తర
గోగ్రహే అర్జున పరిచయే చతుశ్చత్వారింశోఽధ్యాయః.
ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తర
గోగ్రహమున అర్జున పరిచయ మను నలుబది నాల్గవ అధ్యాయము.

## పఞ్చచత్వారింశోఽధ్యాయః - నలుబదియైదవ అధ్యాయము

అర్జునస్య యుద్ధార్థ ముద్యోగోఽస్త్రశస్త్రాణాం స్మరణం తాని ప్రతి వార్తాలాప ఉత్తరస్య భయనివారణంచ.

అర్జునుడు యుద్ధమునకు సిద్ధమగుట, అస్త్రశస్త్రములను స్మరించుట, వానిని గూర్చిన ప్రసంగము, ఉత్తరుని భయమును పోగొట్టుట.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లనెను,

ఆస్థాయ రుచిరం వీర రథం సారథినా మయా,
కతమం యాస్యసేఽనీక ముక్తో యాస్యామ్యహం త్వయా. 1

ఓ వీరుడా! నీ మనోహరమగు రథమునకు సారథి గానైతిని. ఏ సేనవైపు పొమ్మందువు? చెప్పుము నేను రథమును పోనిత్తును.

అర్జున ఉవాచ - అర్జును డిట్లనెను.

ప్రీతోఽస్మి పురుష వ్యాఘ్ర నభయం విద్యతే తవ,
సర్వాన్ నుదామి తే శూరాన్ రణే రణవిశారద. 2

ఓ పురుష వరేణ్యా! ప్రీతుడ నైతిని నీకెంక భయములేదు. ఓరణ విశారద! యుద్ధమున శూరులనందరను పారద్రోలుదును.

స్వస్థోభవ మహాబాహో పశ్యమాం శత్రుభిః సహ,
యుధ్యమానం విమర్దేఽస్మిన్ కుర్వాణం భైరవం మహత్. 3

ఓ మహాబాహూ! మదిని పదిలపరచు కొనుము. శత్రువులతో పోరునప్పుడు భయంకరమైన పనులు చేయు నన్ను చూడుము.

ఏతాన్ సర్వా నుపాసఙ్గాన్ క్షిప్రం బధ్నీహి మే రథే,
ఏకం చాహర నిస్త్రింశం జాతరూప పరిష్కృతమ్. 4

౩. భైరవం - భయమును పుట్టించు.

ఈ అంప పొదుల నన్నింటిని త్వరగా నారథమున కట్టుము బంగారపు తొడవులుగల ఒక ఖడ్గమును తెమ్ము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

అర్జునస్య వచః శ్రుత్వా త్వరావా నుత్తర స్తదా,
అర్జున స్యాయుధాన్ గృహ్య శీఘ్రేణావాతరత్ తతః. 5

అర్జునుని మాట విని పిమ్మట ఉత్తరుడు శీఘ్రముగా అర్జునుని ఆయుధములను గ్రహించి జమ్మిచెట్టునుండి క్రిందికి దిగెను.

అర్జున ఉవాచ - అర్జును డిట్లు పలికెను.

అహం వై కురుభి ర్యోత్స్యా మ్యవజేష్యామి తే పశూన్. 6

నేను కౌరవులతో యుద్ధము చేయుదును. నీ పశువులను సాధింతును.

సంకల్పపక్ష విక్షేపం బాహు ప్రాకారతోరణమ్,
త్రిదణ్డతూణ సంబాధ మనేకధ్వజ సంకులమ్, 7
జ్యాక్షేపణం క్రోధకృతం నేమీ నినద దున్దుభి,
నగరం తే మయా గుప్తం రథోపస్థం భవిష్యతి. 8

ఓ ఉత్తరుడా! చక్కని అమరిక కల ప్రక్కభాగముల విస్తారము కలదియు, బాహువులనెడు ప్రాకారము, తోరణము కలదియు, పోలుకర్ర దానికి ప్రక్కలనుండెడు రెండుకఱ్ఱలు, అంపపొదులు అను వానితో సంకులమైనదియు, ఇతరుల కెవ్వరికిని లేని ధ్వజముతో భయంకరమైనదియు, క్రోధమువలన నైన అల్లెత్రాడులాగుట అను నాలికలు గలదియు, రథచక్రముల పట్టాల శబ్దమునెడు దుందుభులు గలదియునగు నీ రథమునందలి ఆ సనమనెడు నగరము నాచేత చక్కగా రక్షణ కలిగి యుండును.

అధిష్ఠితో మయా సంఖ్యే రథో గాణ్డీవధన్వనా,
అజేయః శత్రు సైన్యానాం వైరాటే వ్యేతు తే భయమ్. 9

ఓ ఉత్తరకుమారా! గాండీవము పట్టి నేను కూర్చున్న ఈ రథము యుద్ధమున శత్రుసైన్యములకు గెలువరానిది, కావున నీభయము తొలగుగాక!

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

బిభేమి నాహమేతేషాం జానామి త్వాం స్థిరం యుధి,
కేశవేనాపి సంగ్రామే సాక్షా దిన్ద్రేణ వా సమమ్. 10

యుద్ధమున నీవు కేశవునితో సమానుడవు. దేవేంద్రునితో సాటివత్తువు. యుద్ధమునందు స్థిరముగా నుందువు. కావున నేను వీరికి భయపడను.

ఇదం తు చిన్తయ న్నేవం పరిముహ్యామి కేవలమ్,
నిశ్చయం చాపి దుర్మేధా న గచ్ఛామి కథంచన. 11

కాని యీ విషయము నాలోచించుచు నేను కేవలము భ్రమపడుచున్నాను. నాపాడుబుద్ధికి ఎంతకును నిశ్చయము కలుగకున్నది.

ఏవం యుక్తాఙ్గరూపస్య లక్షణైః సూచితస్య చ,
కేన కర్మవిపాకేన క్లీబత్వ మిద మాగతమ్. 12

ఇంతగా యుద్ధమునకు యోగ్యమైన అవయవములు రూపము కలవాడవు. లక్షణములు చెప్పుచునే యున్నవి. కాని అట్టి నీకు ఏపాపమువలన యీపేడితనము వచ్చిపడినది?

మన్యే త్వాం క్లీబవేషేణ చరన్తం శూలపాణినమ్,
గన్ధర్వరాజ ప్రతిమం దేవం వాపి శతక్రతుమ్. 13

పేడి వేసము వేసి గంధర్వరాజువలె తిరుగుచున్న శివుడో లేక దేవేంద్రుడో అని నిన్ను సంభావింతును.

అర్జున ఉవాచ - అర్జును డిట్లనెను.

[ఊర్వశీశాపసంభూతం క్లైబ్యం మాం సముపస్థితమ్,
ఊర్వశీశాపమువలన నాకీ పేడితనము వచ్చినది.

పురాహ మాజ్ఞయా భ్రాతు ర్జ్యేష్ఠ స్యాస్మి సురాలయమ్,
ప్రాప్తవా నుర్వశీ దృష్ట్వా సుధర్మాయాం మయా తదా.

నేను పూర్వము మా అన్న ఆజ్ఞపై దేవలోకమున కరిగితిని. అచట సుధర్మయందు ఊర్వశి నన్ను చూచినది.

నృత్యన్తీ పరమం రూపం బిభ్రతీ వజ్రిసంనిధౌ,
అపశ్యం స్తా మనిమిషం కూటస్థా మన్వయస్య మే.

అద్భుతమగు రూపముతో, ఇంద్రుని యెదుట నృత్యము చేయుచుండగా మా వంశమునకు మూలకారణమైన ఆమెను రెప్ప వేయక చూచితిని.

రాత్రౌ సమాగతా మహ్యం శయానం రన్తు మిచ్ఛయా,
అహం తామభి వాద్యైవ మాతృసత్కార మాచరమ్.

రాత్రి ఆమె నా పాన్పుకడకు రమించుకోరికతో వచ్చినది. నేనామెకు మ్రొక్కి తల్లికి చేయుపూజ చేసితిని.

సాచ మామశపత్ క్రుద్ధా శిఖణ్డీ త్వం భవేరితి.

ఆమెయు క్రుద్ధురాలై నీవు నపుంసకుడవు కమ్మని శపించినది.

శ్రుత్వా తమిన్ద్రో మామాహ మాభైస్త్వం పార్థ షణ్ఢతః,
ఉపకారో భవేత్ తుభ్య మజ్ఞాతవసతౌ పురా.

ఆ విషయమును విని ఇంద్రుడు నాతో 'అర్జునా' ఈపేడి తనము వలన భయపడకుము. ముందు అజ్ఞాత వాసమున నీకిది ఉపకారమే యగును' అనిపలికెను,

ఇతీన్ద్రో మా మనుగ్రాహ్య తతః ప్రేషితవాన్ నృపా,
తదిదం సమనుప్రాప్తం వ్రతం తీర్ణం మయానఘ.

ఓయి మంచివాడా! ఇంద్రుడు నన్నిట్లను గ్రహించి యింటికి పంపెను. అదిగో ఆ కారణమున నిది నాకు కలిగెను. ఆ వ్రతము పూర్తి అయినది.]

భ్రాతు ర్నియోగా జ్జ్యేష్ఠస్య సంవత్సర మిదం వ్రతమ్,
చరామి వ్రతచర్యాం చ సత్యమేతద్ బ్రవీమి తే. 14

పెద్దన్నగారి ఆజ్ఞవలన నాకిది సంవత్సరకాలపు వ్రతము ఆ వ్రతము నిచట ఆచరించుచున్నాను. నీకు సత్యమును చెప్పుచున్నాను.

నాస్మి క్లీబో మహాబాహో పరవాన్ ధర్మసంయుతః,
సమాప్తవ్రతము త్తీర్ణం విద్ధి మాం త్వం నృపాత్మజ. 15

రాజకుమారా! నేను నపుంసకుడను కాను. ధర్మమునకు కట్టువడిన పరకీయుడను. వ్రతము చెల్లినది. ఆ పనలనుగడచి ఒడ్డెక్కితిని.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

పరమోఽనుగ్రహో మేఽద్య యత స్తర్కో న మే వృథా,
న హీదృశాః క్లీబరూపా భవన్తి తు నరోత్తమ. 16

నరోత్తమా! ఇది నాకు నేడు పరమానుగ్రహము. నా ఊహ వ్యర్థము కాలేదు. ఇట్టివారు నపుంసకులు కారు.

సహాయ వా నస్మి రణే యుధ్యేయ మమరై రపి,
సాధ్వసం హి ప్రణష్టం మే కింకరోమి బ్రవీహి మే. 17

నాకు యుద్ధమున మంచితోడు దొరికినది. దేవతలతో నైనను పోరాడుదును గుండెగుబులు పూర్తిగా నశించినది. ఏమిచేయుమందువో చెప్పుము.

అహం తే సంగ్రహీష్యామి హయాన్ శత్రు రథారుజాన్,
శిక్షితో హ్యస్మి సారథ్యే తీర్థతః పురుషర్షభ. 18

18. శత్రు రథారుజాన్ - పగవారి రథములను విఱుగగొట్టు, తీర్థతః - గురువువలన

శత్రు రథములను విరుగగొట్టు నీ గుఱ్ఱములను పట్టుదును. పురుషవరేణ్యా! సద్గురువు నొద్ద గుఱ్ఱముల నడపుటలో శిక్షణ పొందితిని.

దారుకో వాసుదేవస్య యథా శక్రస్య మాతలిః,
తథా మాం విద్ధి సారథ్యే శిక్షితం నరపుఙ్గవ. 19

వాసుదేవుని దారుకునివలె, ఇంద్రుని మాతలి వలె నేను రథమునడపుటలో శిక్షితుడనైతిని.

యస్య యాతే న పశ్యన్తి భూమౌ క్షిప్తం పదం పదమ్,
దక్షిణాం యో ధురం యుక్తః సుగ్రీవ సదృశో హయః. 20

కాడికి కుడివైపున కట్టిన గుఱ్ఱమున్నదే అది సుగ్రీవము వంటిది. అది పోవుచుండగా నేలపై వేసిన తీసిన పాదము కూడ కానరాదు.

యోఽయం ధురం ధుర్యవరో వామాం వహతి శోభనః,
తం మన్యే మేఘపుష్పస్య జవేన సదృశం హయమ్. 21

ఇదిగో ఈ ఎడమవైపునకాడిని మోయు శ్రేష్ఠమగు గుఱ్ఱము వేగమున మేఘ పుష్పమువలె సాటివచ్చునది.

యోఽయం కాఞ్చన సన్నాహః పార్ష్ణిం వహతి శోభనః,
సమం శైబ్యస్య తం మన్యే జవేన బలవత్తరమ్. 22

ఆ వెనుక బంగారుకవచము గల గుఱ్ఱము చాల బలము కలిగినది. వేగమున అది శైబ్యముతో తులతూగును.

యోఽయం వహతి మే పార్ష్ణిం దక్షిణా మభితః స్థితః,
బలాహకా దపి మతః సజవే వీర్యవత్తరః. 23

కుడివైపు వెనుక కాడిని మోయుచున్న ఈ గుఱ్ఱము వేగము నందు వలాహకముకంటె మిక్కిలి వీర్యము కలదానినిగా లోకము సంభావించును.

త్వా మేవాయం రథం వోఢుం సంగ్రామేఽర్హతి ధన్వినమ్,
త్వం చేమం రథ మాస్థాయ యోద్ధు మర్హో మతో మమ. 24

యుద్ధమున గొప్ప విలుకాడ వగు నిన్నే ఈరథము మోయ వలయును. నీవును ఈరథమునే యెక్కి యుద్ధము చేయవలయును. ఇది నా అభిమతము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయనుడిట్లు పలికెను.

తతో విముచ్య బాహుభ్యాం వలయాని స వీర్యవాన్,
చిత్రే కాఞ్చనసంనాహే ప్రత్యముఞ్చత్ తదా తలే. 25

అంత ఆ వీర్యవంతుడు చేతులనుండి వలయములను తీసివైచి చిత్రమైన బంగారు భూషణములుగల మైమకవులను తొడిగికొనెను.

కృష్ణాన్ భఙ్గిమతః కేశాన్ శ్వేతే నోద్గ్రథ్య వాససా
అథాసౌ ప్రాఙ్ముఖో భూత్వా శుచిః ప్రయతమానసః,
అభిదధ్యౌ మహాబాహుః సర్వాస్త్రాణి రథోత్తమే. 26

నొక్కులుగల నల్లని కేశములను తెల్లనివస్త్రముతో పైకి ఎత్తికట్టి శుచియై, తూర్పునకు తిరిగి మనసును పదిలపరచుకొని సర్వాస్త్రములును రథముపై నిలుచునట్లుగా ధ్యానించెను.

ఊచుశ్చ పార్థం సర్వాణి ప్రాఞ్జలీని నృపాత్మజమ్,
ఇమే స్మ పరమోదారాః కింకరాః పాణ్డునన్దన. 27

ఆ అస్త్రములన్నియు అంజలి ఘటించి రాజపుత్రుడగు అర్జునునితో ఇట్లు పలికెను. ఓ పాండునందనా ! పరమోదారము లగు మేము నీకు కింకరులము

ప్రణిపత్య తతః పార్థః సమాలభ్య చ పాణినా,
సర్వాణి మానసానీహ భవతేత్యభ్యభాషత. 28

అంత నర్జునుడు వానికి ప్రణమిల్లి చేతితో తాకి మీరందరు నామనస్సున నిలువవలయునని పలికెను.

ప్రతిగృహ్య తతోఽస్త్రాణి ప్రహృష్టవదనోఽభవత్,
అధిజ్యం తరసా కృత్వా గాణ్డీవం వ్యాక్షిపద్ ధనుః. 29

అంత ఆ అస్త్రములను గ్రహించిన అర్జునుని మోము వికసించెను. గాండీవము నెక్కు పెట్టి నారిని వేగముగా లాగి వదలెను.

తస్య విక్షిప్యమాణస్య ధనుషోఽభూ న్మహాధ్వనిః,
యథా శైలస్య మహతః శైలేనైవా వజఘ్నతః. 30

అట్లు లాగి వదలిన ధనువునుండి. కొండనుకొండ ఢీకొన్నప్పటి ధ్వని వంటి మహాధ్వని పుట్టెను.

సనిర్ఘాతోఽభవద్ భూమిర్ దిక్షు వాయు ర్వవౌ భృశమ్,
పపాత మహతీ చోల్కా దిశో న ప్రచకాశిరే,
భ్రాంతధ్వజం ఖం తదాసీత్ ప్రకమ్పిత మహాద్రుమమ్. 31

ఆ ధ్వని భూమిని బ్రద్దలు చేయునట్టి దాయెను. దిక్కులందు ప్రచండముగా గాలి వీచెను. పెద్ద ఉల్కరాలెను. దిక్కులు కాంతి తరిగెను. ఆకాశమున పతాకలు రెపరెపలాడెను. పెనువృక్షములు ఊగులాడెను.

తం శబ్దం కురవోఽజానన్ విస్ఫోట మశనే రివ,
యదర్జునో ధనుః శ్రేష్ఠం బాహుభ్యా మాక్షిపద్ రథే. 32

పిడుగు చీలిన విధముగా నున్న ఆ ధ్వనిని విని అర్జునుడు బాహువులతో గాండీవమును లాగెనని కౌరవులు గుర్తించిరి.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

ఏక స్త్వం పాణ్డవశ్రేష్ఠ బహూనేతాన్ మహారథాన్,
కథం జేష్యసి సంగ్రామే సర్వశస్త్రాస్త్ర పారగాన్. 33

---

31. దీనివలన శత్రు సేనయందు మహాధ్వని వినుటవలన కలిగిన మహాభయము వ్యక్తమగుచున్నది. భూకంపము పుట్టుటయు సూచింపబడినది.

ఓ పాండవ శ్రేష్ఠుడా! నీ వొక్కడవు ఆవల అస్త్రశస్త్రము లన్నింటిలో ఆరితేరిన మహారథులు పలువురు ఉన్నారు. యుద్ధమున వీరి నెట్లు గెలుతువు.

అసహాయో౽సి కౌన్తేయ ససహాయాశ్చ కౌరవాః,
అత ఏవ మహాబాహో భీత స్తిష్ఠామి తే౽గ్రతః. 34

నీకు తోడు లేదు. ఆ కౌరవులో! సహాయసంపద కలవారు. అందువలననే ఓ మహాబాహూ! నీ ముందు భయముతో నిలిచి యున్నాను.

ఉవాచ పార్థో మాభైషీః ప్రహస్య స్వనవత్ తదా. 35

అంతనర్జునుడు పెద్దగా నవ్వి భయపడ వలదని యిట్లు పలికెను.

యుధ్యమానస్య మే వీర గన్ధర్వైః సు మహాబలైః,
సహాయో ఘోషయాత్రాయాం క స్తదాసీత్ సఖా మమ. 36

ఓయి వీరుడా! ఘోషయాత్రయందు గొప్పబలముగల గంధర్వులతో పోరునప్పుడు నాకు తోడు వచ్చిన సఖుడెవ్వడు!

తథా ప్రతిభయే తస్మిన్ దేవదానవసంకులే,
ఖాణ్డవే యుధ్యమానస్య క స్తదాసీత్ సఖా మమ. 37

దేవతలకు దానవులకు కూడ భయము పుట్టించిన ఖాండవమున జరిగిన యుద్ధమునందు పోరాడిన నాకు తోడు వచ్చిన సఖుడెవ్వడు!

నివాతకవచైః సార్ధం పౌలోమైశ్చ మహాబలైః,
యుధ్యతో దేవరాజార్థేకః సహాయ స్తదా భవత్. 38

దేవరాజు పనికిగా నివాతకవచులతో మహాబలులగు పౌలోములతో యుద్ధమాడునపుడు నాకు సహాయుడెవ్వడు!

స్వయంవరే తు పాఞ్చాల్యా రాజభిః సహ సంయుగే,
యుధ్యతో బహుభి స్తాత కఃసహాయ స్తదా భవత్. 39

నాయనా! ద్రౌపదీస్వయంవరమున అనేకరాజ వరులతో యుద్ధము చేసినపుడు నాకు తోడైన వాడెవ్వడు?

ఉపజీవ్య గురుం ద్రోణం శక్రం వైశ్రవణం యమమ్,
వరుణం పావకం చైవ కృపం కృష్ణం చ మాధవమ్, 40

పినాక పాణినం చైవ కథ మేతాన్ న యోధయే,
రథం వాహయ మే శీఘ్రం వ్యేతు తే మానసో జ్వరః. 41

నాకు గురువైన ద్రోణుడు, ఇంద్రుడు, కుబేరుడు, యముడు, వరుణుడు, అగ్ని, కృపుడు, మాధవుడైన కృష్ణుడు, పినాకమును పట్టిన ఈశ్వరుడు అను వారి అండ గలదు. ఈ కౌరవులతో పోరాడుట యెంతపని? గుండె దిగులు వీడి త్వరగా రథమును పోనిమ్ము.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తర గోగ్రహే
ఉత్తరార్జునయో ర్వాక్యం నామ పఞ్చ చత్వారింశోఽధ్యాయః

ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున గోహరణ పర్వమున
ఉత్తరగోగ్రహమున ఉత్తరార్జునుల సంభాషణ మను నలుబదియైదవ అధ్యాయము

## షట్చత్వారింశోఽధ్యాయః - నలుబదియారవ అధ్యాయము

ఉత్తరస్యైవ రథేఽర్జున ధ్వజ స్యాగమన మర్జునస్య
శఙ్ఖనాదో ద్రోణకర్తృక ముత్పాతానాం వర్ణనం చ.

ఉత్తరుని రథమునందే అర్జునధ్వజమేర్పడుట, అర్జునుడు శంఖమును మ్రోయించుట, ద్రోణుడు అశుభశకునములను వర్ణించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఉత్తరం సారథిం కృత్వా శమీం కృత్వా ప్రదక్షిణమ్,
ఆయుధం సర్వ మాదాయ ప్రయయౌ పాణ్డవర్షభః. 1

ఉత్తరుని సారథిగా చేసికొని శమీవృక్షమునకు ప్రదక్షిణము చేసి ఆయుధముల నన్నింటిని గ్రహించి పాండవ శ్రేష్ఠుడు బయలుదేరెను.

ధ్వజం సింహం రథాత్ తస్మాదపనీయ మహారథః,
ప్రణిధాయ శమీమూలే ప్రాయాదుత్తర సారథిః. 2

ఉత్తరుడు సారథిగాగల ఆమహారథుడు ఆరథము నుండి సింహధ్వజమును తొలగించి జమ్మిచెట్టు మొదట నిక్షేపించి బయలు దేరెను.

దైవీం మాయాం రథేయుక్తాం విహితాం విశ్వకర్మణా,
కాఞ్చనం సింహలాంగూలం ధ్వజం వానరలక్షణమ్. 3

విశ్వకర్మ నిర్మించిన దైవమాయ రథమున నెలకొనెను. స్వర్ణమయము, హింసించు తోకకలదియు, వానర స్వరూపము కలదియునగు ధ్వజము ఏర్పడెను.

మనసా చిన్తయామాస ప్రసాదం పావకస్య చ,
స చ తచ్చిన్తితం జ్ఞాత్వా ధ్వజే భూతాన్యదేశయత్. 4

మనస్సుతో అగ్నిదేవుని అనుగ్రహమును ధ్యానించెను. ఆతడును ఆతనిభావమెఱిగి ధ్వజమున భూతములను, నిలిపెను.

స పతాకం విచిత్రాఙ్గం సోపాసఙ్గం మహాబలమ్,
ఖాత్ పపాత రథే తూర్ణం దివ్యరూపం మనోరమమ్. 5

పతాకతో, విచిత్రమైన అవయవములతో, అంపపొదులతో మనోహరమగు దివ్యరూపమొకటి గగనమునుండి రథముపై వచ్చి చేరెను.

రథం తమాగతం దృష్ట్వా దక్షిణం ప్రాకరోత్ తదా,
రథమాస్థాయ బీభత్సుః కౌన్తేయః శ్వేతవాహనః. 6

బద్ధగోధాఙ్గులిత్రాణః ప్రగృహీత శరాసనః,
తతః ప్రాయాదుదీచీం చ కపిప్రవర కేతనః. 7

౩. సింహలాంగూలమ్ - హింసించుతోక కలది - తోక విదిలింపులచేతనే ఏనుగుల గుణ్ణములు మున్నగు వానిని పెక్కింటిని మట్టుపెట్టునదని భావము.

అట్లు వచ్చిన రథమును గాంచి ప్రదక్షిణము చేసెను. తెల్లని గుఱ్ఱములు, కపిధ్వజముగల ఆరథము నెక్కి ప్రేళ్ళకు తొడుగులు వైచుకొని ధనుస్సు చేతబట్టి ఉత్తరదిక్కుగా బయలుదేరెను.

స్వనవన్తం మహాశఙ్ఖం బలవా నరిమర్దనః,
ప్రాధమద్ బల మాస్థాయ ద్విషతాం లోమహర్షణమ్. 8

శత్రు మర్దనుడు బలవంతుడు నగు అర్జునుడు మహానాదము గల మహా శంఖమును, బలమంతయు నుపయోగించి, శత్రువులకు గగుర్పాటు కలుగునట్లు ఊదెను.

[శశాఙ్కరూపం బీభత్సుః ప్రాధ్మాపయ దరిందమః.
శఙ్ఖశబ్దోఽస్య సోఽత్యర్థం శ్రూయతే కాలమేఘవత్.

చంద్రునివలె తెల్లగా నున్న ఆశంఖమును అర్జునుడు మొర యించెను. ఆధ్వని కాలమేఘము ఉరుమువలె మిక్కిలి పెద్దగా వినవచ్చెను.

తస్య శఙ్ఖస్య శబ్దేన ధనుషో నిఃస్వనేన చ,
వానరస్య చ నాదేన రథనేమిస్వనేన చ,
జంగమస్య భయం ఘోర మకరోత్ పాకశాసనిః.

ఆ శంఖనాదము, వింటిధ్వని, కపిఅరపు, రథము పట్టాలఘోష- అనువానితో అర్జునుడు ప్రాణిసముదాయమునకు ఘోరమైన భయ మును కలిగించెను.]

ఉత్తరశ్చాపి సన్త్రస్తో రథోపస్థ ఉపావిశత్. 9

ఉత్తరుడును గుండెచెదరి రథము లోభాగమున కూలబడెను.

సంస్థాప్య చాశ్వాన్ కౌన్తేయః సముద్యమ్య చ రశ్మిభిః,
ఉత్తరం చ పరిష్వజ్య సమాశ్వాసయ దర్జునః. 10

అంత కుంతీతనయుడు గుఱ్ఱములను పగ్గములతో లాగిపట్టి నిలిపి ఉత్తరుని కౌగిలించి తేర్చెను.

అర్జున ఉవాచ - అర్జును డిట్లు పలికెను

మాభైస్త్వం రాజపుత్రాగ్ర్య క్షత్రియోఽసి పరంతప,
కథం తు పురుషవ్యాఘ్ర శత్రుమధ్యే విషీదసి. 11

రాజపుత్రా! భయపడకు. క్షత్రియుడవు కదయ్యా! ఓ పురుష వరా! శత్రువులనడుమ ఇట్లు క్రుంగిపోయినచో ఎట్లు?

శ్రుతాస్తే శఙ్ఖశబ్దాశ్చ భేరీశబ్దాశ్చ పుష్కలాః,
కుఞ్జరాణాం చ నదతాం వ్యూఢానీకేషు తిష్ఠతామ్. 12

ఎన్నో శంఖనాదములు, మరెన్నో భేరీధ్వనులు వినియుందువు. సేనలందు నిలిచిన ఏనుగులు ఘీంకరించుచుండగా వినియుంటివి.

స త్వం కథమిహానేన శఙ్ఖశబ్దేన భీషితః,
విషణ్ణరూపో విత్రస్తో పురుషః ప్రాకృతో యథా. 13

అట్టినీవు సామాన్యజనునివలె ఈ శంఖనాదముచేత వన్నెతరిగి వడకుచు ఇంతభయపడితి వేల?

ఉత్తర ఉవాచ - ఉత్తర డిట్లు పలికెను

శ్రుతా మే శఙ్ఖశబ్దాశ్చ భేరీశబ్దాశ్చ పుష్కలాః,
కుఞ్జరాణాం నినదతాం వ్యూఢానీకేషు తిష్ఠతామ్. 14

అయ్యా శంఖధ్వనులు, భేరీభాంకారములు, వ్యూహములలో నిలిచియున్న ఏనుగుల ఘీంకారములు నేను వినియే యుంటిని.

నైవం విధః శఙ్ఖశబ్దః పురా జాతు మయా శ్రుతః,
ధ్వజస్య చాపి రూపం మే దృష్టపూర్వం నహీదృశమ్. 15
ధనుషశ్చైవ నిర్ఘోషః శ్రుతపూర్వో న మే క్వచిత్.

ఈ విధమైన శంఖధ్వనిని నా క్రమము పూర్వమెప్పుడు విని యుండలేదు. ఇట్టి ధ్వజమును పూర్వమెప్పుడు కనియుండలేదు. ఇంతవింత వింటిమ్రోత నెప్పుడును వినియుండలేదు.

అస్య శఙ్ఖస్య శబ్దేన ధనుషో నిస్వనేన చ. 16
అమానుషాణాం శబ్దేన భూతానాం ధ్వజవాసినామ్,
రథస్య చ నినాదేన మనో ముహ్యతిమే భృశమ్. 17

ఈ శంఖధ్వని, ఈధనుష్టంకారము, ఈ ధ్వజము పైనున్న అమానుష భూతముల అరపులు, ఈ రథనిర్ఘోషము అనువానివలన నా గుండె మిక్కిలిగా చెదరిపోవుచున్నది.

వ్యాకులాశ్చ దిశః సర్వా హృదయం వ్యథతీవ మే,
ధ్వజేన పిహితాః సర్వాదిశో న ప్రతిభాన్తి మే. 18

దిక్కులన్నియు కలగాపులగ మైనట్లున్నవి. నా ఎడద వ్యథ నొందుచున్నట్లున్నది. ఈ ధ్వజముతో కప్పబడి దిక్కులు తోచకున్నవి.

గాణ్డీవస్య చ శబ్దేన కర్ణౌ మే బధిరీకృతౌ.
గాండీవధ్వనితో నా చెవులు చెవుడువడినవి.

సముహూర్తం ప్రయాతంతు పార్థో వైరాటి మబ్రవీత్. 19

ఒక్క ముహూర్తము ప్రయాణము చేసిన ఉత్తరునితో అర్జునుడు ఇట్లు పలికెను.

అర్జున ఉవాచ - అర్జునుడిట్లనెను

ఏకాన్తం రథమాస్థాయ పద్భ్యాం త్వ మవపీడయన్,
దృఢం చ రశ్మీన్ సంయచ్ఛ శఙ్ఖం ధ్మాస్యామ్యహం పునః. 20

20. ఏకాంతమ్ - మిక్కిలిగట్టిగా

కాళ్ళతో గట్టిగా నొక్కిపట్టి పగ్గములను బిగించి రథమును కదలకుండ నిలుపుము, మరొకమారు శంఖము నూదుదును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

తతః శఙ్ఖముపాధ్మాసీద్ దారయన్నివ పర్వతాన్,
గుహా గిరీణాం చ తదా దిశః శైలాం స్తథైవ చ,
ఉత్తరశ్చాపి సంలీనో రథోపస్థ ఉపావిశత్. 21

పర్వతములను, కొండల గుహలను, దిక్కులను, రాలను పగులగొట్టుచున్నట్లు అర్జునుడు శంఖము నూదెను. ఉత్తరుడును రథపునొగలలో అణగిపడియుండెను.

తస్య శఙ్ఖస్య శబ్దేన రథనేమిస్వనేన చ,
గాణ్డీవస్య చ ఘోషేణ పృథివీ సమకమ్పత. 22

ఆ శంఖధ్వనిచేతను, రథఘోషచేతను, గాండీవనాదముచేతను భూమి దద్దరిల్లెను.

తం సమాశ్వాసయామాస పునరేవ ధనంజయః. 23

అర్జునుడు మరల నాతనిని తేర్చెను.

ద్రోణ ఉవాచ - ద్రోణు డిట్లు పలికెను

యథా రథస్య నిర్ఘోషో యథా మేఘ ఉదీర్యతే,
కమ్పతే చ యథాభూమి ర్నైషోఽన్యః సవ్యసాచినః. 24

ఆ రథముధ్వని చూడుడు. మేఘము బ్రద్దలైనట్లున్నది. భూమి దద్దరిల్లుచున్నది. ఇది అర్జునునిది కాకమానదు.

శస్త్రాణి న ప్రకాశన్తే న ప్రహృష్యన్తి వాజినః,
అగ్నయశ్చ న భాసన్తే సమిద్ధా స్తన్న శోభనమ్. 25

ఆయుధములు వన్నె తరిగియున్నవి. గుఱ్ఱములు ఉత్సాహముగా లేవు. ఎంత దరికొల్పినను అగ్నులు మండుటలేదు. ఇది మేలుగా లేదు.

ప్రత్యాదిత్యం చ నః సర్వే మృగా ఘోరప్రవాదినః,
ధ్వజేషు చ నిలీయన్తే వాయసా స్తన్న శోభనమ్. 26

మన జంతువులన్నియు సూర్యునివైపు తిరిగి ఘోరముగా అరచుచున్నవి. కాకులు ధ్వజస్తంభములపై వ్రాలియున్నవి. ఇది మంచిదికాదు.

శకునా శ్చాపసవ్యా నో వేదయన్తి మహద్ భయమ్. 27

అప్రదక్షిణముగా తిరుగు పక్షులును మనకేదో గొప్పకీడును సూచించుచున్నవి.

గోమాయు రేష సేనాయాం రుదన్ మధ్యేన ధావతి,
అనాహతశ్చ నిష్క్రాన్తో మహద్ వేదయతే భయమ్. 28

ఇదిగో ఈనక్క కొట్టబడకయే ఏడ్చుచు సేననడుమనుండి పరువెత్తి పోవుచున్నది. అది పెద్దకీడును సూచించుచున్నది.

భవతాం రోమకూపాణి ప్రహృష్టా న్యుపలక్షయే,
ధ్రువం వినాశో యుద్ధేన క్షత్రియాణాం ప్రదృశ్యతే. 29

మీ అందరిశరీరములపై వెంట్రుకలు నిక్కబొడిచినట్లు కానవచ్చుచున్నవి. ఈ యుద్ధమువలన క్షత్రియులకు వినాశము నిక్కమని తోచుచున్నది.

జ్యోతీంషి న ప్రకాశన్తే దారుణా మృగపక్షిణః,
ఉత్పాతా వివిధా ఘోరా దృశ్యన్తే క్షత్రనాశనాః. 30

జ్యోతులు (సూర్యుడు, కన్నులు, వాక్కులు, మనస్సులు) కాంతితరిగి యున్నవి. మృగములు, పక్షులు దారుణములై యున్నవి. క్షత్రియుల నాశనమునకు సంబంధించిన ఘోరములైన పెక్కు దుశ్శకునములు కానవచ్చుచున్నవి.

విశేషత ఇహాస్మాకం నిమిత్తాని వినాశనే,
ఉల్కాభి శ్చ ప్రదీప్తాభి ర్బాధ్యతే పృతనా తవ,
వాహనా న్యప్రహృష్టాని రుద న్తీవ విశాంపతే. 31

రాజా ! వినాశమును సూచించు నిమిత్తములు విశేషముగా నిటువైపు కానవచ్చుచున్నవి. మండుచున్న ఉల్కలు నీ సేనను బాధించుచున్నవి. గుఱ్ఱములు ఉత్సాహములేక ఏడ్చుచున్నట్లున్నవి.

ఉపాసతే చ సైన్యాని గృధ్రా స్తవ సమ న్తతః,
తప్స్యసే వాహినీం దృష్ట్వా పార్థబాణ ప్రపీడితామ్,
పరాభూతా చ వః సేనా నకశ్చిద్ యోద్ధు మిచ్ఛతి. 32

గ్రద్దలన్నివైపులనుండియు వచ్చి నీ సేనలకడ వ్రాలుచున్నవి. పార్థుని బాణములకు పీడనొందిన నీ సేనను చూచి పరితపింతువు. నీ సేన అంతయు పెడమోము పెట్టియున్నది. ఒక్కడును పోర గోరుటలేదు.

వివర్ణముఖ భూయిష్ఠా స్సర్వే యోధా విచేతసః, 33
గాః సంప్రస్థాప్య తిష్ఠామో వ్యూఢానీకాః ప్రహారిణః.

నీ యోధులందరి ముఖములలో వన్నె తరిగియున్నది. వారందరు గుండె చెదరియున్నారు. గోవులను ముందుకు బయలు వెడలించి మనము మొగ్గరములు తీర్చుకొని యుద్ధముచేయుటకై నిలుతుము.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణ పర్వణి ఉత్తరగోగ్రహే ఔత్పాతికోనామ షట్చత్వారింశోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున ఔత్పాతికమను నలుబదియారవ అధ్యాయము.

## సప్తచత్వారింశోఽధ్యాయః - నలుబదియేడవ అధ్యాయము

దుర్యోధనస్య యుద్ధాయ నిశ్చయః, కర్ణస్యోక్తిశ్చ.

దుర్యోధనుడు యుద్ధమునకు నిశ్చయించుట, కర్ణుని పలుకు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

అథ దుర్యోధనో రాజా సమరే భీష్మమబ్రవీత్,
ద్రోణం చ రథశార్దూలం కృపంచ సుమహారథమ్. 1

అంత యుద్ధరంగమున దుర్యోధనమహారాజు భీష్మునితో, రథికవరుడగు ద్రోణునితో, మహారథుడగు కృపునితో ఇట్లుపలికెను.

ఉక్తోఽయమర్థ ఆచార్యా మయా కర్ణేన చాసకృత్,
పునరేవ ప్రవక్ష్యామి నహితృప్యామి తం బ్రువన్. 2

ఈ ఆచార్యులిరువురకు నేనును కర్ణుడును చాలమారులు ఈ విషయమును చెప్పియే యుంటిమి. మరల చెప్పుచున్నాను. ఎన్నిపర్యాయములు చెప్పినను నాకు తృప్తితీరదు.

పరాభూతైశ్చ వస్తవ్యం తైశ్చ ద్వాదశ వత్సరాన్.
వనే జనపదే జ్ఞాతైరేష ఏవ పణో హి నః. 3

వారు మనచేత ఓడిరి. పంద్రెండు వత్సరములు అడవిలో ఉండవలయును. ఒక యేడు అజ్ఞాతవాసముండ వలయును. ఇదికదా మనము పెట్టిన పందెము.

తేషాం న తావన్నిర్వృత్తం వర్తతే తు త్రయోదశమ్,
అజ్ఞాతవాసో బీభత్సురథాస్మాభిః సమాగతః. 4

దానిని వారింకను పూర్తిగా నిర్వహింపలేదు. పదమూడవ సంవత్సరము గడచుచున్నది అజ్ఞాతవాసము చేయు అర్జునుడు మనకు తెలియవచ్చెను.

అనివృత్తేతు నిర్వాసే యది బీభత్సు రాగతః,
పున ర్ద్వాదశవర్షాణి వనే వత్స్యన్తి పాణ్డవాః. 5

అజ్ఞాతవాసము ముగియకముందే అర్జునుడు వచ్చినచో, పాండవులు మరల పండ్రెండేండ్లు వనవాసము చేయుదురు.

లోభాద్ వా తే న జానీయు రస్మాన్ వా మోహ ఆవిశత్,
హీనాతిరిక్త మేతేషాం భీష్మో వేదితు మర్హతి. 6

లోభమువలన వారిది యెఱుగకున్నారో, మనకు మోహము పట్టెనో ఇందు ఎచ్చుతగ్గులు భీష్ముడే యెరుగును.

అర్థానాం చ పునర్ద్వైధే నిత్యం భవతి సంశయః,
అన్యథా చిన్తితో హ్యర్థః పునర్భవతి సోఽన్యథా. 7

మరియు ఒకదానియందు రెండు పద్ధతులున్నపుడు ప్రయోజనముల విషయమున సంశయము తప్పక కలుగును. ఒక విధముగా అనుకొనినది మరియొక విధముగా నగుచుండును.

ఉత్తరం మార్గమాణానాం మత్స్యానాం చ యుయుత్సతామ్,
యది బీభత్సు రాయాత స్తత్రా కస్యాపరాధ్నుమః 8

యుద్ధముచేయగోరు మత్స్యుల ఉత్తరదిక్కు గోవులను పట్టుటకై మనము రాగా నడుమ అర్జునుడు వచ్చినచో తప్పెవరిది!

6. హీన - అతిరిక్తము - అజ్ఞాతవాస కాలము ముగిసెనా ? లేదా ? అను విషయమును.

7. అజ్ఞాతవాస కాలము ముగియనిచో మన యిష్టమే నెరవేరును, ముగిసినప్పటికిని అర్జునుడు యుద్ధమునకు వచ్చుట దోషమే. ఎట్లన వారు ప్రతిజ్ఞ దీర్చుకొని రాజ్య భాగము కొఱకు నాయనుగ్రహమునకై రావలయునుగాని, యుద్ధమునకు రారాదు - అని దుర్యోధనుని భావము.

8. ఇచట మనకును విరాటునకును యుద్ధసంబంధము - వాలి, సుగ్రీవులు పోరుచుండగా రాముడు వచ్చినట్లు - అర్జునుడు వచ్చినచో దోషమతనిదే. యని అభిప్రాయము.

త్రిగర్తానాం వయం హేతో ర్మత్స్యాన్ యోద్ధు మిహాగతాః,
మత్స్యానాం విప్రకారాం స్తే బహూ నస్మ న్యకీర్తయన్. 9

మనము త్రిగర్తులకొరకై మత్స్యదేశమువారితో పోర నిటకు వచ్చితిమి. మత్స్యులు చేసిన అపకారములను పెక్కింటిని మనకు చెప్పికొనిరి.

తేషాం భయాభిభూతానాం తదస్మాభిః ప్రతిశ్రుతమ్

త్రిగర్తులకు భయము ఆవరింపగా మనము వారికి మాట యిచ్చితిమి.

ప్రథమం తై ర్గ్రహీతవ్యం మత్స్యానాం గోధనం మహత్,
సప్తమ్యా మపరాహ్ణే వై తథా తైస్తు సమాహితమ్. 10

మొదట సప్తమి మధ్యాహ్నకాలమున త్రిగర్తులు మత్స్యుల గొప్ప గోధనమును పట్టవలయు ననుకొంటిమి. వారావని చేసిరి.

అష్టమ్యాం పున రస్మాభి రాదిత్య స్యోదయం ప్రతి,
ఇమా గావో గ్రహీతవ్యా గతే మత్స్యే గవాంపదమ్. 11

మనమన్ననో, అష్టమినాడు సూర్యోదయము వేళకు, విరాటు డా గోవులున్నచోటికి పోయినపుడు, ఈ గోవులను పట్టవలయు నను కొంటిమి,

తే వా గా శ్చానయిష్యన్తి యది వా స్యుః పరాజితాః,
అస్మాన్ వా ప్యవసంధాయ కుర్యు ర్మత్స్యేన సంగతమ్. 12

ఆ త్రిగర్తులు తెచ్చిన గోవులను తెత్తురు. లేదా ఒకవేళ ఓడి లేని మనలను మోసగించి విరాటునితో స్నేహము చేయుదురు.

---

9. అయినచో పగ మత్స్య త్రిగర్తులది కాగా మనమేల రావలయునన్న ప్రశ్న నాకాంక్షించి దుర్యోధనుడు పలుకుచున్నాడు.

అథవా తానపాహాయ మత్స్యో జానపదైః సహ,
సర్వయా సేనయా సార్థం సంవృతో భీమరూపయా,
ఆయాతః కేవలం రాత్రి మస్మాన్ యోద్ధు మిహాగతః. 13

లేదా విరాటుడు జానపదులతోపాటు ఆ త్రిగర్తులను ఉపే క్షించి కడచిన రాత్రియే భయంకరమగు సేన మొత్తముతో తిరిగి గృహమునకు వచ్చి యిప్పుడు మనతో పోరుటకై వచ్చియుండును.

తేషా మేవ మహావీర్యః కశ్చిదేష పురస్సరః,
అస్మా ఞ్జేతు మిహాయాతో మత్స్యోవాపి స్వయం భవేత్. 14

కాదా, వారిలో ఒక మహావీరుడు మనలను గెలుచుటకై యిటు వచ్చియుండును. కాక స్వయముగా విరాటుడే కావచ్చును.

యద్యేష రాజా మత్స్యానాం యది బీభత్సు రాగతః,
సర్వై ర్యోద్ధవ్య మస్మాభి రితి నః సమయః కృతః. 15

విరాటుడే రానిండు, అర్జునుడే కానిండు. మనమందరము యుద్ధముచేయవలయుననియే కదా అనుకొని వచ్చితిమి!

అథ కస్మాత్ స్థితా హ్యేతే రథేషు రథసత్తమాః,
భీష్మో ద్రోణః కృపశ్చైవ వికర్ణో ద్రౌణి రేవచ. 16
సంభ్రాంతమనసః సర్వే కాలే హ్యస్మిన్ మహారథాః.

అట్టియెడ ఈ భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, వికర్ణుడు, అశ్వత్థామ అను నీ మహారథులందరు చెదరిన గుండెలతో రథములపై మెదలకున్నారేమి!

నాన్యత్ర యుద్ధా చ్ఛ్రేయో౽స్తి తథాత్మా ప్రణిధీయతామ్. 17

యుద్ధముకంటె మనకు మేలైనది లేదు. కావున గుండెను దిటవు చేసికొనుడు.

ఆచ్ఛిన్నే గోధనే౽స్మాక మపి దేవేన వజ్రిణా,
యమేన వాపి సంగ్రామే కో హాస్తినపురం వ్రజేత్. 18

శస్త్రము పట్టిన ఇంద్రుడే కానిమ్ము, సాక్షాత్తు యముడే కానిమ్ము. గోవులను అపహరించినచో మనలో హాని కలుగు వాడెవడుండును ? (ఒకవేళ ఏ ఇంద్రుడో, యముడో వచ్చి గోధనమును యుద్ధమున నపహరించినచో అప్పుడు మనలో నెవ్వడు పురమునకు పోకుండును ?)

శరైః శేభిః ప్రణున్నానాం భగ్నానాం గహనే వనే,
గోహి జీవేత్ పదాతీనాం భవే దశ్వేషు సంశయః. 19

ఒకవేళ పదాతులం దెవడేని పారినచో ఈ (నా) శరములు వానిని నుగ్గునూచ యొనర్చును. వానిలో బ్రదుకువాడెవడు ? గుఱ్ఱములు జీవించిన జీవించుగాక !

దుర్యోధనవచః శ్రుత్వా రాధేయ స్త్వబ్రవీద్ వచః,
ఆచార్యం పృష్ఠతః కృత్వా తథా నీతి ర్విధీయతామ్. 20

దుర్యోధనుని మాటవిని కర్ణు డిట్లు పలికెను : ఆచార్యుని వెనుకకు బెట్టి చేయవలసిన నీతిని చేయదగును.

జానాతి హి మతం తేషా మతస్త్రాసయతీహ నః,
అర్జునే చాస్య సంప్రీతి మధికా ముపలక్షయే. 21

ఈతనికి ఆ పాండవుల అభిమతమేమో తెలియును. కావుననే మనల నిచట బెదరించుచున్నాడు. ఈతనికి అర్జునుడన్న ఎంతో ప్రీతి. అది కనిపించుచునే యున్నది.

తథాహి దృష్ట్వా బీభత్సు ముపాయాన్తం ప్రశంసతి,
యథా సేనా న భజ్యేత తథా నీతి ర్విధీయతామ్. 22

అందులకే కదా అర్జునుడు వచ్చుచుండగా చూచి పొగడుచున్నాడు. కావున సేన చెదరని విధముగా మనము నీతిని ప్రయోగింపవలయును.

హ్రేషితం హ్యుప శృణ్వానే ద్రోణే సర్వం విఘట్టితమ్,
అదేశికా మహారణ్యే గ్రీష్మే శత్రువశం గతాః,
యదా న విభ్రమేత్ సేనా తథా నీతి ర్విధీయతామ్. 23

ఈ ద్రోణుడు గుఱ్ఱముల సకిలింత విని భయపడినచో సేన యంతయు చెల్లాచెదరగును. ఇది మన దేశము కాదు. మహారణ్యము, ఎండకాలము. ఇచట సేన చెదరినచో శత్రువులకు పట్టుపడును. కావున చెదరని విధముగా నీతిని ప్రయోగింపవలయును.

ఇష్టా హి పాణ్డవా నిత్య మాచార్యస్య విశేషతః,
అసయన్నపరార్థాశ్చ కథ్యతే స్మ స్వయం తథా. 24

ఈ ఆచార్యునకు పాండవులు నిత్యము మిక్కిలి ఇష్టులు. వారు స్వార్థపరులై యాతనిని మనకడ నుంచిరి. ద్రోణుడుకూడ ఆమాటను స్వయముగా చెప్పుచునే యున్నాడు.

అశ్వానాం హ్రేషితం శ్రుత్వా కః ప్రశంసాపరో భవేత్,
స్థానే వాపి వ్రజన్తో వా సదా హ్రేషన్తి వాజినః. 25

గుఱ్ఱముల సకిలింత విని ఎవ్వడు పొగడ నుంకించును ? గుఱ్ఱములు నిలుచున్నను, కదిలినను ఎప్పుడు సకిలించుచునేయుండును.

సదా చ వాయవో వాన్తి నిత్యం వర్షతి వాసవః,
స్తనయిత్నోశ్చ నిర్ఘోషః శ్రూయతే బహుశ స్తథా. 26

గాలు లెప్పుడు వీచుచునే యుండును. ఇంద్రుడు వర్షమును కురిపించుచునేయుండును. ఉరుము మ్రోతయు సాధారణముగా వినవచ్చుచునే యుండును.

---

23. గ్రీష్మే - ఇది యెండకాలము. యుద్ధమునకు తగనికాలము, అదేశికాః - మనకు కాని దేశమున నున్నారము.

24. అపరార్థాః - పరార్థములేనివారు - అనగా స్వార్థపరులని భావము, అసయన్- ఉంచిరి.

యద్యత్ర కార్యం పార్థస్య కథం వా స ప్రశస్యతే,
అన్యత్ర కామాద్ ద్వేషాద్ వా రోషా దస్మాసు కేవలాత్. 27

పరపక్షమున శ్రేయోభిలాషయో, మనపై ద్వేషమో, లేక కేవలము రోషమో కారణము కావలయును. లేనిచో ఇచట అర్జునునికి పని యేమి గలదు ? అతని నిట పొగడనేల ?

ఆచార్యా వై కారుణికాః ప్రాజ్ఞాశ్చాపాపదర్శినః.
నైతే మహాభయే ప్రాప్తే సంప్రష్టవ్యాః కథంచన. 28

ఆచార్యులకు కరుణ ఎక్కువ. వారు మిక్కిలి తెలివిగలవారు. హింస న్నచో చూడజాలరు. ఇట్టివారిని మహాభయము వచ్చినపుడు ఎన్నిటికిని అభిప్రాయము లడుగరాదు.

ప్రాసాదేషు విచిత్రేషు గోష్ఠీషూపవనేషు చ.
కథా విచిత్రాః కుర్వాణాః పణ్డితా స్తత్ర శోభనాః. 29

భవనములలో, విచిత్రములగు ప్రసంగపు తావులలో, ఉద్యానవనములలో, వింతగొలుపు కబుర్లు చెప్పుచున్నపుడు పండితులు రాణింతురు.

బహూన్యాశ్చర్యరూపాణి కుర్వాణా జనసంసది,
ఇజ్యాస్త్రే చోపసన్ధానే పణ్డితా స్తత్ర శోభనాః. 30

జనులు మూగినచోటులందు అచ్చెరువుగొలుపు వినోదకార్యక్రమములను చేయునప్పుడు, యజ్ఞములకు సంబంధించిన ఆయుధము లందును, వాని అమరికలయందును వారు రాణింతురు.

పరేషాం వివరజ్ఞానే మనుష్యచరితేషు చ,
హస్త్యశ్వరథచర్యాసు ఖరోష్ట్రాజవికర్మణి. 31

---

28. ఇది ద్రోణుని వెక్కిరించుట. కారుణికాః - యుద్ధధర్మము తెలియనివారని అధిక్షేపణ, అపాపదర్శినః - హింసను జూడజాలనివారు;
30. ఇజ్యాస్త్రే - కపాలాదులయందు,
31. వివరజ్ఞానే - దోషములను జూచుటయందు; మనుష్యచరితేషు - స్నానము, ఆచమనము, భోజనము మున్నగు పనులయందు.

గోధనేషు ప్రతోలీషు వరద్వారముఖేషుచ,
అన్నసంస్కారదోషేషు పణ్డితా స్తత్ర శోభనాః. ౩౨

పండితులైనవారు ఇతరుల దోషములను కనిపెట్టుటలో, మనుష్యుల ప్రవర్తనములలో, ఏనుగులు, గుఱ్ఱములు, రథములు అనువాని గమనవిశేషములలో, గాడిదలు, ఒంటెలు, మేకలు, గొఱ్ఱెలు అనువానికి సంబంధించిన చికిత్స మున్నగు పనులలో, గోధనములలో, రచ్చబండలలో, గొప్పవారి యింటిద్వారములలో, అన్నమును సంస్కరించుటలోని తప్పుల విషయములలో రాణింతురు.

పణ్డితాన్ పృష్ఠతః కృత్వా పరేషాం గుణవాదినః,
విధీయతాం యథా నీతి ర్యథా వధ్యో భవేత్ పరః. ౩౩

శత్రువుల గుణములను పొగడు పండితులను వెనుకకు నెట్టి, శత్రువును హతమార్చు నీతిని మన మిపుడు ప్రయోగింపవలయును.

గావశ్చ సంప్రతిష్ఠాప్య సేనాం వ్యూహ్యా సమన్తతః,
ఆరక్షాశ్చ విధీయన్తాం యత్ర యోత్స్యామహే పరాన్. ౩౪

గోవులను, మిమ్ములను చక్కగా నెలకొల్పికొని సేనలను అన్నివైపుల మోహరించుకొని శత్రువులతో యుద్ధమాడుట కనువుగా రక్షకులను నియమించుకొనవలయును.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తర
గోగ్రహే దుర్యోధనవాక్యే సప్తచత్వారింశోఽధ్యాయః
ఇది శ్రీ మహాభారత విరాటపర్వమున గోహరణపర్వమున
ఉత్తరగోగ్రహమున దుర్యోధనవాక్యమను నలుబది యేడవ అధ్యాయము

---

**౩౨.** అన్నసంస్కారదోషేషు - వైశ్వదేవము మొదలగువానియందలి దోషములయందును,

**౩౪.** గావశ్చ - గావః, వః, చ - గోవులను, మిమ్ములను కూడ.

## అష్టచత్వారింశోఽధ్యాయః – నలుబది యెనిమిదవ అధ్యాయము

కర్ణస్య వికత్థనమ్ –

కర్ణుడు బీరములాడుట.

కర్ణ ఉవాచ - కర్ణు డిట్లు పలికెను.

సర్వా నాయుష్మతో భీతాన్ సంత్రస్తా నివ లక్షయే,
అయుద్ధమనస శ్చైవ సర్వాం శ్చైవా నవస్థితాన్. 1

పాపము ఈ ఆయుష్మంతులందరు భయము నొందిన వారివలె, యుద్ధమునకు బుద్ధిపుట్టనివారివలె, నిలుకడలేనివారివలె కానవచ్చు చున్నారు.

యద్యేష రాజా మత్స్యానాం యది బీభత్సు రాగతః,
అహ మావారయిష్యామి వేలేవ మకరాలయమ్. 2

ఈ వచ్చినది విరాటుడే యగుగాక, లేక వివ్వచ్చుడే యగు గాక. వానిని, సముద్రమును చెలియలికట్టవలె, నేను నిలువరింతును.

మమ చాప ప్రయుక్తానాం శరాణాం నతపర్వణామ్,
నావృత్తి ర్గచ్ఛతాం తేషాం సర్పాణా మివ సర్పతామ్. 3

చరచర ప్రాకిపోవు పాములవంటివి, నా వింటినుండి ప్రయో గింపబడినవి, వంగినకణుపులు కలవి అగు బాణములకు గురి తప్పుట యనునది యుండదు.

రుక్మ పుఙ్ఖాః సుతీక్ష్ణాగ్రా ముక్తా హ స్తవతా మయా,
ఛాదయన్తు శరాః పార్థం శలభా ఇవ పాదపమ్. 4

బంగారు పుంఖములు, వాడి అగ్రములు గల నాబాణములు చేయి తిరిగిన నేను ప్రయోగింపగా చెట్టుపై క్రమ్మిన మిడుతలవలె అర్జునుని క్రమ్మివేయును.

1. సర్వాన్ - భీష్ముడు మున్నగువారందరిని, అవస్థితాన్ - నిలుకడలేనివారిని.
3. అవృత్తిః - గురితప్పుట,

శరాణాం పుఙ్ఖసక్తానాం మౌర్వ్యాభిహతయా భృశమ్,
శ్రూయతాం తలయోః శబ్దో భేర్యో రాహతయోరివ. 5

గట్టిగా లాగిన అల్లెత్రాటియందు తగుల్కొనిన పుంఖములు గల బాణముల ప్రక్కభాగములనుండి పుట్టిన శబ్దము, బాగుగా మ్రోయించిన భేరులశబ్దమువలె వెలువడగా మీరు విందురుగాక!

సమాహితో హి బీభత్సు ర్వర్షా ణ్యష్టౌ చ పఞ్చ చ,
జాతస్నేహశ్చ యుద్ధేఽస్మిన్ మయి సంప్రహరిష్యతి. 6

ఈవివ్వచ్చుడు పదుమూడేండ్లు శ్రద్ధతో ఉన్నాడు. ఈ యుద్ధమున నేను కొట్టుచుండగా నాపై స్నేహము కలవాడగును. [వైరమైనచో నిలువజాలడను భావముతో స్నేహముతో మంచితనము పెంచుకొనునని భావము].

పాత్రీభూతశ్చ కౌన్తేయో బ్రాహ్మణో గుణవానివ,
శరౌఘాన్ ప్రతిగృహ్ణాతు మయా ముక్తాన్ సహస్రశః. 7

ఆ కుంతీకుమారుడు, గుణములుగల బ్రాహ్మణునివలె, నేను వేలకొలదిగా గుప్పించు బాణముల ప్రవాహములకు, పాత్రమగును.

ఏష చైవ మహేష్వాస స్త్రిషు లోకేషు విశ్రుతః,
అహం చాపి నరశ్రేష్ఠా దర్జునా న్నావరః క్వచిత్. 8

ఈతడు మూడులోకములలో గొప్పవిలుకాడని ప్రసిద్ధి గన్నవాడు. అట్టి నరశ్రేష్ఠుడగు అర్జునునికంటె నే నెందును తక్కువవాడను గాను.

ఇత శ్చేతశ్చ నిర్ముక్తైః కాఞ్చనై ర్గార్ధ్రవాజితైః,
దృశ్యతా మద్య వై వ్యోమ ఖద్యోతై రివ సంయుతమ్. 9

---

5. పుఙ్ఖసక్తానామ్ - సక్తపుఙ్ఖానామ్ - అల్లెత్రాటియందు తగిలినపుంటములు గల.
9. గార్ధ్రవాజితైః - గ్రద్దయీకలచేత పుట్టిన వేగము, పక్షము లేక శబ్దము కలని.

గ్రద్ద యీకలచేత వేగము పుంజుకొను నా బంగారు బాణములు వింటినుండి వెలువడి చిందరవందరగా మింటికెగయగా ఆగనము మిణుగురులతో నిండినట్లు కానవచ్చును.

అద్యాహ మృణ మక్షయ్యం పురా వాచా ప్రతిశ్రుతమ్,
ధార్తరాష్ట్రాయ దాస్యామి నిహత్య సమరేఽర్జునమ్. 10

ముందు మాట యిచ్చిన ప్రకారము, ఈనాడు యుద్ధమున అర్జునుని చంపి దుర్యోధనుని తరుగని అప్పును తీర్తును.

అన్తరాచ్ఛిద్యమానానాం పుఙ్ఖానాం వ్యతిశీర్యతామ్,
శలభానామివాకాశే ప్రచారః సంప్రదృశ్యతామ్. 11

నడిదారియందే విరిగి జారిపోవు పుంఖములుగల బాణముల గతి ఆకాశమున మిడుతలలగతి వలె కానవచ్చును. చూడుడు !

ఇన్ద్రాశని సమస్పర్శం మహేన్ద్ర సమ తేజసమ్,
అర్దయిష్యామ్యహం పార్థ ముల్కాభి రివ కుఞ్జరమ్. 12

మహేంద్రుని తేజస్సువంటి తేజస్సుగల అర్జునుని, ఇంద్రుని వజ్రము తాకినట్లు తాకు బాణములతో ఏనుగును అంకుశములతో వలె పొడుతును.

రథా దతిరథం శూరం సర్వశస్త్రభృతాం వరమ్,
వివశం పార్థ మాదాస్యే గరుత్మానివ పన్నగమ్. 1

అస్త్రమును పట్టినవారిలో గొప్పవాడును, శూరుడును, అతిరథుడును అగు అర్జునుని రథమునుండి పడగొట్టి గరుత్మంతుడు పామును పట్టినట్లు పట్టుదును.

త మగ్ని మివ దుర్ధర్ష మసి శక్తి శరేన్ధనమ్,
పాణ్డవాగ్ని మహం దీప్తం ప్రదహన్త మివాహితమ్,

అశ్వవేగ పురోవాతో రథౌఘ స్తనయిత్నుమాన్,
శరధారో మహామేఘః శమయిష్యామి పాణ్డవమ్. 14

అర్జునుడు ఆర్పరాని అగ్ని. దానికి ఖడ్గములు, శక్తులు, బాణములు కట్టెలు, అది పగవారిని బూడిద చేయునట్లు మండుచుండును. నేనొక పెద్ద మేఘమును. నా గుఱ్ఱముల వేగమే వాలుగాలి. మన రథముల సముదాయమే ఉరుములు మెఱుపులు, బాణములే నీటి ధారలు. అట్టి నేను అర్జునుని ఆర్పివేయుదును.

మత్కార్ముక వినిర్ముక్తాః పార్థ మాశీవిషోపమాః,
శరాః సమభిసర్పన్తు వల్మీక మివ పన్నగాః. 16

నా వింటినుండి వెడలిన త్రాచుపాముల వంటి బాణములు పుట్టలో అన్నివైపుల దూరినట్లు అర్జునునిలో చొచ్చుకొని పోవుగాక!

సుతేజనై రుక్మపుఙ్ఖైః సుధౌతై ర్నతపర్వభిః,
ఆచితం పశ్య కౌన్తేయం కర్ణికారై రివాచలమ్. 17

చక్కగా పదునెక్కినవి, బంగారు పుంఖములు కలవి, శుభ్రముగా నున్నవి, సరిచేసిన ముడులు కలవి అగు నా బాణములు, — చూడు — కొండగోగులు పర్వతమును కప్పివేయునట్లు అర్జునుని కప్పివేయును.

జామదగ్న్యా న్మయా హ్యస్త్రం యత్ ప్రాప్త మృషిసత్తమాత్,
తదుపాశ్రిత్య వీర్యం చ యుధ్యేయ మపి వాసవమ్. 18

ఋషిశ్రేష్ఠుడగు పరశురాముని దయవలన గొప్ప అస్త్రమును సాధించితిని. దానిని నాశక్తిని ఆధారముగ చేసికొని ఇంద్రునితో నైనను పోరగలను.

ధ్వజాగ్రే వానర స్తిష్ఠన్ భల్లేన నిహతో మయా,
అద్యైవ పతతాం భూమౌ వినదన్ భైరవాన్ రవాన్. 19

7. నతపర్వభిః - ముడుల దగ్గర సమముగా చేయబడిన.

ధ్వజపతాకముపై నున్న కోఁతి నా బాణపు దెబ్బకు భయం
కరముగా బొబ్బలిడుచు నేడు నేలఁ గూలును.

శత్రో ర్మయా విపన్నానాం భూతానాం ధ్వజవాసినామ్,
దిశః ప్రతిష్ఠ మానానా మస్తు శబ్దో దివంగమః 20

పగవాని ధ్వజమున నుండు భూతములు నా దెబ్బకు కూలి
దిక్కులకు పరువెత్తుచు చేయురొద ఆకాశమునంటును.

అద్య దుర్యోధన స్యాహం శల్యం హృది చిరస్థితమ్,
సమూల ముద్ధరిష్యామి బీభత్సుం పాతయన్ రథాత్. 21

దుర్యోధనుని గుండెలో చిరకాలము గ్రుచ్చికొని యున్న
ముంటిని, నేడు వివ్వచ్చుని రథమునుండి పడగొట్టి మొత్తముగా
పెకలించివైతును.

హతాశ్వం విరథం పార్థం పౌరుషే పర్యవస్థితమ్,
నిః శ్వసన్తం యథానాగ మద్య పశ్యన్తు కౌరవాః. 22

గుఱ్ఱములు చచ్చి, రథము విరిగి, పౌరుషముపై పెనగులాడుచు
పామువలె బుసకొట్టుచున్న అర్జునుని నేడు కౌరవులు కాంతురు గాక!

కామం గచ్ఛన్తు కురవో ధనమాదాయ కేవలమ్,
రథేషు వాపి తిష్ఠన్తో యుద్ధం పశ్యన్తు మామకమ్, 23

కౌరవులు గోధనమును కైకొని యథేచ్ఛముగా చనుడు.
లేదా, రథములపై నిలిచి నా దైన యుద్ధమును తిలకింపుడు.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి
ఉత్తరగోగ్రహే కర్ణవికత్థనే అష్టచత్వారింశోఽధ్యాయః

ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున
ఉత్తరగోగ్రహమున కర్ణుడు బీరములాడుట అను నలుబదియెనిమిదవ అధ్యాయము

## ఏకోనపఞ్చాశత్తమోఽధ్యాయః నలుబదితొమ్మిదవ అధ్యాయము

కర్ణం నిర్భర్త్స్య కృపాచార్యేణ స్వమత ప్రకాశనమ్.

కర్ణుని మందలించి కృపాచార్యుడు తనమతమును వెల్లడించుట.

కృప ఉవాచ - కృపుడిట్లు పలికెను.

సదైవ తవ రాధేయ యుద్ధే క్రూరతరా మతిః,
నార్థానాం ప్రకృతి వేత్సి నానుబన్ధ మవేక్షసే. 1

ఓయీ కర్ణా! నీ కెల్లప్పుడు యుద్ధమునందే మిక్కిలి క్రూరమైన బుద్ధి. అర్థముల స్వభావమేమో, వాని ఫలము లెట్టివో యెరుగవు.

మాయా హి బహవః సన్తి శాస్త్ర మాశ్రిత్య చిన్తితాః,
తేషాం యుద్ధం తు పాపిష్ఠం వేదయన్తి పురావిదః. 2

శాస్త్రము నాశ్రయించి తెలిసికొనిన మాయలు పెక్కులు కలవు. పురావేత్తలు మాయ యుద్ధము మిక్కిలి పాపిష్ఠమని చెప్పుదురు.

దేశ కాలేన సంయుక్తం యుద్ధం విజయదం భవేత్,
హీన కాలం తదే వేహ ఫలం న లభతే పునః,
దేశే కాలే చ విక్రాన్తం కల్యాణాయ విధీయతే. 3

---

1. అర్థానామ్ - గోవులు మున్నగువాని యొక్క: ప్రకృతిమ్ = ప్రాప్తి కారణమును, అనుబన్ధమ్ - ప్రాప్తించిన వెనుకవచ్చు ఫలము: ద్యూతము వలన వచ్చిన సంపద పరిణామసుఖముకాదని భావము
2. ద్యూతముతో గెలిచినట్లు ఇప్పుడు అర్జునని కపట యుద్ధమున గెలువశక్యము కాదని భావము,
3. గ్రీష్మమగుటవలన కాలము, గిరిదుర్గమగుట వలన దేశము మనకు అనుకూలములు కావని భావము;

తగు దేశమున, తగిన కాలమున సమకూడిన యుద్ధము విజయము నిచ్చును. కాలము కలిసిరానిచో అదియే ఫలమునకు రాక పోవును. తగు దేశకాలముల వరసి పరాక్రమించినచో శుభము ఘటిల్లును.

ఆనుకూల్యేన కార్యాణా మన్తరం సంవిధీయతే,
భారం హి రథకారస్య నవ్యవస్యన్తి పణ్డితాః. 4

దేశకాలములు సరిపడినచో యుద్ధాది కార్యములు ఫలవంతములగును, రథములు చేయువానిపై భారముంచి వివేకులు యుద్ధమునకు దిగరు.

పరిచిన్త్యతు పార్థేన సంనిపాతో న నః క్షమః,
ఏకః కురూ నభ్యాగచ్ఛే దేక శ్చాగ్ని మతర్పయత్. 5

చక్కగా ఆలోచించినచో మనమిపుడు అర్జునునితో తలపడుట యుక్తము కాదు. ఒంటరిగా కౌరవులపైకి వచ్చుచున్నాడనగా ఒంటరిగా అగ్నిని తృప్తిపరిచెను గదా!

ఏకశ్చ పఞ్చ వర్షాణి బ్రహ్మచర్య మధారయత్,
ఏకః సుభద్రా మారోప్య ద్వైరథే కృష్ణ మాహ్వాయత్. 6

ఒంటరిగా నైదు సంవత్సరములు బ్రహ్మచర్యమును పాలించెను. ఒంటిగా సుభద్రను రథ మెక్కించుకొని కృష్ణుని ఎక్కటి యుద్ధమునకు పురికొల్పెను.

ఏకః కిరాతరూపేణ స్థితం రుద్ర మయోధయత్,
అస్మిన్నేవ వనే పార్థో హృతాం కృష్ణా మవాజయత్. 7

4. రథకారస్య - ఇది ఒక సామెత

6. కృష్ణుని పురికొల్పెననగా యాదవులనని సంభావింపదగును. తిక్కన గారా తాత్పర్యమునే ప్రతిపాదించిరి. చూ. విరా. 4-210.

ఒక్కడై కిరాతరూపముతో వచ్చినిలిచిన రుద్రునితో పోరెను. ఈ వనమునందే ద్రౌపది అపహరింపబడగా తిరిగి ఆమెను సంపాదించుకొనెను.

ఏకశ్చ పఞ్చవర్షాణి శక్రా దస్త్రాణ్యశిక్షత,
ఏకః సోఽయ మరిం జిత్వా కురూణా మకరోద్యశః. 8

ఒక్కడై అయిదేండ్లు ఇంద్రునికడ అస్త్రవిద్య నభ్యసించెను, ఒక్కడై శత్రువును జయించి కౌరవులకు కీర్తిని ఆర్జించిపెట్టెను.

ఏకో గన్ధర్వరాజానం చిత్రసేన మరిందమః,
విజిగ్యే తరసా సంఖ్యే సేనాం ప్రాప్య సుదుర్జయమ్. 9

గెలువశక్యము కాని సేనలో చొరబడి యుద్ధమున ఒంటరిగా గంధర్వరాజగు చిత్రసేనుని ఓడించెను,

తథా నివాతకవచాః కాలఖఞ్జాశ్చ దానవాః,
దైవతై రప్యవధ్యాస్తే ఏకేన యుధి పాతితాః. 10

దేవతలకు కూడ చంపశక్యము కాని వారగు నివాతకవచులు, కాలఖంజులు అను రక్కసులను ఒక్కడై యుద్ధమున కూలనేసెను.

ఏకేన హి త్వయా కర్ణ కిం నామేహ కృతం పురా,
ఏకైకేన యథా తేషాం భూమిపాలా వశే కృతాః. 11

కర్ణా ! వారొక్కొక్కరు విడివిడిగా యుద్ధమున రాజులను వశపరచుకొనినట్లు నీవు ఒక్కడవై మునుపు సాధించిన ఘనకార్యమేమి కలదు ?

ఇన్ద్రోఽపి హి న పార్థేన సంయుగే యోద్ధు మర్హతి,
య స్తే నాశంసతే యోద్ధుం కర్తవ్యం తస్య భేషజమ్. 12

ఇంద్రుడు కూడ అర్జునునితో యుద్ధమున పోరజాలడు, అర్జునునితో పోరు గోరువానికి వైద్యము చేయవలయును.

ఆశీవిషస్య క్రుద్ధస్య పాణి ముద్యమ్య దక్షిణమ్,
అవముచ్య ప్రదేశిన్యా దంష్ట్రా మాదాతు మిచ్ఛసి. 13

కోపించిన త్రాచుపామును కుడిచేతి నెత్తి చూపుడువ్రేలితో ముట్టి కోర పెరుకగోరుచున్నావు.

అథవా కుఞ్జరం మత్త మేక ఏవ చరన్ వనే,
అనఙ్కుశం సమారుహ్య నగరం గన్తు మిచ్ఛసి. 14

వనమున ఒంటరిగా తిరుగుచు ఒకమదించిన ఏనుగును అంకుశము లేనిదానిని ఎక్కి నగరమున కరుగ దలచుచున్నావు,

సమిద్ధం పావకం చైవ ఘృతమేదోవసా హుతమ్,
ఘృతాక్తచీరవాసా స్త్వం మధ్యే నోత్తర్తు మిచ్ఛసి. 15

నేయి, మెదడు, వస అనువానితో హోమముచేయగా మంట లెగయుచున్న అగ్నిని నేతితో తడిసిన వస్త్రములు కలవాడవై నడిమిభాగమునుండి దాట నెంచుచున్నావు.

ఆత్మానం యః సముద్బధ్య కణ్ఠే బద్ధ్వా మహాశిలామ్,
సముద్రం తరతే దోర్భ్యాం తత్ర కిం నామ పౌరుషమ్. 16

ఎవ్వడైనను తన్ను గట్టిగా కట్టిపై చుకొని మెడ కొకబండను కట్టికొని చేతులతో సముద్రమును దాటునా ? అచట మగతన మేమగును ?

అకృతాస్త్రః కృతాస్త్రం వై బలవన్తం సుదుర్బలః,
తాదృశం కర్ణ యః పార్థం యోద్ధు మిచ్ఛేత్ సుదుర్మతిః. 17

అస్త్రములు నేర్వనివాడు అస్త్రములయం దారతేరిన వానితో, బక్కచిక్కినవాడు బలవంతునితో పోరనెంచుటయెట్టిదో కర్ణా ! అర్జునునితో మిక్కిలి దుర్మతియైనవాడు పోరగోరుట యట్టిది.

---

13. ప్రదేశిన్యా - చూపుడువ్రేలితో.

అస్మాభిర్హ్యేష నిభృతో వర్షాణీహ త్రయోదశ,
సింహః పాశవినిర్ముక్తో న నః శేషం కరిష్యతి. 18

మనము పదమూడు ఏండ్లు ఈతనిని అలిగించితిమి. ఇప్పుడాతడు కట్లువదలిన సింహమువలె నున్నాడు. మనలను మిలుగు లేకుండ చేయును.

ఏకాన్తే పార్థ మాసీనం కూపేఽగ్ని మివ సంవృతమ్,
అజ్ఞానా దభ్యవస్కన్ద్య ప్రాప్తాః స్మో భయ ముత్తమమ్. 19

ఎక్కడనో ఒంటిగా గుహలో గుట్టుగా నున్న నిప్పువలె కూర్చున్న అర్జునుని బుద్ధిలేక ఉసికొల్పితిమి. మన కిప్పుడు పెను భయము దాపురించినది.

సహ యుద్ధ్యామహే పార్థ మాగతం యుద్ధదుర్మదమ్,
సైన్యా స్తిష్ఠన్తు సంనద్ధా వ్యూఢానీకాః ప్రహారిణః. 20

కావున యుద్ధమునకు మహోత్సాహముతో వచ్చిన అర్జునునితో అందరము కలసి పోరుదము. సేన యంతయు మొగ్గరములు తీర్చి గట్టిగా పోరుటకై సిద్ధముగా నుండవలయును.

ద్రోణో దుర్యోధనో భీష్మో భవాన్ ద్రౌణి స్తథా వయమ్,
సర్వే యుధ్యామహే పార్థం కర్ణ మా సాహసం కృథాః. 21

ద్రోణుడు, దుర్యోధనుడు, భీష్ముడు, నీవు, అశ్వత్థామ, నేను - మన మందరము కలిసి పోరుదము. కర్ణా! సాహసము చేయకు.

వయం వ్యవసితం పార్థం వజ్రపాణి మివోద్యతమ్,
షడ్రథా ప్రతియుధ్యేమ తిష్ఠేమ యది సంహతాః. 22

ఒక్కపెట్టు లేచి వజ్రపాణివలె వచ్చిపడిన అర్జునునితో మన మారుగురము కలిసి నిలిచినచో పోరగలము.

---

22. షడ్రథాః - కర్ణుడు తానొక్కడే తలపడగోరెను. కృపుడు ఆరుగురము కలసి పోరినచో నిలువగల మని చెప్పుచున్నాడు.

వ్యూఢానీకాని సైన్యాని యత్తాః పరమధన్వినః
యుధ్యామహేఽర్జునం సంఖ్యే దానవా ఇవ వాసవమ్. 23

సైన్యములను చక్కగా నిలుపుకొని సిద్ధముగా నుండిన గొప్ప విలుకాండ్ర మగు మనము, దేవేంద్రునితో పోరు దానవులవలె, అర్జునునితో పోరాడుదము.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే
కృపవాక్యం నామ ఏకోన పఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహము
న కృపవాక్యమను నలుబది తొమ్మిదవ అధ్యాయము.

## పఞ్చాశత్తమోఽధ్యాయః - ఏబదియవ అధ్యాయము

అశ్వత్థామ్న ఉద్గారః.

అశ్వత్థామ కోపమును వెళ్ళగక్కుట.

అశ్వత్థామోవాచ - అశ్వత్థామ యిట్లు పలికెను.

న చ తావజ్జితా గావో న చ సీమాన్తరం గతాః,
న హాస్తినపురం ప్రాప్తాస్త్వం చ కర్ణ వికత్థసే. 1

కర్ణా! మన మింకను గోవులను పూర్తిగా వశపరచుకొనలేదు. శత్రువుల పొలిమేరలను దాటలేదు. హస్తినాపురమును చేరలేదు. నీవేమో వట్టి బీరములు పలుకుచున్నావు.

సంగ్రామాంశ్చ బహూఞ్జిత్వా లబ్ధ్వా చ విపులం ధనమ్,
విజిత్య చ పరాం సేనాం నాహుః కిఞ్చన పౌరుషమ్. 2

1. శూరులు పరులధనము నొడిచికొని పరుల పొలిమేరలను దాటి తమనగరమును చేరియు డంబములు పలుకరు. నీవేమో యింకేదియు చేయకయే బీరములు పలుకుచు సిగ్గుపడకున్నావని భావము.

అనేక యుద్ధములు చేసియు, గొప్పధనమును సాధించియు, శత్రుసేనను రూపుమాపియు బుద్ధిగలవారు పౌరుషమును చాటుకొనరు.

దహత్యగ్ని రవాక్యస్తు తూష్ణీం భాతి దివాకరః,
తూష్ణీం ధారయతే లోకాన్ వసుధా సచరాచరాన్. 3

నిప్పు పలుకకుండనే కాల్చివేయును. సూర్యుడు మాటాడకయే వెలుగొందును - ఈ వసుధ చరాచర భూతకోటిని నోరు విప్పకయే మోయుచున్నది.

చాతుర్వర్ణ్యస్య కర్మాణి విహితాని స్వయమ్భువా,
ధనం యైరధిగన్తవ్యం యచ్చ కుర్వన్ న దుష్యతి. 4

నాలుగు వర్ణములవారికి తగిన పనులను పరమాత్ముడు ఏర్పాటుచేసెను. వేనితో ధనములను పొందవచ్చునో ఏపనులు చేసిన చెడదో చెప్పెదను.

అధీత్య బ్రాహ్మణో వేదాన్ యాజయేత యజేత వా,
క్షత్రియో ధనురాశ్రిత్య యజేచ్చైవ న యాజయేత్. 5

వేదములను అధ్యయనముచేసి, యజ్ఞములను చేయించుటయో, తాను స్వయముగా చేయుటయో బ్రాహ్మణునకు కర్తవ్యము. క్షత్రియుడు విల్లు చేపట్టవలయును. అతడు యజ్ఞము చేయవచ్చును గాని చేయింపరాదు.

వైశ్యోఽధిగమ్య విత్తాని బ్రహ్మకర్మాణి కారయేత్,
శూద్రః శుశ్రూషణం కుర్యాత్ త్రిషు వర్ణేషు నిత్యశః.

4. వీరిని (బ్రాహ్మణులను) మహాభయము వచ్చినచోట సంప్రదింపరాదని కర్ణుడు ఆక్షేపించి యుండెను. అయినచో నీవు వైశ్యుడవుకదా! యుద్ధమున నీకెట్టి సామర్థ్యము కలదు? అని యెత్తిచూపుటకై వర్ణముల కర్మలను వివరించుచున్నాడు.

వర్ణనాయోగవిధిభి ర్వైప్రసీం వృత్తి మాశ్రితః. 6

వైశ్యుడు ధనమార్జించి వేదమున చెప్పిన కర్మములను చేయవలయును. శూద్రుడు నిత్యము వందనాదులతో, నీటిప్రబ్బలివంటి ప్రవృత్తితో, మూడు వర్ణములవారి యందును శుశ్రూష చేయవలయును.

వర్తమానా యథాశాస్త్రం ప్రాప్య చాపి మహీ మిమామ్,
సత్కుర్వన్తి మహాభాగా గురూన్ సువిగుణా నపి. 7

శాస్త్రము ప్రకారము ప్రవర్తించు సత్పురుషులు ఈ భూమండలమంతయు చేజిక్కించుకొనియు, గురువులు గుణరహితులైనను వారిని సత్కరింతురు.

ప్రాప్య ద్యూతేన కో రాజ్యం క్షత్రియ స్తోష్టు మర్హతి,
తథా నృశంసరూపో ఽయం ధార్తరాష్ట్రశ్చ నిర్ఘృణః. 8

ద్యూతములో రాజ్యమును గెలిచిన క్షత్రియుడు స్తుతి కర్హుడా ? ఈ ధృతరాష్ట్రపుత్రుడావిధముగా క్రూరుడు, సిగ్గు లేనివాడు.

తథాధిగమ్య విత్తాని కో వికత్థేద్ విచక్షణః,
నికృత్యా వఞ్చనాయోగై శ్చరన్ వైతంసికో భవేత్. 9

అట్లు మోసముతో కపటోపాయములతో వేటకానివలె ధనములను పొంది వివేకమున్నవాడు పొగడుకొనునా ?

---

6. విత్తాని అధిగమ్య - వ్యవసాయము మున్నగు పనులచేత ధనమార్జించి, బ్రహ్మకర్మాణి - వేదముచెప్పిన ఆధానము మొదలగు కర్మములను, కారయేత్ - చేయవలయును. (ఇచట ణిచ్ ప్రత్యయము స్వార్థమున వచ్చినది)
7. నీవో అన్యాయముగా పాండవులను గెలిచి సాధువులైన గురువులను నిందించుచున్నావని భావము.
8. నిర్ఘృణః - నిర్లజ్జుడు,
9. వైతంసికః - వితంస మనగా వలవంటిది. వానితో బ్రదుకు వేటకాడు వైతంసికుడు.

కతమద్ ద్వైరథం యుద్ధం యత్రా జైషీ ర్ధనంజయమ్,
నకులం సహదేవం వా ధనం యేషాం త్వయా హృతమ్. 10

నీవు ఎన్నడైన ఎక్కటికయ్యమున అర్జునుని గాని, నకులుని గాని సహదేవుని గాని గెలిచితివా ? వారి ధనమును ఒడిచి కొంటివిగాని.

యుధిష్ఠిరో జితః కస్మిన్ భీమశ్చ బలినాం వరః,
ఇన్ద్రప్రస్థం త్వయా కస్మిన్ సంగ్రామే నిర్జితం పురా. 11

ధర్మరాజుగాని బలవంతులలో మిన్నయగు భీముడు కాని నీకు ఎన్నడైన ఏయుద్ధముననైన ఓడెనా ? ఇంద్రప్రస్థమును మున్ను నీ వేయుద్ధమున గెలిచితివి ?

తథైవ కతమద్ యుద్ధం యస్మిన్ కృష్ణా జితా త్వయా,
ఏకవస్త్రా సభాం నీతా దుష్టకర్మన్ రజస్వలా. 12

పాడుపనులు చేయువాడా ! రజస్వలయై, ఒంటిబట్టతో నున్న ద్రౌపదిని ఏయుద్ధమున గెలిచి సభ కీడ్చితివి ?

మూల మేషాం మహత్ కృత్తం సారార్థీ చన్దనం యథా,
కర్మ కారయిథాః సూత తత్ర కిం విదురోఽబ్రవీత్. 13

10. ఇన్ద్రప్రస్థమ్ - ఇంద్రప్రస్థమున నున్న పాండవుల సనిభావము.
13. మూలమ్ ఏషామ్ - పాండవుల మూలము మహత్ - అనగా బ్రహ్మము శ్రీకృష్ణరూపమైనది, వేదవాక్య రూపమైనది, బ్రాహ్మణరూపమైనది. "మూలంకృష్ణో బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ" అని ఆదిపర్వమున గలదు. ద్యూతము వేదవిరుద్ధమగుటచే దుర్యోధనుడు కపటద్యూత మాడించి ధర్మమూలమును నరకెను. బ్రాహ్మణనింద చేయుచున్న నీవును అట్టివాడవే. కావున ధర్మనాశనమువలన మీకు వినాశము తప్పదని భావము - సారార్థీ - ధనమును కోరువాడు,
ఇందలి 'సూత' అను సంబోధనము సాభిప్రాయము. రథము తోలుకొను వానికి యుద్ధకౌశల మెచటిదని హేళన. కర్ణుడు పుట్టుకతో క్షత్రియుడైనను సంస్కారమువలన సూతుడయ్యెను,

చందనమువంటి పాండవుల గొప్పమూలమును భేదించితివి. ధనమునందలి పేరాసతో వారిచే నీచమైన పనులు చేయించితివి. ఓయీ సూతుడా! ఆనాడు విదురు డేమనెనో స్మరింపుము.

యథాశక్తి మనుష్యాణాం శమ మాలక్షయామహే,
అన్యేషా మపి సత్త్వానా మపి కీటపిపీలకైః,
ద్రౌపద్యాః సంపరిక్లేశం న క్షన్తుం పాణ్డవోఽర్హతి. 14

మనుష్యులే కాదు. పురుగులు చీమలు కూడ శక్తియున్నంత మేరకు ఓరిమి వహించుట చూచుచున్నాము. కాని మీరు ద్రౌపదిని పెట్టిన పాటును పాండవులు క్షమింపరానిది.

క్షయాయ ధార్తరాష్ట్రాణాం ప్రాదుర్భూతో ధనంజయః,
త్వం పునః పణ్డితో భూత్వా వాచం వక్తు మిహేచ్ఛసి. 15

ధృతరాష్ట్ర కుమారులను రూపుమాపుటకై అర్జునుడు అవతరించెను. నీవేమో ఇచట పండితుడవై పసలేని పలుకు పలుకుచున్నావు.

వైరాన్తకరణో జిష్ణు ర్న నః శేషం కరిష్యతి. 16

ఈ పగను తుదిముట్టింపగోరు జయశీలి అర్జునుడు మనలను మిగులనీయడు.

నైవ దేవాన్ న గన్ధర్వాన్ నాసురాన్ న చ రాక్షసాన్,
భయా దిహ న యుధ్యేత కున్తీపుత్రో ధనంజయః, 17

కుంతీపుత్రుడగు అర్జునుడు దేవతలతో నైనను, గంధర్వులతో నైనను. అసురులతో నైనను, రాక్షసులతో నైనను భయపడి యుద్ధము చేయుడని లేదు.

---

14. పాండవుల కిచట ప్రత్యక్షకారణము లేకపోయినను వాలి సుగ్రీవుల యుద్ధమున రామునివలె ప్రవేశించి మిమ్ము శిక్షింతురని భావము.

యం యమేషోఽతి సంక్రుద్ధః సంగ్రామే నిపతిష్యతి,
వృక్షం గరుత్మానివ వేగేన వినిహత్య తమేష్యతి. 18

అర్జునుడు మిక్కిలి కోపముతో యుద్ధమున ఎవనిని నేల కూల్చునో వాని వానిని పక్షి వేగముతో చరచి ఉచ్చైక్కించును.

త్వత్తో విశిష్టం వీర్యేణ ధనుష్యమరరాట్సమమ్,
వాసుదేవ సమం యుద్ధే తం పార్థం కో న పూజయేత్. 19

నీకన్న బలమున మిన్న, ధనుర్విద్యయందు దేవేంద్రునికి సాటియైనవాడు, యుద్ధమున వాసుదేవునకు దీటైనవాడు. అట్టి అర్జునుని మన్నింపనివాడెవడు ?

దేవం దైవేన యుధ్యేత మానుషేణ చ మానుషమ్,
అస్త్రం హ్యస్త్రేణ యో హన్యాత్ కోఽర్జునేన సమః పుమాన్. 20

ఆ అర్జునుడు దైవమును దైవబలముతో మార్కొనును. మనుష్య శక్తిని మనుష్య శక్తితో ఎదిరించును. అస్త్రబలము నస్త్రబలముతో త్రిప్పికొట్టును. అతనికి సాటి ఎవ్వరు ?

పుత్రాదనన్తరం శిష్య ఇతి ధర్మవిదో విదుః,
ఏతేనాపి నిమిత్తేన ప్రియో ద్రోణస్య పాణ్డవః. 21

ధర్మమెరిగినవారు శిష్యుడు పుత్రునికంటె వేరుగాడందురు. ఈ కారణముచేతను అర్జునుడు ద్రోణునికి ప్రియుడు.

యథా త్వమకరోద్ద్యూత మింద్రప్రస్థం యథాహరః,
యథానైషీః సభాం కృష్ణాం తథా యుధ్యస్వ పాణ్డవమ్. 22

నీవు ద్యూత మెట్లాడితివో, ఇంద్రప్రస్థము నెట్లు అపహరించితివో సభకు కృష్ణ నెట్లు ఈడ్చితివో అట్టిపొంగుతో అర్జునునితో యుద్ధము చేయుము, చూతము.

---

18. వాడు చచ్చుట తథ్యము వానిని పక్షులు పీకికొని తినునని భావము.

అయం తే మాతులః ప్రాజ్ఞః క్షత్రధర్మస్య కోవిదః,
దుర్ద్యూతదేవీ గాన్ధారః శకుని ర్యుధ్యతా మిహ. 23

ఇదుగో నీమామ, తెలివిగలవాడు, క్షత్రధర్మమున పండితుడు, కపటద్యూతమున నేర్పుగలవాడు గాంధారరాజు శకుని యుండెనే ఆయన ఇచట యుద్ధమాడవలయును.

నాక్షాన్ క్షిపతి గాణ్డీవం న కృతం ద్వాపరం న చ
జ్వలతో నిశితాన్ బాణాం స్తాం స్తాన్ క్షిపతి గాణ్డీవమ్. 24

గాండీవము పాచికలను ప్రయోగింపదు. కృతము, ద్వాపరము, త్రేత అను వానిని అచట చేయదు. మండెడు వాడి బాణములను గుప్పించును.

న హి గాణ్డీవ నిర్ముక్తా గార్ధ్ర పత్రా సుతేజనాః,
నాన్తరే ష్వవతిష్ఠ న్తే గిరీణా మపి దారణాః. 25

గాండీవమునుండి దూసికొనివచ్చు గ్రద్దయీకలుగల మంచి పదునైన బాణములు నడుమ నిలువవు; అవి కొండలనైనను చీల్చివేయును.

అన్తకః పవనో మృత్యు స్తథాగ్ని ర్వడవాముఖః,
కుర్యు శ్శేషం క్వచిచ్ఛేషం న తు క్రుద్ధో ధనంజయః. 26

యముడు, వాయువు, మృత్యువు, బడబాగ్ని - ఇవి యైనను ఒకచో శేషముంచునేమో కాని కోపించిన అర్జునుడు మాత్రము శేషమును నుంచడు.

---

24. నకృతం, ద్వాపరం, నచ - అనుటచేత కృతద్వాపరములతోపాటు త్రేత కూడ చెప్పినట్లయినది. కృతము, త్రేత, ద్వాపరము, కలి యనునవి ద్యూత పరిభాషలు. ఒక గుర్తున్న ప్రదేశము - కలి, రెండున్నది, ద్వాపరము. మూడున్నది త్రేత, నాల్గున్నది కృతము.

అర్జునుడు గెలుచుటయే కాని ఓడుట జరుగదని తాత్పర్యము.

యథా సభాయాం ద్యూతం త్వం మాతులేన సహాకరోః,
తథా యుధ్యస్వ సంగ్రామే సౌబలేన సురక్షితః. 27

సభలో మేనమామతోకూడి జూద మెట్లాడితివో యిప్పుడట్లే యాశకుని రక్షింపగా యుద్ధము చేయుము.

యుధ్యన్తాం కామతో యోధా నాహం యోత్స్యే ధనంజయమ్,
మత్స్యో హ్యస్మాభి రాయోధ్యో యద్యాగచ్ఛేత్ గవాం పదమ్. 28

ఈ యోధులు వారి కోరిక మేరకు పోరిన పోరుదురుగాక! నేను మాత్రము అర్జునునితో యుద్ధమాడను. పశువులకై విరాటుడు వచ్చినచో అతనితోడనే కదా మనము పోరవలసినది.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే ద్రౌణి వాక్యం నామ పఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇతి శ్రీ మహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహణమున అశ్వత్థామవాక్యమను ఏబదియవ అధ్యాయము,

## ఏకపఞ్చాశత్తమోఽధ్యాయః — ఏబదియొకటవ అధ్యాయము

భీష్మస్య సైన్యే శాన్తి మైక్యం చ స్థాపయితుం యత్నో ద్రోణకర్తృకో దుర్యోధనరక్షా ప్రయత్నశ్చ.

సైన్యమున శాంతిని ఐక్యమును నెలకొల్పుటకు భీష్ముడు యత్నించుట, ద్రోణుడు చేసిన దుర్యోధన రక్షా ప్రయత్నము.

భీష్మ ఉవాచ - భీష్ముడిట్లు పలికెను.

సాధు పశ్యతి వై ద్రౌణిః కృపః సాధ్వనుపశ్యతి,
కర్ణస్తు క్షత్ర ధర్మేణ కేవలం యోద్ధు మిచ్ఛతి. 1

అశ్వత్థామ ఆలోచన మంచిది. కృపాచార్యునిదియు మంచి ఆలోచనయే. కర్ణుడు మాత్రము కేవలము క్షత్రియధర్మమును పట్టుకొని పోరగోరుచున్నాడు.

ఆచార్యో నావిభక్తవ్యః పురుషేణ విజానతా,
దేశకాలౌ తు సంప్రేక్ష్య యోద్ధవ్యమితి మే మతిః. 2

తెలివిగలమనుజుడు ఆచార్యుని భంగపరుపరాదు. దేశ కాలములను చక్కగా నరసికొని యుద్ధము చేయవలయునని నా యభిప్రాయము.

యస్య సూర్యసమాః పఞ్చ సపత్నా స్స్యుః ప్రహారిణః,
కథ మభ్యుదయే తేషాం న ప్రముహ్యేత పణ్డితః, 3

దుర్యోధనుని శత్రువులైదుగురు సూర్యునివంటివారు. మంచి పోటుగాండ్రు. వారి అభ్యుదయమును గాంచి మోహపడని పండితుడెవడుండును.

స్వార్థే సర్వే విముహ్యంతి యేఽపి ధర్మవిదో జనాః,
తస్మాద్రాజన్ బ్రవీమ్యేష వాక్యం తే యది రోచతే. 4

మనుజులు ధర్మమును ఎరిగినవారయ్యు స్వార్థమున అందరు పొరబడుదురు. కావున ఓరాజా! నీ కిష్టమైనచో ఈ మాట చెప్పుదును.

కర్ణో హి యదవోచత్ త్వాం తేజః సంజననాయ తత్,
ఆచార్యపుత్రః క్షమతాం మహత్ కార్య ముపస్థితమ్. 5

కర్ణుడు పలికినమాట తన తేజస్సును వెల్లడించుటకు మాత్రమే. ఆచార్యపుత్రుడు దానిని క్షమింప వలయును. ఇప్పుడు మనకు పెద్దపని వచ్చిపడినది.

నాయం కాలో విరోధస్య కౌన్తేయే సముపస్థితే,
క్షన్తవ్యం భవతా సర్వ మాచార్యేణ కృపేణ చ. 6

3. పఞ్చ సపత్నాః - పాండవులని భావము.
5. కర్ణుడు చేసిన ఆచార్యనింద యుద్ధమునకు పురికొల్పుటకా కాని ద్వేషముతో చేసినది కాదని భావము.

అర్జునుడు రాగా మన కిది విరోధములకు సమయముకాదు. ఓ అశ్వత్థామా! నీవును ద్రోణాచార్య కృపాచార్యులును జరిగినదానంతటిని క్షమింపవలయును.

భవతాం హి కృతాస్త్రత్వం యథాఽదిత్యే ప్రభా తథా,
యథా చన్ద్రమసో లక్ష్మీః సర్వథా నాపకృష్యతే. 7

మీరు అస్త్రవిద్యలో ఆరితేరుట సూర్యునిలో కాంతి వంటిది. చంద్రునిలో శోభవంటిది. దాని కెన్నటికిని లోటులేదు.

ఏవం భవత్సు బ్రాహ్మణ్యం బ్రహ్మాస్త్రం చ ప్రతిష్ఠితమ్,
చత్వార ఏకతో వేదాః క్షాత్ర మేకత్ర దృశ్యతే. 8

ఇట్లు తమరియందు బ్రాహ్మణ్యము, బ్రహ్మాస్త్రమును చక్కగా పాదుకొనియున్నవి. నాలుగు వేదము లొకవైపు, క్షాత్ర మొకవైపు కానవచ్చుచున్నవి.

నైతత్ సమస్త ముభయం కస్మింశ్చి దనుశుశ్రుమ,
అన్యత్ర భారతాచార్యాత్ సపుత్రా దితి మే మతిః. 9

భరతవంశపు ఆచార్యునియందు, ఆతని కుమారునియందు కాక మరియెచటను సంపూర్ణముగా నీ రెండును నిండియుండుట వినలేదు.

వేదాన్తాశ్చ పురాణాని ఇతిహాసం పురాతనమ్,
జామదగ్న్యమృతే రాజన్ కో ద్రోణా దధికో భవేత్. 10

వేదాంతములు, పురాణములు, పురాతనమైన ఇతిహాసము వీనిలో పరశురాము డొక్కడు కాక ఓ రాజా! ద్రోణునికన్న మిన్నయగువాడు కలడా?

బ్రహ్మాస్త్రం చైవ వేదాశ్చ నైత దన్యత్ర దృశ్యతే,
బ్రహ్మాస్త్రము, వేదములు మరియేవ్యక్తియందును కానరావు.

ఆచార్యపుత్రః క్షమతాం నాయం కాలో విభేదనే. 11

సర్వై సంహత్య యుధ్యామః పాకశాసని మాగతమ్. 12

అశ్వత్థామ క్షమింపవలయును. ఇది మనలో భేదము పొందుటకు తగినసమయము కాదు. మన మందరము కూడి వచ్చిన ఇంద్రతనయునితో పోరవలయును.

బలస్య వ్యసనానీహ యాన్యుక్తాని మనీషిభిః,
ముఖ్యో భేదో హి తేషాం తు పాపిష్ఠో విదుషాం మతః. 13

సేనకు వచ్చు కీడులని బుద్ధిమంతులు చెప్పువానిలో ముఖ్యమైనది భేదము. అది పాపిష్ఠమని తెలిసినవా రందురు.

అశ్వత్థామోవాచ - అశ్వత్థామ యిట్లు పలికెను

నైవ న్యాయ మిదం వాచ్య మస్మాకం పురుషర్షభ !,
కిన్తు రోషపరీతేన గురుణా భాషితా గుణాః. 14

ఓ మహానుభావా ! మా యీ న్యాయబద్ధమైనమాటను నీవు నిందింపగాదు. గురువు రోషముతో కూడినవాడై అర్జునునిగుణములను కీర్తించెను.

శత్రో రపి గుణా గ్రాహ్యాః దోషా వాచ్యా గురో రపి,
సర్వథా స్వయత్నేన పుత్రే శిష్యే హితం వదేత్. 15

శత్రువే అయినను గుణములను గ్రహింపవలయును. గురువే అయినను వానిదోషములను నిందింపవలయును. అన్నివిధములగు ప్రయత్నములచేతను పుత్రుని విషయమున, శిష్యుని విషయమున హితమును పలుకవలయును.

దుర్యోధన ఉవాచ - దుర్యోధను డిట్లు పలికెను

ఆచార్య ఏవ క్షమతాం శాన్తి రత్ర విధీయతామ్,
అభిద్యమానే తు గురౌ తద్వృత్తం రోషకారితమ్. 16

---

14. రోషపరీతేన - పావపుజూదము నుప్పగు వానిచేత దుర్యోధనాదులయందు కోపముతో కూడినవాడై; గుణాః - అర్జునుని గుణములు.

ఆచార్యులే క్షమింపవలయును. ఇప్పుడు శాంతిని కూర్ప వలయును. గురువులు చేసినది కేవలము దోషమువలననే కాని భేదమువలన కాదు.

వైశంపాయన ఉవాచ - వైశమ్పాయను డిట్లు పలికెను

తతో దుర్యోధనో ద్రోణం క్షమయామాస భారత !,
సహ కర్ణేన భీష్మేణ కృపేణ చ మహాత్మనా. 17

అంత దుర్యోధనుడు కర్ణునితో, భీష్మునితో, మహాత్ముడగు కృపునితోకూడి ద్రోణుని శాంతింపజేసెను.

ద్రోణ ఉవాచ - ద్రోణు డిట్లు పలికెను

యదేతత్ ప్రథమం వాక్యం భీష్మః శాన్తనవోఽబ్రవీత్,
తేనైవాహం ప్రసన్నో వై నీతి రత్ర విధీయతామ్. 18

ఈ భీష్ముడు పలికిన మొదటివాక్యము వలననే నామనస్సు కలతదీరినది. ఇప్పుడు చేయదగిన నీతిని చేయవలసియున్నది.

యథా దుర్యోధనం పార్థో నోపసర్పతి సంగరే,
సాహసాద్ యది వా మోహాత్ తథా నీతి ర్విధీయతామ్. 19

అర్జునుడు యుద్ధమున సాహసించియో, పొరపాటువనో దుర్యోధనుని సమీపింపకుండునట్లు మనము నీతిని పన్నవలయును.

వనవాసే హ్యనిర్వృత్తే దర్శయే న్న ధనంజయః,
ధనం చాలభమానోఽత్ర నాద్య తత్ క్షన్తు మర్హతి. 20

వనవాసము ముగియకముందు అర్జునుడు మనకు కానరాడు. గోధనమును తిరిగి సాధింపక నేడు మనలను క్షమింపడు.

యథా నాయం సమాయుఞ్జ్యాద్ ధార్తరాష్ట్రాన్ కథంచన,
న చ సేనాః పరాజయ్యాత్ తథా నీతి ర్విధీయతామ్. 12

ఎతడు ధృతరాష్ట్రుని కొమరులను పట్టుకొనకుండునట్లును, సేనలను జయింపకుండు విధమునను మనము నీతిని ప్రయోగింప వలయును.

ఉక్తం దుర్యోధనేనాపి పురస్తాద్ వాక్య మీదృశమ్, 22
తదనుస్మృత్య గాఙ్గేయ యథావద్ వక్తు మర్హసి.

దుర్యోధనుడు కూడ మును పీప్రసంగము తెచ్చెను. దానిని స్మరించి ఓభీష్మా ! నీభావమును తెలుపుము.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తర గోగ్రహే ద్రోణవాక్యే ఏకపఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున ద్రోణవాక్యముగల ఏబదియొకటవ అధ్యాయము

## ద్విపఞ్చాశత్తమోఽధ్యాయః_ఏబదిరెండవ అధ్యాయము

భీష్మస్య సమ్మతిః
భీష్ముడు సమ్మతించుట.

భీష్మ ఉవాచ - భీష్ము డిట్లు పలికెను.

కలాః కాష్ఠాశ్చ యుజ్యంతే ముహూర్తాశ్చ దినాని చ, 1
అర్ధమాసాశ్చ మాసాశ్చ నక్షత్రాణి గ్రహా స్తథా.

ఋతవ శ్చాపి యుజ్యంతే తథా సంవత్సరా అపి, 2
ఏవం కాలవిభాగేన కాలచక్రం ప్రవర్తతే.

కళలు, కాష్ఠలు, ముహూర్తములు, దినములు, పక్షములు, మాసములు, నక్షత్రములు, గ్రహములు, ఋతువులు, సంవత్సరములు ఇట్లు విభాగముతో కాలచక్రము ప్రవర్తిల్లుచుండును.

తేషాం కాలాతిరేకేణ జ్యోతిషాంచ వ్యతిక్రమాత్, 3
పఞ్చమే పఞ్చమేవర్షే ద్వౌ మాసావుపజాయతః.

22. ఈ ప్రసంగమనగా అజ్ఞాతవాసము ముగిసెః లేదాః అను ప్రసంగమును,

వానిలో కాలప్రమాణము కొంచెము పెరుగుచుండును. నక్షత్రముల నడకలో హెచ్చుతగ్గులుండును. దానివలన అయిదేడు వత్సరములకు రెండు నెల లధికముగా వచ్చును.

ఏషా మభ్యధికా మాసాః పఞ్చ చ ద్వాదశ క్షపాః,
త్రయోదశానాం వర్షాణా మితి మే వర్తతే మతిః. 4

ఈ పదమూడు సంవత్సరములపై అయిదు నెలలు, పండ్రెండు రాత్రులు నా లెక్కప్రకారము అధికముగా గడచినవి.

సర్వం యథావచ్చరితం యద్ యదేభిః ప్రతిశ్రుతమ్,
ఏవ మేతద్ ధ్రువం జ్ఞాత్వా తతో బీభత్సు రాగతః. 5

వారేదేది ప్రతిజ్ఞ చేసిరో అది యంతయు చెప్పినట్లు ముగిసినది. ఇది నిశ్చయముగా ఎఱిగియే అర్జునుడు వచ్చెను.

సర్వే చైవ మహాత్మానః సర్వే ధర్మార్థకోవిదాః,
యేషాం యుధిష్ఠిరో రాజా కస్మాద్ ధర్మేఽపరాధ్నుయుః. 6

వారందరు మహాత్ములు. ధర్మార్థములలో పండితులు. వారికి రాజు యుధిష్ఠిరుడు. అట్టివారే కారణమున ధర్మము తప్పుదురు.

అలుబ్ధాశ్చైవ కౌన్తేయాః కృతవన్తశ్చ దుష్కరమ్,
న చాపి కేవలం రాజ్య మిచ్ఛేయు స్తేఽనుపాయతః. 7

కుంతీతనయులు లక్కురితి మనుష్యులు కారు. చేయశక్యము కానిపనిని చేసినవారు. ఉపాయమును వదలి కేవలము రాజ్యమును కోరరు.

తదైవ తే హి విక్రాన్తు మీషుః కౌరవనన్దనాః,
ధర్మపాశ నిబద్ధా స్తు న చేలుః క్షత్రియవ్రతాత్. 8

ఆ కౌరవకుమారులు అప్పుడే పరాక్రమము చేయగోరుదురు. ధర్మపాశమునకు కట్టువడి క్షత్రియవ్రతమునుండి చెదరకుండిరి.

యచ్చానృత ఇతి ఖ్యాయేద్ యః సగచ్ఛేత్ పరాభవమ్,
వృణుయు ర్మరణం పార్థా నానృతత్వం కథంచన. 9

ఎవడేని అర్జునుడు సత్యము తప్పెనని చెప్పినచో తప్పక పరాభవము పొందును. పృథాతనయులు మరణమైన కోరుదురు గాని అనృతము నెన్నటికిని వరింపరు.

ప్రాప్తకాలే తు ప్రాప్తవ్యం నోత్సృజేయు ర్నరర్షభాః,
అపి వజ్రభృతా గుప్తం తథా వీర్యా హి పాణ్డవాః. 10

నరవరులైన పాండవులు తగినసమయములో తాము పొందవలసినదానిని, వజ్రపాణి రక్షించునదైనను వదలిపెట్టరు. వారి వీర్య మట్టిది.

ప్రతియుధ్యేను సమరే సర్వశస్త్రభృతాం వరమ్,
తస్మాద్ యదత్ర కల్యాణం లోకే సద్భి రనుష్ఠితమ్,
తత్ సంవిధీయతాం శీఘ్ర మా వో హ్యర్థోఽత్యగాత్ పరమ్. 11

సర్వశస్త్రములను ధరించినవారిలో శ్రేష్ఠుడగు అర్జునుని యుద్ధమున నెదుర్కొందము. లోకమున సత్పురుషులు దేని నాచరింతురో ఆశుభకార్యమును మనము త్వరగా చేయవలయును. మన ప్రయోజనము పరులపాలు కాకుండుగాక.

నహి పశ్యామి సంగ్రామే కదాచిదపి కౌరవ !,
ఏకాన్తసిద్ధిం రాజేన్ద్ర సంప్రాప్తశ్చ ధనంజయః. 12

ఓకురు కుమారా! యుద్ధమున తప్పక గెలుపే కలుగునని ఎన్నటికిని భావింపజాలను. అందులో వచ్చినది అర్జునుడు.

సంప్రవృత్తే తు సంగ్రామే భావాభావౌ జయాజయౌ,
అవశ్య మేకం స్పృశతో దృష్ట మేత దసంశయమ్. 13

యుద్ధము జరిగినచో జయాపజయములలో ఏదో ఒక్కటియే కలుగును. ఇందు సందియము లేదు.

తస్మాద్ యథోచితం కర్మ కర్మవా ధర్మసంహితమ్,
క్రియతా మాశు రాజేన్ద్ర సంప్రాప్తశ్చ ధనంజయః. 14

కావున తగినపని త్వరగా నిర్ణయింపుము, అది ధర్మసహితమై యుండవలయును. ఓ రాజేన్ద్రా ! వచ్చినవాడు ఫల్గునుడు.

[ఏకో౽పి సమరే పార్థః పృథివీం నిర్దహే చ్ఛరైః,
భ్రాతృభి స్సహిత స్త్వథి కింపునః కౌరవాన్ జేనే,
తస్మాత్ సంధిం కురుశ్రేష్ఠ ! కురుష్వ యది మన్యసే,

సోదరులతోకూడి అర్జును డొక్కడే అయినను బాణములతో భూమినంతటిని కాల్చివేయును. నాయనా ! ఇంక కౌరవులను గూర్చి చెప్పనేల ? కావున కురుశ్రేష్ఠా ! మంచిదని తోచినచో సంధిచేయుము.

దుర్యోధన ఉవాచ - దుర్యోధను డిట్లు పలికెను

నాహం రాజ్యం ప్రదాస్యామి పాణ్డవానాం పితామహ !,
యుద్ధోపచారికం యత్తు తచ్ఛీఘ్రం ప్రవిధీయతామ్. 15

తాతా ! నేను పాండవులకు రాజ్య మీయను. యుద్ధమునకు సంబంధించిన దేదో దానిని త్వరగా నేర్పాటు చేయుడు.

భీష్మ ఉవాచ - భీష్మ డిట్లు పలికెను

అత్ర యా మామికా బుద్ధిః శ్రూయతాం యది రోచతే,
సర్వథా హి మయా శ్రేయో వక్తవ్యం కురునన్దన !, 16

నాయనా ! నీకు రుచించినచో నా అభిప్రాయమును వినుము. ఏమైనను నే నెల్లప్పుడు మీకు శ్రేయముగు దానినే చెప్పవలయును.

క్షిప్రం బలచతుర్భాగం గృహ్య గచ్ఛ పురం ప్రతి,
తతో౽పర చతుర్భాగో గాః సమాదాయ గచ్ఛతు. 17

నీవు నాల్గవ భాగము సేనను తీసుకొని మనపురమువైపు నడువుము. మరియొక నాల్గవవంతు సేన గోవులను కొనిపోవలయును.

వయం చార్ధేన సైన్యస్య ప్రతియోత్స్యామ పాణ్డవమ్,
అహం ద్రోణశ్చ కర్ణశ్చ అశ్వత్థామా కృప స్తథా,
ప్రతియోత్స్యామ బీభత్సు మాగతం కృతనిశ్చయమ్, 18

నేను, ద్రోణుడు, కర్ణుడు, అశ్వత్థామ, కృపుడు - ఈ మేము మిగిలిన సగము సేనతో అర్జునునిపై తలపడుదుము. తెంపుచేసి కొనివచ్చిన ఆతనితో పోరుదుము.

మత్స్యం వా పునరాయాత మాగతం వా శతక్రతుమ్,
అహ మావారయిష్యామి వేలేవ మకరాలయమ్. 19

ఆ వచ్చుచున్నది విరాటరాజే కానిమ్ము. లేక దేవేంద్రుడే కానిమ్ము. సముద్రమును చెలియలికట్టవలె నేను నిలువరింతును.

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను
తద్వాక్యం రురుచే తేషాం భీష్మే ణోక్తం మహాత్మనా,
తథాహి కృతవాన్ రాజా కౌరవాణా మనన్తరమ్. 20

మహాత్ముడగు భీష్ముడు చెప్పిన ఆమాట వారికి రుచించెను. కురురాజు దుర్యోధనుడు వెంటనే అట్లాచరించెను.

భీష్మః ప్రస్థాప్య రాజానం గోధనం తదనన్తరమ్,
సేనాముఖ్యాన్ వ్యవస్థాప్య వ్యూహితుం సమ్ప్రచక్రమే. 21

రాజును, గోధనమును బయలుదేరదీసి భీష్ముడు వెను వెంటనే సేనాధిపతులను ఏర్పరచి వ్యూహములు పన్నుటకు ఆరంభించెను.

భీష్మ ఉవాచ - భీష్ముడిట్లు పలికెను

ఆచార్య మధ్యే తిష్ఠ త్వ మశ్వత్థామా తు సవ్యతః,
కృపః శారద్వతో ధీమాన్ పార్శ్వం రక్షతు దక్షిణమ్. 22

ఆచార్యా! నీవు నడుమ నుండుము. అశ్వత్థామ ఎడమవైపు నిలుచును, ధీమంతుడగు కృపాచార్యుడు కుడివైపు రక్షించును.

అగ్రత స్సూతపుత్రస్తు కర్ణ స్తిష్ఠతు దంశితః,
అహం సర్వస్య సైన్యస్య పశ్చాత్ స్థాస్యామి పాలయన్. 23

సూతపుత్రుడగు కర్ణుడు ఆయుధములు ధరించి ముందు నిలుచును. నేను సర్వసేనను రక్షించుచు వెనుకవైపు నిలిచెదను.

[సర్వే మహారథాః శూరా మహేష్వాసా మహాబలాః,
యుధ్యంతు పాణ్డవశ్రేష్ఠ మాగతం యత్నతో యుధి.

మీరందరు మహారథులు, శూరులు, గొప్పవిలుకాండ్రు, గొప్పబలముకలవారు. యుద్ధమునకు వచ్చిన పాణ్డవశ్రేష్ఠునితో పోరాడుడు.

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

అభేద్యం సర్వసైన్యానాం వ్యూహ్య వ్యూహం కురూత్తమః,
వజ్రగర్భం వ్రీహిముఖ మర్ధచంద్రాంతమండలమ్.

సర్వసేనలకు భేదింపశక్యముకాని వజ్రగర్భము, వ్రీహిముఖము, అంతములతో అర్ధచంద్రాకారముకలదియు నగు మండల వ్యూహమును కురూత్తముడు భీష్ముడు ఏర్పరచెను.

తస్య వ్యూహస్య పశ్చార్ధే భీష్మ శ్చాపి యోద్యతాయుధః,
సౌవర్ణ తాలముచ్ఛ్రిత్య రథే తిష్ఠ న్నశోభత.

ఆ వ్యూహమునకు వెనక సిద్ధము చేసికొనిన ఆయుధములతో

బంగారు తాటిచెట్టు పతాకను నిలిపి భీష్ముడు నిలిచి విరాజిల్లెను.]

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే

భీష్మసైన్యవ్యూహే ద్విపఞ్చాశత్తమోఽధ్యాయః

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున

భీష్మసైన్యవ్యూహము అను ఏబదిరెండవ అధ్యాయము

## త్రిపఞ్చాశత్తమోఽధ్యాయః_ఏబదిమూడవ అధ్యాయము

దుర్యోధనసేనాం ప్రత్యాక్రమ్య అర్జునేన విరాటస్య గవాం

వినివర్తనమ్.

దుర్యోధనసేన నాక్రమించి అర్జునుడు విరాటుని గోవులను

మరలించుట.

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

అథ వ్యూహేష్వనీకేషు కౌరవేయేషు భారత, 1
ఉపాయా దర్జున స్తూర్ణం రథఘోషేణ నాదయన్.

ఆ కౌరవు లట్లు వ్యూహములు పన్నుకొనుచుండగా రథ

ఘోషము పిక్కటిల్ల చేయుచు అర్జునుడు శీఘ్రముగా వచ్చెను.

దదృశు స్తే ధ్వజాగ్రం వై శుశ్రువుశ్చ మహాస్వనమ్, 2
దోధూయమానస్య భృశం గాణ్డీవస్య చ నిస్వనమ్.

వారు ధ్వజపు అంచును చూచిరి. మహాధ్వనిని వినిరి.

మిక్కిలిగా విదలింపబడుచున్న గాండీవధ్వనిని వినిరి.

తత స్తు సర్వ మాలోక్య ద్రోణో వచన మబ్రవీత్, 3
మహారథ మనుప్రాప్తం దృష్ట్వా గాణ్డీవధన్వినమ్.

అట్లు వచ్చిన మహారథుడు గాంఢీవధారి అర్జునుని గాంచి

ద్రోణుడు అందరివైపు చూచి ఇట్లు పలికెను.

ద్రోణ ఉవాచ - ద్రోణు డిట్లు పలికెను

ఏతద్ ధ్వజాగ్రం పార్థస్య దూరతః సంప్రకాశతే,
ఏష ఘోషః సరథజో రోరవీతి చ వానరః. 4

ఇదిగో అర్జునుని ధ్వజాగ్రము దూరమునుండియే కానవచ్చు చున్నది. ఈ రథఘోష మాతనిదే. పతాకమందున్న వానరము బొబ్బలిడుచున్నది.

ఏష తిష్ఠన్ రథశ్రేష్ఠే రథే చ రథినాంవరః,
ఉత్కర్షతి ధనుః శ్రేష్ఠం గాణ్డీవ మశనిస్వనమ్. 5

రథులలో శ్రేష్ఠుడగు అర్జునుడు శ్రేష్ఠమగు రథమున నిలిచి ధనువులలో శ్రేష్ఠమును, పిడుగువంటి ధ్వనికలదియునగు గాండీవ మును లాగుచున్నాడు.

ఇమౌ చ బాణౌ సహితౌ పాదయోర్మే వ్యవస్థితౌ,
అపరౌ చాప్యతిక్రాన్తౌ కర్ణౌ సంస్పృశ్య మే శరౌ. 6

ఇవిగో రెండుబాణములు నా పాదములకడ నిలిచినవి. మరి రెండు నాచెవి ప్రక్కగా దూసికొని వెళ్ళినవి.

నిరుష్య హి వనే వాసం కృత్వా కర్మాతిమానుషమ్,
అభివాదయతే పార్థః శ్రోత్రే చ పరిపృచ్ఛతి. 7

వనవాసమును ముగించుకొని, మానవులకు సాధ్యముకాని కార్యమును నెరవేర్చితి నని అర్జునుడు నాకు నమస్కరించుచున్నాడు. చెవులకడ కుశల మడుగుచున్నాడు.

చిరదృష్టోఽయ మస్మాభిః ప్రజ్ఞావాన్ బాంధవప్రియః,
అతీవ జ్వలితో లక్ష్మ్యా పాణ్డుపుత్రో ధనంజయః. 8

ప్రజ్ఞకలవాడు, బంధువులయెడ ప్రేమకలవాడు అగు పాండు పుత్రుడు ధనంజయుడు బహుకాలమునకు కానవచ్చెను. తేజస్సుతో మిక్కిలి వెలుగొందుచున్నాడు.

రథీ శరీ చారుతలీ నిషఙ్గీ
శఙ్ఖీ పతాకీ కవచీ కిరీటీ,
ఖడ్గీ చ ధన్వీ చ విభాతి పార్థః
శిఖీ వృతస్రుగ్భి రివాజ్యసిక్తః. 9

రథము, బాణములు, వ్రేలితొడుగులు, అంపపొదులు, శంఖము, పతాక, కవచము, కిరీటము, ఖడ్గము, ధనువు - ఈ అన్నిం టితో కూడి అర్జునుడు స్రుక్కులతో కూడి నేతితో తడిసిన జ్వాలలు గల అగ్నివలె విరాజిల్లుచున్నాడు.

[వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తముదార ముపాయాన్తం దృష్ట్వా పాణ్డవ మర్జునమ్,
నారయః ప్రేక్షితుం శేకు స్తప న్తంహి యథా రవిమ్,
స తం దృష్ట్వా రథానీకం పార్థః సారథి మబ్రవీత్.

దగ్గరకు వచ్చుచున్న పాండుతనయుడు అర్జునుని శత్రువులు మండుచున్న సూర్యునివలె తేరిపార జూడజాలరైరి. ఆరథసేనను చూచి అర్జునుడు సారథితో ఇట్లు పలికెను.]

అర్జున ఉవాచ - అర్జును డిట్లు పలికెను

ఇషుపాతే చ సేనాయా హయాన్ సంయచ్ఛ సారథే,
యావత్ సమీక్షే సైన్యేఽస్మిన్ క్వాసౌ కురుకులాధమః. 10

సేననుండి బాణములుపడు దూరమున ఓ సారథీ! గుఱ్ఱము లను నిలుపుము. ఆ కురుకులాధముడు దుర్యోధను డాసేనలో ఎక్కడ నుండెనో చూచెదను.

సర్వా నేతా నవాదృత్య దృష్ట్వా త మతిమానినమ్,
తస్య మూర్ధ్ని పతిష్యామి తత ఏతే పరాజితాః. 11

1. చారుతలీ - వ్రేలికి చేతికి ధరించు తొడుగులు కలవాడు.

వీరందరిని లెక్కగొనక అతిమానముగల ఆ దుర్యోధనుని చూచి వానినె త్రిప్పి దూకుదును. దానితో వీరందరు ఓడినవా రగుదురు.

ఏష వ్యవస్థితో ద్రోణః ద్రౌణిశ్చ తదనన్తరమ్,
భీష్మః కృపశ్చ కర్ణశ్చ మహేష్వాసాః సమాగతాః. 12

ఇదిగో ఈయన ద్రోణుడు, ఆపిమ్మట అశ్వత్థామ, భీష్ముడు, కృపుడు, కర్ణుడు - ఈ గొప్ప ధనుర్ధారులు వచ్చియున్నారు.

రాజానం నాత్ర పశ్యామి గాః సమాదాయ గచ్ఛతి,
దక్షిణం మార్గ మాస్థాయ శఙ్కే జీవపరాయణః. 13

రాజిందు కానరాడు. కుడివైపుగా గోవులను తోలుకొని పోవుచున్నాడు. ప్రాణములు రక్షించుకొను శ్రద్ధకలవాడని తోచుచున్నది.

ఉత్సృజైతత్ రథానీకం గచ్ఛ యత్ర సుయోధనః,
తత్రైవ యోత్స్యే వైరాటే నాస్తి యుద్ధం నిరామిషమ్,
తం జిత్వా వినివర్తిష్యే గాః సమాదాయ వై పునః. 14

ఈ రథములసేనను వదలుము. సుయోధను డున్నయెడకు పొమ్ము. ఓ ఉత్తరా! సేనచటనే యుద్ధమాడుదును. ఫలములేని యుద్ధము వలదు. వానిని గెలిచి గోవులను గ్రహించి మరలుదును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

ఏవ ముక్తః స వైరాటిః హయాన్ సంయమ్య యత్నతః,
నియమ్య చ తతో రశ్మీన్ యత్ర తే కురుపుఙ్గవాః,
అచోదయత్ తతో వాహాన్ యత్ర దుర్యోధనో గతః. 15

అర్జును డిట్లు పలుకగా, ఉత్తరుడు గుఱ్ఱములను ప్రయత్నముతో నిలిపి ఆ కురువరేణ్యు లున్నచోట పగ్గములను బిగించెను. పిదప దుర్యోధను డున్నవైపునకు గుఱ్ఱములను తోలెను.

ఉత్సృజ్య రథవంశం తు ప్రయాతే శ్వేతవాహనే,
అభిప్రాయం విదిత్వా చ కృపో వచన మబ్రవీత్. 16

రథసముదాయమును వదలి తెల్లగుఱ్ఱములుగల అర్జునుడు, ఆవలకు పోగా ఆతనియభిప్రాయ మెఱిగి కృపాచార్యు డిట్లు పలికెను.

నైషో౽న్తరేణ రాజానం బీభత్సుః స్థాతు మిచ్ఛతి,
తస్య పార్ష్ణిం గ్రహీష్యామో జవే నాభిప్రయాస్యతః. 17

రాజులేనియెడ అర్జునుడు నిలువగోరడు. వేగముగా పోవుచున్నాడు. వాని ప్రక్కగా మనమును పోవుదము.

నహ్యేన మతిసంక్రుద్ధ మేకో యుధ్యేత సంయుగే,
అన్యో దేవాత్ సహస్రాక్షాత్ కృష్ణాద్ వా దేవకీసుతాత్,
ఆచార్యాచ్చ సపుత్రా ద్వా భారద్వాజా న్మహారథాత్. 18

మహాతీవ్రకోపముగల వీనిని సాక్షాత్తు దేవేంద్రుడో, లేక దేవకీపుత్రుడు కృష్ణుడో, మహారథుడు పుత్రసహితుడు నగు ద్రోణాచార్యుడో కాక మఱియొకడు యుద్ధమున నెదుర్కొనజాలడు.

కిం నో గావః కరిష్యన్తి ధనం వా విపులం తథా,
దుర్యోధనః పార్థజలే పురా నౌ రివ మజ్జతి. 19

మనముందు దుర్యోధనుడు అర్జునుడను నీటిలో ఓడవలె మునిగిపోవుచున్నాడు. మనకీ గోవులతో పని యేమి! విపులమగు ధన మేల!

తథైవ గత్వా బీభత్సు ర్నామ విశ్రావ్య చాత్మనః,
శలభై రివ తాం సేనాం శరైః శీఘ్ర మవాకిరత్. 20

అర్జునుడు అట్లే యేగి తనపేరు చెప్పికొని ఆ సేనలపై మిడుతలు క్రమ్మినవిధమున బాణములను ఒక్కపెట్టున గుప్పించెను.

---

16. రథవంశమ్ - రథములగుంపును:

కీర్యమాణా శరౌఘై స్తు యోధా స్తే పార్థచోదితైః,
నాపశ్య న్నావృతాం భూమిం నా న్తరిక్షం చ పత్రిభిః. 21

అర్జునుడు గుప్పించిన బాణములు ఆ యోధుల నందరిని కప్పివైచెను. వారికి ఎటుచూచినను బాణములే కాని, భూమి కాని ఆకాశము కాని కానరాదయ్యెను.

తేషా మాపతతాం యుద్ధే నాపయా నేఽభవన్మతిః,
శీఘ్రత్వ మేవ పార్థస్య పూజయ న్తి స్మ చేతసా. 22

అట్లు యుద్ధమున వచ్చి మీదపడుచున్న బాణములను త్రిప్పి కొట్టు తలపే వారికి కలుగలేదు. పార్థుని చేతి వేగమునే వారు మనసులో ప్రశంసించుచుండిరి.

తతః శంఖం ప్రదధ్మౌ స ద్విషతాం లోమహర్షణమ్,
విస్ఫార్య చ ధనుఃశ్రేష్ఠం ధ్వజే భూతా న్యచోదయత్. 23

అంత నాతడు శత్రువులకు గగుర్పాటు గల్గునట్లు శంఖ మూదెను. ధనుశ్శ్రేష్ఠమును పెద్దగా లాగి ధ్వజమునందలి భూతము లను కదలించెను.

తస్య శఙ్ఖస్య శబ్దేన రథనేమిస్వనేన చ,
గాణ్డీవస్య చ ఘోషేణ పృథివీ సమకమ్పత. 24

ఆ శంఖనాదముచేతను, రథముపట్టాధ్వనిచేతను, గాణ్డీవ ఘోషముచేతను భూమి దద్దరిల్లెను.

అమానుషాణాం భూతానాం తేషాం చ ధ్వజవాసినామ్,
ఊర్ధ్వం పుచ్ఛాన్ విధున్వానా రేభమాణాః సమ న్తతః,
గావః ప్రతిన్యవ ర్తంత దిశ మాస్థాయ దక్షిణామ్. 25

25. రేభమాణాః - అంబారవములు చేయుచున్నవై;

అర్జునుని ధ్వజముపై నున్న ఆ అమానుషభూతముల అరవులకు తోకలను పైకెత్తి గొట్టుచు అంబారవములు చేయుచు గోవులన్నియు దక్షిణదిక్కుగా మరల జొచ్చినవి.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే గోనివర్తనే త్రిపఞ్చాశత్తమోఽధ్యాయః

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తర గోగ్రహమున గోవులను మరలించుట అను ఏబదిమూడవ అధ్యాయము.

## చతుష్పఞ్చాశత్తమోఽధ్యాయః-ఏబదినాల్గవ అధ్యాయము

అర్జునస్య కర్ణాదీన్ ప్రత్యాక్రమణమ్, వికర్ణ పరాజయః, శత్రుంతపసంగ్రామజితో ర్వధః కర్ణస్య పరాజయశ్చ.

అర్జునుడు కర్ణుని మొదలగువారిని ఆక్రమించుట, వికర్ణుడు పరాజయము, శత్రుంతప సంగ్రామ జిత్తులవధ, కర్ణుడోడుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

స శత్రుసేనాం తరసా ప్రణుద్య
గా స్తా విజిత్యాథ ధనుర్ధరాగ్ర్యః,
దుర్యోధనా యాభిముఖం ప్రయాతో
భూయో రణం సోఽభిచికీర్షమాణః, 1

ధనువుకలవారిలో అగ్రేసరుడగు అర్జునుడు ఒక్కపెట్టున శత్రుసేనను పీడించి, గోవులను విడిపించి, మరల రణముచేయగోరినవాడై దుర్యోధనునికొఱకై వాని కెదురుగా బయలుదేరెను.

గోషు ప్రయాతాసు జవేన మత్స్యాన్
కిరీటినం కృతకార్యం చ మత్వా,
దుర్యోధనా యాభిముఖం ప్రయాతం
కురుప్రవీరాః సహసా నిపేతుః, 2

గోవులు వేగముగా మత్స్యదేశముల దారిపట్టగా, కిరీటి వచ్చిన పనిని సాధించె నని తలచి, కురుప్రవీరు లందరు దుర్యోధనునివైపు పోవుచున్న అతనిపై పడిరి.

తేషా మనీకాని బహూని గాఢం
వ్యూఢాని దృష్ట్వా బహుళధ్వజాని,
మత్స్యస్య పుత్రం ద్విషతాం నిహన్తా
వైరాటి మామన్త్ర్య తతోఽభ్యువాచ. 3

శత్రువులను సంహరించెడు అర్జునుడు శత్రువుల సైన్యములు అనేకధ్వజములుగలవై! గట్టివ్యూహములను పన్నియుండుటను. గాంచి విరాటకుమారుని పిలిచి ఇట్లు పలికెను.

ఏతేన తూర్ణం ప్రతిపాదయేమాన్
శ్వేతాన్ హయాన్ కాంచనరశ్మియోక్త్రాన్),
జవేన సర్వేణ కురు ప్రయత్న
మాసాదయేఽహం కురుసింహవృన్దమ్. 4

ఓయీ! ఈ బంగారు పగ్గములు గల తెల్లగుఱ్ఱములను ఈ మార్గముననే ఉన్న శక్తినంతయు నుపయోగించి తోలుము. నేను దుర్యోధనుని ముఖ్యసేనను అందుకొందును.

గజో గజేనేవ మయా దురాత్మా
యోద్ధుం సమాకాఙ్క్షతి సూతపుత్రః,
తమేవ మాం ప్రాపయ రాజపుత్ర
దుర్యోధనాపాశ్రయ జాతదర్పమ్. 5

ఈ దురాత్ముడు సూతపుత్రుడు కర్ణుడు ఏనుగు ఏనుగుతో ఢీకొనునట్లు నాతో యుద్ధమాడగోరును. కాన రాజకుమారా! దుర్యోధనుని ఆశ్రయమువలన పొగరెక్కిన వానికడకే నన్ను చేర్చుము.

---

1. వృన్దమ్ - ముఖ్యమైన దానిని,

స తైర్హయై ర్వాతజవై ర్బృహద్భిః
పుత్రో విరాటస్య సువర్ణకక్ష్యైః,
వ్యధ్వంసయత్ తద్ రథినా మనీకం
తతోఽవహత్ పాణ్డవ మాజిమధ్యే. 6

వాయువేగముగలవి, బంగారుకుచ్చులతో కూడిన జీనులు కలవియు, పెద్దవియునగు ఆ గుఱ్ఱములతో విరాటసుతుడు ఆ రథికవరులసేనను చీల్చివైచి అర్జునుని యుద్ధమధ్యమునకు చేర్చెను.

తం చిత్రసేనో విశిఖై ర్విపాఠైః
సంగ్రామజి చ్ఛత్రుసహో జయశ్చ,
ప్రత్యుద్యయు ర్భారత మాపతన్తం
మహారథాః కర్ణ మభీప్సమానాః. 7

అంత చిత్రసేనుడు, సంగ్రామజిత్తు, శత్రుసహుడు, జయుడు అను మహారథులు కర్ణుని కాపాడగోరి వచ్చిపడుచున్న అర్జునుని మిక్కిలివాడి బాణములతో తాకిరి.

తతః స తేషాం పురుషప్రవీరః
శరాసనార్చిః శరవేగతాపః,
వ్రాతం రథానా మదహత్ సమన్యు
ర్వనం యథాగ్నిః కురుపుంగవానామ్. 8

అంత ధనుస్సే జ్వాలలుగా, బాణవేగమే మంటగా గల పురుషశ్రేష్ఠుడు అర్జునుడు మిక్కిలికోపముతో, కురుశ్రేష్ఠులగువారి రథముల సమూహమును దావాగ్ని వనమును గాల్చినట్లు కాల్చెను.

తస్మింస్తు యుద్ధే తుములే ప్రవృత్తే
పార్థం వికర్ణోఽతిరథం రథేన,

7. అభీప్సమానాః - బ్రదికింప గోరినవారగుచు.
8. విపాఠైః - లావైనదండముగల బాణములు

విపాఠవర్షేణ కురుప్రవీరో
భీమేన భీమానుజ మాససాద. 9

అట్లు సంకులమైన యుద్ధము సాగుచుండగా లావుపాటిబాణముల వర్షమును భయంకరముగా కురిపించుచు కురువీరుడగు వికర్ణుడు భీమునితమ్ముడగు నర్జునుని రథముతో సమీపించెను.

తతో వికర్ణస్య ధను ర్వికృష్య
జామ్బూనదాగ్ర్యోపచితం దృఢజ్యమ్,
అపాతయ త్తం ధ్వజ మస్య మధ్యా
చ్ఛిన్నధ్వజః సోఽప్యపయా జ్జవేన. 10

అంత అర్జునుడు బంగారు అంచుల పుష్టికలదియు, గట్టి అల్లెత్రాడు కలదియు నగు వికర్ణునిధనువును విఱుగగొట్టి వానిధ్వజమును తునకలుగా గొట్టి పడగూల్చెను. ధ్వజమువిరిగిన ఆవికర్ణుడును వేగముతో తొలగిపోయెను.

తం శాత్రవాణాం గణబాధితారం
కర్మాణి కుర్వన్త మమానుషాణి,
శత్రుంతపః పార్థ మమృష్యమాణః
సమార్దయ చ్ఛరవర్షేణ పార్థమ్. 11

శత్రువులమూకను చీల్చిచెండాడుచున్నవాడు, అమానుషములగుపనులు చేయుచున్నవాడు నగు నర్జునుని సహింపజాలక శత్రుంతపుడు బాణవర్షముతో అర్జునుని పీడించెను.

స తేన రాజ్ఞాతిరథేన విద్ధో
విగాహమానో ధ్వజినీం కురూణామ్,
శత్రుం తపం పఞ్చభి రాశు విద్ధ్వా
తతోఽస్య సూతం దశభి ర్జఘాన. 12

కురుసేనలో చొచ్చి యథేచ్ఛగా విహరించుచున్న అర్జునుడు అతిరథుడైన ఆరాజుచే దెబ్బతిని శ్రుతుంతపుని అయిదు బాణములతో వడిగాగొట్టి పదిబాణములలో వానిసారథిని హింసించెను.

తతః స విద్ధో భరతర్షభేణ
బాణేన గాత్రావరణాతిగేన,
గతాసు రాజా నిపపాత భూమౌ
నగో నగాగ్రా దివ వాతరుగ్ణః. 13

భరతశ్రేష్ఠుడగు అర్జును డట్లు కవచమును చీల్చుకొనిపోవునట్లు బాణములతో కొట్టగా అతడు ప్రాణమును కోల్పోయి, కొండ కొమ్మునుండి గాలికి కదలి కూలిన చెట్టువలె యుద్ధభూమిలో కూలెను.

నరర్షభా స్తేన నరర్షభేణ
వీరా రణే వీరతరేణ భగ్నాః,
చకమ్పిరే వాతవశేన కాలే
ప్రకమ్పితా నీవ మహావనాని. 14

నరులలో శ్రేష్ఠుడు, వీరులలో అధికుడు అగు అర్జునుని చేత నరవరులు వీరులునగు యోధులు యుద్ధమున ప్రళయకాలమున ప్రచండమగు గాలికి ఊగుచుండెడు పెద్ద అడవులవలె ఊగిపోయిరి.

హతా స్తు పార్థేన నరప్రవీరాః
గతాసవోర్వ్యాం సుషుపుః సువేషాః,
వసుప్రదా వాసవతుల్యవీర్యాః
పరాజితా వాసవజేన సంఖ్యే. 15

---

15. గతాసవోర్వ్యామ్ - గతాసవః - ఉర్వ్యామ్ అని పదవిభాగము. సంధి ఆర్షము.

మంచి వేషములు గలిగి ఇంద్రునితో సమానమగు వీర్యముగల నరవరు లనేకులు ఇంద్రుని కుమారుడగు నర్జునునిచేత యుద్ధమున ప్రాణములు గోల్పోయి భూమిపై వాలిరి.

సువర్ణకార్ష్ణాయస వర్మనద్ధా
నాగా యథా హైమవతాః ప్రవృద్ధాః,
తథా స శత్రూన్ సమరే వినిఘ్నన్
గాణ్డీవధన్వా పురుషప్రవీరః. 16

బంగారు తొడుగులుగల నల్లనిఉక్కుతో చేయబడిన కవచములతో కప్పబడినవారును బాగుగా బలిసినవారును మంచుకొండయందలి యేనుగులవలె నున్నవారును అగు శత్రువులను అర్జునుడు యుద్ధమున నుగ్గునుగ్గొనరించెను.

చచార సంఖ్యే విదిశో దిశశ్చ
దహ న్నివాగ్ని ర్వన మాతపాన్తే,
ప్రకీర్ణపర్ణాని యథా వసన్తే
విశాతయిత్వా పవనోఽంబు దాంశ్చ,
తథా సపత్నాన్ వికిరన్ కిరీటీ
చచార సంఖ్యేఽతిరథో రథేన. 17

ఆ అర్జునుడు యుద్ధభూమిలో అన్నిమెడలను గ్రీష్మర్తువులో అగ్నివలె చెలరేగి చెల్లాచెదరుగా పడిన ఆకులను, మేఘములను వాయువు చెదరగొట్టినట్లు అతిరథుడై శత్రువులను చెల్లాచెదరు చేయుచు రథముతో విహరించెను.

శోణాశ్వవాహస్య హయాన్ నిహత్య
వైకర్తనభ్రాతు రదీనసత్త్వః,

17. ఆతపాన్తే - ఘర్మస్వరూపమైన ఎండకాలమున - ఇచట అంతశబ్దము నకు స్వరూపమని యర్థము 'అన్తః స్వరూపే నాశే నా' అని మేదిని.

ఏకేన సంగ్రామ జితః శరేణ
శిరో జహారాథ కిరీటమాలీ, 18

ఎఱ్ఱనిగుఱ్ఱముల రథములుగల కర్ణసోదరుడగు సంగ్రామజిత్తుని గుఱ్ఱములను మహాబలముతో చంపి ఒక్కబాణముతో కిరీటి వానితలను ఖండించెను.

తస్మిన్ హతే భ్రాతరి సూతపుత్రో
వైకర్తనో వీర్య మథాదదానః,
ప్రగృహ్య దన్తా వివ నాగరాజో
మహర్షభం వ్యాఘ్ర ఇవాభ్యధావత్. 19

అట్లు తన సోదరుడు చావగా సూర్యతనయుడగు కర్ణుడు మిక్కిలి సత్త్వమును తెచ్చుకొని కోపముతో పర్వతశిఖరములవలెనున్న అర్జునోత్తరులపైకి ఏనుగువలె, ఆబోతుపై దూకుపులివలె లంఘించెను.

స పాణ్డవం ద్వాదశభిః పృషత్కై
ర్వైకర్తనః శీఘ్ర మథో జఘాన,
వివ్యాధ గాత్రేషు హయాంశ్చ సర్వాన్
విరాటపుత్రం చ శరే నిజఘ్నే. 20

సూర్యసూనుడగు కర్ణుడు పది వాడిబాణములతో అర్జునుని గాఢముగా కొట్టెను. గుఱ్ఱముల దేహములందు బాణములను గుప్పించి నొంచెను. ఉత్తరునిచేతిపై కొట్టెను.

త మాపతన్తం సహసా కిరీటీ
వైకర్తనం వై తరసాऽభిపత్య,
ప్రగృహ్య వేగం న్యపతజ్జవేన
నాగం గరుత్మా నివ చిత్రపక్షః. 21

19. ప్రగృహ్య - కోపముతో, దన్తౌ ఇవ - పర్వతశిఖరములవలె నున్న - "దన్తః సానుని కథ్యతే" అనివిశ్వము.

కిరీటి అట్లు వేగముగా వచ్చిపడుచున్న కర్ణునిముందుకు దూ! వేగము పుంజుకొని చిత్రమైన రెక్కలుగల గరుత్మంతుడు పాముపై ఒడుపుగా దూకినట్లు వానిపై పడెను.

తౌ వృత్తమౌ సర్వధనుర్ధరాణాం
మహాబలౌ సర్వసపత్నసాహౌ,
కర్ణస్య పార్థస్య నిశమ్య యుద్ధం
దిదృక్షమాణాః కురవోఽభితస్థుః. 22

విలుకాండ్రందరిలో ఉత్తములు. మహాబలులు, శత్రువులందర నోర్చువారు నగు ఆ కర్ణార్జునుల యుద్ధమునుగూర్చి విని చూచు వేడుకతో కౌరవులందరు నిలిచియుండిరి.

స పాణ్డవ స్తూర్ణ ముదీర్ణకోపః
కృతాగసం కర్ణముదీక్ష్య హార్షాత్,
క్షణేన సాశ్వం సరథం ససారథి
మ న్తర్దధే ఘోరశరౌఘ వృష్ట్యా. 23

ఆ పాండవుడు వెల్లురేగిన కోపముతో పాపకర్ముడగు కర్ణుని చూచి ఉబ్బి, ఒక్కక్షణములో ఘోరమైన బాణవర్షముచేత గుఱ్ఱము లతో, రథముతో, సారథితోపాటు కర్ణుని కప్పివైచెను.

తతః సువిద్ధాః సరథాః సనాగాః
యోధా వినేదు ర్భరతర్షభాణామ్,
అన్తర్హితాః భీష్మముఖాః సహాశ్వాః
కిరీటినా కీర్ణరథాః పృషత్కైః. 24

పిమ్మట అర్జునుని బాణముల వెల్లువలో భరతశ్రేష్ఠులలో యోధులగు భీష్మాదులు గుఱ్ఱములతోపాటు మునిగినరథములు కల వారై పెద్దగోల చేసిరి.

స చాపి తా నర్జున బాహుయుక్తా
న్క్షురా న్క్షురాగ్రైః ప్రతిహత్యవీరః,
తస్థౌ మహాత్మా సధనుః సబాణః
సవిస్ఫులిఙ్గోఽగ్ని రివాశు కర్ణః. 25

మహాత్ముడగు ఆ కర్ణుడును అర్జునుడు వదలిన బాణములను తన బాణపరంపరలతో త్రిప్పికొట్టి, ధనుర్బాణములతో నిప్పుకణికలతో విరాజిల్లు అగ్నివలె వెలుగొందెను.

తత స్త్వభూద్ వై తలతాలశబ్దః
సశఙ్ఖ భేరీపణవ ప్రణాదః,
ప్రక్ష్వేదిత జ్యాతల నిస్వనం తం
వైకర్తనం పూజయతాం కురూణామ్. 26

అల్లెత్రాటి ఝూంకారములు చేయుచున్న కర్ణుని ప్రశంసించు కౌరవుల చప్పట్లధ్వనులు, భేరీశంఖ పణవముల నాదములతోపాటు పెద్దగా విజృంభించెను.

ఉద్ధూతలాంగూల మహాపతాక
ధ్వజోత్తమాంసాకుల భీషణాన్తమ్,
గాణ్డీవ నిర్హ్రాది కృత ప్రణాదం
కిరీటినం ప్రేక్ష్య ననాద కర్ణః. 27

పైనున్న తోకయే పతాకముగా నున్న ధ్వజముయొక్క రెండుపార్శ్వములయందున్న భయంకరభూతములు కలవాడు, గాణ్డీవ ధ్వనితోపాటు చెలరేగిన సింహనాదము చేయుచున్నవాడును నగు అర్జునుని చూచి కర్ణుడు సింహనాదము చేసెను.

స చాపి వైకర్తన మర్దయిత్వా
సాశ్వం ససూతం సరథం పృషత్కైః,

తమావవర్ష ప్రసభం కిరీటీ
పితామహం ద్రోణకృపౌ చ దృష్ట్వా. 28

ఆ అర్జునుడును గుఱ్ఱములతో, సారథితో, రథులతో పాటుగా కర్ణుని బాగుగా నొంచి, భీష్ముని, ద్రోణాచార్య కృపాచార్యులను గాంచి ఒక్కపెట్టున బాణములను వర్షించెను.

స చాపి పార్థం బహుభిః పృషత్కై-
ర్వైకర్తనో మేఘ ఇవాభ్యవర్షత్,
తథైవ కర్ణం చ కిరీటమాలీ
సంఛాదయామాస శితైః పృషత్కైః. 29

కర్ణుడును అనేకబాణములను మేఘములవలె అర్జునునిపై కురిపించెను. అర్జునుడును వాడిఅలుగులను అట్లే కర్ణునిపై ప్రయోగించి ఆతనిని కప్పివైచెను.

తయోః సుతీక్ష్ణాన్ సృజతోః శరౌఘాన్
మహాశరౌఘాస్త్ర వివర్ధనే రణే,
రథే విలగ్నా వివ చంద్రసూర్యౌ
ఘనాంతరే నానుదదర్శ లోకః. 30

గొప్పబాణములతో, అస్త్రములతో పెరుగుచున్న రణమున మిక్కిలివాడి బాణములను ప్రయోగించుచున్న వారిరువురు, మేఘముచాటున నున్న సూర్యచంద్రులా యన్నట్లుగా జనులకు కానవచ్చిరి.

అథాశుకారీ చతురో హయాంశ్చ
వివ్యాధ కర్ణో నిశితైః కిరీటినః,
త్రిభి శ్చయన్తార మమృష్యమాణః
వివ్యాధ తూర్ణం త్రిభి రస్య కేతుమ్. 31

పిదప గలవాడగు కర్ణుడు అర్జునుని నాలుగుగుఱ్ఱములను వాడిబాణములతో పీడించెను. మూడింటితో సారథిని కొట్టెను. మఱి మూడింటితో ధ్వజమును కొట్టెను.

తతో௨భి విద్ధః సమరావమర్దీ
ప్రబోధితః సింహ ఇవ ప్రసుప్తః,
గాణ్డీవధన్వా ఋషభః కురూణా
మజిహ్మగైః కర్ణ మియాయ జిష్ణుః. 32

అట్లు దెబ్బతిన్న గాండీవధారి, కౌరవులలో శ్రేష్ఠుడు, జయశీలియగు అర్జునుడు నిద్రించుచున్న సింహము మేల్కొన్నట్లు విజృంభించి తీక్ష్ణశరబాణములతో కర్ణుని సమీపించెను.

శరాస్త్రవృష్ట్యా నిహతో మహాత్మా
ప్రాదుశ్చకా రాతిమనుష్యకర్మ,
ప్రాచ్ఛాదయత్ కర్ణరథం పృషత్కైః
లోకా నిమాన్ సూర్య ఇవాంశుజాలైః. 33

ఆ మహాత్ముడు శరముల అస్త్రముల వర్షముతో దెబ్బతిని, అతిమానుషమైన కార్యము నాచరించెను. సూర్యుడు కిరణమాలలతో లోకములను కప్పినట్లు కర్ణుని రథమును బాణములతో కప్పివైచెను.

స హస్తి నేవాభిహతో గజేన్ద్రః
ప్రగృహ్య భల్లాన్ నిశితాన్ నిషఙ్గాత్,
ఆకర్ణపూర్ణం చ ధను ర్వికృష్య
వివ్యాధ గాత్రేష్వథ సూతపుత్రమ్. 34

ఏనుగు తాకిన ఏనుగువలె అర్జునుడు వాడిబాణములను పొది నుండి లాగి ధనువును చెవిదాక లాగి సూతపుత్రుని అంగములపై బాణములను గుప్పించి నొంచెను.

అథాస్య బాహూరు శిరోలలాటం
గ్రీవాం వరాఙ్గాని పరావమర్దీ,
శితైశ్చ బాణై ర్యుధి నిర్బిభేద
గాణ్డీవముక్తై రశని ప్రకాశైః. 85

శత్రుమర్దనుడగు అర్జునుడు గాండీవమునుండి వెలువడి పిడుగుల వలెనున్న వాడి అలుగులతో కర్ణుని చేతులయందు, తొడలయందు, తలయందు, ఫాలమునందు, మెడయందు, మిగిలిన అవయవములందు గట్టిగా కొట్టెను.

స పార్థముక్తై రిషుభిః ప్రణున్నో
గజో గజేనేవ జిత స్తరస్వీ,
విహాయ సంగ్రామశిరః ప్రయాతో
వైకర్తనః పాణ్డవబాణతప్తః. 86

ఇట్లు ఏనుగును తాకిన ఏనుగువలె కర్ణుడు అర్జునుని బాణములచే పీడితుడై మొనతలను వీడి వడివడిగా పారిపోయెను.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే
చతుష్పఞ్చాశత్తమోఽధ్యాయః

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున
ఉత్తరగోగ్రహమున ఏబదినాల్గవ అధ్యాయము.

## పఞ్చపఞ్చాశత్తమోఽధ్యాయః – ఏబదియైదవ అధ్యాయము

అర్జునేన కౌరవసేనాయాః సంహారః, ఉత్తరేణార్జునరథస్య కృపాచార్య సన్నిధా వానయనమ్.

అర్జునుడు కౌరవసేనను తునుమాడుట, ఉత్తరుడు అర్జునరథమును కృపాచార్య సమీపమునకు తెచ్చుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

అపయాతే తు రాధేయే దుర్యోధనపురోగమాః,
అనీకేన యథాస్వేన శనై రార్ఛన్త పాణ్డవమ్. 1

రాధేయు డట్లు రణభూమినుండి తొలగగా దుర్యోధనుడు మున్నగువారు తమతమకున్న సేనతో పాండవుని మెల్లగా సమీపించిరి.

బహుధా తస్య సైన్యస్య వ్యూఢస్యాపతతః శరైః,
అధారయత వేగం స వేలేవ తు మహోదధేః. 2

చక్కగా సన్నద్ధమై బాణములతో వచ్చిపడుచున్న ఆ సేన వేగమును అర్జునుడు చెలియలికట్ట సముద్రవేగమును నిలువరించినట్లు నిలువరించెను.

తతః ప్రహస్య బీభత్సుః కౌన్తేయః శ్వేతవాహనః,
దివ్య మస్త్రం ప్రకుర్వాణః ప్రత్యాయాద్ రథసత్తమః. 3

కుంతీతనయుడు, తెల్లనిగుఱ్ఱములు గలవాడు, మహారథుడు, శత్రువులకు భీతిగొలుపువాడు అగు అర్జును డంత నవ్వి దివ్యమగు అస్త్రమును ప్రయోగించుచు వారి కెదురుగా వచ్చెను.

యథా రశ్మిభి రాదిత్యః ప్రచ్ఛాదయతి మేదినీమ్,
తథా గాణ్డీవ నిర్ముక్తైః శరైః పార్థో దిశో దశ 4

సూర్యుడు కిరణములతో భూమిని కప్పివేసిన విధమున అర్జునుడు పదిదిక్కులను గాండీవమునుండి వెడలిన బాణములతో కప్పివైచెను.

న రథానాం న చాశ్వానాం న గజానాం న వర్మణామ్,
అనిర్విద్ధం శితై ర్బాణై రాసీ ద్వ్యఙ్గుల మన్తరమ్. 5

1. ఆర్ఛన్త - వచ్చిరి
3. ప్రత్యాయాత్ - ఎదురుగా వచ్చెను
5. అనిర్విద్ధమ్ - బాగుగా గ్రుచ్చుకొనని (భాగము)

రథములయు, గుఱ్ఱములయు, ఏనుగులయు, కవచములయు, అర్జునుని వాడిబాణములు పడనిమేర రెండంగుళములు మాత్రము కూడ లేదు.

దివ్యయోగాచ్చ పార్థస్య హయానా ముత్తరస్య చ,
శిక్షాశిల్పోపపన్నత్వా దస్త్రాణాం చ పరిక్రమాత్,
వీర్యవత్త్వం ద్రుతం చాగ్ర్యం దృష్ట్వా జిష్ణో రపూజయన్. 6

అర్జునుని గుఱ్ఱములు దివ్యములు. ఉత్తరుడు బండినడుపుటలో మంచి నేర్పుకలవాడు. అస్త్రములు దూసుకొనిపోవునవి. ఇట్టిసాధన సంపత్తి గల అర్జునుని శక్తిని, శ్రేష్ఠమగు వేగమును శత్రువులు కొనియాడిరి.

కాలాగ్ని మివ బీభత్సుం నిర్దహన్త మివ ప్రజాః,
నారయః ప్రేక్షితుం శేకుః జ్వలన్త మివ పావకమ్. 7

అర్జునుడు కాలాగ్నివలె నుండెను. ప్రజలను బూడిదచేయు చుండెనో అనునట్లుండెను. శత్రువులు మండుచున్న అగ్నివలె నున్న ఆతనిని తేరిపారచూచుటకును చాలరైరి.

తాని గ్రస్తా న్యనీకాని రేజు రర్జునమార్గణైః,
శైలం ప్రతి బలాభ్రాణి వ్యాప్తా నీవార్కరశ్మిభిః. 8

కొండకడ బలమైన మేఘములు సూర్యకిరణములు సోకి విరాజిల్లినట్లు అర్జునునిబాణములు తాకిన సేనలు విరాజిల్లినవి.

అశోకానాం వనానీవ ఛన్నాని బహుళైః శుభైః,
రేజుః పార్థశరై స్తత్ర తదా సైన్యాని భారత. 9

అనేకవిధములగు పూవులతో ఆవరింపబడిన అశోకవనములవలె పార్థునిబాణములతో అన్నివైపుల కప్పబడిన సేనలు విరాజిల్లినవి.

---

8. శైలం ప్రతి-కొండదగ్గర; బలవన్తి - బలముగల - అచంచలములైన.
9. శుభైః - ఫలసూచకములగుటచే శుభములు,

స్రజోఽర్జునశరైః శీర్ణం చమ్పకపుష్పం హిరణ్మయమ్,
ఛత్రాణి చ పతాకాశ్చ ఖే దధార సదాగతిః. 10

అర్జునుని బాణముల తాకిడికి మాలలనుండి రాలిన బంగారు సంపెంగ పూవులను, గొడుగులను, పతాకలను వాయువు ఆకాశము నందే పట్టి నిలిపెను.

స్వబలత్రాపనాత్ త్రస్తాః పరిపేతు ర్దిశో దశ,
రథాఙ్గదేశా నాదాయ పార్థచ్ఛిన్నయుగా హయాః. 11

తమబలములు భయపడుటతో దిక్కుతోచని గుఱ్ఱములు అర్జునుడు కాడులను విఱుగగొట్టగా విఱిగినరథభాగములను కైకొని పదిదిక్కులకు పారినవి.

కర్ణకక్షవిషాణేషు అంతరోష్ఠేషు చైవ హ,
మర్మ స్వఙ్గేషు చాహ త్యాపాతయత్ సమరే గజాన్. 12

అర్జునుడు ఏనుగులను చెవులయందు, కాళ్ళసందులలో, దంతములయొద్దను, దౌడలలోపల, ఆయువుపట్లయందును తాడించి పడగొట్టెను.

కౌరవాగ్రగజానాం తు శరీరై ర్గతచేతసామ్,
క్షణేన సంవృతా భూమి ర్మేఘై రివ నభ స్తలమ్. 13

ప్రాణములు కోల్పోయి పడిన కౌరవుల సేనాగ్రములందలి ఏనుగుల శరీరములు, మేఘములు ఆకాశమును కప్పినట్లు భూమి నంతటిని కప్పెను.

యుగాంతసమయే సర్వం యథా స్థావరజంగమమ్,
కాలక్షయ మశేషేణ దహ త్యగ్రశిఖః శిఖీ,
తద్వత్ పార్థో మహారాజ దదాహ సమరే రిపూన్. 14

14. కాలక్షయమ్ - జగత్తునని భావము.

ప్రళయకాలమున స్థావరజంగమస్వరూపముగల జగత్తు నంతటిని జ్వాలలతో కూడిన మహాగ్ని కాల్చివేసిన విధమున ఓ మహారాజా ! అర్జునుడు యుద్ధమున శత్రువులను కాల్చివేసెను.

తతః సర్వాస్త్ర తేజోభి ర్ధనుషో నిస్వనేన చ,
శబ్దే నామానుషాణాం చ భూతానాం ధ్వజవాసినామ్,
భైరవం శబ్ద మత్యర్థం వానరస్య చ కుర్వతః, 15
దైవారిపాచ్చ బీభత్సు స్తస్మిన్ దార్యోధనే వనే,
భయ ముత్పాదయామాస బలవా నరిమర్దనః. 16

బలవంతుడు, పగవారిని మర్దించువాడు నగు అర్జునుడు అస్త్రము లన్నింటి వెలుగులచేతను, వింటిశబ్దముచేతను, ధ్వజమున నున్న అమానుషములగు భూతముల అరపులచేతను, భయంకర ఆరవము చేయు వానరము శబ్దముచేతను, శంఖనాదముచేతను దుర్యోధన సంబంధమైన వనమున భయము పుట్టించెను.

రథశక్తి మమిత్రాణాం ప్రాగేవ నిపతద్ భువి,
సోఽపయాత్ సహసా పశ్చాత్ సాహసా చ్చాభ్యుపేయివాన్. 17

శత్రువుల దేహశక్తిని ఆతడు ముందే నేలకూల్చెను. అటుపై సాహసముతో వారిని సమీపించెను.

శరవ్రాతైః సుతీక్ష్ణాగ్రైః సమాశ్లిష్టైః ఖగై రివ,
అర్జున స్తు ఖ మావవ్రే లోహితప్రాశనైః ఖగైః. 18

మిక్కిలివాడియయిన అంచులుగల బాణములచేత, రక్తము త్రావు పక్షులచేత వలె అర్జును డాకాశమును కప్పెను.

16. దైవారిపాత్ - దేవతల అరులు - శత్రువులగు రాక్షసులను పాలించునది. దేవారిపము - సముద్రము - అందుపుట్టినది. దైవారిపము - శంఖము.
17. రథశక్తిమ్ - దేహశక్తిని - "రథః స్యన్దనదేహయోః" అని నిఘంటువు. అనయాత్ - శోభనతనమువలన.

అభ్రమధ్యే యథార్కస్య రశ్మిభి స్తిగ్మతేజసః,
దిశాసు చ తథా రాజ న్నసంఖ్యాతాః శరా స్తదా. 19

వాడిదీప్తిగల సూర్యుని కిరణములు పాత్రలో ఇముడని విధముగా అర్జునుని లెక్కపెట్టరాని బాణములు దిక్కులందు పట్టకుండెను,

సకృ దేవానలం శేకూ రథమభ్యసితుం పరే,
అలభ్యాః పున రశ్వ్యై స్తు రథాత్ సోఽతి ప్రపాదయేత్. 20

శత్రువులు అర్జునరథమును ఒక్కసారి మాత్రమే చూడగలిగిరి. మరుక్షణమున అతడు వారికి దొరకడు. ఏలయన అతడు గుఱ్ఱములతోపాటు వారిని మఱునిముసమున ఆ తావునుండి గుంజుకొని పోవును. (అనగా పరలోకమునకు చేర్చువని భావము).

తే శరాః ద్విషచ్ఛరీరేషు యథైవ న ససజ్జిరే,
ద్విషదనీకేషు బీభత్సో ర్న ససజ్జే రథ స్తథా. 21

అర్జునుని బాణములు శత్రువుల శరీరములలో నిలువలేదు. అట్లే ఆతనిరథమును శత్రువులసేనల నడుమ నిలువలేదు.

---

19. అభ్రమధ్యే - అభ్రమనగా అమత్రము - పాత్రమనియు యర్థము - దానినడుమ - ఒకశబ్దములో ఒకటి, రెండు, మూడు - ఈ మొదలుగా వర్ణములు లోపించుట వైదికసంప్రదాయము. ఆ పద్ధతి ప్రకారము - అమత్ర శబ్దములో 'మ' లోపించినది.

20. అ - ఏలయనగా, అతిప్రపాదయేత్ - ఈలోకమును దాటించి పరలోకమును చేర్చును. అర్జునుడు చూచినంత మాత్రమున శత్రువులను పరలోకమునకు చేర్చునని భావము.

21. నిలువలేదనగా చీల్చుకొని అవలకు చేరినవని భావము. అట్లే రథమును కూడ శత్రువులు అవజానిరైరి అనిభావము.

స తద్ విక్షోభయామాస హ్యరాతి జల మఞ్జసా,
అనన్తభోగో భుజగః క్రీడ న్నివ మహార్ణవే. 22

మహాసముద్రమున అంతులేని పడగలుగల మహాసర్పము క్రీడించునట్లు అర్జునుడు శత్రుబలమును ఒక్కుమ్మడిగా కలతకలత లాడించెను.

అస్యతో నిత్య మత్యర్థం సర్వమేవాతిగ స్తథా,
అశ్రుతః శ్రూయతే భూతై ర్ధనుర్ఘోషః కిరీటినః. 23

బాణముల విరజిమ్ముచున్న అర్జునుని ధనుర్ఘోషము సర్వ శబ్దములను మించి ఇంతకు ముందెన్నడు విననంతటిదై భూతములకు విననయ్యెను.

సంతతా స్తత్ర మాతఙ్గా బాణై రల్పాంతరాంతరే,
సంవృతా స్తేన దృశ్యన్తే మేఘా ఇవ గభస్తిభిః. 24

ఆ యుద్ధభూమిలో ఏనుగులు అడుగడుగునను బాణములు గ్రుచ్చుకొని కిరణములతో నిండిన మేఘములా యున్నట్లున్నవి.

దిశోఽను భ్రమతః సర్వాః సవ్యదక్షిణ మస్యతః,
సతతం దృశ్యతే యుద్ధే సాయకాసన మణ్డలమ్. 25

కుడిఎడమ చేతులతో బాణములను సర్వదిక్కులకు గుప్పించుచున్న అర్జునుని ధనుస్సు యుద్ధమున నిరంతరముగా చక్రరూపములో కానవచ్చినది.

పతన్త్యరూపేషు యథా చక్షూంషి న కదాచన,
నాలక్ష్యేషు శరాః పేతు స్తథా గాణ్డీవధన్వనః. 26

---

22. అనన్తభోగః భుజగః - అనగా వేయితలలుగల ఆదిశేషుడని భావము.
25. సాయకాసన మనగా విల్లు - దాని మండలమనగా చక్రాకారము.

రూపములేనివానిపై కనులు ఎన్నటికిని ఎట్లు పడవో అట్లే గాండీవమును ధరించిన అర్జునుని శరములు లక్ష్యము లేనితావుల యందు పడవు.

మార్గో గజసహస్రస్య యుగపద్ గచ్ఛతో వనే,
యథా భవేత్ తథా జజ్ఞే రథమార్గః కిరీటినః. 27

ఒక్కపెట్టున అడవిలో పోవుచున్న వేయి ఏనుగుల మార్గ మెట్లుండునో కిరీటి రథమార్గ మట్లాయెను.

నూనం పార్థజయైషిత్వా చ్ఛక్రః సర్వామరైః సహ,
హన్త్యస్మా న్నిత్యమన్యన్త పార్థేన నిహతాః పరే. 28

'ఇంద్రుడు అర్జునుని జయమును గోరినవాడై దేవతలందరితో కూడివచ్చి మనలను చంపుచున్నాడు. ఇది నిశ్చయము' అని అర్జునునిచే దెబ్బతిన్న శత్రువులు సంభావించిరి.

ఘ్నన్త మత్యర్థ మహితాన్ విజయం తత్ర మేనిరే,
కాల మర్జునరూపేణ సంహరన్త మివ ప్రజాః. 29

మిక్కిలిగా శత్రువులను చంపుచున్న విజయుని చూచి కాలుడు అర్జునరూపముతో ప్రజలను సంహరించుచున్నాడని అచటివారు భావించిరి.

కురుసేనాశరీరాణి పార్థే నైవాహతాన్యపి,
సేదుః పార్థహతానీవ పార్థకర్మానుశాసనాత్. 30

అర్జునుడు చేసినపనికి అదియే సాటి కావున కురుసేనలశరీరములు పార్థునిచే కొట్టబడి అతనిచే కొట్టబడినట్లే ఛిన్నభిన్నములయినవి.

---

27. వేయి యేనుగులు నడచిన అడవి యెట్లు నుగ్గునుగ్గగునో అర్జున రథము నడచిన సేన యట్లగునని భావము.

30. అతడు కొట్టిన దాని కదియే సాటి యని యర్థము.

ఓషధీనాం శిరాంసీవ ద్విషచ్ఛీర్షాణి సోఽన్వయాత్,
అవనేశుః కురూణాం హి వీర్యా ణ్యర్జునజాత్ భయాత్. 31

వరి మొదలగువాని కంకులవలె శత్రువులైన కౌరవుల సత్త్వగల తలలు అర్జునభయమువలన వ్రాలినవి.

అర్జునానిలభిన్నాని వనా న్యర్జునవిద్విషామ్,
చక్రు ర్లోహితధారాభి ర్ధరణీం లోహితాంతరామ్. 32

అర్జునశత్రువుల వనములు అర్జునుడను గాలిచే విఱిగి రక్తధారలచే భూమిని రక్తమయము చేసినవి.

లోహితేన సమాయుక్తైః పాంసుభిః పవనోద్ధుతైః,
బభూవు ర్లోహితా స్తత్ర భృశమాదిత్యరశ్మయః. 33

రక్తముతో తడిసినధూళులు గాలికి పైకెగసినందువలన సూర్యకిరణములు మఱియు ఎఱ్ఱవడినవి.

సార్కం ఖం తత్క్షణే నాసీత్ సంధ్యాయా మివ లోహితమ్,
అప్యస్తం ప్రాప్య సూర్యోఽపి నివర్తేత న పాణ్డవః. 34

సూర్యునితో కూడిన ఆకాశము అక్షణమున సంధ్యయందువలె ఎఱుపెక్కెను. సూర్యుడు అస్తమయకాలముననైనను వెనుదిరుగును. అర్జునుడు తిరుగడు.

తాన్ సర్వాన్ సమరే శూరః పౌరుషే సమవస్థితాన్,
దివ్యై రస్త్రై రచింత్యాత్మా సర్వా నార్చ్ఛద్ ధనుర్ధరాన్. 35

ఊహింపశక్యముకాని ఆత్మకలవాడు, శూరుడు నగు అర్జునుడు యుద్ధమున పౌరుషముతో నిలిచిన ఆవిలుకాండ్ర నందరను దివ్యమగు నస్త్రములతో సమీపించెను.

---

32. వనాని - ఆలయములు - శరీరములని తాత్పర్యము. 'వనం నపుంసకం నీరే నివాసాలయ కాననే' అని మేదిని.

స తు ద్రోణం త్రిసప్తత్యా క్షురప్రాణాం సమార్పయత్,
దుఃసహం దశభి ర్బాణైః ద్రౌణి మష్టాభి రేవ చ. 36

అర్జునుడు డెబ్బదిమూడు వాడిబాణములతో ద్రోణుని, పదింటితో దుస్సహుని, ఎనిమిదింటితో అశ్వత్థామను కొట్టెను.

దుఃశాసనం ద్వాదశభిః కృపం శారద్వతం త్రిభిః,
భీష్మం శాన్తనవం షష్ట్యా రాజానం చ శతేన హ,
కర్ణం చ కర్ణినా కర్ణే వివ్యాధ పరవీరహా. 37

పరవీరులను వధించునర్జునుడు దుశ్శాసనునిపై పండ్రెండుబాణములు, కృపాచార్యునిపై మూడు, శంతనుపుత్రుడగు భీష్మునిపై అరువది, దుర్యోధనునిపై నూఱుబాణములను ప్రయోగించెను. కర్ణుని ఒకబాణముతో గూబమీద కొట్టెను.

తస్మిన్ విద్ధే మహేష్వాసే కర్ణే సర్వాస్త్రకోవిదే,
హతాశ్వసూతే విరథే తతో ఽనీక మభజ్యత. 38

అస్త్రములన్నింట ఆరితేరిన మహాధానుష్కుడగు కర్ణుడు అట్లు దెబ్బతిని చచ్చినగుఱ్ఱములతో సారథితో రథహీనుడు కాగా సైన్య మంతయు చెదరిపోయెను.

తత్ ప్రభగ్నం బలం దృష్ట్వా పార్థ మాజిస్థితం పునః,
అభిప్రాయం సమాజ్ఞాయ వైరాటి రిద మబ్రవీత్. 39

అట్లు చెదరిపోయిన సేనను, యుద్ధమున నింకను నిలిచిన అర్జునుని చూచి అభిప్రాయ మెఱిగి ఉత్తరు డిట్లు పలికెను.

ఆస్థాయ రుచిరం జిష్ణో రథం సారథినా మయా,
కతమం యాస్యసేఽనీక ముక్తో యాస్యామ్యహం త్వయా. 40

37. కర్ణే - చెవిదగ్గఱ - గూబ మీద

'ఓ జయశీలీ! నాసారథ్యమున నున్నరథమున చక్కగా నుండి ఏసేనపై పోనున్నావు? చెప్పుము. అందు బోయెదను.'

**అర్జున ఉవాచ** - అర్జును డిట్లు పలికెను.

లోహితాశ్వ మరిష్టం యం వైయాఘ్ర మనుపశ్యసి,
నీలాం పతాకా మాశ్రిత్య రథే తిష్ఠన్త ముత్తర !॥ 41

ఓ ఉత్తరా! చూడు ఎఱ్ఱని గుఱ్ఱములు గలిగి, పులితోలు కప్పుకొని నల్లనిపతాకతో రథమునందు సుఖముగా నుండెనే, ఆయనను చూచుచున్నావు కదా!

కృపస్యైత దనీకాగ్ర్యం ప్రాపయ స్వైత దేవ మామ్,
ఏతస్య దర్శయిష్యామి శీఘ్రాస్త్రం దృఢ ధన్వినః॥ 42

ఆ కృపాచార్యుని సేనకడకు నన్ను చేర్చుము. గట్టిధనువుగల ఆయనకు నాఅస్త్రవేగమును చూపుదును.

ధ్వజే కమణ్డలు ర్యస్య శాతకౌంభమయం శుభః,
ఆచార్య ఏష హి ద్రోణః సర్వశస్త్రభృతాం వరః॥ 43

సువర్ణమయమై శుభమైన కమండలువు పతాకపై నున్నదే, ఆయన శస్త్రధారు లందరిలో మేటి ఆచార్య ద్రోణుడు.

సదా మమైవ మాన్యస్తు సర్వశస్త్రభృతా మపి,
సుప్రసన్నం మహావీరం కురుష్వైనం ప్రదక్షిణమ్॥ 44

ఆయన ఎల్లప్పుడు నాకెంతో మాన్యుడు. అట్లే శస్త్రమును ధరించినవారి కందరికిని మాన్యుడే. సుప్రసన్నుడైన ఆమహావీరుని ప్రదక్షిణముగా మనరథమును పోనిమ్ము.

---

**41. అరిష్టమ్ - శుభమును, వైయాఘ్రమ్ - వ్యాఘ్రచర్మముతో కప్పబడిన;**

అత్రైవ వావరోహైన మేష ధర్మః సనాతనః,
యది మే ప్రథమం ద్రోణః శరీరే ప్రహరిష్యతి,
తతోఽస్య ప్రహరిష్యామి నాస్య కోపో భవేదితి. 45

ఇప్పుడే ఈతనిని పూజింపుము. యుద్ధమున మెలకువగా నుండుము. ఇది సనాతనధర్మము. ద్రోణుడు నాశరీరమున ముందు దెబ్బకొట్టినచో అప్పుడు నేను కొట్టుదును. దానివలన ఆతనికి కోపము రాకుండును.

అస్యావిదూరే హి ధను ర్ధ్వజాగ్రే యస్య దృశ్యతే,
ఆచార్య స్యైష పుత్రో వై అశ్వత్థామా మహారథః. 46

ఆతనికి అల్లంత దూరమున పతాకపై విల్లుండెనే, ఆతడు ఆచార్యుని పుత్రుడు, మహారథుడగు అశ్వత్థామ.

సదా మమైష మాన్య స్తు సర్వశస్త్రభృతా మపి,
ఏతస్య త్వం రథం ప్రాప్య నివర్తేథాః పునః పునః, 47

ఈతడు ఎల్లప్పుడు నాకును, శస్త్రధారులందరికిని మాన్యుడు. నీ వీతని రథమును సమీపించి మాటిమాటికి వెనుదిరుగవలసి యుండును.

య ఏష తు రథానీకే సువర్ణకవచావృతః,
సేనాగ్ర్యేణ తృతీయేన వ్యావహార్యేణ తిష్ఠతి. 48

అదుగో రథసేనలో బంగారు కవచముతో, సంనద్ధమైన మూడవ సేనతో నిలిచియుండెను చూడుము.

---

45. అత్ర - ఈ సమయమున ; ఏనమ్ - ఈతనిని ; అవ - మన్నింపుము ; అవరోహచ - సిద్ధముగా కూడ నుండుము. ముందు దెబ్బకొట్టనిచ్చుట మన్నన, తరువాత కొట్టుట యుద్ధసన్నద్ధత.

48. వ్యావహార్యేణ - వ్యవహారయోగ్యమైన - అలపుసొలుపులు లేని అధి భావము.

యస్య నాగో ధ్వజాగ్రే ఽసౌ హేమకేతన సంవృతః,
ధృతరాష్ట్రాత్మజః శ్రీమా నేష రాజా సుయోధనః. 49

ధ్వజముపై నాగ మున్నది. సువర్ణమయమైన కేతనముగల ఆ శ్రీమంతుడు ధృతరాష్ట్రకుమారుడు సుయోధన మహారాజు.

ఏత స్యాభిముఖం వీర రథం పరరథారుజమ్,
ప్రాపయ స్వైష రాజా హి ప్రమాథీ యుద్ధ దుర్మదః. 50

శత్రువుల రథములకు పీడాకరమైన మనరథమును వీనికెదురుగా పోనిమ్ము. ఈరాజు పొగరుబోతు. యుద్ధపుపిచ్చి పట్టినవాడు.

ఏష ద్రోణస్య శిష్యాణాం శీఘ్రాస్త్రే ప్రథమో మతః,
ఏతస్య దర్శయిష్యామి శీఘ్రాస్త్రం విపులం రణే. 51

వీనిని ద్రోణశిష్యులలో అస్త్రవేగ విషయమున మొదటివాడని లోకము తలంచును. ఈరణమున వీనికి నా అస్త్రవేగమును విపులముగా చూపుదును.

నాగకక్షాతు రుచిరా ధ్వజాగ్రే యస్య తిష్ఠతి,
ఏష వైకర్తనః కర్ణో విదితః పూర్వ మేవ తే. 52

అందమైన ఏనుగుల గుర్తు ధ్వజాగ్రమున నుండెనే, ఆతడే సూర్యకుమారుడగు కర్ణుడు. పూర్వమే నీవు వీనిని ఎఱుగుదువు కదా!

ఏతస్య రథ మాస్థాయ రాధేయస్య దురాత్మనః,
యత్తో భవేథాః సంగ్రామే స్పర్ధతే హి సదా మయా. 53

ఈ దురాత్ముడగు రాధేయుని రథము సమీపించి సన్నద్ధుడవగుము. ఈతడెప్పుడు యుద్ధవిషయమున నాతో మచ్చరించును.

యస్తు నీలానుసారేణ పఞ్చతారేణ కేతునా,
హస్తావాపీ బృహద్ధన్వా రథే తిష్ఠతి వీర్యవాన్. 54

---

52. నాగకక్షా - ఏనుగు గుర్తుగల పతాక అంచు

నీలిరంగుపతాక, అందు అయిదునక్షత్రముల గుర్తులు గల ధ్వజము గలిగి చేతికి తొడుగులతో, పెద్దధనువుతో వీర్యవంతుడై రథమున నుండెనే ఆయన .........

యస్య తారార్కచిత్రో౽సౌ ధ్వజో రథవరే స్థితః,
యస్యైతత్ పాండురం ఛత్రం విమలం మూర్ధ్ని తిష్ఠతి. 55

నక్షత్రములతో సూర్యునితో చిత్రమైన ధ్వజము రథశ్రేష్ఠము నుండెనే, తెల్లని స్వచ్ఛమైన గొడుగు తలపై నుండెనే ఆయన...

మహతో రథవంశస్య నానాధ్వజపతాకినః,
బలాహకాగ్రే సూర్యో వా య ఏష ప్రముఖే స్థితః. 56

అనేక విధములగు ధ్వజములు, పతాకములుగల గొప్ప రథ సముదాయమున మేఘములనడుమ సూర్యునివలె ముందుభాగమున నిలిచెనే ఆయన ...

హైమం చంద్రార్కసంకాశం కవచం యస్య దృశ్యతే,
జాతరూపశిరస్త్రాణం మనస్త్రాసయతీవ మే. 57

సూర్యచంద్రులవలె వెలుగొందు బంగారుకవచము, సువర్ణమయమగు శిరస్త్రాణము ధరించి నామనస్సును తపింపచేయుచు రానవచ్చుచుండెనే ఆయన ...

ఏష శాన్తనవో భీష్మః సర్వేషాం నః పితామహః,
రాజశ్రియాభివృద్ధశ్చ సుయోధన వశానుగః, 58

అదిగో ఆయనయే శంతనుని కుమారుడగు భీష్ముడు. మా అందరకు తాత. రాజలక్ష్మితో నిక్కిలి పెంపొందినవాడు. దుర్యోధనునకు వశమైనవాడు.

56. సూర్యో వా - సూర్యునివలె - వా-ఇవ-వలె.

పశ్చాద్దేశ ప్రయాతవ్యో న మే విఘ్నకరో భవేత్,
ఏతేన యుధ్యమానస్య యత్తః సంయచ్ఛ మే హయాన్. 59

నాకిపుడు అడ్డురానిచో ఈతనిపైకి తర్వాత పోవుదము. ఇతనితో యుద్ధమాడునపుడు మిక్కిలి జాగరూకతతో గుఱ్ఱములనడపుము.

తతోఽభ్యవహ దవ్యగ్రో వైరాటిః సవ్యసాచినమ్,
యత్రాతిష్ఠత్ కృపో రాజన్ యోత్స్యమానో ధనంజయమ్. 60

అంత ఉత్తరుడు కృపాచార్యుడు పోరుటకు సిద్ధముగా నున్నచోటికి అర్జునుని చేర్చెను.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే అర్జునకృప సంగ్రామే పఞ్చపఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తర గోగ్రహమున అర్జునకృప సంగ్రామమున ఏబదియైదవ అధ్యాయము.

## షట్పఞ్చాశత్తమోఽధ్యాయః – ఏబదియారవ అధ్యాయము

కృపపార్థయో ర్యుద్ధం ద్రష్టు మాకాశే విమానస్థదేవానా మాగమనమ్.

కృపార్జునుల యుద్ధమును తిలకించుటకు ఆకాశమున విమానములలో దేవతలు వచ్చుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

తాన్యనీకా న్యదృశ్యన్త కురూణా ముగ్రధన్వినామ్,
సంసర్పన్తో యథా మేఘా ఘర్మాన్తే మందమారుతైః. 1

భయంకరధనువులుగల కౌరవులసేనలు వర్షాకాలమున మెల్లని గాలితో కదలు మేఘములవలె కానవచ్చినవి.

---

1. ఘర్మాన్తే - గ్రీష్మర్తువ దినర - - అనగా వర్షకాలమున

అభ్యాశే వాజిన స్తస్థుః సమారూఢాః ప్రహారిణః,
భీమరూపాశ్చ మాతఙ్గా స్తోమరాఙ్కుశనోదితాః,
మహామాత్రైః సమారూఢా విచిత్రకవచోజ్జ్వలాః. 2

అందందు సమాయత్తమై అశ్వసేన నిలిచియుండెను. భయంకరమగు రూపముగల ఏనుగులు, తోమరములతో అంకుశములతో గొప్ప మావటివాండ్రు తోలుచుండగా విచిత్రమైన కవచములతో ప్రకాశించినవి.

తతః శక్రః సురగణైః సమారుహ్య సుదర్శనమ్,
సహోపాయాత్ తదా రాజన్ విశ్వాశ్విమరుతాం గణైః. 3

అంత దేవేంద్రుడు విశ్వేల, అశ్వినుల, మరుత్తుల సముదాయములతో విమానము నెక్కి ఆ యుద్ధము జరుగుచోటికి వచ్చెను.

తద్ దేవయక్షగంధర్వ మహోరగ సమాకులమ్,
శుశుభేఽభ్రవినిర్ముక్తం గ్రహాణా మివ మణ్డలమ్. 4

దేవతలతో, యక్షులతో, గంధర్వులతో, మహానాగులతో నిండిన ఆ సముదాయము గగనము విడిచివచ్చిన గ్రహముల మండలమువలె ప్రకాశించెను.

అస్త్రాణాం చ బలం తేషాం మానుషేషు ప్రయుఞ్జతామ్,
తచ్చ భీమం మహద్ యుద్ధం కృపార్జున సమాగమే,
ద్రష్టు మభ్యాగతా దేవాః స్వవిమానైః పృథక్ పృథక్. 5

మనుష్యులపై ప్రయోగించు తమతమ అస్త్రములబలమును, కృపార్జునులు తారసిల్లి చేయు భయంకర మహాయుద్ధమును చూచుటకై దేవతలు వారివారి విమానములతో విడివిడిగా వచ్చిరి.

1. సుదర్శనమ్ - శత్రువులకలయికను - 'సుదర్శనో హరేశ్చక్రే ద్వీపే శత్రు సమాగమే' - అని మేదిని.

శతం శతసహస్రాణాం యత్ర స్థూణా హిరణ్మయీ,
మణిరత్నమయీ చాన్యా ప్రాసాదం తదధారయత్. 6

కోటిబంగారు స్తంభములు, ఒక మణిరత్నమయమగు స్తంభము గల ప్రాసాదము అచట వారికి నెలవయ్యెను.

తతః కామగమం దివ్యం సర్వరత్నవిభూషితమ్,
విమానం దేవరాజస్య శుశుభే ఖేచరం తదా. 7

దివ్యము, కామగమనము గలది, సర్వరత్నములతో అలంకరింపబడినది, ఆకాశమున పోవునది అగు దేవేంద్రునివిమానము ప్రకాశించెను.

తత్ర దేవా స్త్రయస్త్రింశత్ తిష్ఠన్తి సహవాసవాః,
గంధర్వా రాక్షసాః సర్పాః పితరశ్చ మహర్షిభిః. 8

దేవేంద్రునితోపాటు ముప్పదిముగ్గురు దేవతలు, గంధర్వులు, రాక్షసులు, సర్పములు, మహర్షులతోపాటు పితృదేవతలు అచట నిలిచిరి.

తథా రాజా వసుమనా బలాక్షః సుప్రతర్దనః,
అష్టకశ్చ శిబి శ్చైవ యయాతి ర్నహుషో గయః. 9

మనుః పురూ రఘు ర్భానుః కృశాశ్వో సగరో నలః,
విమానే దేవరాజస్య సమదృశ్యన్త సుప్రభాః. 10

అట్లే వసుమనుడు, బలాక్షుడు, సుప్రతర్దనుడు, అష్టకుడు, శిబి, యయాతి, నహుషుడు, గయుడు, మనువు, పురువు, రఘువు, భానుడు, కృశాశ్వుడు, సగరుడు, నలుడు అను మహారాజులు దేవేంద్రుని విమానమున గొప్ప తేజస్సుతో కానవచ్చిరి.

---

8. త్రయస్త్రింశత్ - "ఎనమండ్రు వసువులు, పదునొక్కండ్రు రుద్రులు, పండ్రెండుగురు ఆదిత్యులు, ప్రజాపతి, వషట్కారము - అని యీ లెక్కప్రకారము ముప్పదిముగ్గురు" - అని బ్రాహ్మణము.

అగ్నే రీశస్య సోమస్య వరుణస్య ప్రజాపతేః,
తథా ధాతు ర్విధాతు శ్చ కుబేరస్య యమస్య చ. 11

అలంబుషోగ్రసేనానాం గంధర్వస్య చ తుంబురోః,
యథామానం యథోద్దేశం విమానాని చకాశిరే. 12

అగ్ని, ఈశానుడు, చంద్రుడు, వరుణుడు, ప్రజాపతి, ధాత, విధాత, కుబేరుడు, యముడు, అలంబుషుడు, ఉగ్రసేనుడు మొదలగు గంధర్వులు తుంబురుడు అను వారల విమానములు వారివారి ప్రమాణములకు తగినట్లు ప్రకాశించినవి.

సర్వదేవ నికాయాశ్చ సిద్ధాశ్చ పరమర్షయః,
అర్జునస్య కురూణాం చ ద్రష్టుం యుద్ధ ముపాగతాః. 13

సర్వ దేవతల సముదాయములు, సిద్ధులు, పరమర్షులు అర్జునునకు కౌరవులకు జరుగుచున్న యుద్ధమును చూచుటకు ఏతెంచిరి.

దివ్యానాం సర్వమాల్యానాం గన్ధః పుణ్యోఽథ సర్వశః,
ప్రససార వసన్తాగ్రే వనానా మివ భారత. 14

వసంతర్తువులో పూదోటల వాయువులు అన్నివైపులకు ప్రసరించినట్లు దివ్యములైన మాలల పుణ్యగంధము అన్నిదిక్కులకు వ్యాపించెను.

తత్ర రత్నాని దేవానాం సమదృశ్యన్త తిష్ఠతామ్,
ఆతపత్రాణి వాసాంసి స్రజ శ్చ వ్యజనాని చ. 15

అచట నిలిచిన దేవతల రత్నములు, గొడుగులు, వస్త్రములు, మాలలు, వీవనలు కానవచ్చినవి.

ఉపాశామ్యద్ రజో భౌమం సర్వం వ్యాప్తం మరీచిభిః,
దివ్యగన్ధా నుపాదాయ వాయు ర్యోధా నసేవత. 16

భూమిధూళి అణగెను. కాంతు లంతట వ్యాపించెను. దివ్యగంధములను గ్రైకొని మారుతము యోధులను సేవించెను.

ప్రభాసిత మివాకాశం చిత్రరూప మలంకృతమ్,
సంపతద్భిః స్థితై శ్చాపి నానారత్నవిభాసితైః. 17

పడుచు, నిలుచుచున్న అనేకరత్నముల కాంతులతో ఆకాశము చిత్రములైన విధముగా అలంకరింపబడినట్లు కాంతితో వెలుగొందెను.

విమానై ర్వివిధై శ్చిత్రై రుపానీతైః సురోత్తమైః,
వజ్రభృ చ్ఛుశుభే తత్ర విమానస్థైః సురై ర్వృతః. 18

దేవతలు కొనితెచ్చిన వివిధములైన, విచిత్రములైన విమానములతో, విమానములందలి దేవతలతో సురరాజు శోభిల్లెను.

బిభ్రన్మాలాం మహాతేజాః పద్మోత్పలసమాయుతామ్,
విప్రేక్ష్యమాణో బహుభి ర్నాతృప్యత్ సుమహాహవమ్. 19

పద్మములతో కలువలతో కూడిన గొప్పమాలను ధరించినవాడు, మహాతేజస్వి అయిన దేవరాజును చూచుచున్న అనేకులకు తృప్తితీరలేదు.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే దేవాగమనే షట్పఞ్చాశత్తమోఽధ్యాయః.
ఇది శ్రీమహాభారత విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున దేవతలరాక యను ఏబదియారవ అధ్యాయము.

## సప్తపఞ్చాశత్తమోఽధ్యాయః-ఏబదియేడవ అధ్యాయము

కృపార్జునయో ర్యుద్ధం కౌరవసైనికైః కృపస్య రణా దన్యత్రాపనయనం చ.

కృపార్జునుల యుద్ధము, కౌరవసైనికులు కృపుని రణమునుండి మఱియొకచోటికి తొలగించుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను
దృష్ట్వా వ్యూఢా న్యనీకాని కురూణాం కురునన్దన,
తత్ర వైరాటి మామన్త్ర్య పార్థో వచన మబ్రవీత్. 1

ఓ కురునందనా! తీర్చినిలిచిన కౌరవసేనలను గాంచి అర్జునుడు ఉత్తరుని పిలిచి యిట్లు పలికెను.

జాంబూనదమయీ వేదీ ధ్వజే యస్య ప్రదృశ్యతే,
తస్య దక్షిణతో యాహి కృపః శారద్వతో యతః. 2

అదిగో బంగారపు అరుగు ధ్వజమున కానవచ్చుచున్నదే-అది కలవాడు కృపుడు. ఆయనకు కుడిప్రక్కగా పొమ్ము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను
ధనంజయవచః శ్రుత్వా వైరాటి స్త్వరిత స్తతః,
హయాన్ రజతసంకాశాన హేమభాణ్డా నచోదయత్. 3

ధనంజయుని ఆమాట విని విరాటునికుమారుడు స్వర్ణాభరణములు, కలవి, వెండివలె తళతళలాడుచున్నవి అగు గుఱ్ఱములను తోలెను.

ఆనుపూర్వ్యాత్ తు తత్ సర్వ మాస్థాయ జవ ముత్తమమ్,
ప్రాహిణో చ్చన్ద్రసంకాశాన కుపితా నివ తాన్ హయాన్. 4

క్రమముగా వేగమును పుంజుకొని చంద్రునివలె నున్నవి, కోపించినవో యన్నట్లున్నవియు నగు గుఱ్ఱములను అదలించెను.

స గత్వా కురుసేనాయాః సమీపం హయకోవిదః,
పున రావర్తయామాస తాన్ హయాన్ వాతరంహసః. 5

గుఱ్ఱముల విద్యలో ఆరితేరిన ఆతడు కురుసేన సమీపమున కరిగి, వాయువేగముగల గుఱ్ఱములను మరల వెనుకకు తెచ్చెను.

ప్రదక్షిణ ముపావృత్య మణ్డలం సవ్యమేవ చ,
కురూన్ సమ్మోహయామాస మత్స్యో యానేన తత్త్వవిత్. 6

1. హేమభాణ్డాన్ - బంగారపు తొడవులు కలవానిని,
2. మత్స్యః - ఉత్తరుడు,

ఉత్తరుడు ప్రదక్షిణముగా మండలాకారమున ఎడమవైపుగా రథమును త్రిప్పి తత్త్వమెఱిగినవాడై, తనవాహనముతో కౌరవులను మోహపెట్టెను.

కృపస్య రథ మాస్థాయ వైరాటి రకుతోభయః,
ప్రదక్షిణ ముపావృత్య తస్థౌ తస్యాగ్రతో బలీ. 7

కృపునిరథమును సమీపించి ఎందును భయములేనివాడై, బలశాలియగు ఉత్తరుడు ప్రదక్షిణ మాచరించి అతని ముందు నిలిచెను.

తతోఽర్జునః శఙ్ఖవరం దేవదత్తం మహారవమ్,
ప్రదధ్మౌ బల మాస్థాయ నామ విశ్రావ్య చాత్మనః. 8

అంత అర్జునుడు తనపేరు ప్రకటించి శంఖములలో శ్రేష్ఠమైనది, గొప్పనాదముకలది యగు దేవదత్తమును బలమంతయు కూడదీసికొని మ్రోయించెను.

తస్య శబ్దో మహా నాసీద్ ధమ్యమానస్య జిష్ణునా,
తథా వీర్యవతా సంఖ్యే పర్వతస్యేవ దీర్యతః. 9

జయశాలి, వీర్యవంతుడు నగు అర్జునుడు అట్లు ఊదగా కొండ బ్రద్దలైనదో అన్నట్లు పెద్దమ్రోత కలిగెను.

పూజయాంచక్రిరే శఙ్ఖం కురవః సహసైనికాః,
అర్జునేన తథా ధ్మాతః శతధా యన్న దీర్యతే. 10

అర్జును డంతగా నూదగా నూరువ్రక్కలు కాని ఆ శంఖమును కౌరవులు సైనికులతోపాటు ప్రశంసించిరి.

దివ మావృత్య శబ్దస్తు నివృత్తః శుశ్రువే పునః,
సృష్టో మఘవతా వజ్రః ప్రపత న్నివ పర్వతే. 11

ఆ శబ్దము ఆకాశము నావరించి తిరిగివచ్చి మరల ఇంద్రుడు వదలిన వజ్రము పర్వతమున పడుచున్నట్లు వినవచ్చెను.

ఏతస్మిన్నన్తరే వీరో బలవీర్య సమన్వితః,
అర్జునం ప్రతి సంరబ్ధః కృపః పరమదుర్జయః,
అమృష్యమాణ స్తం శబ్దం కృపః శారద్వత స్తదా. 12

ఇంతలో బలవీర్యములు పెల్లుగాగలవాడు, జయింపశక్యము కానివాడు, వీరుడు నగు శారద్వతుడైన కృపుడు ఆ ధ్వనిని సహింపక అర్జునునిపైకి మిక్కిలి వేగముతో వచ్చెను.

అర్జునంప్రతి సంరబ్ధో యుద్ధార్థీ స మహారథః,
మహోదధిజ మాదాయ దధ్మౌ వేగేన వీర్యవాన్. 13

అర్జునునివైపు దూకుచు యుద్ధమును కోరుచున్న ఆ మహారథుడు శంఖమును గొని వేగముతో మ్రోగించెను.

స తు శబ్దేన లోకాం స్త్రీనావృత్య రథినాం వరః,
ధను రాదాయ సుమహ జ్జ్యాశబ్ద మకరో త్తదా. 14

ఆ రథికశ్రేష్ఠుడు ఆ శబ్దముతో మూడులోకములను ముంచి యెత్తి విల్లుగొని మిక్కిలి పెద్దగా నారిని మ్రోగించెను.

తౌ రథౌ సూర్యసంకాశౌ యోత్స్యమానౌ మహాబలౌ,
శారదా వివ జీమూతౌ వ్యరోచేతాం వ్యవస్థితౌ. 15

సూర్యులవలెనున్నవారు, మహాబలులు, యుద్ధమాడుచున్నవారు నగు నా యిరువురు తలపడిన శరత్కాల మేఘములజంటవలె కానవైరి.

---

13. మహోదధిజమ్ - మహాసముద్రమున పుట్టినదానిని - శంఖమును,
15. రథౌ - రథులు

తతః శారద్వత స్తూర్ణం పార్థం దశభి రాశుగైః,
వివ్యాధ పరవీరఘ్నం నిశితై ర్మర్మభేదిభిః. 16

అంత కృపాచార్యుఁడు పరవీరుల తునుమాడు నర్జునుని వాఁడి యయినవి, ఆయువుపట్టులను చీల్చునవియు నగు పది బాణములతో ఒడుపుగా కొట్టెను.

పార్థోఽపి విశ్రుతం లోకే గాణ్డీవం పరమాయుధమ్,
వికృష్య చిక్షేప బహూన్ నారాచాన్ మర్మభేదినః. 17

అర్జునుఁడును లోకమున ప్రసిద్ధిగన్న పరమాయుధమగు గాండీవమును బాగుగా లాగి మర్మములను భేదించు బాణములను పెక్కింటిని విరజిమ్మెను.

తానప్రాప్తాన్ శితై ర్బాణై ర్నారాచాన్ రక్తభోజనాన్,
కృప శ్చిచ్ఛేద పార్థస్య శతశోఽథ సహస్రశః. 18

రక్తముతినెడు ఆ పార్థుని బాణములు తనకడకు రాకముందే వాఁడిబాణములతో కృపుఁడు వందలుగా వేలుగా ముక్కలుగాఁజేసెను.

తతః పార్థస్తు సంక్రుద్ధ శ్చిత్రాన్ మార్గాన్ ప్రదర్శయన్,
దిశః సంఛాదయన్ బాణైః ప్రదిశశ్చ మహారథః,
ఏకచ్ఛాయ మివాకాశ మకరోత్ సర్వతః ప్రభుః. 19

అంత మహారథుఁడగు అర్జునుఁడు మిక్కిలి కోపించి చిత్రమార్గములను చూపుచు బాణములతో దిక్కుల నన్నింటిని కప్పివైచుచు సమర్థుఁడై ఆకాశము నన్నివైపుల ఒకే నీడపట్టునట్లుగా జేసెను.

ప్రాచ్ఛాదయ దమేయాత్మా పార్థః శరశతైః కృపమ్,
స శరై రర్దితః క్రుద్ధః శితై రగ్నిశిఖోపమైః 20
తూర్ణం దశ సహస్రేణ పార్థ మప్రతిమౌజసమ్,
అర్దయిత్వా మహాత్మానం ననర్ద సమరే కృపః. 21

అమేయాత్ముడగు నర్జునుడు వందలకొలది వాడిబాణములతో కృపుని కప్పివైచెను. వాడిగా నుండి అగ్నిజ్వాలలవలెనున్న ఆ బాణములతో నొప్పిపడి కృపుడు క్రోధముతో సాటిలేనివీర్యముగల మహాత్ముడగు నర్జునుని పదివేలబాణములతో పీడించి సింహనాదమొనర్చెను.

తతః కనకపర్వాగ్రై ర్వీరః సంనతపర్వభిః,
త్వరన్ గాణ్డీవనిర్ముక్తై రర్జున స్తస్య వాజినః,
చతుర్భి శ్చతుర స్తీక్ష్ణై రవిధ్యత్ పరమేషుభిః. 22

అంత వీరుడైన అర్జునుడు వంగినకణుపులు, బంగారుపూత అంచులుగలిగి గాండీవమునుండి వెలువడిన తీక్ష్ణబాణములు నాల్గింటితో కృపాచార్యుని గుఱ్ఱములను నాల్గింటిని బాధించెను.

తే హయా నిశితై ర్బాణై ర్జ్వలద్భి రివ పన్నగైః,
ఉత్పేతుః సహసా సర్వే కృపః స్థానా దథాచ్యవత్. 23

ఆ వాడిబాణములు మంటలు గ్రక్కుచున్న పాములవలె తాకగా ఆ గుఱ్ఱములు ఒక్కుమ్మడిగా ఎగిరిపడినవి. కృపుడు తానున్నచోటినుండి జారిపడెను.

చ్యుతం తు గౌతమం స్థానాత్ సమీక్ష్య కురునన్దనః,
నావిధ్యత్ పరవీరఘ్నో రక్షమాణోఽస్య గౌరవమ్. 24

అట్లు స్థానమునుండి జారిపడిన గౌతముని గాంచి కురువందనుడు పరవీరుల పరిమార్చువాడయినను అతని గౌరవమును కాపాడువాడై కొట్టకుండెను.

స తు లబ్ధ్వా పునః స్థానం గౌతమః సవ్యసాచినమ్,
వివ్యాధ దశభి ర్బాణై స్త్వరితః కఙ్కపత్రిభిః. 25

ఆ గౌతముడును వెనువెంటనే మరల స్థైర్యమును పొంది పక్షి ఈకలుగల పదిబాణములతో అర్జునుని కొట్టెను.

---

25. స్థానమ్ - స్థిరత్వమును - తెలివినొందియని భావము.

తతః పార్థో ధను స్తస్య భల్లేన నిశితేన హ,
చిచ్ఛేదైకేన భూయశ్చ హస్తావాప మథాహరత్. 26

అంతట పార్థుడు ఒక వాడి అమ్ముతో అతనిధనువును తెగ నరికెను. మఱల ఇంకొకబాణముతో చేతితొడుగు నూడగొట్టెను.

అథాస్య కవచం బాణై ర్నిశితై ర్మర్మ భేదిభిః,
వ్యధయన్నచ పార్థోఽస్య శరీర మవపీడయత్. 27

పిమ్మట ఆతనికవచమును మర్మములభేదించు వాడిఅమ్ములతో చీల్చివైచెను. కాని అర్జును డాతని శరీరమును పీడింపలేదు.

తస్య నిర్ముచ్యమానస్య కవచాత్ కాయ ఆబభౌ,
సమయే ముచ్యమానస్య సర్పస్యేవ తను ర్యథా. 28

కవచమూడిన ఆతని శరీరము తగుకాలమున కుబుసమూడిన పాముశరీరమువలె ప్రకాశించెను.

ఛిన్నే ధనుషి పార్థేన సోఽన్య దాదాయ కార్ముకమ్,
చకార గౌతమః సజ్యం తదద్భుత మివాభవత్. 29

ధనుస్సు విఱుగగా కృపుడు వెంటనే మఱియొకవింటిని గొని ఎక్కుపెట్టెను. అది అశ్చరువు గొల్పెను.

స తదప్యస్య కౌన్తేయ శ్చిచ్ఛేద నతపర్వణా,
ఏవమన్యాని చాపాని బహూని కృతహ స్తవత్,
శారద్వతస్య చిచ్ఛేద పాణ్డవః పరవీరహా. 30

కుంతీతనయుడు ఒంపులున్న, కణుపులుగల బాణముతో దానిని కూడ విఱుగగొట్టెను. ఇట్లే అనేకధనువులను పరవీరహంతయగు అర్జునుడు కృపునిచేతికి వచ్చినదానిని వచ్చినట్లు ఛేదించెను.

స చ్ఛిన్నధను రాదాయ రథశక్తిం ప్రతాపవాన్,
ప్రహిణోత్ పాణ్డుపుత్రాయ ప్రదీప్తా మశనీ మివ. 31

విల్లు విఱిగిన ప్రతాపవంతుడగు కృపుడు రథమునందలి శక్తిని మండుచున్న పిడుగునువలె అర్జునునిపై విసరెను.

తా మర్జున స్తదా యాన్తీం శక్తిం హేమవిభూషితామ్,
వియద్గతాం మహోల్కాభాం చిచ్ఛేద దశభిః శరైః. 32

అట్లు బంగారుభూషణములతో ఆకాశమునుండి పెద్దఉల్కవలె వచ్చిపడుచున్న శక్తిని అర్జునుడు పదిబాణములతో ముక్కలు గావించెను.

సాపతద్ దశధా భిన్నా భూమౌ పార్థేన ధీమతా. 33

ఆ శక్తి తెలివిగల అర్జునుడు కొట్టిన దెబ్బకు పదిముక్కలై నేలపై పడెను,

యుగపచ్ఛైవ భల్లైస్తు తతః సజ్యధనుః కృపః,
త మాశు నిశితైః పార్థం బిభేద దశభిః శరైః. 34

ఒక్కపెట్టున ఎక్కుపెట్టిన ధనువుగల కృపుడు పదివాడిబాణములతో శీఘ్రముగా అర్జునుని కొట్టెను.

తతః పార్థో మహాతేజా విశిఖా నగ్నితేజసః,
చిక్షేప సమరే క్రుద్ధ స్త్రయోదశ శిలాశితాన్. 35

అంత మహాతేజస్కుడగు అర్జునుడు క్రుద్ధుడై అగ్నివంటి దీప్తిగలవి, ఉలులవలె వాడికలవి అగు పదమూడు బాణములను కృపునిపై గుప్పించెను.

అథాస్య యుగ మేకేన చతుర్భి శ్చతురో హయాన్,
షష్ఠేన చ శిరః కాయా చ్ఛరేణ రథసారథేః. 36

త్రిభి స్త్రివేణుం సమరే ద్వాభ్యా మక్షం మహారథః,
ద్వాదశేన తు భల్లేన చకర్తాస్య ధ్వజం తదా. 37

37. త్రివేణు శబ్దమునకు ఒకవిధమగు రథమనియు, రథభాగమనియు నర్థము కలదు.

అంత మహారథుడగు అర్జునుడు ఒక బాణముతో రథపుకాడిని, నాల్గింటితో నాల్గు గుఱ్ఱములను కొట్టెను. ఆరవదానితో రథసారథి దేహమునుండి తలను వేరుచేసెను. మూడింటితో రథమునందలి మూడు బొంగులను పగులగొట్టెను. రెంటితో ఇరుసును ముక్కలు చేసెను. పండ్రెండవ బాణముతో ధ్వజమును విరిచెను.

తతో వజ్రనికాశేన ఫాల్గునః ప్రహసన్నివ,
త్రయోదశే నేంద్రసమః కృపం వక్షస్యవిధ్యత. 38

అటుపై వజ్రమువంటి పదమూడవ బాణముతో ఇంద్రసముడగు అర్జునుడు లీలగా నవ్వుచు కృపునిరొమ్ముపై కొట్టెను.

స ఛిన్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః,
గదాపాణి రవప్లుత్య తూర్ణం చిక్షేప తాం గదామ్. 39

అట్లు విల్లువిఱుగగా, గుఱ్ఱములు సారథియు చావగా కృపుడు గదచేపట్టి బలముగా దానిని అర్జునునిపై విసరెను,

సా చ ముక్తా గదా గుర్వీ కృపేణ సుపరిష్కృతా,
అర్జునేన శరై ర్నున్నా ప్రతిమార్గ మథాగమత్. 40

కృపుడు గట్టిగా విసిరిన ఆ పెనుగదను అర్జునుడు బాణములతో మార్గమధ్యముననే దూరముగా పడునట్లు కొట్టెను.

తం తు యోధాః పరీప్సన్తః శారద్వత మమర్షణమ్,
సర్వతః సమరే పార్థం శరవర్షై రవాకిరన్. 41

అట్లు కోపముతోనున్న కృపాచార్యుని రక్షింపగోరి యోధులందరు అన్నివైపులనుండియు పాదివిరొని బాణవర్షములను అర్జునునిపై కురిపించిరి.

తతో విరాటస్య సుతో ఽపసవ్య మావృత్య వాజినః ।
యమకం మణ్డలం కృత్వా తాన్ యోధాన్ ప్రత్యవారయత్ ॥ 42

అంత విరాటుని కుమారుడు గుఱ్ఱములను మండలాకారముగ నడుపుచు ఆ యోధులను నిలువరించెను.

తతః కృప ముపాదాయ విరథం తే నరర్షభాః ।
అపజగ్ముర్మహావేగాః కున్తీపుత్రాద్ధనఞ్జయాత్ ॥ 43

అంత నా నరవరులందరు మహావేగముతో రథములేని కృపాచార్యుని కుంతీపుత్రుడగు ధనంజయునినుండి దూరముగా తొలగించుకొనిపోయిరి.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే కృపాపయానే సప్తపఞ్చాశత్తమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతమున విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున కృపుని తొలగించుకొనిపోవుట అను ఏబదియేడవ అధ్యాయము

## అష్టపఞ్చాశత్తమోఽధ్యాయః

## ఏబదియెనిమిదవ అధ్యాయము

అర్జునస్య ద్రోణాచార్యేణ సహ యుద్ధం ద్రోణాచార్యస్య పలాయనం చ.

అర్జునుడు ద్రోణాచార్యునితో యుద్ధము చేయుట, ద్రోణుడు పారిపోవుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

కృపేఽపనీతే ద్రోణస్తు ప్రగృహ్య సశరం ధనుః ।
అభ్యద్రవ దనాధృష్యః శోణాశ్వః శ్వేతవాహనమ్ ॥ 1

42. అపసవ్యమ్ ఆవృత్య - అప్రదక్షిణముగా తిరిగి, యమకమ్ - శత్రువులను నిరోధించెడు, - యమకమండలము చేయగా శత్రువు అవమానముతో సిగ్గుపడి నిలుచునట.

కృపుడట్లు తొలగింపబడగా అణపశక్యముకానివాడు, ఎఱ్ఱని గుఱ్ఱములు కలవాడు నగు ద్రోణుడు బాణములతోపాటు ధనువును గైకొని అర్జునునిపైకి దుమికెను.

స తు రుక్మరథం దృష్ట్వా గురు మాయాన్త మన్తికాత్,
అర్జునో జయతాం శ్రేష్ఠ ఉత్తరం వాక్య మబ్రవీత్. ౨

బంగారు రథముతో తనసమీపమునకు వచ్చుచున్న గురువును చూచి జయశాలులలో శ్రేష్ఠుడగు అర్జునుడు ఉత్తరునితో నిట్లు పలికెను.

అర్జున ఉవాచ - అర్జునుడిట్లు పలికెను

యత్రైషా కాఞ్చనీ వేదీ ధ్వజే యస్య ప్రకాశతే,
ఉచ్ఛ్రితా ప్రవరే దణ్డే పతాకాభి రలఙ్కృతా,
అత్ర మాం వహ భద్రం తే ద్రోణానీకాయ సారథే. ౩

ఓయీ సారథీ! అదిగో చూడు బంగారువేది ధ్వజమున ప్రకాశించుచున్నది. గట్టిదండమున ఎత్తబడినది. పతాకలతో అలరారుచున్నది. నీకు మేలయ్యెడు. ఆ ద్రోణసైన్యముకడకు నన్ను కొనిపొమ్ము.

అశ్వాః శోణాః ప్రకాశన్తే బృహన్తశ్చారువాహినః,
స్నిగ్ధ విద్రుమసంకాశా స్తామ్రాస్యాః ప్రియదర్శనాః,
యుక్తా రథవరే యస్య సర్వశిక్షా విశారదాః. ౪

అవిగో పెద్దదేహములతో ఎఱ్ఱనివి, నిగనిగలాడు పగడములవలె భాసించుచున్నవి, ఎఱ్ఱని మోములు కలవి, చూచుట కింపుగ నున్నవి, చక్కగా శిక్షణపొంది ఆరితేరినవి అగు గుఱ్ఱములు కట్టిన రథము కడకు పోనిమ్ము.

దీర్ఘబాహు ర్మహాతేజా బలరూప సమన్వితః,
సర్వలోకేషు విక్రాన్తో భారద్వాజః ప్రతాపవాన్. ౫

పొడవైన చేతులు, గొప్ప తేజస్సు, బలము, రూపము, ప్రతాపము కలిగిన ఆ ద్రోణుడు ఎల్లలోకముల పేరెన్నిక గన్నవాడు.

బుద్ధ్యా తుల్యో హ్యుశనసా బృహస్పతిసమో నయే,
వేదా స్తథైవ చత్వారో బ్రహ్మచర్యం తథైవ చ. 6

ససంహారాణి సర్వాణి దివ్యాణ్యస్త్రాణి మారిష,
ధనుర్వేదశ్చ కార్త్స్న్యేన యస్మిన్ నిత్యం ప్రతిష్ఠితః. 7

ఆయన బుద్ధిలో శుక్రసముడు. నీతిలో బృహస్పతి కెనయగును. నాలుగు వేదములు, బ్రహ్మచర్యము, ఉపసంహారములతో కూడిన దివ్యాస్త్రములన్నియు, సంపూర్ణమగు ధనుర్వేదము ఈయనలో గూడుకట్టుకొని కూర్చున్నవి.

క్షమా దమశ్చ సత్యం చ ఆనృశంస్య మథార్జవమ్,
ఏతే చాన్యే చ బహవో యస్మిన్ నిత్యం ద్విజే గుణాః. 8

ఈ ద్విజునిలో ఓర్పు, నిగ్రహము, సత్యము, కృతజ్ఞత, ఋజుత్వము - ఈ మొదలగు ననేక గుణములు పాయక నిలిచియున్నవి.

తేనాహం యోద్ధు మిచ్ఛామి మహాభాగేన సంయుగే,
తస్మాత్ తం ప్రాపయాచార్యం క్షిప్ర ముత్తర ! వాహయ. 9

ఆ మహానుభావునితో యుద్ధమాడగోరుదును. త్వరగా ఆచార్యునికడకు చేర్పుము. ఓ ఉత్తరా! వేగముగా గుఱ్ఱములను తోలుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

అర్జునే నైవ ముక్త స్తు వైరాటి ర్హేమభూషణాన్,
చోదయామాస తానశ్వాన్ భారద్వాజరథం ప్రతి. 10

ఇట్లర్జునుడు చెప్పగా ఉత్తరుడు బంగారుభూషణములు గల ఆ గుఱ్ఱములను ద్రోణుని రథమువైపు తోలెను.

తమాపతన్తం వేగేన పాణ్డవం రథినాం వరమ్,
ద్రోణః ప్రత్యుద్యయౌ పార్థం మత్తో మత్తమివ ద్విపమ్. 11

రథికవరేణ్యుడగు అర్జును డట్లు వేగముగా వచ్చిపడు చుండగా ద్రోణుడు మదించిన ఏనుగును మదించిన ఏనుగు ఎదుర్కొనిన విధముగ ఎదుర్కొనెను.

తతః ప్రధ్మాపయ చ్ఛఙ్ఖం భేరీశతనినాదినమ్,
ప్రచుక్షుభే బలం సర్వ ముద్ధూత ఇవ సాగరః. 12

పిదప నాతడు నూరుభేరుల శబ్దమువంటి శబ్దము కలుగునట్లు శంఖము నూదెను. దానితో పొంగిన సముద్రమువలె సేన యంతయు మిక్కిలి కలగెను.

తతః శోణాన్ సదశ్వాం స్తాన్ హంసవర్ణై ర్మనోజవైః,
మిశ్రితాన్ సమరే దృష్ట్వా వ్యస్మయ న్త రణే నరాః. 13

అంత ఆ ఎఱ్ఱని గుఱ్ఱములు అంచవన్నెగల మహావేగముగల అర్జునుని గుఱ్ఱములతో కలసిపోగా రణమున నరులందఱు చూచి ఆశ్చర్యపడిరి.

తౌ రథౌ వీర్యసంపన్నౌ దృష్ట్వా సంగ్రామమూర్ధని,
ఆచార్యశిష్యౌ వజితౌ కృతవిద్యౌ మనస్వినౌ. 14

సమాశ్లిష్టౌ తదన్యోన్యం ద్రోణపార్థౌ మహాబలౌ,
దృష్ట్వా ప్రాకమ్పత ముహు ర్భరతానాం మహద్ బలమ్. 15

నిండైన వీర్యము, విద్య, అభిమానము గలిగినమహాబలులు, మహారథులు, ఓటమి ఎఱుగనివారు నగు ఆద్రోణార్జునులు మొన తలలో తారసిల్లగా భరతకులమహాసేన కాంచి వణకిపోయెను.

13. గుఱ్ఱములు కలసిపోయినవనగా అంత దగ్గఱకు ఆయోధు లిద్దరు చేరిరని భావము, అందువలన ఆశ్చర్యము.

15. ద్రోణు డర్జునునితో కలసి తమ్మే చావగొట్టునేమో యను శంకతో వణకిపోయి రని భావము.

హర్షయుక్త స్తతః పార్థః ప్రహసన్నివ వీర్యవాన్,
రథం రథేన ద్రోణస్య సమాసాద్య మహారథః, 16

అభివాద్య మహాబాహుః సామపూర్వ మిదం వచః,
ఉవాచ శ్లక్ష్ణయా వాచా కౌన్తేయః పరవీరహా. 17

శత్రువీరుల నంతమొందించు మహారథుడు, మహాబాహుడు నగు అర్జునుడు సంతసముతో వికసించిన మోముతో రథమును ద్రోణుని రథమునకు జోడించి, అభివాదనముచేసి ప్రేమపూర్వకముగా తిన్ననిమాటతో నిట్లు పలికెను.

ఉషితాః స్మో వనే వాసం ప్రతికర్మ[౧] చికీర్షవః,
కోపం నార్హసి నః కర్తుం సదా సమరదుర్జయ. 18

యుద్ధమున గెలువ శక్యముకాని ఓ మహాశయా! వనవాసము చేసితిమి. ప్రతిక్రియ చేయగోరుచున్నాము. మాపై నీవు కోపము చేయరాదు.

అహం తు ప్రహృతే పూర్వం ప్రహరిష్యామి తేఽనఘ,
ఇతి మే వర్తతే బుద్ధి స్తద్భవాన్ కర్తు మర్హతి. 19

అనఘా! నీవు ముందు నన్ను కొట్టినచో మాత్రమే నీపై బాణము వేయవలయునని నా ఉద్దేశము. తమ రట్లుగావింపదగును.

తతోఽస్మై ప్రాహిణోద్ ద్రోణః శరా నధికవింశతిమ్,
అప్రాప్తాంశ్చైవ తాన్ పార్థ శ్చిచ్ఛేద కృతహస్తవత్. 20

అపుడు ద్రోణుడు అతనిపై ఇరువదికి మించి బాణములను వేసెను. చేతి ఒడుపుగల అర్జునుడు వానిని నడుమనే త్రుంచివేసెను.

తతః శరసహస్రేణ రథం పార్థస్య వీర్యవాన్,
అవాకిరత్ తతో ద్రోణః శీఘ్ర మస్త్రం విదర్శయన్. 21

---
౧. ప్రతికర్మ - శత్రువుల కపకారము.

అంత ద్రోణుడు వీర్యమంతయు కూర్చుకొని తన అస్త్రలాఘవమును చూపుచు అర్జునుని రథముపై వేయి బాణములను గ్రుమ్మెను.

హయాంశ్చ రజతప్రఖ్యాన్ కఙ్కపత్రైః శిలాశితైః,
అవాకిర దమేయాత్మా పార్థం సంకోప యన్నివ. ౨౨

పక్షి ఈకలుగలిగి, ఉలుల పదునుగల బాణములను ఊహింపవలవిగాని ఆత్మగల ద్రోణుడు పార్థునికి కోపము తెప్పించుటకో యన్నట్లు తెల్లని గుఱ్ఱములపై ప్రయోగించెను.

ఏవం ప్రవవృతే యుద్ధం భారద్వాజకిరీటినోః,
సమం విముఞ్చతోః సంఖ్యే విశిఖాన్ దీప్తతేజసః. ౨౩

మండుచున్న తేజస్సులు గల బాణములను పరస్పరము ప్రయోగించుకొనుచున్న ద్రోణార్జునుల యుద్ధ మిట్లు సమముగా సాగెను.

తా వుభౌ ఖ్యాతకర్మాణా వుభౌ వాయుసమౌ జవే,
ఉభౌ దివ్యాస్త్రవిదుషా వుభౌ వుత్తమ తేజసౌ,
క్షిపన్తౌ శరజాలాని మోహయామాసతు ర్నృపాన్. ౨౪

ఇద్దరు ప్రసిద్ధమగు అస్త్రకర్మలు కలవారు. ఇద్దరు వేగమున వాయువువంటివారు. ఇద్దఱు దివ్యాస్త్రములయందు నేర్పరులు. ఇద్దరు గొప్ప తేజస్సు కలవారు. అట్టివా రిరువురు బాణసమూహములను ఒకరిపై నొకరు విసరుకొనుచు చూచెడి రాజుల నందరిని మోహపెట్టిరి.

వ్యస్మయన్త తతో యోధా యే తత్రాసన్ సమాగతాః,
శరాన్ విసృజతో స్తూర్ణం సాధుసాధ్వి త్యపూజయన్. ౨౫

---

౨౩. సమమ్ - హెచ్చుతగ్గులు లేనట్లుగా.

అచట మూగినయోధులందరు అంతవఱకుగా బాణములు గుప్పించుచున్న వారిరువురిని గాంచి మేలుమేలని అచ్చెరువుతో ప్రశంసించిరి.

ద్రోణం హి సమరే కోఽన్యో యోద్ధు మర్హతి ఫాల్గునాత్,
రౌద్రః క్షత్రియధర్మోఽయం గురుణా యదయుధ్యత, 26
ఇత్యబ్రువ జ్జనా స్తత్ర సంగ్రామశిరసి స్థితాః.

అర్జునుడు కాక మఱియొకడు ద్రోణునితో యుద్ధము చేయ గలడా ? ఆహా క్షత్రియధర్మ మెంత రౌద్రము? ఏలయన ఈతడు గురువుతో పోరుచున్నాడు. ఇట్లని మొనతలలో నున్న జను లనుకొనజొచ్చిరి.

వీరౌ తా వభి సంరబ్ధౌ సంనికృష్టౌ మహాభుజౌ,
ఛాదయేతాం శరవ్రాతై రన్యోన్య మపరాజితౌ. 27

వీరులు, మిక్కిలి ఉత్సాహముగలవారు, మహాభుజులు ఎందును ఓటమిలేనివారునగు వారిరువురు తారసిల్లి బాణసమూహ ములతో ఒకరి నొకరు ముంచిమెత్తిరి.

విస్ఫార్య సుమహచ్చాపం హేమపృష్ఠం దురాసదమ్,
భారద్వాజోఽథ సంక్రుద్ధః ఫాల్గునం ప్రత్యవిధ్యత. 28

బంగారుతొడుగు గలది, ఇతరులకు పొందశక్యముకానిదియు నగు తనదైన పెద్దవింటిని బాగుగా లాగి ద్రోణుడు మిక్కిలి క్రోధ ముతో అర్జునుని కొట్టెను.

స సాయకమయై ర్జాలై రర్జునస్య రథం ప్రతి,
భానుమద్భిః శిలాధౌతై ర్భానో రాచ్ఛాదయత్ ప్రభామ్. 29

మరియు ద్రోణుడు కాంతులు వెదజల్లుచున్నవి, రాతిపై పదునుపెట్టబడినవియు నగు బాణములవలలచేత అర్జునుని రథముపై సూర్యకాంతిని ప్రసరింపకుండ చేసెను.

పార్థంచ సుమహాబాహు ర్మహావేగై ర్మహారథః,
వివ్యాధ నిశితై ర్బాణై ర్మేఘో వృష్ట్యేవ పర్వతమ్. 30

మహారథుడు, మహాబాహువు నగు ద్రోణుడు మహావేగము గల వాడిబాణములతో అర్జునుని, వర్షము పర్వతమును గొట్టినట్లు గొట్టెను.

తథైవ దివ్యం గాణ్డీవం ధను రాదాయ పాణ్డవః,
శత్రుఘ్నం వేగవాన్ హృష్టో భారసాధన ముత్తమమ్, 31

విససర్జ శరాం శ్చిత్రాన్ సువర్ణవికృతాన్ బహూన్,
నాశయన్ శరవర్షాణి భారద్వాజస్య వీర్యవాన్,
తూర్ణం చాపవినిర్ముక్తై స్తదద్భుతమి వాభవత్. 32

అట్లే అర్జునుడును దివ్యము శత్రునాశకము, ఎంతటి భారమైన ఓర్చునది, ఉత్తమము నగు గాండీవమును గైకొని వేగవంతుడై బంగారుతొడుగులు గల చిత్రములైన బాణములను పెక్కింటిని ప్రయోగించెను. ద్రోణునిశరవర్షములను వీర్యవంతుడై మాయించెను. అది ఆశ్చర్యమాయెను.

స రథేన చరన్ పార్థః ప్రేక్షణీయో ధనంజయః,
యుగపద్ దిక్షు సర్వాసు సర్వతోఽస్త్రాణ్యదర్శయత్. 33

పృథకొడుకు ధనంజయుడు రథముతో సంచరించుచు అన్ని దిక్కులయం దొక్కమారుగా అస్త్రములను పరపుచు చూడదగిన వాడయ్యెను.

ఏకచ్ఛాయ మివాకాశం బాణై శ్చక్రే సమన్తతః,
సాదృశ్యత తదా ద్రోణో నీహారే ణేవ సంవృతః. 34

అతడు బాణములతో ఆకాశ మంతటిని ఒకేనీడ గలదానినిగా చేసెను. మంచుచే కప్పబడినట్లు అప్పుడు ద్రోణుడు కానరాడాయెను.

---

31. భారసాధనమ్ - శత్రువులను మర్దింపజాలినది - ఛేదింప శక్యము కానిదని భావము.

తస్యాభవత్ తదా రూపం సంవృతస్య శరోత్తమైః,
జాజ్వల్యమానస్య తదా పర్వతస్యేవ సర్వతః. 35

ఉత్తమబాణములతో కప్పబడిన ఆతనిరూపము దావాగ్నిలో అంతట మండుచున్న పర్వతమువలె కానవచ్చెను.

దృష్ట్వా తు పార్థస్య రణే శరైః స్వరథ మావృతమ్,
స విస్ఫార్య ధనుఃశ్రేష్ఠం మేఘస్తనిత నిస్వనమ్, 36

అగ్నిచక్రోపమం ఘోరం వ్యకర్షత్ పరమాయుధమ్,
వ్యశాతయ చ్ఛరాం స్తాంస్తు ద్రోణః సమితిశోభనః. 37

యుద్ధమున నారితేరిన ద్రోణుడు అర్జునబాణములతో కప్పబడిన తన రథమును గాంచి ఉఱుమువంటి ధ్వనికలిగిన తన శ్రేష్ఠమగు ధనువును బాగుగా లాగి అగ్నిచక్రమువలె ఘోరమైనదిగా చేసెను. దానితో ఆబాణములను రూపుమాపెను.

మహా నభూత్ తతః శబ్దో వంశానా మివ దహ్యతామ్. 38

అప్పుడు కాలుచున్న వెదుళ్ళ ధ్వనివంటి మహానాదము ఉత్పత్తిల్లెను.

జాంబూనదమయైః పుంఖై శ్చిత్రచాపవినిర్గతైః,
ప్రాచ్ఛాదయ దమేయాత్మా దిశః సూర్యస్య చ ప్రభామ్. 39

చిత్రమగు ధనువునుండి వెడలిన బంగారు బాణములతో ఆ అమేయాత్ముడు దిక్కులను సూర్యకాంతిని కప్పివైచెను.

తతః కనకపుంఖానాం శరాణాం నతపర్వణామ్,
వియచ్చరాణాం వియతి దృశ్యన్తే బహవో వ్రజాః. 40

అంత బంగారు పిడులు, కొంచెము వంగినకణుపులు గల బాణముల సముదాయములు ఆకాశమున పెల్లుగా కానవచ్చినవి.

ద్రోణస్య పుఙ్ఖసక్తాశ్చ ప్రభవన్తః శరాసనాత్,
ఏకో దీర్ఘ ఇవాదృశ్య దాకాశే సంహతః శరః. 41

ద్రోణుని వింటినుండి ఒకటి వెనుక ఒకటి అంటివచ్చుచున్న బాణములు ఆకాశమున ఒకేఒక పొడవైన బాణమువలె కానవచ్చినవి.

ఏవం తౌ స్వర్ణవికృతాన్ విముఞ్చన్తౌ మహాశరాన్,
ఆకాశం సంవృతం వీరా వుల్కాభి రివ చక్రతుః. 42

ఈవిధముగా ఆవీరు లిరువురు స్వర్ణమయములైన మహాబాణములను వదలుచు ఆకాశమును ఉల్కలతో నిండినదానివలె చేసిరి.

శరా స్తయో స్తు విబభుః కఙ్కబర్హిణవాససః,
పఙ్క్త్యః శరది స్వస్థానాం హంసానాం చరతా మివ. 43

గ్రద్దఈకలు నెమలిఈకలు వెనుకవైపుగల వారిబాణములు శరత్కాలమున నెమ్మదితో సంచరించు హంసలపంక్తులవలె ప్రకాశించినవి.

యుద్ధం సమభవ త్తత్ర సుసంరబ్ధం మహాత్మనోః,
ద్రోణపాణ్డవయో ర్ఘోరం వృత్రవాసవయో రివ. 44

ఆ మహాత్ములగు ద్రోణపాండవుల ఘోరసంగ్రామము వృత్రదేవేంద్రులయుద్ధమువలె భయంకరమాయెను.

తౌ గజా వివ చాసాద్య విషాణాగ్రైః పరస్పరమ్,
శరైః పూర్ణాయతోత్సృష్టై రన్యోన్య మభిజఘ్నతుః. 45

రెండుఏనుగులు తారసిల్లి దంతములకొనలతో ఒకదానినొకటి పొడుచుకొనిన విధముగా బాగుగా లాగినవిండ్లనుండి వెలువడు బాణములతో వారిరువురు పరస్పరము కొట్టుకొనిరి.

తౌ వ్యవాహారతాం యుద్ధే సంరబ్ధౌ రణశోభినౌ,
ఉదీరయన్తౌ సమరే దివ్యా న్యస్త్రాణి భాగశః. 46

45. విషాణాగ్రైః - దంతముల కొనలతో
46. వ్యవాహారతామ్ - వ్యవహారమనగా ధర్మయుద్ధము - అది కావించిరి.

వారిరువురు మిక్కిలి తీవ్రతతో ఏరి ఏరి దివ్యములగు అస్త్రములతో ధర్మయుద్ధము గావించిరి.

అథ త్వాచార్యముఖ్యేన శరాన్ సృష్టా ఞ్ఛిలాశితాన్,
న్యవారయ చ్ఛితై ర్బాణై రర్జునో జయతాంవరః. 47

జయశాలులలో శ్రేష్ఠుడగు అర్జునుడు ఆచార్యవరుడు వదలిన పదునైన బాణములను పదునైన తన బాణములతో ఆపెను.

దర్శయన్ వీక్షమాణానా మస్త్ర ముగ్రపరాక్రమః.
ఇషుభి స్తూర్ణ మాకాశం బహుభి శ్చ సమావృణోత్. 48

ఉగ్రమైన పరాక్రమము గల అర్జునుడు చూచువారికి అస్త్రమును ప్రదర్శించుచు అనేకబాణములతో ఒక్కపెట్టున ఆకాశమును కప్పివైచెను.

జిఘాంసంతం నరవ్యాఘ్ర మర్జునం తిగ్మతేజసమ్,
ఆచార్యముఖ్యః సమరే ద్రోణః శస్త్రభృతాంవరః,
అర్జునేన సహాక్రీడ చ్ఛరైః సంనతపర్వభిః. 49

నరవరుడు, తీవ్రతేజస్సు గలవాడు నగు నర్జునుడు తన్ను గొట్టుచున్నప్పటికి ఆచార్యవర్యుడు, అస్త్రవేత్తలలో శ్రేష్ఠుడు నగు ద్రోణుడు కొంచెము వంపుగల బాణములతో అర్జునునితో క్రీడించెను.

దివ్యా న్యస్త్రాణి వర్ష న్తం తస్మిన్ వై తుములే రణే,
అస్త్రై రస్త్రాణి సంవార్య ఫాల్గునం సమయోధయత్. 50

ఆ ఘోరయుద్ధమున దివ్యములైన అస్త్రములను కురియుచున్న అర్జునుని అస్త్రముల నస్త్రములతో వారించి ద్రోణుడు సమానముగా యుద్ధమాడెను.

---

49. జిఘాంసన్తమ్ - కొట్టుచున్నవానిని - ద్రోణుడు వాత్సల్యముతో అర్జునునితో క్రీడించెనని భావము

తయో రాసీత్ సంప్రహారః క్రుద్ధయో ర్నరసింహయోః,
అమర్షిణో స్తదాన్యోన్యం దేవదానవయో రివ. 51

కోపించిన, పరస్పరము మించగోరిన ఆ నరసింహుల కొట్లాట దేవదానవుల యుద్ధమువలె కానవచ్చెను.

ఐన్ద్రం వాయవ్య మాగ్నేయ మస్త్ర మస్త్రేణ పాణ్డవః,
ద్రోణేన ముక్తమాత్రం తు గ్రసతి స్మ పునః పునః. 52

ఇంద్రుడు, వాయువు, అగ్ని అను దేవతల అస్త్రములను ద్రోణుడు ప్రయోగించినది ప్రయోగించినట్లుగా అర్జునుడు మాటి మాటికి అస్త్రములచే అణగించెను.

ఏవం శూరౌ మహేష్వాసౌ విసృజన్తౌ శితా ఞ్ఛరాన్,
ఏకచ్ఛాయం చక్రతు స్తా వాకాశం శరవృష్టిభిః. 53

ఇట్లు మహాధనుర్ధరులగు శూరులు పదునైన బాణములను ప్రయోగించుచు ఆకాశము నంతటి నొక్కనీడ గలదానినిగా బాణ వర్షములతో గావించిరి.

తత్రార్జునేన ముక్తానాం పతతాం వై శరీరిషు,
పర్వతేష్వివ వజ్రాణాం శరాణాం శ్రూయతే స్వరః. 54

అందు అర్జునుడు వదలిన బాణములు ప్రాణులపై పడుచు పర్వతములపై పడిన వజ్రములవలె గొప్ప ధ్వనిని చేసినవి.

తతో నాగా రథా శ్చైవ వాజినశ్చ విశాంపతే,
శోణితాక్తా వ్యదృశ్య న్త పుష్పితా ఇవ కింశుకాః 55

ఓ రాజా! అపుడు ఏనుగులు, రథములు, గుఱ్ఱములు, రక్త పూరితములై పూచిన కింశుకములవలె కానవచ్చినవి.

బహుభి శ్చ సకేయూరై ర్విచిత్రై శ్చ మహారథైః,
సువర్ణచిత్రైః కవచై ర్ధ్వజైశ్చ వినిపాతితైః, 56

యోధైశ్చ నిహతై స్తత్ర పార్థబాణప్రపీడితైః,
బల మాసీద్ సముద్భ్రాన్తం ద్రోణార్జునసమాగమే. 57

ఆ ద్రోణార్జునుల యుద్ధమున అర్జునబాణములపీడనొంది కేయూరములతోపాటు పడిన బాహువుల చేతను, విచిత్రములైన మహారథముల చేతను, మంచిరంగులుగల కవచముల చేతను, కూలి ద్రోసిన ధ్వజములచేతను, చచ్చిపడినయోధుల చేతను సేన యంతయు దిక్కుతోచని దాయెను.

విధున్వానౌ తు తౌ తత్ర ధనుషీ భారసాధనే,
ఆచ్ఛాదయేతా మన్యోన్యం తతక్షతు రథేషుభిః. 58

గొప్పదార్ఢ్యముగల ధనువులను విదలించుచు వారిరువురు ఒకరినొకరు క్షీణింపజేయుచు బాణములతో కప్పివైచిరి.

తయోః సమభవ ద్యుద్ధం తుములం భరతర్షభ,
ద్రోణకౌన్తేయయో స్తత్ర బలివాసవయో రివ. 59

ఆ ద్రోణార్జునులకు బలిదేవేంద్రుల యుద్ధమువంటి మహాఘోరయుద్ధ మాచట జరిగెను.

అథ పూర్ణాయతోత్సృష్టైః శరైః సంనతపర్వభిః,
వ్యదారయేతా మన్యోన్యం ప్రాణద్యూతే ప్రవర్తితే. 60

అప్పుడు వారిరువురికి పరస్పరము ప్రాణద్యూతము ప్రవర్తిల్లెను. విండ్లను మండలాకారముగా చేసి వాడిబాణములతో ఒకరినొకరు చర్మము చీలునట్లు పోరాడిరి.

అథాన్తరిక్షే నాదోఽభూత్ ద్రోణం తత్ర ప్రశంసతామ్,
దుష్కరం కృతవాన్ ద్రోణో యదర్జున మయోధయత్, 61

60. పూర్ణాయత - ఉత్సృష్టైః- విండుగా లాగుటచేత గుండ్రని ఆకారము కలదైన వింటినుండి వెలువడిన (బాణములతో)

ప్రమాథినం మహావీర్యం దృఢముష్టిం దురాసదమ్,
జేతారం దేవదైత్యానాం సర్వేషాం చ మహారథమ్. 62

'శత్రువుల వణచువాడు, మహాశక్తిసంపన్నుడు, దృఢమైన పిడికిలిగలవాడు, వశముకానివాడు, దేవతలను దానవులను గెలిచిన వాడు, అందరిలో మహారథుడు అగు నీ అర్జునునితో ద్రోణుడు పోరెను. ఎంత దుష్కరమైన పనిచేసెను!' అని అచట మూగిన జనులు చేసిన ద్రోణప్రశంస మిన్నుముట్టెను.

అవిభ్రమం శిక్షాం చ లాఘవం దూరపాతితామ్,
పార్థస్య సమరే దృష్ట్వా ద్రోణ స్యాభూచ్చ విస్మయః. 63

యుద్ధమున ఏమాత్రము చెదరకుండుట, నేర్పు, ఒడుపు, ఎంత దూరమునకైనను బాణముల ప్రయోగింపగలుగుట అను అర్జునుని లక్షణములను జూచిన ద్రోణునకును అచ్చెరువు పుట్టెను.

అథ గాణ్డీవ ముద్యమ్య దివ్యం ధను రమర్షణః,
విచకర్ష రణే పార్థో బాహుభ్యాం భరతర్షభ. 64

అంత దివ్యధనువగు గాండీవము నెత్తి మిక్కిలి కోపముతో అర్జునుడు రెండు చేతులతో గట్టిగా లాగెను.

తస్య బాణమయం వర్షం శలభానా మి వాయతిమ్,
దృష్ట్వా తే విస్మితాః సర్వే సాధుసాధ్వి త్యపూజయన్. 65

మిడుతలదండువలె అతివిస్తృతముగా వచ్చిపడుచున్న బాణమయమగు వర్షము చూచి అందరు అచ్చెరువు నొందుచు మేలు మేలని ప్రశంసించిరి.

న చ బాణాన్తరే వాయు రస్య శక్నోతి సర్పితుమ్,
అనిశం సన్దధానస్య శరా నుత్సృజత స్తథా. 66

65. ఆయతిమ్- వెల్లువవంటి దానిని

అపుడు నిరంతరము బాణముల ప్రయోగించుచున్న అర్జునుని బాణముల నడుమ గాలి కూడ పోజాలదాయెను.

దదర్శ నాంతరం కశ్చిత్ పార్థ స్యాదదతోఽపి చ   67

అర్జునుడు బాణము కైకొనుటయందును వ్యవధానము కానరాకుండెను.

తథా శీఘ్రాస్త్రియుద్ధే తు వర్తమానే సుదారుణే,
శీఘ్రం శీఘ్రతరం పార్థః శరా నన్యా నుదీరయత్.   68

అట్లు శీఘ్రములగు అస్త్రముల ఘోరమగు యుద్ధము జరుగుచుండగా అర్జునుడు మరిన్ని బాణములు గుప్పించెను.

తతః శతసహస్రాణి శరాణాం నతపర్వణామ్,
యుగపత్ ప్రాపతం స్తత్ర ద్రోణస్య రథ మంతికాత్.   69

అందు నూరువేల వాడిబాణములు దగ్గరనుండి ద్రోణునిరథముపై ఒక్కుమ్మడిగా పడినవి.

కీర్యమాణే తదా ద్రోణే శరై ర్గాణ్డీవధన్వనా,
హాహాకారో మహా నాసీత్ సైన్యానాం భరతర్షభ.   70

ఓ భరతశ్రేష్ఠా! గాండీవధారియగు అర్జునుని బాణము లట్లు ద్రోణుని క్రమ్మివేయగా సేనల హాహారవము పెల్లురేగెను.

పాణ్డవస్య తు శీఘ్రాస్త్రం మఘవా ప్రత్యపూజయత్,
గన్ధర్వాప్సరస శ్చైవ యే చ తత్ర సమాగతాః.   71

అచట చేరిన దేవేంద్రుడు, గంధర్వులు, అప్సరసలు అర్జునుని బాణలాఘవమును కొనియాడిరి.

తతో వృన్దేన మహతా రథానాం రథయూథపః,
ఆచార్యపుత్రః సహసా పాణ్డవం పర్యవారయత్.   72

అపుడు ఆచార్యపుత్రుడు గొప్పరథముల సముదాయముతో అర్జునుని కవిసెను.

అశ్వత్థామా తు తత్కర్మ హృదయేన మహాత్మనః,
పూజయామాస పార్థస్య కోపం చాస్యాకరోద్ భృశమ్. 73

మహాత్ముడగు అర్జునుడు చేసినపనిని అశ్వత్థామ హృదయమున అభినందించెను. ఆతనిపై పెద్దగా కోపించెను.

స మన్యువశ మాపన్నః పార్థ మభ్యద్రవద్ రణే,
కిరఞ్ఛరసహస్రాణి పర్జన్య ఇవ వృష్టిమాన్. 74

వర్షము కురియుచున్న పర్జన్యునివలె అశ్వత్థామ మిక్కిలి కోపము నొందినవాడై బాణములు గుప్పించుచు పార్థునిపైకి దుమికెను.

ఆవృత్యతు మహాబాహు ర్యతో ద్రౌణి స్తతో హయాన్,
అంతరం ప్రదదౌ పార్థో ద్రోణస్య వ్యపసర్పితుమ్. 75

మహాబాహు వగు నర్జునుడు అశ్వత్థామ యెందున్న నచటికి గుఱ్ఱములను మరలించుచు ద్రోణుడు తొలగిపోవుటకు అవకాశము కల్పించెను.

స తు లబ్ధ్వాంతరం తూర్ణ మపాయా జ్జవనై ర్హయైః,
ఛిన్నవర్మ ధ్వజః శూరో నికృత్తః పరమేషుభిః. 76

ఆద్రోణుడును కవచము చీలిపోగా, ధ్వజము కూలిపోగా, మహాబాణములు శరీరమును చీల్చివేయగా, సందుచూచుకొని వేగముగల గుఱ్ఱములతో దూరముగా తొలగిపోయెను.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి
ద్రోణాపయానే అష్టపఞ్చాశత్తమోఽధ్యాయః
ఇది శ్రీమహాభారతమున విరాటపర్వమున గోహరణపర్వమున
ద్రోణుడు తొలగిపోవుట యను ఏబదియెనిమిదవ అధ్యాయము.

## ఏకోనషష్టితమో౽ధ్యాయః - ఏబదితొమ్మిదవ అధ్యాయము

అశ్వత్థామ్నా సహ అర్జునస్య యుద్ధమ్.

అశ్వత్థామతో అర్జునుని యుద్ధము.

తతో ద్రౌణి ర్మహారాజ ! ప్రయయా వర్జునం రణే,
తం పార్థః ప్రతిజగ్రాహ వాయువేగ మివోద్ధతమ్,
శరజాలేన మహతా వర్షమాణ మివాంబుదమ్. 1

ఓ మహారాజా ! అంత అశ్వత్థామ అర్జునునిమీదికి వెడలెను. అర్జునుడు గొప్పబాణవర్షముతో మేఘమువలె వాయువేగముతో దూకుడుగా వచ్చు ఆతనిని నిలువరించెను.

తయో ర్దేవాసురసమః సంనిపాతో మహా నభూత్,
కిరతోః శరజాలాని వృత్రవాసవయో రివ. 2

వృత్రాసుర దేవేంద్రులవలె బాణములను విరజిమ్ముకొను చున్న వారిరువురి యుద్ధము దేవదానవులయుద్ధమువలె గొప్పదయ్యెను.

న స్మ సూర్య స్తదా భాతి న చ వాతి సమీరణః,
శరజాలావృతే వ్యోమ్ని చ్ఛాయాభూతే సమన్తతః. 3

ఆకాశమంతయు బాణములతో నిండి నీడగానై పోగా సూర్యుడు కానరాలేదు. గాలి వీవలేదు.

మహాం శ్చటచటాశబ్దో యోధయో ర్హన్యమానయోః,
దహ్యతా మివ వేణూనా మాసీత్ పరపురంజయ. 4

ఓ రాజా ! ఆ యోధు లిద్దరు నట్లు పోరుచుండగా కాలుచున్న వెదుళ్ళచప్పుడువంటి చటచటాశబ్దము పెల్లుగా పుట్టెను.

హయా న స్యార్జునః సర్వాన్ కృతవా నల్పజీవితాన్,
తే రాజన్ ! న ప్రజానన్త దిశం కాఞ్చన మోహితాః. 5

అర్జును డాతని గుఱ్ఱముల నన్నింటిని అల్పాయువులను చేసెను. ఓరాజా! ఆ గుఱ్ఱములకు దెబ్బతో ఒడలు తెలియక దిక్కే కానరాలేదు.

తతో ద్రౌణి ర్మహావీర్యః పార్థస్య విచరిష్యతః,
వివరం సూక్ష్మ మాలోక్య జ్యాం చిచ్ఛేద క్షురేణ వై,
తద స్యాపూజయన్ దేవాః కర్మ దృష్ట్వాతిమానుషమ్. 6

అంత మహాబలశాలి అశ్వత్థామ సన్నని సందు చూచుకొని అర్జునుని వింటినారిని కత్తిబాణముతో ఛేదించెను. మనుష్యసాధారణము కాని ఆపనిని దేవతలును కొనియాడిరి.

ద్రోణో భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చైవ మహారథాః,
సాధుసాధ్వితి భాషన్తోఽపూజయన కర్మ తస్య తత్. 7

ద్రోణుడు, భీష్ముడు, కర్ణుడు, కృపుడు మొదలగు మహారథులు అతని ఆపనిని గాంచి మేలుమేలని పొగడిరి.

తతో ద్రౌణి ర్ధను శ్శ్రేష్ఠ మపకృష్య రథర్షభమ్,
పున రేవాహనత్ పార్థం హృదయే కఙ్కపత్రిభిః. 8

పిమ్మట అశ్వత్థామ శ్రేష్ఠమగు తనధనువును బాగుగా లాగి వాడిబాణములతో అర్జునుని ఱొమ్మున కొట్టెను.

తతః పార్థో మహాబాహుః ప్రహస్య స్వనవత్ తదా,
యోజయామాస నవయా మౌర్వ్యా గాణ్డీవ మోజసా. 9

అంత మహాబాహువగు అర్జునుడు పెద్దగా నవ్వి క్రొత్తనారిని గాండీవమునకు బలముతో కూర్చెను.

తతోఽర్ధచన్ద్ర మావృత్య తేన పార్థః సమాగమత్,
వారణే నేవ మత్తేన మత్తో వారణయూథపః. 10

---

10. అర్ధచన్ద్రమ్ - అరచందురునివంటి లలాటమును, ఆవృత్య-చుట్టుకొని.

అంత నర్జునుడు మదించిన ఏనుగుతో మదించిన ఏనుగులజేడు తలపడినట్లు నొసటి చెమటను తుడుచుకొని వానితో పోరునకు తలపడెను.

తతః ప్రవవృతే యుద్ధం పృథివ్యా మేకవీరయోః,
రణమధ్యే ద్వయో రేవం సుమహా ల్లోమహర్షణమ్. 11

అపుడు భూమిలో తమకుతామే సాటి అయిన ఆ వీరు లిరువురకు మహాభయంకరయుద్ధము గగుర్పాటు పుట్టించునదై జరిగెను.

తౌ వీరౌ దదృశుః సర్వే కురవో విస్మయాన్వితాః,
యుధ్యమానౌ మహావీర్యౌ యూథపా వివ సంగతౌ. 12

కౌరవులందరు ఆశ్చర్యపూరితులై తలపడిన ఏనుగుతేడులవలె మహాశక్తితో పోరుచున్న ఆ వీరులను గాంచిరి.

తౌ సమాజఘ్నతు ర్వీరా వన్యోన్యం పురుషర్షభౌ,
శరై రాశీవిషాకారై ర్జ్వలద్భి రివ పన్నగైః. 13

త్రాచుపాములవలె మండిపడుచున్న బాణములతో ఆ వీరు లిరువురు ఒకరినొకరు కొట్టుకొనిరి.

అక్షయ్యౌ విషుధీ దివ్యౌ పాణ్డవస్య మహాత్మనః,
తేన పార్థో రణే శూరం స్తస్థౌ గిరి రివాచలః. 14

మహాత్ముడగు అర్జునునకు దివ్యములైన తరుగుపోని అంప పొదులు రెండు కలవు దానితో ఆ శూరుడు యుద్ధమున చలనము లేని కొండవలె నిలిచెను.

అశ్వత్థామ్నః పున ర్బాణాః క్షిప్ర మభ్యస్యతో రణే,
జగ్ముః పరిక్షయం తూర్ణ మభూత్ తే నాధికోఽర్జునః. 15

అశ్వత్థామ కన్నను వడివడిగా బాణములు గుప్పించుటవలన బాణములు తిరిగిపోవుచుండెను. ఆ కారణముగా అర్జునుడు మిన్న యయ్యెను.

తతః కర్ణో మహాచాపం వికృష్యాభ్యధికం తదా,
అవాక్షిపత్ తతః శబ్దో హాహాకారో మహా నభూత్. 16

అప్పుడు కర్ణుడు గొప్ప వింటిని కైకొని బాగుగా లాగి వదలెను. దానితో గొప్ప హాహాకారము చెలరేగెను.

తత శ్చక్షు ర్దధే పార్థో యత్ర విస్ఫార్యతే ధనుః,
దదర్శ తత్ర రాధేయం తస్య కోపో వ్యవర్ధత. 17

అంత అర్జునుడు విల్లు విప్పారినవైపు దృష్టి నిడెను. అందు కర్ణుని చూచెను. అతనికి కోపము పెల్లురేగెను.

స రోషవశ మాపన్నః కర్ణ మేవ జిఘాంసయా,
తమైక్షత వివృత్తాభ్యాం నేత్రాభ్యాం కురుపుఙ్గవః. 18

అట్లు రోషముతో కూడిన అర్జునుడు కర్ణునే కొట్టనెంచి విప్పారిన కనులతో వానిని గాంచెను.

తథా తు విముఖే పార్థే ద్రోణపుత్రస్య సాయకాన్,
త్వరితాః పురుషాః రాజన్ ఉపాజహ్రుః సహస్రశః. 19

అట్లు అశ్వత్థామ బాణములకు అర్జునుడు విముఖుడు కాగా, త్వరత్వరగా వేలకొలది పురుషులు అశ్వత్థామ నావలకు కొనిపోయిరి.

ఉత్సృజ్య చ మహాబాహు ర్ద్రోణపుత్రం ధనంజయః,
అభిదుద్రావ సహసా కర్ణమేవ సపత్నజిత్. 20

శత్రువుల సంహరించు శీలముగలవాడగు ధనంజయుడు ద్రోణపుత్రుని వదలి ఒక్కపెట్టున కర్ణునిపైకి దూకెను.

16. అవాక్షిపత్ - లాగి వదలెను.

తమబ్రవీత్ కౌన్తేయః క్రోధసంరక్తలోచనః,
కావయన్ ద్వైరథం తేన యుద్ధం వచన మబ్రవీత్.

కుంతీపుత్రుడు ఆకర్ణునితో యుద్ధముచేయగోరి కోపముతో ఎఱ్ఱబడిన కనులతో వారితో నిట్లు పలికెను.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే అర్జునాశ్వత్థామయుద్ధే ఏకోనషష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారత విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున అర్జునాశ్వత్థామయుద్ధముగల ఏబది తొమ్మిదవ అధ్యాయము.

## షష్టితమోఽధ్యాయః — అరువదవ అధ్యాయము

కర్ణార్జునయో ర్యుద్ధం కర్ణస్య పరాజయశ్చ,
కర్ణార్జునుల యుద్ధము, కర్ణుడు ఓడుట.

అర్జున ఉవాచ — అర్జును డిట్లు పలికెను.

కర్ణ యత్ తే సభామధ్యే బహు వాచా వికత్థితమ్,
న మే యుధి సమోఽస్తీతి తదిదం సముపస్థితమ్. 1

ఓ కర్ణా ! సభనడుమ చాలమాటలతో యుద్ధమున నా కెవ్వడు లేడని డాబులు పలికితివే, ఇదిగో అది వచ్చిపడినది. 1

సోఽద్య కర్ణ మయా సార్ధం వ్యవహృత్య మహామృధే,
జ్ఞాస్య స్వబల మాత్మానం న చాన్యా నవమంస్యసే. 2

కర్ణా ! ఆనీవు నాతో ఇపుడు యుద్ధమాడి నీబల మెట్టిదో ఎఱుగుదువు. ఇతరుల నవమానింపవు.

అవోచః పరుషా వాచో ధర్మ ముత్సృజ్య కేవలమ్,
ఇదం తు దుష్కరం మన్యే యదిదం తే చికీర్షితమ్. 3

1. తే - దీనికి 'నీచేత' అనునర్థము చెప్పుకొనవలయును.

ధర్మమును బొత్తుగా విడనాడి తులువ పలుకులు చాల పలికితివి. కాని ఇప్పుడు చేయగోరినది నీవు చేయజాలవు అని నేనెంతును.

యత్ త్వయా కథితం పూర్వం మా మనాసాద్య కించన,
తదద్య కురు రాధేయ కురుమధ్యే మయా సహ. 4

నన్ను తాకకముందు ఏదేది పలికితివో అది ఇప్పుడు ఈ కురువుల నడుమ నాతో చేయుము.

యత్ సభాయాం స పాఞ్చాలీం క్లిశ్యమానాం దురాత్మభిః,
దృష్టవా నసి తస్యాద్య ఫల మాప్నుహి కేవలమ్. 5

ఆనాడు దురాత్ములు సభలో ద్రౌపదిని పెట్టిన పాటు చూచితివి. ఈనాడు సరిగా దానిఫలము ననుభవింపుము.

ధర్మపాశ నిబద్ధేన యన్మయా మర్షితం పురా,
తస్య రాధేయ కోపస్య విజయం పశ్య మే మృధే. 6

మునుపు ధర్మమను త్రాటికి కట్టువడి నేనంతయు సహించితిని. ఓ రాధేయా! ఆకోపమునకు విజయమును ఈ యుద్ధమున చూడుము.

వనే ద్వాదశ వర్షాణి యాని సోఢాని దుర్మతే,
తస్యాద్య ప్రతికోపస్య ఫలం ప్రాప్నుహి సంప్రతి 6

అడవిలో పండ్రెండు సంవత్సరములు పాటుపడితిమి. ఓ దుర్మతీ! దానివలన పెరిగినకోపముఫలమును ఈనాడు ఇప్పుడు అనుభవింపుము.

ఏహి కర్ణ మయా సార్థం ప్రతియుధ్యస్వ సఙ్గరే,
ప్రేక్షకాః కురవః సర్వే భవన్తు తవ సైనికాః. 8

రారా కర్ణా! ఈయుద్ధమున నాతో మార్కొని పోరాడు. ఈ కౌరవులు సైనికులుఅందరు ప్రేక్షకు లగుదురుగాక!

కర్ణ ఉవాచ - కర్ణు డిట్లనెను.

బ్రవీషి వాచా యత్ పార్థ! కర్మణా తత్ సమాచర,
అతిశేతే హి తే వాక్యం కర్మైతత్ ప్రథితం భువి. 9

ఓ పార్థా! మాటతో పలికినదానిని చేతితో చేసి చూపించుము. నీమాట చేష్టను మించుచున్నది. లోకమువకు తెలియుచునే యున్నది.

యత్ త్వయా మర్షితం పూర్వం తదశక్తేన మర్షితమ్,
ఇతో గృహ్ణీమహే పార్థ తవ దృష్ట్వా పరాక్రమమ్. 10

ఓయీ పార్థా! నీవు మున్ను సహించిన దంతయు చేయునది లేకయే సహించితివి. ఇటుపై నీ పరాక్రమమును చూచి అంగీకరింతుము.

ధర్మపాశనిబద్ధేన యత్ త్వయా మర్షితం పురా,
తథైవ బద్ధ మాత్మాన మబద్ధమివ మన్యసే. 11

మునుపు ధర్మపాశమునకు కట్టువడి నీవేది సహించితివో అట్లే నీయాత్మయు కట్టువడినది. దానిని అబద్ధముగా భావింతువా?

యది తావద్ వనే వాసో యథోక్తశ్చరిత స్త్వయా,
తత్ త్వం ధర్మార్థవిత్ క్లిష్టః స మయా యోద్ధు మిచ్ఛసి. 12

నీవు వనవాసమును చెప్పినట్లు చేసినచో దానిని ధర్మార్థముల నెఱిగినవాడవు కనుక కష్టపడితివి. ఇప్పుడు నాతో పోరుట కిష్టపడుచున్నావు.

యది శక్రః స్వయం పార్థ యుధ్యతే తవ కారణాత్,
తథాపి న వ్యథా కాచి న్మమ స్యాద్ విక్రమిష్యతః. 13

ఓ అర్జునా! నీకుగా నీతండ్రి ఇంద్రుడే వచ్చి పోరినను పరాక్రమించుచున్న నా కది ఏ కొంచెము బాధను కలిగింపజాలదు.

అయం కౌన్తేయ కామ స్తే న చిరాత్ సముపస్థితః,
యోత్స్యసే హి మయా సార్ధ మద్య ద్రక్ష్యసి మే బలమ్. 14

ఓ కుంతికుమారా ! ఇదిగో నీకోరిక త్వరలోనే సమకూరినది. నాతో యుద్ధమాడుదువు నాబలమును చూతువు.

అర్జున ఉవాచ - అర్జును డిట్లు పలికెను.

ఇదానీ మేవ తావత్ త్వ మపయాతో రణా న్మమ,
తేన జీవసి రాధేయ నిహత స్త్వనుజ స్తవ. 15

ఓరీ రాధేయా ! ఇప్పుడే నాతో యుద్ధమాడి తొలగిపోతివి. అందువలన బ్రతికితివి. నీతమ్ముడన్ననో చచ్చెను.

భ్రాతరం ఘాతయిత్వా క స్త్యక్త్వా రణశిర శ్చ కః,
త్వదన్యః కః పుమాన్ సత్సు బ్రూయా దేవం వ్యవస్థితః. 16

తమ్ముని చంపికొని యుద్ధభూమిని వదలి సత్పురుషులలో నీకంటె ఇతరు డెవ్వడైన మరల చేరి ఇట్లు పలుకునా ?

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఇతి కర్ణం బ్రువన్నేవ బీభత్సు రపరాజితః,
అభ్యయాద్ విసృజన్ బాణాన్ కాయావరణభేదినః. 17

అని పలుకుచునే ఓటమి యెఱుగని యర్జునుడు పైమెఱుపు చీల్చివేయు బాణములను ప్రయోగించుచు కర్ణునిపై కరిగెను.

ప్రతిజగ్రాహ తం కర్ణః ప్రీయమాణో మహారథః,
మహతా శరవర్షేణ వర్షమాణ ఇవాంబుదమ్. 18

మహారథుడగు కర్ణుడు ప్రీతుడై పెద్దదియగు బాణవర్షములో కురియుచున్న మేఘమువంటి అర్జునుని నిలువరించెను.

ఉత్పేతుః శరజాలాని ఘోరరూపాణి సర్వశః,
అవిధ్య దశ్వాన్ బాహ్వోశ్చ హస్తావాపం పృథక్ పృథక్. 19

ఘోరమైన ఆకృతిగల బాణములు గుములు గుములుగా అన్ని వైపుల ఎగిరిపడినవి. కర్ణుడు అశ్వములను, చేతుల తొడుగులను విడి విడిగా కొట్టెను.

సోఽభ్యస్యమానః కర్ణస్య నిషఙ్గ స్యావలంబనమ్,
చిచ్ఛేద నిశితాగ్రేణ శరేణ నతపర్వణా. 20

అర్జును డది సహింపక కర్ణుని అంపపొదులు గ్రాటిని ఒంపుగల కణుపున్న వాడిబాణముతో తెగనరికెను.

ఉపాసఙ్గా దుపాదాయ కర్ణో బాణా నథాపరాన్,
వివ్యాధ పాణ్డవం హస్తే తస్య ముష్టి రశీర్యత. 21

విడిగా దగ్గరగానున్న పొదినుండి కర్ణుడు వేరుబాణములను కైకొని అర్జునుని చేతిపై కొట్టెను, వానిపిడికిలి దెబ్బతినెను.

తతః పార్థో మహాబాహుః కర్ణస్య ధను రచ్ఛినత్,
స శక్తిం ప్రాహిణోత్ తస్మై తాం పార్థో వ్యధమ చ్ఛరైః. 22

మహాబాహువగు పార్థుడంత కర్ణుని వింటిని విఱుగగొట్టెను. కర్ణుడు శక్తిని ప్రయోగించెను, దానిని అర్జునుడు బాణములతో తునుకలు చేసెను.

తతోఽనుపేతు ర్బహవో రాధేయస్య పదానుగాః,
తాంశ్చ గాణ్డీవనిర్ముక్తైః ప్రాహిణోద్ యమసాదనమ్. 23

అంత కర్ణుని అనుచరు లనేకులు వచ్చిపడిరి. అర్జునుడు గాండీవము నుండి వెలువడిన బాణములతో వారిని యమభవనమున కంపెను.

తతోఽస్యాశ్వా ఞ్ఛరై స్తీక్ష్ణై ర్బీభత్సు ర్భారసాధనైః,
ఆకర్ణముక్తై రవధీత్ తే హతాః ప్రాపతన్ భువి. 24

21. ఉపాసఙ్గాత్ - దగ్గఱగా నున్న చిన్న అంపపొదినుండి;

అర్జునుడు చెవివరకు నారిని లాగి మంచిశక్తిగల తీక్ష్ణబాణములతో కర్ణునిగుఱ్ఱములను కొట్టెను. అవి చచ్చి నేల కొరిగెను.

అథాపరేణ బాణేన జ్వలితేన మహౌజసా,
వివ్యాధ కర్ణం కౌన్తేయ స్తీక్ష్ణే నోరసి వీర్యవాన్. 25

పిదప అర్జునుడు గొప్పశక్తితో ప్రకాశించుచున్న ఒక వాడి బాణముతో శక్తికొలది కర్ణునిరొమ్మున కొట్టెను.

తస్య భిత్త్వా తనుత్రాణం కాయ మభ్యాగమ చ్ఛరః,
తతః స తమసావిష్టో నస్మ కిఞ్చిత్ ప్రజజ్ఞి వాన్. 26

అది కర్ణునికవచమును చీల్చి దేహములోనికి చొచ్చుకొని పోయెను. అంత వానికి చీకట్లు క్రమ్మి ఏమియు తెలియరాలేదు.

స గాఢ వేదనో హిత్వా రణం ప్రాయా దుదఙ్ముఖః,
తతోఽర్జున ఉదక్రోశ దుత్తర శ్చ మహారథః॥ 27

గాఢమైన వేదనకల కర్ణుడు రణమును వదలి ఉత్తరదిక్కుగా పారిపోయెను. అంత అర్జునుడును, మహారథుడగు ఉత్తరుడును విజయనాదము చేసిరి.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి
కర్ణాపయానే షష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున
కర్ణుడు పారిపోవుట యను అరువదియవ అధ్యాయము.

## ఏకషష్టితమోఽధ్యాయః — అరువదియొకటవ అధ్యాయము

అర్జునే నోత్తర స్యాశ్వాసనం, దుశ్శాసనస్య పరాద మశ్చ.

అర్జునుడు ఉత్తరుని తేర్చుట - దుశ్శాసనుని ఓటమి.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

తతో వైకర్తనం జిత్వా పార్థో వైరాటి మబ్రవీత్,
ఏతన్మాం ప్రాపయానీకం యాత్ర తాలో హిరణ్మయః. 1

ఇట్లు కర్ణుని జయించి ఉత్తరునితో నిట్లనెను. ఇదిగో నన్ను ఆబంగారుతాళవృక్షమున్న సేనకడకు చేర్చుము.

అత్ర శాన్తనవో భీష్మో రథేఽస్మాకం పితామహః,
కాఙ్క్షమాణో మయా యుద్ధం తిష్ఠ త్యమరదర్శనః. 2

అచట మాతాత శంతనుపుత్రుడు భీష్ముడు నాతో యుద్ధ మాడగోరుచు దేవతవలె కానవచ్చుచు నిలిచియున్నాడు.

అథ సైన్యం మహద్ దృష్ట్వా రథనాగహయాకులమ్,
అబ్రవీ దుత్తరః పార్థ మపవిద్ధః శరై ర్భృశమ్. 3

ఏనుగులతో, గుఱ్ఱములతో నిండియున్న ఆమహాసేనను చూచి మిక్కిలిగా బాణములు గ్రుచ్చుకొని యున్న ఉత్తరుడు అర్జునునితో నిట్లు పలికెను.

నాహం శక్ష్యామి వీరేహ నియన్తుం తే హయోత్తమాన్,
నిషీదన్తి మమ ప్రాణా మనో విహ్వల తీవ మే. 4

ఓ వీరుడా ! నాకు నీ గొప్పగుఱ్ఱములను పట్టుశక్తి ఉడిగినది. నాప్రాణములు కడబట్టుచున్నవి. మనసు చెదరిపోవుచున్నట్లున్నది.

అస్త్రాణా మివ దివ్యానాం ప్రభావః సంప్రయుజ్యతామ్,
త్వయా చ కురుభి శ్చైవ ద్రవ న్తీవ దిశో దశ॥ 5

ఇటు నీవు, అటు కౌరవులు ప్రయోగించు దివ్యములగు అస్త్రముల ప్రభావ మెట్టిదోగాని పదిదిక్కులు నీరుగారిపోవు చున్నట్లున్నవి.

గన్ధేన మూర్ఛిత శ్చాహం వసారుధిర మేదసామ్,
ద్వైధీభూతం మనో మేఽద్య తవ చైవ ప్రపశ్యతః. 6

ఈ వస, నెత్తురు, మెదడులవాసనవలన నాకు మూర్ఛ వచ్చుచున్నది. నీవు చూచుచుండగనే నాగుండె రెండుగా నయిపోవుచున్నది.

అదృష్టపూర్వః శూరాణాం మయా సంఖ్యే సమాగమః.

నేనింతకుముం దెన్నడు అట్టి శూరులు యుద్ధమున తారసిల్లుటను చూచియుండలేదు.

గదాపాతేన మహతా శఙ్ఖానాం నిస్వనేన చ,
సింహనాదైశ్చ శూరాణాం గజానాం బృంహితైస్తథా. 7

గాణ్డీవశబ్దేన భృశ మశనిప్రతిమేన చ,
శ్రుతిః స్మృతిశ్చ మే వీర ప్రణష్టా మూఢచేతసః. 8

గొప్పగదాపాతము, శంఖములధ్వని, శూరులసింహనాదములు, ఏనుగుల ఘీంకారములు, పిడుగుపాటువంటి గాండీవశబ్దము- ఇవి యన్నియు నామనస్సును మూఢముచేసి చెవులను, గుండెను చెదరగొట్టినవి.

అలాతచక్రప్రతిమం మణ్డలం సతతం త్వయా,
వ్యాక్షిప్యమాణం సమరే గాణ్డీవం చ ప్రకర్షతా,
దృష్టిః ప్రచలితా వీర హృదయం దీర్యతీవ మే. 9

నీ వీ గాండీవమును నిరంతరముగా కొఱకంచును చక్రమువలె త్రిప్పినట్లు త్రిప్పుచున్నావు. దానితో నాచూపు చెదరిపోవుచున్నది. గుండె చీలిపోవుచున్నట్లున్నది.

వపుశ్చోగ్రం తవ రణే క్రుద్ధస్యేవ పినాకినః,
వ్యాయచ్ఛత స్తవ భుజం దృష్ట్వా భీ ర్మే భవత్యపి. 10

నీవు యుద్ధమున విజృంభించగా కోపించిన పినాకపాణి దేహము వలె నున్నది. నీభుజము చూచినచో నాకును బెదరు పుట్టుచున్నది.

నాదదానం న సంధానం న మున్చన్తం శరోత్తమాన్,
త్వామహం సంప్రపశ్యామి పశ్యన్నపి న చేతనః. 11

బాణములు తీయుట, అల్లెత్రాటిలో సంధించుట, విడచుట ఎప్పుడు చేయుచుంటివో చూచుచున్నప్పటికిని చైతన్యములేని నాకు తోచుటలేదు.

అసీదన్తి మే ప్రాణా భూరియం చలతీవ చ,
న చ ప్రతోదం రశ్మీంశ్చ సంయన్తుం శక్తిరస్తి మే. 12

అయ్యా! నాప్రాణములు కడబట్టుచున్నవి. ఈభూమి కదలి పోవుచున్నట్లున్నది. కొరడాను, పగ్గములను పట్టుశక్తి నాకు లేదు.

అర్జున ఉవాచ - అర్జును డిట్లు పలికెను.

మాభైషీః స్తంభయాత్మానం త్వయాపి నరపుఙ్గవ,
అత్యద్భుతాని కర్మాణి కృతాని రణమూర్ధని. 13

నాయనా! భయపడకు. గుండె దిటవుచేసికొ, ఈమొనతలలో నీవును అత్యాశ్చర్యకరమైన పనులు చేసితివి.

రాజపుత్రోఽసి భద్రం తే కులే మత్స్యస్య విశ్రుతే,
జాతస్త్వం శత్రుదమనే నావసీదితు మర్హసి. 14

రాజపుత్రుడవు నీకు మేలగుత. ప్రసిద్ధమైన శత్రుసంహారక మగు మత్స్యకులమున పుట్టితివి. నీవు ఇట్లు సిరుగారిపోరాదు.

ధృతిం కృత్వా సువిపులాం రాజపుత్ర రథే మమ,
యుధ్యమానస్య సమరే హయాన్ సంయచ్ఛ శత్రుహన్. 15

ఓ రాజకుమారా! శత్రుహంతా! మంచిధైర్యము తెచ్చుకొని నేను యుద్ధమాడుచుండగా నారథపు గుఱ్ఱములను అదుపులో పెట్టుము.

---

11. సందధానమ్ అనుటకు సంధానమ్ అనుట ఆర్షరూపము;

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ ముక్త్వా మహాబాహు ర్వైరాటిం నరసత్తమః,
అర్జునో రథినాం శ్రేష్ఠ ఉత్తరం వాక్య మబ్రవీత్. 16

నరవరుడు, మహాబాహువు, రథులలో శ్రేష్ఠుడు నగు అర్జునుడు ఇట్లు పలికి మరియు ఉత్తరునితో నిట్లనెను.

సేనాగ్ర మాశు భీష్మస్య ప్రాపయ స్వైత దేవ మామ్,
ఆచ్ఛేత్స్యామ్య హమేతస్య ధను ర్జ్యామపి చాహవే. 17

ఇదిగో ఈ భీష్ముని సేనముందుకు నన్ను వడిగా గొనిపో. యుద్ధమున నే నతని వింటిని, నారిని ఛేదింతును.

అస్య న్తం దివ్య మస్త్రం మాం చిత్ర మద్య నిశామయ,
శతహ్రదా మివాయాన్తీం స్తనయిత్నో రివామ్బరే. 18

ఆకాశమున మేఘమునుండి తళుక్కుమన్న మెఱుపువలె దివ్యమగు అస్త్రమును ప్రయోగించు నన్ను చూడుము.

సువర్ణపృష్ఠం గాణ్డీవం ద్రక్ష్య న్తి కురవో మమ,
దక్షిణే నాథ వామేన కతరేణ స్విదస్యతి. 19
ఇతి మాం సఙ్గతాః సర్వే తర్కయిష్య న్తి శత్రవః.

నా యీ బంగారుతొడుగు గల గాండీవమును కౌరవులు చూతురుగాక. ఈతడు కుడిచేతితోనా? ఎడమచేతితోనా? దేనితో బాణములను విరజిమ్ముచున్నాడు? అని శత్రువులందరు గుంపులుగా గూడి అనుకొందురు.

శోణితోదాం రథావర్తాం నాగనక్రాం దురత్యయామ్,
నదీం ప్రస్కన్దయిష్యామి పరలోక ప్రవాహినీమ్. 20

---

18. నిశామయ - చూడుము.

రక్తమనెడునీరు, రథములనెడు సుడులు, ఏనుగులనెడు మొసళ్ళు గల దాటజాలనినదిని పరలోకమునకు ప్రవహించుదానిని స్రవింపజేసెదను.

పాణి పాద శిరః పృష్ఠ బాహు శాఖానిరంతరమ్,
వనం కురూణాం ఛేత్స్యామి శరైః సంనతపర్వభిః. 21

సన్నని వంపులుగల బాణములతో చేతులు, కాళ్ళు, తలలు, వీపులు, భుజములు అను కొమ్మలతో సందులేని కౌరవులనెడు వనమును నరికివేయుదును.

జయతః కౌరవీం సేనా మేకస్య మమ ధన్వినః,
శతం మార్గా భవిష్యన్తి పావక స్యేవ కాననే. 22

ఈ కౌరవసేనను ఒంటరిగా గెలుచుచున్న విలుకాడనగు నాకు అడవియం దగ్నికివలె నూరుమార్గము లేర్పడును.

మయా చక్ర మి వావిద్ధం సైన్యం ద్రక్ష్యసి కేవలమ్,
ఇష్వ స్త్రే శిక్షితం చిత్ర మహం దర్శయితాస్మి తే. 23

నే నీ సేనను చక్రాకారముగా త్రిప్పుదును. చూడుము. ధనుర్విద్యలో నేను నేర్చిన చిత్రమును నీకు చూపుదును.

అసంభ్రాన్తో రథే తిష్ఠ సమేషు విషమేషు చ,
దివ మావృత్య తిష్ఠన్తం గిరిం భిన్ద్యాం స్మ పత్రిభిః. 24

నీవు ఎగుడుదిగుడులలో గుండె చెదరక రథమున నిలువుము. ఆకాశము నావరించి నిలిచిన కొండను గూడ బాణములతో పగుల గొట్టుదును.

22. శతం మార్గా భవిష్యన్తి - నాదారికడ్డులేదని భావము. లేక నాబాణములు అన్ని వైపులకు ప్రసరించునని భావము.

23. ఆవిద్ధమ్ - త్రిప్పబడుచున్న.

అహ మిన్ద్రస్య వచనాత్ సంగ్రామే౽భ్యహనం పురా,
పౌలోమాన్ కాలఖఞ్జాంశ్చ సహస్రాణి శతానిచ. 25

నేను పూర్వము ఇంద్రునిమాటపై యుద్ధమున పౌలోములు, కాలకేయులు అను రాక్షసులను వేలకొలదిగా సంహరించితిని.

అహ మిన్ద్రాత్ దృఢాం ముష్టిం బ్రహ్మణః కృతహస్తతామ్,
ప్రగాఢే తుములం చిత్ర మితి విద్ధి ప్రజాపతేః. 26

నేను ఇంద్రునివలన పిడికిలిబిగింపును, బ్రహ్మవలన చేతి ఒడుపులను, పజాపతివలన కష్టసమయమున చేయదగు చిత్రయుద్ధమును నేర్చితిని. ఈవిషయమును గుర్తింపుము.

అహం పారే సముద్రస్య హిరణ్యపురవాసినామ్,
జిత్వా షష్టిం సహస్రాణి రథినా ముగ్రధన్వనామ్. 27

నేను సముద్రము అవతల హిరణ్యపురముననున్న భయంకర ధనువులుగల, రథికవరులను అరువదివేలమందిని జయించగలిగితిని.

శీర్యమాణాని కూలాని ప్రవృద్ధే నేవ వారిణా,
మయా కురూణాం వృన్దాని పాత్యమానాని పశ్య వై. 28

ముంచుకొనివచ్చిన జలములతో ఒడ్లు విఱిగిపడినట్లు ఈ కౌరవుల గుంపులు నాచేత కూలిపోవును. చూడుము.

ధ్వజవృక్షం పత్తితృణం రథసింహగణాయుతమ్,
వన మాదీప యిష్యామి కురూణా మస్త్రతేజసా. 29

ధ్వజములనెడు చెట్లతో పదాతులనెడి గడ్డిపరకలతో, రథములనెడి సింహములగుంపులతో కూడిన ఈ కౌరవులనెడు అడవిని అస్త్రములమంటతో కాల్చివైతును.

---

26. ప్రగాఢే - సంకటస్థితియందు,
27. జిత్వా - జయింపగలిగితిని,

తా నహం రథనీడేభ్యః శరైః సంనతపర్వభిః,
యత్తాన్ సర్వా నతిబలాన్ యోత్స్యమానా నవస్థితాన్,
ఏకః సంకాలయిష్యామి వజ్రపాణి రి వాసురాన్, 30

దేవేంద్రుడు రాక్షసులను చేసినట్లు రథములనెడు గూళ్ల నుండిసర్వసన్నద్ధులై యుద్ధముచేయు ఈమహాబలశాలులనుఒక్కడనై వాడి బాణములతో కూల్తును.

రౌద్రం రుద్రా దహం హ్యస్త్రం వారుణం వరుణా దపి,
అస్త్ర మాగ్నేయ మగ్నే శ్చ వాయవ్యం మాతరిశ్వనః,
వజ్రాదీని తథాస్త్రాణి శక్రా దహ మవాప్తవాన్. 31

నేను రుద్రునివలన రౌద్రాస్త్రము, వరుణునినుండి వారుణాస్త్రము, అగ్నివలన ఆగ్నేయాస్త్రము, వాయుదేవునినుండి వాయవ్యాస్త్రమును, ఇంద్రునినుండి వజ్రము మొదలైన అస్త్రములు సంపాదించితిని.

ధార్తరాష్ట్రవనం ఘోరం నరసింహాభిరక్షితమ్,
అహ ముత్పాటయిష్యామి వైరాటే వ్యేతు తే భయమ్. 32

ధృతరాష్ట్రకుమారులనెడి ఘోరారణ్యమును నరులనెడు సింహములతో రక్షింపబడుదానిని ఓ ఉత్తరా! నేను సమూలముగా పెకలించివైతును. భయము వీడుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

ఏవ మాశ్వాసిత స్తేన వైరాటిః సవ్యసాచినా,
వ్యవాగాహద్ రథానీకం భీమం భీష్మాభిరక్షితమ్. 33

అర్జునుడిట్లు ధైర్యముచెప్పగా ఉత్తరుడు భీష్ముడు రక్షించుచున్న భయంకరమైన రథసేనను చిందరవందర చేసెను.

త మాయాన్తం మహాబాహుం జిగీషన్తం రణే కురూన్,
అభ్యవారయ దవ్యగ్రః క్రూరకర్మాఽఽపగాసుతః. 34

అట్లు రణమున కౌరవులను గెలువగోరి వచ్చుచున్న మహా బాహువగు అర్జునుని యుద్ధమున క్రూరమైన పనులుచేయు నదీ సుతుడు భీష్ముడు ఎచ్చరికతో నిలువరించెను.

తస్య జిష్ణు రుపావృత్య ధ్వజం మూలా దపాతయత్,
వికృష్య కలధౌతాగ్రైః స విద్ధః ప్రాపతద్ భువి. 35

జయశీలుడగు అర్జునుడు అతనివైపు తిరిగి బంగారుపూతగల బాణములతో అతని ధ్వజమును మూలమునుండి పెల్లగించి పడవైచెను. అది ఆదెబ్బకు నేలపై కూలెను.

తం చిత్ర మాల్యాభరణాః కృతవిద్యా మనస్వినః,
ఆగచ్ఛన్ భీమధన్వానం చత్వారశ్చ మహాబలాః. 36

చిత్రములైనమాల్యములు, ఆభరణములు కలవారు, విద్య యందారితేరినవారు, అభిమానవంతులు అగు నలువురు మహా బలులు భయంకరధనువుగల అర్జునునిపైకి వచ్చిరి.

దుశ్శాసనో వికర్ణశ్చ దుఃసహోఽథ వివింశతిః,
ఆగత్య భీమధన్వానం బీభత్సుం పర్యవారయన్. 37

దుశ్శాసనుడు, వికర్ణుడు, దుస్సహుడు, వివింశతి అను నీ నలువురు వచ్చి భయంకరధనుర్ధరుడగు సవ్యసాచిని చుట్టుముట్టిరి.

దుఃశాసనస్తు భల్లేన విద్ధ్వా వైరాటి ముత్తరమ్,
ద్వితీయే నార్జునం వీరః ప్రత్యవిధ్యత్ స్తనాన్తరే. 38

అందులో దుశ్శాసనుడు ఒక బాణముతో విరాటునికొడుకగు ఉత్తరుని కొట్టి రెండవదానితో అర్జునుని రొమ్మునందు తాడించెను.

తస్య జిష్ణు రుపావృత్య పృథుధారేణ కార్ముకమ్,
చకర్త గార్ధ్రపత్రేణ జాతరూప పరిష్కృతమ్. 39

35. ఉపావృత్య - ఎదుటికివచ్చి, వికృష్య - విఱుగఁగొట్టి,

అర్జునుడు వానిపై ప్రతిరిగి పాటల వెడదలంచుగలబాణముతో బంగారు ఆభరణములు గల వాని ధనుస్సును పడిమికి నరికెను.

అథైనం పఞ్చభిః పశ్చాత్ ప్రత్యవిధ్యత్ స్తనాన్తరే,
సోఽపయాతో రణం హిత్వా పార్థబాణప్రపీడితః. 40

పిమ్మట ఆ దుశ్శాసనుని రొమ్మునడుమ అయిదు బాణములను ప్రయోగించెను. అతడా అర్జునుని బాణములకు దిమ్మెక్కి రణమును వదలి తొలగిపోయెను.

తం వికర్ణః శరై స్తీక్ష్ణై ర్గృధ్రపత్రై రజిహ్మగైః,
వివ్యాధ పరవీరఘ్న మర్జునం ధృతరాష్ట్రజః. 41

ధృతరాష్ట్రుని కొడుకు వికర్ణుడు మిక్కిలి పదునుగల అమ్ములతో శత్రువీరుల తునుమాడు అర్జునుని కొట్టెను.

తత స్తమపి కౌన్తేయః శరే ణానతపర్వణా,
లలాటేఽభ్యహనత్ తూర్ణం స విద్ధః ప్రాపతద్ రథాత్. 42

కుంతీతనయుడు వానినికూడ కొంచెము వంగిన కణుపుగల బాణముతో నెన్నుదుటపై వడిగా కొట్టెను. అతడా దెబ్బకు రథమునుండి కూలెను.

తతః పార్థ మభిద్రుత్య దుఃసహ స్సవివింశతిః,
అవాకిర చ్ఛరై స్తీక్ష్ణైః పరీప్సన్ భ్రాతరం రణే. 43

అంత వివింశతిని కలుపుకొని దుస్సహుడు సోదరు నాదుకొన గోరి అర్జునునిపై కవిసి వాడిబాణములను ఒక్కుమ్మడిగా వెదజల్లెను.

తావుభౌ గార్ధ్రపత్రాభ్యాం నిశితాభ్యాం ధనంజయః,
విద్ధ్వా యుగప దవ్యగ్ర స్తయో ర్వాహా నసూదయత్. 44

ధనంజయుడు చెదరక వారిరువుర నొక్కమారుగా తా! నిశితములైన బాణములతో వారిగుఱ్ఱములను చంపెను.

తౌ హతాశ్వౌ విభిన్నాఙ్గౌ ధృతరాష్ట్రాత్మజా వుభౌ,
అభిపత్య రథై రన్యై రపనీతౌ పదానుగైః. 45

చచ్చిన గుఱ్ఱములతో, విఱిగిన అవయవములుగల ఆ ధృతరాష్ట్రకుమారు లిద్దఱు సేవకులు తెచ్చిన వేఱురథములపై నెక్కి తొలగిపోయిరి.

సర్వా దిశ శ్చాభ్యపతద్ బీభత్సు రపరాజితః,
కిరీటమాలీ కౌన్తేయో లబ్ధలక్షో మహాబలః. 46

ఓటమి యెఱుగనివాడు, కిరీటమును ధరించినవాడు, మహాబలుడు నగు నర్జునుడు గురితప్పనివాడై అన్నివైపుల విజృంభించెను.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి అర్జున దుఃశాసనాది యుద్ధే ఏకషష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతమున విరాటపర్వమున గోహరణపర్వమున అర్జునదుశ్శాసనాదుల యుద్ధమున అరువదియొకటవ అధ్యాయము.

## ద్విషష్టితమోఽధ్యాయః — అరువదిరెండవ అధ్యాయము

అర్జునస్య కౌరవమహారథిభిః సంగ్రామః,
అర్జునుడు కౌరవ మహారథులతో పోరుట.

వైశమ్పాయన ఉవాచ — వైశంపాయను డిట్లు చెప్పెను.

అథ సంగమ్య సర్వే తే కౌరవాణాం మహారథాః,
అర్జునం సహితా యత్తాః ప్రత్యయుధ్యన్త భారత. 1

ఓ భారతా! అపుడు కౌరవులలో మహారథులందరు కూడి ఒక్కపట్టున సన్నద్ధులై అర్జునునితో పోరిరి.

46. లబ్ధలక్షః — గురితప్పనివాడై.

స సాయకమయై ర్జాలైః సర్వత స్తాన్ మహారథాన్,
ప్రాచ్ఛాదయ దమేయాత్మా నీహారేణేవ పర్వతాన్. 2

ఊహింపనలవికాని ఆత్మకలవాడగు అర్జునుడు బాణమయము లైన వలలతో ఆమహారథుల నందఱను అన్నివైపులను మంచుతో కొండలను క్రమ్మినట్లు క్రమ్మివైచెను.

నదద్భిశ్చ మహానాగై ర్హ్రేషమాణైశ్చ వాజిభిః,
భేరీశఙ్ఖనినాదైశ్చ సశబ్ద స్తుములోఽభవత్. 3

ఏనుగుల ఘీంకారములతోడను, గుఱ్ఱముల సకిలింతలతోడను, భేరుల, శంఖముల చప్పుళ్లతోడను యుద్ధభూమి గందరగోళ మాయెను.

నరాశ్వకాయాన్ నిర్భిద్య లోహాని కవచాని చ,
పార్థస్య శరజాలాని వినిష్పేతుః సహస్రశః. 4

వేలకొలది అర్జునబాణముల సముదాయములు లోహమయము లగు కవచములను, నరుల, అశ్వముల దేహములను చీల్చుకొని వెలువడినవి.

త్వరమాణః శరా నస్యన్ పాణ్డవః ప్రబభౌ రణే,
మధ్యందినగతేఽర్చిష్మాఞ్ఛర దీవ దివాకరః. 5

పాండవుడు వేగముతో బాణములను గుప్పించుచు శరదృతువున మింటినడుమకు చేరిన వాడిమయూఖములుగల సూర్యునివలె వెలుగొందెను.

ఉపప్లవన్తి విత్రస్తా రథేభ్యో రథిన స్తదా,
సాదిన శ్చాశ్వపృష్ఠేభ్యో భూమౌ చైవ పదాతయః. 6

రథములనుండి రథికవరులు, గుఱ్ఱములనుండి ఆశ్వికులు, భూమియందు కాల్బంటులు భయపడినవారై అటునిటు పరుగెత్తిరి.

1. ఉపప్లవన్తి - అటునిటు పరువెత్తిరి

శరైః సంభిద్యమానానాం కవచానాం మహాత్మనామ్,
తామ్రరాజత లౌహానాం ప్రాదురాసీ న్మహాస్వనః. 7

రాగివి, వెండివి, ఇనుపవియగు మహాత్ములకవచములు బాణములలో చినిగిపోవునపుడు మహాధ్వని ఉత్పత్తిల్లెను.

ఛన్న మాయోధనం సర్వం శరీరై ర్గతచేతసామ్,
గజాశ్వసాదినాం తత్ర శితబాణా త్తజీవితైః. 8

ఒడలెఱుంగని ఏనుగుల, గుఱ్ఱముల, పదాతుల శరీరములు వాడి బాణములతో ప్రాణములు కోల్పోయి యుద్ధభూమి నంతటిని క్రమ్మినవై చెసెను.

రథోపస్థాభిపతితై రాస్తృతా మానవై ర్మహీ,
ప్రనృత్య తీవ సంగ్రామే చాపహస్తో ధనంజయః. 9

రథములనుండి చెల్లాచెదరుగా పడిన మానవులతో భూమి యంతయు నిండియుండెను. విల్లుపట్టిన ధనంజయుడు యుద్ధమున మహానృత్యము చేయుచున్నట్లుండెను.

శ్రుత్వా గాండీవనిర్ఘోషం విస్ఫూర్జిత మివాశనేః,
త్రస్తాని సర్వసైన్యాని వ్యపాగచ్ఛన్ మహాహవాత్. 10

పిడుగుపాటుచప్పుడువంటి గాండీవజ్యారవము విని భయపడినవై సర్వసైన్యములు మహాయుద్ధమునుండి పారిపోయినవి.

కుణ్డలోష్ణీషధారీణి జాతరూపస్రజ స్తథా,
పతితాని స్మ దృశ్యన్తే శిరాంసి రణమూర్ధని. 11

కుండలములు, పాగలు, బంగారుమాలలు ధరించినతలలు రణభూమిలో నేలపైబడి కానవచ్చినవి.

విశిఖోన్మథితై ర్గాత్రై ర్బాహుభి శ్చ సకార్ముకైః,
సహస్తాభరణై శ్చాన్యైః ప్రచ్ఛన్నా భాతి మేదినీ. 12

---

గతచేతసామ్ = ఒడలెఱుంగని.

బాణములతో నుగ్గైన అవయవములతోడను, ధనువులతో కూడిన బాహువులతోడను, అంగదములు మున్నగు హస్తాభరణములు గల దేహములతోడను భూమియంతయు నిండి ప్రకాశించెను.

శిరసాం పాత్యమానానా మంతరా నిశితైః శరైః,
అశ్మవృష్టి రివాకాశా దభవద్ భరతర్షభ ! 13

ఓ భరతశ్రేష్ఠా ! వాడిబాణములు పడుచునే తలలను కూల్చుచుండగా ఆకసమునుంచి రాలవాన పడినట్లాయెను.

దర్శయిత్వా తథాత్మానం రౌద్రం రుద్రపరాక్రమః,
అవరుద్ధో ఒచరద్ పార్థో వర్షాణి త్రిదశాని చ,
క్రోధాగ్ని ముత్సృజన్ వీరో ధార్తరాష్ట్రేషు పాణ్డవః. 14

రుద్రుని పరాక్రమమువంటి పరాక్రమముగలవాడును, పదుమూడేండ్లు అజ్ఞాతముగా నున్నవాడును అగు అర్జునుడు ఇప్పుడు తన్ను ప్రకటించుకొని ధృతరాష్ట్రసుతులయందు క్రోధాగ్నిని వెలిగ్రక్కుచు సంచరించెను.

తస్య తద్ దహతః సైన్యం దృష్ట్వా చైవ పరాక్రమమ్,
సర్వే శాన్తిపరా యోధా ధార్తరాష్ట్రస్య పశ్యతః. 15

అట్లు సైన్యమును కాల్చివేయుచున్న అతని పరాక్రమమును గాంచి దుర్యోధనుడు చూచుచుండగా వాని యోధులందరు అణగారి పోయిరి.

విత్రాసయిత్వా తత్ సైన్యం ద్రావయిత్వా మహారథాన్,
అర్జునో జయతాం శ్రేష్ఠః పర్యవర్తత భారత. 16

సేన నంతటిని చెదరగొట్టి, మహారథులను దూరమునకు తరిమి, జయశాలులలో శ్రేష్ఠుడగు అర్జునుడు అంతట విహరించెను.

ప్రావర్తయ న్నదీం ఘోరాం శోణితోదాం తరఙ్గిణీమ్,
అస్థిశైవాల సంబాధాం యుగాన్తే కాలనిర్మితామ్. 17

రక్తమనెడు జలముకలది, ఎముకలనెడు నాచుతో నిండినట్టిది, యుగాంతమున కాలుడు చేసినదివలె నున్న ఘోరమైన నదిని అర్జునుడు ప్రవహింపజేసెను.

శరచాపప్లవాం ఘోరాం కేశశైవాలశాద్వలామ్,
తనుత్రోష్ణీషసంబాధాం నాగకూర్మమహాద్విపామ్. 18

అందు బాణములు, విండ్లు తెప్పలవలె నున్నవి. కేశములే నాచువలె నున్నవి. మైమఱువులు శిరస్త్రాణములు క్రిక్కిరిసియున్నవి. ఏనుగులే గొప్ప తాబేళ్లు, జలగజములుగా నున్నవి.

మేదోవసాసృక్ ప్రవహాం మహాభయవివర్ధినీమ్,
రౌద్రరూపాం మహాభీమాం శ్వాపదై రభినాదితామ్. 19

అది మెదడు, వస, రక్తములతో కలిసి ప్రవహించుచున్నది. మహాభయమును కలిగించుచున్నది. రౌద్రమైన రూపముతో మహా భీమముగా నున్నది. క్రూరమృగము లట బొబ్బలిడుచున్నవి.

తీక్ష్ణశస్త్రమహాగ్రాహాం క్రవ్యాదగణసేవితామ్,
ముక్తాహారోర్మికలిలాం చిత్రాలంకారబుద్బుదామ్. 20

అందు వాడిఆయుధములనెడు మొసళ్లున్నవి. క్రూరమృగములు గుంపులుగట్టి అట చేరినవి. ముత్యాలహారములే తరంగములుగా, చిత్రమైన ఆభరణములే బుడగలుగా కానవచ్చుచున్నవి.

శరసంఘమహావర్తాం నాగనక్రాం దురత్యయామ్,
మహారథ మహాద్వీపాం శఙ్ఖదుందుభినిస్వనామ్,
చకార చ తదా పార్థో నదీం దుస్తరశోణితామ్. 21

గుములుగట్టిన బాణములే పెద్దసుడులుగా, ఏనుగులే, మొసళ్ళుగా, మహారథములే మహాద్వీపములుగా ఆనదియందున్నవి.

---

18. మహద్విపాః - నీటియేనుగులు.

శంఖములు, దుందుభులు పెల్లుగా మ్రోయుచున్నవి. దాటశక్యము కాని అట్టి ఘోరమైన రక్తపునదిని అర్జును డప్పుడు ప్రవహింపజేసెను.

ఆదదానస్య హి శరాన్ సంధాయ చ విముఞ్చతః,
వికర్షతశ్చ గాణ్డీవం న కశ్చిద్ దదృశే జనః. 23

బాణములను తీయుట, వింటియందు కూర్చుట, వదలుట, గాండీవమును లాగుట అను కార్యములు ఏ ఒక్కనికిని తెలియ రాకుండెను.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి అర్జున సంకులయుద్ధే
ద్విషష్టితమో ఽధ్యాయః

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున అర్జునుని
దొమ్మియుద్ధ మను అరువదిరెండవ అధ్యాయము

## త్రిషష్టితమోఽధ్యాయః - అరువదిమూడవ అధ్యాయము

అర్జునం ప్రతి కౌరవమహారథానా మాక్రమణం, పరాజయం ప్రాప్య పలాయనం చ.

అర్జునునిపై కౌరవమహారథులు తలపడుట, ఓడి పరుగెత్తుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

తతో దుర్యోధనః కర్ణో దుఃశాసన వివింశతీ,
ద్రోణశ్చ సహపుత్రేణ కృపశ్చాపి మహారథః. 1

పున ర్యయుశ్చ సంరబ్ధా ధనంజయజిఘాంసవః,
విస్ఫారయన్త శ్చాపాని బలవన్తి దృఢాని చ. 2

అంత అర్జునుని చంపగోరి బలము, గట్టితనము గల విండ్లను బాగుగా లాగుచు దుర్యోధనుడు, కర్ణుడు, దుశ్శాసనుడు, వివింశతి, పుత్రునితో గూడి ద్రోణుడు, మహారథుడగు కృపుడు - అనువారు ఆగ్రహముతో మరల మార్కొనిరి.

తాన్ వికీర్ణపతాకేన రథే నాదిత్యవర్చసా,
ప్రత్యుద్యయౌ మహారాజ సమన్తాద్ వానరధ్వజః. 3

రెపరెపలాడుచున్న పతాక, సూర్యునివంటి దీప్తిగలరథముతో కపికేతనుడగు అర్జునుడు ఒక్కపెట్టున వారి నెదుర్కొనెను.

తతః కృపశ్చ కర్ణశ్చ ద్రోణశ్చ రథినాంవరః,
తం మహాస్త్రై ర్మహావీర్యం పరివార్య ధనంజయమ్; 4

శరౌఘాన్ సమ్యగస్యన్తో జీమూతా ఇవ వార్షికాః,
వవర్షుః శరవర్షాణి పాతయన్తో ధనంజయమ్. 5

అప్పుడు కృపుడు, కర్ణుడు, రథులలో శ్రేష్ఠుడగు ద్రోణుడు మహాస్త్రములతో మహావీర్యముగల అర్జునుని చుట్టుముట్టి వర్షర్తువు నందలి మేఘములవలె బాణసంఘములను గుప్పించుచు ధనంజయుని పీడించువారై శరవర్షమును కురిసిరి.

ఇషుభి ర్బహుభి స్తూర్ణం సమరే లోమవాహిభిః,
అదూరాత్ పర్యవస్థాప్య పూరయామాసు రాదృతాః. 6

యుద్ధభూమిలో అల్లంతదూరమున అర్జునుని కదలకుండజేసి, ఈకలతో దూసికొనిపోవు అనేకబాణములతో అతనిని ముంచి యెత్తిరి.

తథా తై రవకీర్ణస్య దివ్యై రస్త్రైః సమన్తతః,
న తస్య ద్వ్యఙ్గులమపి వివృతం సమ్ప్రదృశ్యతే. 7

అట్లు దివ్యములగు అస్త్రములను అన్నివైపుల వెదజల్లిరి. అర్జునునకు రెండంగుళముల మేరయు అవకాశములేకపోయెను.

---

5. పాతయన్తః - పీడించువారై
6. పర్యవస్థాప్య - కదలికలేకుండజేసి, పూరయామాసుః - బాణములతో కప్పివైచిరి.

తతః ప్రహస్య బీభత్సు ర్దివ్య మైన్ద్రం మహారథః,
అస్త్ర మాదిత్య సంకాశం గాణ్డీవే సమయోజయత్. 8

అంత మహారథుడగు బీభత్సుడు పెద్దగా నవ్వి, సూర్యునివలె వెలుగొందుచున్న బాణము నొకదానిని గాండీవమున సంధించెను.

శరరశ్మి రివాదిత్యః ప్రతప్తే సమరే బలీ,
కిరీటమాలీ కౌన్తేయః సర్వాన్ ప్రాచ్ఛాదయత్ కురూన్. 9

శరములనెడు కిరణములుగల సూర్యునివలె బలముగలవాడు, కిరీటధారియునగు కుంతికుమారుడు ఆకౌరవుల నందరను కప్పివైచెను.

యథా బలాహకే విద్యుత్ పావకో వా శిలోచ్చయే,
తథా గాణ్డీవ మభవ దింద్రాయుధ మివానతమ్. 10

మేఘమున మెఱపు, కొండయం దగ్ని ఎట్లో అట్లు ఒంపుతిరిగిన ఇంద్రధనుస్సువలె గాండీవమాయెను.

యథా వర్షతి పర్జన్యే విద్యుత్ విభ్రాజతే దివి,
ద్యోతయన్తీ దిశః సర్వాః పృథివీంచ సమన్తతః, 11
తథా దశదిశః సర్వాః పతద్గాణ్డీవ మావృణోత్,
నాగాశ్చ రథినః సర్వే ముముహు స్తత్ర భారత ! 12

వర్షించుమేఘమున మెఱపు ఆకాశమున తళుక్కుమనుచు అన్నిదిక్కులను భూమిని ప్రకాశింపజేయునట్లు, దుముకుచున్న గాండీవము పదిదిక్కులను ఆవరించెను. ఏనుగులు, రథయోధులు అందు ఒడలెఱుగక యుండిరి.

సర్వే శాన్తిపరా యోధాః స్వచిత్తాని న లేభిరే,
సంగ్రామే విముఖాః సర్వే యోధా శ్చ హతచేతసః. 13

చెప్పబడిన ఆయోధులందరకు మనసు మనసులో లేదు. నిశ్చేతనులైన ఆయోధులందరు యుద్ధమునకు పెడమోము పెట్టిరి.

ఏవం సర్వాణి సైన్యాని భగ్నాని భరతర్షభ !
వ్యద్రవన్త దిశః సర్వా నిరాశాని స్వజీవితే. 14

ఈవిధముగా భంగపడిన సైన్యము లన్నియు బ్రదుకుపై ఆశను వదలి అన్ని దిక్కులకు పరువెత్తినవి.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరగోగ్రహే అర్జున సంకులయుద్ధే త్రిషష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరగోగ్రహమున అర్జునుని దొమ్మియుద్ధమను అరువదిమూడవ అధ్యాయము.

## చతుష్షష్టితమోఽధ్యాయః – అరువదినాల్గవ అధ్యాయము

భీష్మార్జునయో ర్యుద్ధం, సారథినా మూర్ఛితస్య భీష్మస్య రణా దన్యత్రాపనయనమ్.

భీష్మార్జునుల యుద్ధము- మూర్ఛపడిన భీష్ముని సారథి మఱియొక చోటికి కొనిపోవుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః శాన్తనవో భీష్మో భరతానాం పితామహః,
వధ్యమానేషు యోధేషు ధనంజయ ముపాద్రవత్. 1

అంత శంతనుపుత్రుడు భరతులతాత అగు భీష్ముడు అట్లు యోధుల నర్జునుడు వధించుచుండగా వానిపై కవిసెను.

ప్రగృహ్య కార్ముకశ్రేష్ఠం జాతరూపపరిష్కృతమ్,
శరా నాదాయ తీక్ష్ణాగ్రాన్ మర్మభేదాన్ ప్రమాథినః. 2

పాణ్డురే ణాతపత్రేణ ధ్రియమాణేన మూర్ధని,
శుశుభే స నరవ్యాఘ్రో గిరిః సూర్యోదయే యథా. 3

బంగారుతొడుగుగల కార్ముకశ్రేష్ఠమును పట్టుకొని వాడి అంచులు గలిగి, ఆయువుపట్టులను చీల్చివేయు సుదృఢమైన బాణము

లను గ్రహించి తలపై పట్టిన తెల్లని గొడుగుతో ఆనరవరుడు సూర్యోదయకాలమున కొండవలె రాణించెను.

ప్రధ్మాయ శఙ్ఖం గాంగేయో ధార్తరాష్ట్రాన్ ప్రహర్షయన్,
ప్రదక్షిణ ముపావృత్య బీభత్సుం సమవారయత్. 4

గంగాతనయుడు భీష్ముడు శంఖమునూది ధృతరాష్ట్రసుతులను సంతోషపరచుచు ప్రదక్షిణముగా వచ్చి అర్జునుని నిలువరించెను.

త ముద్వీక్ష్య సమాయాన్తం కౌన్తేయః పరవీరహా,
ప్రత్యగృహ్ణాత్ ప్రహృష్టాత్మా ధారాధర మివాచలః. 5

శత్రువీరుల చంపెడు అర్జునుడు అట్లు వచ్చుచున్న భీష్ముని గాంచి మదిలో ఎంతో సంతోషమును బొంది కొండ మేఘము నాపిన ట్లాపెను.

తతో భీష్మః శరా నష్టౌ ధ్వజే పార్థస్య వీర్యవాన్,
సమార్పయ న్మహావేగా ఞ్ఛ్వసమానా నివోరగాన్. 6

అంత వీర్యవంతుడగు భీష్ముడు అర్జునుని ధ్వజముపై, బుసగొట్టుచున్న పాములవంటి మహావేగముగల బాణము లెనిమి దింటిని గుప్పించెను.

తే ధ్వజం పాణ్డుపుత్రస్య సమాసాద్య పతత్రిణః,
జ్వలన్తం కపి మాజఘ్ను ర్ధ్వజాగ్రనిలయాంశ్చ తాన్. 7

ఆ బాణములు పాండుపుత్రుని ధ్వజమును జేరి ప్రజ్వరిల్లుచున్న కపిని, ధ్వజముపై నివసించు భూతములను గట్టిదెబ్బకొట్టెను.

తతో భల్లేన మహతా పృథుధారేణ పాణ్డవః,
ఛత్రం చిచ్ఛేద భీష్మస్య తూర్ణం తదపతద్ భువి. 8

అంత నొక వెడల్పైన అంచుగల దొడ్డబాణముతో అర్జునుడు భీష్ముని గొడుగును ఛేదించెను. అది ఒక్కపెట్టున నేలకూలెను.

ధ్వజం చై వాస్య కౌ న్తేయః శరై రభ్యహనద్ భృశమ్,
శీఘ్రకృద్ రథవాహాంశ్చ తథోభౌ పార్ష్ణిసారథీ. ౯

మరియు నర్జునుడు బాణములతో ఆతనిధ్వజమును మిక్కిలిగా కొట్టెను. మిక్కిలివేగముగా బండిగుఱ్ఱములను తాడించెను. అట్లే పార్శ్వరక్షకులను సారథిని కొట్టెను.

అమృష్యమాణ స్తద్ భీష్మో జాన న్నపి స పాణ్డవమ్,
దివ్యే నాస్త్రేణ మహతా ధనంజయ మవాకిరత్. 10

భీష్ముడు అది సహింపక పాండవుని (శక్తిని) మెఱిగియు దివ్యమైన గొప్ప అస్త్రముతో అర్జునుని కొట్టెను.

తథైవ పాణ్డవో భీష్మే దివ్య మస్త్ర ముదీరయన్,
ప్రత్యగృహ్ణా దమేయాత్మా మహామేఘ మి వాచలః. 11

అట్లే అర్జునుడును భీష్మునిపై దివ్యాస్త్రమును వదలుచు, కొండ పెద్దమేఘమునువలె ఆతని అస్త్రమును నిలువరించెను.

తయో స్త దభవ ద్యుద్ధం తుములం లోమహర్షణమ్,
భీష్మస్య సహ పార్థేన బలివాసవయోరివ. 12

భీష్ముడు అర్జునునితో చేసిన ఆ ఘోరయుద్ధము బలి ఇంద్రుల యుద్ధమువలె గగుర్పాటు పుట్టించున దాయెను.

ప్రైక్షన్త కురవః సర్వే యోధాశ్చ సహ సైనికాః,
భల్లై ర్భల్లాః సమాగమ్య భీష్మపాణ్డవయో ర్యుధి,
అన్తరిక్షే వ్యరాజన్త ఖద్యోతాః ప్రావృషీవ హి. 13

కౌరవయోధు లందరు సైనికులతోపాటు ఆయుద్ధమును చూచుచుండిరి. భీష్ముడును పాండవుడును యుద్ధమున తలపడి బాణములకు బాణములను వేసికొనుచుండగా అవి ఆకాశమున వర్షకాల పు మిడుగురులవలె ప్రకాశించినవి.

అగ్నిచక్ర మివావిద్ధం సవ్యదక్షిణ మస్యత:,
గాణ్డీవ మభవద్ రాజన్ పార్థస్య సృజత: శరాన్. 14

అర్జునుడు కుడిఎడమల భేదములేకుండ బాణములను గుప్పించుచుండగా గాండీవము అలాతచక్రమువలె ఆయెను.

తత: సంఛాదయామాస భీష్మం శరశతై: శితై:.
పర్వతం వారిధారాభి శ్ఛాదయ న్నివ తోయద:. 15

అంత నూర్లకొలది వాడిబాణములతో మేఘము నీటిధారలతో పర్వతమును కప్పినట్లు అర్జునుడు భీష్ముని కప్పెను.

తాం స వేలా మివోద్భూతాం శరవృష్టిం సముత్థితామ్,
వ్యధమత్ సాయకై ర్భీష్మ: పాణ్డవం సమవారయత్. 16

అట్లు పెద్దకెరటమువలె పొంగివచ్చు బాణవర్షమును భీష్ముడు బాణములతో అణగార్చెను. అర్జునుని నిలువరించెను.

తత స్తాని నికృత్తాని శరజాలాని భాగశ:,
సమరే చ వ్యశీర్యన్త ఫాల్గునస్య రథంప్రతి. 17

అంత ముక్కలుముక్కలుగా నరుకబడిన బాణసముదాయములు అర్జునునిరథమువైపు చెల్లాచెదరై పడినవి.

తత: కనకపుఙ్ఖానాం శరవృష్టిం సముత్థితామ్,
పాణ్డవస్య రథాత్ తూర్ణం శలభానా మి వాయతిమ్,
వ్యధమత్ తాం పున స్తస్య భీష్మ: శరశతై: శితై:. 18

పాండవుని రథమునుండి పెద్దమిడుతలదండువలె వచ్చుచున్న కనకపుంఖములుగల బాణముల వర్షమును భీష్ముడు వాడిబాణములు వందలకొలది ప్రయోగించి నాశనము చేసెను.

తత స్తే కురవ: సర్వే సాధుసాధ్వితి చాబ్రువన్,
దుష్కరం కృతవాన్ భీష్మో య దర్జున మయోధయత్. 19

14. అగ్నిచక్రమ్ - కొఱకంచును వేగముగా త్రిప్పగా నేర్పడిన నిప్పులచక్రము- దీనినే అలాతచక్రమందురు.

అంత కౌరవులు 'మేలు మేలు భీష్ముడెంత దుష్కరమైన పనిని చేసెను! అర్జునునితో తలపడెను' అని పొగడిరి.

బలవాం స్తరుణో దక్షః క్షిప్రకారీ ధనంజయః,
కోఽయం సమర్థః పార్థస్య వేగం ధారయితుం రణే, 20

ఋతే శాన్తనవాద్ భీష్మాత్ కృష్ణాత్ వా దేవకీసుతాత్,
ఆచార్యప్రవరాద్ వాపి భారద్వాజా న్మహాబలాత్. 21

ధనంజయుడు బలవంతుడు, యువకుడు, సమర్థుడు, ఒడుపు గలవాడు. అట్టి అర్జునుని వేగమును యుద్ధమున నిలుపుటకు సమర్థుడు. శంతనుకుమారుడు భీష్ముడు, దేవకికొడుకు కృష్ణుడు, ఆచార్య వరేణ్యుడు మహాబలుడు ద్రోణుడు కాక మఱియొక్క డెవ్వడుండును!

అస్త్రై రస్త్రాణి సంవార్య క్రీడన్తౌ భరతర్షభౌ,
చక్షూంషి సర్వభూతానాం మోహయన్తౌ మహాబలౌ. 22

అస్త్రముల నస్త్రములతో నిలుపుచు క్రీడించుచున్న ఆ భరత వరేణ్యులు మహాబలులు సర్వభూతముల కన్నులను మోహపెట్టుచున్నారు.

ప్రాజాపత్యం తథై వేన్ద్ర మాగ్నేయం రౌద్రదారుణమ్,
కౌబేరం వారుణం చైవ యామ్యం వాయవ్య మేవ చ,
ప్రయుఞ్జానౌ మహాత్మానౌ సమరే తౌ విచేరతుః. 23

ఆ మహాత్ము లిరువురు బ్రహ్మ, ఇంద్రుడు, అగ్ని, రుద్రుడు, కుబేరుడు, వరుణుడు, యముడు, వాయువు దేవతలుగా గల అస్త్రములను ప్రయోగించుచు యుద్ధమున విహరించిరి.

విస్మితా న్యథ భూతాని తౌ దృష్ట్వా సంయుగే తదా,
సాధు పార్థ! మహాబాహో! సాధు భీష్మేతి చాబ్రువన్. 24

ఆ యుద్ధమున వారిరువురను గాంచిన భూతములన్నియు 'అహో మహాబాహూ అర్జునా! అహో మహాబాహూ భీష్మా!' అని పలుకుచుండెను.

నాయం యుక్తో మనుష్యేషు యోఽయం సందృశ్యతే మహాన్,
మహాస్త్రాణాం సంప్రయోగః సమరే భీష్మపార్థయోః. 25

యుద్ధమున భీష్మార్జునుల ఈ మహాస్త్రములతోడి యుద్ధము మానవమాత్రులకు సాధ్యమయ్యెడిది కాదు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం సర్వాస్త్రవిదుషో రస్త్రయుద్ధ మవర్తత,
అస్త్రయుద్ధే తు నిర్వృత్తే శరయుద్ధ మవర్తత. 26

ఇట్లు అస్త్రములన్నింట ఆరితేరిన ఆ యిరువురకు అస్త్రయుద్ధము ప్రవర్తిల్లెను. అది ముగిసినపిదప బాణయుద్ధము సాగెను.

అథ జిష్ణు రుపావృత్య క్షురధారేణ కార్ముకమ్,
చకర్త భీష్మస్య తదా జాతరూపపరిష్కృతమ్. 27

అంత అర్జునుడు భీష్మునిదగ్గఱకు వచ్చి కత్తివాడిబాణముతో భీష్ముని బంగారుతొడుగుగల ధనుస్సును ఖండించెను.

నిమేషాన్తరమాత్రేణ భీష్మోఽన్యత్ కార్ముకం రణే,
సమాదాయ మహాబాహుః సజ్యం చక్రే మహారథః.
శరాంశ్చ సుబహూన్ క్రుద్ధో ముమోచాశు ధనంజయే. 28

రెప్పపాటుకాలములో మహాబాహువు, మహారథుడు నగు భీష్ముడు మఱియొకవిల్లు చేపట్టి అల్లెత్రాటిని తగిలించెను. క్రోధముతో అర్జునునిపై అనేకబాణములను గుప్పించెను.

అర్జునోఽపి శరాం స్తీక్ష్ణాన్ భీష్మాయ నిశితాన్ బహూన్,
చిక్షేప సుమహాతేజా స్తథా భీష్మశ్చ పాణ్డవే. 29

27. ఉపావృత్య - దగ్గఱకు వచ్చి

అర్జునుడు భీష్మునిపై మిక్కిలిపదునుగల బాణములను పెక్కింటిని ప్రయోగించెను. మహాతేజస్వియగు భీష్ముడు వానిని చెదరగొట్టి అర్జునునిపై అట్లే బాణములను వదలెను.

తయో ర్దివ్యాస్త్రవిదుషో రస్యతో ర్నిశితా ఇచ్ఛరాన్,
న విశేష స్తదా రాజన్ లక్ష్యతే స్మ మహాత్మనోః. 30

దివ్యాస్త్రములందు పండితులు, మహాత్ములు వాడిములుకు లను ప్రయోగించుచున్నవారు నగు వారిరువురిలో హెచ్చుతగ్గులు తెలియరాలేదు.

అథావృణోద్ దశదిశః శరై రతిరథ స్తథా,
కిరీటమాలీ కౌన్తేయః శూరః శాన్తనవ స్తథా. 31

కిరీటము అలంకారముగాగల అర్జునుడు బాణములతో పది దిక్కులను కప్పివైచెను. భీష్ముడు నట్లే చేసెను.

అతీవ పాణ్డవో భీష్మం భీష్మ శ్చాతీవ పాణ్డవమ్,
బభూవ తస్మిన్ సంగ్రామే రాజన్ లోకే తదద్భుతమ్. 32

ఆ యుద్ధమున పాండవుడు భీష్ముని మించెను. భీష్ముడు పాండవుని మించెను. రాజా! లోకమున అది మిక్కిలి 'అద్భుత మయ్యెను.

పాణ్డవేన హతాః శూరా భీష్మస్య రథరక్షిణః,
శేరతే స్మ తదా రాజన్ కౌన్తేయ స్యాభితో రథమ్. 33

ఓ రాజా! భీష్ముని రథమును రక్షించుశూరులు అర్జునుని చేత చచ్చి ఆతనిరథమున కన్నివైపుల పడియుండిరి.

తతో గాణ్డీవనిర్ముక్తా నిరమిత్రం చికీర్షవః,
ఆగచ్ఛన్ పుఙ్ఖసంశ్లిష్టాః శ్వేతవాహనపత్రిణః. 34

అంత గాండీవమునుండి ఒకదానివెనుక నొకటిగా వెలువడు అర్జునుని బాణములు శత్రుశేషములేకుండ చేయగోరినవై వచ్చి పడినవి.

నిష్పతన్తో రథాత్ తస్య ధౌతా హైరణ్యవాససః ।
ఆకాశే సమదృశ్యన్త హంసానా మివ పఙ్క్తయః ॥ 35

ఆ అర్జునుని రథమునుండి వెలువడుచు బంగారుపూతగల తెల్లని బాణములు ఆకాశమున హంసల చాలులవలె కమనీయముగా కన్పట్టినవి.

తస్య తద్ దివ్య మస్త్రం హి విగాఢం చిత్ర మస్యతః,
ప్రేక్షన్తే స్మాన్తరిక్షస్థాః సర్వే దేవాః సవాసవాః ॥ 36

మిక్కిలిగట్టిగా దివ్యమగు అస్త్రమును విచిత్రముగా అర్జునుడు ప్రయోగించుచుండగా ఆకాశమున నున్నదేవతలందరు ఇంద్రునితో పాటు తిలకించిరి.

తం దృష్ట్వా పరమప్రీతో గన్ధర్వ శ్చిత్ర మద్భుతమ్,
శశంస దేవరాజాయ చిత్రసేనః ప్రతాపవాన్. 37

చిత్రము, అద్భుతము అయిన ఆప్రయోగమును చూచి ప్రతాపవంతుడగు గంధర్వుడు చిత్రసేనుడు పరమప్రీతి నొంది దేవరాజుతో నిట్లు పలికెను.

పశ్యేమా& పార్థనిర్ముక్తా& సంసక్తా నివ గచ్ఛతః,
చిత్రరూప మిదం జిష్ణో ర్దివ్య మస్త్ర ముదీర్యతః ॥ 38

దేవేంద్రా ! చూడు ఈ అర్జునబాణములు ఒకదానికొకటి అంటించినట్లు వచ్చుచున్నవి. అర్జునుని ఈ బాణప్రయోగము మిక్కిలి ఆశ్చర్యకరము.

నేదం మనుష్యాః సందధ్యు ర్న హీదం తేషు విద్యతే,
పౌరాణానాం మహాస్త్రాణాం విచిత్రోఽయం సమాగమః ॥ 39

38. అస్త్రమ్ - బాణములను ప్రయోగించునది

మనుష్యు లిది పట్టజాలరు అసలు వారియుం దిట్టిది కాన రాదు. పురాణకాలమునకు సంబంధించిన మహాస్త్రముల ఈ సమాగమము విచిత్రము.

ఆదదానస్య హి శరాన్ సంధాయ చ విముఞ్చతః,
వికర్షతశ్చ గాణ్డీవం నాన్తరం సమదృశ్యత. 40

బాణములను గైకొనుట, సంధించుట, విడుచుట గాండీవమును లాగుట అనుపనులలో వ్యవధానమే కానరాదు.

మధ్యందినగతం సూర్యం ప్రతపన్తమివాంబరే,
నాశక్నువన్త సైన్యాని పాణ్డవం ప్రతివీక్షితుమ్. 41

మింటినడుమ మాడ్చివేయుచున్న సూర్యునివలె పాండవుని వైపు చూచుటకును ఈ సైన్యములు చాలకున్నవి.

తథైవ భీష్మం గాఙ్గేయం ద్రష్టుం నోత్సహతే జనః. 42

అట్లే గంగకొడుకు భీష్ముని కూడ జనము చూడజాలకున్నది.

ఉభౌ విశ్రుతకర్మాణౌ ఉభౌ తీవ్రపరాక్రమౌ,
ఉభౌ సదృశకర్మాణౌ ఉభౌ యుధి సుదుర్జయౌ. 43

ఇద్దఱు ప్రసిద్ధి కెక్కినపనులుగలవారు. ఇద్దఱు గొప్ప పరాక్రమము కలవారు. ఇద్దఱు దీటైనపనులుగలవారు. ఇద్దఱు యుద్ధమున జయింపశక్యముకానివారు.

ఇత్యుక్తో దేవరాజస్తు పార్థభీష్మసమాగమమ్,
పూజయామాస దివ్యేన పుష్పవర్షేణ భారత. 44

గంధర్వు డిట్లనగా దేవేంద్రుడు ఆభీష్మపార్థుల సమాగమమును దివ్యమైన పుష్పవర్షముతో ప్రశంసించెను.

తతః శాన్తనవో భీష్మో వామం పార్శ్వమతాడయత్,
పశ్యతః ప్రతిసన్ధాయ విధ్యతః సవ్యసాచినః. 45

సత్యాహ్ది బాణము తొడిగి కొట్టుచు చూచుచుండగా భీష్ముఁడు అతని ఎడమవైపు కొట్టెను.

తతః ప్రహస్య బీభత్సుః పృథుధారేణ కార్ముకమ్,
చిచ్ఛేద గార్ధ్రపత్రేణ భీష్మస్యాదిత్యతేజసః. 46

అంత అర్జునుఁడు పెద్దగా నవ్వి సూర్యునివలె వెలిగిపోవుచున్న భీష్ముని ధనుస్సును వెడల్పు అంచుగలబాణముతో విరుగగొట్టెను.

అథైనం దశభి ర్బాణైః ప్రత్యవిధ్యత్ స్తనాన్తరే,
యతమానం పరాక్రాన్తం కున్తీపుత్రో ధనంజయః. 47

పిదప కుంతీసుతుఁడగు అర్జునుఁడు పరాక్రమించుటకు యత్నించుచున్న భీష్ముని నడిరొమ్మున పదిబాణములతో కొట్టెను.

స పీడితో మహాబాహు ర్గృహీత్వా రథకూబరమ్,
గాఙ్గేయో యుద్ధదుర్ధర్ష స్తస్థౌ దీర్ఘ మివాన్తరమ్. 48

ఆ మహాభుజుఁడు యుద్ధమున నెట్టివారికి లొంగనివాఁడు భీష్ముఁడు అల్లీటువడి రథమునొగలును పట్టుకొని చాలసేపు నిలిచియుండెను.

తం విసంజ్ఞ మపోవాహ సంయన్తా రథవాజినామ్,
ఉపదేశ మనుస్మృత్య రక్షమాణో మహారథమ్. 49

అట్లు తెలివికోల్పోయిన భీష్ముని రథపుగుఱ్ఱముల నడుపు సారథి తాను నేర్చిన ఉపదేశమును స్మృతికి తెచ్చుకొని ఆ మహారథుని రక్షించువాఁడై ఆవలకు కొనిపోయెను.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి భీష్మాపయానే
చతుష్షష్టితమోఽధ్యాయః

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున భీష్ముఁడు
తొలఁగిపోవుట యను అరువదినాల్గవ అధ్యాయము

## పఞ్చషష్టితమోఽధ్యాయః - అరువదిఅయిదవ అధ్యాయము

అర్జునేన సహ దుర్యోధనస్య యుద్ధం వికర్ణాదిభిః సహ తస్య పలాయనం చ.

అర్జునునితో దుర్యోధనుని యుద్ధము, వికర్ణాదులతో నాతడు పారిపోవుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

భీష్మే తు సంగ్రామశిరో విహాయ
పలాయమానే ధృతరాష్ట్రపుత్రః,
ఉత్సృజ్య కేతుం వినదన్ మహాత్మా
ధను ర్విగృహ్యార్జున మాససాద. 1

భీష్ముడు మొనతల వదలి పారిపోగా ధృతరాష్ట్రకుమారుడు దొడ్డబుద్ధిచేసికొని పతాక నెత్తి పెద్దగా అరచుచు వింటిని లాగి అర్జునునితో తలపడెను.

స భీమధన్వాన ముదగ్రవీర్యం
ధనంజయం శత్రుగణే చరన్తమ్,
ఆకర్ణపూర్ణాయతచోదితేన
వివ్యాధ భల్లేన లలాటమధ్యే. 2

అతడు భయంకరధనువుతో గొప్పశక్తితో శత్రువులనడుమ తిరుగుచున్న అర్జునుని ఫాలమునడుమ చెవివరకు నారిని లాగి వాడి బాణముతో కొట్టెను.

స తేన బాణేన సమర్పితేన
జాంబూనదాగ్రేణ సుసంహితేన,
రరాజ రాజన్ మహనీయకర్మా
యథైకపర్వా రుచిరైకశృఙ్గః. 3

---

ఏకపర్వా - కొనవైపున ఒక వెదురుచెట్టుగల,

అట్లు నాటిన బంగారుములుకుతో ఓరాజా! మహనీయ కర్మముగల అర్జునుడు ఒకే వెదురుచెట్టుగల అందమైన ఒంటిశిఖరపు పర్వతమువలె విరాజిల్లెను.

అథాస్య బాణేన విదారితస్య
ప్రాదుర్బభూ వాసృ గజస్ర ముష్ణమ్,
స తస్య జామ్బూనద పుఙ్ఖచిత్రో
భిత్త్వా లలాటం సువిరాజతే స్మ. 4

ఆ బాణముతో చీలిన నుదుటినుండి వేడిరక్తము విడువక స్రవించెను. ఆబంగారు బాణము ఆతనిలలాటమును భేదించి విరాజిల్లెను.

దుర్యోధన శ్చాపి త ముగ్రతేజాః
పార్థశ్చ దుర్యోధన మేకవీరః,
అన్యోన్య మాజౌ పురుషప్రవీరౌ
సమౌ సమాజగ్మతు రాజమీఢౌ. 5

ఇట్లు ఉగ్రమైన తేజముగల దుర్యోధను డర్జునుని, ఏకవీరుడగు అర్జునుడు దుర్యోధనుని అజమీఢవంశమువారైన ఆ అర్జున దుర్యోధను లిరువురు సమానముగా తలపడిరి.

తతః ప్రభిన్నేన మహాగజేన
మహీధరాభేన పున ర్వికర్ణః,
రథై శ్చతుర్భి ర్గజపాదరక్షైః
కున్తీసుతం జిష్ణు మథాభ్యధావత్. 6

అంత బాగుగా మదించిన కొండవంటి మహాగజముతో నాలుగురథములు ఏనుగులు పదాతులు రక్షించుచుండగా వికర్ణుడు కుంతీకుమారుడగు అర్జునునిపైకి మరల వచ్చెను.

తమాపతన్తం త్వరితం గజేన్ద్రం
ధనంజయః కుమ్భవిభాగమధ్యే,
ఆకర్ణపూర్ణేన మహాయసేన
బాణేన వివ్యాధ మహాజవేన. 7

అట్లు త్వరతో వచ్చుచున్న ఆగజేంద్రమును చెవిదాక లాగి మహావేగముతో వదలిన వలకవంటి బాణముతో అర్జునుడు కుంభస్థలమున కొట్టెను.

పార్థేన సృష్టః స తు గార్ధ్రపత్ర
ఆపుఙ్ఖదేశాత్ ప్రవివేశ నాగమ్,
విదార్య శైలప్రవరం ప్రకాశం
యథాశనిః పర్వత మిన్ద్రసృష్టః. 8

ఆ ట్లర్జునుడు వదలిన ఆబాణము పుంఖముదాక ఏనుగుతలలో దిగబడి, ఇంద్రుడు వదలినపిడుగు కొండను చీల్చినట్లు చీల్చెను.

శరప్రతప్తః స తు నాగరాజః
ప్రవేపితాఙ్గో వ్యథితాన్తరాత్మా,
సంసీదమానో నిపపాత మహ్యాం
వజ్రాహతం శృఙ్గ మివాచలస్య. 9

ఆ గజరాజము ఆబాణముదెబ్బకు మిక్కిలి బాధపడి వణకుచున్న ఒడలితో బాగుగానొచ్చిన హృదయముతో ఒంగిపోవుచు, వజ్రపుదెబ్బతిన్న పర్వతశిఖరమువలె నేలకూలెను.

నిపాతితే దన్తివరే పృథివ్యాం
త్రాసాద్ వికర్ణః సహసావతీర్య,
తూర్ణం పదా న్యష్టశతాని గత్వా
వివింశతేః స్యన్దన మారురోహ. 10

ఆ గజ మట్లు నేలకూలగా భయమువలన వికర్ణుడు వెంటనే దిగి నూటఎనిమిది అడుగులు త్వరత్వరగా నరిగి వివింశతి రథ మెక్కెను.

నిహత్య నాగం తు శరేణ తేన
వజ్రోపమే నాద్రివరాంబుదాభమ్,
తథావిధే నైవ శరేణ పార్థో
దుర్యోధనం వక్షసి నిర్బిభేద. 11

వజ్రమువంటి ఆబాణముతో పర్వతమువలె, మేఘమువలె నున్న ఆ ఏనుగును కూల్చి అట్టిదేయైన మఱియొక బాణముతో అర్జునుడు దుర్యోధనుని రొమ్ముగాడనేసెను.

తతో గజే రాజని చైవ భిన్నే
భగ్నే వికర్ణే చ సపాదరక్షే,
గాణ్డీవముక్తై ర్విశిఖైః ప్రణున్నా
స్తే యోధముఖ్యాః సహసాపజగ్ముః. 12

అంత ఆ ఏనుగును, రాజును, దెబ్బతినగా, పాదరక్షులతో కూడి వికర్ణుడు విరిగి పారగా గాండీవమునుండి వెలువడిన బాణములతో నుగ్గునూచగా సైనయోధవరులందఱు పలాయన మొనరించిరి.

దృష్ట్వైవ పార్థేన హతం చ నాగం
యోధాంశ్చ సర్వాన్ ద్రవతో నిశమ్య,
రథం సమావృత్య కురుప్రవీరో
రణాత్ ప్రదుద్రావ యతో న పార్థః. 13

అర్జునునిచేత చచ్చిన ఏనుగును చూచియు, పారిపోవుచున్న యోధులనుగూర్చి వినియు దుర్యోధనుడు రథమును మరలించి అర్జునుడు లేనికడకు రణభూమినుండి పారిపోయెను.

తం భీమరూపం త్వరితం ద్రవన్తం
దుర్యోధనం శత్రుసహోఽభిషఙ్గాత్,
ప్రాస్ఫోటయద్ యోద్ధుమనాః కిరీటీ
బాణేన విద్ధం రుధిరం వమన్తమ్. 14

అట్లు అవమానమువలన వడివడిగా పరువిడుచున్నవాడును, బాణపుదెబ్బతిన్నవాడును, రక్తము క్రక్కుచున్నవాడు నగు దుర్యోధనుని చూచి శత్రువుల పరిమార్చు అర్జునుడు వానితో యుద్ధమాడగోరి జబ్బచరచెను.

అర్జున ఉవాచ - అర్జును డిట్లు పలికెను

విహాయకీర్తిం విపులం యశశ్చ
యుద్ధాత్ పరావృత్య పలాయసే కిమ్ !,
న తేఽద్య తూర్యాణి సమాహతాని
తథైవ రాజ్యా దవరోపితస్య. 15

ఓరీ ! కీర్తిని విపులమైన యశస్సును వదలి యుద్ధమునుండి మరచి పారిపోవుదు వేల ! రాజ్యమునుండి వెల్లగింపబడిన నీ కిపుడు విజయఘోషలు మ్రోగుటలేదు.

యుధిష్ఠిర స్యాస్మి నిదేశకారీ
పార్థ స్తృతీయో యుధి సంస్థితోఽస్మి,
తదర్థ మావృత్య ముఖం ప్రయచ్ఛ
నరేన్ద్ర వృత్తం స్మర ధార్తరాష్ట్ర. 16

ఓరీధృతరాష్ట్రపుత్రా ! నేను యుధిష్ఠిరుని ఆజ్ఞను పాలించు వాడను - కుంతీతనయులలో మూడవవాడను. ఇదిగో యుద్ధమున

14. అభిషఙ్గాత్ - పరాభవమువలన, ప్రాస్ఫోటయత్ - ప్రాస్ఫోటమనగా బాహుశబ్దము - జబ్బచఱచెను అని భావము.

16. వృత్తమ్ - ద్యూతమునన్నగు వానియందు చేసిన అధర్మము.

నిలువబడితిని. నీవును దానికై వచ్చి మొగముచూపుము. రాజా నీవుచేసినపనిని తలపునకు తెచ్చుకొనుము.

మోఘం త వేదం భువి నామధేయం
దుర్యోధ నేతీహ కృతం పురస్తాత్,
నహీహ దుర్యోధనతా తవాస్తి
పలాయమానస్య రణం విహాయ. 17

నీకు ముందు నీతలితండ్రులు పెట్టిన దుర్యోధనుడు అనుపేరు నేడు భూమిలో వ్యర్థమయినది. రణమును వదలి పారిపోవు నీకు దుర్యోధనత ఇచటలేదు.

న తే పురస్తా దథ పృష్ఠతో వా
పశ్యామి దుర్యోధన ! రక్షితారమ్,
అపేహి యుద్ధాత్ పురుషప్రవీర !
ప్రాణాన్ ప్రియాన్ పాణ్డవతో౽ద్య రక్ష. 18

ఓ దుర్యోధనా ! నీకు ముందుగాని వెనుకగాని రక్షకుడు లేడు. ఓ పురుషప్రవీరుడా ! యుద్ధమునుండి తొలగి పొమ్ము. ఈనాడు పాండవునివలన ప్రియములైన ప్రాణములను కాపాడు కొనుము.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి దుర్యోధనపలాయనే పఞ్చషష్టితమో౽ధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున దుర్యోధనుని పలాయన మను అరువదియైదవ అధ్యాయము.

## షట్షష్టితమో౽ధ్యాయః — అరువదిఆరవ అధ్యాయము

అర్జునాత్ కౌరవదలస్య పరాజయః స్వదేశం ప్రతి ప్రస్థానం చ.

అర్జునునివలన కౌరవసేన ఓడుట, తనదేశమునకు బయలు దేరుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

ఆహూయమానశ్చ స తేన సంఖ్యే
మహాత్మనా వై ధృతరాష్ట్రపుత్రః,
నివర్తిత స్తస్య గిరాఙ్కుశేన
మహాగజో మత్త ఇవాఙ్కుశేన. 1

మహాత్ముడైన అర్జునుడు యుద్ధమున నట్లు పిలువగా ధృతరాష్ట్రుని కొడుకు మదించిన మహాగజము అంకుశముచేత మరలినట్లు మాటయనెడి అంకుశముచేత మరలెను.

సోఽమృష్యమాణో వచ సాభిమృష్టో
మహారథే నాతిరథ స్తరస్వీ,
పర్యావవ ర్తాథ రథేన వీరో
భోగీ యథా పాదతలాభిమృష్టః. 2

ఆ మహారథుని మాట తన్ను కలచగా సహింపని అతిరథుడగు దుర్యోధనుడు కాలితన్నుపడిన త్రాచుపామువలె రథముతో వెనుదిరిగెను.

తం ప్రేక్ష్య కర్ణః పరివర్తమానం
నివర్త్య సంస్తభ్య చ విద్ధగాత్రమ్,
దుర్యోధన స్యోత్తరతోఽభ్యగచ్ఛత్
పార్థం నృవీరో యుధి హేమమాలీ. 3

అట్లు మరలుచున్న ఆతనిని చూచి నరవరుడు, సువర్ణమాలలు కలవాడు నగు కర్ణుడు గాయములు పడిన దేహముగల ఆతనిని మరలించి నిలిపి దుర్యోధనునికి ఉత్తరమువైపుగా నిలిచి అర్జునుని మార్కొనెను.

భీష్మ స్తతః శాన్తనవో వివృత్య
హిరణ్యకక్ష్య స్త్వర యాభిషఙ్గీ,

దుర్యోధనం పశ్చిమతోఽభ్యరక్షత్
పార్థా న్మహాబాహు రధిజ్యధన్వా. 4

అంత శంతనుపుత్రుడగు భీష్ముడు మరల, తొందరగా బంగారుకవచముగలవాడై శత్రువునకు పరాజయముచేయఁగోరి దుర్యోధనునికి పడమరగా ఎక్కుపెట్టిన వింటితో నిలిచి అర్జునునివలన రక్షించుచు నిలిచెను.

ద్రోణః కృపశ్చైవ వివింశతిశ్చ
దుఃశాసనశ్చైవ వివృత్య శీఘ్రమ్,
సర్వే పురస్తాద్ వితతోరుచాపా
దుర్యోధనార్థం త్వరితాఽభ్యుపేయుః. 5

ద్రోణుడు, కృపుడు, వివింశతి, దుశ్శాసనుడు శీఘ్రముగా మరలి అందరు లాగిన ధనుస్సులతో దుర్యోధనునికై సన్నద్ధులై అర్జునునకు ముందుగా నడచిరి,

స తాన్యనీకాని నివర్తమానా
న్యాలోక్య పూర్ణౌఘనిభాని పార్థః,
హంసో యథా మేఘ మివాపతన్తం
ధనంజయః ప్రత్యపతత్ తరస్వీ. 6

నిండువెల్లువవంటి ఆ సేనలు అట్లు మరలుట గని అర్జునుడు వచ్చిపడుచున్న మేఘమును సూర్యునివలె, వేగముగా వారికి తన ప్రతాపమును జూపెను.

తే సర్వతః సంపరివార్య పార్థ
మస్త్రాణి దివ్యాని సమాదదానాః,

---

6. హంసః = సూర్యుడు, ప్రత్యపతత్ = కాల్చెను.

వవర్షు రథ్యేత్య శరైః సమస్తా
స్మేఘా యథా భూధర మంబువర్షైః. 7

వారందఱు దివ్యాస్త్రములను కైకొని పార్థుని చుట్టుముట్టి, మేఘములు జలధారలతో పర్వతమునువలె బాణములతో అతనిని ముంచివేసిరి.

తతోఽస్త్ర మస్త్రేణ నివార్య తేషాం
గాణ్డీవధన్వా కురుపుఙ్గవానామ్,
సమ్మోహనం శత్రుసహోఽన్య దస్త్రం
ప్రాదుశ్చకా రైన్ద్రి రపారణీయమ్. 8

ఆ కురుశ్రేష్ఠుల అస్త్రమును గాండీవధారి తనఅస్త్రముతో నివారించి శత్రువులను సహించువాడై తిరుగులేని సమ్మోహనాస్త్రమును వారిపై ప్రయోగించెను.

తతో దిశ శ్చానుదిశో వివృత్య
శరైః సుధారై ర్నిశితైః సుపత్రైః,
గాణ్డీవఘోషేణ మనాంసి తేషాం
మహాబలః ప్రవ్యథయాంచకార. 9

అంత మహాబలుడగు అర్జునుడు మంచిపదునుగలబాణములతో దిక్కులను, విదిక్కులను వ్యాపించి గాండీవఘోషముతో వారిమనస్సులను బాగుగా పీడించెను.

తతః పున ర్భీమరవం ప్రగృహ్య
దోర్భ్యాం మహాశఙ్ఖ ముదారఘోషమ్,
వ్యనాదయత్ స ప్రదిశో దిశః ఖం
భువం చ పార్థో ద్విషతాం నిహన్తా. 10

1. వివృత్య - వ్యాపించి.

పిమ్మట శత్రుసంహంతయగు అర్జునుడు భయంకరనాదము, గొప్పఘోషగల మహాశంఖమును రెండుచేతులతో పట్టి దిక్కులు, మూలలు, ఆకసము దద్దరిల్లునట్లు మ్రోగించెను.

తే శఙ్ఖనాదేన కురుప్రవీరాః
సమ్మోహితాః పార్థసమీరితేన,
ఉత్సృజ్య చాపాని దురాసదాని
సర్వే తదా శాన్తిపరా బభూవుః. 11

పార్థుడు ఊదిన ఆ శంఖము నాదముచేత కౌరవులలోనిగొప్ప వీరులందరు మూర్ఛవడి ఆక్రమింపరాని ధనువులను వదలి స్మృతి తప్పియుండిరి.

తథా విసంజ్ఞేషు చ తేషు పార్థః
స్మృత్వా చ వాక్యాని తథోత్తరాయాః,
నిర్యాహి మధ్యాదితి మత్స్యపుత్ర
మువాచ యావత్ కురవో విసంజ్ఞాః. 12

అట్లు వారందరు స్మృతిరహితులై యుండగా అర్జునుడు ఉత్తరపలుకులను స్మరించి, వారు అట్లు నిశ్చేష్టులై యుండగనే వారినడుమకు జనుమని ఉత్తరునితో పలికెను.

ఆచార్య శారద్వతయోః సుశుక్లే
కర్ణస్య పీతం రుచిరం చ వస్త్రమ్,
ద్రోణేశ్చ రాజ్ఞశ్చ తథైవ నీలే
వస్త్రే సమాదత్స్వ నరప్రవీర. 13

ఓ నరపుంగవా ! ద్రోణాచార్య, కృపాచార్యుల తెల్లని వస్త్రములు, కర్ణుని అందమైన పచ్చనివస్త్రము, అశ్వత్థామ, దుర్యోధనుల నీలవస్త్రములు కొనితెమ్ము.

---

11. శాన్తిపరాః = అణగిన చిత్తములుగలవారు = మూర్ఛిల్లిరని తాత్పర్యము.

భీష్మస్య సంజ్ఞాం తు తథైవ మన్యే
జానాతి సో౽స్త్రప్రతిఘాత మేషః,
ఏతస్య వాహాన్ కురు సవ్యత స్త్వ
మేవం హి యాతవ్య మమూఢసంజ్ఞైః. 14

భీష్ముడు స్మృతితప్పియుండ డని నాభావన. అత డీఅస్త్రము నకు విఱు గెలుగును. మనగుఱ్ఱములను ఆతనికి ఎడమవైపుగా పోనిమ్ము. అట్లు స్మృతితప్పనివారికి ఎడమవైపుగా పోవలయును.

రశ్మీన్ సముత్సృజ్య తతో మహాత్మా
రథా దవప్లుత్య విరాటపుత్రః,
వస్త్రాణ్యుపాదాయ మహారథానాం
తూర్ణం పునః స్వం రథ మారురోహ. 15

అంత దొడ్డబుద్ధిగల విరాటపుత్రుడు పగ్గములను వదలి రథము నుండి దూకి మహారథుల వస్త్రములను గ్రహించి శీఘ్రముగా మరల తన రథ మెక్కెను.

తతో౽న్వశాస చ్చతురః సదశ్వాన్
పుత్రో విరాటస్య హిరణ్యకక్షాన్,
తే తద్ వ్యతీయు ర్ధ్వజినా మనీకం
శ్వేతా వహన్తో౽ర్జున మాజిమధ్యాత్. 16

అంత విరాటపుత్రుడు బంగారుతొడుగులుగల ఆమేలి గుఱ్ఱములను నాల్గింటిని అదలించెను. ఆ తెల్లగుఱ్ఱములు సేనాసము దాయమునుండి అర్జునుని దాటించి ఆవలకు తీసికొనిపోయెను.

తథానుయాన్తం పురుషప్రవీరం
భీష్మః శరై రభ్యహనత్ తరస్వీ,
స చాపి భీష్మస్య హయాన్ నిహత్య
వివ్యాధ పార్థో దశభిః పృషత్కైః. 17

అట్లు వెడలుచున్న ఆ పురుషశ్రేష్ఠుని భీష్ముడు వేగముతో బాణములతో కొట్టెను. ఆతడును. భీష్ముని గుఱ్ఱములను చంపి పదిబాణములతో ఆతనిని బాధించెను.

తతో ఽర్జునో భీష్మ మపాస్య యుద్ధే
విద్ధ్వాస్య యన్తార మరిష్టధన్వా,
తస్థౌ విముక్తో రథవృన్ద మధ్యా
న్మేఘం విదార్యేవ సహస్రరశ్మిః. 18

అంత నర్జునుడు యుద్ధమున భీష్ముని వదలి, ఆతని సారథిని కొట్టి రథములగుంపు నడుమనుండి పిడి మేఘమును చీల్చుకొనివచ్చు వేయివెలుగుల సూర్యునివలె నిలచెను.

లబ్ధ్వా హి సంజ్ఞాం తు కురుప్రవీరాః
పార్థం నిరీక్ష్యాథ సురేన్ద్రకల్పమ్,
రణే విముక్తం స్థిత మేక మాజౌ
స ధార్తరాష్ట్ర స్త్వరితం బభాషే. 19

అంత కురుప్రవీరులందరు ఒడలెఱింగి దేవేంద్రునివలె నున్న అర్జునుని గాంచిరి. రణమును వదలి ఒంటిగా నిలిచియున్న ఆతనితో దుర్యోధనుడు సరభసముగా నిట్లు పలికెను.

అయం కథం వై భవతో విముక్త
స్తథా ప్రమథ్నీత యథా న ముచ్యేత్,
త మబ్రవీ చ్ఛాన్తనవః ప్రహస్య
క్వ తే గతా బుద్ధి రభూత్ క్వ వీర్యమ్. 20

‘ఈ అర్జునుడు ఒడలెఱుగని మిమ్ములను వదలక పిండిగొట్టి యుండవలసినది ఏల ఊరకుండెను’ అని పలుకగా భీష్ముడు నవ్వి ‘నీబుద్ధి యెట పోయెను! నీశక్తి ఏమాయెను!’ అని పలికెను.

శాంతిం పరాం ప్రాప్య యథా స్థితోఽభూ
రుత్సృజ్య బాణాంశ్చ ధను ర్విచిత్రమ్,
న శ్చైవ బీభత్సు రలం నృశంసం
కర్తుం న పాపేఽస్య మనో విశిష్టమ్. 21

ఏకాంతము ఒడలెఱుగక బాణములను, వింటిని వదలి పడియుంటివి. ఆబీభత్సుడు ఘోరకార్యము చేయజాలక పోయెను. అతని మనస్సు పాపమున లగ్నముకాలేదు కనుక అది శ్రేష్ఠము.

త్రైలోక్యహేతో ర్న జహేత్ స్వధర్మం
సర్వే స తస్మా న్నిహతా రణేఽస్మిన్,
క్షిప్రం కురూన్ యాహి కురుప్రవీర
విజిత్య గాశ్చ ప్రతియాతు పార్థః,
మా తే స్వకోఽర్థో నిపతేత మోహాత్
తత్ సంవిధాతవ్య మరిష్టబద్ధమ్. 22

ఆతడు ముల్లోకములు సిద్ధించుచున్నను స్వధర్మమును విడువడు. కావుననే మనల నందరను ఈ యుద్ధమున చంపలేను. అందువలన త్వరగా కురుప్రవరుడా! కురుదేశములకు పద. అర్జునుడు గోవులను గెలుచుకొని తిరిగిపోయిన పోనిమ్ము. నీ స్వప్రయోజనము మోహము వలన నశింపకుండుగాక! ఇప్పటికి మేలైన పనియేదో దానిని చేయుము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను
దుర్యోధన స్తస్య తు తన్నిశమ్య,
పితామహ స్యాత్మహితం వచోఽథ,

21. శాంతిమ్ - మనను పనిచేయనిస్థితివి, నృశంసం, కర్తుమ్ - ఒడలెఱుగని వారిని చంపుట యను ఘోరకార్యమును చేయుటకు, న, అలమ్-చాలడు. చేయడని భావము.

22. అరిష్టబంధమ్ - మేలొనగూర్చునది,

అతీతకామో యుధి సోఽత్యమర్షీ
రాజా వినిఃశ్వస్య బభూవ తూష్ణీమ్. 23

దుర్యోధనుడు తాత తన హితమునకై చెప్పిన ఆమాట విని యుద్ధమున తీరని కోరికతో మిక్కిలి కోపముతో నిట్టూర్చి ఊరకుండెను.

తద్ భీష్మవాక్యం హిత మీక్ష్య సర్వే
ధనంజయాగ్నిం చ వివర్ధమానమ్,
నివర్తనా యైవ మనో నిదధ్యు
ర్దుర్యోధనం తే పరిరక్షమాణాః. 24

అంత వారందఱు భీష్మవాక్యమును హితమైనదిగా గుర్తించియు, పెరుగుచున్న అర్జునాగ్నిని కాంచియు, దుర్యోధనుని రక్షించుకొనుచు తిరిగి పోవుటకే నిశ్చయించిరి.

తాన్ ప్రస్థితాన్ ప్రీతమనాః స పార్థో
ధనంజయః ప్రేక్ష్య కురుప్రవీరాన్,
అభాషమాణోఽనునయం ముహూర్తం
వచోఽబ్రవీత్ సంపరిహృత్య భూయః. 25

అట్లు బయలుదేరిన కౌరవవీరులను గాంచి ప్రియమయిన మనస్సుగల అర్జునుడు ముహూర్తకాలము అనునయవాక్యమును పలుకకయే వెనుకకు మరలి పలికెను.

పితామహం శాన్తనవం చ వృద్ధం
ద్రోణం గురుం చ ప్రణిపత్య మూర్ధ్నా,
ద్రౌణిం కృపం చైవ కురూంశ్చ మాన్యా
ఞ్ఛరై ర్విచిత్రై రభివాద్య చైవ. 26

25. పలుకకయే పలికెననగా నోటితో కాక, చేష్టతో భావమును ప్రకటించెనని తాత్పర్యము.

వృద్ధుడు, తాత అయిన భీష్ముని, గురువైన ద్రోణుని,తలతో ప్రణమిల్లి, అశ్వత్థామను, కృపాచార్యుని, మన్నింపదగిన కౌరవులను విచిత్రములైన బాణములతో అభివాదనము చేసెను.

దుర్యోధనస్యోత్తమరత్నచిత్రం
చిచ్ఛేద పార్థో ముకుటం శరేణ,
ఆమంత్ర్య వీరాంశ్చ తథైవ మాన్యాన్
గాణ్డీవఘోషేణ వినాద్య లోకాన్. 27

ఉత్తమరత్నములతో చిత్రమైన దుర్యోధనుని కిరీటమును బాణముతో పగులగొట్టెను. అట్లే మన్నింపదగిన వీరులను వీడుకొని గాండీవఘోషముతో లోకములనెల్ల మ్రోగించెను.

స దేవదత్తం సహసా వినాద్య
విదార్య వీరో ద్విషతాం మనాంసి,
ధ్వజేన సర్వా నభిభూయ శత్రూన్
సహేమమాలేన విరాజమానః. 28

అర్జునుడు ఒక్కపెట్టున దేవదత్తమును మ్రోయించి, శత్రువుల గుండెలను పగులగొట్టి, బంగారుమాలలుగల ధ్వజముతో విరాజిల్లుచు శత్రువులను పరాభవించెను.

దృష్ట్వా ప్రయాతాంస్తు కురూన్ కిరీటీ
హృష్టోఽబ్రవీత్ తత్ర స మత్స్యపుత్రమ్,
ఆవర్తయాశ్వాన్ పశవో జితా స్తే
యాతాః పరే యాహి పురం ప్రహృష్టః. 29

---

26. శరైః - అభివాద్య - బాణములను పాదములకడ పడునట్లు వేయుటయే ఇక్కడ నమస్కరించుట, మాన్యాన్ - బాహ్లికసోమదత్తాదులను
27. 'ముకుటం చిచ్ఛేద' - అను మాటచేత దుర్యోధనుని మరణమును సూచించె నని భావము.

బయలుదేరిపోవుచున్న కౌరవులను చూచి, కిరీటి సంతోషముతో ఉత్తరునితో "గుఱ్ఱములను మరలింపుము. పశువులను గెలిచితిమి. శత్రువులు వెడలిపోయిరి. మిక్కిలి ఉబ్బుతో నగరమున కరుగుము" అని పలికెను.

దేవా స్తు దృష్ట్వా మహ దద్భుతం తద్
యుద్ధం కురూణాం సహ ఫాల్గునేన,
జగ్ముః యథా స్వం భవనం ప్రతీతాః
పార్థస్య కర్మాణి విచిన్తయన్తః. 0

దేవతలును మిక్కిలి అశ్చెరువు గొలుపునట్టి అర్జునుడు కౌరవులతో చేసిన యుద్ధమును చూచి, ఆతడు కావించిన కార్యవిశేషములనే మరల మరల భావించుచు తమ తమ భవనముల కరిగిరి.

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి సమస్త కౌరవ పలాయనే షట్షష్టితమోఽధ్యాయః

ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున గోహరణ పర్వమున కౌరవు లందఱు పారిపోవుట అను అరువదిఆఱవ అధ్యాయము

## సప్తషష్టితమోఽధ్యాయః - అరువదియేడవ అధ్యాయము

విజయినోఽర్జునస్య ఉత్తరసహితస్య రాజధానీంప్రతి గమనమ్
ఉత్తరునితో గూడి గెలుపొందిన అర్జునుడు రాజధానికి వచ్చుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతో విజిత్య సంగ్రామే కురూన్ స వృషభేక్షణః,
సమానయామాస తదా విరాటస్య ధనం మహత్. 1

శ్రేష్ఠమైన దృష్టిగల ఆ అర్జునుడు యుద్ధమున కౌరవులను గెలిచి విరాటుని గొప్పధనమును తిరిగి తెచ్చెను.

1. వృషభేక్షణః - శ్రేష్ఠమైన దృష్టిగలవాడు

గతేషు చ ప్రభగ్నేషు ధార్తరాష్ట్రేషు సర్వతః,
వనాన్నిష్క్రమ్య గహనాద్ బహవః కురుసైనికాః. ౩

భయాత్ సంత్రస్తమనసః సహజగ్ముస్తతస్తతః,
ముక్తకేశాస్త్వదృశ్యన్త స్థితాః ప్రాంజలయస్తదా. ౪

ధృతరాష్ట్రకుమారులు బాగుగా దెబ్బతిని వెడలిపోగా ఘోరమైన అడవినుండి వెలువడి చాలమంది కురుసైనికులు భయముతో వణకుచున్న మనస్సులతో, వీడినజుట్టుముడులతో చేతులు జోడించి అందందు నిలిచిరి.

క్షుత్పిపాసాపరిశ్రాన్తా విదేశస్థా విచేతసః,
ఊచుః ప్రణమ్య సంభ్రాన్తాః పార్థ కింకరవామ తే. 4

ఆకలిదప్పులతో అలసి, మతిస్తిమితము తక్కి, కాని దేశమున నున్న వారందఱు తొట్రుపాటుతో ప్రణమిల్లి అయ్యా! అర్జునా! నీ కింకరులము అని పలికిరి.

[ప్రాణా నంతర్హితో యాతాన్ ప్రయాచిష్యామహే వయమ్,
వయం చార్జున తే దాసా హ్యనురక్తా హ్యనాయకాః.

గతితప్పిన మా ప్రాణములను మరల నిన్ను యాచించుచున్నాము. ఓ అర్జునా! నాయకుడులేని మేము నీ దాసులము. నీవు మమ్ము రక్షింపవలయును.

అర్జున ఉవాచ - అర్జును డిట్లు పలికెను.

అనాథాన్ దుఃఖితాన్ దీనాన్ కృశాన్ వృద్ధాన్ పరాజితాన్,
న్యస్తశస్త్రాన్ నిరాశాంశ్చ నాహం హన్మి కృతాఞ్జలీన్.

దిక్కులేనివారిని, ఏడ్చువారిని, దీనులను, కృశించినవారిని, ముసలివారిని,ఓడినవారిని, ఆయుధములుపట్టని వారిని, ఆశలేనివారిని, దోసిలి యొగ్గినవారిని నేను చంపను.]

స్వస్తి వ్రజత వో భద్రం వ భేతవ్యం కథంచన,
నాహ మార్తా ఞ్జిఘాంసామి భృశ మాశ్వాసయామి వః. 5

శుభము. మీరు పొండు. మీకు మేలగుగాక. భయపడవలదు; నేను ఆర్తులను చంపగోరను. మీరు ఊరటపొందుడు.

వైశమ్పాయన ఉవాచ- వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్య తా మభయాం వాచం శ్రుత్వా యోధాః సమాగతాః,
ఆయుః కీర్తియశోదాభి స్త మాశీర్భి రనన్దయన్. 6

ఆతని ఆ అభయవాక్కు విని అటచేరిన యోధులు ఆయువు కీర్తి యశస్సుల నొసగెడు ఆశీస్సులతో ఆతనిని కొనియాడిరి.

తతోఽర్జునం నాగ మివ ప్రభిన్న
ముత్సృజ్య శత్రూన్ వినివర్తమానమ్,
విరాటరాష్ట్రాభిముఖం ప్రయాన్తం
నాశక్నువం స్తం కురవోఽభియాతుమ్. 7

మదించిన ఏనుగువలె శత్రువులను వదలి మరలి, విరాట రాష్ట్రమువైపు బయలుదేరుచున్న అర్జునుని ఎదిరించుటకు కౌరవులు చాలరైరి.

తతః స తన్మేఘ మి వాపతన్తం
విద్రావ్య పార్థః కురుసైన్యవృన్దమ్,
మత్స్యస్య పుత్రం ద్విషతాం నిహన్తా
వచోఽబ్రవీత్ సంపరిరభ్య భూయః. 8

అంత ఆ అర్జునుడు మేఘమువలె వచ్చిపడిన కురుసేనల సముదాయమును పారద్రోలి, శత్రుసంహారకుడై ఉత్తరుని గాఢముగా కౌగిలించుకొని ఇట్లు పలికెను.

పితుః సకాశే తవ తాత! సర్వే
వసన్తి పార్థా విదితం తవైవ,

తాన్ మా ప్రశంసే ర్నగరం ప్రవిశ్య
భీతః ప్రణశ్యే ద్ధి స మత్స్యరాజః. 9

నాయనా! నీతండ్రికడ పాండవులందరు నివసించియున్నారు. ఇది నీకు తెలిసినదే కదా! నగరమును ప్రవేశించి వారి మాట యెత్తకుము. ఆ విరాటరాజు భయముతో క్రుంగిపోవును.

మయా జితా సా ధ్వజినీ కురూణాం
మయా చ గావో విజితా ద్విషద్భ్యః,
పితుః సకాశం నగరం ప్రవిశ్య
త్వ మాత్మనః కర్మ కృతం బ్రవీహి. 10

'ఆకౌరవసేనను నేను గెలిచితిని, గోవులను శత్రువులనుండి నేను ఒడుచుకొంటిని' అని నగరమును ప్రవేశించి తండ్రి కడ ఇది యంతయు నీపని యన్నట్లుగా చెప్పుము.

ఉత్తర ఉవాచ- ఉత్తరు డిట్లు పలికెను.

యత్ తే కృతం కర్మ న పారణీయం
తత్ కర్మ కర్తుం మమ నాస్తి శక్తిః,
న త్వాం ప్రవక్ష్యామి పితుః సకాశే
యావ న్న మాం వక్ష్యసి సవ్యసాచిన్ ! 11

ఓ సవ్యసాచీ! ఈ పని యితరులకు చేయజాలనిది. నీవు చేసినపని చేయుటకు నాకు శక్తిలేదు. తండ్రియొద్ద నీవు చెప్పునంత వరకు నేను నిన్నుగూర్చి చెప్పను.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

స శత్రుసేనా మవజిత్య జిష్ణు
రాచ్ఛిద్య సర్వం చ ధనం కురుభ్యః,
శ్మశాన మాగత్య పునః శమీం తా
మభ్యేత్య తస్థౌ శరవిక్షతాఙ్గః. 12

జయశాలియగు అర్జునుడు ఇట్లు శత్రుసేనను ఓడించి కౌరవుల నుండి ధనమంతయు ఒడిచికొని తిరిగి శ్మశానముకడకు వచ్చి జమ్మిని చేరి బాణముల గాయములుకల దేహముతో నిలిచెను.

తతః స వహ్నిప్రతిమో మహాకపిః
సహైవ భూతై ర్దివ ముత్పపాత,
తథైవ మాయా విహితా బభూవ
ధ్వజం చ సైంహం యుయుజే రథే పునః. 13

అంత అగ్నివంటి మహాకపి భూతములతోపాటు ఆకసమున కెగిరిపోయెను. అట్లే పూర్వపుమాయ ఏర్పడెను. రథమున తిరిగి సింహధ్వజము తగులుకొనెను.

విధాయ తచ్చాయుధ మాజివర్ధనం
కురూత్తమానా మిషుధీః శరాం స్తదా,
ప్రాయాత్ స మత్స్యో నగరం ప్రహృష్టః
కిరీటినా సారథినా మహాత్మనా. 14

అంతట ఉత్తరుడు మునుపటివలె కురువరేణ్యుల (పాండవుల) ఆయుధములను, అంపపొదులను, బాణములను అచట నిక్షేపించి మహాత్ముడగు సారథి అర్జునునితో మిక్కిలి సంతోషముతో నగరమునకు బయలుదేరెను.

పార్థస్తు కృత్వా పరమార్యకర్మ
నిహత్య శత్రూన్ ద్విషతాం నిహన్తా,
చకార వేణీం తథైవ భూయో
జగ్రాహ రశ్మీన్ పున రుత్తరస్య.
వివేశ హృష్టో నగరం మహామనా,
బృహన్నలారూప ముపేత్య సారథిః. 15

---

13. సైంహం ధ్వజమ్ - ఉసింహధ్వజము ఉత్తరునిది.

దొడ్డమనసుగల సారథి, శత్రుసంహారకుడు అర్జునుడు దొడ్డ కార్యము నట్లు నిర్వహించి, శత్రువులను గెలిచి, మరల మునుపటి వలె బృహన్నలరూపమును పొంది జడనల్లి ఉత్తరుని రథము పగ్గము లను పట్టి సంతోషముతో నగరమును ప్రవేశించెను.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతో నివృత్తాః కురవః ప్రభగ్నా వశ మాస్థితాః,
హాస్తినాపుర ముద్దిశ్య సర్వే దీనా యయుస్తదా. 16

అంతట కౌరవులు దెబ్బతిని పరవశులై వెనుదిరిగి ప్రేలు మొగములతో హాస్తినాపురమువైపు పోయిరి.

పన్థాన ముపసఙ్గమ్య ఫాల్గునో వాక్య మబ్రవీత్.

అర్జునుడు బాటలోనికి వచ్చి యిట్లు పలికెను.

రాజపుత్ర ప్రత్యవేక్ష్య సమానీతాని సర్వశః,
గోకులాని మహాబాహో! వీర గోపాలకైః సహ. 18

ఓ రాజకుమారా! మహాబాహూ! చూడుము, గోపాలకులతో పాటు అన్నివైపులనుండియు గోకులములు తిరిగి వచ్చినవి.

తతో ఽపరాహ్ణే యాస్యామో విరాటనగరం ప్రతి,
ఆశ్వాస్య పాయయిత్వా చ పరిప్లావ్య చ వాజినః. 19

కాబట్టి గుఱ్ఱములను చల్లచేసికొని నీరుత్రావించి, స్నానము చేయించి, ప్రొద్దువాలు వేళకు విరాటనగరమును చేరుదము.

గచ్ఛన్తు త్వరితా శ్చేమే గోపాలాః ప్రేషితా స్త్వయా,
నగరే ప్రియ మాఖ్యాతుం ఘోషయన్తు చ తే జయమ్. 20

ఈ గోపాలకులు నీవు పంపగా త్వరగా నగరమున ప్రియవార్త తెలుపుట కరుగవలయును. నీజయము నచట చాటింపవలయును.

---

16. వశమ్ ఆస్థితాః - పరుల వశమును పొందినవారై,

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు పలికెను.

అథోత్తర స్త్వరమాణః స యోధా
నాజ్ఞాపయద్ వచనాత్ ఫాల్గునస్య,
ఆచక్షధ్వం విజయం పార్థివస్య
భగ్నాః పరే విజితా శ్చాపి గావః. 21

అర్జునుని మాటపై ఉత్తరుడు త్వరగా యోధుల కాజ్ఞాపించెను. 'రాజునకు విజయమును తెలుపుడు. శత్రువులు దెబ్బతినిరి. గోవులు చిక్కినవి' అని విన్నవింపుడు.

ఇత్యేవం తౌ భారత మత్స్యవీరౌ
సంమంత్ర్య సఙ్గమ్య తతః శమీం తామ్,
అభ్యేత్య భూయో విజయేన తృప్తా-
వుత్సృష్ట మారోపయతాం స్వభాణ్డమ్. 22

ఆ అర్జునుడును ఉత్తరుడును ఇట్లు వారిని పంపి మరల జమ్మిచెట్టుకడకు వచ్చి విజయముతో తృప్తినొందుచు ఇదివరకు వదలిన అలంకారములను మరల ధరించిరి.

స శత్రుసేనా మభిభూయ సర్వా-
మాచ్ఛిద్య సర్వం చ ధనం కురుభ్యః,
వైరాటి రాయా న్నగరం ప్రతీతో
బృహన్నలాసారథినా ప్రవీరః. 23

22 విజయేన, తృప్తౌ - విజయమునందు తృప్తినందినవారై, అనగా ఇంత కంటె పెద్దయుద్ధమును చేయగోరకున్నవారై - యని యర్థము చెప్పదగును, ఉత్సృష్టమ్, స్వభాణ్డమ్ - యుద్ధమునకు ముందు వదలిన తనతన ఆభరణములను,

అట్లా విరాటపుత్రుడు శత్రుసేనను పరాభవించి కౌరవుల నుండి గోధనము నంతటిని ఒడుచుకొని ఆనందముతో సారథియగు బృహన్నలతో పెద్దవీరుడై నగరమునకు తిరిగివచ్చెను.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి ఉత్తరాగమనే సప్తషష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారత విరాటపర్వమున గోహరణపర్వమున ఉత్తరువిరాకయను అరువదిఏడవ అధ్యాయము.

## అష్టషష్టితమోఽధ్యాయః – అరువదిఎనిమిదవ అధ్యాయము

విరాటస్య చిన్తోత్తరస్య నగరే ప్రవేశః, ప్రజాజనై స్తస్య స్వాగతకరణం; విరాటేన యుధిష్ఠిరస్య తిరస్కారణం, క్షమాభ్యర్థన ముత్తరం ప్రతి యుద్ధవృత్తాన్త జిజ్ఞాసనం చ.

విరాటుని చింత, ఉత్తరుడు నగరమును ప్రవేశించుట, జనులు స్వాగతమిచ్చుట, విరాటుడు యుధిష్ఠిరుని తిరస్కరించుట, క్షమను వేడుట, ఉత్తరుని యుద్ధవార్త లడుగుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ధనం చాపి విజిత్యాశు విరాటో వాహినీపతిః,
వివేశ నగరం హృష్ట శ్చతుర్భిః పాణ్డవైః సహ. 1

సేనల కధిపతియైన విరాటుడు శీఘ్రముగా ధనమును వశపరచుకొని సంతోషముతో నలుగురు పాండవులతో పాటు నగరమును ప్రవేశించెను.

జిత్వా త్రిగర్తాన్ సంగ్రామే గా శ్చైవాదాయ సర్వశః,
అశోభత మహారాజ సహపార్థః శ్రియా వృతః. 2

1. ధనమ్ - అలమందలను.

ఓ మహారాజా! అతడు యుద్ధమున త్రిగర్తులను గెలిచి గోవులను మొత్తముగా తెచ్చుకొని, పాండవులతో కలిసి సంపదతో కూడి అలరారెను.

తమాసనగతం వీరం సుహృదాం హర్షవర్ధనమ్,
ఉపాసాఞ్చక్రిరే సర్వే సహపార్థైః పరన్తప. 3

సింహాసనమున కూర్చున్నవాడు, వీరుడు, మిత్రములకు సంతోషమును పెంచువాడు నగు ఆరాజును పాండవులతోపాటు అందరు సేవించిరి.

ఉపతస్థుః ప్రకృతయః సమస్తా బ్రాహ్మణైః సహ,
సభాజితః ససైన్యస్తు ప్రతినన్ద్యాథ మత్స్యరాట్, 4
విసర్జయామాస తదా ద్విజాంశ్చ ప్రకృతీస్తథా.

బ్రాహ్మణులతోపాటు సర్వప్రజలు కొలువుతీరియుండిరి. సైన్యముతోపాటు మన్ననపొందిన ఆమత్స్యరాజు వారిని అభినందించి బ్రాహ్మణాదులను తక్కినప్రజలను పంపివేసెను.

తదా స రాజా మత్స్యానాం విరాటో వాహినీపతిః, 5
ఉత్తరం పరిపప్రచ్ఛ క్వ యాత ఇతి చాబ్రవీత్,
ఆచఖ్యుస్తస్య తత్సర్వం స్త్రియః కన్యాశ్చ వేశ్మని. 6

పిమ్మట విరాటమహారాజు ఉత్తరుడెందుబోయెనని అడిగెను. అప్పుడు అంతఃపురమునందలి స్త్రీలు, కన్యలు జరిగిన దంతయు చెప్పిరి.

అన్తఃపురచరాశ్చైవ కురుభిర్గోధనం హృతమ్,
విజేతుమభిసంరబ్ధ ఏక ఏవాతిసాహసాత్,
బృహన్నలాసహాయశ్చ నిర్గతః పృథివీఞ్జయః, 7

---

1. సభాజితః - పూజితుడు.

అంతఃపురమునున్నవారు "కౌరవులు గోధనము నపహరింపగా మాటామాటికిని వారిని గెలుచుటకు మిక్కిలిసాహసముతో బృహన్నలతోడుగా ఉత్తరకుమారుడే అరిగెను" అని చెప్పిరి.

ఉపయాతా నతిరథాన్ భీష్మం శాన్తనవం కృపమ్,
కర్ణం దుర్యోధనం ద్రోణం ద్రోణపుత్రం చ షడ్‌రథాన్. 8

'అతిరథులైన భీష్ముడు, కృపుడు, కర్ణుడు, దుర్యోధనుడు, ద్రోణుడు, ద్రోణుని కుమారుడు అశ్వత్థామ అను ఆరుగురు మహారథులు దగ్గఱకు రాగా నాతడు వారిపై నరిగెను' అని చెప్పిరి.

వైశమ్పాయన ఉవాచ- వైశంపాయను డిట్లు చెప్పెను.
రాజా విరాటోఽథ భృశాభితప్తః
శ్రుత్వా సుతం హ్యేకరథేన యాతమ్.
బృహన్నలాసారథి మాజివర్ధనం
ప్రోవాచ సర్వా నథ మంత్రిముఖ్యాన్. 9

తన కొడుకు బృహన్నలను సారథిగా చేసికొని ఒంటిరథముతో యుద్ధమున కరిగెనని విని విరాటరాజు మిక్కిలి దుఃఖించి మంత్రిముఖ్యు లందరితో ఇట్లు పలికెను.

సర్వథా కురవ స్తే హి యే చాన్యే వసుధాధిపాః,
త్రిగర్తాన్ నిఃసృతా న్ఛ్రుత్వా న స్థాస్యన్తి కదాచన. 10

ఆ కౌరవులు, మిగిలినరాజులును త్రిగర్తులు మన కోడి రని విని ఎంతమాత్రము నిలువరు.

తస్మాద్ గచ్ఛన్తు మే యోధా బలేన మహతా వృతాః,
ఉత్తరస్య పరీప్సార్థం యే త్రిగర్తై రవిక్షతాః. 11

కావున త్రిగర్తుల యుద్ధములో దెబ్బతినని నాయోధులందరు గొప్పసేనతో ఉత్తరుని రక్షణకొఱకు వెళ్ళవలయును.

హయాంశ్చ నాగాంశ్చ రథాంశ్చ శీఘ్రం
పదాతిసంఘాంశ్చ తతః ప్రవీరాన్,
ప్రస్థాపయామాస సుతస్య హేతో
ర్విచిత్రశస్త్రాభరణోపపన్నాన్. 12

విరాటుడు తనకొడుకుకొరకు గుఱ్ఱములను, ఏనుగులను, రథములను,విచిత్రములైన శంఖములు, ఆభరణములు ధరించిన గొప్ప వీరులను తరలించెను.

ఏవం స రాజా మత్స్యానాం విరాటో వాహినీపతిః,
వ్యాదిదేశాథ తాం క్షిప్రం వాహినీం చతురఙ్గిణీమ్. 13

గొప్పసేన గల ఆ విరాటరాజు నాలుగు అంగములు గల తన సేనకు త్వరతో ఇట్లు ఆజ్ఞ ఇచ్చెను.

కుమార మాశు జానీత యది జీవతి వా న వా,
యస్య యన్తా గతః షణ్ఢో మన్యేఽహం న స జీవతి. 14

ముందు వెంటనే కుమారుడు బ్రతికియుండెనో లేదో తెలియుడు. ఆ నపుంసకుని సారథిగా కొనిపోయెను. బ్రదుకడనియే నా తలపు.

వైశమ్పాయన ఉవాచ- వైశంపాయను డిట్లు చెప్పెను.

త మబ్రవీద్ ధర్మరాజో విహస్య
విరాటరాజం తు భృశాభితప్తమ్,
బృహన్నలాసారథి శ్చేన్నరేన్ద్ర
పరే న నేష్యన్తి తవాద్య గా స్తాః. 15

అంత ధర్మరాజు నవ్వి పెల్లుశోకించుచున్న విరాటరాజుతో ఇట్లనెను. 'ఓ రాజా! బృహన్నల సారథి అయినచో శత్రువులు నేడు నీగోవులను తరలించుకొనిపోలేరు.

సర్వాన్ మహీపాన్ సహితాన్ కురూంశ్చ
తథైవ దేవాసురసిద్ధయక్షాన్,
అలం విజేతుం సమరే సుత స్తే
స్వనుష్ఠితః సారథినా హి తేన. 16

ఓరాజా! ఆతడు సారథియైనచో నీకుమారుడు రాజు లందఱను, మిత్రులతో కూడిన కౌరవులను, అట్లే దేవతలను, రాక్షసులను, సిద్ధులను యక్షులను గూడ యుద్ధమున గెలువజాలును. మంచిపని జరిగినది.

వైశమ్పాయన ఉవాచ- వైశంపాయను డిట్లు చెప్పెను.

అథోత్తరేణ ప్రహితా దూతా స్తే శీఘ్రగామినః,
విరాటనగరం ప్రాప్య విజయం సమవేదయన్. 17

అంత ఉత్తరుడు పంపిన వేగరులగు దూతలు విరాట నగరమును చేరి విజయమును వెల్లడించిరి.

రాజ్ఞ స్తత్ సర్వ మాచఖ్యౌ మంత్రీ విజయ ముత్తమమ్,
పరాజయం కురూణాం చా ప్యుపాయాన్తం తథోత్తరమ్. 18

మంత్రి రాజునకు ఉత్తమమైన గెలుపును, కౌరవుల పరాజయమును, తిరిగి వచ్చుచున్న ఉత్తరుని గూర్చి మొత్తము నివేదించెను.

సర్వా వినిర్జితా గావః కురవ శ్చ పరాజితాః,
ఉత్తరః సహ సూతేన కుశలీ చ పరంతపః. 19

గోవులన్నియు చిక్కినవి. కౌరవులు ఓడిరి. శత్రువులను సంహరించిన ఉత్తరుడు సారథితోపాటు కుశలముగా నున్నాడు.

యుధిష్ఠిర ఉవాచ- యుధిష్ఠిరు డిట్లనెను.

దిష్ట్యా వినిర్జితా గావః కురవ శ్చ పలాయితాః,
నాద్భుతం త్వేవ మన్యేఽహం యత్ తే పుత్రోఽజయత్ కురూన్.
ధ్రువ ఏవ జయ స్తస్య యస్య యన్తా బృహన్నలా. 20

అదృష్టమువలన గోవులు చేజిక్కినవి. కౌరవులు పారిపోయిరి. నీకుమారుడు గెలిచెననగా ఇదియొక ఆశ్చర్యముగా నేను తలంపను. బృహన్నల సారథిగా ఉన్నవానికి జయము తథ్యము.

[దేవేన్ద్రసారథి శ్చైవ మాతలి ర్లఘు విక్రమః,
కృష్ణస్య సారథి శ్చైవ న బృహన్నలయా సమా.

సూక్ష్మవిక్రమము గల ఇంద్రసారథి మాతలియు, కృష్ణుని సారథియును బృహన్నలకు సాటిరారు.]

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

తతో విరాటో నృపతిః సంప్రహృష్టతనూరుహః, 21
శ్రుత్వా స విజయం తస్య కుమారస్యామితౌజసః,
ఆచ్ఛాదయిత్వా దూతాం స్తాన్ మంత్రిణం సోఽభ్య
చోదయత్. 22

అంత విరాటరాజు ఆనందముతో గగుర్పాటుగలవాడై సాటిలేని దేహబలముగల కుమారుని విజయమును విని దూతలను ఆభరణాదులతో ముంచియెత్తి మంత్రి నిట్లాజ్ఞాపించెను.

రాజమార్గాః క్రియన్తాం మే పతాకాభి రలంకృతాః,
పుష్పోపహారై ర్యర్చన్తాం దేవతా శ్చాపి సర్వశః. 23

రాజమార్గముల నన్నింటిని పతాకలతో అలంకరింపుడు. పూలకానుకలతో అన్నియెడల దేవతలకు పూజలు చేయుడు.

కుమారా యోధముఖ్యాశ్చ గణికాశ్చ స్వలంకృతాః,
వాదిత్రాణి చ సర్వాణి ప్రత్యుద్యాన్తు సుతం మమ. 24

కుమారులు, యోధులలో శ్రేష్ఠులు, చక్కని అలంకారముగల వేశ్యలు అన్నివిధములైన వాద్యములు నాకుమారుని కెదురేగవలయును.

---

22. ఆచ్ఛాదయిత్వా - వస్త్రాభరణములతో కప్పి,

ఘణ్టాపణః మానవః శీఘ్రం మత్తమారుహ్య వారణమ్,
శృఙ్గాటకేషు సర్వేషు ఆఖ్యాతు విజయం మమ. 25

గంట మ్రోగించువాడు మదించిన యేనుగు నెక్కి అన్ని కూడలులలో నావిజయమును త్వరగా చాటవలయును.

ఉత్తరా చ కుమారీభి ర్బహ్వీభిః పరివారితా,
శృఙ్గారవేషాభరణా ప్రత్యుద్యాతు సుతం మమ. 26

చాలమంది కన్నియలు చుట్టిరాగా ఉత్తరయు, నాట్యము నందలి వేషమును ఆభరణములను ధరించి నాకొడుకున కెదురుగా నరుగవలయును.

వైశమ్పాయన ఉవాచ- వైశంపాయను డిట్లు చెప్పెను.

శ్రుత్వా చేదం వచనం పార్థివస్య
సర్వం పురం స్వస్తికపాణిభూతమ్,
భేర్యశ్చ తూర్యాణి చ వారిజాశ్చ
వేషైః పరార్ధ్యైః ప్రమదాః శుభాశ్చ. 27

తథైవ సూతైః సహ మాగధైశ్చ
నాన్దీవాద్యాః పణవా స్తూర్యవాద్యాః,
పురాద్ విరాటస్య మహాబలస్య
ప్రత్యుద్యయుః పుత్ర మనన్తవీర్యమ్. 28

25. శృఙ్గాటకేషు - నాలుగుదారులు కలిసిన తావులలో- "శృఙ్గాటకం భవేద్ ద్వారి కణ్టకే చ చతుష్పథే" అని మేదిని
26. శృంగారవేషాభరణా - నాట్యముచేయునప్పటి వేషము, నగలు కలదియై - "శృఙ్గారః సురతే నాట్యే" అని మేదిని.
27. స్వస్తికపాణిభూతమ్ - మంగళ ఆరతులు, పెరుగు, గరికలు మొదలగునవి చేతియందు కలది: వారిజాః - శంఖములు.
28. నాన్దీవాద్యాః - మంగళవాద్యములు: తూర్యవాద్యాః - జయవాద్యములు.

మహారాజుమాట విని పురమంతయు మంగళవస్తువులగు అరతులు మొదలగునవి చేతబట్టి బయలుదేరెను. భేరులు, వాద్యములు, శంఖములు, చాలవిలువగల వేషములతో స్త్రీలు, వందులు, మాగధులు, మంగళవాద్యములు, పణవములు, జయవాద్యముల వారు మహాబలుడైన విరాటుని పురమునుండి అంతులేని శక్తిగల కుమారునికి ఎదురేగిరి.

ప్రస్థాప్య సేనాం కన్యాశ్చ గణికాశ్చ స్వలంకృతాః,
మత్స్యరాజో మహాప్రాజ్ఞః ప్రహృష్ట ఇద మబ్రవీత్. 29

ఇట్లు సేనను, కన్యలను, చక్కని వేషముగల వేశ్యలను తరలించి మహాప్రాజ్ఞుడగు మత్స్యరాజు మిక్కిలి సంతోషముతో ఇట్లు పలికెను.

అక్షా నాహర సైరంధ్రి కఙ్కం ద్యూతం ప్రవర్తతామ్,
తం తథా వాదినం దృష్ట్వా పాణ్డవః ప్రత్యభాషత. 30

ఓ సైరంధ్రీ! పాచికలు కొనిరా! కంకభట్టూ! ద్యూతమాడుదము! అని ఇట్లు పలుకుచున్న ఆతనితో పాండవుడిట్లు పలికెను.

న దేవితవ్యం హృష్టేన కితవే నేతి నః శ్రుతమ్,
తం త్వా మద్య ముదాయుక్తం నాహం దేవితు ముత్సహే,
ప్రియం తు తే చికీర్షామి వర్తతాం యది మన్యసే. 31

సంతోషములోనున్న జూదగానితో జూదమాడరాదని వినియుంటిమి. నీ విపుడు చాల సంతోషములో నున్నావు. నీతో జూదమాడజాలను, అయినను నీకు ప్రియము చేయగోరుదును, నీవు కావలెనన్నచో కానిమ్ము.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

స్త్రియో గావో హిరణ్యం చ యచ్చాన్యద్ వసు కించన,
న మే కించిత్ త్వయా రక్ష్య మన్తరే ణాపి దేవితుమ్. ౩౨

స్త్రీలు, గోవులు, బంగారము మఱియేధనమైనను జూద మాడకపోయినను, నీనుండి నేను రక్షింపదగినది ఇసుమంతయు లేదు.

కఙ్క ఉవాచ - కంకభట్టిట్లనెను.

కిం తే ద్యూతేన రాజేన్ద్ర బహుదోషేణ మానద,
దేవనే బహవో దోషా స్తస్మాత్ తత్ పరివర్జయేత్. ౩౩

ఓ మహారాజా! చాలకీడులుగల ఈ ద్యూతము నీకేల! ద్యూతమునందు అనేకదోషములు కలవు. కావున దానిని విడువ వలయును.

శ్రుత స్తే యది వా దృష్టః పాణ్డవేయో యుధిష్ఠిరః,
స రాష్ట్రం సుమహత్ స్ఫీతం భ్రాతౄంశ్చ త్రిదశోపమాన్,
రాజ్యం హారితవాన్ సర్వం తస్మాద్ ద్యూతం న రోచయే. ౩౪

పాండురాజు కుమారుడు యుధిష్ఠిరుని నీవు వినియో, కనియో యుందువు. అతడు విశాలమగుధనముతో నిండిన రాజ్యమును, దేవతలవంటి తమ్ములను ద్యూతమున కోల్పోయెను. కావున ద్యూతము నిష్టపడను.

[నిఃసంశయం స కితవః పశ్చాత్ తప్యతి పాణ్డవః,
వివిధానాం చ రత్నానాం ధనానాం చ పరాజయే.

ఆ జూదరి అగు పాండవుడు అనేకములగు రత్నములను ధన ములను ఓడి పిమ్మట తప్పక వేదన పడియుండును.

అస్మిన్ క్షతివినాశశ్చ వాక్పారుష్య మనన్తరమ్,
అవిశ్వాస్యం బుధై ర్నిత్య మేకాహ్నా ద్రవ్యనాశనమ్.

౩౨. అన్తరేణాపి - జూదమాడకున్నను,

ఇందులో రాజ్యము పోవును. మాట పరువ మగును. పండి తుల విశ్వాసము నశించును. ఒక్కరోజులో ద్రవ్యమంతయు నాశన మగును.]

అథవా మన్యసే రాజన్ దీవ్యామ యది రోచతే. 35

అయినను ఓరాజా! నీవు తలచినచో, నీకు ఇష్టమైనచో ఆడుదము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ప్రవర్తమానే ద్యూతే తు మత్స్యః పాణ్డవ మబ్రవీత్,
పశ్య పుత్రేణ మే యుద్ధే తాదృశాః కురవో జితాః. 36

జూదము సాగుచుండగా విరాటుడు ధర్మరాజుతో 'చూడు! నాకొడుకుచేత యుద్ధమున అటువంటి కౌరవు లోడిరి' అని పలికెను.

తతో ఽబ్రవీ న్మహాత్మా స ఏనం రాజా యుధిష్ఠిరః,
బృహన్నలా యస్య యన్తా కథం స న జయేద్ యుధి. 37

అపుడు మహాత్ముడు యుధిష్ఠిరమహారాజు ఆతనితో 'బృహన్నల సారథియైనచో యుద్ధమున గెలువకుండుట యెట్లు?' అని పలికెను.

ఇత్యుక్తః కుపితో రాజా మత్స్యః పాణ్డవ మబ్రవీత్,
సమం పుత్రేణ మే షణ్డం బ్రహ్మబంధో! ప్రశంససి. 38

అత డట్లు పలుకగా విరాటరాజు కోపించి ధర్మరాజుతో 'ఓరీ బ్రాహ్మణాధమా! నాకొడుకుతోపాటు ఆనపుంసకుని పొగడద వేల!' అనెను.

వాచ్యావాచ్యం న జానీషే నూనం మా మవమన్యసే,
భీష్మద్రోణముఖాన్ సర్వాన్ కస్మా న్న స విజేష్యతి. 39

ఏమాట పలుకవగునో, ఏది పలుకరాదో యెఱుఁగవు. నీవు నిక్కముగా నన్నవమానించుచున్నావు. ఏమీ! నాకొడుకు భీష్ముడు, ద్రోణుడు మున్నగుగొప్పవారి నేల గెలువడు!

వయస్యత్వాత్ తే బ్రహ్మ న్నపరాధ మిమం క్షమే,
నేదృశం తు పున ర్వాచ్యం యది జీవితు మిచ్ఛసి. 40

నీవు సఖుడవు కనుక ఓ బ్రాహ్మణుడా! ఈతప్పు కాచితిని. బ్రదుకఁగోరినచో మరల ఇట్టిపాడుమాట పలుకకు.

యుధిష్ఠిర ఉవాచ - ధర్మరా జిట్లు పలికెను.

యత్ర ద్రోణ స్తథా భీష్మో ద్రౌణి ర్వైకర్తనః కృపః,
దుర్యోధన శ్చ రాజేన్ద్ర స్తథాన్యే చ మహారథాః. 41

మరుద్గణైః పరివృతః సాక్షాదపి మరుత్పతిః,
కో౽న్యో బృహన్నలాయా స్తాన్ ప్రతియుధ్యేత సంగతాన్. 42

ఎచట ద్రోణుడు, మఱియు భీష్ముడు, అశ్వత్థామ, కర్ణుడు, కృపుడు, రాజేంద్రుడగు దుర్యోధనుడు ఇంకను ఇతరమహారథులు కూడివచ్చిరో అట్టివారితో యుద్ధమాడుటకు దేవతలందరితో కూడివచ్చిన సాక్షాత్తు దేవేంద్రుడు కూడ చాలడు. అట్టియెడ బృహన్నలకు కాక మఱియొకని కది సాధ్యమా!

యస్య బాహుబలే తుల్యో న భూతో న భవిష్యతి,
అతీవ సమరం దృష్ట్వా హర్షో యస్యోపజాయతే. 43

యో౽జయత్ సంగతాన్ సర్వాన్ ససురాసురమానవాన్,
తాదృశేన సహాయేన కస్మాత్ స న విజేష్యతే. 44

బాహుబలములో అతనితో సాటియైనవాడు మునుపు లేడు. ముందు ఉండడు. యుద్ధము పెరుగుచున్నకొలది అతనికి హర్షము మిక్కుటమగుచుండును. అతడు మునుపు దేవతలు, రాక్షసులు,

మానవులు కలిసిపోరగా వారిని గెలిచెను. అట్టివాడు సహాయుడై యుండగా నీపుత్రుడు ఏల గెలువడు ?

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

బహుశః ప్రతిషిద్ధోఽసి న చ వాచం నియచ్ఛసి, 45
నియన్తా చేన్న విద్యేత న కశ్చి ద్ధర్మ మాచరేత్.

ఎన్నిమారులు వలదన్నను నోరుమూయవు. నియమించువాడు లేనిచో ధర్మము నెవ్వడు చేయును ?

వైశమ్పాయన ఉవాచ- వైశంపాయను డిట్లు చెప్పెను.

తతః ప్రకుపితో రాజా తమక్షే ణాహనద్ భృశమ్, 46
ముఖే యుధిష్ఠిరం కోపా న్నైవ మిత్యేవ భర్త్సయన్.

అంతట రాజు మిక్కిలి కోపముతో మరల ఇట్లు పలుకకు మని బెదిరించుచు పాచికతో ధర్మరాజుముఖమున గట్టిగా కొట్టెను.

బలవత్ ప్రతివిద్ధస్య నస్తః శోణిత మావహత్, 47
తదప్రాప్తం మహీం పార్థః పాణిభ్యాం ప్రత్యగృహ్ణాత.

అట్లు బలముగా కొట్టగా ఆతనిముక్కునుండి నెత్తురోడెను. అది నేలపై పడకుండ ధర్మరాజు చేతులతో గట్టిగా నొక్కిపట్టెను.

అవైక్షత స ధర్మాత్మా ద్రౌపదీం పార్శ్వతః స్థితామ్.

ఆ ధర్మాత్ముడు ప్రక్కనున్న ద్రౌపదివైపు చూచెను.

సా జ్ఞాత్వా తమభిప్రాయం భర్తు శ్చిత్తవశానుగా, 48
పాత్రం గృహీత్వా సౌవర్ణం జలపూర్ణ మనిన్దితా,
తచ్ఛోణితం ప్రత్యగృహ్ణాద్ యత్ ప్రసుస్రావ నస్తతః. 49

---

46. నైవమ్ - నైవం వాచ్యమితి - మరల ఇట్లు పలుకకుమని
47. నస్తః - నాసికనుండి
49. నస్తతః - తత్ - శబ్దమునకు నాదియని యర్థము. తనోతి దేహమ్ - అని వ్యుత్పత్తి - దేహమును వ్యాపించి యుండునది అని అర్థము - కావున నస్తతః - అనగా ముక్కునాడినుండి యని యర్థము.

దోషములుఁగనిది, భర్తచిత్తము ననుసరించి ప్రవర్తించు నదియు అగు ఆమె అతని ఇంగిత మెఱిగి నీటితో నిండిన బంగారు పాత్రను కొనివచ్చి ముక్కునాడులనుండి కారిన రక్తమును తుడిచెను.

అథోత్తరః శుభై ర్గన్ధై ర్మాల్యైశ్చ వివిధై స్తథా,
అవకీర్యమాణ స్సంహృష్టో నగరం స్వైరమాగతః. 50

అంత శుభములైన గంధములు, వివిధములగు మాలలు పైబడుచుండగా మిక్కిలి సంతోషముతో నున్న ఉత్తరుడు స్వేచ్ఛగా నగరములోనికి వచ్చెను.

సభాజ్యమానః పౌరైశ్చ స్త్రీభి ర్జానపదై స్తథా,
ఆసాద్య భవనద్వారం పిత్రే సమ్ప్రత్యవేదయత్. 51

పౌరులు, స్త్రీలు, గ్రామవాసులు కొనియాడుచుండగా భవన ద్వారముకడకు వచ్చి తండ్రికి తనరాక తెలుపుకొనెను.

తతో ద్వాఃస్థః ప్రవిశ్యైవ విరాట మిద మబ్రవీత్,
బృహన్నలాసహాయశ్చ పుత్రో ద్వార్యుత్తరః స్థితః. 52

అంత ద్వారపాలకులు ప్రవేశించి విరాటునితో 'ఉత్తరుడు బృహన్నలతోకూడి ద్వారముకడ నున్నాడని' పలికిరి.

తతో హృష్టో మత్స్యరాజః క్షత్తార మిద మబ్రవీత్,
ప్రవేశ్యతా ముభౌ తూర్ణం దర్శనేప్సు రహం తయోః. 53

సంతోషముతో ఉప్పొంగిన మత్స్యరాజు ద్వారపాలకునితో 'వారిరువురను వెంటనే ప్రవేశపెట్టుము. నేను వారిని చూడగోరు చున్నాను' అని పలికెను.

క్షత్త్రార్థం కురురాజస్య శనైః కర్ణే ఉపాజపత్,
ఉత్తరః ప్రవిశత్వేకో న ప్రవేశ్యా బృహన్నలా. 54

ధర్మరాజు మెల్లగా ద్వారపాలకునిచెవిలో రహస్యముగా ఇట్లు చెప్పెను. 'ఓయీ! ఉత్తరు నొక్కనినే లోపలకు రానిమ్ము. బృహన్నలను ప్రవేశపెట్టకుము.'

ఏతస్య హి మహాబాహో వ్రత మేతత్ సమాహితమ్,
యో మమాఙ్గే వ్రణం కుర్యా చ్ఛోణితం వాపి దర్శయేత్, 55
అన్యత్ర సంగ్రామగతా న్న స జీవేత్ కథంచన.

ఓ మహాబాహూ! ఇతని కొకవ్రతము కలదు. ఎవడైన నా మేన గాయము చేసినా? రక్తము చూపినా? యుద్ధమున కాక తక్కినచోట అట్టివాడు ఎన్నడును జీవింపడు.

న మృష్యాద్ భృశసంక్రుద్ధో మాం దృష్ట్వా తు సశోణితమ్,
విరాట మిహ సామాత్యం హన్యాత్ సబలవాహనమ్. 56

నెత్తురోడిన నన్ను చూచి మిక్కిలి క్రోధము నొంది నిగ్రహించుకొనజాలడు. మంత్రులతో, సేనతో, వాహనములతో పాటు విరాటుని చంపును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను
తతో రాజ్ఞః సుతో జ్యేష్ఠః ప్రావిశత్ పృథివీంజయః, 57
సోఽభివాద్య పితుః పాదౌ కఙ్కం చాప్యుపతిష్ఠత.

అంత రాజు పెద్దకొడుకు భూమింజయుడు ప్రవేశించెను. రాజు పాదములకు ప్రణమిల్లెను. కంకభట్టును కూడ సేవించెను.

తతో రుధిరసంయుక్త మనేకాగ్ర మనాగసమ్,
భూమా వాసీన మేకాన్తే సైరన్ధ్ర్యా ప్రత్యుపస్థితమ్. 58

అంత నెత్తురు కారుచుండగా చీకాకుతో సైరంధ్రి సేవలు గొనుచు భూమిపై నొంటరిగా కూర్చున్న పుణ్యాత్ముని ధర్మరాజును చూచెను.

తతః పప్రచ్ఛ పితరం త్వరమాణ ఇవోత్తరః,
కేనాయం తాడితో రాజన్ కేన పాప మిదం కృతమ్. 59

అపుడు మిగుల ఆవేగముతో ఉత్తరుడు తండ్రిని 'రాజా! ఈయనను కొట్టిన దెవరు? ఆపాప మొడిగట్టిన దెవరు?' అని పలికెను.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

మయాయం తాడితో జిహ్మో న చాప్యేతావ దర్హతి,
ప్రశస్యమానే యచ్ఛూరే త్వయి షణ్ఢం ప్రశంసతి. 60

ఈ కుటిలుని నేనే కొట్టితిని. ఇంతమాత్రముతో చాలదు. శూరుడవయిన నిన్ను నేను కొనియాడుచుండగా ఇత డాపేడిని పొగడును.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

అకార్యం తే కృతం రాజన క్షిప్ర మేవ ప్రసాద్యతామ్,
మా త్వాం బ్రహ్మవిషం ఘోరం సమూల మిహ నిర్దహేత్. 61

రాజా! మీరు కానిపని చేసితిరి. వెంటనే వారిని ప్రసన్నులను చేసికొనుడు. ఘోరమైన బ్రహ్మవిషము మిమ్ము సమూలముగా కాల్చకుండుగాక.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

స పుత్రస్య వచః శ్రుత్వా విరాటో రాష్ట్రవర్ధనః,
క్షమయామాస కౌన్తేయం భస్మచ్ఛన్న మివానలమ్. 62

రాష్ట్రవర్ధనుడైన విరాటుడు కొడుకుమాట విని, నివురుగప్పిన నిప్పువలె నున్న ధర్మరాజును శాంతింపజేసెను.

క్షమయన్తం తు రాజానం పాణ్డవః ప్రత్యభాషత,
చిరం క్షాన్త మిదం రాజన్ న మన్యు ర్విద్యతే మమ. ౬౩

అట్లు అనునయించుచున్న రాజును గాంచి ధర్మరాజు ఇట్లు పలికెను. ఓ రాజా ! కోప మెప్పుడో పోయినది. నా కది యిప్పుడు లేదు.

యది హ్యేతత్ పతేద్ భూమౌ రుధిరం మమ నస్తతః,
సరాష్ట్ర స్త్వం మహారాజ ! వినశ్యేథా న సంశయః. ౬౪

ఓ మహారాజా ! ఈ నా రక్తము ముక్కునాళికలనుండి భూమిపై పడినచో నీవు, నీ రాష్ట్రము నశింపక తప్పదు. ఇందు సంశయములేదు.

న దూషయామి తే రాజన్ ! యద్ వై హన్యా దదూషకమ్,
బలవ న్తం ప్రభుం రాజన్ ! క్షిప్రం దారుణ మాప్నుయాత్. ౬౫

దోషము చేయని వానినికొట్టుట అను నీపనిని నేను నిందింపను, ఏలయన ఓ రాజా ! బలవంతుడైన ప్రభువును ఇట్టి దారుణములు చేరుచునే యుండును.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను

శోణితే తు వ్యతిక్రాన్తే ప్రవివేశ బృహన్నడా,
అభివాద్య విరాటం తు కఙ్కం చాప్యుపతిష్ఠత. ౬౬

ఆ నెత్తురు ఆగినపిమ్మట బృహన్నల ప్రవేశించెను. విరాటునికి నమస్కరించి కంకునికి కూడ ప్రణమిల్లెను.

---

౬౫. నీవు చేసినపని నిందింపదగినదే అయినను నేను నిందింపను. ఏలయన బలవంతుడైన ప్రభువు ఇట్టి క్రూరకర్మములు చేయుచునే యుందురు. "హృష్టో దృప్యతి దృప్తో ధర్మ మతిక్రామతి" అని స్మృతి [illegible] వల్లరాని సంతోషము కలిగినపుడు నరుడు గర్వించును, గర్వించినవాడు ధర్మమును మీరును. - అని భావము.

క్షమయిత్వా తు కౌరవ్యం రణా దుత్తర మాగతమ్,
ప్రశశంస తతో మత్స్యః శృణ్వతః సవ్యసాచినః. 67

ధర్మరాజును ప్రసన్నుని చేసికొని మత్స్యరాజు యుద్ధము నుండి వచ్చిన ఉత్తరుని, అర్జునుడు వినుచుండగా పొగిడెను.

త్వయా దాయాదవా నస్మి కైకేయానన్దివర్ధన,
త్వయా మే సదృశః పుత్రో న భూతో న భవిష్యతి. 68

నాయనా! నీవలన నేను పుత్రవంతుడ నైతిని. సుదేష్ణ ఆనందమును పెంచువాడవు. నాకు నీతో సాటియగు కొడుకు మునుపు లేడు; ముందు కలుగడు.

పదం పదసహస్రేణ య శ్చరన్ నాపరాధ్నుయాత్,
తేన కర్ణేన తే తాత కథ మాసీత్ సమాగమః. 69

బాణములుపడు స్థానమున సంచరించుచు వేయిలక్ష్యముల నైనను తప్పని కర్ణునితో, నాయనా! నీ కెట్లు యుద్ధము జరిగెను ?

మనుష్యలోకే సకలే యస్య తుల్యో న విద్యతే,
తేన భీష్మేణ తే తాత! కథ మాసీత్ సమాగమః. 70

మానవలోకము మొత్తముమీద సాటిలేనివాడు. అట్టి భీష్ముని తో ఎట్లు పోరితివి?

ఆచార్యో వృష్ణివీరాణాం కౌరవాణాం చ యో ద్విజః,
సర్వక్షత్రస్య చాచార్యః సర్వశస్త్రభృతాం వరః,
తేన ద్రోణేన తే తాత! కథ మాసీత్ సమాగమః. 71

69. పదమ్ - బాణముపడుచోటు, పదసహస్రేణ - వేయి లక్ష్యములకొఱకు- వేయి గురులు కొట్టుట కనిభావము. చరన్ - బాణములతో తిరుగుచు, న అపరాధ్నుయాత్ - ఒక్కస్థానముగూడ వ్యర్థము చేయడు. వేయి లక్ష్యముల నొక్కమారు కొట్టగలడని తాత్పర్యము, సమాగమః - సంగ్రామము.

ఆ ద్రోణుడు వృష్ణివంశమువారికి, కురువంశమువారికి గురువు. క్షత్రియులందరకు ఆచార్యుడు. ఆయుధధారులందరిలో మిన్న. అట్టి వానితో పోరాట మెట్లు జరిగెను ?

ఆచార్యపుత్రో యః శూరః సర్వశస్త్రభృతా మపి,
అశ్వత్థా మేతి విఖ్యాత స్తే నాసీత్ సంగరః కథమ్. 72

ఆచార్యునిపుత్రుడు, శస్త్రముపట్టినవారిలో శూరుడు, అశ్వత్థామ యని పేర్గన్నవాడు-అతనితో యుద్ధ మెట్లు జరిగినది ?

రణే యం ప్రేక్ష్య సీదన్తి హృతస్వా వణిజో యథా,
కృపేణ తేన తే తాత ! కథ మాసీత్ సమాగమః. 73

ఎవనిని చూచి సొమ్మంతయు కోల్పోయిన వర్తకులవలె శూరులు వణకిపోవుదురో అట్టికృపునితో ఎట్లు పోరితివి ?

పర్వతం యోఽభివిధ్యేత రాజపుత్రో మహేషుభిః,
దుర్యోధనేన తే తాత కథ మాసీత్ సమాగమః. 74

రాజపుత్రుడగు దుర్యోధనుడు గొప్ప బాణములతో కొండలను కూడ పిండిచేయును. నాయనా ! అట్టివానితో ఎట్లు పోరితివి ?

అవగాఢా ద్విషన్తో మే సుఖో వాతోఽభివాతి మామ్,
య స్త్వం ధన మథాజైషీః కురుభి ర్గ్రస్త మాహవే. 75

నీవు కౌరవులు అపహరించిన ధనమును యుద్ధమున తిరిగి సాధించితివి. నా శత్రువులు పరాభవము పొందిరి. నాకు సుఖమైన గాలి వీచుచున్నది.

తేషాం భయాభిపన్నానాం సర్వేషాం బలశాలినామ్,
నూనం ప్రకాల్య తాన్ సర్వాం స్త్వయా యుధి నరర్షభ !,
ఆచ్ఛిన్నం గోధనం సర్వం శార్దూలే నామిషం యథా. 76

---

73. హృతస్వాః - దొంగిలింపబడిన సొమ్ముకలవారు.
75. అవగాఢాః - పరాభవము పొందిరి
76. ప్రకాల్య - ఓడించి,

గొప్పబలముగలవారి నందరిని భయపెట్టి, యుద్ధమున ఓడించి, పెద్దపులి మాంసమును తెచ్చినట్లు గోధనమును ఒడిచి తెచ్చితివి.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి విరాటోత్తర సంవాదే అష్టషష్టితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున విరాటోత్తరుల సంవాదమను అరువది ఎనిమిదవ అధ్యాయము.

## ఏకోనసప్తతితమోఽధ్యాయః – అరువది తొమ్మిదవ అధ్యాయము

విజయవిషయే విరాటోత్తరయో ర్వార్తాలాపః.

విజయవిషయమున విరాటోత్తరుల సంభాషణము.

ఉత్తర ఉవాచ – ఉత్తరు డిట్లు పలికెను.

న మయా నిర్జితా గావో న మయా నిర్జితాః పరే,
కృతం తత్ సకలం తేన దేవపుత్రేణ కేనచిత్. 1

గోవులను సాధించినది నేనుకాదు. శత్రువుల నోడించినది నేను కాదు. అది యంతయు నొకానొక దేవపుత్రుడు చేసిన ఘనకార్యము.

స హి భీతం ద్రవన్తం మాం దేవపుత్రో వ్యవర్తయత్,
స చాతిష్ఠద్ రథోపస్థే వజ్రసంహననో యువా. 2

భయపడి పారిపోవుచున్న నన్నా దేవపుత్రుడు మరలించెను. వజ్రమువంటి దేహము గల ఆయువకుడే రథమున నిలిచియుండెను.

తేన తా నిర్జితా గావః కురవశ్చ పరాజితాః,
తస్య తత్ కర్మ వీరస్య న మయా తాత! తత్ కృతమ్. 3

గోవులను మరలించినది ఆతడు, కౌరవుల నోడించినది యాతడు. అది యంతయు ఆవీరుని పని. తండ్రీ! నేను చేసినది కాదు.

స హి శారద్వతం ద్రోణం ద్రోణపుత్రం చ షడ్రథాన్,
సూతపుత్రం చ భీష్మం చ చకార విముఖా (న్) శరైః. 4

కృపుని, ద్రోణుని, ద్రోణపుత్రుని, ఆరుగురు రథికవరులను, సూతపుత్రుడగు కర్ణుని, భీష్ముని అతడు గదా బాణములతో విముఖులను చేసెను !

దుర్యోధనం వికర్ణంచ సనాగమివ యూథపమ్,
ప్రభగ్న మబ్రవీద్ భీతం రాజపుత్రం మహాబలః. 5

ఏనుగులగుంపుతో కూడిన ఏనుగురాజునువలె దుర్యోధనుని, వికర్ణుని చిదుకగొట్టి ఆమహాబలుడు భయపడిన రాజపుత్రునితో నిట్లనెను.

న హాస్తినపురే త్రాణం తవ పశ్యామి కించన,
వ్యాయామేన పరీప్సస్వ జీవితం కౌరవాత్మజ. 6

ఓరీ కౌరవకుమారా ! నీకు హస్తినాపురములో కొంచెము కూడ రక్షణము లేదు. దేశముల ద్రిమ్మరుచు జీవితమును కాపాడుకొనుము.

న మోక్ష్యసే పలాయం స్త్వం రాజన్ యుద్ధే మనః కురు,
పృథివీం భోక్ష్యసే జిత్వా హతో వా స్వర్గ మాప్స్యసి. 7

ఓరాజా ! పారిపచో నీకు ముక్తి లేదు. కావున యుద్ధమున మనసు పెట్టుము. గెలుతువో భూమి ననుభవింతువు. చత్తువో స్వర్గమును పొందుదువు.

స నివృత్తో నరవ్యాఘ్రో ముఞ్చన్ వజ్రనిభా ఞ్ఛరాన్,
సచివైః సంవృతో రాజా రథే నాగ ఇవ శ్వసన్. 8

---

5. రాజపుత్రమ్ - దుర్యోధనుని
6. వ్యాయామేన - నిత్యము వేఱుదేశములందు తిరుగుటచేత,

ఆ నరశ్రేష్ఠుడు మంత్రులతో కూడి రథమున పామువలె రోజుచు వజ్రమువంటి బాణముల గుప్పించుచు మరలెను.

తం దృష్ట్వా రోమహర్షోఽభూ దురుకమ్పశ్చ మారిష,
స తత్ర సింహసంకాశ మనీకం వ్యధమ చ్ఛరైః. 9

వానిని చూచినంత వారు ఒడలు గగుర్పొడిచెను. దేహము కంపిల్లెను. అందు ఆతడు సింహమువలె నున్న సేనను బాధించెను.

తత్ ప్రణుద్య రథానీకం సింహసంహననో యువా,
కురూం స్తాన్ ప్రహసన్ రాజన్ ! సంస్థితాన్ హృతవాససః. 10

ఆ సింహమువంటి బలముగల యువకుడు ఆకౌరవుల నందరిని బాగుగా, పీడించి, నవ్వుచు, పడియున్న వారి వస్త్రముల నపహరించెను.

ఏకేన తేన వీరేణ షడ్ రథాః పరినిర్జితాః,
శార్దూలే నేవ మత్తేన యథా వనచరా మృగాః. 11

ఆ ఒక్కవీరుడు ఆరుగురు రథికవరులను, మదించిన బెబ్బులి అడవిలో తిరుగు మృగములను వలె పూర్తిగా ఓడించెను.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

క్వ స వీరో మహాబాహు ర్దేవపుత్రో మహాయశాః,
యో మే ధన మథాజైషీత్ కురుభి ర్గ్రస్త మాహవే. 12

కౌరవులు వశముగానించుకొన్న నాగోధనమును మరల సాధించిన ఆమహాబాహువు, ఆమహాయశస్వి, ఆ దేవపుత్రుడు. ఆ వీరుడు ఎక్కడ !

ఇచ్ఛామి త మహం ద్రష్టు మర్చితుం చ మహాబలమ్,
యేన మే త్వం చ గావశ్చ రక్షితా దేవసూనునా. 13

నిన్ను, గోవులను రక్షించిన ఆదేవపుత్రుని చూడగోరుదును ఆమహాబలుని పూజింపగోరుదును.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

అన్తర్ధానం గత స్తత్ర దేవపుత్రో మహాబలః,
స తు శ్వో వా పరశ్వో వా మన్యే ప్రాదుర్భవిష్యతి. 14

ఆ మహాబలముగల దేవపుత్రుడు అక్కడికక్కడ అంతర్ధానము చెందెను రేపో, ఆమరునాడో మరల అవతరించునని నా ఊహ.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవ మాఖ్యాయమానం తు ఛన్నం సత్రేణ పాణ్డవమ్,
వస న్తం తత్ర నాజ్ఞాసీద్ విరాటో వాహినీపతిః. 15

పెద్ద సేనలుగల విరాటుడు ఇట్లు చెప్పబడుచున్నవానిని, నెపముతో మరుగుపడియున్న పాండవుని, అచటనే ఉన్నవానిని ఎఱుంగడాయెను.

తతః పార్థోఽభ్యనుజ్ఞాతో విరాటేన మహాత్మనా,
ప్రదదౌ తాని వాసాంసి విరాటదుహితుః స్వయమ్. 16

అంత అర్జునుడు మహాత్ముడగు విరాటునియొద్ద అనుమతిగొని ఆ వస్త్రములను స్వయముగా విరాటుని పుత్రిక కొసగెను.

ఉత్తరా తు మహార్హాణి వివిధాని నవాని చ,
ప్రతిగృహ్యాభవత్ ప్రీతా తాని వాసాంసి భామినీ. 17

మిక్కిలి వెలగల, వివిధములైన ఆవస్త్రములను, గ్రహించి ఉత్తర ఎంతో ప్రీతురాలాయెను.

మన్త్రయిత్వా తు కౌన్తేయ ఉత్తరేణ మహాత్మనా,
ఇతి కర్తవ్యతాం సర్వాం రాజన్ పార్థే యుధిష్ఠిరే, 18
తత స్తథా తత్ వ్యవధాద్ యథావత్ పురుషర్షభ.

15. సత్రేణ - వ్యాజముతో.

ఓ రాజేంద్రా! అర్జునుడు ధర్మరాజు విషయమున చేయదగిన పనినంతటిని మహాత్ముఁడగు ఉత్తరునితో సంప్రదించి దాని నంతయు నట్లే ఆచరించెను.

సహపుత్రేణ మత్స్యస్య ప్రహృష్టా భరతర్షభాః. 19

ఆ భరతవరేణ్యు లందఱు విరాటుని పుత్రునితోపాటు మిక్కిలి ఆనందము నొందిరి.

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి గోహరణపర్వణి విరాటోత్తర సంవాదే ఏకోన సప్తతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున గోహరణపర్వమున విరాటోత్తర సంవాదమున అరువదిత్తొమ్మిదవ అధ్యాయము.

సమాప్తం గోహరణపర్వ - గోహరణ పర్వము సమాప్తము.

ఓమ్

# శ్రీ మన్మహాభారతమ్

## వైవాహికపర్వ - వైవాహికపర్వము

### సప్తతితమోఽధ్యాయః - డెబ్బదియవ అధ్యాయము

అర్జునేన విరాటం ప్రతి యుధిష్ఠిరస్య పరిచయదానమ్.

అర్జునుడు విరాటునకు యుధిష్ఠిరుని పరిచయము చేయుట.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తత స్తృతీయే దివసే భ్రాతరః పఞ్చ పాణ్డవాః,
స్నాతాః శుక్లాంబరధరాః సమయే చరితవ్రతాః. 1

యుధిష్ఠిరం పురస్కృత్య సర్వాభరణభూషితాః,
ద్వారి మత్తా యథా నాగా భ్రాజమానా మహారథాః. 2

విరాటస్య సభాం గత్వా భూమిపాలాసనే ష్వథ,
నిషేదుః పావకప్రఖ్యాః సర్వే ధిష్ణ్యేష్వి వాగ్నయః. 3

అంత మూడవదినమున పాండవసోదరు లైదుగురు స్నానములు చేసి, తెల్లనివస్త్రములు ధరించి, సమయమున చేయవలసిన పనులు చేసి, అన్ని ఆభరణములతో అలంకరించుకొని ద్వారమున నున్న మదించిన ఏనుగులవలె, మహారథు లై విరాజిల్లుచు, అగ్నివంటి

---

3. ధిష్ణ్యేషు - అగ్నిశాలలయందు.

తేజస్సుతో అగ్నిశాలలలో నున్న అగ్నులవలె వెలుగొందుచు ధర్మరాజును ముందిడుకొని విరాటుని సభ కరిగి రాజాసనముల యందు కూర్చుండిరి.

తేషు తత్రోపవిష్టేషు విరాటః పృథివీపతిః,
ఆజగామ సభాం కర్తుం రాజకార్యాణి సర్వశః. 4

వారచట కూర్చుండియుండగా రాజైన విరాటుడు రాజకార్యములను నిర్వహించుటకు సభకు వచ్చెను.

శ్రీమతః పాణ్డవాన్ దృష్ట్వా జ్వలతః పావకానివ,
ముహూర్తమివ చ ధ్యాత్వా సరోషః పృథివీపతిః, 5
అథ మత్స్యోఽబ్రవీత్ కఙ్కం దేవరూపమివ స్థితమ్,
మరుద్గణై రుపాసీనం త్రిదశానామివేశ్వరమ్. 6

విరాటరాజు జ్వాలలుగల అగ్నులవలె నున్న శ్రీమంతులగు పాండవులను చూచి క్షణకాలము రిచ్చవడి రోషముతో దేవరూపముతో నున్నట్లున్నవాడును, దేవతల సముదాయము కొలువుతీరియుండగా కూర్చున్న దేవతాసార్వభౌమునివలె నున్నవాడును అగు కంకునితో ఇట్లనెను.

స కిలాక్షావాప[1] స్త్వం సభాస్తారో మయా వృతః,
అథ రాజాసనే కస్మా దుపవిష్ట స్త్వలంకృతః. 7

ఓయీ ! నీవు జూదగాడవు. నేను నిన్ను సభ్యునిగా నియమించితిని గదా ! చక్కగా అలంకరించుకొని రాజాసనమున కూర్చున్నావేమి !

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

పరిహాసేప్సయా వాక్యం విరాటస్య నిశమ్య తత్,
స్మయమానోఽర్జునో రాజ న్నిదం వచన మబ్రవీత్. 8

1. అక్షావాపః - పాచికలను ప్రయోగించువాడు - జూదరి.

ఓ రాజా! విరాటుని పలుకు విని అర్జునుడు కొంత ఎగతాళి ధోరణితో నవ్వుచు ఇట్లు పలికెను.

అర్జున ఉవాచ - అర్జును డిట్లు పలికెను.

ఇంద్రస్యాప్యర్ధాసనం రాజ న్నయ మారోఢు మర్హతి,
బ్రహ్మణ్యః శ్రుతవాం స్త్యాగీ యజ్ఞశీలో దృఢవ్రతః. 9

ఓ రాజా! బ్రహ్మము నెఱిగినవాడు, విద్యలన్నియు నేర్చినవాడు, త్యాగము కలవాడు, యజ్ఞములు చేయువాడు, దృఢమైన వ్రతము కలవాడు అగు ఈతడు ఇంద్రుని అర్ధాసన మెక్కుటకును యోగ్యుడు.

ఏష విగ్రహవాన్ ధర్మ ఏష వీర్యవతాం వరః,
ఏష బుద్ధ్యాధికో లోకే తపసాం చ పరాయణమ్. 10

ఈతడు ఆకారము ధరించిన ధర్మము. వీర్యవంతులలో శ్రేష్ఠుడు. లోకమున బుద్ధియం దధికుడు. తపస్సులకు నిధి.

ఏషోఽస్త్రం వివిధం వేత్తి త్రైలోక్యే సచరాచరే,
న చైవాన్యః పుమాన్ వేత్తి న వేత్స్యతి కదాచన. 11

స్థావరములతో, జంగమములతో నిండిన, మూడులోకము లందును గల వివిధములైన అస్త్రముల నీత డెఱుగును. మఱియొకడు అంతగా నెఱుంగడు. ఇటుపై ఎఱుగను బోడు.

న దేవా నాసురాః కేచి న్మనుష్యా న రాక్షసాః,
గన్ధర్వయక్షప్రవరాః సకిన్నరమహోరగాః. 12

అట్లు అస్త్రముల నెఱిగినవాడు దేవతలలో, అసురులలో, మనుష్యులలో, రాక్షసులలో, గంధర్వులలో, యక్షులలో, కిన్నరులలో, నాగులలో లేడు.

దీర్ఘదర్శీ మహాతేజాః పౌరజానపదప్రియః,
పాణ్డవానా మతిరథో యజ్ఞధర్మపరో వశీ. 18

ఈయన చాలముందుచూపుగలవాడు. గొప్పతేజస్సుగల వాడు. పురములందు, గ్రామములందు నున్న జనులకు ప్రియుడు. యజ్ఞమునందు, ధర్మమునందు శ్రద్ధగలవాడు. విగ్రహముగలవాడు. పాండవులలో అతిరథుడు.

మహర్షికల్పో రాజర్షిః సర్వలోకేషు విశ్రుతః,
బలవాన్ ధృతిమాన్ దక్షః సత్యవాదీ జితేన్ద్రియః,
ధనైశ్చ సంచయైశ్చైవ శక్రవైశ్రవణోపమః. 14

మహర్షులతో సాటియైన రాజర్షి. సర్వలోకములలో ప్రసిద్ధి గలవాడు. బలవంతుడు. ధైర్యము కలవాడు. సమర్థుడు. సత్యమునే పలుకువాడు. ఇంద్రియములను గెలిచినవాడు, ధనముల విషయమునను, వస్తువుల కూర్పులందును దేవేంద్రునకు, కుబేరునకు సాటియైనవాడు.

యథా మనుర్మహాతేజా లోకానాం పరిరక్షితా,
ఏవమేష మహాతేజాః ప్రజానుగ్రహకారకః. 15

అటు మనువెట్లు గొప్పతేజముతో లోకములను పరిరక్షించుచునో ఇటు ఈయన అట్లే గొప్పతేజము కలవాడై ప్రజల ననుగ్రహించుచుండును.

అయం కురూణా మృషభో ధర్మరాజో యుధిష్ఠిరః,
అస్య కీర్తిః స్థితా లోకే సూర్యస్యే వోద్యతః ప్రభా. 16

ఈయన కురువంశమున శ్రేష్ఠుడు. ధర్మరాజు. యుధిష్ఠిరుడు. ఉదయించుచున్న సూర్యునికాంతివలె ఈయన కీర్తి లోకమున నిలిచియున్నది.

సంసరన్తి దిశః సర్వా యశసోఽస్య ఇవాంశవః,
ఉదితస్యేవ సూర్యస్య తేజసోఽనుగభస్తయః. 17

ఉదయించిన సూర్యుని తేజస్సును వెంటనంటి కిరణములు సర్వదిక్కులను వ్యాపించినట్లు ఈతని యశస్సుయొక్క అంశములు సర్వదిక్కులకు ప్రసరించుచున్నవి.

ఏవం దశసహస్రాణి కుఞ్జరాణాం తరస్వినామ్,
అన్వయుః పృష్ఠతో రాజన్ యావ దధ్యావసత్ కురూన్. 18

కురుదేశమున నీతడు నెలకొని యున్నపుడు వేగముగల పదివేల ఏనుగులు ఈతని వెనుక అనుసరించుచుండెడివి.

త్రింశ దేవం సహస్రాణి రథాః కాఞ్చనమాలినః,
సదశ్వై రుపసంపన్నాః పృష్ఠతో௨నుయయు స్తదా. 19

మంచిగుఱ్ఱములు కట్టినవి, బంగారుమాలలు కలవి యగు ముప్పదివేల రథములు అప్పుడు ఈమహాత్ముని వెంట నడచెడివి.

ఏవ మష్టశతాః సూతాః సుమృష్టమణికుణ్డలాః,
అబ్రువన్ మాగధైః సార్ధం పురా శక్ర మి వర్షయః. 20

పూర్వము ఋషులు దేవేంద్రుని స్తోత్రముచేసినట్లు చక్కగా తీర్చిదిద్దిన కుండలములుగల ఎనిమిదివందలమంది వందిమాగధులు ఈతనికి స్తోత్రపాఠములు చేసిరి.

ఏవం నిత్య ముపాస న్త కురవః కింకరా యథా,
సర్వే చ రాజన్ రాజానో ధనేశ్వర మి వామరాః. 21

దేవతలు కుబేరుని సేవించినట్లు రాజులైన కురువంశము వారందరు ప్రతిదినము కింకరులవలె నీతనిని సేవించిరి.

ఏష సర్వాన్ మహీపాలాన్ కరదాన్ సమకారయత్,
వైశ్యా నివ మహాభాగో వివశాన్ స్వవశా నపి. 22

20. అబ్రువన్ - స్తుతించిరి

ఈ మహానుభావుడు భూపాలుర నందరను స్వతంత్రులైనప్పటికి తనవశము చేసికొని వైశ్యులనువలె కప్పము చెల్లించు వారినిగా చేయించెను.

అష్టాశీతి సహస్రాణి స్నాతకానాం మహాత్మనామ్,
ఉపజీవన్తి రాజాన మేనం సుచరితవ్రతమ్. 23

చక్కగా ఆచరించిన వ్రతముగల ఈరాజు నాశ్రయించి మహాత్ములైన పూర్ణవిద్యావంతులు ఎనుబదియెనిమిదివేలమంది బ్రదికెడివారు.

ఏష వృద్ధా ననాథాం శ్చ పఙ్గూ నన్ధాం శ్చ మానవాన్,
పుత్రవత్ పాలయామాస ప్రజాధర్మేణ వై విభుః. 24

ఈయన వృద్ధులను, దిక్కులేనివారిని, కుంటివారిని, గ్రుడ్డి వారిని తన సంతానమువలె ధర్మముతో పాలించెను.

ఏష ధర్మే దమే చైవ క్రోధే చాపి జితవ్రతః,
మహాప్రసాదో బ్రహ్మణ్యః సత్యవాదీ చ పార్థివః. 25

ఈ మహారాజు ధర్మమునందు, ఇంద్రియములను వశముచేసికొనుటయందు, క్రోధమునందు నిగ్రహమే వ్రతముగా గలవాడు. ఈతని అనుగ్రహము గొప్పది. బ్రహ్మణ్యుడు. సత్యవాది.

శీఘ్రం తాపేన చైతస్య తప్యతే స సుయోధనః,
సగణః సహ కర్ణేన సౌబలేనాపి వా విభుః. 26

ప్రభువైన సుయోధనుడు సోదరుల సముదాయముతో, కర్ణునితో, శకునితోపాటు ఈతని ప్రతాపమునకు తీవ్రముగా వేదన పడుచుండును.

---

26. శీఘ్రం - తీవ్రముగా

న శక్యాస్తే హ్యస్య గుణాః ప్రసంఖ్యాతుం నరేశ్వర,
ఏష ధర్మపరో నిత్య మానృశంస శ్చ పాణ్డవః. 27

ఓ నరేశ్వరా! ఈతని గుణములను పరిగణించుటకు శక్యము కాదు, ఈతడు ధర్మపరుడు, దయగలవాడు, ఈతడు పాండురాజు కుమారుడు.

ఏవం యుక్తో మహారాజః పాణ్డవః పార్థివర్షభః,
కథం నార్హతి రాజార్హ మాసనం పృథివీపతే! 28

ఓ రాజా! ఇట్టి యోగ్యుడు, మహారాజు, పాండురాజు తనయుడు, రాజులలో శ్రేష్ఠుడు అగు ఈతడు ఈ రాజయోగ్యమగు ఆసనమునకు ఎట్లు తగడు?

ఇతి శ్రీమహాభారతే విరాటపర్వణి వైవాహికపర్వణి పాణ్డవ
ప్రకాశే సప్తతితమోఽధ్యాయః.

ఇది శ్రీమహాభారతము విరాటపర్వమున వైవాహికపర్వమున
పాండవులు వెల్లడియగుట యను డెబ్బదియవ అధ్యాయము

## ఏకసప్తతితమోఽధ్యాయః - డెబ్బదియొకటవ అధ్యాయము

విరాటస్య అన్యపాణ్డవైః సహ పరిచయః, విరాటేన యుధిష్ఠిరాయ రాజ్యసమర్పణ మర్జునేన సహ ఉత్తరాయాః పరిణయస్య ప్రస్తావకరణం చ.

విరాటునకు ఇతర పాండవులతో పరిచయము, విరాటుడు యుధిష్ఠిరునకు రాజ్యము సమర్పించుట. అర్జునునితో ఉత్తర వివాహము గూర్చి ప్రసంగము చేయుట.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

యద్యేష రాజా కౌరవ్యః కున్తీపుత్రో యుధిష్ఠిరః,
కతమోఽస్యార్జునో భ్రాతా భీమ శ్చ కతమో బలీ. 1

ఈతడు కుంతికొడుకు, కౌరవవంశమువాడు అగు ధర్మరాజై నచో ఈతని తమ్ముడగు అర్జును డెవరు? బలవంతుడగు భీము డెవరు?

నకులః సహదేవో వా ద్రౌపదీ వా యశస్వినీ,
యదా ద్యూతజితాః పార్థా న ప్రాజ్ఞాయన్త తే క్వచిత్. ౩

నకులు డెక్కడ? సహదేవు డెక్కడ? ఆ పుణ్యవతి ద్రౌపది యెక్కడ? వారు జూదమున నోడి యెందుండిరో తెలియవచ్చుట లేదు.

అర్జున ఉవాచ - అర్జును డిట్లు చెప్పెను.

య ఏష వల్లవో బ్రూతే సూద స్తవ నరాధిప!,
ఏష భీమో మహారాజ! భీమవేగపరాక్రమః. ౪

ఓ మహారాజా! ఇదిగో వల్లవు డందురే వంటలవాడు, భయంకరమైన వేగము, పరాక్రమము గల ఈతడే భీముడు.

ఏష క్రోధవశాన్ హత్వా పర్వతే గన్ధమాదనే,
సౌగన్ధికాని దివ్యాని కృష్ణార్థే సముపాహరత్. ౫

ఈతడు గంధమాదన పర్వతమున క్రోధవశులను చంపి ద్రౌపదికొఱకు దివ్యములగు సౌగంధికపుష్పములను కొనివచ్చెను.

గన్ధర్వ ఏష వై హన్తా కీచకానాం దురాత్మనామ్,
వ్యాఘ్రా నృక్షాన్ వరాహాంశ్చ హతవాన్ స్త్రీపురే తవ. ౬

పాపబుద్ధిగల కీచకులను చంపిన గంధర్వుడు ఈతడే. ఈ నీ అంతఃపురమున పులులను, ఎలుగులను, అడవిపందులను చంపినవా డీతడే.

[హిడిమ్బం చ బకం చైవ కిర్మీరం చ జటాసురమ్,
హత్వా నిష్కణ్టకం చక్రే౽రణ్యం సర్వతః సుఖమ్.

హిడింబుని, బకుని, కిర్మీరుని, జటాసురుని చంపి అరణ్యము నంతటిని పీడలేనిదిగా సుఖమైనదిగా చేసెను.]

యా శ్చాసీ దశ్వబంధ స్తే నకులో౽యం పరంతపః,
గోసంఖ్య స్సహదేవ శ్చ మాద్రీపుత్రౌ మహారథౌ. 6

నీకడ గుఱ్ఱములకాపరిగా నుండెనే ఆ శత్రుమర్దనుడు నకులుడు. గోపాలకుడు సహదేవుడు. ఈ మహారథులిద్దఱు మాద్రి కొడుకులు.

శృఙ్గారవేషాభరణౌ రూపవన్తౌ యశస్వినౌ,
మహారథసహస్రాణాం సమర్థౌ భరతర్షభౌ. 7

చక్కని అందమైన వేషములు, ఆభరణములు కలవారు, రూపవంతులు, కీర్తిమంతులు, వేలకొలది మహారథులను నిలుపగల వారు. భరతవంశమున శ్రేష్ఠులు.

ఏషా పద్మపలాశాక్షీ సుమధ్యా చారుహాసినీ,
సైరంధ్రీ ద్రౌపదీ రాజన్ యస్యార్థే కీచకా హతాః. 8

ఇదిగో పద్మపు రేకులవంటి కనులు, సన్నని నడుము, అందమైన నవ్వు గల ఈ సైరంధ్రి ద్రౌపది. ఈమె నిమిత్తముననే కీచకులు చచ్చిరి.

అర్జునో౽హం మహారాజ వ్యక్తం తే శ్రోత్ర మాగతః,
భీమా దవరజః పార్థో యమాభ్యాం చాపి పూర్వజః. 9

ఓ మహారాజా! నేను అర్జునుడను. అంతయు నీకు స్పష్టముగా వినిపించితిని. భీమునకు తమ్ముడను. కవలల అన్నను, పృథాదేవి కుమారుడను,

ఉషితాః స్మ మహారాజ సుఖం తవ నివేశనే,
అజ్ఞాతవాస ముషితా గర్భవాస ఇవ ప్రజాః. 10

ఓ మహారాజా ! మేము మీయింట సుఖముగా నున్నాము. ప్రజలు తల్లికడుపున ఉన్నట్లు ఇక్కడ అజ్ఞాతముగా ఉన్నాము.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

యదార్జునేన తే వీరాః కథితాః పఞ్చపాణ్డవాః,
తదార్జునస్య వైరాటిః కథయామాస విక్రమమ్. 11

అర్జును డట్లు పాండవులను గూర్చి చెప్పిన పిదప ఉత్తరుడు అర్జునుని పరాక్రమమును వివరించెను.

పున రేవ చ తాన్ పార్థాన్ దర్శయామాస చోత్తరః. 12

మఱియు ఆ పాండవులను ఉత్తరుడు చూపెను.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

య ఏష జామ్బూనద శుద్ధగౌర -
తను ర్మహాన్ సింహ ఇవ ప్రవృద్ధః,
ప్రచండఘోణః పృథుదీర్ఘ నేత్ర
స్తామ్రాయతాక్షః కురురాజ ఏషః. 13

ఇదిగో బంగారమువలె పచ్చని పసిమిగల దేహముతో ఏపుగా పెరిగిన సింహమువలె ఎత్తైనముక్కు, మిక్కిలి విశాలములై, కొంచెము ఎరుపెక్కిన కనులుగల ఈ మహాత్ముడు కురురాజు.

అయం పున ర్మత్తగజేన్ద్రగామీ
ప్రతప్త చామీకర శుద్ధగౌరః,
పృథ్వాయతాంసో గురుదీర్ఘ బాహు
ర్వృకోదరః పశ్యత పశ్యతైనమ్. 14

మదించిన ఏనుగులతేనివడకవంటి నడక, బాగుగా కాలిన బంగారమువలె స్వచ్ఛమైన పసిమి గలదేహము, పెద్దది, వెడల్పుగా

13. ప్రచణ్డఘోణః - పెద్దముక్కు కలవాడు.

నున్నది యగు భుజము, బలమైన పొడవైన బాహువులు గల ఈయన వృకోదరుడగు భీముడు. చూడుడు.

యస్త్వేష పార్శ్వేఽస్య మహాధనుష్మాన్
శ్యామో యువా వారణయూథపోపమః,
సింహోన్నతాంసో గజరాజగామీ
పద్మాయతాక్షోఽర్జున ఏష వీరః. 16

ఆయన ప్రక్క నున్న దొడ్డవింటిని చేపట్టి, ఏనుగుల రేడువలె నున్న నల్లనియౌవనుడు, సింహమువలె ఎత్తైనభుజములు గలవాడు, ఏనుగువడకవంటి నడక గలవాడు, పద్మములవలె విశాలమైన కనులు కలవాడు - ఈ వీరుడు అర్జునుడు.

రాజ్ఞః సమీపే పురుషోత్తమౌ తు
యమావిమౌ విష్ణుమహేన్ద్రకల్పౌ,
మనుష్యలోకే సకలే సమోఽస్తి
యయోర్న రూపే నబలే న శీలే. 16

రాజు ప్రక్క విష్ణువు, దేవేంద్రుడువలె నున్న ఆ పురుష శ్రేష్ఠులిద్దఱు కవలలు. సమస్తమైన మానవలోకమున రూపమునందు గాని, బలమునందు గాని, శీలమునందు గాని వీరితో సాటి యగువాడు లేడు.

ఆభ్యాం తు పార్శ్వే కనకోత్తమాఙ్గీ
యైషా ప్రభా మూర్తిమతీవ గౌరీ,
నీలోత్పలాభా సురదేవతేవ
కృష్ణా స్థితా మూర్తిమతీవ లక్ష్మీః. 17

వారిరువురి ప్రక్క నున్న ఆమె ద్రౌపది. బంగారువంటి ఉత్తమదేహము, ఆకృతిదాల్చిన పసిమివర్ణమా అన్నట్టి కాంతి, నల్లకలువలవంటి తళుకుతో ఈమె దేవకాంతయో, లేక రూపొంది వచ్చిన లక్ష్మియో యన్నట్లున్నది.

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం నివేద్య తాన్ పార్థాన్ పాణ్డవాన్ పఞ్చ భూపతేః,
తతో ఽర్జునస్య వైరాటేః కథయామాస విక్రమమ్. 18

ఇట్లాతడు రాజునకు ఆ అయిదుగురు కుంతీపుత్రులనుగూర్చి నివేదించి పిమ్మట అర్జునుని పరాక్రమమును చెప్పెను.

ఉత్తరఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

అయం స ద్విషతాం హన్తా మృగాణా మివ కేసరీ,
అచరద్ రథవృన్దేషు నిఘ్నం స్తాంస్తాన్ వరాన్ రథాన్. 19

ఈ శత్రుసంహర్త మృగములలో సింహమువలె, ఆయా రథికవరేణ్యులను కొట్టుచు రథములగుంపులో విహారము చేసెను.

అనేన విద్ధో మాతఙ్గో మహా నేకేషుణా హతః,
సువర్ణకక్షః సంగ్రామే దన్తాభ్యా మగమ న్మహీమ్. 20

ఈతడు కొట్టిన ఒక బాణముతో బంగారుమైతొడుపుగల పెద్ద ఏనుగు యుద్ధమున చచ్చి దంతముల ఊతతో నేలకూలెను.

అనేన విజితా గావో జితాశ్చ కురవో యుధి,
అస్య శఙ్ఖప్రణాదేన కర్ణౌ మే బధిరీకృతౌ. 21

గోవులను గెలిచినది ఈతడు. కౌరవులను యుద్ధమున ఓడించినది యీతడు. ఈతని శంఖనాదముచేత నాచెవులు చెవుడువడినవి.

వైశంపాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తస్య తద్ వచనం శ్రుత్వా మత్స్యరాజః ప్రతాపవాన్,
ఉత్తరం ప్రత్యువాచ చేద మభిపన్నో యుధిష్ఠిరే. 22

ప్రతాపవంతుడగు విరాటుడు ఉత్తరుని ఆమాట విని ధర్మరాజు విషయమున అపరాధముచేసిన భావముతో ఉత్తరునితో ఇట్లు పలికెను.

---

22. అభిపన్నః - తప్పుచేసినవాడు.

ప్రసాదనం పాణ్డవస్య ప్రాప్తకాలం హి రోచతే,
ఉత్తరాం చ ప్రయచ్ఛామి పార్థాయ యది మన్యసే. 23

నాయనా! మన కిపుడు పాండవుని అనుగ్రహము పొంద వలసిన కాలము, నీవు సరే యన్నచో అర్జునునకు ఉత్తరనిత్తును.

ఉత్తర ఉవాచ - ఉత్తరు డిట్లు పలికెను.

ఆర్యాః పూజ్యాశ్చ మాన్యాశ్చ ప్రాప్తకాలం చ మే మతమ్,
పూజ్యన్తాం పూజనార్హాశ్చ మహాభాగాశ్చ పాణ్డవాః. 24

పాండవులు ఆర్యులు, పూజ్యులు, మాన్యులు. మన కిది తగిన కాలము. మహానుభావులు, పూజకు యోగ్యులు నైనవారిని పూజింపవలయును.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

అహం ఖల్వపి సంగ్రామే శత్రూణాం వశమాగతః,
మోక్షితో భీమసేనేన గావశ్చాపి జితాస్తథా. 25

నేనును యుద్ధమున శత్రువులకు చేజిక్కితిని. భీమసేనుడు నన్ను విడిపించెను. ఆవిధముగా గోవులును మనకు లభించినవి.

ఏతేషాం బాహువీర్యేణ అస్మాకం విజయో మృధే,
ఏవం సర్వే సహామాత్యాః కున్తీపుత్రం యుధిష్ఠిరమ్,
ప్రసాదయామో భద్రం తే సానుజం పాణ్డవర్షభమ్. 26

వీరి చేతుల బలిమి వలన మనకు యుద్ధమున జయము లభించినది. కావున మనము మన మంత్రులతో కూడి కుంతీపుత్రుడగు యుధిష్ఠిరుని, పాండవశ్రేష్ఠుని తమ్ములతో పాటు ప్రసన్నుని చేసికొనవలయును. నీకు మేలగుగాక.

యదస్మాభి రజానద్భిః కిఞ్చి దుక్తో నరాధిపః,
క్షన్తు మర్హతి తత్ సర్వం ధర్మాత్మా హ్యేష పాణ్డవః. 27

మనవు తెలియక ఈరాజు నేమన్నను ధర్మాత్ముడగు ఈ పాండవుడు అదియంతయు క్షమించుగాక.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

తతో విరాటః పరమాభితుష్టః
సమేత్య రాజా సమయం చకార,
రాజ్యం చ సర్వం విససర్జ తస్మై
సదణ్డకోశం సపురం మహాత్మా. 28

మహాత్ముడగు విరాటుడు మిక్కిలి సంతోషపడినవాడై పుత్రునితో కూడి ఒకనిశ్చయము చేసెను. సేన, ధనాగారము, పురముతోపాటు రాజ్య మంతయు ధర్మరాజునకు సమర్పించెను.

పాణ్డవాంశ్చ తతః సర్వాన్ మత్స్యరాజః ప్రతాపవాన్,
ధనంజయం పురస్కృత్య దిష్ట్యా దిష్ట్యేతి చాబ్రవీత్. 29

సముపాఘ్రాయ మూర్ధానం సంశ్లిష్య చ పునః పునః,
యుధిష్ఠిరం చ భీమం చ మాద్రీపుత్రౌ చ పాణ్డవౌ. 30

నాతృప్యద్ దర్శనే తేషాం విరాటో వాహినీపతిః.

ప్రతాపవంతుడు అగు విరాటుడు అర్జునుని ముందిడుకొని పాండవుల నందరను శిరముపై మూర్కొని మాటిమాటికి కౌగిలించుకొనుచు వారిని చూచుటలో ఎంతకును తృప్తిపొందడాయెను.

స ప్రీయమాణో రాజానం యుధిష్ఠిర మథాబ్రవీత్. 31

ప్రీతిచెందిన ఆరాజు ధర్మరాజుతో నిట్లు పలికెను.

దిష్ట్యా భవన్తః సంప్రాప్తాః సర్వే కుశలినో వనాత్,
దిష్ట్యా సంపాలితం కృచ్ఛ్ర మజ్ఞాతం వై దురాత్మభిః. 32

అదృష్టవశమున మీరు వనమునుండి కుశలముతో వచ్చితిరి. అదృష్టవశమున ఆ దుర్మార్గులకు తెలియరాకుండ అజ్ఞాతవాసమును ముగించితిరి.

ఇదం చ రాజ్యం పార్థాయ యచ్చాన్యదపి కించన,
ప్రతిగృహ్ణన్తు తత్ సర్వం పాణ్డవా అవిశఙ్కయా. 33

ఓ పాండవులారా! ఈ రాజ్యము, మఱియు నాదని పేరొంద మున్నను అదియంతయు పార్థునకే యొసగుచున్నాను. తమరు స్వీకరింతురుగాక.

ఉత్తరాం ప్రతిగృహ్ణాతు సవ్యసాచీ ధనంజయః,
అయం హ్యౌపయికో భర్తా తస్యాః పురుషసత్తమః. 34

ఈ ధనంజయుడు రెండుచేతులతో బాణములు ప్రయోగించు నేర్పు గల పురుషవరేణ్యుడు ఉత్తరను స్వీకరించుగాక. అతడే ఆమెకు తగినభర్త.

ఏవ ముక్తో ధర్మరాజః పార్థ మైక్షద్ ధనంజయమ్,
ఈక్షిత శ్చార్జునో భ్రాత్రా మత్స్యం వచన మబ్రవీత్. 35

విరాటు డిట్లు పలుకగా ధర్మరాజు అర్జునునివైపు చూచెను. అర్జునుడును ఆ చూపును గ్రహించి విరాటునితో ఇట్లు పలికెను.

ప్రతిగృహ్ణామ్యహం రాజన్ స్నుషాం దుహితరం తవ,
యుక్త శ్చావాం హి సంబన్ధో మత్స్యభారతయో రపి. 36

ఓ రాజా నీపుత్రికను కోడలిగా స్వీకరింతును. మత్స్యభరత వంశముల వారమగు మనకు సంబంధము తగినదే కదా!

ఇతి శ్రీ మహాభారతే విరాటపర్వణి వైవాహికపర్వణి ఉత్తరావివాహ
ప్రస్తావే ఏకసప్తతితమోఽధ్యాయః

ఇది శ్రీ మహాభారతము విరాటపర్వమున వైవాహికపర్వమున
ఉత్తరావివాహప్రసంగము అను డెబ్బదియొకటవ యధ్యాయము.

## ద్విసప్తతితమోఽధ్యాయః - డెబ్బదిరెండవ అధ్యాయము

అర్జునేన పుత్రవధూత్వేనోత్తరాయా గ్రహణ మభిమన్యూత్తరయో ర్వివాహశ్చ.

అర్జునుడు కోడలిగా ఉత్తరను స్వీకరించుట అభిమన్యూత్తరల వివాహము,

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

కిమర్థం పాణ్డవశ్రేష్ఠ భార్యాం దుహితరం మమ,
ప్రతిగ్రహీతుం నేమాం త్వం మయా దత్తా మిహేచ్ఛసి. 1

ఓ పాండవశ్రేష్ఠుడా ! నేను నాపుత్రికను భార్యగా ఇచ్చుచుండగా నీ వేల స్వీకరింపకోరవు ?

అర్జున ఉవాచ - అర్జును డిట్లు చెప్పెను.

అన్తఃపురేఽహ ముషితః సదా పశ్యన్ సుతాం తవ,
రహస్యం చ ప్రకాశం చ విశ్వస్తా పితృవ న్మయి. 2

నేను నీపుత్రికను అరమరికలు లేక ఎల్లవేళల చూచుచు అంతఃపురమున నుంటిని. నాయం దామె తండ్రివలె విశ్వాసముంచినది.

ప్రియో బహుమతశ్చాసం నర్తకో గీతకోవిదః,
ఆచార్యవచ్చ మాం నిత్యం మన్యతే దుహితా తవ. 3

ఆటపాటలు గరపుచు నేను మిక్కిలి ఇష్టుడనై యుంటిని. నీపుత్రికయు నన్ను ఆచార్యునివలెనే మన్నించినది.

వయఃస్థయా తయా రాజన్ సహ సంవత్సరోషితః,
అతిశఙ్కా భవేత్ స్థానే తవ లోకస్య వా విభో. 4

ఓ రాజా ! వయసునున్న ఆమెతో కలిసి సంవత్సరకాలము ఉంటిని. ఇది నిన్ను నీవారికిని శంకకలుగుటకు తగిన విషయము.

తస్మాన్నిమన్త్రయేఽహం తే దుహితాం మనుజాధిప,
శుద్ధో జితేన్ద్రియో దాన్త స్తస్యాః శుద్ధిః కృతా మయా. 5

ఓ రాజా ! ఆకారణమున నేను నీపుత్రికను కోడలిగా అడుగుచున్నాను. నేను శుద్ధుడను. ఇంద్రియములపై అదుపుకలవాడను. ఆమె నిట్లు పరిశుద్ధురాలినిగా చేసితిని.

స్నుషాయాం దుహితు ర్వాపి పుత్రే చాత్మని వా పునః,
అత్ర శఙ్కాం న పశ్యామి తేన శుద్ధి ర్భవిష్యతి. 6

కోడలైనచో నీకూతుకు విషయమునగాని, నాపుత్రుని విషయమునగాని, నావిషయమునగాని శంక ఉండదు. దీని కిట్లది శుద్ధికాగలదు.

అభిశాపా దహం భీతో మిథ్యావాదాత్ పరన్తప,
స్నుషార్థ ముత్తరాం రాజన్ ప్రతిగృహ్ణామి తే సుతామ్. 7

లోకము నిందలకు భయపడు నేను, ఓరాజా ! నీ సుతను కోడలిగా స్వీకరింతును.

స్వస్రీయో వాసుదేవస్య సాక్షా ద్దేవశిశు ర్యథా,
దయిత శ్చక్రహస్తస్య సర్వాస్త్రేషు చ కోవిదః. 8

అభిమన్యు ర్మహాబాహుః పుత్రో మమ విశామ్పతే,
జామాతా తవ యుక్తో వై భర్తా చ దుహితు స్తవ. 9

---

6. దుహితా శబ్దము అకారాంతముకూడ కలదు. ఇట్లు కోడలిగా అడుగుటవలన అజ్ఞాతవాసకాలమున నేను బ్రహ్మచర్యము పాటించిన విషయముకూడ లోకమునకు తెలియును.

7. అభిశాపాత్ - (నీవు నాకు అమెను భార్యగా విత్తునన్నచో నేను అంగీకరించినచో వీరిరువురకు ఇంతకుముందే సంబంధముండునని లోకమాడు నిందా వాక్యమువలన.

వాసుదేవునకు చెల్లెలికొడుకు, సాక్షాత్తు దేవునిబిడ్డవంటి వాడు, శ్రీకృష్ణునకు ప్రియుమైనవాడు, అన్ని అస్త్రములలో ఆరి తేరినవాడు, మహాబాహువు నగు నాకొడుకు అభిమన్యుడు నీకు అల్లుడగుటకు, నీపుత్రికకు భర్తయగుటకు యోగ్యుడు.

విరాట ఉవాచ - విరాటు డిట్లు పలికెను.

ఉపపన్నం కురుశ్రేష్ఠే కున్తీపుత్ర ! ధనంజయే.
య ఏవం ధర్మనిత్యశ్చ జాతజ్ఞానశ్చ పాణవః. 10

ఓ ధర్మరాజా ! కురుశ్రేష్ఠుడైన ధనంజయునియం దిది యెంతయు చక్కగా అమరియున్నది. ఆతడు ధర్మమునందు శ్రద్ధ గలవాడు. జ్ఞానము కలవాడు.

యత్ కృత్యం మన్యసే పార్థ క్రియతాం తదనన్తరమ్,
సర్వే కామా సమృద్ధా మే సంబంధీ యస్య మేఽర్జునః. 11

ఓ ధర్మరాజా ! నీ కేది ఉచితమో అది చేయుము. నా కోరిక లన్నియు పూర్తిగా నిండినవి. ఏలయన అర్జునుడు నాతో వియ్య మందుచున్నాడు.

వైశమ్పాయన ఉవాచ - వైశంపాయను డిట్లు చెప్పెను.

ఏవం బ్రువతి రాజేన్ద్రే కున్తీపుత్రో యుధిష్ఠిరః,
అన్వశాసత్ స సంయోగం సమయే మాత్స్యపార్థయోః. 12

ఆవిరాటరాజు ఇట్లు పలుకుచుండగా కుంతీకుమారుడగు యుధి ష్ఠిరుడు మాత్స్యపార్థుల ఆ సంబంధమును చేయదగినదిగా చెప్పెను.

తతో మిత్రేషు సర్వేషు వాసుదేవం చ భారత,
ప్రేషయామాస కౌన్తేయో విరాటశ్చ మహీపతిః. 13

12. సంయోగమ్ - వివాహ సంబంధమును, అన్వశాసత్ - ఆజ్ఞాపించెను.
13. ప్రేషయామాస - (దూతలను) పంపెను.

అంత ధర్మరాజును, విరాటరాజును మిత్రులందరికడకును వాసు
దేవుని యొద్దకును దూతలను పంపిరి.

తత స్త్రయోదశే వర్షే నివృత్తే పఞ్చ పాణ్డవాః,
ఉపప్లవ్యం విరాటస్య సముపద్య న్త సర్వశః. 14

అంత పదమూడవయేడు పూర్తికాగా పాండవులైదుగురును
విరాటునిదగు ఉపప్లావ్యనగరమును చేరిరి.

అభిమన్యుం చ బీభత్సు రానినాయ జనార్దనమ్,
ఆనర్తేభ్యోఽపి దాశార్హానానయామాస పాండవః. 15

అర్జునుడు జనార్దనుని, అభిమన్యుని, ఆనర్తదేశములనుండి
ఇతరయాదవులను పిలిపించెను.

కాశిరాజశ్చ శైబ్యశ్చ ప్రీయమాణౌ యుధిష్ఠిరే,
అక్షౌహిణీభ్యాం సహితౌ ఆగతౌ పృథివీపతీ. 16

యుధిష్ఠిరునియందు ప్రీతిగల కాశిరాజు, శైబ్యుడు అను
రాజులు రెండక్షౌహిణుల సేనతో వచ్చిరి.

అక్షౌహిణ్యా చ సహితో యజ్ఞసేనో మహాబలః,
ద్రౌపద్యాశ్చ సుతా వీరాః శిఖణ్డీ చాపరాజితః. 17

మహాబలుడగు ద్రుపదుడు, ఒక అక్షౌహిణి సేనతో వచ్చెను.
వీరులైన ద్రౌపది కొడుకులు, శిఖండియు, అపరాజితుడును వచ్చిరి.

ధృష్టద్యుమ్నశ్చ దుర్ధర్షః సర్వశస్త్రభృతాం వరః,
సమస్తాక్షౌహిణీపాలా యజ్వానో భూరిదక్షిణాః,
వేదావభృథసంపన్నాః సర్వే శూరా స్తనుత్యజః. 18

శస్త్రములు ధరించువారిలో శ్రేష్ఠుడు, ఎట్టివారికి లోబడని
వాడునగు ధృష్టద్యుమ్నుడును వచ్చెను. గొప్ప దక్షిణలతో యజ్ఞ

---

14. ఉపప్లవ్యమ్ = విరాటనగరమునకు దగ్గఱగానున్న మఱియొక నగరము.

ములు చేసినవారు, గొప్ప సేనాపతులు, వేదాధ్యయనసంపదగల వారు, యుద్ధమున శరీరములను గూడ లెక్కపెట్టని శూరులు వచ్చిరి.

తా నాగతా నభిప్రేక్ష్య మత్స్యో ధర్మభృతాం వరః,
పూజయామాస విధివత్ సభృత్య బలవాహనాన్. 19

సేవకులతో, సైనికులతో, వాహనములతో వచ్చినవారి నందరిని ధర్మవేత్తలలో శ్రేష్ఠుడగు విరాటుడు విధిపూర్వకముగా పూజించెను.

ప్రీతో౽భవద్ దుహితరం దత్వా తా మభిమన్యవే.

ఆరాజు తనపుత్రికను అభిమన్యునకిచ్చి ప్రీతుడాయెను.

తతం ప్రత్యుపయాతేషు పార్థివేషు తత స్తతః, 20
తత్రాగమద్ వాసుదేవో వనమాలీ హలాయుధః,
కృతవర్మా చ హార్దిక్యో యుయుధానశ్చ సాత్యకిః, 21
అనాధృష్టి స్తథాక్రూరః సామ్బో నిశఠ ఏవ చ,
అభిమన్యు ముపాదాయ సహమాత్రా పరంతపాః. 22

ఆయా దేశములనుండి రాజులందరు వచ్చుచుండగా వనమాల ధరించిన వాసుదేవుడు, నాగలి ఆయుధముగాగల బలరాముడు, కృత వర్మ, సాత్యకి, యుయుధానుడు, అనాధృష్టి, అక్రూరుడు, సాంబుడు, నిశఠుడు మున్నగు మహావీరు లందరు తల్లితోపాటు అభి మన్యుని తోడుకొని వచ్చిరి.

ఇన్ద్రసేనాదయ శ్చైవ రథై స్తైః సుసమాహితైః.
ఆయయుః సహితాః సర్వే పరిసంవత్సరోషితాః. 23

సంవత్సరకాలము యాదవులతో నివసించిన ఇంద్రసేనుడు మున్నగువారందరు రథములతో సిద్ధమై వచ్చిరి.

దశనాగసహస్రాణి హయానాం ద్విగుణం తథా,
రథానా మయుతం పూర్ణం నియుతం చ పదాతినామ్, 24

వృష్ణ్యంధకాశ్చ బహవో భోజాశ్చ పరమౌజసః,
అన్వయు ర్వృష్ణిశార్దూలం వాసుదేవం మహాద్యుతిమ్. 25

పదివేల ఏనుగులు, అంతకు రెట్టింపు గుఱ్ఱములు, పదివేల రథములు, పదికోట్ల కాల్బంటులు, వృష్ణిఅంధకవంశములవారు పెక్కురు, గొప్ప దేహశక్తిగల భోజులు మహాకాంతితో వెలుగొందు వాసుదేవుని వెంట వచ్చిరి.

పారిబర్హం దదౌ కృష్ణః పాండవానాం మహాత్మనామ్,
స్త్రియో రత్నాని వాసాంసి పృథక్ పృథ గనేకశః. 26

మహాత్ములగు పాండవులకు కృష్ణుడు వేరువేరుగా పెద్ద సంఖ్యలో స్త్రీలను, రత్నములను, వస్త్రములను కానుక నిచ్చెను.

తతో వివాహో విధివద్ వవృధే మత్స్యపార్థయోః,
తతః శఙ్ఖాశ్చ భేర్యశ్చ గోముఖాడమ్బరా స్తథా. 27
పార్థైః సంయుజ్యమానస్య నేదు ర్మత్స్యస్య వేశ్మని,
భక్ష్యాన్నభోజ్యపానాని ప్రభూతా న్యభ్యహారయన్. 28

మత్స్యపార్థులయింట వివాహము శాస్త్రరీతిలో చక్కగా జరిగెను. శంఖములు, భేరులు, గోముఖములు, డంబరములు మున్నగు వాద్యములు పాండవులతో సంబంధము పొందుచున్న విరాటునియింట మ్రోగినవి. భక్ష్యములను, భోజనములను, పానీయములను పెద్ద ప్రమాణములో ఉపయోగించిరి.

గాయనాఖ్యానశీలాశ్చ నటవైతాలికా స్తథా,
స్తువన్త స్తా నుపాతిష్ఠన్ సూతాశ్చ సహ మాగధైః. 29

గాయకులు, కథలు చెప్పువారు, నటులు, మేల్కొలుపువారు, వంధిమాగధులు వారిని స్తుతించుచు కొలిచియుండిరి.

సుదేష్ణాం చ పురస్కృత్య మత్స్యానాం చ వరస్త్రియః,
ఆజగ్ముశ్చారుసర్వాఙ్గ్యః సుమృష్టమణికుణ్డలాః. 30

సుదేష్ణను ముందిడుకొని మత్స్యదేశమునందలి ఉత్తమస్త్రీలు మనోహరములైన సర్వావయవములతో, చక్కగా చేర్చిన మణికుండలములతో వచ్చిరి.

వర్ణోపపన్నాస్తా నార్యో రూపవత్యః స్వలంకృతాః,
సర్వాశ్చాభ్యభవన్ కృష్ణా రూపేణ యశసా శ్రియా. 31

చిత్రచిత్రములైన వర్ణములతో నున్నరూపవతులు, చక్కగా అలంకరించుకొన్నవారు నగు ఆస్త్రీలు అందరు ద్రౌపది రూపముచేత, యశస్సుచేత, శోభచేత వీగిపోయిరి.

పరివార్యోత్తరాం తాస్తు రాజపుత్రీ మలంకృతామ్,
సుతా మివ మహేన్ద్రస్య పురస్కృత్యోపతస్థిరే. 32

చక్కగా అలంకరింపబడి, దేవేంద్రునిబిడ్డయో యన్నట్లున్న ఉత్తరను చుట్టుకొని ఆస్త్రీలందరు కూర్చుండిరి.

తాం ప్రత్యగృహ్ణాత్ కౌన్తేయః సుతస్యార్థే ధనంజయః,
సౌభద్రస్యానవద్యాఙ్గీం విరాటతనయాం తదా. 33

ఎందును దోషములేని దేహముతో విరాజిల్లుచున్న ఆవిరాట పుత్రికను అర్జునుడు తనకుమారుని కొఱకు స్వీకరించెను.

తత్రాతిష్ఠన్మహారాజో రూప మిన్ద్రస్య ధారయన్,
స్నుషాం తాం ప్రతిజగ్రాహ కున్తీపుత్రో యుధిష్ఠిరః. 34

కుంతీతనయుడు యుధిష్ఠిరమహారాజు దేవేంద్రుని రూపము వంటి రూపముతో వెలుగొందుచు ఆమెను కోడలిగా గ్రహించెను.

ప్రతిగృహ్య చ తాం పార్థః పురస్కృత్య జనార్దనమ్,
వివాహం కారయామాస సౌభద్రస్య మహాత్మనః. 35

శ్రీకృష్ణుని ముందిడుకొని ధర్మరాజు మనుమాను గ్రహించి సుభద్రకొడుకగు అభిమన్యునకు వివాహము చేయించెను.

తస్మై సప్తసహస్రాణి హయానాం వాతరంహసామ్,
ద్వే చ నాగశతే ముఖ్యే ప్రాదాద్ బహుధనం తదా. 36

విరాటుడు, వాయువేగముగల వేయి గుఱ్ఱములను, రెండు వందల ఏనుగులను, మిక్కుటమగు ధనమును అభిమన్యున కొసగెను.

హుత్వా సమ్యక్ సమిద్ధాగ్ని మర్చయిత్వా ద్విజన్మనః,
రాజ్యం బలం చ కోశం చ సర్వ మాత్మాన మేవ చ. 37

చక్కగా ప్రజ్వరిల్లుచున్న అగ్నియందు హోమముచేసి బ్రాహ్మణులను పూజించి రాజ్యమును, సేనను, కోశమును, తనతో పాటు సర్వమును అర్పించెను.

కృతే వివాహే తు తదా ధర్మపుత్రో యుధిష్ఠిరః,
బ్రాహ్మణేభ్యో దదౌ విత్తం యదుపాహర దచ్యుతః. 38

వివాహకార్యము ముగిసినపిమ్మట ధర్మపుత్రుడగు యుధిష్ఠిరుడు శ్రీకృష్ణుడు తెచ్చినధనము నంతటిని బ్రాహ్మణుల కొసగెను.

గోసహస్రాణి రత్నాని వస్త్రాణి వివిధాని చ,
భూషణాని చ ముఖ్యాని యానాని శయనాని చ,
భోజనాని చ హృద్యాని పానాని వివిధాని చ. 39

వేలకొలది గోవులు, రత్నములు, వివిధములైన వస్త్రములు, మనోహర శ్రేష్ఠములగు ఆభరణములు, వాహనములు, పాన్పులు, మనోహర అనేకములగు పానీయములు దానమిచ్చెను.
ములైన భోజనములు

తన్మహోత్సవసంకాశం హృష్టపుష్టజనాయుతమ్,
నగరం మాత్స్యరాజస్య శుశుభే భరతర్షభ ! 40

అట్టి గొప్పపండుగతో నిండినదియు, సంతోషము, పుష్టిగల జనులుం గలదియునగు మత్స్యరాజు నగరము ఎంతయో శోభిల్లెను.

**ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం విరాటపర్వణి వైవాహికపర్వణి ఉత్తరావివాహే ద్విసప్తతితమోఽధ్యాయః**

**ఇది నూరువేల శ్లోకములసంహిత వ్యాసనిర్మితమైన అగు శ్రీ మహాభారతము విరాటపర్వమున వైవాహికపర్వమున ఉత్తరావివాహమను డెబ్బదిరెండవ అధ్యాయము.**

[విరాటపర్వ సమాప్తమ్ - విరాటపర్వము ముగిసెను.]

# శ్రవణ మహిమా - శ్రవణ మహిమ

శ్రుత్వా తు చరితం పుణ్యం పాణ్డవానాం మహాత్మనామ్,
నాధి వ్యాధి భయం తేషాం జాయతే పుణ్యకర్మణామ్. 1

మహాత్ములగు పాండవుల పుణ్యచరితమును వినిన పుణ్యకర్మము గలవారికి మనోబాధలు, దేహబాధలు అనువాని భయము కలుగదు.

దుర్గతే స్తరణే తేషా మాయుతం తరణం భవేత్,
సుభిక్షం క్షేమ మారోగ్యం పుణ్యవృద్ధిః ప్రజాయతే. 2

వారు దురవస్థలు దాటుటకై ఇది పెద్దతెప్ప యగును. సంపద, క్షేమము, ఆరోగ్యము, పుణ్యము వృద్ధి యగుట అను ఫలములు కలుగును.

సర్వ పాపాని నశ్యన్తి జాయన్తే సర్వసంపదః,
ఏకాకీ విజయే చ్ఛత్రూన్ స్మృత్వా ఫాల్గున కర్మ చ. 3

పాపములన్నియు నశించును, సంపదలన్నియు కలుగును. అర్జునుడు చేసిన పనిని స్మరించినవాడు ఒంటిగా శత్రువులను జయించును.

ఈతయః సంప్రణశ్యన్తి న వియోగః ప్రియై ర్జనైః.

ఈతిబాధలు నశించును. ప్రియమైన జనముతో ఎడబాటు కలుగదు.

శ్రుత్వా వై రాటకం పర్వ వాసాంసి వివిధాని చ,
హిరణ్యం ధాన్యం గావశ్చ దద్యాద్ విత్తానుసారతః. 5

విరాటపర్వమును వినినపిమ్మట వివిధములైన వస్త్రములను, ధనమును, ధాన్యమును, గోవులను విత్తమున్న మేరకు దానము చేయవలయును.

ప్రీతయే దేవతానాం వై దద్యాద్ వై ద్విజముఖ్యకే,
వాచకే తు సుసంతుష్టే తుష్టాః స్యుః సర్వదేవతాః. 6

దేవతల తృప్తికై బ్రాహ్మణులలో శ్రేష్ఠుడైనవానికి దానము చేయవలయును. పఠించువాడు తృప్తిపడినచో సర్వదేవతలు తృప్తిపొందుదురు.

బ్రాహ్మణాన్ భోదయేచ్ఛక్త్యా పాయసైః సర్పిషాన్వితైః,
ఏవం శ్రుతే చ వైరాటే సమ్యక్ ఫలమవాప్నుయాత్. 7

శక్తికొలది పాయసము, నేయి మున్నగుపదార్థములతో బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును, ఈ విధముగా విరాటపర్వమును విన్నచో మానవుడు మంచిఫలము పొందును.

'మోక్షమిత్ర' - ఏలూరు.

